అంతరభారతీయ పుస్తకమాల

# గడచిన కాలం

రచన
కె.పి. కేశవ మీనన్
అనువాదం
ఈశ్వర్



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# విషయసూచిక

# తొలిపలుకు

స్వీయచరిత్రలకు సాహిత్య గౌరవం యివ్వడానికి, వాటిగురించి విస్తృత పరిశోధనలకు పూనుకోవడానికి విమర్శకులు ఎప్పుడూ వెనుకంజ వేస్తూనే వున్నారు. ఈ ప్రక్రియ పట్ల యిటువంటి ఉదాసీనత వుండకూడదు. ఫ్రెంచి మేధావి ఆంద్రేమారో చెప్పినట్లు 'స్వీయచరిత్ర ఒక్కటే సాహితీ ప్రక్రియలు అన్నిటికన్న రసవత్తరమైనది'. ఈ అభిప్రాయంతో సగటు సాహితీ విమర్శకులు ఏకీభవించక పోవచ్చు. ఈ అసాధారణ విమర్శకులు - చాలా వరకు స్వీయచరిత్రలను - చారిత్రక గ్రంథాల దృష్టితో చూసి, గందర గోళానికి గురికావడం అలవాటై పోయింది. ఉదాహరణకు రెనివెలక్. అయితే స్వీయచరిత్రల ఆకర్షణాశక్తి, పాఠకులు వాటి ద్వారా పొందే ఆనందానుభూతి చారిత్రక గ్రంథాలలోని ప్రాచీన స్మశానవాటికల జాబితాలు, వివరాలు వంటి అంశాలతోను, ఒకరిని గురించి మరొకరు వ్రాసే జీవిత చరిత్రలలోని 'విశేషాంశాల' తోను, పోల్చి చూడదగినది కాదు. రచయిత హృదయాన్ని ఒక భావనాకేంద్రంగా రూపొందించే ముఖ్యపాత్రను-స్వీయచరిత్ర నిర్వహిస్తుంది. ఆ విధంగా జీవాన్ని, శక్తిని సంతరించుకుంటుంది. అందువల్లే ఈ సాహితీ ప్రక్రియను ఏ రచయిత అయినా ఒక్కసారి కంటె ఎక్కువగా వ్రాయలేదు! అదే యిందులోని విశిష్టత కూడా! ఒకవేళ ఎవరైనా స్వీయచరిత్రలు ఒకటికి మించి వ్రాస్తే, అవి ఒకదానికొకటి వ్యతిరేకంగానో, లేదా ఒక దానికొకటి ప్రతిబింబంగానో రూపొంది, ఫలితం ఏమీ లేకుండా పోతోంది.స్వీయచరిత్ర ద్వారా వెలువడే సత్యాలే ఎక్కువగా - నిజాయితీని, ప్రాముఖ్యాన్ని కలిగివుంటాయి. అవి వ్యక్తిగతమైన అనుభవాలకు చాలా సన్నిహితమైనవి, అన్న అభిప్రాయానికి మనం రావడంలో తప్పు లేదు. 'ఒకరి చరిత్రను వ్రాయడానికి తగిన వ్యక్తి - ఆవ్యక్తే !' అని డాక్టర్ జాన్సన్ - ఎందుకు చెప్పారో దీన్ని బట్టి మనకు అర్థమవుతోంది.

'ఉత్తమ చరిత్ర స్వీయచరిత్రే' అన్నది ఆయన అభిప్రాయం. సాహిత్యంలోని వివిధ ప్రక్రియలలోనూ - రచయిత వ్యక్తిగత జీవితాన్ని అనుసరించి ఏర్పడే మనోస్థితి మనకు కనిపిస్తుంది. ప్రతిస్పందన - ఆ రచనల్లోని అటువంటి 'మనోస్థితి' వల్లే ఏర్పడుతుంది. ఉన్నతమైన కళాసృష్టి అన్నది - ఒక కళాకారుడు తనలోని భావ వైశిష్ట్యాన్ని - తన ప్రక్రియ ద్వారా తక్కిన వారితో పంచుకోవడం తప్ప - మరేమీ కాదు! 'నిజాయితీతో చెప్పే ఏ

జీవిత చరిత్ర అయినా ఉత్తమమైనదే' అంటారు కోల్‌రిడ్జ్. తన చరిత్రను నిజాయితీతో చేప్పాలంటే - అన్నిటికన్నా మించి ఆ వ్యక్తి - స్వతహాగా నిరాడంబరత, ఔన్నత్యాన్ని కలిగిన వ్యక్తి అయివుండాలి. జీవితంలోని నిజాయితీ లాగే, జీవిత చరిత్రలోని నిజాయితీకూడా ఆ వ్యక్తి ఔన్నత్యాన్ని అనుసరించి వచ్చే అంశమే! ప్రపంచ సాహిత్యంలో - చాలా ఉత్తమమైన స్వీయచరిత్రలుగా పేరుపొందిన వాటి రచయితలు - సెయింట్ అగస్టిన్, గాథే, రోసూ, టాల్‌స్టాయ్, గాంధీ వంటివారు అన్ని కాలాల్లోనూ - విశిష్టమైన వ్యక్తులుగా కీర్తి గడించారు. ఈ కొందరిలోనూ - చాలా గొప్ప వ్యక్తిగా పేరుపొందిన గాథే - 'కవిత్వమూ - సత్యమూ' అన్న పేరుతో విశిష్టమైన స్వీయచరిత్రను వ్రాశారు.స్వీయచరిత్రలలో రచయిత విశిష్టతకు, రచనా విశిష్టతకు మధ్యవున్న సంబంధం - తక్కిన సాహితీ ప్రక్రియలలో చాలా అరుదుగా కనిపిస్తుంది.

'మలయాళంలో చాలా ఉత్తమమైన స్వీయచరిత్ర ఏది ? అని అడిగితే, అందుకు ఒకేఒక సమాధానం - కె.పి. కేశవమీనన్ రాసిన - 'కళింజకాలం' (గడచిన కాలం). 'ఎందువల్ల అది ఉత్తమమైనది'? అని ఆ తర్వాత ప్రశ్నిస్తే చెప్పేవారి మేధాశక్తిని బట్టి, సమాధానాలు పలువిధాలుగా వుంటాయి. అయితే, సిసలైన సమాధానం - చాలా సులభంగా చెప్పవచ్చు. ఈ రచయిత కేరళీయులందరిలోను - విశేష మానసిక పరిపక్వత, ఔన్నత్యం గలవారు' అన్నదే ఆ సమాధానం. గాథే స్వీయచరిత్రకున్న మకుటాన్ని బట్టి చెప్పాలంటే, కేశవమీనన్ స్వీయచరిత్రను - 'రాజకీయాలూ - సత్యమూ' అని చెప్పవచ్చు. ఉన్నతమైన ఊహాలోకపు జీవితాన్ని సూచించడానికి - గాథే 'కవిత్వం' అనే మాట ప్రయోగిస్తే, ఈ నాటి అస్తవ్యస్త సాంఘిక, రాజకీయ కార్యకలాపాలను కేశవమీనన్ ప్రస్తావించడం - 'రాజకీయాలు' గా అన్వయించుకోవచ్చు. ఎక్కడ చూసినా లంచగొండితనం, చికాకు కలిగించే జీవన విధానం... ఇవి ఈ రచనలో ప్రతిబింబించడం మనం గమనించ వచ్చు. ఒకరు తమ జీవితంలో కవిత్వాన్ని, సత్యాన్ని ఒకటిగా చేర్చి జీవించడానికి ప్రయత్నించడంకన్నా, రాజకీయాలను, సత్యాన్నీ ఒకటిగా చేర్చి జీవించడానికి ప్రయత్నించడం కష్టతరమైనది. అయితే కేశవమీనన్ వల్ల అది చాలావరకు సుసాధ్యమైంది!

ఈ స్వభావమే-కేశవమీనన్ స్వీయచరిత్రను ఉత్తమమైనదిగా రూపొందించిందని నేను భావిస్తున్నాను.ఆయన వ్యక్తిగత ఔన్నత్యాన్ని నిజాయితిగా, సాహితీ పూర్వకంగా ఈ గ్రంథం ప్రతిబింబిస్తోంది.అందువల్లే, ప్రపంచంలోని ఉత్తమమైన స్వీయచరిత్రల కోవలలోకి ఈ గ్రంథాన్ని చేర్చి, గౌరవించ తగ్గదిగా వుంది. మన్నించమన్నట్లుగా వుండే ధోరణి, దయనీయమైన స్థితి - ఇందులో లేవు. అయితే, సాధికారంగా చెప్పగలిగిన - అణకువ నిజాయితీ, సరళత ఈ రచనలో మూర్తీభవించాయి. ఈనాటి రచనల్లో రచయిత

- తనను తాను శిలువ వేసుకుని - శిక్షించుకునేటటు వంటి ధోరణి ఎక్కువగా వుంది. జీవితసత్యాలను - ప్రతిఫలించి - చూపేవి, వ్యక్తులు, చేతలు కావు. వాళ్ల అంతరంగ భావతరంగాలేనని ఈనాటి రచయితలు విశ్వసిస్తున్నారు. ఐతే, ఈ అభిప్రాయానికి సరిగ్గా వ్యతిరేకమైన ధోరణి వుండడంకూడా మనస్తత్వరీత్యా - సాధ్యమేనన్న సంగతి వాళ్లు గ్రహించడం లేదు.కేశవమీనన్ చేతలు, భావతరంగాలు..... ఈ రెండిటి ద్వారా ఆయన గురించిన సత్యాలను ఈ స్వీయచరిత్ర ప్రతిబింబించి, చూపుతోంది. ఆయన శైలి, సంఘటనలను అభివర్ణించిన తీరు, ఆలోచనా సరళి..... ఒక విలక్షణమైన మిశ్రమం. పరస్పరవిరుద్ధమైన భావప్రకటన, డొంక తిరుగుడు కాని ఆయన రచనాశైలిని - సమకాలీన మలయాళ వచన రచనకు ఉత్తమమైన ఉదాహరణగా, ఆయన ప్రత్యేకాభిమానులు పేర్కొంటారు.

స్వీయచరిత్ర వ్రాయడానికి రచయిత ఎలాంటి ఇబ్బందులను అధిగమించాలి? మొదటిది, క్లుప్తంగా చెప్పాలంటే మతిమరుపు. ఆ తర్వాత- తన జీవితంలో అసంతృప్తిని కలిగించిన, సిగ్గుపడేలా చేసిన సంఘటనలను - రచన నుంచి తొలగించాలని అనిపించే ఒక విధమైన ఆత్మాభిమానం; ప్రచారధోరణి, అసహజమూ, కృత్రిమమూ అయిన సౌందర్య దృక్పథం. ప్రసిద్ధ రచయితలైన రోసూ, జార్జిశాండ్, ఆంద్రేబైట్ మున్నగువారు కూడా ఇలాంటి లోపాలను అధిగమించడానికి వీలుకాలేదు. ఎంత రచయితలైనా, తామూ జీవితంలో ఎదురయ్యే జయాపజయాల్లో పాలుపంచుకునే సాధారణమైన వ్యక్తులేనన్న మానసిక పరిపక్వత వాళ్లల్లో ఏర్పడలేదు కాబోలు... వాళ్లు నిజానికి వ్రాయలేదు. మాటలతో చిత్రాలను రచించారని చెప్పాలి.కానీ, మీనన్ స్వీయచరిత్ర సరళమైన అక్షరాలు మాత్రమే. అది వర్ణచిత్రంకాదు. ఆయన ఏం చేసినా, ఎంత కష్టపడినా, తగిన స్థాయిలోనే చేశారు.

'గడచిన కాలం' సహజంగా, సరళంగా, పరిపూర్ణంగా వుంది. 'జీవితం నన్ను ఎక్కడికి తీసుకువెళుతోందని తెలియక పోయినప్పటికీ, జీవించాలన్న దాహంయింకా తీరలేదు!' ప్రస్తుతం ఆయనకు ఎనభైఎనిమిది సంవత్సరాలు. మలయాళీల మధ్య ఆయన ఒకమేరు పర్వతం. సాత్రేలా తన ఏడేళ్ల ప్రాయం గురించి ప్రామాణికంగా చెప్పడానికి మీనన్ సిద్ధం కాలేదు. కారణం ఆ వయసులో జరిగిన సంఘటనల గురించి ఇతమిత్థంగా ఆయనకు తెలిసి వుండదు. అయితే పదహేడవ సంవత్సరం నుంచి డెభైయవ సంవత్సరం వరకూ ఆయనకు గట్టిగా తెలుసు. అందువల్లే ఆ వయసులో 'ఎక్కడికి.... ఎలాంటి ప్రాంతానికి వెళ్లినా సరే నేను టికెట్ కొనక తప్పలేదు' అని ఆయన చెప్పగలరు. జీవితం అన్నది తెలియని ఊరికి వెళ్లే ప్రయాణం అయివుండవచ్చు.కానీ జీవిత నౌక ఆయనకు తెలియని దేమీకాదు. క్లుప్తంగా

ఇదే ఆయన చేసిన జీవన సిద్ధాంతం. సార్త్రే మాటల్లో టికెట్ లేని ప్రయాణికుని సిద్ధాంతం' లా దీనిని తీసుకోవచ్చు!

మనదేశ స్వాతంత్ర్య సిద్ధికి పూర్వం కేరళలో ఏర్పడిన జాతీయోద్యమంతో ముడిపడిన జీవితం - కేశవమీనన్‌ది. స్వాతంత్ర్యం లభించింది. కాని ప్రజాజీవితం ఎలావుంది? ఎక్కడ చూసినా లంచగొండితనమే కనిపిస్తున్న కేరళ ప్రజాజీవితాన్ని క్షాళన చేసే కృషిజరగాలని మీనన్ ఆశించారు. ఆ ఉత్సాహం నాయకులలో కలగడానికి ఆయన ఎంతగానో దోహదం చేశారు. అది ఎన్నటికి మరుపురాని కృషి! ఆ కృషి ఇప్పటికీ కొనసాగుతోంది. అందువల్లే, ఆయన తొంభైలోకి అడుగు పెడుతున్నా, ఈనాటికీ, శరీరంలోని ఎటువంటి లోపాన్ని అయినా అధిగమించగల మానసిక దృఢత్వానికి ఉదాహరణగా నిలబడగలిగారు. ఇటువంటి దృఢమైన మనసుగల వ్యక్తి పక్షపాత రహితంగా, ఆ మాటకొస్తే ఎంతో సునాయాసంగా తన గతాన్ని అవలోకించి, ఆ పాత సంఘటనలను ఎక్కువ తక్కువలు లేకుండా, ఉన్నది ఉన్నట్టుగా చెప్పడానికి ముందుకు రావడంలో ఆశ్చర్యంలేదు. 'గడచిన కాలం' అని స్వీయచరిత్రకు మకుటాన్ని వుంచడంలోని అర్థం - 'జీవితం అంతా ముగిసిపోయింది' అని కాదు. ఆయనకు ఇవాళ - ఒక వర్తమాన కాలం, ఎదురుచూడడానికి ఓ భవిష్యత్కాలం వున్నాయి - అన్నదే! పాఠశాలలో తను తక్కువమార్కులు తెచ్చుకున్న విషయాన్ని దాచకుండా అంగీకరించడం; విదేశరాయబారిగా తను రాణించలేకపోయానని వినయంగా చెప్పడం; తను దేశాన్ని వదిలి వెళ్లడానికి కారణంగా వున్న పరిస్థితుల్ని విడమరచి చెప్పడం; జపాను వారి దుష్కృత్యాలను వివరించడం; శక్తివంతమైన ప్రభుత్వవ్యతిరేకతను లెక్క చెయ్యకుండా, తన ఆత్మగౌరవాన్ని, స్వేచ్ఛను కాపాడుకోవడానికి చేసిన పోరాటాన్ని వివరించడం... వంటి సందర్భాలలో - ఆయన మానసిక పరిపక్వత, మేధాశక్తి, పసిపాప మనస్తత్వం - ఔన్నత్యం...... రకరకాల రూపాల్లో మనకు అర్థమవుతుంది.

ఈనాటి మలయాళీలలో స్వీయచరిత్ర రాయడానికి అన్ని విధాలుగా ఎన్నో అర్హతలు కలిగినవారు కేశవమీనన్. చిన్నతనం నుంచే మహాపురుషుల జీవితాలు ఆయనను ఆకర్షించాయి. ఆయన రచనల్లో ఎక్కువభాగం - జీవిత చరిత్రలే. రచనా వ్యాసంగం ఆరంభించిన తొలి రోజుల్లోనే - ఆయన - లజ్‌పత్‌రాయ్, గోఖలే, తిలక్, గాంధీవంటి స్వాతంత్ర్యోద్యమ నాయకుల చరిత్రలను వ్రాశారు. ఆ తర్వాత 'సమకాలీన భారత నిర్మాతలు' అన్న మకుటంతో జాతీయ నాయకులు అందరి గురించి ఒక బృహద్గ్రంథాన్ని రచించారు.

ఈ జీవిత చరిత్రలు వ్రాయడంతోపాటే, స్వీయచరిత్ర రచయితగానూ

ఆయన రాణించసాగారు. అందుకు ఆరంభంగా - రూపొందిన రచన 'విదేశీ విశేషాలు'. ఆ పుస్తకంలో ఆయన తన యూరోపు పర్యటనను వివరించారు. (ఈ పర్యటన 1912లో చేశారు. పుస్తకం 1916లో వెలువడింది) కాలక్రమేణా ఆయన రచనల్లో కనిపించిన విశిష్టతన -ఈ పుస్తక సూచిస్తుంది. అప్పటినుంచే, ఆయన చేసిన రచనల్లో స్వీయచరిత్ర ధోరణి కనిపించింది. అదే ఆ తర్వాత కొనసాగింది. ఆ ధోరణి కొన్ని ఉత్తమ 'సింహావలోకన' గ్రంథాలు ఆయన రాయడానికి దోహదం చేసింది. కేరళహైందవ దేవాలయాల్లో ఎంతోకాలంగా వున్న అస్పృశ్యతను వ్యతిరేకిస్తూ, 1924తో ప్రారంభించిన వైక్కం సత్యాగ్రహానికి సంబంధించిన వివరణ 'బంధనత్తిల్‌నిణ్ను' (బంధనాలు వదలి...) రెండవ ప్రపంచ యుద్ధకాలంలో మలేసియాలో జపాన్ వారి వద్ద ఆయన పొందిన భయంకర అనుభవాలను సూక్ష్మంగా వివరిస్తుంది. ఆయన రచించిన 'భూతవుం-భావియుం' (నిన్నా-రేపు). 'జీవిత సింరగళ్' (జీవితానుభవాలు) అన్నపేరుతో మరో రచన ఆయన బహుముఖ ప్రజ్ఞలను, రంగురంగుల జీవితాన్ని, ఆలోచనల్ని, జ్ఞాపకాలను, ప్రతిబింబిస్తూంది. స్వీయచరిత్ర 'గడచిన కాలం' (కళింజ కాలమ్) కు ఈ రచనలన్ని చక్కని రిహర్సల్స్ అయ్యాయి. అందువల్లే వరుస క్రమంలో జీవితంలోని వివిధ ఘట్టాలు. ఇతరుల జీవిత చరిత్రలు రచనల రూపంలో వెలువడినా, కొనమెరుపుగా వాటి అన్నిటికి ముక్తాయింపుగా రూపొందింది. 'గడచినకాలం'. జీవనపోరాటంలో, విరామ మెరుగని కష్టజీవిలో తప్పని సరిగాకనిపించే ఒక విధమైన పరిణతి, పరిపక్వత - ఈ గ్రంథంలో ప్రతిఫలిస్తాయి. జాతీయస్థాయిలో, సాహిత్య అకాడమీ బహుమతిని ఈ గ్రంథానికి యిచ్చి, గౌరవించడంలో ఆశ్చర్యమేమి లేదు. రచయిత ఔన్నత్యం, విషయ ప్రాధాన్యం, శైలి, రచనా వైశిష్ట్యం మొదలైన వివిధ కోణాలనుంచి ఈ రచనను పరిశీలించి స్వీయచరిత్రల కోవలో దీనికి ఇంతకుముందే ఉన్నతమైన స్థానాన్ని ఏకగ్రీవంగా కల్పించారు విమర్శకులు.

కేశవమీనన్ స్వీయచరిత్రలోని ప్రత్యేకత ఏమిటంటే, అది మలయాళంలోని ఇతర స్వీయచరిత్రలను అన్నిటినీ కూడా అతి సాధారణమైనవిగా కనిపించేలా చేస్తోంది! మలయాళంలో చరిత్ర గ్రంథాలు చాలా వున్నప్పటికీ, స్వీయచరిత్రలు ఎక్కువగా లేవు. స్వీయచరిత్ర రచనకు అవసరమైన విశిష్టతలు గల వ్యక్తుల సంఖ్య చాలా తక్కువ కావడం యిందుకు కారణం కావచ్చు. ఉన్న ఆ కొద్ది స్వీయచరిత్రలలోనూ-రచయితలు, సాహిత్యం, రాజకీయాలు, సాంఘిక సేవ మొదలైన వివిధ శాఖల్లో తాము ప్రముఖంగా చేసిన కృషినీ, ఆయా రంగాల్లో తను ముద్రను ప్రతిబింబించారు. మరో అంశం - స్వీయచరిత్ర వ్రాయడానికి ముందంజవెయ్యని విశిష్ట వ్యక్తుల జాబితాకూడా పెద్దదిగానే కనిపిస్తున్నది. కుమరన్ ఆసాన్, వళ్ళలతోల్, ఉళ్ళూర్ ఎస్. పరమేశ్వర

అయ్యర్, పట్టంథాను పిళ్లై, కె. కేళప్పన్, ఆర్ శంకర్ మున్నగువారిని ఆ జాబితాలో పేర్కొనాలి. రచయితల్లో - కృష్ణపిళ్లై, బి.కె. నారాయణ పిళ్లై స్వీయచరిత్రలు రాశారు. ఒకరి రచనలో వ్యంగ్యం, మరొకరి రచనలో నిశితమైన ఉద్వేగం - ప్రతిఫలిస్తూ, అవి విశిష్టతను సంతరించుకున్నాయి. జోసఫ్ ముండాచేరి, బి. కేశవదేవ్ వంటి ఆధునిక సాహితీకర్తలు ఈ ప్రక్రియలో తమ సమర్థతను నిరూపించారు. ఇదేవిధంగా - రాజకీయ ప్రముఖులు సి. కేశవన్, సర్దార్ కె.ఎమ్. పణిక్కర్‌లు కూడా స్వీయచరిత్రల రచనలో తమ ప్రత్యేకతను ప్రతిబింబింపజేశారు. అయితే, వీటన్నిటిలోనూ కేశవమీనన్ స్వీయచరిత్ర ఉత్తమ మైనదనడంలో అభిప్రాయభేదానికి స్థానమే లేదు!

జీవితచరిత్రను ఉదాత్తంగా రాయడం, ఉదాత్తంగా జీవించడం కన్నా కష్టమైన పని అని చెప్పడం కద్దు. అయితే, నిజంగా విశిష్టమైన జీవితాన్ని అనుభవించిన వ్యక్తి, తప్పకుండా ఉన్నతమైన స్వీయచరిత్ర వ్రాయగలరు. రచనావిశిష్టత అన్నది వ్రాసేవారి జీవిత ఔన్నత్యాన్ని అనుసరించి ఏర్పడుతుందనే ప్రాథమిక సత్యానికి ఒక ఉదాహరణగా 'గడచిన కాలం' (కళింజ కాలమ్) భాసిస్తున్నది.

-ఆచార్య సుకుమార్ అళిక్కోడ

# చిన్ననాటి జ్ఞాపకాలు

సాయంత్రం ఐదు కావస్తోంది పలక, పుస్తకాలు పట్టుకుని, బడిగంట ఎప్పుడు మ్రోగుతుందా అని పిల్లలు ఆతృతగా ఎదురు చూస్తూ కూర్చున్నారు.

మరచి పోలేని రోజు అది! నేలమీద కూర్చుని, ఇసుక మీద అక్షరాలు రాసి, చదువుకునే దశ నుంచి బెంచి మీద కూర్చుని చదువు నేర్చుకునే దశకు ఎదిగిన రోజులు మరి! ఆ 'అభివృద్ధి' నాకు ఎంతో ఆనందాన్ని కలిగించింది.

నేలమీద నుంచి బెంచి మీదకి 'ఎదిగి' పోవడంతో, ఇంతకాలం ఇసుకలో వ్రేలు అరిగి పోయేలా రాసినమేము, ఇకనుంచి పలక మీద బలపంతో రాస్తామన్న మాట!

చేతిలో కొత్తపలక, బలపం వున్నాయి. ఆ ఉత్సాహం గురించి వేరే చెప్పాలా? బడిగంట మ్రోగింది. ఒక్కుమ్మడిగా పిల్లలు ఒకరి నొకరు తోసుకుంటూ, సంతోషంగా కేకలు పెడుతూ, కబుర్లు చెప్పు కుంటూ బళ్ళోంచి బయటకు పరుగులు తీశారు. ప్రధానోపాధ్యాయులు గోవిందమీనన్ గారు 'గోల చెయ్యకండర్రా...' అని ఎన్నోసార్లు చెబుతారు. కాని ఏం ప్రయోజనం? పిల్లలు ఆ మాటల్ని లెక్కచేస్తే కదా!

బెంచి మీద కూర్చున్న విశేషం గురించి, దారి పొడుగునా మిత్రులతో గొప్పలు చెప్పు కుంటూ, నా కొత్త పలకను, బలపాన్ని పదేపదే చూపుతూ ఇంటికి వచ్చాను.

ఆ బెంచి మీద కూర్చున్న విశేషం గురించి ఆ రోజు మా అమ్మతో ఎన్నిసార్లు చెప్పానో... మా అమ్మను మీనాక్షి నేత్యార్ అని పిలిచే వాళ్లు. నేను సంబర పడుతూ చెప్పిన సంగతులన్నిటినీ మా అమ్మ చాలా సంతోషంగా విన్నది. నేనలా గారాబంతో, మారాంచేస్తూ, మరోపక్క గంతులు వేస్తూ, కొత్త క్లాసు విశేషాలు చెబుతూ వుంటే, మా తాత (అమ్మగారి నాన్న) చేతికర్రను వూపుతూ, నవ్విన దృశ్యం ఇంకా నా స్మృతి పథంలో అలాగే వుంది!

గుండ్రని ముఖం, బట్టతలతో, ఎత్తుగా, లావుగా వుండేవారు మా తాత. అప్పటి మా తాత గారి రూపం ఇంకా నా కళ్లల్లో మెదులుతూనే వుంది. నేను వయసులో పెరిగి, పరిపక్వత పొందాకే, ఆయన విశాల దృక్పథాన్ని,

ప్రేమతత్వాన్ని గొప్పతనాన్ని గ్రహించగలిగాను. కష్టాలలో వున్నవారిని ఆదుకోవడానికి ఆయన ఎప్పుడూ సిద్ధంగా వుండేవాడు. 'లేదు' అన్నమాట ఆయనకు తెలియదు. తన శక్తికి మించి ఇతరులకి సహాయం చెయ్యడంతో, ఆయన అప్పులపాలై పోయారు. ఆయనకాలం అలాగే గడిచింది!

ఇవాళ్టితరం వారు ఆనాటి సాంఘికస్థితిని, ఆ క్రమశిక్షణను, అలవాట్లను అర్థం చేసుకోవడం కష్టం. ఊహించి తెలుసుకోవడం కూడా కష్టమే!

పాల్‌ఘాట్ రాజవంశ పరంపరలో పుట్టిన మా తాతగారు ఒక యువరాజు. ఆయన మాటల్లోను, నడతలోను వంశపారంపర్యంగా వచ్చే రాజనం కనిపించేది. 'మేమిలా భావిస్తున్నాము. మా అభిప్రాయం ఇది' అనే పద్ధతిలో, 'రాజుల భాష' లోనే మాట్లాడేవారు. తనతో ఇతరులు మాట్లాడేటప్పుడు వాళ్ళకూడా తప్పకుండా అటువంటి గౌరవప్రదమైన భాషను ఉపయోగించాలని మరీమరీ చెప్పేవారు.

ఉదయాన్నే స్నానం చేసి, నుదుట బొట్టుపెట్టుకుని, గుడినుంచి పూజారి తీసుకువచ్చే ప్రసాదం స్వీకరించి, అపూట - దానధర్మాలు చెయ్యకుండా, ఆయన ప్రొద్దుటి భోజనం తీసుకునేవారుకారు. క్షవరం చేసుకున్న రోజున ఆయన సరస్సుకు వెళ్లి స్నానం చేసేవారు. 'తంబిరాన్' (యజమాని), అంటే మా తాతగారు స్నానం చెయ్యడానికి ఆ సరస్సుకు రానున్నారని తెలియగానే, ఆ దరిదాపుల్లో ఎవరూ వుండేవారు కాదు. కత్తి, డాలు పట్టుకుని ఇద్దరు అంగరక్షకులు ముందు నడుస్తూ, అప్పుడప్పుడు చాలా దూరం వినిపించేలా ...'ఆ ...హా' అని నినాదాలు చేసేవాళ్లు. తంబిరాన్ వెనుక ఒక సేవకుడు ఓ తాటాకుల గొడుగును పట్టుకుని నడిచేవాడు. ఆయన స్నానానికి సరస్సుకు వెళ్లడం, స్నానం చేసి తిరిగి రావడం చూడడానికి జనం వరుసగా నిలబడేవారు.

క్షవరానికి కూర్చోవడానికి ముందు - ఆయన క్షురకుడికి తాంబూలం సమర్పించడం వాడుక. అతను చేతిలో కత్తిపట్టుకుని తన ముందు కాస్సేపు కూర్చోవాలి కాబట్టి, అతన్ని సంతోషపరచడం సముచితమన్న ఉద్దేశ్యంతో ఈ వాడుక ఆరంభమైంది కాబోలు!

ఎప్పుడో సంవత్సరానికి ఒకసారో లేదా రెండుసార్లో ఏదైనా ముఖ్యమైన కారణం వుంటేనే, తంబిరాన్ - ఆలత్తూరుకో, పాలఘాట్‌కో ప్రయాణం చేసేవారు. మా ఇల్లు పాల్‌ఘాట్‌కు నైరుతిదిశగా ఇరవైమైళ్ల దూరంలో తరూర్ గ్రామంలో వుండేది. నేను అక్కడే పుట్టాను.

తాతగారి ప్రయాణం నిర్ణయం అయిందంటే, ఎన్నో రోజులకు ముందే ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లు ప్రారంభం అవుతాయి. యుద్ధంలో

ఉపయోగపడేపలురకాల ఆయుధాలు అక్కడ వుండేవి. ఆ ఆయుధాలకు తుడిచి, శుభ్రం చెయ్యడానికి మనుషులు వచ్చేవారు. కత్తి, డాలు, తుపాకి, ఈటె, శూలం, గొడ్డలి మొదలైన ఆయుధాలను - గదులలో వాటి వాటి స్థానాల్లో తగిలించి వుంచేవారు. ముఖ్యమైన కొన్ని సందర్భాలలోనే వాటిని వెలుపలికి తీసేవారు. బోయీలు వచ్చి పల్లకిని శుభ్రం చేసేవారు. పణిక్కర్ (జ్యోతిష్కుడు) వచ్చి, ప్రయాణానికి ముహూర్తాన్ని నిర్ణయించేవారు. తంబిరాన్ ప్రయాణం, ఆ వూరేగింపు బయలుదేరడం, చూడడానికి చుట్టుపక్కల నుంచీ జనం వచ్చేవారు. ఆ యాత్రావిధానమే చూడచక్కని ఒక దృశ్యం!

భటులందరూ - తగిన దుస్తులు ధరించి, ఆయుధాలు పట్టుకుని వరుసగా నిలబడేవారు. పల్లకి ముందూ, వెనుకా వాళ్లలా నిలబడి వుంటే, పల్లకికి రెండు వైపులా ఇద్దరు వెండిపూతగల దుడ్డుకర్రలు పట్టుకుని వుండేవారు. తమలపాకుల పెట్టె, కూజా చెంబులతో నీళ్లు పట్టుకుని సేవకులు పల్లకి వెంట నడిచివచ్చేవాళ్లు.

అందరూ తమ తమ స్థానాలలో నిలబడి, ప్రయాణానికి సిద్ధంకాగానే, శకునం చూసేవాళ్లు, అప్పుడు... విలువైన పట్టుసంచి, నడుముకుపైన ఉత్తరీయం, పాదాలకు ఖరీదైన పాదరక్షలు... వక్షం మీద సువర్ణహారాలు ధగధగా మెరుస్తూ వుంటే, తంబిరాన్ వెలుపలికి వచ్చి దర్శనం యిచ్చేవారు. పల్లకి ఎక్కడానికి ముందు, రెండు చేతులు వెనక్కికట్టుకుని, ఒకసారి అలా సేవకులను, భటులను-చూసి, ఠీవిగా తలపంకించేవారు. ఇక, వూరేగింపు బయలుదేరవలసిందే!

పల్లకి ముందు నడిచే భట్రాజుల ప్రశంసావాక్యాలు, బోయీలవూత పదాలు, సేవకులు చేసేహడావిడి .... ఇవి చాలాదూరం వినబడేవి.

తంబిరాన్ రాజుల ధోరణిలోనే అతిథులకు ఉపచారం చేసేవారు. ఎవరు వెళ్లినా, ఏమాత్రం లోటు చూపకుండా, తాంబూలం యిచ్చేవారు. అయితే, తాంబూలం యిచ్చేధోరణిలో కొన్ని భేదాలు వుండేవి. కొందరికి చేతితోనే తాంబూలం తీసి యిచ్చేవారు. కొందరికి తామే స్వయంగా - తాంబూలం పెట్టెలోంచి, తమలపాకులు_ వక్కలు తీసి యిచ్చేవారు. మరికొందరినైతే, లోపలికి ఆహ్వానించి, చాపమీద కూర్చోబెట్టి, తాంబులంపెట్టెను వారి ముందు వుంచి, తాంబూలం స్వీకరించమని మనవి చేసేవారు.

బ్రాహ్మణులకు తప్ప - వేరెవరికైనాగాని, తంబిరాన్ ముందు తాంబూలం వేసుకునే అలవాటులేదు. సంప్రదాయాలను నియమనిష్ఠలతో అనుసరించే బ్రాహ్మణులను ఆహ్వానించి, మర్యాదలు చేసి, వారికి దానం చేయడంలో

తంబిరాన్ ఎక్కువ ఆసక్తిని కనబరచేవారు. ఆయన సంస్థానానికి చెందిన ఒక ఉచిత వసతి గృహం కూడా ఆ ప్రాంతంలో వుండేది. ఆనాటి పాల్‌ఘాట్ రాచరికపు కుటుంబాలను 'పీఠాలు'గా వ్యవహరించడం పరిపాటి. బ్రాహ్మణ బాటసారులు - ఆ వసతిగృహంలో రెండుపూటలు బస చేసి, భోజనం చెయ్యవచ్చు. రాత్రి బసచేస్తే, భోజనం తర్వాత తాంబూలంతో పాటు, చాప, దిండు కూడా వాళ్ళకు యివ్వడం అలవాటు. ఇలాంటి వసతిగృహాలను ఆనాటి సంపన్నులు పలుప్రాంతాలలో ఏర్పాటు చేశారు. అయితే ఆ సౌకర్యాలు పై జాతులని చెప్పబడ్డవారికి పరిమితం చేయడం జరిగింది. వాళ్ళల్లో పండితులు, శాస్త్రాలలో ఆరితేరిన విజ్ఞులు వుండేవారు. మా తాతగారు అప్పుడప్పుడు వాళ్ళతో చర్చలు జరుపుతూ ఆనందించేవారు. వాళ్ళు కథలు, పురాణాలు అవి వివరంగా చెబుతూ వుంటే, విని సంతోషించేవారు.

మా తాతగారికి కథలు చెప్పే సామర్థ్యం బాగా వుండేది. ప్రతి కథా రసవత్తరంగా చెప్పేవారు. అందువల్ల ప్రతిరోజూ నేను, అక్కయ్య - రాత్రి భోజనాలు చేశాక, ఆయన దగ్గరికి కథలు వినడానికి వెళ్ళేవాళ్ళం.

కథముగిసేముందు తాతయ్య మీద కాళ్ళుజాపుకుని నేను నిద్రపోయేవాణ్ణి. ఎంతో ప్రేమగా ఆ రెండు చేతులూ నా తలని స్పృశించే ఆ అనురాగాన్ని అనుభవించకుండా నేను నిద్రించిన రోజులు చాలా తక్కువ.

బడిలో ఉపాధ్యాయుని వద్ద మేము దెబ్బలు తిన్నా, యితర కుర్రాళ్ళు నా పెన్సిలు లాక్కున్నా మా తాతయ్య దగ్గరకు పరుగెత్తుకు వచ్చేవాణ్ణి. నాకు ఎటువంటి కష్టం వచ్చినా మా తాతయ్య దగ్గరకు వచ్చానంటే అది తొలగేదారి వుంటుందన్న నమ్మకం నా లేత హృదయంలో వేళ్ళూని వుండేది నాకు. ఎలాంటి చేష్టలు చేసినా ఆయన ఎప్పుడు ఏమి చేయరని అనుకునేవాణ్ణి. భరించలేనంతగా నేను విసిగించినప్పటికి కూడ ఆయన 'నిన్ను కొడతాను చూడు ఒక రోజు' అనే తిట్టేవారు. అయితే నన్ను కొట్టకుండానే ఆయన కాలం గడిచిపోయింది.

మరణ విషాదాన్ని నేను మొట్టమొదటిసారిగా అప్పుడే గ్రహించాను. నా కంటిపాపలాంటి ప్రియమైన తాతగారిని పట్టుగుడ్డతో కప్పి చితిమీద నిప్పంటించినప్పుడు ఆ దృశ్యం చూడలేక నేను విలపించాను. చితిరగిలినప్పుడు, నన్ను ఎన్నోసార్లు ప్రేమతో కౌగలించుకున్న ఆ చేతులు కాలిపడడం, ఎప్పుడూ నాకు అండనూ, ఆదరణను యిచ్చిన వక్షం కాలిబూడిద కావడం సహించలేక నా లేత హృదయం రోదించింది. నా ప్రియమైన తాతయ్యను యికచూడలేను కదా అన్న విషాదం ఏర్పడింది. మిగతా వాళ్లందరూ నన్ను ఓదార్చడానికి ప్రయత్నించినప్పటికీ తాతయ్యతో

కలిసి తిరిగిన స్థలాలన్ని బోసిగా అనిపించినప్పుడు నాకు తెలియకుండానే దుఃఖం ముంచుకువచ్చేది.

'తాత స్వర్గంలో వున్నారు. ఆయన పాపపుణ్యాలు దేవుడు లెక్క చూస్తూవుంటాడు' అని కొందరు నాతో చెప్పినప్పుడు వాళ్లతో, 'మా తాతయ్య - ఒక్క పాపం కూడా చెయ్యనివాడు' అని గట్టిగా అరిచి చెప్పాను. రత్నాలు పొదిగిన బంగారు కిరీటం, బంగారు హారాలు, పట్టు పీతాంబరాలు ధరించి ఉన్నతమైన ఆసనంలో కూర్చున్న ఒక దివ్య స్వరూపాన్ని; స్నానం చేసి, నుదుట బొట్టుపెట్టుకుని చేతులు కట్టుకుని శాంతం, వినయం రూపుదాల్చినట్లు నిలబడ్డ మా తాతయ్యను నా లేత హృదయం ఊహల్లో చూసేది.

మా అమ్మమ్మ నెరిసిన జుట్టు, విబూది మీద కుంకుమ తిలకంతో వేకువజామున ఏట్లో స్నానంచేసి రావటం కాస్త దూరం నుంచే కనుక్కోవచ్చు. మామ్మ స్నానం చెయ్యడానికి వెళ్లినప్పుడు నన్నుకూడా తీసుకువెళ్లేది. స్నానం చేసి తిరిగివచ్చేప్పుడు ఏటిగట్టున ఉన్న పెద్ద మర్రి వృక్షానికి ప్రదక్షిణలు చేసేది.

'కాశి విశ్వనాథా! హిమాద్రినాథా! అనాథరక్షకా!' అని ప్రార్థించి మర్రిచెట్టు వద్దనుంచి యింటికి చేరేవాళ్లం. మామ్మగారి విబూది పెట్టి తోనేను ఆమె వెంట నడిచేవాణ్ణి. దారిలో ఎవరైనా సెరుమరై జాతి (అంటరాని) వాళ్లని చూస్తే దూరంగా తొలగిపొమ్మని గట్టిగా కేకవేసేది. అయితే వాళ్లకే ఆమె, తలంటుకోడానికి నూనె, ధరించడానికి దుస్తులు, తమలపాకులు, ప్రేమతో యిచ్చేది. మామ్మగారి మందుల పెట్టెలో ఎప్పుడూ సిద్ధంగా మామూలు రోగాలకు కావలసిన మందులు వుండేవి. ఆ రోజుల్లో వైద్యులను వెతుక్కుని వెళ్లేవాళ్లు చాలా తక్కువ. మా ఇంట్లోనే కాదు. ఇరుగుపొరుగు వారికి కావలసినప్పుడల్లా ఆ మందులు, వాటితో పాటు సలహాలు అందజేసి సహాయపడేది. అయితే మామ్మకు కోపం వచ్చిందంటే ఆమె కఠినమైన పదజాలం కూడా విని తీరాల్సిందే. ఆమెకు కోపం వచ్చినప్పుడు పెట్టే చివాట్లు వినేవాళ్లు భరించలేని విధంగా వుంటాయి.

మామ్మకు ఇద్దరు పిల్లలు. మా అమ్మకన్న ఎన్నో సంవత్సరాలు పెద్దవాడైన అప్పుకుట్టి మేనన్ తర్వాత మా మామ్మ పదకొండు మందిని కన్నదట. అయితే ఆ బిడ్డలందరూ పుట్టిన కొన్నాళ్లల్లోనే చనిపోయారు. నలభై ఏళ్లువచ్చినా కూడా మరోబిడ్డ లేదే అన్న కొరత మామ్మకు ఉండేది. అందువల్ల ఆలోటు తీరడానికి పలువిధాలైన ప్రాయశ్చిత్తాలు, ప్రార్థనలు, దివ్యక్షేత్రాల సందర్శన చేసిం తర్వాత నలభై రెండేళ్ల ప్రాయంలో మా అమ్మను

కన్నదట. కూతురికి ఆనాటికి తగ్గ విద్య నేర్పించారు. మా అమ్మకు చక్కగా చదవడం, రాయడం తెలుసు. ఆమె రామాయణం చదువు తున్నప్పుడు వినడానికి ఎంతో ఇంపుగా వుండేది. మధురమైన స్వరంతో పాడుతూ, వీణకూడా వాయించేది.

నలుగురైదుగురు సంతానం కలిగాక కూడా మా అమ్మ పాటకి, వీణకి ఎలాంటి ఆటంకమూ ఏర్పడలేదు.

మా అమ్మకు సంగీతం నేర్పించిన పళమనూర్‌సాము భగవతర్ నాకింకా జ్ఞాపకం వున్నారు. నాకు ఊహతెలిసిన కాలంలో ఆయన మామూలుగా వచ్చి పాఠాలు నేర్పింది లేదు. అయినప్పటికీ అప్పు డప్పు డు వచ్చి తన విద్యార్థినిని పిలిచి పాడమనేవారు. తను కూడా కలసి పాడేవారు. డెబ్భై ఏళ్లు దాటిన సాముభగవతర్ నోట్లో నాలుగైదు పళ్లు మాత్రమే వుండేవి. ఉచ్చారణ, కంఠస్వరం సుమారుగానే వుండేవి. అయితే ఆయన అష్టపది ఆలపించినప్పు డు భావోద్వేగం ఎక్కువగా వుండేది. ఈ రోజుల్లో కొందరు అష్టపదుల్ని కొత్తవిధానంలో పాడుతున్నారు. అవి వినడానికి అంత ఇంపుగా లేవు. నాకు అష్టపదుల్ని పాత పద్ధతుల్లో పాడడమే ఇష్టం.

మా అమ్మ తెల్లవారు జామునలేచి దీపం వెలిగించి, వీణ తీసుకుని అష్టపదుల్ని ఆలాపించడం వినడానికి ఇరుగు పొరుగు అక్కడికి వచ్చి కూర్చునేవారు.

ఇంటిపనులు సక్రమంగా నెరవేర్చడం లోను పనిమనుషులతో కలిసి నడుచుకునే తీరు సున్నితంగా ప్రవర్తించడంలోను మా అమ్మ స్వభావం తేట తెల్లమయ్యేది. వసంత కాలంలో కాయగూరల పాదులకు నీళ్లు పట్టడానికి పనిమనుషులతో పాటే ఆమె కూడా వెళ్లేది. ఉదయం పనిమనుషులు ఇల్లు ఊడ్చి అలికి శుభ్రం చేసేప్పు డు మా అమ్మ కూడా వాళ్లకు సహాయం చేసేది. మా ఇంట్లో చాలాకాలంగా ఒకావిడ వంటపని చూస్తూవుండేది. ఆమెని మేము మా ఇంట్లో ఒక మనిషిగానే భావించేవాళ్లం. మా అమ్మ అప్పు డప్పు డు వంటగదిలోకి వెళ్లి ఆమెకు సహాయం చేసేది. శివరాత్రి, జంధ్యాల పౌర్ణమి మొదలైన విశేష పర్వదినాల్లో బ్రాహ్మణులకు దక్షిణ, బియ్యం, కూరగాయలు, పప్పు లు మొదలైన వస్తువులు ఇవ్వడం అలవాటు. ఆయా రోజులకంటే ప్రత్యేకమైన ఆచారాలు, సంప్రదాయాలు వుండేవి. అవన్నీ ఆగిపోకుండా, కాదనకుండా మా అమ్మ నెరవేర్చేది.

మా అక్కయ్యకు నాకు మధ్య తగవు వచ్చిందంటే మా అమ్మ ఎప్పు డు మా అక్కనే తిట్టేది.

వాడు ఊరక దబ్బలాటకు రాడు. నువ్వే పోట్లాటకు దిగుతున్నావు' అని తిట్టి నన్ను దూరంగా తీసుకువెళ్లేది. నేను ఎప్పుడూ తప్పు చేయ్యని వాణ్ణేంకాదు. అయినప్పటికీ మా అమ్మకు నేను ఎప్పుడు తప్పు చెయ్యనివాణ్ణే!

మా మేనమామ అప్పుకుట్టిమేనన్ దాదాపు తన ఏభై ఐదవ ఏట కాశికి వెళ్లారు. అక్కడ్నించి ఆయన తిరిగి రాలేదు. అక్కడే ముక్తి పొందాలన్నది ఆయన చివరికోరిక. అది నెరవేరింది.

మా స్వగృహం నుంచి కొద్ది దూరంలో నాన్న కొయ్యపలకలతో ఏర్పరచిన చిన్న ఇంట్లో మేము నివసించే వాళ్లం. మా స్వగృహానికి తూర్పువారి ఇల్లు అని పేరుండేది. ఈ కుటుంబంలో సభ్యులందరూ చాలా కష్టాల్లోనే కాలం గడిపారు. కంచెవేయడానికి, ప్రహరికట్టడానికి, తవ్వడానికి, కప్పు వేయడానికి ఇంట్లోవాళ్లు సహాయపడేవాళ్లు. వాళ్లలో చాలా మందికి చెప్పు కోదగ్గ వృత్తిగానీ, ఉద్యోగం గానీ లేదు. అందువల్ల కుటుంబపెద్ద అభిప్రాయానికి తగ్గట్టుగా నడుచుకోవడానికి సిద్ధంగా వుండేవారు. కుటుంబ పెద్దకు కూడా యువతరంతో కలిసి పని చేయడానికి విసుగనిపించేదికాదు.

మధ్యాన్నం వరకు కలిసి పనిచేసిన తర్వాత స్నానంచేసి నడుముకు చుట్టుకున్న పంచను ఆరవేసి, నడుముకు ఉత్తరీయాన్ని చుట్టుకుని భోజనానికి కూర్చునేవారు. మందపాటి గిన్నె ముందు ఆయన కూర్చున్న తర్వాత ఆయన చెల్లెలు వడ్డించేది. పెద్దపెద్ద ముద్దలు చేసి ఆయన త్వరత్వరగా భుజించేవారు. తాంబూలం వేసుకున్న తర్వాత, గొడుగు తీసుకుని బయలుదేరేవారు. కుటుంబ పెద్ద దినసరి చర్య యిది.

కుటుంబ పెద్ద కుటుంబ సంక్షేమాన్ని, మంచిపేరును, యువతరాన్ని జాగ్రత్తగా కాపాడుతూ వచ్చారు. ఆలయ ఉత్సవాలు, పురం పండుగ మొదలైనవే వాళ్ల మూసజీవనానికి భిన్నమైనవి - చెప్పు కోదగ్గవి.

ఇంట్లో అందరూ ఒక చోట ఉండడం కష్టంగా ఉండడం వల్లే మా తండ్రి గారు మాకు ఇల్లు విడిగా కట్టి యిచ్చారు. నా ఈడు వాళ్లతో ఆటలాడుకోడానికి నేను ఆ కొయ్యపలకల ఇంటినుంచి స్వగృహానికి వెళ్లేవాణ్ణి. నేను రకరకాల ఆటలాడేవాడిని. ఎంతో ఆసక్తితో ఆడే ఆట 'మేష్టారు-పిల్లలు గల పాఠశాల' ఆటే! 'కుటుంబపెద్ద-పిల్లలు' అనే కుటుంబపు ఆట కూడ మేం తరచు ఆడేవాళ్లం. పెద్దలెవరైనా దగ్గరకు వస్తున్నారని తెలియగానే నేను పరుగెత్తుకువెళ్లి దాక్కునేవాణ్ణి. కుటుంబ పెద్ద అన్నా మామవరుస వచ్చే వాళ్లన్నా నాకు భయం. అయితే ఒక్కమామ దగ్గర మాత్రంనాకు భయం ఉండేది కాదు. ఆయనే 'అబద్ధాలకోరు'మామ! ఆయన్ను చూడగానే అందరం చుట్టుముట్టేవాళ్లం. ఆయనకు మేమంటే చాలాప్రేమ.

ఆయనకు 'అబద్ధాలకోరు' అన్న పేరు ఎలా వచ్చిందో నాకు తెలియదు పిల్లలు మాత్రమే కాదు పెద్దలు కూడా ఆయన్న అలాగే పిలిచేవారు.

నాకు ఊహతెలిసిన రోజుల్లో ఆయనకు దాదాపు ఏభై ఏళ్లు ఉండచ్చు. సన్నగా పొడుగ్గా బట్టతలతో, కుడివైపుకి వాలిన చూపుతో, తమలపాకు వల్ల గారకట్టిన పళ్లతో, మోకాళ్లకు పైన కట్టిన పంచతో ఆయన ఉండేవారు. ఒక చేత్తో ఏసిని కర్రపట్టుకుని ఆయన కనిపిస్తే చాలు పిల్లలు పరుగెత్తుకుని వెళ్లి ఆయన్ను చుట్టుముట్టే వాళ్లు. గడప ఎక్కే లోపల, 'ఎక్కడున్నారు మామయ్యా కొన్ని రోజులుగా కనిపించడం లేదే మిటి' అంటూ పలకరింపులు జరిగేవి. ఆయన అలాన్‌పదో 'కథ' చెప్పడం ప్రారంభించేవారు. ఆయన 'కథ' ను ఇంకా నేను మరచి పోలేదు.

ఒకరోజు ఆయన - 'నేను తిరువెళ్ల కొండకు వెళ్లాను' అని ప్రారంభించారు. నేను ఆయన మాటలను జ్ఞాపకం తెచ్చుకుంటున్నాను. 'తిరుళ్ల కొండనుంచి లకిడికి పోయాను అప్పు డు రైలు బండిలో పొట్లకాయలు ఎక్కించారు. ఒక్కొక్కటి పదహారడుగుల పొడవు ఒక అరటి చెట్టు అంత లావు. అటువంటి పొట్లకాయలను నేను ఇంతవరకు చూడలేదంటే నమ్మండి...

'అవన్నీ ఎక్కడికి వెళుతున్నాయి మామయ్యా' అనడిగాడు ఒక కుర్రాడు 'చెబుతావిను. కొచ్చి రాజు పుట్టిన రోజుకు తీసుకు వెడుతున్నారట. నాతో ఓ వంటతను చెప్పాడు. అతడు అక్కడికి వెళ్లడం గురించి ఏని నేను వెళ్లాను. ఆహా.....ఆ సందడి ఎందు కడుగుతారు. అ....హా.....హా!'

తమలపాకులు తీసుకుని తుడిచి, సున్నంపూసి అబద్ధాల కోరు మామయ్య ఎంతో ఉత్సాహంగా పుట్టిన రోజు విందు గురించి చెప్పసాగాడు.

'పంక్తిలో వేసిన ఒక్కొక్క ఆకు గజంకర్రకు మూడునాలుగింతలు పొడవుపుంది. అన్నం అంటే అదే అన్నం. మల్లెపూలు చెడ్డాయనుకో- తాళింపులు, పచ్చళ్లు చెప్పడానికి లేదు. ఆ....హా.... అరవైనాలుగు రకాలు... ఆ పాల పాయసం వడ్డించారు చూడండి... అది చూడాలా మీరు!'

మామయ్య మొహం, చేతులూ ఆడిస్తూ ఆ భోజనాన్ని వర్ణించిన ఉత్సాహం ఎంతో రసవత్తరంగా వుంది. 'ఒక బావి నిండుగా పాయసం! బావి నిం"....డు.....గా! బావి చుట్టు లోపల వెండి రేకుతో కవచం దించారు. బావిలోపల వెండికవచం. ఆ తర్వాత ఆ బావిలోపల పాయసం తోడి పొయ్యడానికి వీలుగా ఒక వెండి ఏతం. ఆ పని నంబుద్రీలు చేశారు. రెండు వైపులా నున్నటి చెక్కెరతో దారి తీసి విడిచిన కాలవలోకి పాయసాన్ని పారించి, భోజనాలకు ఆకువేసి కూర్చోబెట్టి ఆ పాయసాన్ని అక్కడికి పారించారంటే

చూడండి. ఇవన్నీ ఎవరి వల్ల చేయడానికి వీలవుతుంది? మహారాజుల వల్ల సాధ్యమవుతుంది. నన్ను కూడా రెండ్రోజులు వుండి పొమ్మన్నారు. అందువల్లే రెండ్రోజులు నేను ఇక్కడ లేను!'

మామయ్య తమలపాకు మడిచి వేసుకున్నాడు. మేము ఆ కథ మిగతా వాళ్లకి చెప్పడానికి పరుగెత్తాం. 'అబద్ధాలకోరు' అన్న బిరుదు మా మామయ్య కెందుకు వచ్చిందో పాఠకులు ఈ పాటికి గ్రహించే వుంటారు.

ప్రధానోపాధ్యాయుడు గోవింద మీనన్ రోజూ మా ఇంటికి వచ్చేవారు. మా తాత గారికి లెక్కలు, ఉత్తరాలు ఆయనే రాసిపెట్టేవారు. నడుముకు పంచను చుట్టుకుని మళ్లీ ఆ పంచకు ఉత్తరీయం కట్టుకుని, పేనా కత్తి వుండే తాళం చెవుల గుత్తితో రెండు చేతులూ కట్టుకుని ప్రధానోపాధ్యాయుడు తాత దగ్గర నిలబడి కాస్సేపు మాట్లాడేవారు. ఉపాధ్యాయుని చూడగానే నేను, నా సోదరి లోపలికి పరుగెత్తే వాళ్లం. ఆయన అక్కడినుంచి వెళ్లారాఅని వాకిట్లోంచి తొంగి చూసేవాళ్లం. ఉపాధ్యాయుడు తన ఇంటికి వెళ్లడం మేము చూస్తూ అలాగే నిలబడే వాళ్లం. ఆయన కొంచెం దూరం వెళ్లగానే 'గోవింద మేష్టారు పుల్లాట్టు మీద్, అస్తమిచ్చాల్ దినేదినే' అని పాడుకుంటూ పరుగెత్తుతూ ఆటలాడే వాళ్లం. ఈ పాట మొదట పాడినవారు ఎవరో నాకు తెలియదు. ఈ పరిహాస గీతం గురించి మేష్టారుకు తెలుసా అన్నది తెలియదు. అయితే మేం ఆ పాట పాడని రోజులు చాలా అరుదు. ఏటా విజయదశమి రోజున ఉపాధ్యాయులు గురుదక్షిణ గురించి ఆయన పాదాలకు మొక్కేవాళ్లం. అలాగే ప్రయాణాలకు వెళ్లేప్పు డు కూడా ఆయన ఆశీర్వచనాలు పుచ్చుకునేవాళ్లం. ఓణం, చిత్తిరైవిశు, తిరువదురై, దేవాలయ ఉత్సవాలు మొదలైన పండుగదినాలు మేము ఎంతో సంతోషంగా గడిపేవాళ్లం. తిరువోణానికి కొన్నిరోజుల ముందు నుంచే ఆటపాటలు ప్రారంభమవుతాయి. పువ్వులుకోసుకు రావడం, మహాబలి బొమ్మ చెయ్యడం, విల్లుపాట పాడి నాటక రంగాలను సిద్ధంచెయ్యడం ఒక్కొక్కటిగా చేస్తూవుండేవాళ్లం. ఉత్తరాషాఢ రోజున చారల పంచ, తిరువోణానికి తెల్లటి ఇస్త్రీపంచ తప్పకుండా కావాలి.

మా నాన్న గారి పీఠంలో జరిగే విశేషక్రీడా వైభవం అందరి దృష్టిని ఆకర్షించింది. పగలు రెండుగంటల ప్రాంతాన ఒక పెద్ద మైదానంలో ఆ కార్యక్రమం ప్రారంభమవుతుంది. ఆ మైదానానికి విశేషక్రీడా మైదానం అని పేరు.

మైదానంలో దక్షిణ, ఉత్తరస్థలాల్లో ఆటలో పాల్గొనే ఇరుపక్షాల వాళ్లు, తూర్పు పడమర వైపుల ప్రేక్షకులు గుమికూడే వారు. మైదానం మధ్యగా ఒక కుర్చీలో పెద్దకూర్చునేవారు.

ఈ పండుగ క్రీడలో పాల్గొనేవారు ఎవరైనా కాస్త నీచంగా మాట్లాడినా, ప్రవర్తించినా వాళ్లను అక్కడినుంచి తరిమి వేయడానికి చేతిలో బెత్తంతో కాపలావాళ్లు పెద్ద దగ్గర వుండేవాళ్లు. గుంపు చేరగానే రెండు పక్షాల వాళ్లు తను నేర్పును ప్రదర్శించడం ప్రారంభిస్తారు. ఒక్కొక్క పక్షంలోని వీరులూ నడుంకి పంచ కట్టుకుని నలుగురైదుగురుగా చేరి గట్టిగా కేకలు వేసి పిలుస్తూ ముందుకు వెళ్లి ఎదుటి పక్షం వాళ్లని సవాలు చేసి వచ్చేవాళ్లు. ఈ విధంగా తమతమ బలాలు చూపి అరుస్తూ గొప్పలు చెప్పుకుంటూ సవాలు చేస్తూ ఆటకు కావలసిన వాతావరణాన్ని సృష్టించేవాళ్లు. ఆ తర్వాత ఇరుపక్షాల వీరుల మధ్య పోటీలు జరిగేవి.

ఆటజరిగేప్పుడు గౌరవానికి తగ్గ విధంగా కాకుండా ఏదైనా జరిగితే ఆ విషయాన్ని అందుకోసమే నియమింపబడ్డ కాపలావాళ్లు చూసుకునేవాళ్లు. ఆ విధంగా ప్రవర్తించిన వారిని వెంటనే ఆటనుంచి బహిష్కరిస్తారు. ఆ రోజుల్లో కొట్టి, కొట్టామ్ మొదలైన సుప్రసిద్ధులైన ఆటగాళ్లు పోటీల్లో పాల్గొంటున్నారంటే ఎక్కువ జనం గుమికూడేవారు.

కొన్ని సమయాల్లో పోట్లాటలు, అరుపులు ఎక్కువయి అలజడి ఏర్పడేది. అటువంటి సందర్భాలలో పెద్ద చేతిలో పేము పట్టుకుని గుంపు మధ్యకి జొరబడి పేము విసురుతూ నడిచేవాడు పోట్లాట, అరుపులు తగ్గి ఎవరికి వారు యథాస్థానాల్లు కూర్చునేవారు.

ఉత్సవం చివరిరోజున ఆటలలో పాల్గొన్న ఇరుపక్షాల వారికి పెద్ద కొత్తపంచ, కండువా బహూకరించేవారు. ఎంత ఉత్సాహం కలిగించే దృశ్యాలు అవి!

# విద్యాభ్యాసం

**పాల్‌ఘాట్ లోనూ, కోళిక్కోడ్ లోనూ**

నా తండ్రి భీమనచ్చన్, పాల్‌ఘాట్ రాజపరంపరలో 'నడువిలెడమ్' అన్నకుటుంబానికి చెందినవారు. ఇంచుమించు నూటయాభై మంది సభ్యులున్న ఆ ఉమ్మడి కుటుంబం ఆ రోజులలో చాలామంచి స్థితిలో వుండేది. మా తండ్రి ఆ కుటుంబంలో మూడో సంతానం. అయినా కుటుంబ నిర్వహణా బాధ్యతలను ఆయనే చూసుకునేవారు. మాటకారితనం, కార్యనిర్వహణా సామర్థ్యం, మంచి పలుకు బడి వున్న ఆయన పట్ల, కుటుంబ సభ్యులే కాకుండా మిగతా వాళ్ళుకూడా మంచి గౌరవాభిమానాలు, విశ్వాసం చూపేవాళ్ళు. 'నడువిలెడమ్' అన్న మా భవంతిలో ముప్పై గదులుండేవి. ఉదయం, సాయంకాలం రెండు పూటలా మామూలుగా అందరం చేరి ఎసట్లో బియ్యం పోసి అన్నం వండే వాళ్లం. తల్లివైపు బంధువులు తమకు కావలసిన కూరలు విడిగా చేసుకునే వాళ్ళు. ఓణం, విషం, తిరువాదిరై, మొదలైన పండుగలకు అయ్యే అదనపు ఖర్చులకు తగ్గట్టు డబ్బు, వస్తువులు తల్లివైపు వారికి పంచి ఇచ్చేవాళ్ళు.

వయసుకు వచ్చిన మగపిల్లలకు ప్రతిసంవత్సరం అవసరానికి తగ్గట్టు ఓ మోస్తరు ఖర్చుకు డబ్బులు ఇచ్చే అలవాటు వుండేది. వివాహితులైతే ఇంకా ఎక్కువగా ఖర్చుకు ఇచ్చేవాళ్ళు. అవసరాలు తక్కువగా వున్నా ఆ కాలంలో ఈ పద్ధతులు చాలా సవ్యంగా జరిగేవి.

కుటుంబ లెక్కలు చూసే గుమాస్తా కరుప్పనెళుత్తచ్చన్ రోజూ ఉదయం వంటకు కావలసిన సరుకుల్ని తీసి ఇచ్చేవారు. మోకాలు క్రిందికి ఒక పెద్ద అంచు పంచె కట్టుకుని, పైన కండువా కప్పుకుని, చేతిలో కాగితం, కలం పట్టుకుని, ముడివేసిన పిలకజుత్తుతో ఎళుత్తచ్చన్ వంట మనిషికి కావలసిన సరుకులకు, వాటికయ్యేఖర్చుల వివరాలను తెలియజేయడానికి మానాన్న గారి వద్దకు వచ్చి నిలబడేవారు. మా తండ్రి, ఇంటికి ఎవరైన వస్తారా, ఏమైనా విశేషం వున్నదా అని విచారించిన తర్వాత, దానికి తగ్గట్టుగా ఎళుత్తచ్చన్ కు ఏమేమి కొనవలసిందే, వాటికి అనుమతి ఇచ్చేవారు.

వంటకి కావలసిన వస్తువులు కొని ఇచ్చిన తర్వాత, ఇళుత్తచ్చన్ దక్షిణంవైపు వున్న గాదెల చూరు క్రింద - 'పీఠం' లో వున్న పిల్లలకు పాఠాలు

బోధించేవారు. పగటిపూట పిల్లలకు రామాయణం చదవడం నేర్పేవారు. ఈ పనులన్నిటికి జీతంగా ఎళుత్తచ్చన్ తీసుకునేది ఏడాదికి కొన్ని బస్తాల ధాన్యం.

బట్టలుతికే చాకలి, క్షురకుడు, మొదలైన వారందరికి ప్రతియేటా ధాన్యాగారం నుంచి రెండుసార్లు లేదా మూడు పర్యాయాలు వడ్లు ఇవ్వడం అలవాటు. శాంతి, తృప్తి రాజ్యంచేసిన బంగారుకాలం అది!

ఆ రోజులలో తరూర్‌లో ఒక ప్రాథమిక పాఠశాల మాత్రమే వుండేది. అక్కడ నాలుగో తరగతి వరకు చదివి, ఆ తర్వాత నేను ఆలత్తూర్ బోర్డుమిడిల్ స్కూల్‌కు చదువుకోవడానికి వెళ్లాను. బడిని దూరం నుంచి చూడగానే నా గుండె భయంతో దడదడ లాడేది. ఇల్లువిడిచి దూరంగా వెళుతున్నారన్న భావమో లేదా ఉపాధ్యాయుల పట్ల వున్న భయమో... ఏమో? ఆనాటి ప్రధానోపాధ్యాయులు అనంత సుబ్బశాస్త్రి గళ్. సుబ్రమణ్య అయ్యర్ మా క్లాసు మాస్టారు. విద్యార్థులందరికి ఆయనంటే చాలా భయం. 'బ్రహ్మానంద స్వామి' గా ప్రసిద్ధులైన గోవింద మీనన్ మాకు సంస్కృతం నేర్పారు. ఆలత్తూర్‌లో నేను ఆరునెలల పాటు చదువుకున్నాను. ఆ తర్వాత పాల్‌ఘాట్ చేరుకున్నాను. అక్కడ కల్‌పాత్తి విశ్వనాథ ఆలయం సమీపంలో ఉన్న పాఠశాల నిర్వాహకుడిగా పనిచేసే ఒకరి ఇంట్లో వుంటూ చదువుకున్నాను. బడి ఇంటికి దగ్గర లోనే వుండేది. పాఠశాల ప్రధానోపాధ్యాయులూ, నిర్వాహకులు అయిన గోపాల అయ్యర్ పిల్లలకు చదువు చెప్పడం లోను, తప్పు చేస్తే దండించడంలోనూ పేరు పొందిన వారు. చేతిలో బెత్తం లేకుండా ఆయన తరగతికి వచ్చేవారు కాదు. ఆ బెత్తాన్ని ఉపయోగించకుండా ఆయన తరగతి నుంచి వెళ్లిందీ లేదు!

నాకు అప్పుడు పదేళ్లే. 1886 సం॥ సెప్టెంబరు ఒకటో తేది నాపుట్టిన రోజు.

ఆ రోజులలో నా సమ వయస్కులైన పిల్లలతో కలిసి ఆడుకుని ఆనందించే అవకాశం నాకు అంతగా ఏర్పడలేదు. వేకువజామున నాలుగు గంటలకు ఆలయం ముందు నిలబడి ఒక వ్యక్తి 'హరహరమహదేవ' అని గట్టిగా అరవడం వినిపించేది. ఆ శబ్దం చెవిన పడగానే మొట్టమొదట ఇంటి యజమాని నన్ను తట్టి లేపి, ఒక కిరోసిన్ దీపం వెలిగించేవారు. తెల్లవారేవరకు నన్ను అక్కడే కూర్చుని చదవమని ఆయన స్నానం చేసి పాఠశాల పనులు చూడడానికి వెళ్లేవారు.

ఆయన వెళ్లిన కొద్దిసేపటి కంతానేను మళ్లీపడుకునే వాణ్ణి!

'ఆయన రానీ నేను చెబుతాను! దొంగ వెధవా! అసలు నీకు చదవాలని బుద్ధివుంటే గదా? బాగా తినడం నిద్ర పోవడం.... ఆటలాడడం.... అంతేనా? నువ్వెక్కడ బాగుపడతావు? ఆ విశ్వనాథ స్వామి కళ్లు తెరిస్తేనే ఏదైనా!' అంటూ ఇంటాయన భార్య బాగా తిట్టిపోసేది. నేను ఏదీ వినన ట్లుగా ముడుచుకుని

పడుకునేవాణ్ణి. తెల్లవారగానే ఏట్లో స్నానం చేసి, ఆరున్నరకల్లా బడికి వెళ్ళాలి. బడిలో చూచివ్రాత, లెక్కలు చెయ్యడం, పాఠం చదవడం ఆరంభమయ్యేది. ఆ రోజుల్లో ఆ తరగతిలో నేను మరో ఇద్దరు, ముగ్గురు పిల్లలేవుండే వాళ్లం. మేము ప్రధానోపాధ్యాయుని ప్రత్యేకమైన శ్రద్ధకు పాత్రులైన వాళ్లం కూడా! ఉదయం ఎనిమిది గంటలకు ఇంటికి వచ్చి చద్దిఅన్నం, బెండకాయ కూర తిని బడికి వెళ్లే వాణ్ణి!

బడిలో స్థలం చాలా తక్కువ. ఉపాధ్యాయుల హడావిడి అడుగుల చప్పుడు, పిల్లల అరుపులతో ఎప్పుడూ ఒకే సందడిగా వుండేది. సాయంకాలం బడి నుంచి ఇంటికి వచ్చామంటే ఏట్లోస్నానం చెయ్యకుండా ఇంటి గుమ్మంలోకి అడుగుపెట్టడానికి వీలులేదు. స్నానానికి వెళ్లేప్పుడు మాత్రమే నేనొక స్వేచ్ఛావిహంగాన్ని. దీపం పెట్టాక గుడికి మ్రొక్కి వచ్చేలోపల నాకు పాఠాలు చెప్పడానికి 'ట్యూషన్ మాస్టారు' వచ్చేవారు. పాఠశాల నిర్వాహకుడు, ఆయన భార్య నేను చేసిన, చెయ్యని తప్పులన్నిటినీ ఆయనకు ఫిర్యాదు చేసేవాళ్లు. 'ఏమోయ్ సోమరిగాడిదా' అంటూ ఆయన తొడపాశం పెట్టేవాడు. నోరుతెరిచి ఏడిస్తే ఇంకా దెబ్బలు పడేవి.

'పంతులూ.... దెబ్బలు తినందే గొడ్డు అయినా అణగదు. అలా ఇవ్వండి. ఇస్తేనే దారికి వస్తాడు! ఎప్పుడుచూసినా ఆటలు.... అరుపులు' అంటూ ఆయనకు మరింత ఉత్సాహం కలిగేట్టు చేసి లోపలికి వెళ్లేవాళ్లు.

బాధకు ఓర్చుకుని, కన్నీళ్ల నాపుకుని ఎలాగో కష్టపడి చదివేవాణ్ణి. అలా కొంత సేపట్లో నా 'ట్యూషన్' చివరి దశకు వస్తుంది. నేను భోజనం చేసిపడుకునే వాణ్ణి.

స్కూలు జీతం, ట్యూషన్ మాస్టారుకి డబ్బు, అంతా ఇంటినుంచి ఎవరైనా వచ్చి ఇచ్చేవాళ్లు, పుస్తకాలు, పలక, పెన్సిల్ మొదలైనవి. ఇంకా ఏదైనా కావాలంటే కొనుక్కోడానికి చిల్లర ఖర్చులకు కావలసిన డబ్బు ఇవ్వడానికి 'తాండవన్' అన్న ఒక చిన్న వ్యాపారస్తుణ్ణి ఏర్పాటు చేశారు నాన్న, తాండవన్ దగ్గర్నుంచి తేలిగ్గా డబ్బురాదు. ఒక్కసారికి నాలుగు సార్లు అడిగితేనే అవసరమైన దాంట్లో సగమైనా వస్తుంది. ఒకసారి ఒక రూపాయి ఇచ్చాడు. నోట్ పుస్తకం, పెన్సిల్ కొన్నాక రెండణాలు మిగిలాయి. బడి దగ్గర్లో ఒక ముసలమ్మ తిను బండారాలు చేసి అమ్మేది. ప్రతిరోజూ ఆ ముసలమ్మను చూస్తూ వెళ్లేవాణ్ణి. ఏదైనా కొని తిందామన్నా నా దగ్గర డబ్బులుండేవి కావు. చేతిలో రెండణాలు వుండేసరికి, ఆ డబ్బులో కొంత ఖర్చుపెట్టి, నా చిరకాల వాంఛితాన్ని తీర్చుకోవడానికి ఆ రోజు తెగించాను. ఒక అణాకు తినుబండారాలు కొన్నాను. గదిలోపల కూర్చుని అన్నిటినీ తినేశాను.

ముసలమ్మ వద్ద తినుబండారాలు నేను కొని తిన్నవిషయం ఇంటాయన భార్య తెలుసుకుంటుందో ఏమో నన్నభయం నాకు లోలోపల లేక పోలేదు.

అయినప్పటికీ ఆ మర్నాడు కూడా మిగిలిన ఆ ఒక అణాను ఖర్చు చేశాను. మూడేరోజు తినుబండారాలు కొనడానికి చేతిలో డబ్బు లేక పోవడం వల్ల అప్పు చేసి తిన్నాను. ఏడెనిమిది రోజులు వరుసగా ఆమె దగ్గర అలా అప్పు చేసి, అవీ, ఇవీ రోజూ తిన్నాను. అప్పు భారం పదణాలు కావడంతో ముసలమ్మ అంతకన్న ఎక్కువగా అప్పు ఇవ్వడానికి ఒప్పుకోలేదు!

అందువల్ల ఆమె కంటపడడానికి భయపడి మరోదారిలో వెళ్లడం ప్రారంభించాను. నేను కనబడక పోయేసరికి అవిడ ఎలాగో నేను వుంటున్న చోటు తెలుసుకుని ఆలయ పాఠశాల నిర్వాహకుడి ఇల్లు వెతుక్కుంటూ వచ్చింది. ఇక ఆ తర్వాత నేనేమి చెప్పనవసరం లేదు. ముసలమ్మ, ఇంటి యజమాని, అతని భార్య నా మీద కురిపించిన తిట్లవాన నన్ను మూగవాడిగా చేసింది. నేనేం సమాధానం చెప్పగలను?

చివరికి తాండవన్ ఈ సంగతి తెలుసుకుని ఆ అప్పు తీర్చాడు. ఇచ్చిన తర్వాత ఈ విషయం నాన్నకు వివరంగా రాస్తానని బెదిరించాడు. ఆ అనుభవం చాలా దుర్భరమైనది. అప్పు ఇచ్చిన వారినుంచి ఎలాగైనా, ఎప్పుడైనా తప్పించుకోలేము అన్న నిజాన్ని మొట్టమొదటిసారిగా గ్రహించాను!

సెలవులకు ఊరెళ్లి మా అమ్మతో జరిగిన సంగతంతా వివరంగా చెప్పాను. నన్నుపై చదువులు చదివించడానికి కోళిక్కోడకు పంపడానికి నిశ్చయించారు. నేను బయలుదేరడానికి ముందురోజే నాన్న కోళిక్కోడలో నేనెలా జాగ్రత్తగా చదువుకోవాలో నీతులు చెప్పడం ప్రారంభించారు. కష్టపడి చదువుకోవాలి; వృధా ఖర్చులు చేసిధనం వ్యయం చెయ్యకూడదు; తోటి పిల్లలతో పేచీలు, తగవులు పెట్టుకోకూడదు; ఉంటున్న చోట ఇతరులకు ఇబ్బంది కల్గించేవిధంగా మాట్లాడడం గానీ, నడుచుకోవడంగాని చెయ్యకూడదు; మొదలైన వాటి గురించి ఆయన నీతులు చెబుతూవచ్చారు. ఆయన మనసులోని ప్రేమని ఎక్కువగా బయటికి చూపేవారుకారు. అయినా తన కొడుకు విద్యాభ్యాసం కోసం ఆయన ఎంతటి త్యాగాన్నయినా చేయడానికి సిద్ధంగా వున్నారు.

మర్నాడు ఉదయం పెట్టె, పడక ఒక కూలి మనిషి మోసుకురాగా, మా తండ్రి గారి కార్యదర్శిగా వుంటున్న వాసుభట్టర్‌తో కోళిక్కోడుకు బయలుదేరాను. అది 1898 సంవత్సరం ప్రారంభం.

మా యింటి నుంచి ఏడుమైళ్లదూరంలో వుండేది అక్కడి రైలు స్టేషన్. మైదానాలు, పంటపొలాలు, గుట్టలు, నదీప్రవాహం.... ఆ వాతావరణంలో, ఆ దారిపొడవునా వాసుభట్టర్ ఏవేవో పాత కథలు చెబుతూ రావడం వల్ల నడవడం కష్టం అనిపించలేదు. మాట్లాడుతూ వచ్చే వాసుభట్టర్ ఒక్కోసారి అలసి పోయేవారు. అలవాటున్న దారే కావడం వలన అతనికి అలసట కనిపించలేదు. వాసుభట్టరు కు చదవడం, వ్రాయడం రాదు. అయినా చాలా

గట్టివాడుగా గుర్తింపు పొందిన వ్యక్తి. ఒక్కొక్క కష్టాన్నీ ఎదుర్కొని జయించిన తీరు, రైతులకు సంబంధించిన సమస్యలను, పరిష్కరించిన సామర్థ్యం, చమత్కారం ఆయన మాటలలో తెలిసివచ్చాయి. నేటి ఎక్కాల ద్వారానే ఎలాంటి పెద్ద మొత్తాల నైనాసరే కూడికలు, తీసివేతలు వేసి జ్ఞాపకం వుంచుకునే అసాధారణమైన సామర్థ్యం ఆయనకు వుండేది. రకరకాల మనుషులతో వారివారి స్వభావాలు కనుగుణంగా మాట్లాడటంలోనూ, నడుచుకోవడంలోనూ చాకచక్యంగా వుండేవాడు.

అంతకు ముందు నేను రైలు ప్రయాణం చేసి వున్నప్పటికీ అక్కడినుంచి కోళిక్కడి వరకూ నేను చేసిన ఆ రైలు ప్రయాణం ఒక కొత్త అనుభవంగానే అనిపించింది. రైలు దిగి స్టేషన్ నుంచి వెలుపలికి రాగానే అక్కడ గుర్రంబళ్లు చాలాకనిపించాయి. అంతవరకూ నేను గుర్రబ్బండిలో ప్రయాణంచేయలేదు. అందువలన ఓ గుర్రబ్బండిలో ఎక్కివెళదామని వాసుభట్టర్‌తో చెప్పాను. అయినా వాసుభట్టర్ అందుకు ఒప్పుకోలేదు. బండికైతే అరణాలు ఇవ్వాలి. అదే కూలివాడికైతే రెండణాలు చాలు అంటూ సామాను లన్నిటినీ ఒక కూలిమనిషి నెత్తి కెక్కించి మేము బయలుదేరాము. దారిపొడవునా ఆ దృశ్యాలు నాకు కొత్తగా కనిపించాయి. వాసుభట్టర్ నగరం గురించి చెప్పిన వివరాలు నాలో ఉత్సాహం రేకెత్తించాయి.

ఆ రోజు సాయంకాలం కోళిక్కడలో మేము బసచేసే చోటికి వచ్చిచేరాము.

ఎనిమిదేళ్లపాటు నేను కోళిక్కడ్‌లోని కేరళవిద్యాలయంలో చదువుకున్నాను. ఈ విద్యాలయమే క్రమేణ కళాశాలగా అభివృద్ధి చెందింది. ఇవాళదాన్ని గురువాయూరప్పక కళాశాల అంటున్నారు. కానీ నాకెందుకో ఆపాత పేరే సరైనదని అనిపించేది.

వెనుకబడిన ప్రజలని అంటరాని వారుగా భావించే ఆ రోజుల్లో, ఆ కళాశాలలో చదువుకోవడానికి వారికి చోటులేదు. కానీ, అదే సమయంలో మహమ్మదీయులు, క్రైస్తవులు ఆ కళాశాలలో చదివేవాళ్లు. ఆ రోజులలో అంటరానివారు కళాశాలలో చేరి చదవడానికి, అనుమతించడానికి వీలవుతుందా? కాదా? అనే అంశంపై కళాశాలలో వక్తృత్వపు పోటీలు జరగడం నాకింకా గుర్తుంది. ఆ రోజులలో ఈ పోటీలకు నేనే కార్యదర్శిని. అప్పటి ఉపాధ్యాయులలో నాకు బాగా నచ్చిన సుబ్బారావుగారే ఈ అంశమైతే పోటీకి బాగుంటుందని ప్రోత్సహించారు. విద్యార్థులకు కావలసిందేమిటో గ్రహించి వారిని ఆకట్టుకునే విధంగా సమర్థతతో వ్యవహరించేవారు సుబ్బారావు మేష్టారు. బోధించవలసిన వాటిని సులభశైలిలో, అర్థమయ్యే తీరులో వివరించగల విశేష ప్రజ్ఞ ఆయనకు వుండేది. తప్పు చేసిన విద్యార్థిని కొట్టి సరిదిద్దడమనేది ఆయనకు నచ్చని విషయం. యువకుల హృదయాలను కదిలించే విధంగా వారు తమ తప్పులను, లోపాలను గ్రహించే విధంగా

సూచనప్రాయంగా తెలియజేసేవారు. తరచుగా విజ్ఞానయాత్రలు నిర్వహించేవారు. ఆటపాటలతో అవి వినోదయాత్రల్లా సరదాగా వుండేవి. పాఠాలు ప్రారంభించడానికి ముందు ప్రతిరోజూ కళాశాలలో సమిష్టిగా ప్రార్థనలు జరపటం అలవాటు. ఇష్టమున్న విద్యార్థులందరూ ఆ ప్రార్థనలో పాల్గొనవచ్చు. ఎవరైనా ఒక ఉపాధ్యాయుడు ఏదైనా ఒక మంచి విషయంపైన నాలుగు మాటలు చెప్పేవారు. పిల్లల లేత హృదయాలను సక్రమమార్గంలో మళ్లించడానికి ఉపయోగపడే ఈ ఏర్పాటు కొంతకాలం వాడుకలో వుండేది.

నాకు తరచుగా జ్ఞాపకం వచ్చేమరొక ఉపాధ్యాయుడు పి.సి. గోవిందనాయర్. బడిపంతులుగా ఉద్యోగం చేస్తున్న ఆ రోజుల్లోనే ఆయన 'కేరళసంచారి' అనే పత్రికకు సంపాదకులుగా కూడా వుండేవారు. మమ్మల్ని లెక్కలు చేయమని చెప్పి ఆయన పత్రికకు సంబంధించిన వార్తలో లేక సంపాదకీయమో రాసుకుంటూ వుండేవారు. విద్యార్థులు గొడవచేయడం మొదలెడితే, కళ్లద్దాలు చేతిలోకి తీసుకుని తలపైకెత్తి చూసేవారు. మళ్లీరాయడం ప్రారంభించేవారు. ఆరోజులలో ఉపాధ్యాయులను చూడగానే భక్తి ప్రపత్తులు కలిగేవిధంగా దుస్తులు ధరించేవారు. అస్తవ్యస్తంగా దుస్తులు ధరించడం. నిరాడంబర జీవితానికి గుర్తుగా ఆరోజులలో ఎవరూ భావించలేదు.

ఫర్డ్ ఫారంలో దక్షిణామూర్తి అయ్యర్ ఉపాధ్యాయులుగా వుండేవారు. ఆయన తరగతికి వస్తున్నారనే విషయాన్ని దూరంగానే తెలుసుకోవచ్చు. కళాశాలకు సమీపంలోనే వుండేది ఆయన ఇల్లు. మొదటి గంటకొట్టే సరికల్లా, పొడవాటి కోటు, తెల్లతలపాగాతో, భూగోళం లాంటి ఒక ఎర్రని చెక్కపెట్టెను చేత్తో పట్టుకుని అటూ ఇటూ చూసుకుంటూ ఆయన రావడమే ఒక దృశ్యం! విద్యాబోధనతోబాటు, పుస్తక వ్యాపారం కూడా చూసుకునేవారాయన. అందువల్లనే, డబ్బు దాచిన ఆచెక్క పెట్టె ఎప్పుడూ ఆయనతో వుండేది.

అయ్యర్ జుట్టుతీయించుకున్న రోజున కోపంతో వుంటారన్న అభిప్రాయం విద్యార్థులకు వుండేది. దానికేదైనా ఆధారం వుందా అంటే చెప్పడం కష్టమే. కానీ మాకుమాత్రం ఆరోజు రోజంతా లోలోపల భయంగా వుండేది. ఆయన పేము బెత్తాన్ని ఉపయోగించని రోజు దాదాపు లేదనే చెప్పవచ్చు. తలపాగాను తీసి బల్లమీదవుంచి ఆయన తన బలాన్ని వుపయోగించాలి. పిల్లల్ని పేముతో కొట్టేప్పుడు పాతకాలపు పిలకను గుర్తుచేసే ఆయన నెరసిన జుట్టు నృత్యం చేయడాన్ని చూడవచ్చు.

కళాశాలకు సమీపంలోని ఒక హోటల్‌లో ఒక బ్రాహ్మణుడు తినుబండారాలు చేసి అమ్మేవాడు. నాకు ప్రతిరోజూ అర్థణాకు సరిపడే తినుబండారాలు ఇచ్చేలా మా వాళ్లు ఏర్పాటు చేశారు. సాయంకాలం

క్లాసులయ్యాక నేను తిన్నగా అక్కడికే వెళ్లేవాడిని. ఆ అర్థణాలో నాకు లడ్డు, జిలేబిలాంటి తీపిపదార్థాలు రావు కదా! చక్కిలాలు, గారెలు మాత్రం తిని నేను తృప్తిపడవలసి వచ్చేది. లడ్డు, జిలేబీలు తిని ఆనందించడానికి నేనే కొత్త మార్గం కనిపెట్టాను.

నాలుగు రోజుల పాటు ఏమీ కొనకూడదని నిర్ణయించుకున్నాను. ఐదవరోజు ఏమేమి తినాలో ఆలోచించాను. నాలుగురోజులు వెళ్లలేదు కాబట్టి ఐదేరోజు రెండణాల విలువైన తినుబండారులు తినవచ్చునను కుంటూ లోపలికి వెళ్లాను. 'ఒక లడ్డు, ఒక జిలేబీ, ఒక పెరుగువడ ఇవ్వండి స్వామీ'. అంటూ గూర్చున్నాను.

'ఏమోయ్! నీకేమైనా మతిచలించిందా? అర్ధణాకు రెండణాల తినుబండారాలు అడుగుతున్నావ్?' అని ఆయన పరిహాసం చేశాడు.

'మరినేను నాలుగు రోజులపాటు రాలేదు కదా! ఆ నాలుగు అర్ధణాలు రెండణాలు కాలేదా? ఆ డబ్బుల కివ్వమనే నేనడిగాను' అన్నాను.

'అవన్నీ నాకు అనవసరం. ఒక రోజుకి అర్ధణాకు యివ్వమన్నదే ఏర్పాటు. ఇవాళ కూడా అంతే యిస్తాను' అన్నాడాయన. అప్పుడు నాకు వచ్చిన కోపం అంతా యింతా కాదు. ఏమీ తీసుకోకుండానే వచ్చేశాను. ఈ చిన్న సంఘటన వల్ల ఏర్పడిన బాధ కొన్ని రోజుల తర్వాత గానీ తగ్గలేదు.

ఫుట్‌బాల్ లాంటి ఆటలు ఆడడం నాకు ఇష్టం లేదు. అయితే కళాశాల నాటక సంస్థతో నాకు మంచి అనుబంధం వుండేది. నాటకాలలో నటించడం, అందులోనూ ఆడవేషాలు ధరించడం అంటే నా కెంతో యిష్టం. ఒకసారి నాటకం వేస్తున్నప్పుడు జరిగిన ఓ భయంకరమైన సంఘటన నాకు జ్ఞాపకం వస్తోంది. ఆరోజు మా కళాశాల వక్తృత్వపుపోటీ సంస్థకు వార్షికోత్సవం. కళాశాలకు ఉత్తరం వైపు కొత్తగా నిర్మించబడిన మేడ మీది హాల్లో ఉత్సవ కార్యక్రమం జరుగుతోంది. దాదాపు అయిదు వందలమంది కూర్చోడానికి చాలినంత స్థలం. ఒకప్రక్క ఎత్తయిన వేదిక, రెండువైపులా మెట్లు వున్నాయి. సాయంకాలం ఆరుగంటలకు నాటకం ఆరంభమైంది. విద్యార్థులు, అహ్వానితులు కలిసి దాదాపు అయిదు వందలమంది కన్నా ఎక్కువే వున్నారు.

గ్రీన్ రూంలో వేషం వేసుకుంటున్న వారిలో నేనూ ఒకణ్ణి. ఆరోజు నేను స్త్రీ వేషం వేసుకుంటున్నాను. చీర, నగలు ధరించి రంగస్థలం మీదికి రావడానికి సిద్ధంగా వున్న నాకు, హఠాత్తుగా ఒక శబ్దం వినిపించింది. దానితో బాటు హాల్లోజనం అరుపులూ విన్పించాయి. ఆ కొత్త భవనం పై కప్పు విరిగిపడివుంది. తమను తాము రక్షించుకోలేని వారెందరో అందులో చిక్కుకుని నలిగిపోయారు. వారి అరుపులు, భయంతో దేవుణ్ణి పిలిచే ఆర్తనాదాలు నా హృదయాన్ని కదిలించాయి.

వేదిక వెనుకవైపు మెల్ల మీదుగా నేను దిగి వచ్చాను. ఏంచేయాలో తెలియని స్థితిలో అటూ ఇటూ పరుగెత్తాను. స్త్రీ వేషంలో వున్న నన్ను చూసి, అందరూ ఆడ పిల్లేనను కున్నారేమో! నేను అలాగే పరుగెత్తుకుంటూ వెళ్లి రోడ్డుకు దగ్గరలోనే వున్న మా యింటికి చేరుకున్నాను. అలంకరణ అంతా తీసేసి, బట్టలు మార్చుకుని కళాశాలకు తిరిగివెళ్లాను.

అప్పటికీ అక్కడ కటిక చీకటిగా వున్నందువలన, ఆపదలో వున్న వారిని కాపాడడం చాలా కష్టమైపోయింది. చాలా మందికి చేతులు విరిగాయి. ఒక విద్యార్థి మాత్రం ప్రాణాలు కోల్పోయాడు.

భవన నిర్మాణం పూర్తయ్యాక సరైన పర్యవేక్షణ లేకుండా ముందువెనుకలు ఆలోచించకుండా ఎక్కువమందిని అక్కడికి అనుమతించిన. కళాశాల అధికారులను చాలా మంది తిట్టుకున్నారు. ఈ దారుణమైన సంఘటన ఫలితంగా మా కళాశాల నాటకసంస్థ కార్యక్రమాలను కొంతకాలం పాటు నిలిపివేయవలసి వచ్చింది.

ఆ రోజులలో జరిగిన మరో సంఘటన కూడా నాకు జ్ఞాపకం వస్తోంది. విక్టోరియా రాణి మరణం తరువాత, ఏడవ ఎడ్వర్డు రాజు పట్టాభిషేక ఉత్సవాన్ని మేం జరిపినప్పు డు ఆ సంఘటన జరిగింది. అప్పు డు సెలవులు కావడం వలన నేను మా గ్రామంలో వున్నాను. ఆ సంబరాన్ని భారీ ఎత్తున జరపడానికి మా గ్రామంలో ఏర్పాట్లు జరిగాయి. కొత్త రాజు చిత్రపటాన్ని ఏనుగుమీద వుంచి ఊరేగింపు జరపడానికి తీర్మానించారు. ఆ ఊరేగింపులో చిత్రపటాన్ని పట్టుకుని ఏనుగు మీద నేనే కూర్చున్నాను. రకరకాల వాయిద్యాల సంగీతంతో, మేళతాళాలతో రెండు మైళ్ళు దూరం ఊరేగింపువచ్చింది. అలంకరించిన వేదిక మీద ఆ పటాన్ని వుంచాము. గ్రామప్రజలందరూ రాజుగారి పటానికి నమస్కరించడానికి అక్కడ గుమికూడారు. ఆవేదికకు మణిమకుటంలా కనిపిస్తున్న ఆ చిత్రపటం బ్రిటిష్ చక్రవర్తిది కాదనీ, అతని కన్నా కళా గాంభీర్యం వున్న రష్యన్ చక్రవర్తిదనీ, ఆ మర్నాడే మాకు తెలిసింది. ఈ సమారంభం ఏర్పాటుచేసిన కార్యకర్తలకు ఈ విషయం లోలోపల భయాన్ని రేకెత్తించింది. తాము తెలిసి, తెలిసి రాజద్రోహం చేయలేదన్న విషయాన్ని అధికారులు గ్రహిస్తారో, లేదోనని భయపడ్డారు. చివరికి ఆ పొరబాటుకు బాధ్యత నా మీద పడింది. రకరకాల చిత్రపటాలనుంచి, ఈ చిత్రపటాన్ని నేనే ఎన్నిక చేశానని ఆరోపించారు. మా నాన్నగారికి కోపం వచ్చినా, నేను భయపడినట్లుగా ఏదీ జరుగలేదు.

కోళిక్కడ్‌లో చదువుకునే రోజులలో నేను మా తండ్రి గారికి ఆప్తమిత్రులయిన మందత్తు కృష్ణన్ నాయర్ గారి ఇంట్లో బసచేశాను. ఆ రోజులలో న్యాయవాదిగా ఆయనకు పేరు ప్రఖ్యాతులు వుండేవి. కృష్ణన్

నాయర్ నిర్మలమైన మనస్సు, కష్టపడి పనిచేసే స్వభావం, ప్రేమతో ఆయన మసలుకునే తీరు నా యువహృదయాన్నెంతో ఆకర్షించాయి.

న్యాయస్థానంనుంచి ఇంటికి రాగానే, రాత్రి పన్నెండు గంటలవరకూ, మర్నాడు విచారణకు రానున్న కేసుల వివరాలు చదువుకుంటూ వుండేవారు. ఆ తర్వాత స్నానంచేసి, భోజనం చేసేవారు. కాలాన్ని వృధాచేయడం ఆయనకు తెలీదు. ఆనాటి పరిస్థితులకు అనువుగా ఆయన ప్రజాజీవితంలోనూ పాల్గొనే వారు. కొంత కాలం మద్రాసు శాసనసభలో సభ్యులుగా వున్నారు. ఆ తరువాత తిరువాన్కూర్ ప్రధాన న్యాయమూర్తిగానూ, దివాన్‌గానూ చేశారు. పెన్షన్ తీసుకుని, విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో కూడా ఆయన మద్రాసు ప్రభుత్వ ఎగ్జిక్యూటివ్ కమిటీలో సభ్యుడుగా వుండేవారు. ఆయనలోని వినయశీలత, ఓర్పు, నిర్విరామ కృషి ఆయనప్రగతికి ప్రధాన కారణాలుగా చెప్పవచ్చు.

మన చుట్టూ వున్నమనుషులు, స్నేహితులూ మనకు తెలియకుండానే మన స్వభావాన్ని నిర్ణయిస్తారు. ముఖ్యంగా పసిప్రాయంలో ఇలాంటి వాటికి అవకాశం ఎక్కువ. పార్టీవారితో, అతిథులతో, సేవకులతో, తక్కిన వారితో కృష్ణన్ నాయర్ నడుచుకునే తీరు తెన్నులలో ఓ ప్రత్యేకత వుండేది. వాటిని చూసి కొన్ని పాఠాలు నేర్చుకోదగిన సందర్భాలు నాకు ఏర్పడ్డాయి. ఆ విశిష్ట గుణాలను నేనెప్పుడూ మరచిపోలేను. చివరివరకూ నన్నొక కొడుకులా చూసుకుంటూ ఎంతో ప్రేమతో నా జయాపజయాలపట్ల ఎంతో శ్రద్ధ కనబరచేవారు.

'ఇందులేఖ' సంపాదకులైన చందూమేనన్ ను ఎన్నోమార్లు చూసినట్లు నాకు జ్ఞాపకం వుంది. ఆ రోజుల్లో ఆయన కోళికోడ్ సబ్‌జడ్జిగా వుండేవారు. పొడుగాటి ధోవతి, తెల్లని చొక్కా, సన్నంచు కండువా పళని టోపీ, పాదరక్షలతో ఆయన ప్రతి ఉదయం వ్యాహ్యాళికి రావడం ఓ గమ్మత్తయిన దృశ్యం! ఆ కాలంలో సబ్‌జడ్జి పదవి చాలా వున్నతమైన పదవి. చందు మీనన్ ఒక పెద్దమనిషి.

మెల్లగా నడుస్తూ, అక్కడక్కడ నిలబడి చూస్తూ వచ్చే ఆ సబ్‌జడ్జిని చూడగానే ప్రజలు దూరంగా తప్పుకునేవారు. గార్డ్ నారాయణన్ నాయర్ కొద్ది దూరంలో ఆయన వెనకే నడిచి వచ్చేవాడు. గంభీరమైన చూపులతో మదపుటేనుగులా హుందాగా నడిచివస్తూంటే, ఆయనను గురించి విన్నదంతా నిజమే అనిపించేది. నాటక కళాకారులో, కథకళి ఆడేవారు కోళికోడ్ వస్తే, ఆయన ఇంట్లో కనీసం ఒక ప్రదర్శన అయినా ఇవ్వడం ఆనవాయితీ. కోళిక్కోడ్‌లో పదవి నిర్వహిస్తున్నప్పుడే ఆయన కాలధర్మంచెందారు.

చదువులో గొప్పవాణ్ణి అవుతానన్న నమ్మకం నాకులేదు. నా విద్యాభ్యాసకాలంలో నేను చదువులో వెనకబడి వుండేవాడిని. చదువు పట్ల

అశ్రద్ధచూపే పిల్లల్ని గురించి పెద్దలకు వెళ్ళే రిపోర్ట్‌లో నాపేరు తప్పనిసరిగా వుండేది. అయినా కళాశాల వక్తృత్వపు పోటీలలో నేను ఎంతో వుత్సాహంగా పాల్గొనేవాడిని. వేదికపై ఉపన్యసించడంలోనూ, వ్యాసరచనపోటీలలోనూ నేను ఎన్నోమార్లు బహుమతులు గెల్చుకున్నాను.

మెట్రిక్యులేషన్ లో ఉత్తీర్ణుణ్ణయి, ఎఫ్.ఏ. చదవటానికి నేను మదరాసు వెళ్లాను. అది 1906వ సంవత్సరం. నావివాహం కూడా ఆ సంవత్సరమే జరిగింది. విద్యాభ్యాసం పూర్తికాకముందే వివాహబాధ్యతలు భరించాలన్న ఉత్సాహం నాకులేదు. అయినా కుటుంబానికి సంబంధించిన కొన్ని వ్యక్తిగత కారణాలవలన, కన్నవారి కోర్కెను కాదనలేక, అంగీకరించాను. అందువలన నేను బాధపడే అవసరం రాలేదు. పైగా అదినాకో మంచి అవకాశంగా పరిణమించింది.

ఒక మనిషి సుఖ, దుఃఖాల్లో పాలుపంచుకొనే భార్య బాధ్యతలకు విలువ కట్టలేము. సుఖం పెంచడానికి, దుఃఖం తగ్గించడానికి భార్యకున్న శక్తి సామర్థ్యాలను బట్టే ఆవ్యక్తి జీవితంలో సుఖశాంతులు వుంటాయి. అన్ని భాగ్యాలకన్న, కలతలు లేని సుఖసంసారాన్నే మనం కోరుకుంటాము. అయితే ఆ భాగ్యం ఏ కొందరికో మటుకు లభిస్తుంది.

పాల్‌ఘాట్ రాజకుటుంబానికి చెందిన ఒక 'పీఠం' లో పుట్టి, నాలుగవ తరగతి వరకే చదివిన లక్ష్మిని నేను పెళ్లాడాను. పెద్దగా చదువుకోకపోయినప్పటికీ, ఇంటి బాధ్యతలను సక్రమంగా నిర్వహించే శక్తిసామర్థ్యాలు, తెలివితేటలు లక్ష్మికి వున్నాయి. వంటచేయడంలో నా భార్యకున్న నేర్పు, తినడంలో నాకున్న శక్తిసామర్థ్యాలు చక్కగా కలిసి ఒక వరంగా రూపొందాయి!

# మద్రాసులో విద్యార్థి దశ

భారతజాతీయ వాతావరణంలో ఒక తరహా చైతన్యం పొంగి పొరలు తున్న ఘట్టం. నేను మద్రాసులో చదువుకోవడం ప్రారంభించాను. ఆనాటి వైస్రాయ్ కర్జన్ ప్రభువు అహంకారపూరిత మైన మాటలు, ప్రజాభిప్రాయాలను తోసి రాజనే చేతలు దేశం మొత్తంమీద అసంతృప్తి చెలరేగడానికి దోహదం చేశాయి. 1905వ సం॥ జరిగిన బెంగాల్ విభజన అంతః కలహాలకు దారి తీసింది. ప్రజల విజ్ఞాపనాన్ని, వ్యతిరేకతను లెక్కచేయకుండా కర్జన్ ప్రభువు బెంగాల్‌ను రెండుగా విభజించాడు.

ఈ చర్యలు బెంగాలీయులను మాత్రమేకాక, దేశంలోని ఇతర రాష్ట్రాలప్రజలను కూడా పోరాటానికి పురికొల్పాయి. ఆయన కలకత్తాలో చేసిన ఒక ఉపన్యాసం - అగ్నికి ఆజ్యం పోసినట్లు - భారత ప్రజల సత్యాన్వేషణను మరింత ఉధృతం చేసింది.

'కాంగ్రెసును గొయ్యి తీసి పాతెయ్యాలి. నేను ఇండియా నుంచి వెళ్లే లోగా అంత్యక్రియలు చేసెయ్యాలని ఆశిస్తున్నాను' అని కర్జన్ ప్రభువు ఆనాటి భారతసెక్రటరీకి వ్రాసిన విషయం ఈ సందర్భంలో ప్రస్తావించతగ్గది.

ఇవన్నీ అధిక సంఖ్యాకులైన ప్రజల్ని ఆవేశంలో ఉవ్వెత్తున రెచ్చగొట్టడానికి దోహదంచేశాయి. భారతీయుల మధ్య పుట్టి పెరిగిన స్వాతంత్ర్య పిపాసను అణచివేయడానికి ప్రభుత్వం చేసిన ప్రయత్నం దేశప్రజల స్వాభిమానాన్ని, జాతీయోద్యమాన్ని తట్టి లేపాయి. ఆనాటి జాతీయ ఉద్యమానికి కేంద్రం. బెంగాల్ సురేంద్రనాథబెనర్జీ చెవులూరించే ఉపన్యాస సామర్థ్యం, బిపిన్ చంద్రపాల్ నిప్పులు చిమ్మే ఉపన్యాస ఝురి, అరవింద ఘోష్ ఉత్సాహం కలిగించే వ్యాసాలు, కాశ్మీరునుంచి కన్యాకుమారి పర్యంతం ఒక అద్భుతమైన ఐకమత్యాన్ని కలిగించాయి. 1906వ సం॥ కలకత్తా కాంగ్రెసు సమావేశంలో ఇండియా లక్ష్యం 'స్వరాజ్యం' అని దాదాభాయ్‌నౌరోజీ గర్జించారు. స్వదేశ వస్తువుల్ని మాత్రమే ఉపయోగించాలని, విదేశీ వస్తువులను బహిష్కరించాలని, బెంగాల్‌లో ప్రారంభమయిన ఉద్యమం ఇతర ప్రాంతాలకూ వ్యాపించింది. స్వరాజ్యం, స్వదేశీ, స్వతంత్రం అన్న మాటలు దేశమంతటా మారుమ్రోగాయి.

ఆ కాలంలో మద్రాసుకు విజయం చేసిన బిపిన్ చంద్రపాల్‌కు స్వాగతం పలకడానికి ఒకటిన్నరమైలు పొడవు ఊరేగింపు ఏర్పాటైంది. ఆయన రాక మద్రాసు ప్రజల్లో ఎంతో చైతన్యం కలిగించింది. మద్రాసు సముద్రతీరంలో ఏర్పాటైన ఆయన ఉపన్యాసాలు వినడానికి వారంరోజులపాటు ప్రతీ సాయంత్రం ప్రజలు గుమిగూడేవారు.

మైకులు లాంటి సాధనాలు లేని ఆ రోజులలో, సాటిలేని తన వాగ్ధాటితో రెండుమూడు గంటల సేపు వేలసంఖ్యలో వున్న ప్రజలనుద్దేశించి మాట్లాడి ఆకర్షించేవారు బిపిన్ చంద్రపాల్, ప్రజల ఆవేశాన్ని నిర్మాణాత్మక మార్గంలో మళ్లించే ముందడుగు వేయడానికి, ఉత్సాహపరచడానికి ఆయన చూపిన సామర్థ్యం ఎనలేనిది.

జి. సుబ్రహ్మణ్య అయ్యర్ తొలి బహిరంగ సభకు అధ్యక్షత వహించారు. జాతీయ నాయకులలో ప్రథమశ్రేణిలో వున్న దాక్షిణాత్యుడాయన. బిపిన్ చంద్రపాల్ కున్న వాగ్ధాటి ఆయనకు లేకున్నా, సామాన్య ప్రజాహృదయాల్లో హత్తుకునే విధంగా, సులభశైలిలో, హాస్యరసం చిందేలా మాట్లాడడంలో ఆయనది అందెవేసిన చెయ్యి. ఈనాడు ఉన్నతస్థాయిలో వెలువడుతున్న తమిళ దినపత్రిక 'సుదేశమిత్రన్' ను ఆరంభించినవారాయనే. 'హిందూ' పత్రిక అధిపతి, మొట్టమొదటి సంపాదకుడూ ఆయనే.

నేను మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో ఎఫ్.ఏ. మొదటి సంవత్సరం చదివాను. తరువాతి సంవత్సరం ఎఫ్.ఏ. పరీక్ష పూర్తిచేయడానికి కోయంబత్తూరు వెళ్లాను. బి.ఏ. చదవడానికి మద్రాసు క్రైస్తవకళాశాలకు వచ్చాను. మదరాసులోని ఈ రెండు కళాశాలల వాతావరణంలో వున్న భేదాలు, వీటిలో చదువు కున్న వారు గ్రహించడం కష్టమేమి కాదు. ఈ రెండు కళాశాలల్లోని ప్రముఖ ఉపన్యాసకులందరూ ఆంగ్లేయులే. క్రైస్తవకళాశాలలో ఉపాధ్యాయులకూ, విద్యార్థులకు మధ్యవున్న సన్నిహిత సంబంధం ప్రెసిడెన్సీ కళాశాలలో కనిపించేదికాదు. క్రైస్తవకళాశాలలోని ఉపన్యాసకులైన డా॥ స్కిన్నర్, ప్రొఫెసర్ హెూగ్, 'ఫుటర్‌బర్గ్' మెస్టన్ మహాశయులను విద్యార్థులెవరూ మరచిపోలేరు. 'ప్రతి ఉపాధ్యాయుడూ తనకు సన్నిహితుడే' అని ప్రతివిద్యార్థీ భావించేవాడు. డాక్టర్ స్కిన్నర్ తరగతికి రావడంతో వాతావరణమే మారిపోయేది. విద్యార్థుల గౌరవమర్యాదలను, భక్తిశ్రద్ధలనూ అనాయాసంగా ఆకర్షించే అరుదైన సామర్థ్యం ఆయనకు వుండేది.

జ్ఞాపకానికి వచ్చే మరోవ్యక్తి ప్రెసిడెన్సీ కళాశాలలో ఆనాడు మలయాళ ఉపన్యాసకులుగా వుండిన ముళియల్ కృష్ణన్. బోధనా విధానంలోనూ, క్రమశిక్షణలోనూ ఆయనకు కొన్ని ప్రత్యేక లక్షణాలు ఉండేవి. ఆయన

గురించి ఎన్నో మంచిమంచి కథలు విన్నాము. ఇతరుల పట్ల కఠినంగా మసలు కోవడం ఆయనకు తెలియదు. తమకు నచ్చని విషయాలను గురించి చెప్పవలసివస్తే, ఆ పరిస్థితిని చాలా చాకచక్యంగా ఎదుర్కొనేవారు. ఒకమారు ఒక విద్యార్థి రాసిన వ్యాసాన్ని చదివి అనేక చోట్ల పెన్సిల్‌తో మార్కుపెట్టిన తర్వాత ఆ విద్యార్థితో ఇలా అన్నారు :-'అక్షరాల తప్పులు చాలావున్నాయి. పదాల అర్థం స్పష్టంగా లేదు. వాక్యాలలో తప్పు లెక్కువ. చేతివ్రాత బాగాలేదు. అయినా వ్యాసమంతా అధ్వాన్నంగా లేదు' ఈ విధంగా వివరించడం ఆయనలోని ప్రత్యేకగుణం.

దేశంలో జరిగే సంగతులు, దేశనాయకుల జీవితచరిత్రలూ చదివి తెలుసుకోవాలంటే నాకు చాలా ఉత్సాహం వుండేది. చేతిలో నాలుగు డబ్బులు ఉన్నప్పుడల్లా జాతీయ వ్యవహారాలకు సంబంధించిన పుస్తకాలు కొని చదవడం ప్రారంభించాను. ఆకాలంలోనే నేను లాలాలజపతిరాయ్ జీవిత చరిత్రను సంగ్రహించి రాసి ప్రచురించాను. విద్యాభ్యాసానికి వచ్చిన విద్యార్థులు ఇలాంటి వ్యాపకాలతో కాలాన్ని వృథాచేయరాదని కొందరు నాకు హితోపదేశం చేశారు. మానాన్న గారు కూడా చాలా కోపగించుకున్నారు. కానీ, ఒక పుస్తక రచయితగా నాకున్న ఉత్సాహంలో, నా తొలి ప్రయత్నంగా ఆ చిన్ని పుస్తకాన్ని నేను దృఢవిశ్వాసంతో వెలువరించాను.

పాలకుల్ని వ్యతిరేకించే విధంగా ఏదైనా మాట్లాడినా చేతలకు దిగినా, అలాంటి వారిని తండ్రిగారు వ్యతిరేకించేవారు. పాత అలవాట్లను మార్చడం ఆయనకు ఇష్టం లేదు. మద్రాసులో చదువుకునే రోజుల లోనే నేను నా పిలకను తీసేసి, క్రాపు చేయించుకున్నాను. విద్యాభ్యాసం పూర్తయి నేను ఊరికి తిరిగి వచ్చాక, క్రాపుచేయించు కున్నందుకు మా తండ్రి చాలా కోపించుకున్నారు. ఇలాంటి పనులు క్షమించరాని అపరాధాలుగా ఆయన భావించారు.

మలయాళ కుటుంబాలలో ఆస్తులు, భాగాలు పంచుకోవడం అవసరమా? అన్న అంశం మీద ఓ మంచి వ్యాసం వ్రాసే సభ్యునికి ఒక బహుమతియిస్తామని సుప్రసిద్ధ కేసరి కుంజ్ఞ రామన్నాయర్ మద్రాసు మలయాళక్లబ్ అధికారులకు ఒక ప్రకటన జారీచేశారు. ఆ పోటీలో పాల్గొన్న నాకు బహుమతి వచ్చింది. ఈ వార్తవిన్న మా నాన్నగారు ఎంతో సంతోషించారు. నేను ఊరెళ్లగానే ఆ వ్యాసాన్ని చదివివినిపించమన్నారు. ఆ వ్యాసం విడిపోవడాన్ని ప్రోత్సహించేలా వున్నది. ఆ వ్యాసాన్ని పూర్తిగా విన్నాక, ఆయన ముఖకవళికలు మారాయి. 'నువ్వు క్రాపుచేయించుకోవడం, కుటుంబం విడిపోవడానికి మద్దతుగా రాసిన ఈ వ్యాసం - ఇవన్నీ గమనిస్తూ వుంటే నీ

అసలు ఉద్దేశ్యం ఏమిటో తెలియడం లేదు' అని కోపంగా చెప్పారు. అలా వచ్చిన కోపం తగ్గడానికి ఆయనకు దాదాపు రెండుమూడు రోజులు పట్టింది.

ఒకమారు గోపాలకృష్ణ గోఖలే మదరాసుకు వచ్చారు. అప్పట్లో నేను క్రైస్తవ కళాశాల విద్యార్థిని. విక్టోరియా పబ్లిక్ హాల్‌కు ఉత్తరంలో వున్న మైదానంలో ఏర్పాటుచేయబడిన సభలో ఆయన ఉపన్యసించారు. భారతీయులేకాక, ఆంగ్లేయులు సైతం ఆయన ఉపన్యాసం వినడానికి అధిక సంఖ్యలో వచ్చారు.

తాము చెప్ప దలచుకున్నది ప్రజలకు తేటతెల్లంగా వివరించారు. అనవసరమైనది మాట్లాడకుండా, తాను నమ్మిన సిద్ధాంతాలను పరిశీలించి ఇతరుకు తేటతెల్లంగా తెలియచేయడమే ఆయన ప్రత్యేకత. పూనాలో చేస్తున్న ఉపాధ్యాయవృత్తిని వదిలి దేశసేవకు తమ జీవితాన్ని అంకితంచేయడానికి నిశ్చయించుకున్నారు. రాజకీయ వ్యవహారాలను బాగా ఆకళింపు చేసుకుని దేశసేవ చేయాలనుకునే భారతీయులకోసం 1905వ సం॥లో పూనాలో భారతీయసేవాసంఘం (సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ) స్థాపించారు. ఆ సంఘంలో చేరిన వారిలో శ్రీనివాస శాస్త్రి, దేవదాస్, పండిత కుంస్రూ, కోదండరావ్ ప్రసిద్ధులు.

స్వార్థరహితమైన దేశసేవచేయడంలో గోఖలే ఆనాటి యువకులకు మార్గదర్శకులుగా, ఆదర్శపురుషులుగా వుండేవారు. ఎలాగైనా సరే ఒక్కసారి గోఖలేను కలుసుకోవాలన్న ఉత్సాహం నాకు కల్గింది! సభ ముగిసిన తర్వాత ఆయన వేదిక నుంచి దిగి వచ్చేప్పు డు ప్రజలు ఆయనను చుట్టుముట్టారు. అందువలన ఆయన దగ్గరికి వెళ్లలేక పోయాను. ఆయన బండి దగ్గరకు వెళ్తుంటే ఆయన వెంటవెళ్లాను. నా ముందున్న వారిని తోసుకుని దగ్గరగా వెళ్లి ఆయన చేతిని తాకాను. ఆ రద్దీలో నా టోపి క్రింద పడినలిగినా దేశాభిమాని గోపాలకృష్ణ గోఖలే గారిని తాకానన్న తృప్తి నాకు లభించింది. వారి లక్ష్యాన్ని అధిగమించి, నేడు భారతదేశం ఎంతో అభివృద్ధి గాంచింది. అయినా గోఖలేగారి కార్యదక్షత, సేవాహృదయం, త్యాగనిరతి ఇంకా మన దేశభక్తికి ఉత్సాహం కలిగిస్తూనే వుంటాయి.

మద్రాసులో మేం నలుగురైదుగురం కలిసి, ఒక యింటిని అద్దెకు తీసుకున్నాము. ఆ రోజుల్లో ఇంటికి సంబంధించిన పనులన్నీ నేనే చూసుకునేవాడిని. రకరకాల అభిరుచులు గలమేము కొంత కాలం కలిసి వుండడం మా సౌకర్యాలను గూర్చి పట్టించుకోకుండా, ఇతరులకు తగినట్లు సర్దుకుపోవడం అంత సులభం కాదు. తమ అవసరాలను తగ్గించుకుని ఇతరులను సమయానికి ఆదుకోవడం వల్ల మనసుకు తృప్తి కలుగుతుంది. విశాలభావాలు ఏర్పడతాయి. ఆరోజులలో మద్రాసులో వున్న మిత్రులలో

మరో ప్రముఖుడు కుట్టి కృష్ణమీనన్. మా మధ్యవున్న సాన్నిహిత్యం అతిగాఢమైన స్నేహంగా పరిణమించింది. నేను ఇంగ్లండు నుంచి తిరిగిరాకముందే ఆయన 'మద్రాసు' లో ప్రాక్టీసు ప్రారంభించారు. ఆయన తెలివితేటలు, నిజాయితీ పట్టుదల కార్యదీక్ష కొద్దికాలంలోనే మద్రాసు న్యాయవాద సంఘంలో ఆయన ప్రముఖ స్థానం సంపాదించుకోవడానికి కారణమైనాయి. అడ్వకేట్ జనరల్‌గా కూడా ఆయన పదవీనిర్వహణ చేశారు. అరవైఏళ్ళకు పైగా నా కష్టసుఖాల పట్ల ఆయన చూపిన శ్రద్ధ అంతాయింతా కాదు. మా మధ్యవున్న ప్రేమ మాటల కందనిది. ఈ అనుబంధం మీద కాలం ఎలాంటి ప్రభావమూ చూపలేకపోగా.... అది మరింత దృఢతరమైంది.

నేను మద్రాసు మలయాళీ క్లబ్‌లో ఒకసారికన్న ఎక్కువగా కార్యదర్శి బాధ్యతలు స్వీకరించాను. ఆ రోజులలో ఆ క్లబ్‌లో సుబ్బరాయలు అనే ప్యూన్ వుండేవాడు. సభ్యుల వద్ద చందావసూలు చేయడంలో అతను మహా నేర్పరి. అతను లేక పోతే క్లబ్ కొనసాగేదికాదని కొందరు అనుకోవడం అతిశయోక్తికాదు! తెల్ల వారకుండానే చందాపుస్తకాన్ని తీసుకుని బయలుదేరేవాడు. ఎందరెన్ని గడువులు చెప్పినా, చెప్పిన గడువు రోజుకు ప్రత్యక్షమయ్యేవాడు. అతని చిరునవ్వు ముఖాన్ని, వినయాన్ని చూస్తే చందా ఇవ్వాలనిపించేది.

ఆనాటి ప్రముఖులలో మరి కొందరు సర్.సి.శంకరన్ నాయర్, డా|| టి.ఎం. నాయర్, న్యాయవాది రయరు నంబియార్, సెంగుళత్తు గోపాలమీనన్ కోళిచ్చేరి కరుణాకరమీనన్. ఉన్నత పదవి, ప్రత్యేక విశిష్టత గలవారు శంకరన్‌నాయర్. డా|| టి.ఎం. నాయర్ సమర్థులైన నాయకులు. జస్టిస్ పార్టీని స్థాపించి తన శక్తి సామర్థ్యాలతో, ఉత్సాహంతో దానినొక ఉద్యమంగా నడిపించిన వారు ఆయన.

కరుణాకర మీనన్ సుప్రసిద్ధ పత్రికా సంపాదకులు. కొంతకాలం హిందూ పత్రిక సంపాదకులుగా పనిచేసిన తరువాత ఆయన స్వంతంగా 'ఇండియన్ పేట్రియట్' అనే దినపత్రిక ప్రారంభించారు. కానీ ఆ పత్రిక చాలాకాలం కొనసాగలేదు. మద్రాసునగర జీవితంలో కరుణాకరనాయర్ ప్రముఖ పాత్ర వహించారు. ఆయన గొప్ప వక్త కాకపోయినా, పేరుపొందిన పత్రికా సంపాదకులు.

నేను బి.ఏ. పరీక్ష పాసయిన విషయం తెలిసినప్పుడు అంతులేని ఆనందం పొందాను. ఆ తరువాత ఏం చేయాలి? అన్న విషయంపై మా యింట్లో సుదీర్ఘమైన చర్చలు జరిగాయి. ప్రభుత్వోద్యోగానికి ప్రయత్నించమని కొందరు మా తండ్రికి సలహా యిచ్చారు. కానీ, నా కెందుకోనచ్చలేదు. ఇంగ్లాండు వెళ్లి

బారిష్టరు చదవాలన్న కోరిక వున్నా కూడా మా నాన్న గారి ఆర్థిక పరిస్థితి అందుకు అవకాశం కల్పించదేమోనని భయపడ్డాను. ఆ సమయంలో కుటుంబంలో కొన్ని విషాదసంఘటన లేర్పడినా, నా కోర్కెను తీర్చగలనని మా నాన్నగారు వాగ్దానం చేశారు. ఆయన చేయదలచిన త్యాగం తలచుకొని, నా మనసు కరిగిపోయింది. కొందరు తల్లిదండ్రులు తమ పిల్లల కోసం పడే కష్టాలను, చేసే త్యాగాలను చూసినప్పుడు వారిపై చెప్పలేని భక్తి, గౌరవాలు ఏర్పడుతాయి. అదేవిధంగా తమకున్నదంతా పిల్లలకే త్యాగంచేసి, వృద్ధాప్యంలో కష్టాలు అనుభవించే తలిదండ్రులను చూసినప్పుడు, కన్న పిల్లలు ఇంతకృతఘ్నులుగా వుంటారా అనిపిస్తుంది. నేటి సమాజంలో ఈ రెండు రకాల వారినీ మనం చూస్తున్నాము.

నా విదేశీ పయనం మా గ్రామంలో పెద్ద సంచలనాన్ని రేపింది. నేను ఇంటినుంచి బయలుదేరినప్పుడు నా వెంట ఓ గుంపు కొంత దూరం వరకూ నడిచింది. ఒలవక్కోడ్ రైల్వేస్టేషన్ నుంచి రైలు బయలుదేరి నప్పుడు కన్నీటితో నిలబడిన మా తండ్రిని మళ్ళీచూడ లేనన్న సంగతి నాకు తెలియలేదు.

1912వ సం॥ ఆగస్టు నెలలో నేను ఇంగ్లాండు బయలుదేరాను. ఆ రోజులలో కోళిక్కోడ్‌లో 'మనోరమ' పత్రిక సంపాదకులుగా వున్న పుళియం పట్ట కుంజ్ఞ కృష్ణమీనన్. పాశ్చాత్య జీవనం గురించి అప్పుడప్పుడు వ్రాసి పంపమని నన్ను కోరారు. ఆయన కోరికమేరకు నేను 'మనోరమ' పత్రికకు వ్రాయడం ప్రారంభించాను. ఆ వ్యాసపరంపరే ఆ తరువాత 'విదేశీ విశేషాలు' అన్న పేరిట పుస్తకంగా వెలువడింది. దీని ద్వారా కేరళలోని వివిధ ప్రాంతాల ప్రజలకు నా పరిచయం చేసుకునే అవకాశం కల్పించిన 'మనోరమ' పత్రికకు, ఆ పత్రిక ఆనాటి సంపాదకులకు, నా హృదయపూర్వక కృతజ్ఞతలను తెలుపుకుంటున్నాను.

# ఐరోపాలో

కొలంబో హార్బర్‌లో నేను లండన్ నగరానికి ఓడను ఎక్కాను. ఆస్ట్రేలియా నుంచి లండన్ నగరానికి వెళ్లె షిప్ అది. ఆ ఓడలో పనిచేసేవాళ్లు చాలమంది తెల్లవాళ్లే. ఉన్నతాధికారులుగా పదవులలో మాత్రమే తెల్లవారిని చూసిన నాకు, చిన్న చిన్న ఉద్యోగులుగా పనిచేసే వారిని చూసినప్పుడు ఆశ్చర్యం కల్గడంలో వింతలేదు! ఓడలోని కొత్త వాతావరణం అలవాటు పడడానికి నాకు కొన్ని రోజులు పట్టాయి. ఒక వారం పాటు సముద్రపైత్యం నన్ను వేధించింది. వాంతులు, తలతిప్పడం పైత్యపు లక్షణాలు, కొన్ని సమయాలలో ఈ ప్రయాణమే చేయకుండా వుంటే బావుండేదనిపించేది. ఓడ సూయజ్ కాలువ చేరేంత వరకు నాకు ఆరోగ్యం బాగాలేదు, మారిసెయల్స్ చేరుకున్న తరువాత, ఓడ నుంచి దిగి రైల్లో ఫ్రాన్స్‌కు వెళ్లి, అక్కడి నుంచి లండన్‌కు బయలుదేరాము. లండన్ విక్టోరియా నిలయంలో ఒక మిత్రుడు నా కోసం ఎదురుచూస్తూ వున్నాడు. అతనితో పాటు నేను బసచేయడానికి ఏర్పాటు చేసిన స్థలానికి బయలుదేరాను.

ఆ తర్వాత కొన్నిరోజులు లండన్ నగరం చూడడానికి సరిపోయాయి. ఆ మహానగరం పరిశుభ్రత, అందం, విరామం లేకుండా తిరిగే వాహనాలు, వాటిని క్రమబద్ధం చేసే విధానమూ, ప్రజలు మర్యాదతో మాట్లాడేమాటలు, సత్ప్రవర్తన, ఇతరులకు ఎప్పుడూ సహాయపడడానికి సిద్ధంగావున్న సభ్యత, రక్షకభటశాఖ అప్రమత్తత, ఓర్పు, ఆదేశ ప్రజలపట్లగౌరవాభిమానాలు ఏర్పడేలాచేశాయి. భారతదేశంలో నేను చూసిన ఆంగ్లేయుల ప్రవర్తనకు, ఇక్కడ వారు మాట్లాడే విధానానికి చాలా తేడా కనిపించింది. మన దేశంలో నేను చూసిన ఆంగ్లేయులు, అహంకారం, గర్వంతో కనిపించే పరిపాలనాధికారులు. వీళ్లు సభ్యత, గౌరవం మూర్తీభవించిన ఆంగ్లదేశ ప్రజలుగా కనిపించారు. వీళ్ల జీవన విధానం నన్నెంతగానో ఆకర్షించింది. ఆంగ్లేయుల కార్యదక్షత, ఉత్తమ జీవితం పట్ల వారికి వుండే ఉత్సాహం నాకు ఆశ్చర్యం కలిగించాయి. ప్రజాసేవ పట్ల వారు చూపే శ్రద్ధ నాకు ఒక పాఠంగా నిలిచిపోయింది. 'నాదేశ ప్రజలు కూడా వీళ్ల వద్ద నేను చూసినంత

అద్భుతమైన లక్షణాలను కలిగివున్నట్లయితే' ఇలా చాలసార్లు నేను అనుకోకపోలేదు.

సర్వసద్గుణాలూ కలిగిన ఒక మనిషిని కాని, దేశాన్నికాని ప్రపంచంలో చూడలేము. ఎదుటివారి మంచి గుణాలను చూసి, వాటిని అనుసరించేప్పుడు, వాళ్ల దుర్గుణాలు మనకు అలవడకుండా మనం తప్పుకునేప్పుడు మాత్రమే మనలోని సహజమైన గుణాలు వికసిస్తాయి. ఆంగ్లేయులవద్ద నేను చూసిన కొన్ని మంచి అలవాట్లను నేను నా దేశంలోనూ వ్యాపింపచేయాలని ఆలోచన నాకు కలిగింది. ఇప్పటికి ఆ ఆలోచనలో యింకా మార్పురాలేదు! లండన్‌లో నేను బసచేసింది ఒకే చిన్న ఆంగ్లేయ కుటుంబంతో. ఒక వనిత, ముగ్గురు పిల్లలువున్న కుటుంబంఅది. నేనూ, నా మిత్రుడు, అక్కడ బసచేశాము. అక్కడే భోజనం చేశాము, ఆ గృహిణి యింటి పనులుచేసే నేర్పు చూసే తెలుసుకోవాలి, తెల్లవారు జామునే ఆమె నిద్రలేచి, యిల్లుశుభ్రంచేసి, మాకు టిఫిన్ తయారుచేసి యిచ్చిన తర్వాత, యింటికి కావలసిన వెచ్చాలు కొనడానికి బయటికి వెళ్లేది. అంతకు మునుపే పిల్లల్ని కూడా సిద్ధంచేసి బడికి పంపేది, మేము బయటికి వెళ్లిన తర్వాత, మా గదులను శుభ్రంచేసేది, ఒక్కరోజుకూడా ఆమె ఈ పనులు చేయడం మానలేదు. మేము సాయంకాలం ఇల్లు చేరేప్పటికి, ఆమె తేనీటితో మా కోసం ఎదురుచూస్తూవుండేది. రాత్రి భోజనానికి మాకేదైనా ప్రత్యేకంగా కావాలా అని అడిగి తెలుసుకున్నాక ఆ ఆహారం తయారుచేసేది, సమయం దొరికేప్పుడు పుస్తకమో, పత్రికలో చదివేది. ఒక పనికూడా అసంపూర్తిగా వదిలిపెట్టేది కాదు. ఏ విషయంలోనూ తొందరపాటు, హడావిడి పడడం చేసేది కాదు. అన్నిటికీ కొన్ని నిర్ణీత సమయాలు వుంటాయి. ఆయా సమయాల్లో ఆయా పనులు పూర్తి చేసేది.

రెండేళ్ళకు పైగా ఆ కుటుంబ సభ్యులతో కలిసి వున్నాక, నేను స్వదేశం తిరిగి వచ్చేప్పుడు నా సొంత కుటుంబాన్ని వదిలివచ్చేస్తున్నంతగా విచారించాను. ఇతరులతో మనల్ని కలిపేది రక్తసంబంధం కాదు - సద్గుణ స్వభావమూ, నిర్మలమైన హృదయం మాత్రమే. ఒకరు ఇతరుల యోగక్షేమాలు, సంతోషం పట్ల చూపే ఆసక్తి, ప్రేమా జీవితంలో, మధురమైన అనుభవాల్ని ఉత్సాహాన్ని పల్లవింపజేస్తాయి. కొందరు తమ సంభాషణల ద్వారానే ఇతరులను ఆకర్షిస్తారు, మరికొందరు వాటివల్లే ఇతరుల ద్వేషానికి గురి అవుతారు, ఇవన్నీ మనకు సర్వసాధారణంగా కనిపించే నిత్యసత్యాలు.

ఎక్కడ చూసినా, బ్రిటన్ ఒక స్వతంత్రదేశం అన్న భావం స్పష్టమయింది. ఆదివారాల్లో, నేనూ నా మిత్రుడూ, లండన్ హైడ్ పార్కులో చాలాసేపు

తిరుగుతూవుండడం అలవాటు. రకరకాల స్థాయిలో వున్న ఉపన్యాసకులను అక్కడ చూడవచ్చు. వాళ్లు రకరకాల విషయాలగురించి ఉపన్యసించేవాళ్లు. అక్కడ వున్న భావస్వాతంత్రాన్ని వ్యక్తంచేసే విధంగా వాళ్లు మాట్లాడడం, వాటిని వినడానికి ప్రజలు విరివిగా గుమికూడటం చేసేవారు. ఆ బహిరంగ సభల్ని చూసిన విదేశీయులెవ్వరూ ఆ ధోరణిచూసి ఆశ్చర్యపడకుండా వుండలేరు. బుద్ధి వికాసానికి ప్రజలు చూపే ఉత్సాహం, ఓర్పు, భయంలేని వాతావరణం - పరుల అధికారానికి లోబడి, స్వతంత్రం అంటే ఏమిటో తెలియక మగ్గిన భారతీయులైన మాకు ఉత్సాహాన్ని కలిగించే విధంగా కనిపించాయి.

ఇంగ్లండు పరిస్థితి, గురించీ, అక్కడి సంస్థల గురించి, మరింతగా తెలుసుకున్న తర్వాత, మన దేశం పరిస్థితి గురించి తలుచుకునినేను సిగ్గుపడ్డాను, ఆవేదన చెందాను, ఇండియా, పరుల అధికారానికి లోబడిన దేశం అన్న సత్యం నన్నుమరీ మరీ వేధించింది, నేను ఒక స్వతంత్ర దేశ పౌరుణ్ణి కాను, బ్రిటిష్ పాలకులకు లోబడిన పౌరుణ్ణి, అని నాకు గుర్తుచేసిన సంఘటనలు ఒకటి రెండు కావు.

నేను బసచేసిన యింట్లో నున్న పాప నాతో ఒక రోజు యిలా అంది. 'నిన్న మా టీచర్ ఇండియా గురించి చెప్పారు, భారతీయులకు తమ దేశాన్ని పరిపాలించడం సాధ్యం కాలేదు, వాళ్లు తమలో తాము కలహించుకుంటూ దేశంలో అశాంతిని కల్లోలాన్ని ఏర్పరచు కున్నారు. అందువల్లనే మనం వాళ్ల దేశాన్ని పరిపాలిస్తున్నాము, ఎప్పటికీ మనమే భారతదేశాన్ని పరిపాలించవలసి వుంటుంది అన్నారు'.

ఆ టీచర్ చెప్పిన మాట నిజమే కదా! మనలోని ఐకమత్య రాహిత్యమే కదా మనల్ని ఇతరులు పరిపాలించేట్టు చేసింది? ఈ దుస్థితి నుంచి భారతదేశాన్ని కాపాడే మార్గం ఏది?

విద్యార్థులైన మేము, ఆ విషయం గురించి చాలసార్లు చర్చించుకునే వాళ్లం.

వివిధ దేశాల ప్రజల స్వాతంత్ర్య పోరాట చరిత్రలను చదివి తెలుసుకునే ఉత్సాహం నాలో ఎక్కువ కొనసాగింది. మాజిని, గారిబాల్డి, వాషింగ్టన్, రాణి లక్ష్మిబాయి, మొదలైన దేశభక్తుల చరిత్రలను చదివే ఉత్సాహం నాలో పెల్లుబికింది, దేశ స్వాతంత్ర్య ప్రయత్నంలో తగిన పాత్ర వహించాలన్న ఆశకూడా ఏర్పడింది.

నాలోని ఆ ఉత్సాహం, నన్ను ప్రజా జీవితంలో పాలుపంచుకోవడానికి ప్రోత్సహించింది, దానికి కావలసిన శిక్షణను, నేను ఇంగ్లండులో ఉన్నప్పు డే పొందాలని నిర్ణయించుకున్నాను అక్కడ వున్న పలుసంస్థలు, సంఘాలు గురించి, వాటి కార్యకలాపాల నిర్వహణ గురించి, పద్ధతుల గురించి,

తెలుసుకోవడానికి ప్రత్యేకమైన ఉత్సాహంతో ప్రయత్నించాను. 'లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్' అన్న సంస్థలో నేను చేరి కొంత కాలంపాటు శిక్షణ పొందాను, పార్లమెంటుకు వెళ్ళి, అక్కడ జరిగే వాదోపవాదాలను, ఉపన్యాసాలను శ్రద్ధగా విన్నాను.

మా నాన్నకు నేను ప్రభుత్వ ఉద్యోగంలో చేరిపోవాలన్న ఆశవుండేది, నాకు ఆయన రాసిన అనేక ఉత్తరాలలోనూ ఈ విషయం తేటతెల్లం చేశారు. బ్రిటిష్ ప్రభుత్వం పట్ల చాలా భక్తి, వాళ్ల పరిపాలనలో పూర్తి సంతృప్తి కలిగినవారు మా నాన్న.

రవీంద్రనాధటాగూర్, గోపాలకృష్ణగోఖలే, లాలాలజపతిరాయ్, మహమ్మదాలీజిన్నా, సరోజిని నాయుడు, సర్ సి. శంకరన్ నాయర్, అనీబిసెంట్, మొదలైన సుప్రసిద్ధ నాయకులు, నేను లండన్ లో వున్నప్పుడు అక్కడికి విజయం చేశారు, వాళ్లను ఆహ్వానిస్తూ, ఏర్పాటు చేసిన సభలన్నిటిలోనూ నేను పాల్గొన్నాను. దేశాభివృద్ధి కోసం జరిగే గొప్ప ప్రయత్నంలో పాలుపంచుకునే సుప్రసిద్ధ నాయకులను చూడడానికి, సాన్నిహిత్యాన్ని పొందడానికి నేను చాలా ఉత్సాహ పడేవాణ్ణి. పైన పేర్కొన్న నాయకులలో కొందరిని, నేను లండన్‌లో వున్నప్పుడు వెళ్ళి చూశాను. వాళ్ల సాహచర్యంలో పనిచేయాలని నాకెంతో ఉత్సాహం కలిగింది, పరిపక్వం, పరిణితి చెందని నా ఆలోచనలు, అభిప్రాయాలు వాళ్లకు పరిహాస్పాదంగా వుండివుండవచ్చు. ఆ తరవాత, 'ఎంత మూర్ఖంగా నేను మాట్లాడాను' అని నాకు అనిపించింది; అయినప్పటికీ గొప్ప నాయకులతో మాట్లాడిన మహత్తర అవకాశమే నాకు లభించిందని ఆనందించాను.

ఇంగ్లండులో ఒక వ్యవసాయదారుని యింట్లో నేను వుంటున్న రోజులలో నా తండ్రి మరణవార్త అందింది. ఆయన మంచం పట్టి వుండడం నాకు ముందే తెలిసివున్నప్పటికీ, ఆయన అంత త్వరగా నన్ను వదిలివెళతారని అనుకోలేదు, నన్ను బారిష్టర్‌గా చూడాలని ఉవ్విళ్లూరేవారు అలాంటి ప్రియమైన మా నాన్న లేని యింటికి నేను తిరిగి వెళ్లడం ఎంత మాత్రం ఊహించలేకపోయాను.

నాకు అతిథ్యంయిచ్చిన మిత్రుడు, అతని భార్యా రకరకాలుగా నన్ను ఓదార్చడానికి ప్రయత్నించారు, ఎవరూ లేని చోట ఒంటరిగా కూర్చుని మా నాన్న గురించి నా ఆలోచనలతో నేను పొద్దుపుచ్చసాగాను. పెద్ద విషాదం బాధిస్తున్నప్పుడు కావలసిన వాళ్లెవరూ సమీపంలో లేనప్పుడు, ఆ విషాదం మరింత భారంగా హృదయాన్ని బరువెక్కిస్తుందని ప్రత్యేకంగా చెప్పాలా? నా

మనసుకు అతీతమైన ఆలోచనలతో ఎంత మాత్రం స్థిమితం లేకుండా బాధపడ్డాను.

బాల్యం నుంచి అలవాటు చేసుకున్న కొన్ని పద్ధతులు, ఆచారాలు, విశ్వాసాలు, అర్ధరహితంగా కనిపించాయి. అయినా వాటి స్థానంలో మరో అభిప్రాయాలకు మనసు చోటివ్వలేదు. అనేక పుస్తకాలు నేను చదివాను, ఎందరివో ఉపన్యాసాలు నేను విన్నాను, అయినప్పటికీ దృఢమైన ఒక అభిప్రాయం మనసులో ఏర్పడలేదు, థామస్ ఎకంబి - 'క్రీస్తును అనుసరించడం' ఎపిక్టిటస్ రాసిన 'ఉపన్యాసాలు', మార్కస్ అరేలియస్ - 'ఆత్మచింతనలు' ఎడ్విన్ ఆర్నాల్డ్ 'ఆసియా జ్యోతి' మొదలైన పుస్తకాలు నాకు చాలా ప్రియమైనవి. ఏసు, బుద్ధుడు, ఈ యిద్దరి జీవిత చరిత్రలు ఎన్నిసార్లు చదివినా ఉత్సాహకరంగానే వుంటాయి. పంచతంత్రం, రామాయణం కూడా అలాంటి గ్రంథాలే, బైబిల్‌లో కొన్ని భాగాలు నాకు కంఠతా వచ్చు, అయినప్పటికి, మరణానంతర స్థితి గురించి నన్నెవరైనా ప్రశ్నిస్తే సమాధానం చెప్పడం కష్టం.

నా సిద్ధాంతాల కనుగుణంగా, జీవితాన్ని మలచుకోవాలని ఆశించాను, అయినా దానికి తగ్గ మనోస్థైర్యం నాలో లేదు, ఈ విధంగానే నడచుకోవాలని నిర్ణయించుకుని, అదే విధంగా నడుచుకోవడం ప్రారంభించినప్పటికీ, ఆ పద్ధతిని కొనసాగించే దృఢత్వం నాలోలేదు, నేను ఖర్చు చేసే డబ్బును లెక్కరాసిపెట్టాలని మానాన్న నాకు మరీ మరీ చెప్పేవారు, కొన్నాళ్లు ఆ పద్ధతిని అనుసరించాను. తర్వాత ఆ అలవాటును వదిలేశాను, మూడు నాలుగునెలల తర్వాత మళ్లీ ప్రారంభించాను, అదే విధంగా సాగింది, ఇలా దైనందిన కార్యక్రమాలను ఒక క్రమబద్ధం చేయడానికి ఎన్నో నిర్ణయాలను ఆలోచించాను. అయితే కార్యాచరణలో కొనసాగలేదు. చెయ్యకూడదనుకున్న పనిచేయడమూ, చేయవలసిన దాన్ని చెయ్యకుండా వాయిదా వెయ్యడమూ, తప్పు అనే భావం నాలో వుండేది. అయినప్పటికీ, మనసును నిగ్రహిస్తూ ఒక సక్రమమైన మార్గంలో పెట్టే స్థైర్యం లేకుండా కొట్టుమిట్టాడాను.

1914వ సంవత్సరం జూలై నెలలో, ఒక మిత్రునితో కలిసి ఐరోపా దేశాలలో కొన్నిటిని చూడడానికి బయలుదేరాను, మేము జర్మనీ రాజధాని అయిన బెర్లిన్‌లో వున్నప్పుడు, ప్రథమ ప్రపంచ యుద్ధం ప్రారంభమయింది. యుద్ధం ఆరంభమయ్యాక, రెండు నెలలు మేము స్విట్‌జర్‌లాండ్‌లో బసచేశాము. లండన్‌కు తిరిగిరావడానికి దారిలేకుండా పోయింది, అక్కడ 'ఇంటర్‌లాక్కన్' అనేఒక వసతి గృహంలో మేము బసచేశాము. లండన్ వెళ్లడానికి సౌకర్యం ఏర్పడగానే మేము తిరిగివచ్చాము. అప్పటి అనుభవాలను

విదేశీ విశేషాలు అన్న వ్యాస పరంపరలో వివరించి వుండడంవల్ల, వాటిని ఇక్కడ మళ్లీ చెప్పడం లేదు, అయినా ఒక చిన్న సంఘటనను మాత్రం తెలియజేస్తాను.

మేము 'ఇంటర్ లాక్కన్' చేరినప్పుడు, మా దగ్గిర డబ్బుల్లేవు, యుద్ధం ప్రారంభం కావడం వల్ల, మా దగ్గిర వున్న నోట్లను మార్చుకోవడానికి వీలుకాలేదు. మిగతా ప్రయాణీకుల స్థితి కూడా అదేవిధంగా వుంది. అప్పటికి మేము డబ్బుచెల్లించలేమన్న విషయం తెలిసే వసతి గృహం నిర్వాహకుడు మేము అక్కడ వుండడానికి అనుమతించాడు. కొన్ని రోజులు గడిచాక, అక్కడి ఒక ఆంగ్లేయుడు, 'ఇంటర్ లాక్కన్' లో బసచేసి వున్న బ్రిటిష్ పౌరుల అవసరం కోసం బ్రిటిష్ ప్రభుత్వం, లండన్ నుంచి కొంత పైకాన్ని పంపి నట్టు, మాకు డబ్బు అవసరమైనట్లయితే, అందుకోసం ప్రత్యేకంగా ఏర్పరచిన కార్యవర్గ సభ్యుల్ని కలుసుకుని తెలియజేయడం మంచిదని తెలియజేశారు. బ్రిటిష్ పౌరులకు అనుమతించబడిన, వసతులు, రాయితీలు, అడిగిపొందడానికి మాకు హక్కువున్నది. నేను నా మిత్రుడు, కార్యవర్గసభ్యుల్ని కలుసుకుని, మేము లండన్ చేరేంత వరకు మాకు కావలసిన పైకం గురించి తెలియజేశాము. మాకు డబ్బు ఏమీ అవసరం లేదనీ, బ్రిటిష్ పౌరులకు డబ్బుయివ్వడాన్ని తెలుసుకునే మేము అడుగుతున్నామనీ భావించి అందువల్ల యివ్వడానికి వీలుకాదని, ఒక కమిటీ సభ్యుడు తెలియజేశాడు.

ఆయన, ఆ రోజుల్లో భారతదేశంలో ఒక పెద్ద అధికారి. మాలాగే స్విట్జర్లాండ్ నుంచి తిరిగి వెళ్లడానికి దారిలేక అక్కడే ఆగిపోయాడు. ఆ సమయంలో ఇంటర్ లాక్కన్‌లో దాదాపు మూడు వందల మంది బ్రిటిష్ పౌరులు వున్నారు, అందులో మేము ఇద్దరమే భారతీయులం.

అతను ఈ విధంగా తిరస్కరించినప్పుడు, మేము అక్కడవుండి పోవడానికి, డబ్బు పొందడానికి రాలేదనీ, కమిటీ ఆహ్వానం మీదే వచ్చామనీ, మమ్మల్ని మా దేశం గురించి లేనిపోని మాటలను ఒక సభ్యుడు చెబుతున్నప్పుడు, ఇతరులు ఆ మాటలను ప్రతిఘటించి ఏమి మాట్లాడని స్థితిలో మీ కమిటీ సహాయం అక్కర లేదనీ అక్కడి నుంచి వచ్చేశాము. ఈ వివరాలను తెలియ జేస్తూ ఆ రోజే కమిటీ కార్యదర్శికి ఒక ఉత్తరం పంపాము, ఉత్తరం ఆఖరు భాగంలో ఇలా రాసి పంపాము.

'పైన వివరించిన స్థితిలో, మీ కమిటీ ద్వారా, ఏ సహాయాన్నయినా అంగీకరించడం, మాకూ, మా దేశానికీ అవమానకరంగా భావిస్తాము. ఈ వివరాన్ని తమ కార్యవర్గానికి తెలియజేస్తారు కదా!'

ఈ ఉత్తరానికి మర్నాడే కమిటీ కార్యదర్శి వద్ద నుంచి జవాబు వచ్చింది, దాని సారాంశం : మొదటి రోజు సంభవించిన సంఘటన గురించి కమిటీ చాలా విచారిస్తున్నదనీ, బాధ్యత తెలియని ఒక సభ్యుడు పలికిన మాటలను కమిటీ మాటలుగా తీసుకోవద్దనీ, అవసరమైన పైకాన్ని తెలియజేస్తేదాన్ని వెంటనే పంపిస్తామనీ రాశారు.

డబ్బు అవసరం లేదని చెప్పి, లండన్ తిరిగి రావడానికి బస్సు ఛార్జీ మాత్రమే మేము అడిగా తీసుకున్నాము. ఇది తెలిసి వసతిగృహం నిర్వాహకుడు మమ్మల్ని అభినందించాడు. అప్పుడు తనకు డబ్బు అవసరం లేదని, మేము లండన్ తిరిగి వెళ్లిన తర్వాత పంపితే చాలని ఆయన చెప్పారు. కొన్ని రోజులకు లండన్‌కు తిరిగి రాగానే వసతిగృహానికైన ఛార్జీలను ఆయనకు పంపాము.

పరీక్షల్లో ఉత్తీర్ణుడినిఅయి బారిష్టర్‌గా లండన్ నుంచి మాతృదేశానికి బయలుదేరినప్పుడు, మూడేళ్లపాటు ఒకటిగా వున్న నా ప్రియమిత్రుడు పుదియవీట్టిల్ నారాయణమీనన్‌ను వదలిరావడానికి చాలా బాధపడ్డాను. ఆయన లండన్ విశ్వవిద్యాలయంలో వైద్యవిద్యలో శిక్షణ పొందుతున్నాడు. ఆయన చదువు పూర్తికావడానికి యింకా రెండేళ్లు పడుతుంది. కళాశాల సమయాల్లో తప్ప మిగతా సమయాల్లో మేము విడదీయలేనంతగా కలిసివుండేవాళ్లం. రెండేళ్లు గడిచి ఆయన స్వదేశం తిరిగి వచ్చేవరకు ఎలా ఒకరి నొకరం చూసుకోకుండా వుండడం అన్న ఆవేదనతో మేము విడిపోయాము. ఆ విడిపోవడం శాశ్వతమైనదని అప్పుడు మాకు తెలియదు!

రెండేళ్లు పూర్తికాకముందే ఆయన లండన్ లో కాలంచేశాడు. శాంతం, దయ, సత్యమే ఆదర్శాలుగా భావించిన ఆ యువకుడు, ప్రజల మధ్య ఒక గొప్ప వైద్యుడుగా రాణించి వుండేవాడు. అయినా విధి మరో విధంగా నిర్ణయించింది!

1915వ సంవత్సరం జూలై నెలలో నేను మాతృదేశం వచ్చేశాను, యుద్ధం అప్పుడు కూడా జరుగుతూనేవుంది, శత్రువుల బెదిరింపులతో, ఓడ ప్రయాణం అపాయకరంగానే వున్నది.

ఓడ బొంబాయి రేవుకు చేరినప్పుడు, ప్రయాణీకులు మరణద్వారం నుంచి బయట పడినంతగా సంతోషించారు.

నేను ఊరుచేరాక, మంగళవాద్యాలతో బాణాసంచాతో ఏనుగుతో నన్ను ఆహ్వానించడానికి ఎదురుచూస్తున్న జనాన్ని చూసి ఆశ్చర్యం చెందాను, మా ఊరి నుంచి ఆరోజుల్లో విదేశానికి వెళ్లి వచ్చిన వారు ఎవరూ లేరు, అదే ఆ అట్టహాసానికి, సంబరానికీ కారణం!

నేను ఊరు వదిలి వెళ్లి మూడేళ్లయింది. ఆ కాలఘట్టంలోనే ప్రియమైన తండ్రిగారు, ఒక సహోదరి ఈ లోకం వదిలి వెళ్లారు, ఆ పెద్ద కుటుంబం పూర్తి భారం, వయోధికురాలైన నా తల్లి నుంచి నేను తీసుకున్నాను.

# న్యాయవాది వృత్తి – ప్రజా జీవనం

1915వ సం॥ ఆగస్ట్ నెలలో నేను కోళిక్కోడ్‌లో న్యాయవాద వృత్తిని ప్రారంభించాను. మేజా, కుర్చీ, రాక్ నిండుగా పుస్తకాలు ఏర్పరచుకుని, పార్టీల కోసం ఎదురుచూడసాగాను. వృత్తికి సంబంధించిన జ్ఞానం, అనుభవం గల కొందరు మిత్రులు మొదట నేను ఒక మంచి గుమాస్తాను చూసుకోవాలని సలహా ఇచ్చారు. ఒక మంచి గుమాస్తా దొరికేంత వరకు కోర్టు విషయాలలో అనుభవం లేని నాకు సహాయం చేయటానికి మా కుటుంబానికి కావలసిన ఒక గ్రామోద్యోగి కోళిక్కోడ్‌కు వచ్చినాతో కొన్నాళ్ళు గడిపాడు. అనేక మంది గొప్ప న్యాయవాదుల గురించి అతనికి తెలుసు. వాళ్ళు ఒక్కొక్కరు కేసులు నిర్వహించే పద్ధతి గురించి నాకు వివరంగా తెలియజేశాడు. వాళ్ళల్లో ఒకరు కేసు నడపడానికి చాలా ముఖ్యమైన సాక్షుల్ని తయారుచేయడంలో చాలా గట్టివాడు. ఉపాధ్యాయుడు పిల్లలకి పాఠాలు బోధించే విధంగా సాక్షులకు ఆయన పాఠాలు చెప్పేవాడు. అవతలి పక్షం న్యాయవాది కేసు విచారణ జరిపేటప్పుడు న్యాయమూర్తి ఏదో వ్రాయడానికి పూనుకుంటే అది కూడదని అలా వ్యతిరేకించిన మరో న్యాయవాది గురించి ఆయన తెలియజేశాడట. ఆయన అభ్యంతరాన్ని లెక్క చెయ్యకుండా న్యాయమూర్తి వ్రాసుకుంటూ వుంటే ఈ న్యాయవాది కాస్తా న్యాయమూర్తి దగ్గరకెళ్ళి ఆయన చేయిపట్టుకున్నాట్ట! అలాంటి తెగింపు మామూలు న్యాయవాదులకు వుంటుందా అని విస్మయాన్ని వ్యక్తంచేస్తూ, ఆ గ్రామోద్యోగి నాతో చెప్పాడు. ఈ కథలన్నిటినీ నేను నమ్మినట్లే ఆయన భావించి వుంటాడు!

'అబద్ధపు సాక్ష్యాన్ని సృష్టించడం సరైన పనా?' అని నేనతణ్ణి అడిగాను. అందుకు అతని ప్రత్యుత్తరం ఇది : 'కోర్టు సత్యస్థానం కాదు. న్యాయస్థానం. కోర్టులో జయంపొందాలని క్లయింట్లు న్యాయవాదిని ఆశ్రయిస్తారు. సత్యమో..... అసత్యమో..... వాళ్ల లక్ష్యం ప్రధానం. సత్యమే లక్ష్యంగా వుండాలంటే ఈ వృత్తి కెందుకు రావాలి?'

ఎలాగైనా సరేనని నాకు ఒక కేసు సంపాదించి పెట్టాలని అతనికి ఆసక్తి వుండేది. నేను దాన్ని ఎలా నడిపిస్తానో చూడాలని అతను ఆశించేవాడు. ఉదయం స్నానం చేసి కాఫీ, ఫలహారాలు ముగించుకుని నా ఆఫీసు గదిలో కూర్చునేవాణ్ణి. పదిగంటలకు భోజనం చేసి, న్యాయస్థానానికి బయలుదేరేవాణ్ణి. అలా రెండు నెలలు గడిచాయి.

ఒక రోజు ఉదయం నేను స్నానం చేస్తున్నాను. అతను స్నానాలగది తలుపు దగ్గర నిలబడి తొందరగా స్నానం చేసి రమ్మన్నాడు. కొందరు క్లయింట్లు వచ్చారన్న శుభవార్తను తెలియజేశాడు. నేను స్నానంపూర్తి చేసి

త్వరత్వరగా దుస్తులు ధరించి అయిదు నిముషాలటు ఆఫీసుగదిలోకి ప్రవేశించాను. అక్కడ అతను తప్ప మరెవ్వరూ లేరు.

'క్లయింట్స్ ఎక్కడ?' అని అడిగాను.

'వాళ్లు వేరొక వకీలు ఇల్లు వెతుక్కుంటూ వచ్చారు. వెళ్లిపోయారు', అని జవాబు చెప్పాడు. కేసులు వస్తాయి లెండి. అయినా కొంతకాలం ఆగాలి. నాకు తెలిసిన వాళ్లు చాలామంది వున్నారు' అన్నాడు నన్ను ఓదార్చే ధోరణిలో.

నేను లండన్‌లో ఒక బారిస్టర్ దగ్గర శిక్షణ పొందిన కాలంలో ఆయన చెప్పిన కొన్ని కథలు నాకు జ్ఞాపకం వచ్చాయి. ప్రాక్టీస్ ప్రారంభించి కొన్నాళ్లయ్యాక కూడా కేసనేది లేకుండా నిరుత్సాహపడిన బారిస్టర్ కథ అది. ఆయన ప్రతిరోజూ కార్యాలయానికి వెళ్లేవారు. కొంత సేపు అయిన తర్వాత తప్పని సరిగా న్యాయస్థానానికి వెళ్లేవాడు. ఎవరైనా క్లయింట్స్ వస్తే వెంటనే గుమాస్తా వెళ్లి న్యాయస్థానంలో అతనికి తెలియచేయాలన్నది ఉత్తరువు. ఒకనాడు ఆ బారిష్టర్ న్యాయస్థానంలో వున్నప్పుడు, గుమాస్తా పరుగెత్తుకు వచ్చి వగర్చుకుంటూనే ఒక క్లయింట్ వచ్చినట్లు తెలియజేశాడు. 'అలాగా.. త్వరగా వెళ్లి వాళ్లని ఆఫీసులోనే వుండమని చెప్పు. నేనిప్పుడే వస్తున్నాను' అన్నాడు బారిష్టర్. 'వాడు వెళ్లిపోడు సార్! తలుపు మూసే వచ్చాను. కచ్చితంగా లోపలే వుంటాడు' అని ఆ గుమాస్తా ఉత్సాహంగా జవాబు చెప్పాడట! తన గుమాస్తా సామర్థ్యానికి సంతోషిస్తూ వచ్చిన బారిస్టర్ ఆఫీసుకు వచ్చి, తలుపు తెరిచి చూడగానే అక్కడ ఎవరూ కనిపించలేదు. విషయం ఏమిటంటే - వెనకవైపు వున్న తలుపు తాళం వేయడం గుమాస్తా మరిచిపోయాడు!

కొన్నిరోజుల తర్వాత గ్రామోద్యోగి ఒక కేసును పట్టుకొచ్చాడు. అప్పుడే నాకో గుమాస్తా కూడా దొరికాడు. అప్పీల్ కోసం స్పెషల్ లీవ్‌పిటీషన్ కోరేకేసు అది. దొరల న్యాయస్థానం కావడం వల్ల ప్రత్యేకంగా శ్రద్ధ తీసుకుని చర్య తీసుకోవాలని ఎన్నవించాడు. అది నా తొలికేసు. అయిదు రూపాయలు ఫీజు లభించింది. అప్పీల్‌ను జాగ్రత్తగా చదివాను. చట్టాన్ని పరిశీలించాను. మొదటికేసులో విజయం సాధించాలని ప్రార్థన చేసి న్యాయస్థానానికి వెళ్లాను. జస్టిన్ జాక్సన్ అప్పటి జిల్లా న్యాయమూర్తి. నా కేసు గురించి వాదించే సమయం ఆసన్నమయింది. నేను కేసుకి సంబంధించిన ఫైలు తీసుకుని న్యాయశాస్త్రానికి సంబంధించిన పుస్తకాన్ని తెరిచాను. అంతకుముందే దరఖాస్తును అనుమతించినట్లు న్యాయమూర్తి ఆజ్ఞమంజూరు చేశారు. నేను లేచి నిలబడిందీ పుస్తకం తెరిచిందీ నా గుమాస్తా, గ్రామోద్యోగి ఉత్సాహంతో చూస్తున్నారు. అయినా నేను ఏదీ మాట్లాడవలసిన అవసరం లేకపోయింది. నా తొలికేసును ఇలా నిర్వహించి - విజయం సాధించాను!

కోళిక్కోడ్ న్యాయవాదుల సంఘ గ్రంథాలయం ఆ రోజుల్లో ఒక క్లబ్బులాగా వుండేది. బాగా ప్రాక్టీసు లేని న్యాయవాదులను అక్కడ అధిక సంఖ్యలో చూడవచ్చు. వాళ్ల సంభాషణల్లో పలు విషయాలు వినిపించేవి. కేసులు లేని వాళ్లు, విచారణ కోసం కాచుక్కూర్చునే వాళ్లు. ఆ సంభాషణల్లో

పాలుపంచుకునే వాళ్లు. అయినా విడిగా కూర్చుని చదువుకోవాలనుకున్నవారికి అక్కడ సౌకర్యం లేదు. సమయాన్ని ఉపయోగించుకుని తన వృత్తికి కావాలసిన శిక్షణ పొందడానికి అక్కడ వసతులు లేవు. ఇప్పటికీ ఆ స్థితిలో ఏదైనా మార్పు వచ్చిందా అంటే వచ్చిందని చెప్పడానికి లేదు!

ఇద్దరు ముగ్గురు న్యాయవాదులు కలిసి సంయుక్తంగా కృషి చేస్తే వారితెలివితేటలకు, సామర్థ్యానికి అనుగుణంగా అందరికి ఉపయోగపడే విధంగా ఫలితాలు పొందవచ్చు. ఇలాంటి ఆచరణ మరి కొద్ది చోట్లలోనే అమలులో వుంది. మన దేశంలో సాధారణంగా ఇది వాడుకలో లేదు. ఆ పద్ధతి అమలుకు వస్తే న్యాయవాదులకూ, క్లయింట్స్‌కు బావుటుంది. ఈ నాటి పరిస్థితులలో ఇది ప్రత్యేక ధోరణిలో పరిశీలించవలసిన విషయం అనిపిస్తుంది.

కోళిక్కోడ్ నుంచి నేను ఒక కేసు కోసం తిరూరు వెళ్లాను. ఆ కేసు నాకు రావడం ఆ క్లయింట్ల తీరు నా జీవితంలో ఓ మరచిపోలేని అనుభవం.

ఒకనాడు సాయంత్రం. నలుగురైదుగురు కేసు కాగితాలతో మా ఇంటి మెట్లెక్కి వచ్చారు. మర్నాడు తిరూరు మున్సిఫ్ కోర్టులో విచారణకు రానున్న ఒక కేసులో నేను హాజరు కావాలని వారు కోరారు. ఆ కాగితాలు చూసి, కేసు గురించి వివరాలు తెలుసుకోడానికే మూడు గంటలకు పైగా పట్టింది. ఫీజు నిర్ణయించుకున్నాము. మర్నాడు ఉదయం బండిలో తిరూర్ వెళ్లేట్టు తీర్మానించాను. ఫీజుతో పాటు దారి ఖర్చులకు కావలసిన డబ్బు కూడా సిద్ధంచేసి, రైలుస్టేషన్ దగ్గర వుంటామని చెప్పి వాళ్లువెళ్లారు. నేను చెప్పిన సమయానికి రైలుస్టేషన్‌కి వెళ్లాను. బండి బయలుదేరడానికి అయిదు నిమిషాలే వుంది. నన్ను చూడడానికి వచ్చిన వాళ్లల్లో ఒకరు మాత్రం అక్కడ కనిపించారు. 'నాతో వచ్చిన వాళ్లు దుకాణానికి వెళ్లారు. ఒకవేళ వాళ్లు మరో రైలులో రావచ్చు. మనం ఈ రైల్లో వెళదాం. డబ్బువాళ్లు వచ్చేప్పుడు తెస్తారు' అని చెప్పి నాకూ, తనకూ కలిపి టిక్కట్లు నేనే కొనేట్టు చేశాడు. మేము తిరూరు చేరుకున్నాము. ఏదో కారణం వల్ల కేసు వాయిదా పడింది. పాలఘాట్ సంగుణ్ణి మీనన్ ఆ రోజులలో మునసబుగా వుండేవారు. నా బాల్యకాలం నుంచే నాకు పరిచయం వున్నవారాయన. కేసువాయిదా వేసిన తర్వాత మధ్యాహ్న విరామసమయంలో నన్ను తన గదికి పిలిచారు. నేనొక యువన్యాయవాదిని అనే ధోరణిలో క్లయింట్లతో ఎలా మాట్లాడాలో ఎలా నడచుకోవాలో నాకు ఆ విధానాలను గురించి తెలియజేశారు. 'కేసు కోసం పొరుగూరు వెళ్లేటట్టయితే ముందుగా ఫీజు తీసుకోకుండా అడుగు పెట్టవద్దు. చాలాసార్లు క్లయింట్లు కొత్త న్యాయవాదులకు ఇవ్వవలసిన ఫీజు ఇవ్వకుండా మోసం చేస్తారు' అని అన్నారు. నా మనసులో అది నాటుకు పోయింది. ఆ తర్వాత నేను కోళిక్కోడ్ బయలుదేరేముందు నా క్లయింట్స్ కోసం వెతికాను. అక్కడ ఎవరూ కనిపించలేదు. నాకు ఫీజూ లభించలేదు. అప్పటినుంచి సంగుణ్ణిమీనన్ చెప్పినట్లు నడుచుకోవాలని నిశ్చయించుకుని, జేబు ఖర్చులకువుంచుకున్న డబ్బుతో టిక్కట్ కొని కోళిక్కోడ్ తిరిగివచ్చేశాను. ఆ క్లయింట్స్ మళ్లీ కనిపించనే లేదు!

న్యాయవాదవృత్తిలో వున్నది కొద్దికాలమే అయినా, అనుభవం వల్ల నాలో ఏర్పడిన కొన్ని అభిప్రాయాలు ఇక్కడ చెప్పు కో తగ్గవని భావిస్తున్నాను. కేసు నడిపించేప్పు డు కొందరు న్యాయవాదులు, న్యాయమూర్తులతో మాట్లాడే తీరు నన్ను బాధపడేట్టు చేసింది. న్యాయస్థానానికున్న గౌరవాన్ని న్యాయవాది ఇవ్వాలి. ఆత్మగౌరవాన్ని వదులుకుని వ్యవహరించడం సరికాదు. న్యాయమూర్తి ఆయన స్థానంలో కూర్చుని వున్నారు. న్యాయవాది తన స్థానంలో వున్నారు. ఇద్దరూ తమతమ కర్తవ్యాలని నిర్వర్తిస్తున్నారు. న్యాయమూర్తి ఎవరికీ జంకవలసిన పనిలేదు. న్యాయవాదికూడా న్యాయమూర్తికి భయపడ నవసరంలేదు. ఏ మాత్రం భయపడకుండా ఓ న్యాయవాది తన క్లయింటుకోసం కేసు జరిపించవచ్చు. కేసు అపజయం పొందినా పర్వాలేదు. సత్యాన్ని విస్మరించడం మంచిది కాదు. ఆత్మగౌరవమూ కాపాడుకోవాలి!

సామాజిక పునర్వికాసానికి న్యాయవాదులు చాలావరకు కృషిచేయవచ్చు. వారు తమ బాధ్యతలను ఉన్నత ప్రమాణాలలో నిర్వహించగలగాలి. న్యాయవాదవృత్తి కేవలం ధనార్జనకు మాత్రమే అని భావించరాదు. ఇతరుల సమస్యలను సులభతరం చేసే విధంగా వాళ్లు సహాయం చెయ్యవచ్చు. వాళ్లు మంచి చెయ్యడం సులభసాధ్యమే. న్యాయవాదులు తమకున్న సహజసామర్థ్యంతో పలుదేశాలలోనూ, శాసనసభలలోనూ, రాజ్యాంగ నిర్వహణా వ్యవహారాలలోనూ ప్రజాసంస్థలలో కృషిచేయడం వల్ల ఆ వృత్తి ఔన్నత్యాన్ని సంతరించుకుంటుంది. పునర్వికాసం పొందే మనదేశంలో న్యాయవాదికి గురుతరమైన బాధ్యత వుంది. ఆ బాధ్యతను గుర్తించి, నిర్వహించే సామర్థ్యం, పట్టుదల వారు ప్రయత్నించి సాధించాలి. కొందరు అనుకునేట్టు న్యాయవాదులు సమాజం మీద ఆధారపడే పరాన్న భుక్కులు కారు. సాంఘిక జీవితంలో నీతి, నిజాయితీ లను నిలిపే బలమైన స్థంభాలు!

1916వ సం॥ ఆగస్టునెలలో నేను విదేశీ విశేషాలు, అనే పుస్తకం వెలువరించాను. ఆ పుస్తకానికి ప్రజలు చూపిన ఆదరణ నాకు ఎంతో తృప్తి నిచ్చింది. ప్రపంచయుద్ధం దాని పర్యావసానంగా భారత జాతీయ రంగంలో ఏర్పడిన విప్లవాత్మకమైన మార్పులు, ప్రజాజీవితంలో నేను పాల్గొనాలనే అభిలాషకు ఉత్సాహాన్ని కలిగించాయి. చిన్నదేశాల స్వాతంత్ర్య హక్కులను పరిరక్షించడానికే తాము జర్మనీతో యుద్ధం ప్రారంభించినట్లు బ్రిటిష్ వారు ప్రకటించినప్పు డు పెద్ద దేశమైన మన భారతదేశానికి స్వాతంత్ర్య హక్కులు కాదనడంలో అర్థమేమిటని భారతీయులు ప్రశ్నించసాగారు. భారతదేశంలో స్వపరిపాలనను స్థాపించడానికి అనిబిసెంట్ ప్రారంభించిన హోమ్‌రూల్ ఉద్యమం దేశమంతటా విశేషమైన ఆదరణను చూరగొన్నది.

ఆంగ్లేయులు ఒక ప్రపంచ మహాయుద్ధంలో పోరాడుతున్నప్పు డు ఆ పరిస్థితిలో వారికి సాయంచేయకుండా ప్రభుత్వ విధానాలను మార్చుమని ఇబ్బంది పెట్టడం సరికాదు అని కాంగ్రెస్ పార్టీ నాయకులు చాలామంది భావించారు. అనిబిసెంట్ అభిప్రాయం దీనికి విరుద్ధంగా వుండేది. బ్రిటిష్‌వారు ఇబ్బందులలో పడ్డ తరుణంలోనే భారతదేశం తన స్వాతంత్ర్య

నినాదాన్ని గట్టిగా వినిపించాలని ఆమె ఆశించారు. అరవైఏడు సంవత్సరాల ఆ వృద్ధురాలు ఒక యువతికున్న ఉత్సాహంతో, ఒక యుద్ధవీరునికున్న తెగింపుతో దేశస్వాతంత్ర్య సమరంలోకి దిగింది. స్వాతంత్ర్యం సంపాయించుకోవడానికి భారతీయులకు హక్కు వుందని ఆమె సింహనాదం చేశారు. సోమరితనాన్ని జడత్వాన్ని విడిచి 'హోమ్‌రూల్' ఉద్యమాన్ని బలపరచమని ప్రజలకు పిలుపునిచ్చారు. మేలుకున్న భారతప్రజలు అనిబిసెంట్ నాయకత్వంలో ఏకమయ్యారు. ఈవిధంగా ఆ వృద్ధురాలు భారత స్వాతంత్ర్యపోరాటపు తొలి అధ్యాయాన్ని ప్రారంభించారు. అనిబిసెంట్ సంపాదకత్వంలో మద్రాసునుంచి వెలువడిన 'న్యూ ఇండియా' పత్రిక హోమ్‌రూల్ ఉద్యమానికి సాధనంగా ఉపయోగపడింది. 'హోమ్‌రూల్' 'స్వపరిపాలన' అన్న మాటలు దేశం మొత్తంమీద ప్రతిధ్వనించాయి.

'హోమ్‌రూల్‌లీగ్' శాఖలు పలుచోట్ల ఏర్పాటుచేయబడ్డాయి. మలబారులోను ఒక శాఖ వెలిసింది. ఆ శాఖకు కార్యదర్శిగా నన్ను ఎన్నుకున్నారు. అంతకుముందే నేను కాంగ్రెస్ కార్యదర్శి బాధ్యతలు వహిస్తూవుండేవాణ్ణి. ఆ కాలంలోనే మలబారులో కాంగ్రెస్ ఒక సుస్థిరమైన ఉద్యమంగా పనిచేయడం ప్రారంభించింది.

నేను కోళిక్కోడ్‌లో 'ప్రాక్టీస్' ప్రారంభించడానికి కొన్నిరోజులు కె. మాధవన్ నాయర్ కూడా మంజేరి నుంచి కోళిక్కోడ్‌కు వృత్తిరీత్యా వచ్చి చేరారు. చాలా గట్టి న్యాయవాది అన్నపేరు ఆయనకు వుండేది. మలయాళంలో చక్కగా ఉపన్యసించడంలో గట్టివాడైన ఆయనకు కవితా వ్యాసంగం కూడా వుండేది. ప్రజాజీవితంలో పాల్గొని కృషిచేసే సామర్థ్యం మాధవన్ నాయర్‌కు బాగా వుండేది. సాయంకాలం షికారుకి వెళ్లేప్పుడు ఆయన నన్ను తీసుకువెళ్లేవారు. మా మధ్య అలా పెరిగిన స్నేహం ప్రజాజీవితంలో మా సాన్నిహిత్యానికి దోహదం చేసింది.

న్యాయవాది అచ్యుతన్ మా బృందంలో మరో మిత్రులు. స్వపరిపాలనోద్యమం ఉన్నత జాతి వాళ్ల ఉద్యమం, 'నిమ్నజాతులుగా భావించబడేవాళ్లు అందులో పాల్గొనడం వాళ్లకు ఇష్టంవుండదు' అన్నది నాటి 'మితవాది' పత్రికా సంపాదకులైన న్యాయవాది కృష్ణన్ అభిప్రాయం. న్యాయవాది అచ్యుతన్ ఆ అభిప్రాయాన్ని లెక్కజేయకుండా 'హోమ్‌రూల్' ఉద్యమానికి మద్దతుగా మాతో చేరారు నాడు ప్రారంభించిన ప్రజాజీవితాన్ని ఆయన చివరి వరకూ కొనసాగించారు.

సుప్రసిద్ధులైన మంజేరి రామయ్యర్ మలబార్ హోమ్‌రూల్ ఉద్యమం జీవనాడిగా భావించారు. హాస్యరసం చిందే ఆయన ఉపన్యాసాలు, సాహసవంతమైన చేతలు, తనస్నేహితులతో, అనుచరులతో కలసిమెలసి తిరిగే స్వభావం మలబార్ హోమ్‌రూల్ ఉద్యమానికి బలాన్ని చేకూర్చాయి. అనిబిసెంట్‌ను కీర్తిస్తు ఆమె దారిలో నడిచిన రామయ్యర్ ఆమె కోసం ఎలాంటి త్యాగమైనా చేయడానికి సిద్ధంగా వుండేవారు.

రాజకీయ వ్యవహారాలకు దూరంగా వుండి, ఇతర రంగాలలో కీర్తి నార్జించిన కొందరిని గురించి ఇక్కడ చెప్పు కుందాం. మలబారు మొత్తం మీద ప్రజలకు తెలిసిన డిప్యూటీ కలక్టరు వర్గీన్ ప్రజా సామాన్యం మెచ్చుకునే ప్రభుత్వ అధికారిగా వుండేవారు. నిజాయితీ, దైవభక్తిగల వర్గీన్‌ను సామాన్య ప్రజానీకమే కాకుండా ప్రభుత్వాధికారులూ ప్రేమాభిమానాలతో, విశ్వాసంతో గౌరవించారు. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉద్యమం సాగిస్తున్న సంస్థతో అయన సన్నిహితులు కాలేకపోయారు. నాటి దేశ పరిస్థితుల్ని గమనిస్తే అయన మనేస్థితిని గ్రహించవచ్చు. పదవి నుంచి అయన విరమించి పెన్షన్ తీసుకునే స్థితిలో ప్రజలు చాలామంది అయన సేవలను, మంచి మాటలను, ఆదరణను ఆశిస్తూవెళ్లేవారు.

వర్గీన్ మా నాన్నగారి ఆప్తమిత్రులు. ఆ విధంగా నేను కోళిక్కోడ్‌లో న్యాయవాద వృత్తిని చేపట్టాక, పలు సమయాలలో ఆయన్ని చూడడం కద్దు. దేశపోరాటం గురించి నా అభిప్రాయాలు అయనకు విచారం కలిగించాయి. అయినా నా అభివృద్ధి పట్ల ఆయనకు ఎంతో శ్రద్ధవుండేది. పొడవైన తెల్లటి కోటు, షరాయి, పెద్ద తలపాగాతో ఎవరినయినా ఇట్టే ఆకర్షించే చిరునవ్వుతో వర్గీన్ గారు కలక్టర్ కార్యాలయానికి రావడం ఒకసారి చూస్తేనే చాలు..... మరిచిపోలేము.

నెడుంగాడి బ్యాంకు స్థాపకులు, టి.ఆర్. అప్పు నెడుంగాడి. ఆ కాలంలో కోళిక్కోడ్ న్యాయవాదుల్లో సుప్రసిద్ధులైన వారు, నేను కోళిక్కోడ్‌లో వృత్తి ప్రారంభించిన తొలిరోజులలో .ఆయన ప్రభుత్వ వకీలుగా ఉండేవారు. ఉద్యోగవిరమణ చేసిన తర్వాత, నెడుంగాడి బ్యాంకు స్థాపించి, దానిని సుస్థిరం చేయడంలోనే నిమగ్నులైపోయారు. తెల్ల వాళ్లమీద, వాళ్ల అలవాట్లు ఆచరవ్యవహారాల మీద నెడుంగాడికి ఎంతో మోజు వుండేది. కాంగ్రెస్‌లోగానీ, జాతీయ ఉద్యమంలో గానీ అయనకు ఏ మాత్రం ఆసక్తి వుండేదికాదు. భారతీయులు స్వపరిపాలన చేసుకోవడానికి తగ్గవారు అన్న నమ్మకం కూడా ఆయనకు లేదు. కార్యదక్షత, ఉద్యోగంచేసే తీరూ, ఎంతో గౌరవంగా మసులుకొనే నెడుంగాడిని ఒక సుప్రసిద్ధుడైన బ్యాంకు అధినేతగా ఉన్నత స్థితికి తీసుకువచ్చాయి. మలయాళ భాషలో తొలి కాల్పనిక కథారచయితగా కూడా అప్పు నెడుంగాడి కీర్తి గడించారు.

ప్రజలకు ఓ మాదిరిగా తెలిసిన మరోవ్యక్తి, 'మితవాది' పత్రికా సంపాదకులు సి. కృష్ణన్. ఆయన న్యాయవాదిగా వుండికూడా వృత్తిలో అంత ఆసక్తి కనబరచలేదు. తన జాతి ప్రజల ప్రగతికి ఆయన కృషి చేస్తూవచ్చారు. దళిత వర్గాల స్థితి మెరుగుకాకముందే ఇండియా స్వతంత్రం పొందినట్టుయితే, అది అగ్రవర్ణాల ప్రభుత్వంగానే వుంటుందనీ, అది ఉభయులకూ మంచి చేయదనీ కృష్ణన్ అభిప్రాయపడ్డారు. రాజకీయ వ్యవహారాలలో మేమిద్దరం కలిసి పనిచేయడం కఠినంగా వున్నప్పటికీ, అస్పృశ్యతా నివారణ పట్ల మా యిద్దరి మధ్య అభిప్రాయభేదాలు లేవు. ఆ రోజుల్లో కోళిక్కోడ్‌లో దేవాలయం ముందున్న బాటలో కూడ నిమ్నజాతుల

వాళ్లు నడవడం సాధ్యంకాదు. అలా నడిచివెళ్లడాన్ని నిషేధిస్తూ, ఒక నోటీస్ బోర్డు కూడా అక్కడవుండేది.

ఈ అవినీతిని సమూలంగా నిర్మూలించాలని మేము నిశ్చయించాము, ఒక రోజు మంజేరి రామయ్యార్, కె. మాధవన్ నాయర్, సి. కృష్ణన్, నేనూ, నిషేధించబడ్డ ఆ వీధిలో నడిచాము. రామయ్యార్, మాధవన్ నాయర్, నేనూ ఆ వీధిలో నడవడానికి ఎలాంటి నిషేధమూ లేదు. సి. కృష్ణన్‌ను ఎవరైనా అడ్డుపడి ఆపారంటే ఆయనకు మా మద్దతును తెలియజెయ్యాలనే మేము అలా కలిసి నడిచాము. ఆ రోజు ఎలాంటి అవాంఛనీయమైన సంఘటనా జరగలేదు. అయినప్పటికీ అటువంటి చట్టాన్ని అతిక్రమించే చర్యలో దిగడానికి కృష్ణన్ అయిష్టంగానే అంగీకరించారు.

తెల్లటి ప్యాంట్, నల్లకోటు, పట్టు తలపాగాతో, చందనం బొట్టుపెట్టుకుని వుండే సి. కృష్ణన్, న్యాయవాదుల సంఘు కార్యాలయానికి వచ్చారంటే సామాజిక సమస్యలను గురించి మాట్లాడకుండా వుండేవారు కారు. కాంగ్రేస్‌నూ, హోమ్‌రూల్ ఉద్యమాన్ని ఆయన ద్వేషించారనే చెప్పాలి. జాతిభేదాలు నిర్మూలించకుండా, పరిపాలనాధికారం చేపట్టడం సాధ్యంకాదనే ఆయన వాదించే వారు. వివాదం ఎంత తీవ్రంగా కొనసాగినప్పటికీ కృష్ణన్‌కు కోపంరాదు. ఆయన ముఖంలో అప్పుడు కూడ చిరునవ్వు వెలిగేది. ఇవాళ కృష్ణన్ బ్రతికి ఉన్నట్టయితే ఆయన అభిప్రాయాలు ఎలా వుండేవనీ వూహించడం ఆసక్తి దాయకమైన అంశం. అభిప్రాయభేదాలు ఎలావున్నప్పటికీ కృష్ణన్ నాకెంతో అభిమాన పాత్రమైన మిత్రులు.

1916వ సంవత్సరంలో ఏప్రిల్ నెలలో పాల్‌ఘాట్‌లో ప్రథమ మలబార్ జిల్లా మహాసభ సమావేశమయింది. దానికి అనిబిసెంట్ అధ్యక్షత వహించారు. స్వపరిపాలన హక్కు గురించి తీర్మానాన్ని సమావేశంలో ప్రవేశపెట్టేనేనే మాట్లాడాను. అటువంటి ఉపన్యాసాలు ప్రభుత్వానికి వ్యతిరేకమైనవనీ, అది నా వృత్తి వ్యవహారాలకు యిబ్బంది. కల్గిస్తుందనీ కొందరు బంధువులూ, మిత్రులు నన్ను హెచ్చరించారు.

1917వ సం॥ ఏప్రిల్ నెలలో రెండవ మహాసభ కోళిక్కోడ్‌లో జరిగింది. నేను మహాసభకార్యదర్శులలో ఒకరిగా వున్నాను. కె.పి. రామన్ మీనన్, ఆహ్వాన సంఘం అధ్యక్షులు. కోళిక్కోడ్‌లో సుప్రసిద్ధులైన న్యాయవాదుల్లో అగ్రస్థానం వహించిన చట్ట నిపుణుడాయన. పూర్తిగా, ప్రజాజీవితంలో పాల్గొనకపోయినప్పటికి ఎంతో ప్రేమగా మాకు సలహాలు యివ్వడానికి, మద్దతు నివ్వడానికి రామన్‌మీనన్ వెనుకాడలేదు.

మహాసభ జరగడానికి 'మానాంజిర' మైదానంలో పందిరి వేయడానికి ఆనాటి కలెక్టర్ 'ఇన్నిస్' అనుమతి యివ్వలేదు, అందువల్ల రామన్ మేనన్ యింటిముందు అంతకు ముందే వేసిన పందిట్లో మహాసభ జరిగింది. సి.పి. రామస్వామి అయ్యార్ ఆ సభకు అధ్యక్షత వహించారు. ముఖ్య అతిధిగా అనిబిసెంట్ కూడా వచ్చారు. ఆ రోజు వారికి కోళిక్కోడ్ ఘనంగా స్వాగతం పలికింది. ఈ విధంగా హోమ్‌రూల్ లీగ్ కార్యకలాపాలలోను, మహాసభలకు,

బహిరంగ సభలకూ నేను ఎక్కువ కాలం వినియోగించేవాణ్ణి. వృత్తి రంగంలో సంపూర్ణంగా కృషిచేయవలసిన కాలంలో ప్రభుత్వ వ్యతిరేక చర్యల్లో పాల్గొనే నా అవివేకం, అమాయకత్వం గురించి నా శ్రేయోభిలాషులు చాలమంది సలహాలు యిచ్చారు. అయినప్పటికీ నిరోధించడానికి సాధ్యంకాని ఉద్వేగం నన్ను రాజకీయాలకు మరింత సన్నిహితం చేసింది.

'పాలిటిక్స్' లో నేను పెద్ద శూరుణ్ణిని మందత్తు కృష్ణన్ నాయర్ గ్రహించారు. ఆ రోజుల్లో కృష్ణన్ నాయర్ తిరువిదాన్కూర్ దివాన్. ఆయన అప్పుడు నాకు రాసిన ఉత్తరం.

'వృత్తి ప్రారంభించిన కాలంలోనే అది మరీ మరీ అభివృద్ధి కావడానికి పునాదుల్ని సుస్థిరం చేసుకోవాలి. వ్యాజ్యాలలోతుల్ని పరిశీలించి, వాటికి సంబంధించిన సూక్ష్మాలను పరిశోధించి తెలుసుకోవాలి. పార్టీలతో సగౌరవంగా మాట్లాడాలి. న్యాయమూర్తికి విసుగుకలగకుండా విషయాలను తెలియజెయ్యాలి, వీటన్నిటినీ ప్రారంభంలో అలవాటు చేసుకుంటేనే వృత్తి అభివృద్ధిచెందుతుంది. ప్రజలకు సేవచేసే అవకాశం క్రమంగా కలుగుతుంది. అప్పుడు మాత్రమే ఆ రంగంలో దిగాలి. లేకుంటే ప్రాక్టీసు లేదనే అనుకుంటారు'. అంటూ ఆయన నాకు సూచనలు తెలిపారు. ఈ ఉత్తరం నాలో కొంత నిరుత్సాహం కల్గించింది.

వృత్తిలో ఉన్నత స్థితికి రావాలనే ఆశ ప్రజాజీవితంలో సంపూర్ణంగా పాల్గొనాలనె ఉత్సాహం, ఆసక్తి ఈ రెండూ, ఒకటిగా కలిసి, కృషి చేయడం సాధ్యమేనా అన్న ప్రశ్నలో తలెత్తి నన్ను వేధించసాగింది.

# హోమ్‌రూల్ ఉద్యమం

నేను న్యాయవాద వృత్తి ప్రారంభించిన కాలం లోనే కుటుంబ బాధ్యతలు నాకు ఎక్కువగా వుండేవి. నా విద్యాభ్యాసం పూర్తయ్యే లోపల నాన్నగారు కాలధర్మం చెందారు. అందువల్ల నా విదేశీ చదువులకైన ఖర్చులకు కొంచెం అప్పు చేయవలసి వచ్చింది. దానిని తీర్చవలసిన బాధ్యత నా మీద పడింది. దైనందిన ఖర్చులకు కావలసిన డబ్బు సంపాయించడానికే కొట్టుమిట్టాడుతున్న కాలంలో ఈ బాధ్యత నాకు అదనపు భారమయింది. చాలా మంది మిత్రులు, ప్రజాజీవితంలో చూపే శ్రద్ధను వృత్తిమీద చూపమని నాకు సలహా ఇచ్చారు. మానాన్న గారు బ్రతికి వుంటే ప్రభుత్వానికి వ్యతిరేకమైన కార్యక్రమాలలో నేను పాల్గొనడాన్ని అనుమతించేవారు కారనీ, ఆయన తర్వాత కుటుంబాన్ని నిర్వహించవలసిన బాధ్యత నాకు వుందనీ ఆ బాధ్యతను నిర్వర్తించడమే నా మొట్టమొదటి కర్తవ్యమని వారు నాకు రకరకాలుగా తెలియజెప్పారు.

ఆ బాధ్యతలను నేను మరచిపోలేదు. వాటిని నెరవేర్చడానికి ప్రయత్నాలు చెయ్యకుండా వూరుకోలేదు. అయితే ప్రజాజీవితం నుంచి పూర్తిగా విరమించడానికి నా వల్ల వీలుకాలేదు. వృత్తికి ఆటంకం రాకుండా ప్రజాజీవితంలోనూ పాల్గొనడం సాధ్యమేనని నాకు నమ్మకం కుదిరింది. దానికి తగ్గ విధంగా నా సమయాన్ని క్రమబద్ధం చేసుకోవాలని నిర్ణయించుకున్నాను.

ఉదయం అయిదు గంటలకు లేచి 'లా' పుస్తకాలు చదివేవాణ్ణి. స్నానం చేసిన తర్వాత కొంతసేపు మనసుకు ఉత్సాహం, ప్రేరణ కలిగించే పుస్తకాలను చదివే అలవాటువుంది. తరువాత విచారణకు వచ్చే కేసుల వ్యవహారాలు చూడడానికీ, సాక్షులను కలిసి మాట్లాడడానికి సమయాన్ని కేటాయించాను. కేసు వున్నా లేకపోయినా, రోజూ కోర్టుకి వెళ్లే వాణ్ణి. అక్కడి నుంచి వచ్చిన తర్వాత వార్తాపత్రికలు చదివేవాణ్ణి. అయిదు గంటలకు వ్యాహ్యాళికి బయలుదేరేవాణ్ణి లేదా బహిరంగ సభలు వుంటే అక్కడికి వెళ్లేవాణ్ణి. రాత్రి భోజనం అయ్యాక రెండుగంటల సేపు చదివే వాణ్ణి. సాహిత్యం, చరిత్ర, రాజకీయాలు, జీవిత చరిత్రలు, తత్వశాస్త్రం మొదలైన వివిధ విషయాలను చదివి తెలుసుకోవాలనే ఆసక్తి నాకు ఎక్కువ. పేకాట, క్లబ్ మొదలైన వినోదాల పట్ల నాకు ఆనాడూలేదు. ఈ నాడూలేదు.

కొందరు మిత్రులు ప్రతి ఆదివారమూ ఒక చోట కలుసుకోవడానికి ఏర్పాటుచేశారు. అంతకు ముందే నిర్ణయించుకున్న విషయం గురించి, అప్పుడు అక్కడ చర్చించడం అలవాటు చేసుకున్నాం. ఈ సమావేశానికి

ఎక్కువగా, యువన్యాయవాదులు వచ్చేవారు. ఒక్కొక్క ఆదివారం ఒక్కొక్కరి ఇంట్లో సమావేశం జరిగేది. టీ తర్వాత చర్చ ప్రారంభమయ్యేది. రెండుగంటల సేపు ఆ చర్చ కొనసాగేది. ఈ ఏర్పాటు ఫలితంగా యువకులైన న్యాయవాదులకు, ప్రజాజీవితం గురించి ఆలోచించడానికి, తెలుసుకోవడానికి అవకాశం ఏర్పడింది. కాంగ్రెస్ కమిటీకి గాని, హెూమ్‌రూల్ కమిటీకి గాని, ఈ సంస్థతో ఎటువంటి సంబంధమూ లేదు. అయినప్పటికీ వాటితో సంబంధం పెంచుకోవడానికి ఈ సమావేశాలు దోహదం చేశాయి. యువకులే కాకుండా కొందరు వృద్ధులైన న్యాయవాదులు కూడా ఈ చర్చల్లో పాల్గొనేవారు. న్యాయవాదులు కాని వారుకూడా వచ్చేవారు.

1916వ సం॥ లక్నోలో జరిగిన కాంగ్రెస్ మహాసభలకి నేను మొట్టమొదటి సారిగా వెళ్లాను. భారీ ఎత్తున జరిగిన ఒక కాంగ్రెస్ మహాసభకు వెళ్లడం అన్నది అదే ప్రథమం. అంబికా చరణ్ మజుందార్ మహాసభ అధ్యక్షుడు. ఆ సమావేశంలోనే నేను ప్రప్రథమంగా మహాత్మాగాంధీని, లోకమాన్యతిలక్‌ను, బాబూ సురేంద్రనాథ్ బెనర్జీని చూశాను. ప్రథమ ప్రపంచ సంగ్రామమం జరుగుతూవుండడం వల్ల కాంగ్రెస్ వారిని సంతోషపెట్టే ఉద్దేశంతో ఆ రోజులలో ఐక్య రాష్ట్ర గవర్నర్‌గా వున్న జేమ్స్‌మెస్టన్, కాంగ్రెస్ మహాసభకు వచ్చి ఉపన్యాసం కూడా ఇచ్చారు. కాంగ్రెస్ ఆవిర్భవించిన సంవత్సరమే 'సర్వీస్' లో చేరినట్టు, ఆ మహాసంస్థ పట్ల తనకు అమిత గౌరవం వుందనీ ఆయన అప్పుడు చెప్పారు. సభికులను సంతోషం పెట్టడానికి చెప్పిన మాటలు అవి.

అనిబిసెంట్ నాయకత్వంలో ప్రారంభమైన హెూమ్‌రూల్ ఉద్యమం రోజురోజుకూ బలపడుతూ వచ్చింది. ఆ ఉద్యమం, యుద్ధచర్యలకు ఆటంకం కలిగిస్తోందని ఆరోపించి, అనిబిసెంట్‌ను, ఆమె సహచరులు అరుండేల్, వాడియా మొదలైనవారిని కస్టడీలో వుంచడానికి ప్రభుత్వం నిర్ణయించి, వారిని ఖైదు చేసింది. అప్పుడు ఆ నాయకులను విడుదల చేయాలని దేశవ్యాప్తంగా పోరాటం ప్రారంభమైంది. కోళిక్కోడ్ లోను అందుకు నినాదాలు ఘోషిస్తూ ప్రజలు నగరవీధుల్లో ఊరేగింపుగా తిరిగారు. కాంగ్రెస్ కమిటీకి, హెూమ్‌రూల్ కమిటీకి నేను కార్యదర్శిగా వుండడం వల్ల ఊరేగింపు, బహిరంగ సభ నేనే ఏర్పాటు చేసినట్లు జిల్లా అధికారులు భావించారు. నాతో సన్నిహితంగా వుండేవారిని సైతం, అధికారులు అనుమానంతో చూశారు. నా మిత్రులుగా వున్న కొందరు అధికారులు, మరి కొందరు మా ఇంటికి రావడానికి, నాతో మాట్లాడడానికి ఇష్టపడక దూరమయ్యారు. 'దారి తప్పిన యువకుడు' అని నాగురించి భావించారు. ఆ అభిప్రాయాన్ని ధృవపరిచేట్టుగా ఆరోజులలోనే ఒక సంఘటన జరిగింది.

మద్రాసు గవర్నర్ కోళిక్కోడ్‌కు రాబోతున్నారు. అప్పుడు యుద్ధనిధి కోసరం వారికి ప్రజల తరఫున కొంతనిధి ఇవ్వడానికి కొందరు ప్రముఖులు నిర్ణయించారు. అందుకోసరం కోళిక్కోడ్ టౌన్‌హాల్‌లో ఒక సభ జరిపారు. ఆ నాటి ప్రముఖులు కొందరి అభిప్రాయానుసారం, కోళిక్కోడ్ పురపాలక అధ్యక్షుడు సి.వి. నారాయణ మీనన్ ప్రజలను సమావేశపరచి ఆ సభ

ఏర్పాటు చేశారు. ప్రజల తరఫున నిధి అందిస్తున్నట్లు ఒక తీర్మానాన్ని సభలో తీసుకువచ్చినట్లయితే, అందుకు నేను వ్యతిరేకించగలనని ముందుగానే నేను నారాయణ మీనన్‌కు తెలియజేశాను. ఈ వార్త టౌన్‌హాల్లో సమావేశమైన ప్రజలను విశేషంగా ఆకర్షించింది. కలెక్టర్ ఇవాన్స్ సభకు అధ్యక్షత వహించారు. జిల్లా న్యాయమూర్తి జాక్సన్, పోలీస్ సూపరింటెండెంట్ మొదలైన పెద్ద అధికారులతో, దివాన్ బహద్దూర్ కేళు ఇరాడి, కవళప్పార ముప్పిన్ నాయర్ మొదలైన పురప్రముఖులు పలువురు వేదిక మీద ఆసీనులయ్యారు. నేనూ, మంజారి రామయ్యర్, కె. మాధవన్ నాయర్ మొదటి వరుసలో కూర్చున్నాము. ఘర్షణ ఏదీ జరగకుండా వుండడంకోసం సైనికులను కొందరిని టౌన్‌హాల్ ముందు నిలబెట్టారు. కలెక్టర్ సమావేశానికి వచ్చి అధ్యక్షస్థానంలో ఆసీనులయ్యారు. సమావేశం ఉద్దేశాన్ని వివరిస్తూ ఒక యువకుడు ప్రసంగించడంతో సమావేశం ప్రారంభమైంది. మొదటి తీర్మానాన్ని ప్రతిపాదించడం కోసం, అధ్యక్షుడు - కవళప్పార ముప్పిల్ నాయర్‌ను పిలిచారు.

గవర్నర్ కోళిక్కోడ్ వచ్చినప్పుడు ప్రజల పేరుతో యుద్ధనిధికి డబ్బు ఇవ్వడం గురించిన తీర్మానం అది. ఆ తీర్మానాన్ని దివాన్ బహదూర్ కేళు ఇరాడి బలపరిచారు. ఇది జరిగిన వెంటనే నేను లేచి నిలబడి, పై తీర్మానం గురించి కొన్ని మాటలు చెప్పడానికి అధ్యక్షుని అనుమతి కోరాను. అధ్యక్షుడు అంగీకరించారు. నేను వేదిక మీదకి వచ్చాను. రెండు నిముషాల పాటు చెలరేగిన కరతాళ ధ్వనులు నాకు ఉత్సాహాన్ని కలిగించాయి. నేను మలయాళంలో ప్రసంగించడం మొదలు పెట్టాను. 'గౌరవనీయులైన అధ్యక్షమహాశయా' అని నేను అనగానే అధ్యక్షునికి కోపం వచ్చేసింది. ఆయన వెంటనే లేచి నేను మలయాళంలో మాట్లాడటానికి సమ్మతించడం లేదని చెప్పారు. 'ఇక్కడున్న ప్రజలు మలయాళం మాట్లాడేవాళ్లు, ఇంగ్లీషు భాష అర్థంకానివాళ్లు చాలామంది ఇక్కడ వున్నారు. వారి తరఫున తీసుకువచ్చిన తీర్మానం ఏమిటో తెలుసుకునే హక్కువారికుంది. అందువల్ల నేను మలయాళంలో మాట్లాడతాను' అని నేను జవాబు చెప్పడంతో హాలు లోపలా, బయట గుమిగూడిన ప్రజల కరతాళధ్వనులతో ఆ ప్రదేశం ప్రతిధ్వనించింది. ఏమి జరుగనున్నదో అని ప్రజలు ఉద్వేగం చెందారు. 'మలయాళంలో..... మలయాళంలో' అని అరిచారు. అధ్యక్షుడు 'ఏమైనా సరే మలయాళంలో మాట్లాడటానికి అనుమతించను' అన్నారు కఠినంగా. నేను కూడా 'అలాగయితే ఆత్మగౌరవం వున్న మలయాళీలు ఈ సమావేశంలో పాల్గొనరు' అని చెప్పి టౌన్‌హాల్ నుంచి వెలుపలికి వచ్చేశాను. టౌన్‌హాల్‌లో వున్న చాలామంది ప్రజలూ నన్నే అనుసరించారు. ప్రభుత్వ అధికారులూ, వారికి సంబంధించిన వారు మాత్రమే అక్కడ మిగిలారు. నగరంలో పెద్ద సంచలనాన్ని సృష్టించిన సంఘటన ఇది. దీని తర్వాత నన్ను ఖైదు చేయనున్నారన్న వదంతి కూడా నగరంలో కొన్ని రోజులు వ్యాపించింది.

తెల్ల అధికారులు నామీద కోపంగా వున్నట్లు పలువురు అనుకున్నారు. అందువల్ల వారి సమక్షంలో విచారణకు వచ్చే కేసులకు హాజరు కావడానికి నా దగ్గరకు వచ్చేవారు తగ్గారు. ఆ రోజులలో అన్ని ముఖ్యమైన శాఖలలోను తెల్లవాళ్లే అధికారులుగా వుండేవారు. అయినప్పటికీ, కొన్ని వ్యక్తిగత కారణాలవల్ల తెల్లవారి సమక్షంలో నేను కేసు జరిపించే సందర్భాలూ వచ్చాయి. అటువంటి ఒక కేసు కోళిక్కోడ్ సబ్‌డివిజనల్ మేజిస్ట్రేటు మిస్టర్ హాల్ ముందు విచారణకు వచ్చింది.

మహమ్మదీయులలో అహమదీయులు అనే ఒక శాఖ వుంది. వారి మధ్య విశేషమైన ఆసక్తిని సృష్టించిన కేసు అది. నిందితుని తరఫున ఇద్దరు ప్రముఖ న్యాయవాదులు హాజరయ్యారు. ప్రత్యర్థి సాక్షులను సక్రమంగా విచారించడానికి మేజిస్ట్రేటు వారిని అనుమతించలేదు. ఆ కారణం చేత, రెండురోజుల విచారణ తర్వాత, వారు నా దగ్గరకు వచ్చారు. వారు కోరిన ప్రకారమే నేనా కేసును స్వీకరించాను. ఆ న్యాయవాదులు కూడా నాకు సాయంగా నిలిచారు. మేజిస్ట్రేటు కోర్టులో విచారణ జరిగింది. ప్రజలు లోపలా, బయటా గుమిగూడారు. పదకొండు గంటలకు విచారణ ప్రారంభమైంది. మొదటి రోజు విచారణ జరిపిన సాక్షిని, మరి కొన్ని ప్రశ్నలు అడగడానికి నన్ను అనుమతించాలని కోరాను. మేజిస్ట్రేటు అందుకు అనుమతి ఇవ్వడానికి అంగీకరించలేదు. నేను మళ్లీ 'కొన్ని అరబిక్ మాటలకు సాక్షులను విచారించాకే అర్థం తెలుసుకోవాలి' అన్నాను. మేజిస్ట్రేటు 'సాక్షికి అరబిక్ భాష తెలియదు' అన్నారు. 'అయితే ఆ విషయం ఆ సాక్షినే చెప్పనివ్వండి' అన్నాను నేను పట్టుదలగా. మేజిస్ట్రేటు నన్ను కోపంగా చూసి 'వీలుకాదు. నేను అంగీకరించలేదు' అన్నారు. 'అలా అయితే నేను ఈ ప్రశ్నను అడిగాననీ, దానిని కోర్టు అనుమతించలేదనీ నమోదు కావాలి' అన్నాను. అందుకు మేజిస్ట్రేటు ఒప్పు కోలేదు. అప్పు డు ఆ ప్రశ్నలతో పాటు ఒక విన్నపంరాసి మేజిస్ట్రేటు చేతికిచ్చాను. ఆయన అది చదివి 'కోర్టు అనుమతించని ప్రశ్నలకన్నిటికీ విన్నపం రాసి ఇవ్వడానికా మీరు వచ్చారు?' అని అడిగారు. 'ఆ పరిస్థితి ఏర్పడవచ్చుననే నేను సిద్ధంగా వచ్చాను' అని ప్రత్యుత్తరమిచ్చాను. అది తీసి వుంచుకుని సాక్షిని నేను విచారించడానికి ఆయన అనుమతించారు.

దీని కంతటికీ కొంత సమయం పట్టింది. గుమికూడిన వారందరూ నేనూ, మేజిస్ట్రేటు వాగ్వాదం జరపడం జాగ్రత్తగా గమనిస్తూ వచ్చారు. ఆ రోజు నేను న్యాయస్థానం నుంచి బయటకు వచ్చినప్పు డు మిస్టర్ హాల్ నా దగ్గరకు వచ్చి, నావీపు మీద ఒక చేయివుంచి మందహాసంతో 'నేను మీ క్లయింట్‌ను శిక్షించబోతున్నాను. అటువంటప్పు డు ఎందుకు ఈ ఆర్భాటమంతా?' అని ప్రశ్నించారు. 'అది నాకూ తెలుసు. అందువల్లే అప్పీలుకు కావలసిన సాక్ష్యాలను నేను సేకరించుకుంటున్నాను' అన్నాను.

ఆ రోజు అలా అయింది.

మర్నాడు విచారణ అద్భుతంగా జరిగింది. మేజిస్ట్రేటు ఎటువంటి ఇబ్బంది కల్గించలేదు. చాలా గౌరవంగా మాట్లాడారు.

వాగ్వాదాలు ముగిసిన తర్వాత తీర్పు మర్నాటికి వాయిదా వేశారు. నేను, నా క్లయింట్‌లు ఆశ్చర్యపడే విధంగా, మేజిస్ట్రేటు - నా క్లయింట్‌లు నేరస్థులుకారని భావించి వారిని విడుదల చేశారు. అది నాకు గొప్ప విషయం.

ఆ కేసులో విజయం సాధించిన ఆ రోజునే-నేను టౌన్‌హాల్‌లో కలెక్టర్‌ను ఎదుర్కోవడం సంభవించింది.

# స్వక్రమమైన దేశసేవలు

ఐకమత్య ధోరణితో నిర్మాణాత్మకమైన ప్రజా కార్యక్రమాలు భారతదేశంలో ప్రారంభించిన వారు అనీబిసెంట్ గారే. 1921 సం॥లో ప్రారంభించిన సహాయ నిరాకరణోద్యమంలా హెూమ్‌రూల్ ఉద్యమం శక్తివంతంగా విస్తరించి అభివృద్ధి చెందలేదనడం నిజమే. అయినప్పటికీ కేవలం ఉపన్యాసాల ద్వారానే రాజకీయ స్వాతంత్ర్యం సాధించలేము; వాటితో పాటు ఐకమత్యం, నిర్మాణాత్మకమైన కార్యక్రమం అవసరమని గ్రహించి, అమితోత్సాహంతో భారతదేశంలో వాటిని ప్రారంభించారు అనిబిసెంట్. మతానికి సంబంధించి, విద్యారంగంలోనూ, సామాజిక వికాసం దృష్ట్యా అంతవరకు కృషి చేస్తూవచ్చిన అనిబిసెంట్ జాతీయరంగంలోకి ప్రవేశించడంతో స్వాతంత్ర్యోద్యమానికి నూతనోత్తేజం, వేగం సమకూరాయి. అనిబిసెంట్ తాను బాధ్యత వహించే ఏ కార్యాన్నయినా ఉత్సాహంతో సమర్థవంతంగా నిర్వహించగల దక్షురాలు. ఆమె కార్యదక్షత, కృషి, వాగ్ధాటి ఆమెతో సన్నిహితంగా మెలగినవారు ఎన్నటికీ మరువలేని అరుదైన అంశాలు.

మలబార్‌లోని హెూమ్‌రూల్ లీగ్ కార్యదర్శిగా నేను చాలా సార్లు అనిబిసెంట్ గారిని కలుసుకోవడానికి, సన్నిహితంగా వుండడానికి అవకాశాలు లభించాయి. పలు సందర్భాలలో ఆమెతో కలిసి నేను ప్రయాణం చేశాను.

ఒక బహిరంగ సభలో ఉపన్యసించడానికి అంగీకరించినట్లయితే, నిర్ణీత సమయానికి ముందే ఆమే ఆ ప్రదేశానికి చేరుకునే వారు. ఉపోద్ఘాతం ఏదీ లేకుండానే అసలు విషయానికి వచ్చేవారు. నిర్ణీత సమయానికి సరిగ్గా ఉపన్యాసం ముగించేవారు. ఉపన్యాసంలో మాటలు, భావాలు ఎలాంటి ఆటంకం లేకుండా ప్రవాహంలా సాగిపోతూవుండేవి. మధురమైన కంఠస్వరం ఆమెది. ఒక్క నిముషం కూడా ఆమె వృధాగా గడిపేవారు కారు. కారులోనే, రైలు లోనే ప్రయాణం చేస్తున్నప్పుడు కూడా ఆమె ఏదో ఒక పని కల్పించుకుని, చేస్తూవుండేవారు.

మద్రాసు నుంచి ఢిల్లీకి నేను అనిబిసెంట్ గారితో ప్రయాణం చేసిన ఘట్టం నాకు జ్ఞాపకం వస్తోంది. రిజర్వ్ చేయబడిన 'కూపే'లో ప్రయాణం చెయ్యడం ఆమెకు అలవాటు. ఇంట్లో పనులు చేసుకున్నట్లే ప్రయాణం చేస్తున్నప్పుడు కూడా ఆమె పనులు చేసుకుంటూ వుండేవారు. వేకువ జామున నాలుగు గంటలకే నిద్రలేచి, స్నానం చేసి, ధ్యానం చేసిన తర్వాత ఆ నాటి కార్యక్రమాలు ప్రారంభించేవారు. అన్నిపనులు నిరాటంకంగా చేసుకుపోయే అనిబిసెంట్ అభిప్రాయాలతో, విశ్వాసాలతో ఏకీభవించని వారుసైతం, ఆమె అసాధారణ శక్తి వంతురాలని భావించారు. ఆమె పని చేసేతీరు, ఆ క్రమశిక్షణ మొదలైన

వాటిని చూసి నేర్చుకోవాలి. హోమ్‌రూల్ ఉద్యమ కాలంలో ఆమెతో కలిసి వివిధ కార్యక్రమాలలో పాల్గొనే అవకాశం లభించడం మహాభాగ్యంగా నేను భావిస్తున్నాను.

1917వ సంవత్సరాంతంలో పరిపాలనా విధానాల సంస్కరణ గురించి భారతీయుల భావాలు తెలుసుకోవడానికి, అప్పుడు భారత సెక్రటరీగా వున్న మాంటేగ్ భారతదేశానికి అరుదెంచారు. హోమ్‌రూల్ లీగ్ ప్రతినిధులు అప్పుడు ఆయనకో నివేదికను సమర్పించారు. అనిబిసెంట్ గారి అధ్యక్షతనే అది జరిగింది. ఆ ప్రతినిధులలో నేను వున్నాను. లోకమాన్యతిలక్, ఆ రోజు ఢిల్లీలో మాంటేగ్‌ను చూడడానికి వచ్చారు.

రాజద్రోహనేరం ఆరోపించబడి, ఆరు సంవత్సరాలు జైలు శిక్ష అనుభవించిన తర్వాత 1919వ సం॥లో తిలక్ మళ్లీ జాతీయోద్యమ రంగంలో ప్రవేశించారు. పంచకట్టుకుని, కోటువేసుకుని, మహారాష్ట్ర పద్ధతిలో తలపాగా కట్టుకుని, మెడచుట్టూ కండువాతో, చేతికర్రతో కనిపించేవారు తిలక్. తన ఆదర్శాలతో ఆయన గొప్ప ప్రజానాయకుడిగా భాసించారు. పత్తయిన మీసం, ప్రకాశవంతమైన కళ్లు, ఆయన హుందాతనాన్ని ద్యోతకం చేసేవి. త్యాగతిలకంగా వెలిగిన ఆయన జీవిత చరిత్ర ఎంతో ఉత్తేజం కల్గించేవి. తిలక్, అనిబిసెంట్ ఆనాటి భారతజాతీయ రంగంలో ఇద్దరు మహానాయకులు.

ఆ రోజులలో మహాత్మాగాంధీ కూడా ఢిల్లీలో వున్నారు. రాజకీయ రంగంలోకి గాంధీ అప్పటికీ పూర్తిగా ప్రవేశించలేదు. ఖద్దరు పంచ, చొక్కాతో తలపాగా చుట్టుకుని, ఆ రోజు వచ్చిన వారితోపాటు నిలబడి వైస్రాయ్‌ని, మాంటేగ్‌ను సందర్శించడానికి వచ్చారు. ఆ రోజే నేను మహాత్మాగాంధీతో మొట్టమొదటిసారిగా మాట్లాడాను.

సి.పి. రామస్వామి అయ్యర్, ఆర్. రంగస్వామి అయ్యంగార్, రాజగోపాలాచారి, సేలం విజయ రాఘవచారి, సత్యమూర్తి, నరసింహయ్యర్ మొదలైన దక్షిణాది నాయకులను పరిచయం చేసుకునే అవకాశం నాకు అప్పుడే ఏర్పడింది. సి.పి. రామస్వామి అయ్యర్ హోమ్‌రూల్ ఉద్యమంలో ప్రముఖ నాయకులు కూడా. శక్తి సామర్థ్యాలుగల న్యాయవాదిగా ప్రసిద్ధిగాంచిన ఆయన, జాతీయ రంగం లోనూ, సాహితీరంగంలోనూ సుప్రసిద్ధులుగా రాణించారు. ఏ విషయాన్నైనా సులువుగా అవగాహన చేసుకునే చాకచక్యం ఆయనకు వుండేది. ఎటువంటి సభలో నైనా సరే ఉపన్యసించే సామర్థ్యం కలిగివుండేవారు. ఆ తర్వాత కాలంలో ఆయన మార్గం మరోవైపుకి మళ్లినప్పటికీ, స్వాతంత్ర్యోద్యమం పట్ల ఆ రోజులలో ఆయన చూపిన అండదండలు మరువ రానివి.

ఒక కాలఘట్టంలో ఒకే లక్ష్యం ఏర్పరచుకుని కలిసిమెలిసి పనిచేసే అనుయాయుల మధ్య కాలక్రమేణ అభిప్రాయభేదాలు తలెత్తడంతో వేరువేరు మార్గాలలో విడిపోయారనే అనుకుందాం. అప్పుడు తమ మార్గమే ఉత్తమం; ఎదుటి వారిది సరైనది కాదు అని వారిని విమర్శించే స్వభావం చాలా మందికి వుంది. రకరకాల స్వభావాల మనుషులు జీవించే ఈ ప్రవాహంలో మనిషి

స్వతంత్రంగా అభివృద్ధి చెందాలంటే తప్పని సరిగా సహనం వుండి తీరాలి. మనం ఎదుటి వారి చిత్తశుద్ధిని శంకించేప్పు డు, ఎదుటి వారికి మన చిత్తశుద్ధిని గురించి ప్రశ్నించే హక్కు వుందన్న విషయం గుర్తుంచుకోవాలి. చాలా వున్నతమైన పదవిలో వుండేవారు సైతం కొన్ని సందర్భాలలో ఏమాత్రం జంకుగొంకు లేకుండా ఇతరుల లోపాలను ప్రస్తావించడం వింటే ఆశ్చర్యం కలుగుతుంది.

సేలం నరసింహయ్యర్ అనిబిసెంట్ మద్దతుదార్లలో ప్రముఖులు. హోమ్‌రూల్ ఉద్యమ రోజులలో అమితోత్సాహంతో పాటుపడినవారు. ఒకసారి ఆయన కుమార్తెలు ఇద్దరు అకాల మరణం పొందారు. ఆ దుఃఖాన్ని తట్టుకోలేని ఆయన లౌకిక వ్యవహారాలను త్యజించి, తన ఆలోచనలను ఆధ్యాత్మిక భావాలవైపు మళ్లించారు. సాయిబాబా శిష్యులై, నరసింహస్వామి అన్న పేరు పొందారు. 1957వ సం॥లో ఆయన భౌతికకాయాన్ని త్యజించారు. ఒక వేళ ఆయనకు ప్రజాజీవితంలో లభించని మనశ్శాంతి ఆ ప్రశాంతమైన ఆశ్రమజీవితంలో లభించి వుండవచ్చు. కొందరు జీవితాన్ని ఒక యుద్ధరంగంగా భావిస్తారు. మరికొందరు దాన్ని శిక్షణా క్షేత్రంగానూ భావిస్తారు.

ఎస్. సత్యమూర్తి అద్భుతమైన వక్త. తమిళంలోనూ, ఆంగ్లంలోనూ అనర్గళంగా ఉపన్యాసించే సామర్థ్యం ఆయనకు వుండేది. బహిరంగ సభగానీ, విశ్వవిద్యాలయం సెనేట్ గానీ, ఏ విషయాన్ని అయినా ఆయన బాగా పరిశీలించి ఆకళింపు చేసుకుంటే తప్ప ఆయన మాట్లాడేవారుకారు. నిర్ణీత, చైతన్య స్వభావం గల సత్యమూర్తి గారు అకాల మరణం చెందడం భారతావనికి పెద్ద లోటనే చెప్పాలి.

ఢిల్లీలో నేను సర్.సి. శంకరన్ నాయర్ గారిని చూశాను. ఆయన ఆ రోజులలో వైస్రాయ్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌లో ఒక సభ్యుడిగా వుండేవారు. కోళిక్కోడ్ టౌన్‌హాల్‌లో నేను కలెక్టర్ 'ఇవాన్‌సూ' ను ఢీకొన్న వార్త విని ఆయన నన్ను అభినందించారు. జరిగిన సంఘటనను వివరంగా చెప్పమని అడిగారు. 'నా బాల్యంలో కలెక్టర్ అంటే ఏమిటేమిటో అనుకునే వాళ్లం! మీరు చేసింది చాలా మంచి పని. మన ఆత్మగౌరవాన్ని ఎట్టి పరిస్థితులలోను విస్మరించకూడదు' అని ఆయన చాలా అభినందన పూర్వకంగా చెప్పారు.

'విదేశివిశేషాలు' కు లభించిన ఆదరణ, ఉత్సాహం నన్ను గోపాల కృష్ణగోఖలే, లోకమాన్య బాలగంగాధర తిలక్ మొదలైన వారి జీవిత చరిత్రలు రాసి ప్రచురించడానికి దోహదం చేశాయి. ఏదో వృత్తి చేస్తూ సంపాయించిన ధనంతో కుటుంబాన్ని నిర్వహించడమే కఠినంగా వున్న ఆ రోజులలో పుస్తకాల ద్వారా లభించే ఆదాయం, కొద్దిగా వున్నప్పటికీ అది ఎంతో సహాయపడింది. రూపాయి ఏమిటి? ఒక అణా కూడా లెక్క చేయకుండా ఖర్చుపెట్టడానికి వీలులేని రోజులు అవి.

ఆ సంవత్సరం మార్చినెలలో తిరువిదాన్కూర్ లో సమావేశమైన నంబూద్రి యోగక్షేమ సభ, నాకు 'కేరళ తిలకం' అన్న బిరుదు నిచ్చి సన్మానించింది. ప్రారంభం నుంచి నంబూద్రిసమాజంలోని చాలా మంది పెద్దలు, నా ప్రజా

జీవితాన్ని అభినందిస్తూ ఉత్సాహపరిచారు. ఆ సన్మానానికి సంబంధించిన మెమెంటోలు అవి ప్రస్తుతం నా దగ్గర లేవు. అయినప్పటికీ, ఆ రోజులలో వాటిని బహూకరించి నన్ను గౌరవించడానికి పూనుకున్న ఆ ఉదార మనస్కులను నేను కృతజ్ఞతా పూర్వకంగా జ్ఞాపకం చేసుకుంటున్నాను.

'హోమ్‌రూల్' ఉద్యమంతో పాటు, జాతీయ విద్య అనే ఒక ఉద్యమం కూడా బయలుదేరింది. దానికి నిధి సేకరించడంకోసం, కోళిక్కోడ్ బైరాగి సత్రంలో ఏర్పాటు చేసిన 'ఫన్‌ఫేర్' వేలకొలది ప్రజల్ని ఆకర్షించింది. అటువంటి కార్యక్రమం అంతకుముందు కోళిక్కోడ్‌లో జరిగింది లేదు. హోమ్‌రూల్ ఉద్యమాన్ని ప్రోత్సహించని వాళ్లుకూడా ఈ 'ఫన్‌ఫేర్' విజయవంతంగా పూర్తికావడానికి మనస్ఫూర్తిగా సహకరించారు.

1918వ సంవత్సరంలో తలైచ్చేరిలో సమావేశమయిన మలబార్ మహాసభ సమావేశానికి సిరక్కల్ రామవర్మ వలియరాజా, ఆహ్వానసంఘం అధ్యక్షులుగా ఉన్నారు. కోళిక్కోడ్ మహాసభకు విచ్చేసిన సాముదిరి రాజాకు అనాటి కలెక్టర్ వ్యతిరేకత తెలియజేశారు. ఆ విషయం తెలిసి వుండికూడా, సిరక్కల్ రామవర్మ రాజా, బాధ్యత వహించడానికి ముందుకు వచ్చినప్పుడు, ఆయన ధైర్యాన్ని దేశభక్తినీ చాలమంది మెచ్చుకున్నారు.

విదేశీ రాజకీయ రంగంలో కీర్తి గడించి ఈ రోజు చాలమంది మెచ్చుకునే విధంగా వి.కె. కృష్ణమీనన్, ఆ రోజులల్లో హోమ్‌రూల్ ఉద్యమంలో ఎంతో ఉత్సాహంతో పాల్గొన్న యువకుడు. తలైచ్చేరి కాంగ్రెస్ లో నేను పాల్గొనడానికి వెళ్ళినప్పుడు నేను కృష్ణమీనన్ తండ్రి శ్రీ కృష్ణకురూప్ యింట్లోనే బసచేశాను. ఆ రోజుల్లో ఆయన తలైచ్చేరిలో సుప్రసిద్ధులైన న్యాయవాది.

ఆ సంవత్సరం న్యాయస్థానం సెలవుల్లో దివాన్ మందత్తు కృష్ణన్ నాయర్‌ను కలుసుకోవడానికి నేను తిరువనంతపురం వెళ్లాను. దివాన్‌గారి 'భక్తివిలాస్' గృహంలో నేను ఒక వారం బసచేశాను. కృష్ణన్ నాయర్‌కు ఏమాత్రం పదవీ ఆడంబరంలేదు. ప్రతీరోజూ, ఆయన కోసం చాలామంది వచ్చేవారు, వాళ్లల్లో ఎవర్నీ వృధాగా తన కోసం ఎదురుచూసేలా చేసేవారుకాదు. వాళ్లతో మర్యాదగా వ్యవహరించేవారు. న్యాయవాదిగా వుండి దివాన్‌గా పెద్ద పదవికి ఎదిగివున్నప్పటికీ, ఆయన మాటల్లోనూ, తీరులోనూ, నాకు ఏవిధమైన మార్పు కనిపించలేదు.

నేను కావాలనే ఆయన సలహాతీసుకుని మూలం తిరునాళ్ మహారాజాను చూడడానికి వెళ్లాను. రాజ భవనానికి వెళ్లేప్పుడు ధరించవలసిన సంప్రదాయ దుస్తులు నా దగ్గర లేవు. కృష్ణన్ నాయర్ అంతరంగ కార్యదర్శి రాఘవఫణిక్కర్ పొడవాటి కోటునాకు సరిపోయేట్టుంది. దాన్ని అర్జంటుగా ఇస్త్రీ చేయించాను. సిల్కు పంచ, జరీ తలపాగా కృష్ణన్ నాయర్‌వి. అన్నిటిని ధరించి అద్దం ముందు నిలబడి నన్ను నేను చూసుకున్నప్పుడు 'మోహిని నృత్యం' లో 'నట్టు వాన్' వేషం నాకు గుర్తుకొచ్చింది. దివాన్ గారి జంట గుర్రాల బండిలో ఎక్కి నేను రాజభవనానికి వెళ్లినప్పుడు నన్ను చూసిన వాళ్లు 'విదూషకుడి వేషంలో వెళుతున్న ఇతనెవరో' అని ఆశ్చర్యపోయి వుంటారు!

ఒక రక్షక భటుడు నన్ను రాజుగారి సమక్షానికి తీసుకుపోయాడు. ఒక పంచ మాత్రమే కట్టుకుని ద్వారం వద్ద నుంచున్న రాజు, రాజఠీవి తొణికిసలాడే ముఖంలో మందహాసం చేస్తూ, నన్ను ఆహ్వానించారు. నేను లోలోపల గుర్తు చేసుకున్న స్తుతి వాక్యాలన్ని మరిచి పోయాను. మహారాజు పావుగంటసేపు నాతో మాట్లాడారు. నా క్షేమం గురించి అడిగారు. మళ్లీ తిరువనంతపురం వస్తే నన్ను కలుసుకోమని ప్రేమతో చెప్పారు. నేను అందుకు ఒప్పుకున్నాను. అయితే ఆ తర్వాత నేను అక్కడి పైక్కమ్ సత్యాగ్రహకాలంలో మహారాజు చెరసాలకు ఒక ఖైదీగానే వెళ్లాను.

ఈ విధంగా వృత్తి, ప్రజా జీవితంలో కోళిక్కోడ్‌లో మూడేళ్లు గడిచాయి కొందరు మిత్రులు నేను మద్రాసు వెళ్లి అక్కడ వృత్తి చేపట్టడం మంచిదని సలహాయిచ్చారు. నాకూ ఒక మార్పు కావాలనిపించింది. అందువల్ల వేసవి సెలవుల తర్వాత కోర్టు ఆరంభం కాగానే మద్రాసు వెళ్లి వృత్తి కొనసాగించాలని నిశ్చయించాను.

# కార్మిక సంఘాలు

మద్రాసులో నా వృత్తి కోళిక్కోడ్ కన్నా తృప్తికరంగానే వుండేది. దానికి చాల కారణాలు వుండేవి. నా మిత్రులు కె. మాధవన్ నాయర్, మరికొందరూ కోళిక్కోడ్ నుంచి తరుచూ నాకు కొన్ని కేసులు పంపుతూవుండేవారు. అనాటి మద్రాసు న్యాయవాదులలో ప్రముఖులుగా వున్న బారిస్టర్ సి. మాధవన్ నాయర్ ఆయన తీసుకోని కొన్ని చిన్న కేసులను నాకు పంపి సహాయం చేశారు. నా జాతీయ భావాలపట్ల అభిమానం గల కొందరు మిత్రులు కూడ నా పట్ల ఆదరణ చూపారు. అన్నిటికన్నా మించి మద్రాసు హైకోర్టులో న్యాయవాద వృత్తిని కొనసాగించడం నాకు ఆనందదాయకంగా వుండేది. కొన్ని సందర్భాలలో కొన్ని కేసుల కోసం, మద్రాసు నుంచి ఇతర వూళ్లకు వెళ్లే అవకాశాలు కూడ లభించాయి. ఉన్నత న్యాయస్థానంలో వృత్తిని ప్రారంభించిన ఒక యువ న్యాయవాదిగా నా ఆదాయం తక్కువ అని చెప్పడానికి వీలులేదు. ఐనా నాకున్న బరువు బాధ్యతల దృష్ట్యా అది సరిపోయేది కాదు.

ప్రజాజీవితంలో పాల్గొనే చాలమంది నాకు పరిచితులుగా వుండడంవల్ల, నేను ప్రజాజీవితానికి దూరంగా వుండడం అనేది కష్టంగా వుండేది. అటువంటి జాతీయ మిత్రులు నేను మద్రాసుకి వృత్తి రీత్యా రావడంపట్ల హర్షం వెలిబుచ్చారు. కాలక్రమంగా మద్రాసు నగర ప్రజాజీవితంలోనూ నేను పాలుపంచుకునే విధంగా నా దృష్టిని ఆకర్షించారు.

బారిష్టర్ ఇ.ఎల్. అయ్యర్, పి.పి. వాడియా హోమ్‌రూల్ ఉద్యమ కాలంలోనే నాకు చిరపరిచితులు. కార్మికులకు సంబంధించిన విషయాలలో ఎంతో ఉదాత్తంగా వ్యవహరించే ఉత్తమ వ్యక్తి పి.పి. వాడియా. ఆయన మంజేరి రామయ్యార్, నరసింహఅయ్యార్ హోమ్‌రూల్ లీగ్‌లో ప్రతినిధులుగా, భారతదేశపు న్యాయసమ్మతమైన కోర్కెలను బ్రిటీష్ వారికి తెలియజేయడానికి ఇంగ్లండుకు బయలుదేరారు. అయినప్పటికి వాళ్లు జిబ్రాల్టర్ చేరేలోగా, బ్రిటిష్ ప్రభుత్వం జారీచేసిన ఉత్తరువు, వాళ్లను భారతదేశానికి పంపించింది.

ఇ.ఎల్. అయ్యర్ క్రిమినల్ కోర్టులో వృత్తి నిర్వహిస్తూ వుండేవారు. ఆయన యింట్లో ఎల్లప్పుడూ కార్మిక నాయకులను చూడవచ్చు. వాళ్లతో అయ్యర్ ఎంతో గౌరవప్రదంగా మాట్లాడేవారు. ఎటువంటి సమస్య వచ్చినా వాళ్లు అయ్యర్‌నే ఆశ్రయించేవారు. ఎలాంటి కేసు అయినప్పటికీ కార్మికుల తరపున అయ్యర్‌నే హాజరు కమ్మని చెప్పేవారు. ఫీజును గురించి అయ్యర్ దగ్గర నిర్బంధంలేదు, అయినప్పటికి కార్మికులు కూడా అయ్యర్‌కు వీలయినంత యివ్వడానికి వెనుకాడేవారుకారు. తనవృత్తికన్నా, అయ్యర

కార్మికుల క్షేమమే మిన్నగా భావించారు. ఇ.ఎల్. అయ్యర్‌తో స్నేహం నన్ను కార్మిక సంఘాల వైపు ఆకర్షించింది. కార్మిక సంఘాలను సంఘటిత పరిచి, వాటిని నిర్దిష్టమైన పద్ధతిలో నడిపించే ఏర్పాట్లు చేయడానికి పూనుకున్నాము. వి.వి. వాడియా, ఈ విషయంలో చాల ఉత్సాహంగా పాల్గొన్నారు. ఆయన అనీబిసెంట్ గారి న్యూ ఇండియా పత్రిక కార్యాలయ పర్యవేక్షకులు. ట్రాయ్‌వే కార్మికులు, రిక్షాకార్మికులు, నగరశుద్ధి కార్మికులు, దర్జీ పనివాళ్లు, నూనెకంపెనీ కార్మికులు... ఇలా... మద్రాసులోవున్న కార్మిక విభాగాలను కొన్ని సంఘాలుగా రూపొందించి సంఘటిత పరిచాము. వాటి కార్యాచరణకు కావలసిన చట్టాలు, రూపొందించాము. చర్కరై చెట్టియార్, శ్రీరాములు, హరిసర్వోత్తమరావు మొదలైన వారు ఈ కృషిలో అగ్రగాములైన వారిలో కొందరు. కొద్దికాలంలోనే మద్రాసులో కార్మిక సంఘాలు అభివృద్ధి చెందాయి.

రిక్షా కార్మికుల యూనియన్‌కు, నగరశుద్ధ కార్మికుల యూనియన్‌కు నేను అధ్యక్షుణ్ణి అయ్యాను. ట్రాయ్‌వే కంపెనీ కార్మికులు, నూనె కంపెనీ కార్మికులు సమ్మెచేయడంతో కొన్ని చిక్కులు ఏర్పడ్డాయి. ఇతర యూనియన్ల వాళ్లు కూడా సమ్మె గురించి ఆలోచించసాగారు. చాలా రోజులు ఎగ్మూరులోని నాయింటిముందు నగర శుద్ధ కార్మికులు సమావేశం కావడం అలవాటయిపోయింది. వాళ్లు కూడ సమ్మెచేయడానికి నిశ్చయించి యితర కార్మిక సంఘాల కార్మికులను ఉత్సాహంగా గమనించసాగారు. సాధారణ సమ్మెకు సిద్ధంగా వుండాలన్న అభిప్రాయం వ్యాపించసాగింది. ఈ విధంగా కార్మికులమధ్య వ్యాపించిన అసంతృప్తి, ఒక విధమైన ఉద్రిక్తవాతావరణాన్ని సృష్టించింది. ప్రభుత్వం వారుకూడా త్వరగా ఏదైనా చేయాలని గ్రహించారు. ఆ రోజుల్లో వెల్లింగ్‌టన్ ప్రభువు మద్రాసు గవర్నర్‌గా వుండేవారు. కొంతకాలం తర్వాత ఆయనే ఇండియా వైస్రాయిగా పదవీ స్వీకరించారు. కార్మికుల సమస్యలకు సంతృప్తికరమైన పరిష్కారం ఏర్పడేలా, యూనియన్ నాయకులతో చర్చలు జరపడానికి వారిని రౌండ్ టేబుల్ సమావేశానికి ఆహ్వానించారు.

వాడియా, సర్కరై చెట్టియార్, ఇ.ఎల్. అయ్యర్, డాక్టర్ సుబ్బరాయన్, హరిసర్వోత్తమరావు, శ్రీరాములు మొదలైనవారు గవర్నమెంటు హవున్‌లో సమావేశమైన సభకు హాజరయ్యారు. నేనూ వాళ్లతో వున్నాను. నిజంగా అది రౌండ్ టేబుల్ సమావేశమే. మేమందరం ఒక రౌండ్ టేబుల్ చుట్టూకూర్చున్నాము. ప్రభుత్వ ప్రతినిధులైన గవర్నర్, ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ సభ్యులైన గోరన్ హంటర్ ఆసీనులయ్యారు; నగర శుద్ధి కార్మికుల ఉపాధ్యక్షుడైన ఒక కార్మికుడు గవర్నర్‌కు ఎడమవైపు ఒక కుర్చీలో కూర్చున్నాడు. సహృదయుడైన వెల్లింగ్‌టన్ ప్రభువు, కార్మికుల కష్ట నష్టాలను, కోర్కెలను పరిశీలించడానికి ఒక కమిటీని ఏర్పాటు చేయనున్నట్లు, ఆ కమిటీలో ఫలానా వాళ్లు సభ్యులు అనీ తెలియజేశారు. కమిటీ సభ్యునిగా ఒక వ్యక్తిని కార్మిక సంఘనాయకులు వ్యతిరేకించారు. ఆ కారణంవల్ల ఎటువంటి ఫలితం లేకుండా సమావేశం ముగిసింది. ఆ తర్వాత జరిగిన

సమ్మెకొన్నాళ్ళపాటు సాగింది. ఆ కాలంలో యూనియన్ సభ్యులు మధ్య నెలకొన్న ఐకమత్య భావం, సామర్థ్యం, మామూలు ప్రజలతోపాటు, దాంతో సంబంధంవున్న మమ్మల్నీ ఆశ్చర్యపరిచాయి.

సమ్మెజరిగినప్పుడు, ఏర్పడిన అల్లర్ల కారణంగా పోలీసువారు కొందరిని ఖైదుచేశారు. వాళ్లమీద నేరారోపణచేసి చీఫ్ ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ సమక్షంలో విచారణకు తీసుకునివచ్చారు. చీఫ్ ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ ఒక యూరోపియన్. కార్మికనాయకుల విజ్ఞప్తి ప్రకారం ముద్దాయి తరపున నేను హాజరయ్యాను. విచారణచూడడానికి కోర్టులో జనం అసంఖ్యాకంగా గుమిగుడారు. పెరుగుతున్న యూనియన్ శక్తి సామర్థ్యాలను అణగద్రొక్కాలని మెజిస్ట్రేట్ భావించారు. రెండురోజులు విచారణ కొనసాగింది, వాటి పూర్తివివరాలను ఆనాటి 'న్యూ ఇండియా' పత్రిక ప్రచురించింది. ముద్దాయిలకు మెజిస్ట్రేట్ శిక్షవిధించారు, అయినప్పటికి యూనియన్ శక్తి సామర్థ్యాలను పెంచడానికి ఆ విచారణ దోహదం చేసింది.

ఆ రోజుల్లో మేము నెలకొల్పిన రెండు సంస్థల గురించి ఇక్కడ చెబుతాను. ఒకటి 'న్యూఫేబియన్ సొసైటీ' అందులో పన్నెండుమంది సభ్యులు మాత్రమే వుండేవాళ్లం, పి.పి. వాడియా, కుమారి ఛటోపాధ్యాయ (సరోజినీ నాయుడు సోదరి) చెంచయ్య, సర్కారై చెట్టియార్, కె.బి. పద్మనాభ పిళ్లై, బారిస్టర్ శంకరనారాయణన్ మొదలైనవారు అందులో కొందరు. నేను వాళ్లల్లో ఒకణ్ణి ప్రజా సమస్యల గురించి బాగా పరిశీలించి, వాటి గురించి వ్యాసాలు తయారుచేసే వాళ్లం, ఒక్కొక్క శుక్రవారం సాయంకాలం ఆరు గంటలకు ఒక సభ్యుని యింట్లో మేము సమావేశమయ్యేవాళ్లం. ముందుగా నిర్ణయించిన విషయం గురించి రెండు గంటలపాటు వివాదించే వాళ్లం. సభ్యులందరూ కూడ అనుకున్న విషయం గురించి బాగా చదివి, స్వయంగా ఆలోచించివుండాలి. వివాదం జరుగుతున్నప్పుడు మధ్య మధ్య వివరాలు నోట్ చేసుకోడం అలవాటు. ఒక్కొక్కసారి వివాదం రోజంతా చర్చించినా పూర్తి కాకుండా కొనసాగడం కూడా కద్దు. వివాదానికి తీసుకున్న విషయాన్ని బట్టి వుంటుందది. రెండు మూడు నెలల పాటు కూడా ఒక్కొక్క విషయాన్ని గురించి చర్చించిన సందర్భాలు వున్నాయి. ఈ విధంగా మేము రెండు పుస్తకాలు ప్రచురించాము. 'మాంటేగ్ - చెమ్స్ ఫర్డ్ రిపోర్ట్' 'మద్రాసు రాష్ట్రంలో ఓటుహక్కు సమస్య' అన్న ఈ రెండు పుస్తకాలను ఇంగ్లండు ఫేబియన్ సొసైటీ ఎంతో ప్రశంసించింది. వివాదం ముగిసిన రోజున అందరం కలిసి విందులో పాల్గొనేవాళ్లం. మేము ఈ స్థితిలోనూ జాతి భేదం చూడకూడదని నిశ్చయించుకున్నాము. దానికి ఒప్పుకోని వారిని మేము సభ్యులుగా చేర్చుకోలేదు. నేను మద్రాసు వదలి వెళ్లేంతవరకూ ఫేబియాన్ సొసైటీ కార్యకలాపాలు కొనసాగాయి.

ఇంకొకటి, భారతదేశం స్వతంత్రం పొందాలన్న ఒకే లక్ష్యంతో ఎటువంటి మార్గానయినా చేపట్టవచ్చని తెగించి, రహస్యంగా ఏర్పాటుచేసిన సంఘం. ఆ సంఘ సభ్యులు రెండువారాల కొకసారి నిర్ణీత స్థలంలో సమావేశమయ్యేవారు.

లక్ష్యసాధనకు కావలసిన కార్యక్రమాల గురించి ఆలోచించేవారు. ఎనిమిది మందో పది మందో మాత్రమే సభ్యులు. నాలుగు, అయిదు నెలలు ఈ విధంగా సమావేశమై ఆలోచించడం తప్ప, చెప్పుకోదగ్గ కార్యమేమీ సాధించలేదు. స్వతంత్రం కోసరమే అయినప్పటికి, మాలో కొందరు, యితరులకు ద్రోహం తలపెట్టడానికి తెగించలేదు. ఈ సంఘం అట్టే కాలం కొనసాగకపోవడానికి యిదే ప్రధాన కారణం.

నేను మద్రాసులో న్యాయవాద వృత్తిలో వుండగా ఒక రోజు బారిష్టర్ డాక్టర్ స్వామినాధన్ నన్ను చూడడానికి వచ్చారు. ఆయన నన్ను వెతుక్కుని రావడం చూసి ఎంతో ఆశ్చర్యం చెందాను. మద్రాసు న్యాయవాదులలో క్రిమినల్ విభాగంలో ప్రముఖులలో చాలా చాలా ప్రధానమైనవారు ఆయన. ఇల్లువదిలితే న్యాయస్థానం తప్ప ఆయన మరెక్కడికీ వెళ్లేవారుకారు. కేసులు, పార్టీవాళ్లు తప్ప, తక్కిన ప్రపంచం మీద ఆయనకు అంత ఉత్సాహంలేదు. అటువంటి డాక్టరు స్వామినాధన్ ఉన్నట్టుండి నన్ను చూడడానికి వచ్చిన కారణం ఏమై వుంటుంది? నేను ఆశ్చర్యపోవడం చూసి నా మనసులోని భావాలను ఆయన గ్రహించి వుండాలి. వెంటనే ఆయన నాతో 'నేను ఎందుకు యిక్కడికి వచ్చాను అని మీరు అనుకోవచ్చు, చెబుతాను. కోర్టుఆఫ్‌వార్డ్సు పిల్లల కేసు గురించి మీకు తెలిసేవుంటుంది కదా? ఆ కేసును యిక్కడికి తీసుకొని వస్తే తప్పకుండా ప్రతివాదులను శిక్షిస్తారు. విచారణను ఈ కోర్టు నుంచి మరోచోటికి తీసుకుపోవడానికి ప్రయత్నిస్తాను. దానికోసరం విన్నపం సిద్ధంగా వుంది. ఒక అఫిడవిట్ కూడా కావాలి; అది ఈ కోర్టులో ప్రాక్టీసు చేసేవాళ్లు యిస్తే బావుంటుంది. అందుకోసరం కొందరు ప్రముఖ న్యాయవాదులను కలుసుకొన్నాను. వాళ్లు అఫిడవిట్ యివ్వడానికి జంకుతున్నారు. మీరు దీనికి కావలసిన ఒక అఫిడవిట్ యివ్వగలరా అని అడగడానికే వచ్చాను'.

ప్రజల దృష్టిని బాగా ఆకర్షించిన కేసు అది. సంపన్నులైన జమిందారు పిల్లలకు వుండడానికి సౌకర్యాలు కల్పించి విద్య నేర్పడానికి మద్రాసులో 'కోర్ట్ ఆఫ్ వార్డ్సు' కు చెందిన న్యూయంగ్ టోన్ అనే స్థలం వుండేది. ఒక యూరోపియన్-పర్యవేక్షకుడిగా వుండి ఆ పిల్లలకు చదువు చెబుతూవచ్చాడు. ఒక రోజు ఆ యూరోపియన్‌ను ఎవరో కాల్చిచంపేశారు. అక్కడ వున్న యిద్దరు పిల్లలను అనుమానించి వారిని ఖైదుచేసి వారిమీద నేరారోపణ చేశారు. మద్రాసు ఉన్నత న్యాయస్థానంలోనే ఆ కోర్టు విచారణ జరపాలి. జ్యూరీలు మద్రాసుకు చెందిన వారుగానే వుంటారు. డాక్టర్ స్వామినాధన్ ఆ కేసును పిల్లల తరఫున వాదించడానికి ముందుకువచ్చారు. నగరంలోని ప్రజలందరూ ఈ కేసు గురించే మాట్లాడుకోసాగారు. ఈ స్థితిలో మద్రాసు నగరం నుంచి ఎన్నుకోబడిన జ్యూరీల తీర్పు సంపూర్ణ న్యాయాన్ని చేసేదిగా వుండడం కష్టం అని డాక్టరు స్వామినాధన్ కు అనిపించింది. కేసును బొంబాయి ఉన్నత న్యాయస్థానానికి గాని, మరే నగర ఉన్నత న్యాయస్థానానికి గాని, మార్చాలని కోరుతూ గవర్నర్ జనరల్‌కు ఒక వినతిపత్రాన్ని యివ్వడానికి

డాక్టరు స్వామినాథన్ నిశ్చయించారు. దానికి కావలసిన 'అఫిడవిట్' కోరి నా దగ్గరికి వచ్చారు. నేను యిచ్చాను.

ఆ విన్నపాన్ని గవర్నర్ జనరల్ అంగీకరించి అనుమతించారు. కేసు బొంబాయి న్యాయస్థానానికి బదిలీ అయింది. ఆ తర్వాత మళ్లీ ఒకనాడు డాక్టరు స్వామినాథన్ మాయింటికి వచ్చారు. 'అఫిడవిట్' యిచ్చినందుకు నేను కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను. అయితే మీదగ్గర ఒకటి చెప్పాలి, మీ స్థితిలో వుండివుంటే నేనా అఫిడవిట్‌లో సంతకం చేసేవాణ్ణికాను. నేను ఒక యువ బారిష్టర్‌ని. ఈ అఫిడవిట్ యివ్వడంవల్ల నాకెటువంటి లాభము జరగబోయేదిలేదు. పైగా కష్టాన్నే కలిగిస్తుంది. తెల్లవారైన న్యాయమూర్తులు యితరులు దీనిని అభిలషించరు. ఎందుకు వృధాగా వారి మనసు కష్టానికి గురికావాలి, అనే భావించేవాణ్ణి అన్నారు. డాక్టరు స్వామినాథన్ లేచి సెలవు తీసుకునే ముందు మెచ్చుకునే విధంగా నావీపు నిమిరారు 'ముందుకు రావలసిన యువకులు మీరు' అని అభినందించి వెళ్లారు.

ఆ కేసులో పిల్లలు నేరస్థులు కాదని బొంబాయి న్యాయస్థానం వాళ్లను విడుదల చేసింది. ఇది జరిగి రెండు వారాలు గడిచాక, ఆ జమీందారు పిల్లలతో పాటు డాక్టరు స్వామినాథన్ మళ్లీ మా యింటికి వచ్చారు.

'వీళ్లిద్దరూ ఆ కేసులో నేరం ఆరోపించ బడ్డవారు. మద్రాసులో జరిగి వుండివుంటే వీళ్లిద్దరూ తప్పకుండా మరణదండన అనుభవించవలసి వచ్చేది. మీరు అఫిడవిట్ సంతకం చేసిన కారణంగా, ఈ యిద్దరి ప్రాణాలు కాపాడడానికి సహాయపడ్డారు. ప్రత్యక్షంగా మీకు కృతజ్ఞతలు చెప్పడానికే వీళ్లను యిక్కడకి తీసుకుని వచ్చాను' అన్నారు డాక్టరు స్వామినాథన్. ఆయన హృదయాపూర్వకమైన మాటలు, నాకు ఎంతటి ఆనందాన్ని కలిగించి వుంటాయనీ ప్రత్యేకంగా చెప్పాలా?

వి.వి.యస్. అయ్యర్, సురేంద్రనాధ్ ఆర్యా, ఎన్. దురైస్వామి మొదలైన వారు నేను తరుచుగా చూడాలని ఆశించే మిత్రులు. మైత్రికి ప్రాతిపదిక ఒకే రకమైన అభిరుచులే కదా? అటువంటి ఒకే అభిమానం మమ్మల్ని సన్నిహితంగా చేశాయి.

వి.వి.యస్. అయ్యర్ ఉన్నతాధర్మాలుగల జీవితాన్ని ఆశించినవారు. ఒక గురుకులాన్ని స్థాపించి, తమ శిష్యులతోపాటు ఆయన అక్కడే గడిపారు. 'తిరుక్కురళ్' అన్న అపూర్వ నీతి గ్రంధాన్ని ఆయన తమిళం నుంచి ఆంగ్లంలోకి అనువదించారు. మద్రాసుకు వచ్చినప్పుడల్లా ఆయన నన్ను కలుసుకునేవారు. నదిలో స్నానం చేస్తున్నప్పుడు కాలుజారిపడి మునిగిపోయిన తన కుమార్తెను కాపాడే నిమిత్తం తనుకూడ నదిలోకి దూకి, ఆయనకూడ ప్రవాహంలో కొట్టుకుపోయారు. ఆయన మరణం తమిళ సాహిత్యానికి తీరని లోటు.

బ్రహ్మసమాజంలోనూ, కార్మిక ఉద్యమంలోను ఉత్సాహంగా కృషి చేసినవారు సురేంద్రనాధ్ ఆర్యా. నేను మద్రాసులో వున్నప్పుడు ఆయన తరుచూ మా యింటికి రావడం కద్దు. రాజకీయవిషయాలలో ఆయన

ప్రోగ్రెస్సివ్ పార్టీకి చెందినవారు. మద్రాసునుంచి వెళ్లిన తర్వాత చాలా రోజులు అయనని చూడలేదు. 1952వ సంవత్సరం అయన కోళిక్కోడ్‌కు వచ్చినప్పు డే నేను అయన్ని చూసే అవకాశం లభించింది.

పాతరోజుల గురించి మేము మాట్లాడుకుంటున్నప్పు డే అయన కుటుంబ జీవితంలో జరిగిన విషాద సంఘటనలన్నింటినీ చెప్పారు. అదృష్టహీనులు? ఇంకేం చెప్పడం? రెండేళ్ల తర్వాత అయన కాలం చేశారు.

ఎస్. దురైసామి మద్రాసు ఉన్నత న్యాయస్థానంలో ఒక ప్రముఖమైన న్యాయవాది. ఇతరులకు సహాయం చేయడానికి అయన ఎప్పు డూ వెనుకాడేవారు కారు. కాబట్టి అయనకు చాలామంది స్నేహితులు వుండేవారు మంచి ఉద్యోగం, ఆదాయం, వున్నప్పటికీ అయన అధ్యాత్మిక విషయాలలో చాల అసక్తి కనబరిచేవారు. చాలా మంది మిత్రులకు అయన అర్థిక సహాయం చేశారు. వేలకొద్దీ ఆదాయం వస్తున్న రోజులలో అయన వృత్తిని వదిలి మనశ్శాంతిని వెతుక్కుంటూ అరవిందాశ్రమం చేరారు. కొన్నిరోజులపాటు అయన అక్కడే సకుటుంబంగా గడిపారు. ఆశ్రమం నుంచి ఆ తర్వాత నిష్క్రమించినప్పటికీ - అధ్యాత్మక చింతనలోనే జీవితాన్ని గడుపుతూవున్నారు.

కొన్ని సంవత్సరాల క్రితం నేను అయన్ను మద్రాసులో చూశాను, అ పాతస్నేహితుడు అకారంలో చాలామార్పుచెందారు. డబ్బు, పదవి, పేరు ప్రతిష్ఠలు అయన్ను ఆకర్షించలేదు. 'వీటికంతా ఏమిటి పరమార్థం? ఈ జీవితం మనల్ని ఎక్కడికి తీసుకు వెళుతోంది? అన్న ప్రశ్నలకు జవాబు వెదికే ఆలోచనలలో లీనమయ్యారు.

ఆధ్యాత్మక చింతనలకు తగ్గ మానసిక పరిపక్వత సమకూరితేనే మనశ్శాంతిని, ఆనందాన్ని, అనుభవించడం సాధ్యం. వయసుగాని, పరిస్థితిగాని, దానికి అటంకంకాదు.

జీవిత పయనంలో మనతో మసలే మనుషులతో మనకు ఏర్పడే అనుభవాలు మనకు తెలియకుండానే మన స్వభావాన్ని, ఆలోచనా వైఖరిని, మార్చడానికి దోహదం చేస్తాయి. కొందరి మాటలు, చేతలు ఎప్పటికీ మరిచిపోని విధంగా మన హృదయాల్లో గాఢంగా ముద్రవేస్తాయి. ఎన్ని రకాల మనుషుల్ని మనం చూస్తాము? ఎటువంటి భావాలతో వారు తమ బాధ్యతలు నెరవేరుస్తారు? ఒక సాధారణ వ్యక్తిని ఒకేపనికి పురికొల్పేవి, హృదయాంతరాళాల్లో వుండే స్వార్థమే అని కొందరు చెప్పడం కద్దు. అధిక సంఖ్యాకుల్లో యిది నిజంకావచ్చు. అయితే ఈ కోవకు చెందని కొందరు పెద్దలను మనం చూస్తాము. అటువంటి మహనీయులు సంఖ్యలో చాలాతక్కువగా వుండడంవల్ల వారిని మనం గౌరవిస్తాం. సూక్ష్మంగా ఆలోచించి చూసినట్టయితే ఒక మనిషి తన ఉద్దేశాలకు, తను జీవించే సమాజలక్ష్యాలను ఒకటిగా చేసుకోవచ్చు. అలా జరగలేదంటే ఒకటి. తన లక్ష్యానికి సంబంధించినంతవరకు అయన అభిప్రాయం తప్పు గా వుండాలి, లేదా అయన జీవించే సమాజధోరణిలో చిక్కులు వుండాలి. సమాజం ఉద్దేశ్యం వ్యక్తులు జీవిత క్షేమాన్ని వికసింపచేసి అభివృద్ధి చేసేదిగా వుండాలి. సామాజిక క్షేమాన్ని దృష్టిలో

వుంచుకుని వ్యక్తి తన జీవితాన్ని రూపొందించుకోవాలి. తన బాగు సమాజానికి సంబంధించిన బాగు అనీ, సామాజిక క్షేమమే, తనక్షేమం అని భావించే పరిపక్వతను మనిషి యింకా పొందలేదు. తత్త్వజ్ఞానుల ఊహల్లో మాత్రమే కనిపించే ఆదర్శలోకం మామూలు మనిషి లక్ష్యానికి దూరమైపోతూంది. లక్ష్యాన్ని సాధించే ప్రయత్నాలను చేపట్టినప్పు డే జీవితంలో సుఖం, వెలుగు చేకూరుతాయి!

# ఒక కొత్తమలుపు

హోమ్‌రూల్ ఉద్యమ ఫలితంగా భారతదేశంలో కొన్ని పరిపాలనా సంస్కరణలు తీసుకురావడానికి బ్రిటిష్ ప్రభుత్వం ముందుకు వచ్చింది. ఆ రోజులలో సెక్రటరీగా వున్న మాంటేగ్, వైస్రాయ్‌గా వున్న చేమ్స్‌ఫోర్డ్ ప్రభువు కలిసి చర్చించి తయారు చేసిన నివేదికను 1918వ సం॥ నవంబరులో విడుదల చేశారు. ఆ ప్రకటనలో వివరించిన తీర్మానాలు భారతీయులను రెండు రకాలుగా విభజించడానికి దోహదం చేశాయి. అందులో సూచించిన పరిపాలనా సంస్కరణలు తమకు ఏమాత్రం తృప్తి కలిగించలేదనీ, వాటిని అంగీకరించడానికి వీలుకాదనీ తీవ్రవాదులు కొందరు పట్టుబట్టారు. అంగీకరించడానికి తగిన కొన్ని తీర్మానాలు వున్నాయని, కనీసం ప్రయోగాత్మకంగా అమలుపరచడానికి కొంతకాలమైనా వాటిని ఒప్పుకోవచ్చునని కొందరు మితవాదులు అభిప్రాయపడ్డారు. అయితే కాంగ్రెస్‌లో అధిక సంఖ్యాకులు అతివాదులే! ప్రకటన విడుదలైన తర్వాత కొంతకాలానికి పత్రికలలోనూ, ప్రజావేదికలమీద దాని గురించి తీవ్రమైన వివాదాలు చెలరేగాయి. అంతవరకు ఒకటిగా కృషిచేసిన చాలామంది మిత్రులు విరోధుల్లా విడిపోయి ఒకరితో ఒకరు పోట్లాడుకోసాగారు.

మాంటేగ్ - ఛేమ్స్‌ఫర్డ్ నివేదికను, శ్రద్ధగా చదివి వాటి వివరాలను సూక్ష్మంగా పరిశీలించడానికి అప్పుడప్పుడు మాలో కొందరం న్యూఇండియా కార్యాలయంలో సమావేశమయ్యే వాళ్లం. వాళ్లల్లో అనిబిసెంట్, సి.పి. రామస్వామి అయ్యర్, ఇ.ఎల్. అయ్యర్, చక్కరై చెట్టియార్ ఇంకా పలువురు సమావేశమయ్యేవాళ్లు. నేనూ ఆ సమావేశంలో పాల్గొనేవాణ్ణి. అనిబిసెంట్, సి.పి. రామస్వామి అయ్యర్ దాదాపు ఏకాభిప్రాయమే కలిగివుండేవారు. పరిపాలనా సంస్కరణలను, ప్రయోగప్రాతిపదికమీద తీసుకురావచ్చని వారు అభిప్రాయపడ్డారు. మాలో కొందరు దానికి సమ్మతించలేదు. క్రమక్రమంగా మేము వారినుంచి దూరమైపోతున్నట్లుగా నాకు అనిపించింది!

భారతదేశంలోని అనేక ప్రాంతాలలో వ్యాపించిన ఈ అభిప్రాయభేదాలు మలబార్ కాంగ్రెస్‌లోనూ చోటుచేసుకున్నాయి. రెండు సంవత్సరాలుగా నేను మద్రాసులో నివసిస్తూ వున్నప్పటికీ, మలబార్‌లో జరిగే జాతీయ సంఘటనలను నేను జాగ్రత్తగా పరిశీలిస్తూ వచ్చాను. 1920 సం॥ ఏప్రిల్‌నెలలో మంజేరిలో సమావేశం కానున్న మలబార్ జిల్లా మహాసభకు రావాలని కె. మాధవన్ నాయర్ నన్ను ఆహ్వానించారు. ఆ ఆహ్వానానికి గల కారణాన్ని వెంటనే గ్రహించాను.

'హిందూ' సంపాదకులు కస్తూరి రంగ అయ్యంగార్ ఆ మహాసభకు అధ్యక్షత వహించారు. అనిబిసెంట్ కూడా ఆ మహాసభకు విచ్చేశారు. మలబార్ పలుప్రాంతాలనుంచి ప్రతినిధులుగా, పరిశీలకులుగా చాలామంది హాజరయ్యారు.

ఎటుచూసినా అలజడి చెలరేగే వాతావరణంలో మహాసభ సమావేశమై వున్నట్టు పరిస్థితిని చూస్తుంటే అర్థమయింది. మొదటి రోజు అవేదిక చుట్టూ అక్కడక్కడ సమావేశమై, కాంగ్రెస్ పరిశీలనకు వచ్చే విషయాల గురించి చర్చించి ఉభయపక్షాల వారి అభిప్రాయాలను, మద్దతుదార్లను సేకరించే ప్రయత్నాలు తీవ్రంగా కొనసాగాయి.

ఖిలాఫత్ విషయంలో, బ్రిటిష్ ప్రభుత్వం అనుసరించిన తంత్రం మహమ్మదీయులకు ఎంతో ఉత్సాహాన్ని కలిగించింది. బ్రిటిష్ వాళ్లు భారత దేశంలో ఆచరణకు తీసుకురానున్న పరిపాలనా సంస్కరణలు ఆశించిన దానికంటే భిన్నంగా సంకుచిత ధోరణిలోవున్న విషయం తెలియగానే జాతీయవాతావరణమే ఉద్రేకపూరితమైంది! సంస్కరణకు సుముఖత చూపే బృందాలు, విముఖత చూపే బృందాల మధ్య మలబార్‌లోని మంజేరిలో ఒక పోరాటమే జరిగింది. ప్రతినిధుల సమావేశంలో చాలామంది మహమ్మదీయులు వున్నారు. మునుపు ఎన్నడూ లేనంతగా ప్రతినిధులు అత్యధిక సంఖ్యలో కనిపించారు. వివిధ మతాలకు చెందినవారు మధ్యతరగతి గృహస్థులు, కార్మికులు, ఇలా పలువర్గాలకు చెందిన వారెందరో పాల్గొన్న ఆ మహాసభ చాలా ఉత్తేజకరంగా కనిపించింది. ఏప్రిల్ 28వ తేదీ మధ్యాహ్నం పన్నెండుగంటలకు మహాసభ ఆరంభమైంది. ఆ రోజు ఉదయం ఎనిమిది గంటలకు దేశపరిస్థితిని ఉద్దేశిస్తూ మహాసభ వేదిక ఆవరణలో జరిగిన బహిరంగసభలో నేను, ఎ. రంగస్వామి అయ్యర్ గారు ఉపన్యసించాము. పరిపాలనా సంస్కరణల గురించి విపులంగా వివరించి ప్రజలు మా అభిప్రాయంతో ఏకీభవించేట్టు చేయడానికి మేము ప్రయత్నించాము. అధ్యక్షోపన్యాసం తర్వాత నాటి సభ ముగిసింది. సాయం కాలం ప్రారంభమైన కార్యనిర్వాహక వర్గ సమావేశం రాత్రి ఎనిమిది గంటలవరకు జరిగింది. మర్నాడు జరుగనున్న చర్చనీయాంశాలు ఏమిటనే సూచనలు అప్పుడే కనిపించసాగాయి.

29వ తేదీ ఉదయం పదకొండు గంటలకు సభ మళ్లీ ప్రారంభమైంది. 1300 ప్రతినిధులు సభకు హాజరయ్యారు. అప్పుడే సభలో వేడి కనిపించింది. వ్యతిరేకతకు ఆస్కారం లేని తీర్మానాలను ఆమోదించిన తర్వాత పరిపాలనా సంస్కరణల గురించిన తీర్మానాన్ని కె.బి. రామన్ · మీనన్ ప్రవేశపెట్టారు.

సంపూర్ణ బాధ్యతాయుతమైన పరిపాలనకు భారతదేశం పూర్తిగా అర్హమైనదనీ, మాంటేగ్ పరిపాలనా సంస్కరణలో భారతదేశానికి న్యాయబద్ధమైన హక్కు నిరాకరించబడిందనీ, ఈ కొత్త సంస్కరణ తృప్తి కలిగించదనీ, ప్రజల అభీష్టానికి విరుద్ధమైనదనీ ఆ తీర్మాన పాఠం.

ఎం.ఎల్.ఏ. సుబ్బరామయ్యర్ దానిని ధ్రువపరిచారు. పరిపాలనా సంస్కరణ 'తృప్తికలిగించనిది' 'అభీష్టానికి విరుద్ధమైనది' అన్న పదజాలం తీసివేయాలన్న దిద్దుబాటును అనిబిసెంట్ తమ అసమాన వాక్చాతుర్యంతో తెలియచేశారు. ఆ సవరణకు నీలాంబూర్ యువరాజు ఆమోదాన్ని తెలియజేసి ధ్రువపరచారు. నేను దానిని వ్యతిరేకించి మాట్లాడాను.

ఎ. రంగస్వామి అయ్యంగార్, కె. మాధవన్ నాయర్, మంజారి రామయ్యర్ మొదలైనవారు దానిమీద జరిగిన చర్చలో పాల్గొన్నారు. అధిక సంఖ్యాకులైన ప్రతినిధుల ఆలోచనా ధోరణి తమకు అనుకూలంగా లేదని గ్రహించడంతో అనిబిసెంట్, ఆమె మద్దతు దార్లు సమావేశం నుంచి వెళ్లిపోయారు. తీర్మానానికి ఎన్నిక జరిగినప్పుడు, అధిక సంఖ్యాబలంతో తీర్మానం నెగ్గింది. చరిత్ర ప్రసిద్ధిగాంచిన మంజారి మహాసభ ఈ విధంగా ముగిసింది.

అనిబిసెంట్ పరిస్థితి శోచనీయమైనదిగా నాకు అనిపించింది. అయినప్పటికీ నాకు ఆమె మీద వున్న గౌరవం ఏమాత్రం తగ్గలేదు. వివిధరీతుల్లో మన దేశానికి సేవ చేసి, భారతీయుల కృతజ్ఞతకు, పాత్రమైన ఆ విశిష్ట వనితకు భారతచరిత్రలో శాశ్వతమైన స్థానం తప్పక వుంటుంది. అభిప్రాయాలు వేరుకావచ్చు; దృక్పథాలు, పోకడ వేరు కావచ్చు. కాని నిస్వార్థమైన సేవకు తన జీవితాన్నే త్యాగం చేసిన ఆ మహనీయురాలికి వినమ్ర పూర్వకంగా శిరస్సు వంచి అంజలి ఘటించకుండా వుండలేము.

దేశప్రజలలో మరింత అలజడిని రేకెత్తించే సంఘటనలు వెనువెంటనే జరగసాగాయి. చాలాకాలంగా బంధనాలలో వున్న భారత భూమి బానిసత్వంనుంచి విముక్తిపొంది, స్వాతంత్ర్యాన్ని గెల్చుకోడానికి - విధి అనుకూలించేవిధంగా కనిపించాయి ఆ సంఘటనలు. జలియన్‌వాలాబాగ్ దురంతాలు, ఆ తర్వాత సైనిక నిర్బంధం, అన్యుల ఆధిక్యాన్ని గురించిన అసలు స్వరూపాన్ని ప్రజలకు బట్టబయలు చేశాయి. చలన రహితంగా వుండి పోకుండా తమను పీడిస్తున్న బానిస సంకెళ్లను తెంచుకోడానికి ఐకమత్యంతో పోరాడాలన్న స్పృహ దేశప్రజలలో కలిగింది. పంజాబు అరాచక పరిపాలన గురించి అభిప్రాయభేదాల కారణంగా, ఆ రోజులలో వైస్రాయ్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌లో సభ్యులుగా వున్న సర్ సి.పి. శంకరన్ నాయర్, తమ పదవికి రాజీనామాచేశారన్న వార్త దేశమంతటా వ్యాపించింది. ప్రజలు అమితోత్సాహంతో ఆ వార్తను హర్షించారు. పదవిని త్యాగం చేసి మద్రాసు వచ్చిన శంకరన్ నాయర్‌కు ఆ రోజు దారిపొడవునా ఏర్పాటు చేయబడిన గౌరవమర్యాదలు, సత్కారాలు, పరిపాలనా పద్ధతిపట్ల ప్రజలలో ఏర్పడిన అసంతృప్తిని, ఆంగ్లేయుల పట్ల వ్యతిరేకతను తేటతెల్లం చేశాయి. ఆయన మద్రాసు సెంట్రల్ రైల్వేస్టేషన్‌లో దిగినప్పుడు జనం గుంపులు గుంపులుగా వచ్చి స్వాగతం చెబుతూ చేసిన నినాదాలు, పొందిన ఆనందం మరువలేనివి.

దేశంలో జరుగుతున్న సంఘటనలు నన్ను నిలువనీయకుండా చేశాయి. న్యాయవాద వృత్తిలో శ్రద్ధచూపడం చాలా కష్టమనిపించింది. కుటుంబ బాధ్యతలు, ప్రజాహిత కార్యక్రమాల పట్ల ఉత్సాహం... ఈ రెండింటి మధ్య

సంఘర్షణ ఆరంభమైంది. భార్యా పిల్లల్ని కాపాడే బాధ్యత మాత్రమే కాదు, మా తల్లిని, నా ఆశ్రయం కోరిన తోబుట్టువులు కొందరిని కూడా కాపాడవలసిన బాధ్యత నామీద వుంది. నాకు ఇద్దరు సోదరులు; నలుగురు సోదరీమణులు. ఈ బాధ్యతలతో పాటు అప్పుల బాధ మరొకవైపు. అప్పులు చేసినవాడు వాటిని తీర్చేవరకు, మరే బాధ్యతల్నీ తీసుకోకూడదని నాలో నేను ఎన్నోసార్లు అనుకునేవాణ్ణి. కాని సాంఘికోద్యమం పట్ల నా ఉత్సాహం ఎప్పటికప్పుడు ద్విగుణీకృతమవుతూ వుండేది. ఏదో అదృశ్యశక్తి ఇతర బాధ్యతలను స్వీకరించకుండా నన్ను మళ్లీ మళ్లీ ప్రజాహిత కార్యాల వైపే ఆకర్షిస్తున్నట్లు అనిపించేది. 'చేతిలో కాస్త డబ్బుంటే.......' అన్న ఆశ నాలో చాలాసార్లు కలిగేది. అలా వున్నట్టయితే నా ధోరణికి తగిన జీవితాన్ని కొనసాగించడం సాధ్యమవుతుంది కదా? అందుకు వీలుకాకుండా రుణభారం నాకు పెద్ద ఇనుప సంకెళ్లు వేస్తూ వచ్చింది. స్వతంత్ర పోరాటం నేను లేక పోయినా నడుస్తుంది. నిజమే. భారతీయ స్వాతంత్ర్యపోరాటంలో నా పాత్ర ప్రముఖమైనదని నేను అనుకోలేదు. అయినప్పటికీ దేశసేవలో నేను అనిర్వచనీయమైన తృప్తి పొందాను. నేను ఆశించిన కార్యక్రమాలలో పాల్గొనలేని నా దురదృష్టాన్ని నిందించాను. శపించాను.

సి. రాజగోపాలాచారి ఆ రోజులలో మద్రాసులో న్యాయవాద వృత్తిలో వుండేవారు. హోమ్‌రూల్ ఉద్యమం ప్రారంభించిన నాటి నుంచే ఆయనతో నాకు పరిచయం ఏర్పడింది. ఆ రోజులలో ఆయన సేలంలో ప్రాక్టీసు చేసేవారు. ఆ తర్వాతే మద్రాసు వచ్చారు. అప్పుడప్పుడు న్యాయస్థానంలోనూ, ఇతరత్రా మేము కలుసుకునేవాళ్లం. నా భావసంఘర్షణను ఆయన సహృదయంతో అర్థం చేసుకున్నారు. ఆయన సూక్ష్మబుద్ధి, లోపాలను, తప్పులను నిశితంగా పరిశీలించే తెలివితేటలు, ప్రజాహిత కార్యక్రమాలలో పాల్గొనే దక్షత నన్ను ఆయన వైపు ఆకర్షించాయి. ప్రజాకార్యాలలో పాల్గొనమని ఆయన నన్ను ప్రోత్సహించారు. మేము కలిసి పని చేసిన రోజులలో ఆ మధుర స్మృతులు ఏమాత్రం చెరిగిపోకుండా, ఇంకా నా మనసులో నిలిచివున్నాయి.

స్వాతంత్ర్యోద్యమంలో ఉత్సాహంతో పాల్గొనడానికి నన్ను ప్రోత్సహించిన మరోమిత్రులు శ్రీరాములు. కార్మిక ఉద్యమం ప్రారంభించిన రోజులలో అమితోత్సాహంతో పాల్గొన్న ప్రముఖుడాయన. ఆయన ఎక్కువగా చదువుకోలేదు. అయినప్పటికీ కార్మికుల మధ్య శ్రీరాములుకు మంచి పలుకుబడి వుండేది. పండిత మదన్‌మోహనమాలవ్యాలా పొడవైన చొక్కా, తలపాగా వేసుకుని, వెనుక మెడకు చుట్టిన అంగవస్త్రంతో - మందహాసంతో చలాకీగా తిరుగుతూ పనిచేసే శ్రీరాములు గారు ఆనాటి ప్రజాజీవితంతో పరిచయం వున్నవారందరికి తెలుసు. ఆయన ప్రతిరోజూ మా ఇంటికి వచ్చేవారు. కుటుంబ సభ్యులలో ఒకరుగా మాతో మాట్లాడి సంతోషించేవారు. నేను మద్రాసు నుంచి వచ్చేవరకు ఆయన నన్ను విడిపోలేదు.

అదేవిధంగా చక్కరై చెట్టియార్ కూడా సన్నిహిత మిత్రులే. దేశంలోని కార్యకలాపాల గురించి, కార్మికోద్యమం గురించి ఆ రోజులలో మా అభిప్రాయాలు ఒకే విధంగా వుండేవి. ఆ తర్వాత మాలో అభిప్రాయభేదాలు వచ్చాయి.

ఒక సుప్రసిద్ధ సాహితీవేత్త జీవితాన్ని ఒక తేనెతుట్టకు ఉపమానంగా చెప్పిన విషయం నాకు జ్ఞాపకం వస్తోంది. 'తేనెటీగలు వివిధ ప్రదేశాలలోని పువ్వులనుంచి తేనెను స్వీకరించి తీసుకువస్తాయి. పువ్వుల మకరందాన్ని అనుసరించే తేనె వుంటుంది. అయితే కొన్ని రకాల పువ్వులనుంచి లభించే మకరందం చాలా తియ్యగా వుంటుంది. కొన్ని రకాల పువ్వుల నుంచి లభించే తేనె అలా వుండదు. అయినప్పటికీ చిట్టచివర అన్ని కలిసినప్పటి తియ్యటితేనె కదా మనకు లభిస్తోంది? జీవితం కూడా అలాంటిదే. వివిధ రకాల వ్యక్తులు ఒక్కొక్క విధంగా మనల్ని ప్రభావితం చేస్తారు. పరిచయస్తులు, మిత్రులు, శ్రేయోభిలాషులు అందరి దగ్గర నుండి లోటు పాట్లను, మంచి గుణాలను మనం కొంతవరకు మనవిగా చేసుకుంటాము. అది మన అసలైన స్వభావంలో హెచ్చు, తగ్గులు ఏర్పడే విధంగా మార్పులు తీసుకువస్తుంది. ఈ అంశాన్ని మనం గ్రహించకపోయినప్పటికీ, ఇలా జరగడం అన్నది వాస్తవం'.

# న్యాయవాద వృత్తి విరమించి ప్రజాజీవితంలో పాల్గొనడం

1920వ సం|| డిసెంబర్‌లో నాగపూర్‌లో సమావేశమైన కాంగ్రెస్ సభ భారత చరిత్రలో ఒక నూతన అధ్యాయాన్ని ప్రారంభించింది. మహాత్మాగాంధీ రాజకీయ రంగంలోకి ప్రవేశించగానే దేశం మొత్తంమీద విప్లవాత్మకమైన మార్పులు అతివేగంగా చోటుచేసుకున్నాయి. భాషా ప్రాతిపదిక మీద కాంగ్రెస్ ప్రాంతీయ సంస్థలను రూపొందించింది. కాంగ్రెస్ లక్ష్యం స్వరాజ్యాన్ని సాధించడమేనని, దానికి మార్గం, హింసామార్గం కాదనీ, సహాయ నిరాకరణ అని కాంగ్రెస్ ఉద్ఘాటించింది. పర్యవసానంగా చాలా మంది పదవులు, హోదాలు, వదులుకున్నారు. ఎందరో న్యాయవాదులు వృత్తిని విరమించి రాజకీయరంగంలోకి దూకారు. విద్యార్థులు కళాశాలలను విడిచి దేశస్వాతంత్ర్య సంగ్రామంలోకి దిగారు. కాంగ్రెస్ అస్పృశ్యత నివారణ పథకం వివిధజాతుల వారిని రణరంగక్షేత్రానికి ఆకర్షించింది. ఖిలాఫత్ ఉద్యమంలో కాంగ్రెస్ ప్రదర్శించిన ఉదాత్త వైఖరి హిందూ-ముస్లిం ఐక్యత బాగా నెలకొనడానికి దోహదం చేసింది. దేశం మొత్తం మీద మున్నెన్నడూ కనీవిని ఎరుగని ఐకమత్యభావం, ఉత్తేజంగా త్యాగనిరతి ప్రస్ఫుటంగా కనిపించాయి.

నాగపూర్ కాంగ్రెస్‌లో నెగ్గిన తీర్మానం, ఆ తర్వాత దేశ ఉత్తరాగ్రం నుంచి దక్షిణాగ్రంవరకు పొంగిపొరలిన ఉద్వేగం నాలోను విప్లవధోరణిని రేకెత్తించాయి. ఏం చెయ్యడమో దిక్కుతోచకుండా దిగులుతో కొన్నాళ్లు కాలం గడిపాను. ఈ సమయంలో రాజగోపాలచారి నన్ను చాలాసార్లు చూశారు. ఒక సారినాతో 'మీరు ఇప్పుడు మలబారులో వుండాలి' అన్నారు.

పోరాటంలో దిగడానికి నాకు ప్రేరణ అవసరం అనిపించలేదు. అయితే చేతిలో డబ్బులు లేకుండా నాకుంటుంబాన్ని దిక్కులేని స్థితిలో ఎలా విడిచిపెట్టగలను? నా బాధ్యతలను నెరవేర్చకుండా దేశభక్తుణ్ణని చెప్పుకుంటూ నేను స్వతంత్ర పోరాటంలో దిగటం సబబేనా? మా తండ్రి ప్రాణంతో వుండి వుంటే నా ధోరణి గురించి ఆయన ఏమనేవారో చాలాసార్లు ఆలోచించి చూశాను. అయితే ఈ సమస్య గురించి రెండువిధాలుగా ఆలోచించాలి. భారతదేశం ఒక స్వతంత్ర దేశమనీ అది మరో దేశంతో యుద్ధానికి దిగవలసిన తప్పనిసరి పరిస్థితి ఏర్పడివుందనుకుందాం. యువకులందరూ యుద్ధానికి బయలుదేరాలని భారతదేశం ఆదేశిస్తే, తిరస్కరించడం నా వల్ల సాధ్యమవుతుందా? కాంగ్రెస్ నన్ను నిర్బంధించి ఆజ్ఞాపించలేదు. అయినప్పటికీ కాంగ్రెస్ ఉద్దేశాన్ని ఒక ఆజ్ఞగా భావించి

అనుసరించే బాధ్యత నాకు లేదా? ఇలాంటి ఆలోచనలు నాలో చెలరేగి నా మనసును కలవర పరిచాయి.

ఇంతలో మలబారులోని పరిస్థితికూడా ఉద్యమానికి సిద్ధంగా మార్పులు చెందుతూ వచ్చింది. నాగ్‌పూర్ కాంగ్రెస్ తీర్మానాలు, మలబార్ కాంగ్రెస్ కార్యక్రమాలకు ఒక నూతనోత్సాహాన్ని కలిగించాయి. ఖిలాఫత్ ఉద్యమం దానికి మరింత బలం చేకూర్చింది.

కాంగ్రెస్, కొత్త భాషా ప్రాతిపదికపై రాష్ట్రాలుగా తీర్చిదిద్దడానికి పూనుకోవడం వల్ల - కొచ్చి, తిరువిదాన్కూర్, మలబార్ కలిసి కేరళ రాష్ట్రమయింది. ఈ కేరళ రాష్ట్ర కాంగ్రెస్ కమిటీకి కె. మాధవన్ నాయర్ కొత్త కార్యదర్శి అయ్యారు.

మహమ్మదీయులలో ఏర్పడిన అసంతృప్తి - ప్రమాదకరంగా పరిణమిస్తుందేమోనని అధికార వర్గం అనుమానపడింది. దానిని తొలగించడానికి కొన్ని మార్గాలను ఆలోచించారు. బహిరంగసభలకు నిషేదాజ్ఞలు జారీచేస్తూ జిల్లా మెజిస్ట్రేటు ఆజ్ఞాపించారు. మద్రాసు ముస్లిమ్ వర్గంలో గొప్పనాయకుడుగా పేరు తెచ్చుకున్న యాకూబ్ హసన్ సాహెబ్ కోళిక్కోడ్ లో ఒక బహిరంగ సభలో ఉపన్యసించడానికి సిద్ధపడ్డారు. ఆయన ఆ స్థలానికి చేరగానే ఆయన మీద నిషేధాజ్ఞ చర్య తీసుకున్నారు. అది 1921 సం॥ ఫిబ్రవరి 15వ తేదీన జరిగింది. ఆ సభలో పాల్గొనడానికి పి. గోపాల మీనన్, కె. మాధవన్ నాయర్, పొన్‌మాడత్తు మొయిదీన్, కోయా మొదలైన వారికీ అదే నిషేధాజ్ఞ! ఆ ఆజ్ఞను అతిక్రమించి, బహిరంగసభ జరపడానికి వారు నిశ్చయించారు. జిల్లా మెజిస్ట్రేటు థామస్ వారిని ఖైదు చేయమని పోలిస్ సూపరింటెండెంట్ హిచ్‌కాక్‌కు ఆజ్ఞాపించారు. ఈ వార్త ప్రజలలో వ్యాపించగానే, కలెక్టర్ కార్యలయం చుట్టూ ఒక పెద్ద గుంపు చేరింది. కలెక్టర్ కార్యాలయానికి మూడు వైపులా వున్న ద్వారాలను మూసివేశారు. బయటనున్న బ్రిటిష్ సైన్యం కాపలాకు వచ్చారు. దాదాపు రెండు గంటలు గడిచిన తర్వాత పోలీస్ డిప్యూటీ సూపరింటెండెంట్ ఆయూసాహెబ్, యాకూబ్‌హసన్‌ను మిగతా వారిని ఖైదుచేసి తీసుకువచ్చారు. ఆ నలుగురినీ - ఆరునెలలపాటు శాంతికి భంగం కలిగించమని, మంచి నడవడిక కలిగి వుంటామనే షరతుపై జామిను యిస్తామని అక్కడికి తీసుకువచ్చారు. అయితే అందుకు వారు ఒప్పుకోలేదు. అందువల్ల వారికి ఒక్కొక్కరికీ ఆరునెలలు జైటు శిక్ష విధించి కణ్ణనూర్ జైలుకు తీసుకువెళ్లారు.

ఈ వార్త దావానలంలా దేశమంతటా ప్రాకిపోయింది. దుకాణాలు మూసేశారు. విద్యాలయాలనుంచి విద్యార్థులు తరగతులు బహిష్కరించి బయటకు వచ్చారు. న్యాయవాదులు న్యాయస్థానాలు బహిష్కరించారు. ప్రభుత్వం అక్రమచర్యలు ఖండిస్తూ, మలబార్‌లోను వెలుపలా పలుచోట్ల బహిరంగసభలు ఏర్పాటుచేశారు.

'నాయకులను ఖైదు చేశారు. అత్యయిక పరిస్థితి; వెంటనే రావాలి' అని నాకు కోళిక్కోడ్ నుంచి ఒక తంతి వచ్చినప్పుడు, ఏం చెయ్యాలనీ

సందేహించకుండా ఆరోజే కోళిక్కోడ్‌కు బయలుదేరాను. రాజగోపాలాచారి కూడా నాతో వస్తున్నట్టు చెప్పారు. నా భార్యపిల్లలు మద్రాసులో వున్నారు. ఉన్నట్టుండి నేను కోళిక్కోడ్ వెళుతున్నాని చెప్పడంతో వారు దిగ్భ్రాంతి చెందారు. నా ప్రజాసేవకు అడ్డుచెప్పాలని వారు భావించలేదు. అయితే కుటుంబ పరిస్థితి ఏమవుతుందోనని వాళ్లు దిగులు చెందడంలో ఆశ్చర్యం లేదు కదా? రాజగోపాలచారితో నేను ఆ రోజు మెయిల్ లో కోళిక్కోడ్ కు ప్రయాణమయ్యాను.

కోళిక్కోడ్‌లో జరిగిన సంఘటనలు ప్రజలను ఎంతగానో ఉద్రేకపూరితుల్ని చేశాయన్న సంగతి దారిపొడవునా రైలు స్టేషన్లలో మేము చూసిన జనసందోహం రుజువుచేసింది. కోళిక్కోడ్ రైలు స్టేషన్లో, పోలిస్ సూపరింటెండెంట్ హిచ్‌కాక్, రక్షకభటులు, గుమిగూడిన ప్రజాసమూహం మా కోసం ఎదురుచూస్తున్నారు. హిచ్‌కాక్ నాకు తెలియదు. సేలంలో ఆయన కొంతకాలం వుండడం వల్ల, రాజగోపాలాచారికి ఆయనతో పరిచయంవుంది. మేము రైలు స్టేషన్ నుంచి తిన్నగా కాలపురత్తు మాధవన్ నాయర్ ఇంటికి వెళ్లాము. జరిగిన సంగతులు తెలియజేశారు. హిచ్‌కాక్ కూడా వాటి గురించి చెప్పారు. రెండు రోజుల తర్వాత మేము కన్ననూర్ చెరసాలకి వెళ్లి హసన్ సాహెబ్‌ను, మాధవన్ నాయర్‌ను, గోపాల మీనన్‌ను, మొయ్‌దీన్ కోయాను చూశాము. జైల్లోవున్నవారికి బయటనుంచి వచ్చిన మిత్రుల్ని చూడడంలో ఎంత ఉత్సాహం. జైలు అధికారులు దగ్గర్లో వున్నప్పటికీ మేము ఉత్సాహంగా ఏం మాట్లాడుకున్నప్పటికీ వారు అడ్డు చెప్పలేదు. జాతీయవాదులు ఖైదీలుగా ఎక్కువ సంఖ్యలో చేరని రోజులవి!

కోళిక్కోడ్‌కు తిరిగివచ్చిన తర్వాత, మేము తీసుకోవలసిన చర్యల గురించి, ఆలోచించి తీర్మానించాము. వృత్తిని విరమించి ప్రజాజీవితంలో పాల్గొనడానికి నేను నిశ్చయించాను. రాజగోపాలాచారి మద్రాసు ప్రయాణమయ్యారు. మలబార్ కాంగ్రెస్ కార్యక్రమాల బాధ్యతలు నేను స్వీకరించాను. మాధవన్ నాయర్ ఇంట్లోనే కాంగ్రెస్ కార్యాలయం. నా బస కూడా అక్కడే. మూడు వారాలు గడిచాయి.

నేను వృత్తిని విరమించి రాజకీయరంగంలో పాల్గొన్న వివరాలు మొట్టమొదట పత్రికల ద్వారానే నా భార్యపిల్లలు తెలుసుకున్నారు. మా దగ్గర బంధువులందరు ఈ వార్తను ఎలా స్వీకరిస్తారో అని వారు భయపడ్డారు. నాకూ అదే భయం. కోళిక్కోడ్ నుంచి ఒకరోజు నేను పాల్ఘాట్‌కి వెళ్లినప్పుడు, నా ధోరణి పట్ల వారికున్న అభిప్రాయభేదాలను వారి ముఖకవళికలు తెలియజేశాయి. వాళ్లందరూ నేను వృత్తిని విడిచి రాజకీయ కార్యకలాపాలలో పాల్గొనడం ద్వారా పెద్ద కీడును కొని తెచ్చుకుంటున్నట్లు భావించారు. దానిని గురించి నేను వారితో ఎంత చెప్పినా ప్రయోజనం లేదని నాకు తెలుసు. వారి మనోస్థితిని బాగా ఆకళింపు చేసుకున్నాను. నేను ఆ ధోరణిని మార్చే వృథా ప్రయత్నం చెయ్యలేదు. మందందు కృష్ణన్ నాయర్, మరి కొందరు పెద్దలతో నాకు తగిన రీతిలో బుద్ధిచెప్పమని వారు మొరపెట్టుకున్నారు. కృష్ణనాయర్

పట్ల నాకెంతో గౌరవాదరాలు వున్నాయి అన్న విషయం వారికి తెలుసు. నా స్వభావం ఆయనకూ బాగా తెలుసు. సందర్భానికి తగిన విధంగా ఆయన నాకు మంచి మాటలు చెప్పకుండా వుండేవారుకాదు. అయినప్పటికీ ఉద్యమంలోకి ముందు పెట్టిన కాలు నేను వెనుదీయడానికి సిద్ధంగా లేను!

మద్రాసు నుంచి భార్యాపిల్లలను వీలయినంత త్వరలో కోళిక్కోడ్‌కు తీసుకురావాలని నిర్ణయించాను. ఎన్నో బాధ్యతలు అక్కడ పూర్తి చెయ్యవలసివుంది. అందువలన మద్రాసుకు బయలుదేరాను.

రాజగోపాలాచారి లాగే ప్రకాశంకూడా ప్రజాహిత కార్యక్రమాలలో నాకు ప్రేరణ, ఉత్సాహం కలిగించిన మిత్రులు. నేను మద్రాసునుంచి బయల్దేరడానికి ముందు ఒకటి రెండు సార్లు మా ఇంటికి వచ్చి నా వ్యక్తిగత సమస్యలు విచారించి తెలుసుకున్నారు. వృత్తిని విడిచిపెట్టి ప్రజాజీవితాన్ని చేపట్టడానికి కావలసిన ఆర్థిక వసతి నాకు లేదన్న సంగతి ఆయన బాగా గ్రహించారు. నాకు వీడ్కోలు చెప్పడానికి వచ్చినప్పుడు 'ఇది మీ దగ్గర వుంచుకోండి' అని చెప్పి ఒక చెక్ ఇచ్చారు. అది ఆ సమయంలో నా సమస్యలు తగ్గించడానికి ఎంతో ఉపయోగపడింది.

'లా' పుస్తకాలను, కేసుల కాగితాలను కొందరికి అప్పగించిన తర్వాత, చట్టాన్ని ఎదిరించడానికీ, దేశసేవకు సిద్ధపడి నేను మద్రాసు విడిచి కోళిక్కోడ్ చేరుకున్నాను.

# సహాయ నిరాకరణోద్యమం

కేరళను ఒక ప్రత్యేక కాంగ్రెస్ రాష్ట్రంగా ఏర్పరచిన విషయం చెప్పాను కదా... కేరళ రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి హోదాలో వివిధ శాఖలు ఏర్పరచడం లోనూ, కార్యకలాపాలను నిర్దుష్టంగా తీర్చిదిద్దడానికి నేను ప్రయత్నించాను. ప్రారంభ కాలంలో వివిధ కార్యక్రమాలకు కావలసిన ఖర్చుకోసరం రాజగోపాలాచారి వెయ్యిరూపాయలు సాయం చేశారు. మాధవన్ నాయర్ ఇంట్లో మేడ మీద నేను సకుటుంబంగా నివసిస్తూ వచ్చాను. క్రింద కాంగ్రెస్ కార్యాలయం. వృత్తిని విడిచి ప్రజాసేవ చెయ్యడానికి వచ్చిన కొందరు న్యాయవాద మిత్రులు కాంగ్రెస్ కార్యక్రమాలను గమనించి వాటిని సక్రమంగా నెరవేర్చడానికి నాకు సహకరించారు. పి. అచ్యుతన్, అంబలకార్టు కరుణాకరమీనన్, కె.బి. గోపాల మీనన్, వి.ము. గోవిందన్ నాయర్, పి. రావుణ్ణిమీనన్ మొదలైనవారు వృత్తిని విడిచి నిరాకరణోద్యమంలో చేరి కృషిచేసిన వారే.

కళాశాలలో చదువుకుంటున్న విద్యార్థులు కూడా కొందరు చదువుకు స్వస్తి చెప్పి ఉద్యమంలో పాలుపంచుకోవడానికి వచ్చారు. వాళ్లల్లో కొందరు ఐకమత్యంతో నిర్మాణాత్మకమైన పథకాలు ఆచరణపట్ల ఆసక్తి కనబరచారు. కె.పి. అప్పనాయర్, టి.వి. సాత్తు కుట్టి నాయర్, ఆర్.పి. శర్మ, దేవేశన్, మాణిక్కత్తు గోపాలమీనన్, కె.వి. బాలకృష్ణమీనన్, శేఖర్ మీనన్ మొదలైన వారి పేర్లు ఇక్కడ పేర్కొన దగ్గవి. అత్యవసర పరిస్థితులలో వారిలో కొందరు చూపిన చొరవ, కార్యదక్షత కొనియాడదగ్గవి.

ఆ తర్వాత కాలంలో పేరు ప్రతిష్ఠలతో భాసించిన వారిలో మరికొందరిని కూడా ఇక్కడ పేర్కొనాలి. ఒకరు ఐ.కె. పిళ్లై. సహాయనిరాకరణోద్యమం ప్రారంభించినప్పు డు ఆయన ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో విద్యార్థి. ఆయన చదువుకు స్వస్తి చెప్పి కేరళ కాంగ్రెస్‌లో చేరి కృషి చేయడానికి వచ్చినట్లు, అలా రావడనికి ఆకర్షించిన కారణాలు ఏమిటో - తన సహజమైన మందహాసంతో నాతో వివరంగా చెప్పారు. అలాగే మాకు పరిచయం ఏర్పడింది. శ్రీ పిళ్లై ఆ తర్వాత నాకుమరింత సన్నిహితమై, ఆప్తమిత్రులయ్యారు. ఎంతోకాలం ఆయన కాంగ్రెస్‌కు మనఃపూర్వకంగా సేవచేశారు. ఉద్యమం కోసం ఎన్నో రకాలుగా కష్టనష్టాలు అనుభవించారు.

కాంగ్రెస్ లక్ష్యాలను ప్రజలలో వ్యాపింపచేయడానికి ఆయన 'కొల్లం' నుంచి 'స్వరాట్' అన్న పేరుతో ఒక మలయాళ పత్రికను ప్రచురించారు. కొంతకాలం గడిచాక పిళ్లై కాంగ్రెస్ నుంచి విడిపోయి ఎమ్.ఎన్. రాయ్ పార్టీలో చేరారు.

రెండుగంటల సేపయినా సరే సభకులను ఆకట్టుకునేలా ఉపన్యసించేవారు. అనాయాసంగా మాట్లాడేవారు. లౌడ్ స్పీకర్లు లేని కాలం అది అన్న విషయం మరచిపోకూడదు.

కాంగ్రెస్ ప్రచారం కోసం ఉత్తర మలబార్ వెళ్లినప్పుడు జరిగిన ఒక రసవత్తరమైన సంఘటన నాకు జ్ఞాపకం వస్తోంది. బహిరంగసభ ఒక మసీదుకు సమీపంలో వున్న మైదానంలో ఏర్పాటుచేయబడింది. ఎత్తయిన వేదిక, దాని మీద మేజా, కుర్చీ వేసి అలంకరించి పందిరి వేసి వుంచారు. సభకు చాలామంది ప్రజలు హాజరయ్యారు. వేదిక మీద నాతో పాటు ఏడెనిమిది మంది పెద్దలు కూర్చుని వున్నారు. సభ పూర్తయ్యే సరికి దాదాపు రెండుగంటలు పట్టింది. అంతా ముగిసి క్రిందకి దిగిన తర్వాతే ఆ వేదిక ఒక అందమైన బావిపైన చుట్టు గోడల మీది పలకలు వేసి ఏర్పాటు చేయబడిందని గ్రహించాను. పలకలు విరిగి వుంటే మేమందరం బావిలో పడివుండే వాళ్లం. ఎలాంటి తెగింపుగల ఏర్పాటు అది! ఏదో విధంగా పని సులభంగా పూర్తి కావాలన్నదే వారి అభిలాష. అపాయం వాటిల్లవచ్చుకదా అన్న అనుమానం నేను వ్యక్తం చేస్తే 'మంచి దృఢమైన పలకలు, భయపడవలసిందేమీ లేదు' అని ఆ కార్యకర్తలు జవాబు చెప్పారు.

కోముకుట్టి మౌల్వి, కొల్లత్తు ఫరీద్ సాహెబ్, తిరువిల్లా కురువిళ మాత్యు, సిగ్రెడత్తు గుంగు పిళ్లై మొదలైన వారు సహాయ నిరాకరణోద్యమం తొలిరోజుల్లో ఉత్సాహంతో పోరాటరంగంలోకి దిగిన మరికొందరు మిత్రులు.

సభ్యులకు కావలసిన శిక్షణ ఇవ్వడానికి కాంగ్రెస్ కార్యాలయం సమీపంలో ఒక శిక్షణా కేంద్రం ఏర్పాటు చేశాము. కేరళరాష్ట్రం లోని వివిధ ప్రాంతాలనుంచి శిక్షణకోసం సభ్యులు వచ్చారు. మూడు వారాల పాటు శిక్షణనిచ్చాము. ప్రపంచ చరిత్ర, భారతదేశ చరిత్ర, కాంగ్రెస్ చరిత్ర, కాంగ్రెస్ పథకాలు, స్వాతంత్ర్య పోరాటయోధుల జీవిత చరిత్రలు మొదలైన విషయాలను వారికి సమగ్రంగా బోధించాము. నూలు వడకడం, మద్య నిషేధ ప్రచారం శిక్షణా పథకం ముఖ్య అంశాలు. వి.యు. గోవిందన్ నాయర్ శిక్షణా పాఠశాల పర్యవేక్షకుడు. మధురదాస్ పురుషోత్తం అన్న గుజరాత్ వ్యక్తి నూలు వడికే తరగతులు నిర్వహించేవారు. ఉదయం సమయాలలో చదువు, మధ్యాహ్నానికి పైన కల్లుదుకాణాల పికెటింగ్, నూలు వడకడం మొదలైనవి కార్యక్రమాలు. తరగతి నిర్వహించడానికి నేను ప్రతిరోజూ ఉదయం ఎనిమిది గంటలకి శిక్షణా శిబిరానికి వెళ్లేవాణ్ణి. రెండు గంటల సేపు పాఠాలు చెప్పి కాంగ్రెస్ కార్యాలయానికి చేరుకునే వాణ్ణి. కె.పి. గోపాల మీనన్, న్యాయవాది అచ్యుతన్, అంబల కొట్టు కరుణాకర మీనన్ మొదలైన వారందరూ వారివారి బాధ్యతలు నెరవేర్చడానికి ఉదయమే వచ్చేసేవారు. కరుణాకరమీనన్ రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ కోశాధికారిగా వుండేవారు. ఎం.ఎం. గోవిందకురూప్ ప్రతిరోజూ కాంగ్రెస్ కార్యాలయానికి, శిక్షణపాఠశాలకు వచ్చి కృషిచేసేవారు. ప్రభుత్వ కార్యాలయంలా నిర్దుష్టంగా అన్ని పనులూ జరిగేవి. హకీమ్ అజమత్ ఖాన్, రాజగోపాలాచారి ఒక సారి కాంగ్రెస్ కార్యాలయాన్ని పర్యవేక్షించి దక్షతతో

చివరిరోజుల్లో మా మధ్య రాజకీయ అభిప్రాయ భేదాలు తలెత్తినప్పటికీ అవి మా హృదయపూర్వకమైన మైత్రికి అడ్డుకాలేదు.

సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించిన తొలిరోజులలో ఒక రోజు ఒక యువకుడు కార్యాలయం వచ్చాడు. అతను బొంబాయిలో న్యాయశాస్త్రం చదువుతున్న విద్యార్థి. చదువు వదులుకుని ప్రజాజీవితంలో ప్రవేశించడానికి వచ్చినట్లు తెలియజేశాడు. చొక్కా, కోటు, చేతిలో ఒక గొడుగుతో - మేడ మీదకి వచ్చి నిలబడిన ఆ విద్యార్థే - ఆ తర్వాత కాలంలో దేశసేవ చేసి విశేషంగా పేరు ప్రతిష్ఠలు ఆర్జించిన కె. కేళప్పన్.

సహాయ నిరాకరణోద్యమం ప్రారంభమైనప్పుడు మహమ్మద్ అబ్దుల్ రహిమాన్ అలిఘుర్ కళాశాలలో చదువుకుంటూ వుండేవారు. చదువుకు తిలోదకాలిచ్చి ఆయన కోళిక్కోడ్ వచ్చారు. అబ్దుల్ రహిమాన్ సన్నగా పొడుగ్గా దిట్టమైన మీసాలతో వుండేవారు. ఉత్సాహం తొణికిసలాడే మాటలు. ఒకసారి చూస్తేనే చాలు తమవైపు ఆకర్షించగల సామర్థ్యం గల వారాయన. కాంగ్రెస్ లోనూ, ఖిలాఫత్ ఉద్యమంలోనూ ఆయన పాత్ర పేర్కొనదగ్గది. 'అల్ అమీన్' అన్న ఒక పత్రికను ప్రచురిస్తూ వచ్చారు. ఆయన పేరు ప్రతిష్ఠలు ఉచ్ఛస్థితిలో వున్న రోజులలో జాలిలేని యముడు ఆ దేశాభిమానిని తీసుకు వెళ్లిపోయాడు. ఆయన అకాలమరణం కేరళ జాతీయరంగానికి చాలా పెద్ద లోటు.

మేము మొదట ప్రచారం కోసం రాష్ట్ర మంతటా, శాఖలు ఏర్పాటుచేయడంలో శ్రద్ధ చూపాము. అందుకోసం ఒక వారంలో రెండు మూడు సార్లు నేను కోళిక్కోడ్ నుంచి బయటి ఊళ్లకు వెళ్లేవాణ్ణి.

మహమ్మదీయులకు కాంగ్రెస్ లక్ష్యాలగురించి వివరించడానికి, వారిని ఉద్యమంలో చేర్చడానికి ఇ. మొయిత్తు మౌల్వి చేసిన కృషి గణనీయమైనది. సామాన్య వ్యక్తి అర్థం చేసుకునే తీరులో సరళమైన భాషలో ఆయన కాంగ్రెస్ పథకాల గురించి, చర్యల గురించి, ఖిలాఫత్ ఉద్యమ లక్ష్యం గురించి వేలాది మహమ్మదీయ మిత్రులకు తెలియ జెప్పారు. ఎన్నో బహిరంగసభలలో మేము మాట్లాడాము. ఒక్కొక్క రోజు మూడు నాలుగు సభలు కూడా వుండేవి. ఆ రోజులనుంచి ఈనాటి వరకు మొయిత్తు మౌల్వి ప్రజాజీవితంలో కృషి చేస్తున్నారు.

గొప్ప వక్త కాకపోయినప్పటికీ అసన్ కోయా మౌల్వి గారిది మందహాసం చిందించే ముఖం. ఆయన ఉత్సాహం ఉద్యమానికి ఎంతో సహాయపడింది. కాంగ్రెస్ నిధి సేకరణకోసం ప్రజలను కలిసి సంప్రదించి వారి సహాయాన్ని కోరి అసన్ కోయా మౌల్వి చేసిన కృషి, సహకారం నాటి కాంగ్రెస్ కార్యకర్తలు మరువలేనిది.

పెరుందల్ మన్నా మహమ్మద్ ముస్లిమార్ మరో ఉత్సాహవంతులైన కాంగ్రెస్ కార్యకర్త. సహాయ నిరాకరణోద్యమం ప్రారంభమైన ఘట్టంలోనే ఆయన కాంగ్రెస్ ప్రచారరంగంలో పాల్గొన్నారు. తెల్లటి చొక్కాతో, తువ్వాలు మడిచి తలకు చుట్టుకుని ముస్లిమార్ వేదిక మీదకి ఎక్కినట్లయితే

కార్యక్రమాలు కొనసాగుతున్న పద్ధతిని, పరిశీలించి అభినందనలు తెలుపడం మాకెంతో ఆనందాన్ని కలిగించింది.

కొచ్చి రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి ముత్తేదత్తు నారాయణ మీనన్, తిరువిదాన్కూర్‌లో ఎ.కె. పిళ్లై, తలచ్చేరిలో కె.పి. అప్పునాయర్ కాంగ్రెస్ కార్యకలాపాలను పర్యవేక్షిస్తూ వచ్చారు.

కొచ్చి రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రచారం కోసం వెళ్లిన నేను రెండురోజులు సెరుతురుత్తి ప్రయాణీకుల వసతి గృహంలో బసచేశాను. అక్కడే కేరళ రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ నిర్వాహక నివేదికను వ్రాసి సిద్ధం చేశాను. తొలి నిర్వాహక నివేదికలో కాంగ్రెస్ కమిటీకి ఒక అధ్యక్షుడు లేడు. రాష్ట్ర కాంగ్రెస్ నిర్వహణా బాధ్యతలు ఏడుగురు సభ్యులు గల కౌన్సిల్‌కు అప్పగించబడింది. వారి అధికారానికి లోబడి కార్యదర్శి బాధ్యతలు నిర్వహించేవారు.

కాంగ్రెస్ కార్యాలయంలో నాకు ఎంతో సహాయం చేసిన వ్యక్తి కె.ఎ. కుంజ్ఞుణ్ణి మీనన్. మంచి గద్యం వ్రాయగల వారాయన. నివేదికలు విజ్ఞప్తులు తయారు చేయడంలో ఆయన అందజేసిన సహకారం విలువ కట్టలేనిది. బాగా సన్నిహితులైన ప్రియమిత్రులకు సంబంధించిన విషయం అంటే అది ఎంత క్లిష్టమైన దైనా సహాయపడడానికి వెనకాడేవ్యక్తి కాదు.

1921 సం॥ ఏప్రిల్ నెలలో తొలి కేరళ రాష్ట్ర మహాసభ జరపడానికి ఏర్పాట్లు చేశాము. అంతకు ముందు మలబారు జిల్లా మహాసభ కదా జరిగింది.... కొత్త రాష్ట్ర కాంగ్రెస్ ఏర్పరచిన తర్వాత ఆలస్యం చేయకుండా ప్రథమ మహాసభ జరపాలని తీర్మానించాము. ఒర్ర్ధపాలం కమిటీ కార్యదర్శి పి. రాముణ్ణి మీనన్ అక్కడ ఒక న్యాయవాది. విద్యార్థిదశలోనే జాతీయోద్యమంలో పాలు పంచుకున్న యువకులు. చేపట్టిన పథకం ఏదైనా సరే విజయవంతం చెయ్యాలన్న పట్టుదల గలవ్యక్తి. పేరు ప్రతిష్ఠలకు ఆయన ప్రాధాన్యం చూపలేదు. రాత్రింబవళ్లు నిర్విరామంగా పాటుబడ్డారు. కొంతకాలం తర్వాత మాతృభూమి సంపాదక బాధ్యతలు స్వీకరించినప్పుడు ఆయనలోని ఈ మంచి స్వభావం బాగా తెలిసింది. తను నమ్మిన సిద్ధాంతంలో మంచి విశ్వాసం, జంకు లేకుండా విషయాలను విశ్లేషించి పరిశీలించే చొరవ, తెగింపు, ఫలితం ఆశించకుండా కృషి చేయడానికి సిద్ధంగా వుండడం వంటిగుణాలు రాముణ్ణి మీనన్ కు కేరళప్రజా సేవకుల్లో అగ్రస్థానాన్ని కల్పించాయి. తమ ఆరోగ్యాన్ని కూడా లెక్క చేయకుండా పాటుపడిన ఆ నిస్వార్థ దేశభక్తుని అకాల మరణం కేరళ ప్రజలను దుఃఖ సాగరంలో ముంచివేసింది.

అప్పట్లో ఒర్ర్ధపాలం మహాసభను విజయవంతంగా జరపడం కోసం రాముణ్ణి మీనన్ ఉత్సాహపూర్వకంగా కృషి చేశారు. ఆయనకు సహాయం అందజేయడానికి నేను అప్పుడప్పుడు ఒర్ర్టపాలం వెళ్లడం జరిగేది. సహాయ నిరాకరణోద్యమం ప్రారంభమయిన తర్వాత తొలి మహాసభ కావడం వల్ల కేరళలోని వివిధ ప్రాంతాల నుంచి ప్రతినిధులు వచ్చారు. టి. ప్రకాశం అధ్యక్షత వహించారు. పాల్‌ఘాట్‌లో పెద్ద న్యాయవాదిగా పేరుమోసిన ఎల్.ఎ. సుబ్బరామయ్యార్ ఆహ్వాన సంఘం అధ్యక్షులు. ఈ కేరళ రాష్ట్ర కాంగ్రెస్

మహాసభతో, ఒక ఖిలాఫత్ మహాసభ, విద్యార్థుల మహాసభ కూడా జరిగాయి. తిరుచూరాపల్లి నుంచి వచ్చిన సయ్యద్ మూర్దు సాహెబ్ ఖిలాఫత్ మహాసభకు అధ్యక్షత వహించారు. విద్యార్థుల మహాసభకు జార్జ్ జోసఫ్ అధ్యక్షుడుగా వున్నారు.

మగత నిద్రలో వున్న ఒట్రపాలం నూతనోత్తేజం పొందింది. వాద్యబృందాల ఘోష, ఉపన్యాసాలు, నినాదాలు రెండ్రోజులు అక్కడ మార్మోగాయి. మహావక్త పాలియత్ కుఞ్ఞుణ్ణి అచ్చన్ ఉపన్యాసం ప్రజలను ఉత్తేజితులుగా చేసింది. ఒట్రపాలం మహాసభ ప్రజలలో నూతన చైతన్యం కలిగించింది. అప్పుడు ఒక దురదృష్టకరమైన సంఘటన కూడా జరిగింది.

సహాయ నిరాకరణోద్యమం ప్రారంభమయినప్పుడు, దానినెలాగైనా విఫలం చేయాలన్న అభిప్రాయం పాలకవర్గంలో ఏర్పడింది. హిందువులు, మహమ్మదీయులు కలిసి స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొనడాన్ని వారు సహించలేక పోయారు. ఉద్యమం జయప్రదం కాకుండా చూడడానికి పోలీసులు మార్గాలు అన్వేషించసాగారు.

పోలీస్ సూపరింటెండెంట్ హిచ్‌కాక్ నాయకత్వంలో అసంఖ్యాకులైన పోలీసులు సమావేశవేదికకు దూరంగా కాచుకుని వున్నారు. మహాసభకు జీవనాడిగా భాసించిన రాముణ్ణిమీనన్‌ని హింసించడానికి ఏదైనా అవకాశం దొరకదా? అని ఎదురు చూడసాగారు. మహాసభ ప్రారంభమైన రెండవ రోజు మధ్యాహ్నం మహాసభ ఆవరణలోనూ, వెలుపలా పెద్ద అలజడి చెలరేగింది. రాముణ్ణి మీనన్‌ను, ప్రతినిధుల నాయకుడు సి. మాధవన్ మీనన్‌ను, మరికొందరిని పోలీసులు హింసించారన్న వార్త వ్యాపించింది. గాయపడి రక్తం స్రవిస్తుండగా సొమ్మసిల్లి పడిపోయిన రాముణ్ణి మీనన్ ని ఒక మహమ్మదీయ మిత్రుడు భుజాలమీద వేసుకుని మహాసభ ఆవరణలోకి ప్రవేశించడంతో, ప్రజలలో ఆవేశం పెల్లుబికింది. అయినప్పటికీ మన పోరాటం - హింసాత్మకం కాదన్న భావనే, ప్రజలను పోలీసుల మీదకి విజృంభించకుండా ఆపింది.

ఇటువంటి విపరీతాలేవో జరుగుతాయని భయపడి చాలా మంది ఒట్రపాలం విడిచి పారిపోయారు. జరిగిన సంఘటనపై దర్యాప్తు జరిపి ఒక నివేదికను సమర్పించడానికి మహాసభ ఒక కమిటీని ఏర్పాటు చేసింది. కాంగ్రెస్ మహాసభ అధ్యక్షులు ప్రకాశం, ఆహ్వానసంఘం అధ్యక్షులు ఎల్.ఎ. సుబ్బరామయ్యర్, ఖిలాఫత్ మహాసభ అధ్యక్షులు సయ్యద్ మూర్తు సాహెబ్, విద్యార్థుల మహాసభ అధ్యక్షులు జార్జ్ జోసఫ్, కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి హోదాలో నేనూ ఆ కమిటీ సభ్యులం. దెబ్బలకు గాయపడినవారిని, ఇతరులను కలుసుకుని, సాక్ష్యాలను సేకరించి నేను కోళిక్కోడ్ వెళ్లాను. ఒక నెలలో నివేదిక వెలువడింది. పోలీసులు హిచ్‌కాక్ ఆజ్ఞమేరకు కావాలనే కాంగ్రెస్ ప్రతినిధులను గాయపరిచారనీ అలాంటి హింసాత్మక చర్యలు తీసుకోవడానికి దోహదం చేసేలా ప్రజలు ఎలాంటి తప్పూ చేయలేదని మా ఏకాభిప్రాయం. ఆ నివేదిక తనకు పరువు నష్టం కలిగించిందని మా మీద కేసు

పెట్టారు. అది మేము న్యాయ స్థానాలను బహిష్కరించిన సమయం కావడం వల్ల మాలో నలుగురూ కేసు వాదించడానికి కోర్టుకి వెళ్లలేదు.

భారతదేశంలో ఇవాళ అమలులో వున్న నీతి న్యాయాల మీద ఈ ప్రతివాదికి విశ్వాసం లేక పోవడం వల్ల ఈ కేసును వాదించడానికి సిద్ధంగా లేమని నేను కోర్టువారికి తెలియజేశాను. ఆ కేసులో క్రింది కోర్టు, హైకోర్టు, హిచ్‌కాక్ కు అనుకూలంగా తీర్పునిచ్చాయి. అయినప్పటికీ ప్రజల అభిప్రాయం మా నివేదికకు అనుకూలంగానే వున్నది.

హిచ్‌కాక్ పేరు మోసిన ఒక పోలీస్ అధికారి. ఆయన చాలాకాలం మలబారులో వున్నారు. ఏరనాడులో ఘర్షణ జరిగినప్పుడు ఉద్యమకారులను పట్టుకోవడంలో విశేషమైన ప్రజ్ఞ కనుబరచినవారు. పెన్షన్ పొంది ఇంగ్లాండు తిరిగివెళ్తున్నప్పుడు చనిపోయారు. ఆ రోజులలో పోలీసు వాళ్లు ప్రయత్నించి ఆయనకు ఒక స్మృతి చిహ్నం ఏర్పరచారు. కోళిక్కోడ్ నుంచి వెళ్లే రోడ్డు మంజేరికి మళపురానికి చీలే స్థలంలో దానిని ఏర్పరచారు. అది పెద్ద ఉద్యమం జరిగిన స్థలం అని చెప్పాలి. దేశం స్వాతంత్ర్యం పొందిన తర్వాత, ఆ స్మృతి చిహ్నాన్ని అక్కడవుంచడం అవమానకరం అని భావించి దానిని తీసివేశారు. అయినప్పటికీ దాని గుర్తులు ఇంకా అలాగేవున్నాయి.

కొందరు ఒక వ్యక్తికి స్మృతిచిహ్నం ఏర్పరుస్తారు, మరికొందరు దానిని నాశనంచేస్తారు, ఇది సర్వసాధారణంగా మనం చూసే నిజం. మనదేశంలో మాత్రమేకాదు, విదేశాలలోనూ యిది మామూలే. బ్రిటిష్ వారికాలం నుంచి శిలలు, చిత్రాలు, ఊరుపేర్లని మార్పులకోసం మనదేశంలో అలజడిజరుగలేదా? జరిగిన చరిత్రను మార్చడం ఎవరివల్లా సాధ్యంకాదు. అది అవసరంలేదు కూడా. అన్యుల అధికారాన్ని జ్ఞాపకం చేసే చిహ్నాలను మనం గుణపాఠాలుగా స్వీకరించాలి. గడిచిన ప్రపంచ యుద్ధంలో జపాన్‌వారు సింగపూర్‌ను వశపరచుకున్నప్పుడు బ్రిటిష్ పరిపాలనను జ్ఞాపకంచేసే పలు చిహ్నాలను నాశనంచేశారు. తాము అధికారంలోని వచ్చినదానికి గుర్తుగా కొన్ని భవనాలను, సంస్థలను ఏర్పాటుచేశారు. బ్రిటిష్ వాళ్లు మళ్లీ దానిని వశపరచుకోగానే జపాన్ ఏర్పరచిన దానినంతా నేలమట్టంచేశారు. ఈ విధంగా చరిత్రను మార్చడం సాధ్యమా? జరిగిన సంఘటనలకు జరగనట్లుగా చెయ్యడం వీలవుతుందా?

# అపాయ సూచనలు

ఆరునెలల కారాగారశిక్ష అనుభవించిన తర్వాత యాకొబ్‌హసన్, మాధవన్ నాయర్, గోపాలమీనన్, మొయిదీన్‌కోయా 1921వ సం॥ ఆగస్టు 17న విడుదల అయ్యారు. ప్రజలు వారు కోళిక్కోడ్ వచ్చేంత వరకు ప్రతిచోట స్వాగతోపచారాలు ఏర్పాటుచేశారు. కాంగ్రెస్ సభ్యులు, ఖిలాఫత్ సభ్యులు, సామాన్య ప్రజానీకం కోళిక్కోడ్ రైలు స్టేషన్‌లో వాళ్లకోసం గుమికూడారు. యాకోబ్ హసన్‌సాహెబ్ తిన్నగా మద్రాసు బయలుదేరారు. తక్కిన ప్రముఖులను ఊరేగింపుగా నగరవీధులలో తీసుకెళ్లడానికి ఏర్పాట్లుచేశాము. ఊరేగింపులో మొదట టి.పి. సాత్తుక్కట్టి నాయర్, తగిన దుస్తులు ధరించి, గుర్రంమీద బయలుదేరారు. వాద్యఘోషలు, జయజయధ్వనులు మారుమ్రోగుతూవుంటే నెమ్మదిగా ముందుకు సాగిన ఆ ఊరేగింపు అరుదైన దృశ్యంగా కనిపించింది.

సుస్వాగత ప్రవేశ ద్వారాలతో తోరణాలతో, అలంకరించబడిన వీధులగుండా ఊరేగింపు వెళుతున్నప్పుడు చాల చోట్లలో ప్రజలు నాయకులకు పూలమాలలు వేసి సత్కరించారు. ఊరేగింపు సాలపురం కాంగ్రెస్ కార్యాలయానికి రావడానికి మూడుగంటలుపట్టింది; ఆ రోజు సాయంకాలం సముద్రపు ఒడ్డున జరిగిన బహిరంగ సభకు వేలకొలది ప్రజలు హాజరయ్యారు. హిందు, ముస్లిం ఐకమత్యం మహోన్నతస్థితిలో వున్న రోజులు అవి. ఆ రోజును ఒక పండుగ రోజుగా నగర ప్రజలు జరుపుకున్నారు. ఇవన్నీ ముగిసిన తర్వాత మాధవన్ నాయర్ మంజేరి వెళ్లారు. ఈ స్వాగత కార్యక్రమం ఏర్పాటుల్లో నేను తలమునకలుగా వుండడంవల్ల కొన్నాళ్లు కార్యాలయం పనులు కొన్ని ఆగిపోయాయి. అందువల్ల వాటిని మళ్లీ ప్రారంభించాను. నాయకులు జైలు నుంచి విడుదలయిరావడానికి ముందు కొన్నాళ్ల నుంచే ఏరనాడులో పరిస్థితి అంత తృప్తికరంగా లేదని, కొన్ని ఫిర్యాదులు కాంగ్రెస్ కార్యాలయానికి రాసాగాయి. అక్కడ పోలీసువాళ్లు ఖిలాఫత్ కమిటీలను, కాంగ్రెస్ కమిటీలను విడగొట్టడానికి ప్రయత్నించారు. ఏదో ఒక సాకు చెప్పు కుంటూ ఖిలాఫత్ కార్యాలయాలకు వెళ్లి పనిచేసే వాళ్లను కొట్టడం, ఖైదు చెయ్యడం సాధారణ సంఘటనలయ్యాయి. అలాంటి

అక్రమాలకు సభ్యులు కొన్నాళ్లు ఓర్పువహించారు. అహింసాయుతమైన చర్యలను ఎన్నాళ్లు సహించడం అన్నది వారికి అర్థం కాలేదు, చాలసార్లు ఏరనాడు బహిరంగసభకు నేను వెళ్లినప్పుడు కూడా ఈ విషయాలను నాకు స్వయంగా తెలియజేశారు. పోలీసు వాళ్లు ఎన్ని దౌర్జన్యాలకు దిగినప్పటికి మనం మాత్రం అహింసాయుతమైన మార్గం నుంచి దూరంకాకూడదని నేను వారికి చెప్పాను. అయినప్పటికీ పోలీసు వారి ఎడతెరపిలేని హింసాత్మక చర్యలను ప్రజలు తట్టుకోలేకపోయారు. సభ్యుల వద్ద నుంచి వచ్చిన నివేదికలు ఏరనాడులోనే మరికొందరి వద్ద నుంచి వచ్చిన ఫిర్యాదులు అందుకు సాక్ష్యాలుగా కనిపించాయి.

కాంగ్రెస్ కమిటీలు, అభివృద్ధి చెందడం పోలీసువాళ్లు అంతగా పట్టించుకోలేదు. అయితే ఖిలాఫత్ కమిటీలు పెరిగి రావడం వాళ్లు చూసి సహించలేక ఆవేశపరులయ్యారు. ఏరనాడు ఎన్నో ఉద్యమాలకు రంగస్థలంగా వుండడంతో, ఖిలాఫత్ కమిటీలు మరోకొత్త కలవరానికి నాంది పలుకగలవని వాళ్లు భయపడ్డారు.

ఖిలాఫత్ కమిటీలు అంటే ఏవో అని పాఠకులు అనుకోవచ్చు. ఖలీఫ్ అన్న అరబ్బు పదానికి ప్రతినిధి అని అర్థం. దైవప్రతినిధి అన్న అర్థంతో ఆ మాట వాడుకలోవుంది. మహమ్మదు నబి పైలోకం చేరాక, దేశ పరిపాలనా బాధ్యతలు, మతాధికారం ఒకరి చేతికే అప్పగించబడ్డాయి. ఆ విధంగా మొదటి ఖలీఫ్‌ను ఎన్నుకున్నారు. తర్వాత కొంతకాలం గడిచాక ఆ పదవి అరేబియా రాజకుటుంబ పారంపర్యానికి పరిమితమయింది. చివరగా అది టర్కీ సుల్తాను వశమయింది. సుల్తానుకు లభించిన ఈ గొప్పపదవిని మహమ్మదీయులు మామూలుగానే అంగీకరించారు. ఎందుకంటే ఖలీఫ్ పదవి స్వీకరించే నాయకుడు, తానే పరిపాలనాధికారాన్ని నిర్వహించగల రాజుగా వుండాలనే నిర్బంధం వారికి వుండేది. ఆ పరిస్థితిలోనే ఖలీఫ్ మహమ్మదీయుల పుణ్యస్థలాలను, పరిరక్షించి నిర్వహించగల శక్తిగల వ్యక్తిగా వుండాలని వారు భావించారు. టర్కీ సుల్తాను వద్ద యీ అర్హతలన్నీ వుండడంవల్ల ఎవరుగాని, అతని అర్హత పట్ల అనుమానం వెలిబుచ్చలేదు. ఇండియాలోని మహమ్మదీయులు కూడ టర్కీ సుల్తాన్‌ను ఖలీఫ్‌గా అంగీకరించారు. బ్రిటిష్ వాళ్లు కూడ టర్కీ సుల్తాన్‌ను, ఆ పరిస్థితిలో గౌరవించారు.

ఖలీఫ్ ఆజ్ఞలను, అల్లా ఆజ్ఞలుగానే భావించాలనీ, వాటికి భిన్నంగా నడచుకునే మహమ్మదీయులకు పరలోక పదవి పొందే మార్గంలేదనీ వాళ్ల విశ్వాసం. అందువల్ల ఖలీఫ్ అధికారాలకు ఎటువంటి, ఆటంకాలూ కలగకుండా

చూసుకోవడం మహమ్మదీయుల ధర్మం అన్నది కూడా వాళ్ల సిద్ధాంతం. ఇందువల్ల, ఇస్లాం మతస్థుల పుణ్యస్థలాలు గల అరేబియా, మహమ్మదీయుల ప్రత్యక్ష అధికారానికి పరిరక్షణకు లోబడి వుండాలన్న పట్టుదల, దృఢమైన క్రమశిక్షణ వాళ్లల్లో వుండేది.

ఖిలాఫత్ సంగతి చెప్పుకునే ముందు దాని తత్వసారమైన ఈ రెండు అంశాలను కూడ గుర్తుంచుకోవాలి. మొట్టమొదటిదిగా ఖిలాఫత్, పదవినీ, అధికారాన్ని, సుస్థిరంచేసే బాధ్యత అందరి మహమ్మదీయులకూ వున్నది. రెండవది ఇస్లాం మతస్థుల కేంద్రస్థానంగా వున్న అరబ్‌దేశం అక్కడ వున్న పుణ్యస్థలాలు, యితర మతస్థుల అధికారంలోకి రాకూడదు. ఆ విధంగా పరిరక్షించ వలసిన బాధ్యత మహమ్మదీయులందరికీ వున్నది. ఈరెండు విశ్వాసాలువాళ్లలో చాలకాలంగా వ్రేళ్లూని వున్నాయి.

1914వ సంవత్సరం ప్రారంభమయిన ప్రథమ ప్రపంచ సంగ్రామంలో టర్కీసుల్తాన్ బ్రిటిష్ వాళ్లకు వ్యతిరేకంగా జర్మనీ పక్షం చేరారు. ఈ సంఘటన భారతీయ, మహమ్మదీయుల మధ్య గందరగోళం ఏర్పరచింది. వాళ్లు బ్రిటిష్ సామ్రాజ్య ప్రజలు కదా? అందువల్ల, బ్రిటిష్ వారికి విశ్వాసపాత్రులుగా మసలవలసివచ్చింది. అదే సమయంలో టర్కీసుల్తాన్ వాళ్ల మత నాయకుడైన ఖలీఫ్ కదా? ఖలీఫ్ పదవికి అధికారానికి మద్దతుగా నిలబడవలసిన బాధ్యత మహమ్మదీయులందరికీ వుందికదా? భారతీయ మహమ్మదీయుల ధర్మ సంకట పరిస్థితిని బాగా గ్రహించిన బ్రిటిష్ వాళ్లు యుద్ధసమయంలో వాళ్ల మద్దతు పొందడానికి ఒక తంత్రం పన్నారు.

మహమ్మదీయుల పుణ్యస్థలాలకు ఎటువంటి హానీ కలుగజేయమని, యుద్ధం టర్కీ రాజుతో తప్ప ఖలీఫ్‌తో కాదనీ, ఐరోపా చట్టాలకు లోబడకుండా ఖలీఫ్‌కు స్వయంగా అధికారం చలాయించడానికి మద్దతునియ్యాలనే మహమ్మదీయుల విశ్వాసాలను తాము బాగా గ్రహించి అంగీకరిస్తున్నామనీ, బ్రిటిష్ చక్రవర్తి ప్రతినిధి అన్న స్థాయిలో నాటి భారత వైస్రాయ్ ఒక ప్రకటన చేశారు. అది భారతీయ మహమ్మదీయులను అప్పటికి శాంతపరచింది. దాని ఫలితంగా బ్రిటిష్ వారికి యుద్ధ సమయంలో వాళ్ల సహాయసహకారాలు విరివిగా లభించాయి.

యుద్ధం ముగిసింది. విజయం సాధించిన బ్రిటిష్ వాళ్లు యిచ్చిన మాటను నిలబెట్టుకోవాలని అనుకోలేదు. 1920వ సంవత్సరం జూన్‌లో, ప్యారీస్ నగరంలో జరిగిన ఒప్పందం, ఖలీఫ్ పదవికి చాల హాని కలిగించేట్టుగా వుంది. సుల్తాన్ పదవినీ అధికారాన్నీ విజేతలు చాలవరకు కత్తిరించి కుదించారు. ఎటువంటి అధికారమూ లేకుండా సుల్తాన్ బొమ్మసుల్తాన్‌గానే మిగిలారు.

తమ ఖలీఫ్‌కు దాపురించిన ఈ స్థితి భారతీయ మహామ్మదీయుల మధ్య అశాంతిని కలుగజేసింది. ఖలీఫ్ పోగొట్టుకున్న పదవి, అధికారాలను మళ్లీ సాధించి యివ్వడం తమ బాధ్యతగా భావించారు. దాని కోసం వాళ్లు పంపిన విన్నపాలు, ఫలితం యివ్వక పోయేసరికి తమ న్యాయమైన కోరికలను, తెలియజేయ్యడానికి ఉద్యమం లేవదియ్యాలని వాళ్లు నిశ్చయించారు. మహామ్మదీయుల ఈ లక్ష్యసాధనకు సహాయంచేస్తామని కాంగ్రెస్ వాళ్లు మాటయిచ్చారు. ఈవిధంగా సహాయనిరాకరణోద్యమంలో ఒక అంశంగా ఖిలాఫత్ కోరికకూడ చోటుచేసుకుంది. దేశమంతటా ఖిలాఫత్ కమిటిలు రూపొందాయి.

మామూలు ప్రజలు, ఖిలాఫత్ గురించి వివరంగా తెలుసుకోలేదు. ఇస్లాం మతానికి విరుద్ధంగా బ్రిటిష్ ప్రభుత్వం ఏదో చేసిందనీ, అందువల్ల బ్రిటిష్ ప్రభుత్వంతో సహాకరించకూడదని మాత్రం ఒక సగటు మహామ్మదీయ పౌరుడు భావించాడు. ఆ అభిప్రాయమే వాళ్లలో ఒక ఉద్వేగాన్ని రేకెత్తించింది. తమ మతాభిమానానికి యిబ్బంది కల్గిందని గ్రహించిన మహామ్మదీయులు దాన్ని కాపాడడానికి ఎటువంటి సాహసానికైనా సిద్ధమైవున్నారని బ్రిటిష్ అధికారులు గ్రహించారు. అందువల్ల మహామ్మదీయులు అధిక సంఖ్యలో వున్న ఎరనాడులో ఖిలాఫత్ కమిటీలు, ఎక్కువ కావడం ఎలాగైన ఆపాలని వాళ్లు నిశ్చయించుకున్నారు.

ఖిలాఫత్ ఉద్యమాన్ని వ్యతిరేకించి రూపుమాపడానికి మలబార్ మహామ్మదీయులతో ప్రభుత్వ అధికారులు ఒక పార్టీని ప్రారంభించారు. ఖిలాఫత్‌లోనూ, కాంగ్రెస్‌లోను చేరడం మతాభిమానంగల ఒక మహామ్మదీయ పౌరునికి తగినపని కాదని ఈ పార్టీ వాళ్లు మాట్లాడసాగారు. 1921వ సం॥ జూలై 24వ తేదీ వుదియపొన్నానిలో ఒక ఖిలాఫత్ సభ జరపడానికి తీర్మానించారు. అదే రోజున దానికి వ్యతిరేకంగా మరోసభను ప్రతిపక్షం వాళ్లు పొన్నానిలో ఏర్పాటు చేశారు. ఈ సభ అధికారుల మద్దతుతో ఏర్పాటు చేయబడింది. ఖిలాఫత్ కమిటీ వాళ్లను ఏ కారణం చూపో అడ్డుపడాలని పోలీసువాళ్లు ఎదురుచూడసాగారు. కొందరు సభ్యులు ఓర్పుతో, శాంతంగా వ్యవహారించడం వల్లే ఆ రోజు పెద్ద ఘర్షణ ఏదీలేకుండా సభ ముగిసింది.

కేళప్పన్ ఆ రోజుల్లో పొన్నాని కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి. గాంధీ సిద్ధాంతాలను దృఢంగా ఆచరించే గాంధీయవాది. పలు సందర్భాలలో ఆయన తన ప్రాణాన్ని కూడ లెక్కచేయకుండా ఉద్యమకారులతో స్వయంగా మాట్లాడి, సమాధానపరిచి కష్టాలు పడ్డ వాళ్లను కాపాడడానికి ముందడుగు వేసి సేవచేశారు.

పొన్నాని సంఘటనలు జరిగిన మూడువారాల అనంతరం తిరూరంగాడిలో నేనొక సభ అధ్యక్షత వహించడం గుర్తుచేసుకుంటున్నాను. ఆ సభను ఖిలాఫత్ సభవాళ్లు ఏర్పాటుచేశారు. కలవరాన్ని రేకెత్తించే సంఘటనలకు పేరుగాంచిన ఆలిముసలియార్, లవక్కుట్టి, కుంజ్జలవి, మొదలైనవారు సభకు వచ్చారు. ఆలిముసలియార్ నాతో వేదిక మీద కూర్చున్నారు, కుంజ్జలవి, సభ్యుల బృందానికి నాయకుడు, లవక్కుట్టి కార్యదర్శులలో ఒకరు పోలీసువాళ్లు అక్రమ చర్యలు చూసి కోపం వహించి హింసకు దిగడం, అహింసా సిద్ధాంతానికి తగ్గది కాదని శాంతంగా తమ తమ బాధ్యతలను నిర్వహించాలనీ నేను ప్రజలకు విన్నవించుకున్నాను.

ఆ రోజుల్లో ఏరనాడు తాలుకా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి ఎం.బి. నారాయణమీనన్ పెరుందల్ మాన్నాలో ప్రాక్టీసు చేస్తున్న న్యాయవాది. ఆయన తన వృత్తిని వదలి కాంగ్రెసుకు సేవచేయడానికి ఏరనాడు వచ్చినివసిస్తున్నారు. ఆయనకు మహామ్మదీయుల ఆచారవ్యవహారాలన్నీ బాగాతెలుసు. చుట్టు జరిగే సంఘటనలను జాగ్రత్తగా పరిశీలించిన నారాయణ మీనన్ రెండు మూడు సార్లు కోళిక్కోడ్ వచ్చి ఏరనాడు పరిస్థితి ప్రశాంతంగా లేదనీ, లోలోపల రగులుతున్నదనీ ముందుగానే హెచ్చరిక చేశారు. పోలీసువాళ్లు అక్రమచర్యలు చూసి సహించలేక ప్రజలు వాళ్లను ఎదిరించి పగతీర్చుకునే విధంగా ఆయుధాలను సేకరించి భద్రపరుస్తున్నట్టు ఆయనకు వివరాలు తెలియవచ్చాయి. తిరూరంగాడి సభలో ఈ విషయాలను నేను మనసులో వుంచుకునే ప్రజలతో ఏ పరిస్థితులలోనూ అహింస జరగకుండా శాంతిని కాపాడాలనీ మరీమరీ వేడుకున్నాను. నా విన్నపం సత్ఫలితం యివ్వాలని ఆశించాను. అయితే ఆ తర్వాత జరిగిన సంఘటనలు, నా నమ్మకం పునాదుల్నే కదిలించివేశాయి.

# మలబారు ఉద్యమ ప్రారంభం

1921వ సంవత్సరం, ఆగస్ట్ 19న రాత్రి పదిగంటలకు అబ్దుల్ రహిమాన్ నన్ను కలుసుకోవడానికి కాంగ్రెస్ కార్యాలయానికి వచ్చారు. ఆ రోజుల్లో ఆయన మలబార్ ఖిలాఫత్ కమిటీ కార్యదర్శి. ముఖ్యమైన కొన్ని విషయాలు చెప్పడానికే అబ్దుల్ రహిమాన్ వచ్చారు. సైనికభటులు, పోలీసువాళ్లు వున్న ఒక ప్రత్యేక రైలు కోళిక్కోడ్ రైలుస్టేషన్ నుంచి వెళ్లిందని, వాళ్లతో పాటు జిల్లా మెజిస్ట్రేటు థామస్, పోలీస్ సూపరింటెండెంట్ హిచ్‌కాక్, ఎ.ఎస్.పి. ఆయూ వున్నారని ఆయన తెలియజేశారు. వాళ్లు ఎక్కడికి వెళ్లారన్న విషయం అబ్దుల్ రహిమాన్‌కు తెలియదు. మలపురానికి సమీపాన వున్న బూక్కోట్టూర్‌కు వెళ్లివుండవచ్చని ఆయన ఊహించారు. కొన్నాళ్ల క్రితం బూక్కోట్టూరులో అనుకోని సంఘటనలు జరిగాయి. అందువల్ల సైనిక భటులు అక్కడికి వెళ్లివుంటారని ఆయన ఊహించారు. వాళ్లు అక్కడ ఎవరినైనా ఖైదుచేసినట్లయితే ఆందోళన చెందవద్దని ప్రజలకు చెప్పడం మంచిదని అనుకుని, అక్కడికి నన్ను వెంటనే బయల్దేరి వెళ్లమని చెప్పడానికే అబ్దుల్‌రహిమాన్ నా దగ్గరకు వచ్చారు. పరిస్థితిని గురించి నేను కొంతసేపు ఆలోచించిన తర్వాత, నేను అప్పుడు వెళ్లకూడదని నిశ్చయించాను. సైనిక భటులు ఫలాన చోటకు వెళ్లారని ఇతమిత్థంగా తెలియదు. వాళ్లు బూక్కోట్టూరుకే వెళ్లారని తెలిసినప్పటికీ, వాళ్లు అక్కడికి చేరే లోపతే నేనక్కడికి వెళ్లడం సాధ్యం కాదు. అందువల్ల అప్పుడు బయలుదేరి ప్రయోజనం లేదనిపించింది. సరైన సమాచారం అందాక ఉదయమే నాకు తెలియపరచమని చెప్పి ఆయన్ను నేను పంపించాను. ఇరవైయ్యోతేదీ మధ్యాహ్నం కోళిక్కోడ్‌లో రకరకాల వార్తలు వ్యాపించసాగాయి. 'ఏరనాడులో ఎక్కడో అల్లర్లు.... సైనికులు చాలామందిని కాల్చిచంపారు. ఉద్యమకారులు కూడా సైనికులు కొందరిని చంపారు. వాళ్లు కోళిక్కోడ్‌కు వస్తున్నారు' అంటూ చాలా వార్తలు నగరంలో వ్యాపించసాగాయి. అసలు విషయాలు తెలుసుకోడానికి ప్రజలు కాంగ్రెస్ కార్యాలయానికి రాసాగారు.

సాయంకాలానికి అల్లర్లు తిరూరంగాడిలోనే ప్రారంభమయ్యాయనీ, ఉద్యమకారులు సైన్యాన్ని తరుమగొట్టారనీ, హత్య, దోపిడి మొదలైన

దురాగతాలు జరుగుతున్నాయనీ వార్తలు అందాయి. వర్ణనాతీతమైన విషాదం నగర ప్రజలను ఆవహించింది. దుకాణాలు, వ్యాపార కేంద్రాలు మూయబడ్డాయి. ప్రజల రాకపోకలు తగ్గాయి. పొద్దుపోయేలోగా ఇళ్లకు చేరుకోవాలని జనం త్వరత్వరగా వెళ్లిపోసాగారు. గట్టిగా మాట్లాడ్డానికి కూడా చాలామంది జంకారు.

కాంగ్రెస్ కార్యాలయానికి ప్రజలు వస్తూపోతూ వున్నారు. రాత్రి పదకొండు గంటల దాకా ఎవరో ఒకరు వస్తూనే వున్నారు. ఆ తర్వాత నేను స్నానంచేసి, భోజనం ముగించి పడుకున్నాను. నిద్రపట్టలేదు. ఏదైనా శబ్దం వింటే వెంటనే లేచిచూసే వాణ్ణి. తర్వాత పడుకునే వాణ్ణి. ఈవిధంగా కొంతసేపు గడిచింది.

రాత్రి ఒంటి గంట అయివుంటుంది. క్రింద ఏదో శబ్దం వినిపించింది. దారిలో ఎవరో ఇటువైపుగా వస్తున్నట్లుగా అనిపించింది. వాళ్లు సమీపించేకొద్దీ వాళ్లమాటలు వినిపించాయి. నేను లేచి వరండాలోకి వచ్చి నిలబడి క్రిందకి చూశాను. ఏడెనిమిదిమంది ఇంటి ముందు వుండడం కనిపించింది. 'ఎవరది' అని అడిగాను. 'మేము ఎరనాడు నుంచి వస్తున్నాము. కొన్ని నిజాలు తెలియజేయడానికి వచ్చాము' అన్నారు. నేను క్రిందకి దిగబోతూండగా మా ఆవిడ- 'ఎవరని తెలుసుకోకుండా ఒంటరిగా వెళ్లకండి. సాత్తుకుట్టి నాయర్‌ను పిలవండి' అన్నది. సాత్తుకుట్టి నాయర్ నాతో పాటే కాంగ్రెస్ కార్యాలయంలో వుంటున్నాడు. అతణ్ణి లేపాను. తలుపు తెరిచి, ఇంటికి పడమటి వైపుగా వున్నగేటు దగ్గరకి వెళ్లాము. మా చేతిలో దీపం వుంది. మేము వాళ్లను అక్కడికి పిలిచాము.

'మేము సెరువణ్ణూర్ వాళ్లం. వీళ్లిద్దరిది తిరూరంగాడి. అక్కడ జరిగిన విషయాలను చెప్పడానికి వచ్చాము' అని అక్కడ వున్న మరో ఇద్దర్ని చూపిస్తూ ఓ వ్యక్తి నాతో చెప్పాడు. కోళిక్కోడ్ సమీపంలో సెరువణ్ణూర్ అనే ప్రాంతం వుంది. అక్కడి నుంచే వాళ్లు వచ్చారు.

సైనికులు ఆరోజు తిరూరంగాడి చేరగానే ప్రజలను ఖైదుచేశారు. మసీదును ముట్టడిచేశారు. వాళ్లు ప్రజలపై తుపాకులు ప్రేల్చేసరికి ప్రజలు కొందరు వారిని ఎదిరించారు. వచ్చిన వాళ్లు ఈ విషయాలను వివరంగా చెప్పి కలెక్టర్ థామస్, హిచ్‌కాక్ మృతి చెందినవారి పట్టీలు వున్నట్లు చెప్పారు. అది నిజం కాదు.

'మేము ఇక ఏం చెయ్యాలి?' అని వాళ్లు నన్ను అడిగారు. 'మీరు ఇప్పుడు ఏమి చెయ్యవద్దు. ప్రశాంతంగా మీ ఇళ్లకు వెళ్లిపొండి. చాలు. నేను పొద్దున్నే తిరూరంగాడికి బయలుదేరి వెళతాను. అక్కడినుంచి తిరిగి వచ్చాక ఏం చెయ్యాలో వివరంగా చెబుతాను. అని నేను సమాధానం చెప్పాను.

'రేపు సైనికులు అక్కడికి వస్తారు. మనం వాళ్లని ఆటంకపరచాలి లేదా! చెట్లు నరికి రోడ్డుకు అడ్డంగా వేస్తే ఏం?' అని అవతలి వారి ప్రశ్న.

'అలా చేసినట్లయితే అది మరిన్ని కొత్త ఉపద్రవాలు తెచ్చిపెడుతుంది. పైగా ఇలా చేయడం ద్వారా సైనికులను రాకుండా ఆపలేము. ఏమైనాసరే మీరు అలాంటి పనుల చేయకండి' అని చెప్పి వాళ్లను పంపేశాను. ఉదయం ఏం చెయ్యాలని ఆలోచించాను. మళ్లీ పడుకున్నప్పటికీ నిద్ర పట్టలేదు.

ఇరవై ఒకటో తేదీ తెల్లవారింది. ఘర్షణ గురించిన వివరాలు తెలుసుకోవడానికి ప్రజలు కాంగ్రెస్ కార్యాలయం ముందు గుమిగూడారు. రకరకాల వార్తలు కల్పించినవి. అదనంగా జోడించినవి నగరమంతా వ్యాపించాయి. మేము కొందరం అల్లర్లు జరుగుతున్న స్థలానికి బయలుదేరుతున్నామని తెలియగానే కొందరు మిత్రులు అది తగని సాహసమని మాకు చెప్పడానికి వచ్చారు.

ఉదయం ఎనిమిది గంటలకి నేను, యు. గోపాలమీనన్, ఇ. మొయితు మౌల్వీ ఒక కారులో బయలుదేరాము. టి.పి. సాత్తుకుట్టి నాయర్ కూడా మాతో వున్నారు. దారిలో గుండోట్టి 'తంగళ్' ఇంటి గడప ఎక్కగానే, అక్కడ మరి కొందరు మమ్మల్ని కలుసుకున్నారు. అక్కడే మొదటి రోజు తిరూరంగాడిలో జరిగిన సంఘటనలను గురించి మేము వివరంగా తెలుసుకోవడం సాధ్యమైంది. ఆ రోజే ఉదయం తిరూరంగాడి నుంచి ఉద్యమకారులు పెద్దగుంపుగా మంజేరికి బయలుదేరినట్లు తెలిసింది. వాళ్లు మంజేరి చేరేలోగా, మేము అక్కడికి చేరుకోవాలని నిశ్చయించుకున్నాము.

కారులో కొంతదూరం వెళ్లాక, దారిలో పెద్దచెట్లు నరికి రోడ్డుకి అడ్డంగా వేసివుండడం వల్ల కారు అక్కడే ఆపవలసి వచ్చింది. అక్కడున్న కొందరు మమ్మల్ని సమీపించారు. వాళ్లు మమ్మల్ని ఫలాన అని గుర్తించారు. దారిపొడవునా ఆవిధంగా చెట్లు నరికి పడవేశారని, మంజేరి వరకు మేము కారులో వెళ్లడం సాధ్యంకాదని వాళ్లు తెలియజేశారు. కాంగ్రెస్ పార్టీ ఆజ్ఞప్రకారమే చెట్లు నరికి రోడ్డుకు అడ్డంగా వేశారని, దాన్ని గమనించడానికి మేము వచ్చినట్లు వాళ్లు అనుకోవడం మేము గ్రహించాము. ఈ స్థితిలో మంజేరికి ఎలా చేరుకోడం? ఇక ప్రయోజనం లేదని గుండోట్టికి తిరుగుముఖం పట్టాము. కారు అక్కడే ఆపి మేము కాలినడకనే తిరూరం గాడికి నడిచివెళ్లాము.

గుండోట్టి నుంచి తిరూరంగాడి వెళ్లడానికి సుమారు రెంటుగంటలు పట్టింది. పొలాలు, మైదానాలు, గుబుర్లు, గుట్టలు దాటుకుంటూ వెళ్లడం కష్టమే అనిపించింది. అక్కడక్కడ మా పట్ల సానుభూతి గల పౌరులు దారి పొడవునా

కొబ్బరి బోండాలు, అటుకులు ఇచ్చి మాకు ఉపచారాలు చేశారు. అల్లర్ల గురించి ఎన్నోకొత్తవిషయాలు వాళ్లు చెప్పారు. తిరూరంగాడికి సమీపంలో వున్న ఏటిగట్టుకు చేరేప్పటికి నాలుగు గంటలయింది. మేము వస్తున్న సమాచారం అక్కడివాళ్లకి ముందు గానే అందింది. ఏటి అవతలి ఒడ్డున ఒక పెద్ద గుంపు మా కోసం ఎదురు చూస్తున్నారు. మేము ఏరుదాటి వెళ్లాము. అక్కడ చాలామంది ఆయుధాలతో కనిపించారు. పడవ దిగి మేము అల్లర్లు జరిగిన చోటికి వెళుతుంటే మా వెంట ఆ గుంపులోని వాళ్లూ వచ్చారు.

మేము ఎరిగున్న వాళ్లు చాలా మంది ఆ జనసందోహంలో కనిపించారు. జరిగిన సంఘటనలను వాళ్లు వివరంగా తెలియజేశారు. అల్లర్లు జరిగిన ప్రదేశాలను వాళ్లు చూపారు. ఒక డాబా యింటికి మమ్మల్ని తీసుకువెళ్లారు. నేను ఆ ఇంటి డాబా మీదనుంచి క్రింద గుమిగూడిన ప్రజలను చూశాను. తిరూరంగాడిలో జరిగిన విషాధ సంఘటనల గురించి విచారించి ప్రజల క్షేమం కోసం శాంతిని పరిరక్షించడమే మంచిదని వాళ్లకి తెలియచెప్పాను. హితోపదేశాలు వినే స్థితిలో వాళ్లు లేరు అన్న సంగతి నేను గ్రహించాను. అయినప్పటికీ ఓర్పు, వివేకమూ, ప్రధానంగా చూపవలసిన సమయం అది అని గ్రహించిన కొందరు సభ్యులు అక్కడ లేక పోలేదు. వాళ్లు అక్కడ వున్న వారిలో కొందర్ని అనునయపరిచి, మంచితనంతో శాంతిని పరిరక్షించగలరన్న నమ్మకంతోనే నేను అలా మాట్లాడాను. 20న జరిగిన విషయాలను ఇక్కడ క్లుప్తంగా తెలియజేస్తున్నాను.

ఆగస్ట్ పంధొమ్మిదో తేదీ రాత్రి, సైనికులు, పోలీసువాళ్లు ప్రయాణం చేసిన ప్రత్యేక రైలు కోళిక్కోడ్ నుంచి బయలుదేరి పరప్పనాంగాడిని చేరింది. సైనికులు అక్కడ దిగిపోయారు. అక్కడి నుంచి సమీపంలో వున్న తిరూరంగాడికి వెళ్లారు. తిరూరంగాడికి వెళ్లేదారులలోను, ఏటి గట్ల వద్ద, వాళ్లు కాపలావాళ్లను నిలబెట్టారు. వేకువ జామున అయిదు గంటలకల్లా ఈ ఏర్పాట్లన్నీ జరిగిపోయాయి. తిరూరంగాడి తూర్పువైపున వున్న మసీదు ద్వారాన్ని, ఖిలాఫత్ కార్యాలయాన్ని, కొందరు ప్రముఖుల ఇళ్లను, సైనిక భటులు ఆక్రమించారు. తెల్లవారింది. జిల్లా మేజిస్ట్రేట్ థామస్, పోలిస్ సూపరింటెండెంట్ హిచ్‌కాక్ మరికొందరు అక్కడ సోదా జరిపారు. ఖిలాఫత్ కార్యాలయంలోని 'రికార్డుల'ను అపహరించారు. కొందర్ని ఖైదు చేసి పోలీస్ స్టేషన్‌కి తీసుకువెళ్లారు. అంతవరకు దొమ్మి ఏదీ చెలరేగలేదు. వేకువ జామున ఈ విషయాలు అందరికీ తెలిసిపోయాయి. తిరూరంగాడి మసీదును ముట్టడిచేశారని, ఆ మసీదును నేలమట్టం చేయనున్నారనీ మహమ్మదీయులు ఇళ్లల్లో ప్రవేశించి వారిని అరెస్ట్ చేశారనీ, కొందరిని కాల్చి

చంపారనీ వార్తలు పరప్పనంగాడి, తానూర్, తిరూర్, కొట్టెక్కల్ మొదలైన ప్రదేశాలకు దావానలంలా వ్యాపించాయి. మహమ్మదీయులు ఎక్కువగా నివసించే ప్రాంతాలు అవి. పలు ప్రాంతాలనుంచి మహమ్మదీయులు తిరూరంగాడికి చేరుకున్నారు. ఫైరు చేసినవారు పోలీసుల కాపలాలో వున్నారని తెలుసుకుని, ప్రజావెల్లువ అక్కడికి తరలింది. దాదాపు ఒక ఫర్లాంగు దూరం వెళ్లేసరికి వాళ్లను చూసి కొందరు సైనికులు, పోలీసులు పోలిస్‌స్టేషన్ నుంచి వారి వైపు వచ్చారు. 'మీకేం కావాలి?' అని అడిగారు. 'అరెస్ట్ చేసిన వారిని విడుదల చేయ్యాలి. మాకు కావలసింది అదే' అన్నారు ఆలిముసలియార్. తిరూరంగాడిలో తూర్పు మసీదులో మతవిద్యా బోధకుడుగా వుండేవారు ఆలిముసలియార్. అక్కడ వున్న మహమ్మదీయుల్లో ఆయనకు మంచి పలుకుబడి వుండేది.

'అరెస్ట్ చేసిన వాళ్లను వదిలివేస్తాం. మీరిక్కడే వుండండి' అని హెడ్ కానిస్టేబుల్ మొయ్‌దీన్ అన్నాడు. ఆ ప్రకారమే అందరూ అక్కడే కూర్చున్నారు. అర నిముషం అయ్యేలోపల, ఆ ప్రజలపై కాల్పులు జరపవలసిందిగా సైనికాధికారి ఆజ్ఞాపించాడు. వెంటనే చెవులు అదిరేలాగ తుపాకులు మోగాయి. తుపాకీ శబ్దాలు, గాయపడినవారి ఆర్తనాదాలు, భయంతో చెల్లాచెదురుగా పరిగెత్తిన వారి దీనారావాలు... వీటన్నిటితో ఆ ప్రదేశం ఒక చిన్న యుద్ధరంగంగా మారింది. సైనికుల మోసాన్ని, ఈ ఘోరకృత్యాన్ని చూసి ఉగ్రులైన ప్రజలు తమ చేతుల్లో వున్న ఆయుధాలతో వారిని ఎదిరించారు. తుపాకీ గుళ్లను లెక్క చెయ్యకుండా వారు ముందుకు అడుగు వేశారు. చాలామంది నేలకూలారు. అప్పటికీ వాళ్లు సైనికులని ఎదిరించడం మానలేదు. హెడ్ కానిస్టేబుల్ మొయ్‌దీన్, ఇద్దరు తెల్లవారు మరణించిన వారిలో కొందరు. సైనికులు భయపడి పోలిస్‌స్టేషన్‌లో దాక్కున్నారు. అక్కణ్ణించి గుంపు కదిలింది, చనిపోయిన వారిని తీసుకుపోవడానికి, గాయపడిన వారికి చికిత్స చేయించడానికి. ఆలిముసలియార్ ఆయన అనుచరులూ, మసీదుకు వెళ్లారు.

పరప్పనంగాడి, తానూర్, మొదలైన ప్రాంతాలనుంచి వచ్చిన ప్రజలు ఈ సంఘటన తర్వాత తిరిగి వెళ్లేప్పుడు ప్రభుత్వ కార్యాలయాలలోను, పోలీస్ స్టేషన్‌లోను, రైల్వే స్టేషన్‌లోను, న్యాయస్థానాల్లోను జొరబడి కొల్లగొట్టారు. రైలు పట్టాలను తొలగించారు. తంతి స్థంభాలను పడద్రోశారు. అన్నిటికీ తెగించిన ఉద్యమకారులుగా వాళ్లు మారారు. ఆ ప్రాంతాలలోని ప్రజలకు, భయాందోళనలు అలుముకున్నాయి.

తిరూరంగాడిలో జరిగిన సంఘటనల గురించి తెలిసి అక్కడున్న సైనికభటులు రెండు లారీలలో, కార్లలో మలప్పురం నుంచి బయలు దేరి ఉద్యమకారులను అడ్డగించారు. ఆయుధాలను లాక్కుని మనుషులను చంపారు.

తమకు ఏవిధం గానూ తప్పించుకునే మార్గం లేదని గ్రహించిన, థామస్, హిచ్‌కాక్ ఇత్యాదులు ఆ రాత్రంతా పోలీస్ స్టేషన్ లోనే దాక్కున్నారు. వేకువజామున అయిదు గంటలకు కోళిక్కోడ్‌కు బయలుదేరారు. అక్కడక్కడ రైలు పట్టాలు తొలగించబడడం వల్ల, రైలులో వెళ్లడానికి సాధ్యంకాలేదు. అందువల్ల వారు రైలు మార్గంలో పరుగెత్తసాగారు. ఒక పెద్ద గుంపు వాళ్లను వెంబడించింది. ఫరోక్ వచ్చిన తర్వాత వాళ్లు రైలెక్కి కోళిక్కోడ్ వెళ్లారు.

జరిగిన సంఘటనలు వివరంగా తెలుసుకున్న తర్వాత మసీదుకు వెళ్లి అలిముసలియార్‌ను చూడాలనుకున్నాము. అయినప్పటికీ పొద్దుపోవడంవల్ల మేము మసీదుకు వెళ్లలేదు. మేము తిరూరంగాడి నుంచి తిరిగి వచ్చేప్పుడు రాత్రి ఎనిమిది దాటింది. కాగడాలతో మెల్లిగా నడిచాము. చిట్టడవులూ, వెదురుపొదలూ వున్న దారిని దాటి గుండేట్టి చేరేప్పటికి రాత్రి పదకొండుగంటలైంది. 'తామరి' ఇంట్లో అతిథులుగా అల్పాహారం, కాఫీ తీసుకుని కోళిక్కోడ్ బయలుదేరాము.

ఫరోక్ కు తూర్పుగా ఎనిమిది మైళ్ల దూరంలో ఒక ప్రాంతానికి చేరుకున్నాక, రోడ్డు మీద కొందరు నిలబడి వుండడం చూశాము. వారు ఆపమని చేతులు వూపారు. కారు ఆపి కిందకి దిగిచూసేప్పటికి అక్కడ వున్న చిన్న వంతెన విరిగిపడి వుండడం కనిపించింది. మేము ఉదయం ఆ దారి గుండా వెళ్లడం చూసి తిరిగి రాగలమని రోజంతా కాచుకుని వున్నట్లు తిరిగి రాకపోయేసరికి వేరే దారిగుండా వెళ్లి వుంటామనుకుని వంతెనని పడగొట్టి నట్లు, ఏరుదాటి వెళ్లడానికి కోళిక్కోడ్ చేరుకోవడానికి ఒక తెప్పను ఏర్పాటు చేస్తామని చెప్పారు. వేరే దారిలేక మేము అలాగే వెళ్లవలసి వచ్చింది.

మమ్మల్ని గురించిన వివరాలు ఏమీ తెలియకుండా మా కోసం ఆందోళన పడుతున్న ఆ కుటుంబాల సభ్యులూ, వాళ్ల మిత్రులు ఎంతో సంతోషంగా మమ్మల్ని ఆహ్వానించారు. ఈ లోగా కోళిక్కోడ్‌లోనూ, మరికొన్ని ప్రాంతాలలోనూ సైనిక చట్టం అమలులోకి వచ్చింది.

# పోరాటం జరిగిన ప్రాంతాలలో పర్యటన

తిరూరంగాడిలో జరిగిన సంఘటనలు మమ్మల్ని చాలా ఆవేదనకు గురిచేశాయి. అక్కడి నుంచి తిరిగి వచ్చిన తర్వాత ఆ ఉద్యమం ఇతర ప్రాంతాలకు వ్యాపించకుండా నిరోధించడం మా కర్తవ్యం అయింది. సైనిక చట్టం ఎరనాడులోనూ మరికొన్ని ఇతర ప్రాంతాలలోనూ అమలులో వుండడం వల్ల మేము అనుకున్న ప్రకారం అక్కడ పర్యటించడం సాధ్యంకాలేదు. దానికి అధికారుల నుంచి అనుమతి పొందవలసి వచ్చింది. జిల్లా మెజిస్ట్రేటు నుంచి అనుమతి తీసుకోవాలని అనుకున్నాను. తిరూరంగాడి నుంచి నేను తిరిగివచ్చిన ఆ మర్నాడే జిల్లా మెజిస్ట్రేటు థామన్‌కు ఈవిధంగా ఉత్తరం రాశాను.

'ఎరనాడులో జరిగిన సంఘటనల గురించి మీలాగే నేను విచారిస్తున్నాను. కొందరు ప్రతినిధులతో పాటు నేను పోరాటం జరిగిన ప్రాంతాలకు వెళ్లి, అక్కడి ప్రజలతో మాట్లాడి మళ్లీ ప్రశాంతతను నెలకొల్పడానికి ప్రయత్నం చేయాలనే ఉత్సాహంతో వున్నాను. ఆ ప్రయత్నం నెరవేరే విధంగా, సైనికాధికారులు నాకు కావలసిన సౌకర్యాలు కల్పించి సహకరించేలా ఏర్పాటు చేయవలసిందిగా నేను ప్రార్థిస్తున్నాను. మీ జవాబు చూసి నేను ఎరనాడుకు బయలుదేరగలను'.

ఈ ఉత్తరం జిల్లా మెజిస్ట్రేటుకు అందజేయడంలో చాలా ఇబ్బందులు వున్నట్లు అనిపించింది. సైనికచట్టం అమలులో వుండడం వల్ల జిల్లా అధికారిని గానీ, సైనికాధికారులను గానీ సులభంగా కలుసుకోవడం సాధ్యంకాదు. వాళ్లు ఏమీ చెబుతారో అని ప్రజలు భయపడుతున్నారు. మాణిక్యత్తు గోపాలమీనన్ ఆ రోజులలో చదువు మానేసి కాంగ్రెస్ సేవలో దిగిన విద్యార్థి. సమర్థుడు, సామరస్యంగా మాట్లాడగలవాడు. ఆయన ఆ ఉత్తరాన్ని మెజిస్ట్రేటుకు అందజేయడానికి ముందుకు వచ్చారు. ఖద్దరు చొక్కా, గాంధీ టోపి, అధికారులను ఆందోళనకు గురి చేస్తున్న రోజుల్లో వాటిని ధరించి, వాళ్లను కలుసుకోవడం అరుదైన సాహసకృత్యం. గోపాలమీనన్ ధైర్యంతో ఉత్తరాన్ని తీసుకుని సైనికుల శిబిరానికి వెళ్లి ఇచ్చారు. ఇచ్చి వచ్చిన తర్వాత థామన్‌ను కలుసుకోవడం గురించి తెలియజేశారు. ఉత్తరానికి మర్నాడు జవాబు రాస్తానని చెప్పారట. ఆ సమయంలో గోపాల మీనన్ చూపిన ధైర్యం,

సామర్థ్యం ఎంతైనా మెచ్చుకోతగ్గవి. రాయబారం నెరపడంలో ఆయన చూపిన నేర్పు ఆ తర్వాత గోపాల మీనన్ భారతదేశంలో ఉత్తమ రాజకీయవేత్తగా పేరు తెచ్చుకోవడానికి దోహదం చేసింది.

థామస్ నుంచి జవాబు రావడానికి రెండు రోజులు పట్టింది. ప్రభుత్వాధినేతలతో చర్చించిన తర్వాత జవాబిచ్చారని తెలిసింది. ఆ జవాబు ఇలా వుంది. 'మీరు పంపిన ఉత్తరం అందింది. మీ ప్రచార దుష్ఫలితాలను మీరు ఇప్పుడైనా గ్రహించారు. మీరు రగిల్చిన నిప్పును మీరే ఆర్పే ప్రయత్నంలో వున్నారు. అందుకు నేను చాలా సంతోషిస్తున్నాను. ఉద్యమ ప్రాంతాలకు మీ ఇష్టప్రకారం వెళ్లడానికి నేను, సైనిక అధికారులూ మీకు అనుమతి ఇస్తున్నాము. మీ ప్రయత్నం విజయవంతం కావాలి' ఉత్తరంలో రెండవ వాక్యం నాకు కొంత ఆగ్రహాన్ని కలిగించింది. ఆ రోజే వారికి జవాబు రాశాను.

'మీ జవాబు అందింది. ఉద్యమ ప్రాంతాలకు వెళ్లడానికి అనుమతి ఇచ్చిన మీకు, ఆర్మీ కమాండింగ్ ఆఫీసర్‌కి కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను. అయితే అల్లర్లు ఉత్పన్నం కావడానికి నా ప్రచారమే కారణం అన్న ఆరోపణను నేను ఖండిస్తున్నాను. పోరాటం రగలడానికి కారణం ఎవరు అన్న విషయం గురించి వివాదం జరిపే సమయం కాదిది.

'నేను ఇరవైనాలుగు మంది కాంగ్రెస్ సభ్యులతో రేపు ఉదయం ఎరనాడుకు బయలుదేరుతున్నాను. మేము అక్కడికి వెళ్లి ప్రజలు మధ్య ప్రశాంతత నెలకొల్పడానికి కావలసిన ప్రయత్నాలకు ఉపక్రమించేముందు సైనికులు ఉద్యమకారులను కాల్చి చంపేట్టు వుంటే మా పర్యటన వల్ల ఎలాంటి ప్రయోజనమూ వుండదు. ఆ విధంగా చేయకుండా వుండడానికి కావలసిన ఆజ్ఞను సైనికులకు పంపగలరని ఆశిస్తున్నాము.'

ఈ ఉత్తరం పంపిన తర్వాత మర్నాడు బయలుదేరడానికి నేను సిద్ధంగా వున్నాను. ఆగస్ట్ ఇరవై ఆరో తేదీ ఉదయం మేము ఇరవైనాలుగు మంది ఆరుజట్కా బండ్లలో, కోళిక్కోడ్ నుంచి బయలుదేరి ఫరూక్ వంతెన దగ్గరికి చేరాము. వంతెన దగ్గర సైనికులు కొంగరు కాపలా కాస్తున్నారు. మేమందరం ఒకటిగా కలిసి రావడంవల్ల వంతెనకు దూరంగానే మమ్మల్ని అటకాయించారు. వంతెన దగ్గరగా నిలబడ్డ ఒక సార్జెంట్ దగ్గరకు వెళ్లాను. అతను తుపాకి గురిపెట్టి 'ఎవరు?' అన్నాడు గట్టిగా.

'ఒక మిత్రుణ్ణి' అన్నాను నేను.

'ఇక్కడికి రా మిత్రమా' అని ఆజ్ఞాపించాను.

నేను అతడిని సమీపించి మెజిస్ట్రేటు ఉత్తరం చూపాను. వంతెనను దాటి వెళ్లడానికి అనుమతించడానికి అతనికి అధికారం లేదు. ఫరూక్ స్టేషన్లో మకాం పెట్టిన డాడన్‌హౌమ్ అన్న అధికారికే ఆ అధికారం వున్నది. నా ఉత్తరాన్ని అతనికి పంపాడు. పది నిముషాల్లో డాడన్‌హౌమ్ మేము వున్న చోటికి వచ్చాడు. మమ్మల్ని అందరినీ లెక్కబెట్టి చూసి 'Pass 24 Non Cops - from Calicut Taluk to Ernadu Taluk along the Ferock bridge' అని ఆ ఉత్తరం వెనకవైపు రాశాడు. మేము ఎరనాడులో ప్రవేశించడానికి కావలసిన అనుమతి చీటీ అది. Non Cops అన్నది 'Non Co-operations' అన్నదానికి క్లుప్తీకరణ, డాడన్ హ్యౌమ్ కోసరం మేము ఎదురు చూస్తూ వున్నప్పుడు, వంతెన సమీపంలో వున్న కొందరు పోలీసువాళ్లు మమ్మల్ని చాలా హీనమైన మాటలతో తిట్టి అవమానించారు. మాలో కొందరు పోలీసుల ముఖాల మీద ఉమ్మడానికి కూడా వెనుకాడలేదు!

వంతెన దాటి అవతలి గట్టుకి చేరగానే నాకో అనుమానం కలిగింది. తిరిగి రావటానికి ఆ అనుమతి చీటీ చాలా అని సందేహం నివృత్తి చేసుకోవడానికి డాడన్‌హౌమ్ ను చూడడానికి ఫరోక్ స్టేషన్‌కి వెళ్లాను. నా కూడా వున్న వాళ్లు దారిలోనే నిలబడ్డారు. నేను అనుమానాన్ని తెలియజేయగానే డాడన్‌హౌమ్ తిరిగి రావడానికి అదే చాలన్నాడు. నన్ను చూసినప్పుడు మనసులో చెలరేగిన కోపాన్ని అణచుకునే ప్రయత్నం ఆయన ముఖకవళికలు తెలియజేశాయి. నేను రైలు స్టేషన్ నుంచి బయటకు రాగానే, ఆయన ఉద్యమకారులతో పాటు మమ్మల్ని ఉరితీయాలి అన్నాడు. అవసరమైతే నిర్మలమైన మనస్సుతో ఉరికంబం ఎక్కడానికి సిద్ధంగానే వున్నాము. అన్నాను నేను. నేను ఊరికే తమాషాకి అన్నాను అన్నాడు ఆయన. అయితే నేను మాత్రం నిజంగానే అన్నాను అని చెప్పాను. వెంటనే నేను దారిలో దిగిన మిత్రులను కలుసుకున్నాను.

అప్పుడు నాతో వున్న కె.పి. గోపాలమీనన్, పాన్‌మాడత్తు మొయిద్దీన్ కోయా, యు. గోపాలమీనన్, మాణిక్కత్తు గోపాలమీనన్, క్రోమ్‌బెయిల్, కొయం గల్లూర్ శేఖరమీనన్, అబ్దుల్ రహిమాన్ కుజ్జామదు, కె. మాధవమీనన్, టి.పి. సాత్తు కుట్టి నాయర్, మధురవనం గోవిందకురూప్ మొదలైన చాలా మందిని నేను జ్ఞాపకం చేసుకుంటున్నాను. ఖద్దరు చొక్కా, గాంధీ టోపి ధరించిన మేము ఇద్దరిద్దరుగా ఫరోక్ నుంచి కాలినడకన బయలుదేరాము. రోడ్లలో అక్కడక్కడ మనుషులు పలుచగా కనిపించారు. రోడ్డు పక్కన ఇళ్లల్లో ఎవరూ కనిపించలేదు.

ఫరూక్ నుంచి నాలుగైదు మైళ్లు తూర్పుగా వెళ్లాక, కొద్ది దూరంలో కూలిపోయిన ఒక డాబా యింటి నుంచి ఇద్దరు మమ్మల్ని సమీపించారు. మేము తిరూరంగాడికి వెళ్లే విషయం వారికి తెలుసు. కోళిక్కోడ్ నుంచి సైనికులు, పోలీసువాళ్లో బయలుదేరితే, ఆ ఆచూకి తెలియజేయడానికి మనుషులు అక్కడక్కడ వున్నారన్న విషయం ఆ తర్వాత మాకు తెలిసింది. వాళ్లిద్దరు అలాంటి ఆచూకీ తీసేవాళ్లు. సైనికులను తీసుకుపోయే ఎనిమిది-పది కార్లు, లారీలు మేము దారిలో చూశాము. ధూరం నుంచి చూసేటప్పుడు మమ్మల్ని ఉద్యమకారులని భావించి సైనికులు కాల్చి చంపవచ్చు. అందుకని ముందుగానే మేము ఫలాన అని తెలియజేయడం మంచిదని వాళ్లు మాకు చెప్పారు. మాకు అది క్షేమమే అనిపించింది. వాళ్లల్లో అప్పు డే ఒకరు వివరాలు తెలియజెప్పడానికి తిరూరంగాడికి వెళ్లాడు. మేము పుళక్కళై చేరడానికి మరి రెండుగంటలు పట్టింది. నెమ్మదిగానే నడిచిపోయాము. మకు ఒరత్తు కడై సమీపించేప్పు డు కనబడిన దృశ్యం మరువరానిది. కాంగ్రెస్ జెండా, ఖిలాఫ్ జెండా, పట్టుకుని రెండు పెద్ద పడవలలో ఆయుధాలు ధరించిన కొందరు, ఆలిముసలియార్ అనుచరులు, అక్కడ కాచుకుని వున్నారు. కాంగ్రెస్ ప్రతినిధులైన మాకు స్వాగతం చెప్పడానికే వాళ్లు అక్కడికి వచ్చారు.

తిరూరంగాడిలోనూ, దానికి సమీపంలోని ప్రదేశాలలోను, బ్రిటిష్ వారి పరిపాలన ముగిసింది. ఆలిముసలియార్ ఆయన అనుచరులే పాలిస్తున్నారు. లవక్కుట్టి వాళ్ల ప్రతినిధుల్లో ఒకడు. ముసలియార్ మంత్రిగా పనిచేసినవాడు. ముప్పైఅయిదు సంవత్సరాలు దాటని ఆ యువకుడు ఖిలాఫత్ కార్యకర్తల కమిటీ సభ్యుడు. ఆ దశ నుంచి ముసలియార్ విశ్వాసపాత్రుడిగా మంత్రి పదివి వరకు వెళ్లాడు. లవక్కుట్టి మాకు స్వాగతం చెప్పడానికి వచ్చాడు.

ఏరుదాటి అవతలి గట్టుకు చేరినతర్వాత, అక్కడ ఆలిముసలియార్ అనుయాయులు దాదాపు వందమందికి పైగా మాకు స్వాగతం చెప్పారు. వాళ్లతో పాటు మరికొందరు కూడా వున్నారు. ఏటిగట్టు నుంచి తిరూరంగాడి వీధుల్లోకి వెళ్లిన ప్రయాణం ఒక అరుదైన దృశ్యంగా కనిపించింది. ప్రజలు అక్కడక్కడ గుమిగూడారు. లవక్కుట్టి తన మనుషులకి ఏవేవో ఆజ్ఞలు జారీచేస్తున్నాడు. పావుగంటలో తిరూరంగాడి ఖిలాఫత్ కార్యాలయంవద్దకు వచ్చాము. ముసలియార్ అనుచరులు అక్కడ కనిపించారు. వాళ్లే కాకుండా చాలా మంది ప్రజలు అక్కడ గుమిగూడారు. నేను, యు. గోపాలమీనన్, మొయ్తు మౌల్వి ఖిలాఫత్ కార్యలయం డాబా గదిలోకి వెళ్లాము. నాలుగైదు బల్లలు, కుర్చీలు కనిపించాయి. అక్కడ ఆలిముసలియార్ కోసరం కాచుక్కూర్చున్నాము.

సభ్యుల అడుగుల చప్పుడు, నాయకుని ఆజ్ఞలు, కార్యాలయం హడావిడి, మాకు ఆలిముసలియార్ రాకను తెలియజేశాయి. ఆయన తిన్నగా మేడమీదకి వచ్చారు. ఆయనతోపాటు ఇద్దరు ముగ్గురు వున్నారు. మేము లేచి నిలబడి ఆయనకు నమస్కరించాము. సంతోషంగా ఆయన మమ్మల్ని ఆశీర్వదించారు. ఒక్క నిముషంపాటు ఏమి చెప్పాలో తెలియకుండా నేను మౌనంగా వున్నాను. తర్వాత తిరూరంగాడిలో జరిగిన సంఘటనల గురించి, అడిగినప్పుడు జంకకుండా ఆయన అన్నిటినీ వివరించారు.

అప్పుడు ఆలిముసలియార్‌కు అరవైఅయిదు సంవత్సరాలు వుండవచ్చు. అంతలావుగా లేకుండా పొడవుగా, తెల్లని మేని ఛాయలో చూడడానికి చక్కగా వుండేవాడు. పాదాల వరకు తెల్లటి చొక్కా, టోపీమీద తలపాగాతో ఆయన కనిపించారు. ఆయన ఆజ్ఞను శిరసావహించడానికి చాలామంది అనుచరులు అక్కడ సిద్ధంగా వున్నారు.

ఆలిముసలియార్ చెప్పిన దంతా విన్న తర్వాత 'ఇక మీదట ఏం చెయ్యాలి అనుకుంటున్నారు?' అన్నాను. 'ఏం చెయ్యాలి?' అని ఆయన నన్ను తిరిగి ప్రశ్నించారు. అటువంటి అతి క్లిష్ట సమయంలో మనస్సాక్షికి విరుద్ధం కాకుండా ఒక సలహా ఇవ్వడం అంత సులభంకాదు. నా రాక కారణాన్ని ఆయన ఊహించి గ్రహించేవుండాలి.

'నేను చెప్పడం తప్పుగా తీసుకోకూడదు' అన్న పీఠికతో ప్రారంభించి నేను నా అభిప్రాయాన్ని వారికి తెలియజేశాను. జరిగిపోయిన దాని గురించి చెప్పుకోవడంలో ప్రయోజనం లేదు. ఎదురుచూడకుండా అనుకోని కొన్ని కష్టాలు మనకి వాటిల్లాయి. ఇంకా హింసాత్మక చర్యలకు పూనుకోవడం, మరిన్ని కష్టనష్టాలకు దోహదంచేస్తుంది.

మేము ఇక్కడికి వచ్చేటప్పుడు కొన్ని సైనిక వాహనాలను చూశాము. ఇంకా కొన్ని సైనిక వాహనాలు రావడం ఖాయం. వాళ్లు వచ్చి కాల్చి చంపడం మొదలుపెడితే ఏం జరుగుతుందో మీకు తెలియనిదా? అది తప్పించుకోవాలంటే ప్రభుత్వం కోరే విధంగా, కొందరు సైనిక చట్టానికి లోబడి నడుచుకోవడానికి ముందుకు రావాలి. అలాగయితేనే తిరూరంగాడిని, ఇక్కడి ప్రజలను కాపాడడానికి వీలవుతుంది. సైనిక చట్టానికి లోబడే వారికి వాళ్లు కచ్చితంగా శిక్ష విధిస్తారు. అయితే ఆ కొందరి త్యాగం, చాలామంది తప్పించుకోవడానికి సహాయకారి అవుతుంది. దీనిని ఆలిముసలియార్ తన అనుచరులకు నచ్చజెప్పే రీతిలో తెలియజేయాలి. ఇదే చెయ్యదగిందని నాకు అనిపిస్తోంది అన్నాను. ముసలియార్ అంతా విని దీర్ఘంగా నిట్టూర్చారు.

అక్కడ వున్న వారిని కొద్దిసేపు అలాగే మౌనంగా చూసి, తర్వాత నాతో ఇలా అన్నారు.

'మీరు చెప్పింది నిజమే. ఏం చెయ్యాలన్నది మిగతా వాళ్లతోను కలిసి ఆలోచించిన తర్వాత తీర్మానించాలి. లవక్కుటిని, కుంజ్ఞలవిని చూసి వాళ్లతో ఈ వివరాలు చెప్పడం మంచిది'.

నేను అందుకు అంగీకరించాను. ఆలిముసలియార్, మేము దాదాపు ఒక గంటసేపు మాట్లాడుకున్నాము. మేము వచ్చిన ఉద్దేశాన్ని ఒక రకంగా ఊహించిన కొందరు ఏవేవే చెప్పుకుంటున్నారని, ఎక్కువ సేపు అక్కడ వుండడం హానికరమనీ, కిందనుంచి కొందరు మాకు రాసి పంపారు. మేమూ తిరిగి వెళ్లడానికి సిద్ధమయ్యాము. ఖిలాఫత్ కార్యాలయం ముందు కుంజ్ఞాలవి నుంచుని వున్నాడు. వీపులో ఒక కత్తి, చేతిలో ఒక కత్తితో నుంచున్న అతను నన్ను సమీపించాడు. ఆలిముసలియార్ సేనా నాయకుడు అతను. ఇరవైయో తేదీ తిరూరంగాడిలో జరిగిన ఘర్షణలో ఇద్దరు తెల్లవారిని చంపిన వ్యక్తి అతనే. అవాళ జరిగిన సంగతంతా అతన్ని అడిగి తెలుసుకున్నాను. కొంతసేపు ఇదంతా మాట్లాడిన తర్వాత, అతన్ని దూరంగా తీసుకు వెళ్లి, 'ఇకపై ఏం చెయ్యనున్నావు?' అని అడిగాను. 'అణిగి పోయే కథ మాత్రం నా దగ్గర చెప్పవద్దు. వాళ్ల చేతులకి దొరకితే వాళ్లు నన్ను చంపరు. తొక్కి అంబలి చేసేస్తారు. నేను వాళ్లతో యుద్ధం చేసే చస్తాను' అని చాలా వినయంగా జవాబు చెప్పాడు కుంజ్ఞాలవి

'నువ్వు అలా చేయాలనుకోవడం సరైనదే. అయితే తిరూరంగాడి స్థితి గురించి కొంచెం ఆలోచించి చూడాలి కదా... మసీదును వాళ్లు మందు గుండు పెట్టి కాలిస్తే ఏం చేస్తాం?' అని నేను మళ్లి అడిగాను.

'మేము అక్కడ వున్నప్పుడు వాళ్లు మసీదును మందుగుండు పెట్టి కాల్చడానికి వీలుకాదు' అని జవాబిచ్చాడు కుంజ్ఞాలవి. అతని నమ్మకం అది. ఇక అతనితో మాట్లాడి ప్రయోజనం లేదనిపించింది.

ఆలిముసలియార్‌కి నేను చెప్పింది సబబుగా తోచింది. అయినప్పటికీ తన అనుచరులకి విరుద్ధంగా నడచుకోవడానికి ఆయన ఇష్టపడలేదు. ఇటువంటి స్థితిలో హింసాకృత్యాలు కొనసాగుతూనే వుంటాయి.

అక్కడ సబ్-రిజిస్ట్రార్‌గా వున్న ఎ.పి. కరుణాకర మీనన్ గర్భిణీ అయిన భార్యాపిల్లలతో కలిసి మా ప్రాంతంలో చిక్కుపడ్డారని తెలిసి వారిని అక్కడినుంచి కాపాడాలని కుంజ్ఞాలవిని వేడుకున్నాను. అతను వెంటనే అందుకు తగిన ఏర్పాట్లు చేశాడు.

ముంజరక్కడవు దాటిన తర్వాత, రాత్రి ఎనిమిది అయింది. పడవలు అవతలితీరం చేరే సమయానిక మసీదునుంచి వినబడ్డ సామూహిక ప్రార్థనాస్వరాలు అగాధాంధకారంలో నాలో వివరించలేని భావాలను రేకెత్తించాయి. అక్కడక్కడ కొన్ని దివిటీలు కనిపించాయి. లెక్కలేనన్ని మిణుగురు పురుగులు, ఏటిగట్టున చెట్లమీద ఎగరడం చూశాను. ప్రయాణ అనుభవాల గురించి కూడా వున్నవాళ్లు ఏవేవే చెబుతూవున్నారు. నా హృదయాంతరాళాల్లో ఏదో భరించలేని బరువు. ఏవేవే ఆలోచనలు ఆవేదనలు మనసులో మెదులుతున్నాయి. పడవనుంచి దిగి దగ్గరలో ఒక ప్రాంతానికి వెళ్లి రాత్రి గడిపాము. మర్నాడు ఉదయం మళ్లీ ప్రయాణం కొనసాగించాము.

కరుణాకరమీనన్ భార్యను ఒక వాలు కుర్చీలో కూర్చోబెట్టి మాతో వచ్చిన వాళ్లు మోసుకువచ్చారు. పదిమైళ్ల దూరంలో వున్న ఒక నాయర్ ఇంటికి మధ్యాహ్న భోజనానికి సరిగ్గా వచ్చాము. అక్కడ కొంతసేపు విశ్రాంతి తీసుకున్న తర్వాత, మేము మళ్లీ యాత్రను కొనసాగించాము. సాయంకాలానికి కోళిక్కోడ్ చేరాము.

# ఉద్యమం తీవ్రంగా వ్యాపించడం

ఆగస్ట్ ఇరవైఆరోతేదీ, కొందరు సభ్యులతో నేను కోళిక్కోడ్ నుంచి తిరూరంగాడికి వెళ్లేప్పుడు, సైనికులను ఎక్కించుకుని కార్లు, వాహనాలు వెళ్లాయని చెప్పాను కదా..! వారి వెనకాల సైకిళ్ల మీద రిజర్వ్ పోలీసులు వెళ్లారు. వాళ్లు తిరూరంగాడికే వెళ్లారు. మరి కొన్ని ప్రాంతాల నుంచి, ఘర్షణ జరిగిన ప్రాంతానికి సైనికులు వస్తున్నట్లు ఆ తర్వాత తెలియవచ్చింది. సైనికులు, పోలీసులు వస్తున్నారన్న వార్తను, ముందుగానే ఆలిముసలియార్, ఆయన అనుచరులు పసిగట్టివుండాలి.

స్త్రీలను, పిల్లలను, తిరూరంగాడి నుంచి అవతలి ప్రాంతాలకు తరలించారు. అనవసరమైన ఘోరకృత్యాలకు ఒడి గట్టకూడదనీ, దోపిడీ, హత్యలు మొదలైన ఘోరకృత్యాలకు దిగిన వారికి తగిన శిక్షలు విధించబడతాయనీ, హిందువులకు ఏవిధంగానూ, అపకారం తలపెట్టకూడదనీ, ఆలిముసలియార్ తన అనుచరులకి తెలియజేశారు. ఆలిముసలియార్ అధికారం, వున్న రోజుల్లో ఆ ప్రాంతంలో హింసాకృత్యాలు తక్కువగానే వుండేవి. అయినప్పటికీ ఆ స్థితి ఆట్టేకాలం కొనసాగలేదు.

ఏర్పాట్లు ముగిసిన తర్వాత, ఆగస్ట్ ముప్ఫయ్యో తేదీ, సైనికులూ, పోలీసులూ, తిరూరంగాడికి వచ్చి చేరారు. మసీదు ముఖద్వారం దగ్గర శిబిరాలు ఏర్పాటు చేశారు. గిడ్డంగులు ఏర్పాటు చేసి తుపాకులు పోగుచేసి యుద్ధానికి సన్నిద్ధులయ్యారు. ఆలిముసలియార్ మరి కొందరు, మసీదు ముఖద్వారానికి లోపలివైపున వున్నారు. ముప్పై ఒకటో తేదీ ఉదయం సైనికులు కాల్పులు ప్రారంభించారు. మసీదు లోపల వున్నవాళ్లూ సైనికుల వైపు తుపాకులు పేల్చారు. పోలీస్ స్టేషన్ నుంచి మరికొన్ని స్థలాలనుంచీ వాళ్లు ఆయుధాలు సేకరించి వుంచారు. ఈ విధంగా ఇరుపక్షాలకు మధ్య చెలరేగిన ఘర్షణ కొంతసేపు కొనసాగింది. ఈద్‌గా మసీదు మూడు వైపులా సైనికులు చుట్టుముట్టారు. మధ్యాహ్నం అయ్యేసరికి ఏం చెయ్యాలో తోచక కొందరు లోపలినుంచి వెలుపలికి వచ్చారు. వార్తలో కుంజ్ఞలవి కూడా వున్నాడు. అతను కత్తితో సైనికులను ఎదిరించాడు. కొందరిని పొడిచి

చంపాడు. ఉద్యమకారులను సైనికులు అంత సులభంగా పట్టుకోలేకపోయారు. వాళ్లు మసీదుకి ఉత్తరంగా వున్న అడవుల్లోకి పరుగెత్తి దాక్కున్నారు.

మసీదులో వున్నవారు మళ్లీ కాల్పులు జరిపారు. మందుగుండు సామాగ్రి అయిపోయింది. ఆ పరిస్థితిలో సైనికులను ఎదిరించడం అసాధ్యం అని భావించి, ఉద్యమకారులు తెల్లజెండాలు చూపారు. తాము లొంగిపోవడానికి సిద్ధంగా వున్నట్లు తెలియజేశారు.

ఈ విధంగా తిరూరంగాడి పోరాటం ముగిసింది. ఆలిముసలియార్‌ను మిగతావారిని ఖైదుచేసి మర్నాడు తిరూరుకి తీసుకువెళ్లారు.

ఇటువంటి సంఘటనలు తిరూరంగాడిలో మాత్రమే జరగలేదు. ఎరనాడు, వళ్లువనాడు, పొన్నాని, కోళిక్కోడ్ తాలూకాలలో పలుచోట్ల కొంతకాలమైన బ్రిటిష్ పరిపాలన లేకుండా పోయింది. అధికారులూ, పోలీసులు, ఊరివారు చాలామంది, ఆ ప్రాంతాలనుంచి పారిపోయి వేరే ప్రాంతాలలో తలదాచుకున్నారు. ఆ ప్రాంతాలలో అరాచకం తాండవమాడింది.

పొన్నాని ఖజానాను కొల్లగొట్టడానికి బయలుదేరిన ఉద్యమకారులను, దారిలో చూసిన కేళప్పన్, అటువంటి దుష్టకృత్యం చేయకూడదని ఎంతో మృదువుగా ప్రార్థించాడు. ఆఖరికి, తన దేహాన్ని తొక్కుకుంటూ తప్ప పోలేరని చెప్పి రోడ్డుకు అడ్డంగా పడుకుని ఉద్యమకారులను వెనక్కిపంపాడు. అటువంటి ధీరకృత్యం మెచ్చుకోదగ్గ ఘనకార్యం కాదా? అలాంటి కేళప్పన్ మీద మేడకు నిప్పంటిచాడన్న నేరం మోపారు పోలీసులు. మంజేరీలోను, ప్రభుత్వ ఖజానాను పగులగొట్టి డబ్బు దోచుకున్నారు. పోలిస్‌స్టేషన్ నుంచి ఆయుధాలు స్వాధీనపరచుకున్నారు. ప్రభుత్వ కార్యాలయాలలో చొరబడి 'రికార్డుల'ను నాశనం చేశారు. ఇదే విధంగా ఏడవణ్ణాత్తి లోను అక్రమాలు కొనసాగించారు. చెరసాలలను కాపలా శిబిరాలను తెరిచి, ఖైదీలను విడిపించారు.

మంజేరి గుడిలో వున్నవాళ్లు, ఉద్యమకారుల రాక గురించి విని అక్కడినుంచి పరుగు లంకించుకున్నారు. నిలంబూర్ ఆలయం వద్ద పోలీసులకు, ఉద్యమకారులకు మధ్య జరిగిన ఘర్షణలో చాలామంది పోలీసులు మరణించారు. ఆలయంలోని ఆయుధాలను, ఉద్యమకారులు స్వాధీనం చేసుకున్నారు. ఉద్యమకారులకు నాయకులుగా వున్నవాళ్లలో చాలామంది ప్రముఖులూ వున్నారు. వాళ్లల్లో ప్రసిద్ధి గాంచిన వారు వారియన్ కుణ్ణత్తు, కుంజ్జహమత్ హాజి. ఏభైయేళ్ల కుంజ్జహమత్ హాజి, ఆలిముసలియార్, బంధువు మాత్రమే కాదు; శిష్యుడు కూడా. తిరూరంగాడిలో జరిగిన సంఘటనలు ఆయన్ని పోరాటంలో దిగేట్లు చేశాయి.

మంజేరిలో జరిగిన బహిరంగ సభలో హిందువులకు ఎలాంటి అపకారమూ జరగదనీ, దోపిడీకి దిగిన వారికి కఠినమైన శిక్షలు పడతాయనీ తెలియజేశారు. ఆ సభకు వెళ్లాడన్న కారణంగానే ఎం.పి. నారాయణ మీనన్ మీద రాజద్రోహ నేరం మోపబడింది. సైనిక న్యాయస్థానం ఆ నేరంపై ఆయనకు పద్నాలుగు సంవత్సరాలు కఠిన కారాగార శిక్ష విధించింది. అటువంటి క్లిష్టపరిస్థితిలోనూ ఉద్యమకారులను నిరోధిస్తూ శాంతిని నెలకొల్పడానికి, నారాయణ మీనన్ కొంచెం కూడా వెనుకాడకుండా, చేసిన గొప్ప ప్రయత్నాలు ఆ ప్రాంతాల వారికి బాగా తెలుసు. అయినప్పటికీ ఎరనాడులో సుప్రసిద్ధులైన కాంగ్రెస్ కార్యదర్శిని ఊరికే విడిచిపెట్టడానికి పోలీసువారికి మనసొప్పలేదు. ఆ రోజుల్లో అధికారుల అక్రమకృత్యాలకు నారాయణ మీనన్‌కి విధించిన చిరకాల కారాగార శిక్షే మంచి ఉదాహరణ!

కుంజహమత్ హాజి కూటమిలో వున్న ఉద్యమకారులు పోలీస్ ఇన్స్పెక్టర్ సేకుట్టిని కాల్చిచంపి, ఆయన తలను పైకెత్తి పట్టుకుని మంజేరిలో పటుచోట్ల ఊరేగింపుగా వచ్చారు. తమ విరోధులకు పాఠం చెప్పడానికి, ఉద్యమకారులు ఎలాంటి ఘోరకృత్యాలకు పాల్పడ్డారన్న దానికి ఇదొక ఉదాహరణ. ఈ విధంగా హిందువు అని గాని, ముస్లిమ్ అని గాని వారు భేదం పాటించలేదు.

ఉద్యమకారుల మరొక కార్యరంగం కోళిక్కోడ్ నుంచి, మలప్పురం వెళ్లే దారిలో వున్న పుక్కొట్టూర్ అన్న స్థలం. అక్కడ అంతకు ముందే జరగరాని సంఘటనలు జరిగాయి. సుందర ప్రకృతిగల ఎరనాడులో మనోజ్ఞమైన దృశ్యాలు వున్న స్థలం అది. తిరూరంగాడిలో జరిగిన సంఘటనలు విని, అక్కడ నుంచి బయలుదేరిన ఒక పెద్ద ఉద్యమకారుల గుంపును కె. మాధవన్ నాయర్, అబ్దుల్ రహమాన్, అడ్డుపడి, త్రిప్పి పంపేశారు. అది ఆగస్ట్ ఇరవై ఒకటో తేదీ జరిగింది. ఒక్క వారం రోజుల్లో పుక్కొట్టూరులో పరిస్థితి మళ్లీమారింది. గుట్టలు, కొండలు, అడవులమయమైన ఆ ప్రాంతం దాక్కోవడానికి చక్కటి ప్రదేశం. అక్కడ చాలామంది ఉద్యమకారులు దాక్కుని వున్నట్లు ఉద్యమకారులకై వేటాడుతున్న సైనికులకు ఆచూకీ అందింది. సైనికులు అక్కడికి రాలేని విధంగా, దారిపొడవునా చెట్లు నరికి రోడ్డు కడ్డంగా వేశారు. ఆగస్ట్ ఇరవై ఆరోతేదీ ఉదయం సైన్యం పూక్కోట్టూరు వెళ్లింది. సైనికులు రోడ్డుమీద నిలబడి చూసినప్పుడు ఎవరూ కనిపించలేదు. ఉద్యమకారులు గుట్టల్లోను, కొండల్లోను బాంబులు ప్రయోగిస్తూ కొంతసేపు ఎదిరించారు. ఆ ప్రాంతం నుంచి సైనికులపై తూటాలు వచ్చి పడ్డాయి. తూటాలు ఒక వైపు నుంచి మాత్రమే వచ్చాయని చెప్పడానికి లేదు. పలువైపుల నుంచి వచ్చాయి. అడవుల్లో దాక్కున్న ఉద్యమకారులను

కనుగొనడం సైనికులకు దుర్లభమైంది. బాంబుల శబ్దం చాలాదూరం వినిపించేది. తుపాకీ తూటాలు, మందుగుండు అయిపోయే సమయంలో ధోరణిని మార్చి 'నగారా' మ్రోగించారు. యుద్ధానికి సిద్ధంకండని ప్రజలకు తెలియజేయడానికి, మసీదునుంచి పెద్ద ఎత్తున డప్పులు మ్రోగించారు. ప్రజలందరూ ఏకమై సైనికులను ఎదుర్కొన్నారు. ప్రజలు వారిని కర్రలతో బాదారు. కత్తులతో తెగనరికారు. రాళ్లు రువ్వి గాయం చేశారు. ఈటెలతో పొడిచారు. పుట్టనుంచి చీమలు బయలుదేరినట్లు లెక్కలేనంత మంది ప్రజలు బయటకు వచ్చారు. తుపాకీ గుళ్లకి ఎందరో మరణించారు. 'పట్టు...చంపు...కొట్టు...నరుకు' అని అరుచుకుంటూ ముందుకు దూసుకు వచ్చిన ఉద్యమకార్లలో దాదాపు మూడువందల మంది ఈ పోట్లాటలో మరణించారు. సైనికులకూ పెద్ద నష్టం వాటిల్లింది. ఉద్యమం జరిగిన కాలంలో పూక్కోట్టూర్‌లో జరిగినదే చాలా ఘోరమైన పోట్లాట అని చెప్పాలి.

ప్రజల మధ్య భయాన్ని రేకెత్తించడానికి, ఉద్యమం జరిగిన ప్రాంతాలలో సైనికులు గుంపులు గుంపులుగా తిరిగారు. ఉద్యమకారులు కొండల్లో, కోనల్లో అడవుల్లోను దాక్కున్నారు. వాళ్లు దాక్కున్న స్థలాలను చూపడానికి సైన్యానికి ప్రజల సహాయం కావలసి వచ్చింది. ఈ విధంగా ఎవరైనా సైన్యానికి సహాయపడుతున్నారని తెలియగానే ఉద్యమకారుల ఆగ్రహం వారి మీద పడేది. ఈ కాలఘట్టంలోనే హిందువులను వేధించడం ప్రారంభించారు.

అడవుల్లో కలహదార్లు మామూలుగా యుద్ధ పద్ధతులు నేర్చుకుంటున్నారని విన్నాము. వారి సమీపంలో వున్న ఇళ్లను దోచుకుని, ఆహార పదార్థాలు ఆయుధాలు సేకరించారు. వేర్వేరు ప్రాంతాలలో వున్న ఉద్యమనాయకులకు సమాచారం అందజేయడానికి వేగుల వాళ్లు కూడా నియమించబడ్డారు. స్పెషల్ పోలీస్‌కు, వారికి సహాయంగా వచ్చిన సైనికులకూ ఉద్యమకారులను అణచడం సాధ్యం కాదనిపించింది. తర్వాతనే గూర్ఖా సైన్యాన్ని రప్పించారు. దానికి కొంతకాలం పట్టింది. ఈ లోగా ఉద్యమకారుల అక్రమాలు, వారి కృత్యాలు విస్తరించాయి.

సెంబరాచ్చేరి తంగళ-ఆయన అనుచరులూ, పాండికాడులో యుద్ధ ఆయుధాలు సేకరిస్తూ వచ్చారు. 1921వ సం॥ నవంబర్‌లో గూర్ఖా సైన్యం పాండిక్కాడులో సంతలో మకాం చేశారు. సెంబారాచ్చేరి తంగళ అనుచరులు సంతవైపు వచ్చి వాళ్లను చుట్టు ముట్టారు. సంతకు వెలుపల కాపలా కాస్తున్న సైనికులను కాల్చి చంపారు. సంత ప్రహరీ గోడను మందుగుండు పెట్టి ప్రేల్చి లోపలకు వెళ్లారు. గూర్ఖా వీరులు యుద్ధం చేయడంలో సామర్థ్యం కలవారని ప్రసిద్ధిగాంచిన వారు. నరకడానికి, చంపడానికి వెనుకాడని వారు.

అడవుల్లో పోరాడే ప్రత్యేక శక్తి సామర్థ్యాలు గలవారు. ఉద్యమకారులు అంతటి శిక్షణ పొందిన వారు కారు. అయినప్పటికీ గూర్ఖా సైనికులకు ఎదిరించి పోరాడటంలో ఎంతో నేర్పును, ధైర్యసాహసాలను ప్రదర్శించారు. చంపండి, పొడవండి, కొట్టండి అన్న అరుపుల మధ్య రెండు గంటల సేపు పోరాటం జరిగింది. రెండు వందలకి పైగా ఉద్యమకారులు ఈ పోరాటంలో మరణించారు. చనిపోయిన సైనికులు ఎందరన్నది ఇతమిత్థంగా చెప్పలేము. ఉద్యమంతో పాటు జరిగిన మరికొన్ని సంఘటనలను కూడా ఇప్పుడు చెప్పుకోవాలి. ఎరనాడు తాలూకాలో కొన్నారా ఒక చిన్న గ్రామం. కొన్నారా తంగళ్ ఆ ప్రాంతంలో మహమ్మదీయులకు నాయకుడుగా వుండేవాడు. మసీదులో సైనికులు అడుగుపెట్టారని తెలియగానే వాళ్లను ఎదుర్కోవడానికి కొన్నార తంగళ్ నాయకత్వంలో ఒక పెద్ద గుంపు బయలుదేరింది. సైనికులు మసీదు నుంచి వెళ్లి అడవుల్లో పొంచి వున్నారు. ఆ సంగతి తెలుసుకుని తంగళ అతని అనుచరులు రాత్రి వేళ వారిని చుట్టుముట్టారు. సైనికుల కాల్పులు మొదలు పెట్టారు. చీకటి కమ్ముకుని వుండడం వల్ల ఇరుపక్షాల వారు ఒకరినొకరు గుర్తుపట్టడం కష్టమైంది. ఇందువల్ల రెండు పక్షాలలోను పెద్ద నష్టం ఏర్పడింది. తెల్లవారేప్పటికి మిగిలిన అనుచరులు, అక్కడి నుంచి పారిపోయి, కోళిక్కోడ్ తాలూకాలో ఒక కొండమీద కొన్నాళ్లు దాక్కున్నారు. అప్పుడప్పుడు అక్కడ కూడా సైనికులతో పోరాటం జరిగేది. ఆయుధాలు, మనుషుల అండ తగ్గిపోయిన తర్వాత తంగళ్ మారువేషంలో బయటికి వచ్చారు. కొంతకాలం ఆయన అక్కడక్కడ అవస్థలుపడుతూ తిరిగినట్లు చెబుతారు. తర్వాత కూత్తు పరంబులో ఆయన్ని ఖైదు చేశారు. సైనిక కోర్టు విచారణ తర్వాత, ఆయన్ని కోయంబత్తూరు జైల్లో ఉరితీశారు.

తిరూరంగాడిలో జరిగిన పోరాటంలో కుంజ్ఞాలవి, మరికొందరు సైనికులను హతమార్చిన తర్వాత పారిపోయి అడవుల్లో తలదాచుకున్నారని చెప్పాను కదా. కొన్ని రోజుల అడవుల్లో గడిపాక, కణ్ణమంగళం సమీపం లోని ఒక ఆలయం వద్ద సైన్యం వారిని పసిగట్టి ఎదిరించింది. ఆ పోరాటంలో కుంజ్ఞాలవి మరణించాడు. ఆ విధంగా ఉద్యమకారులలో ముఖ్యుడుగావున్న ఒక నాయకుడు ఇదివరకే నాతో చెప్పినట్లు కుంజ్ఞాలవి యుద్ధభూమిలోనే మరణించాడు. లవక్కుట్టి ఉరికంబానికి బలి అయ్యాడు!

ఉద్యమం గురించి పూర్తి చరిత్రను నేనిక్కడ రాయడం లేదు. నా ఉద్దేశం అది కాదు. ఉద్యమకాలంలో జరిగిన కొన్ని ముఖ్యమైన సంఘటనలను గురించి, అందులో పాల్గొన్న కొందరు నాయకులను గురించి క్లుప్తంగా తెలియజేసే వివరాలు మాత్రమే ఇవి. ఇంచుమించు రెండువందల ఇరవై

గ్రామాల వరకూ వ్యాపించిన ఉద్యమం వినాశకర శక్తిని, అది కొనసాగిన కాలాన్ని, ఆలోచించి చూస్తే ఇంతవరకు మలబారులో జరిగిన పోరాటాలలో చాలా ముఖ్యమైనది ఇదే అనడంలో సందేహం లేదు.

ఉద్యమకారులకు ఏమాత్రం తీసిపోని విధంగా, క్రూరంగా సైనికులు ప్రజల పట్ల నడుచుకున్నారు. సైనికులు వస్తున్నారన్న వార్తవిని విలవిలలాడిపోయి పారిపోతున్న ప్రజలను అడవి మృగాలు వేటాడి చంపినట్లు తరిమి తరిమి కాల్చి చంపారు. అపరాధులు, నిరపరాధులు, పిన్నలూ, పెద్దలూ, స్త్రీలు, పురుషులు, ఒక విధంగా ప్రాణభయంతో కొంపాగోడు విడిచి అడవుల్లో, కొండల్లో రోజులతరబడీ రాత్రింబవళ్లు గడిపారు.

ఆ కాలఘట్టంలో ప్రపంచ ప్రజలను దిగ్భ్రాంతులను చేసిన మరో సంఘటన గురించి ఇక్కడ చెబుతాను. 1921 సం॥ నవంబర్ నెల పదో తేదీ ఉద్యమకారులు తొంభైమందిని ఖైదు చేసి, తిరూరంనుంచి ఒక బండిలో ఎక్కించుకుని, కోయంబత్తూరుకి తీసుకుపోయారు. గాలి వెలుతురు జొరబడకుండా తాళం వేసిన ఇనుప పెట్టె లాగుంది ఆ బండి. సైనికులు తుపాకీ మొనలతో ఖైదీలను లోపలికి నెట్టారు. బండి తిమారు నుంచి కదిలింది. వేడిమి వల్ల దాహానికి తట్టుకోలేక, లోపలవున్నవారు నాలుక లెండిపోయి, అల్లాడి అరచిన దీనస్వరాలు దారిపొడవునా వినిపిస్తూనే వున్నాయి. తర్వాత ఆ శబ్దం ఆగిపోయింది. అర్ధరాత్రి పన్నెండు గంటలకి బండీ పోతనూర్ చేరింది. పెట్టె తెరిచి చూస్తే కనిపించిన దృశ్యం భయభ్రాంతులని చేసింది. ఒకరినొకరు హత్తుకుని, ఒకరినొకరు కొరుక్కుతింటున్నట్లు, కళ్లప్పగించి, నాలుకలు వేళ్లాడుతూ, ప్రాణంతో వున్నారా లేదా అన్న వ్యత్యాసం లేకుండా, చెమట, నీళ్లు, మలంగా చిందరవందరగా పడివున్న తొంభైమంది దేహాల దీనదృశ్యాన్ని అక్కడ చూశాను. అరవైనాలుగు మంది చనిపోయారు. మిగతా వాళ్లు మృత్యుద్వారం వద్ద అల్లాడుతున్నారు.

దిక్కులేని ఖైదీలపట్ల దయారహితంగా నడచుకున్నవారి క్రూరత్వాన్ని బయటవారు తెలుసుకోని విధంగా, అధికారులు దాచడానికి ప్రయత్నించినప్పటికీ మేము ఈ వివరాలు మర్నాడే తెలుసుకున్నాము. ఈ వార్తను మద్రాసు పత్రికలకు అందజేయడానికి మేము ఒక మిత్రుణ్ణి పంపాము.

సైనిక పరిపాలన ఆరునెలలు కొనసాగింది. ఉద్యమకారులపై విచారణ జరపడానికి ఒక ప్రత్యేక న్యాయస్థానం ఏర్పాటు చేశారు. అందుకని కొన్ని ప్రత్యేక చట్టాలు చేశారు. ఉద్యమకారులు చాలామందిని ఉరితీశారు. ఎందరినో అండమాన్ దీవులకు తరలించారు. పది నుంచి పద్నాలుగు

సంవత్సరాలు దండన పొందినవారు కొద్దిమంది కాదు. ఉద్యమనాయకులైన అలిముసలియార్, సెంబరిచ్చేరి తంగళ్, కుంజ్ఞహమద్ హాజి మొదలైనవారిని మలపురంలో కాల్చి చంపారు.

ఉద్యమకారులను శిక్షించినట్లే, వారికి సహాయం చేసిన కొందరు గౌరవనీయులైన ప్రముఖులకూ శిక్ష విధించారు. ఎం.జి. నారాయణ మీనన్, కే. కేళప్పన్, ఇ. మొఇతా మౌల్వి, మణ్ణార్ కాదు ఇళయన్ నాయర్, మహమ్మద్ అబ్దుల్ రహమాన్, అప్పన్ కొయా మొల్ల మొదలైనవారికి శిక్షలు పడ్డాయి.

కె.వి. గోపాలమీనన్ తమ్ముడు, కె.బి. గోపాల కృష్ణమీనన్ గురించి ఈ సందర్భంలో ప్రత్యేకంగా చెప్పాలి. కేళప్పన్‌తో పొన్నాని నుంచి కాంగ్రెస్ సేవ చేసిన యువకుడు. చదువుకు స్వస్తిచెప్పి కాంగ్రెస్‌లో సేవ చేయడానికే వచ్చినవాడు. ఉద్యమం ప్రారంభమైన రోజుల్లోనే అతన్ని ఖైదుచేసి కణ్ణనూర్ జైలుకి పంపారు. ఆ వీర యువకుడు జైలులోనే వ్యాధిగ్రస్తుడై మరణించాడు. కాంగ్రెస్ లక్ష్యాలను నెరవేర్చే ప్రయత్నంలో వీరమరణం పొందిన మొదటి త్యాగి ఆయన. ఆయన ఛాయాచిత్రాన్ని జార్జ్‌జోసెఫ్ కాంగ్రెస్ కార్యాలయానికి సమర్పించిన విషయం జ్ఞాపకం వస్తోంది. కేరళ కాంగ్రెస్ సంస్మరించిన అమరుడయ్యాడు ఆయన.

సైనిక న్యాయస్థానం ఉద్యమకారులను విచారణ చేసిన విధానం గురించి, మలబార్‌లో ప్రసిద్ధి గాంచిన ఒక క్రిమినల్ లాయర్ మంజేరి రామయ్యర్ చెప్పారు. ఒకే నేరానికి రెండు పక్షాలైన ప్రతివాదులను వేర్వేరు న్యాయమూర్తుల ముందు హాజరు చేసి నేరారోపణ చేశారు. రెండు కేసుల్లోని సాక్షులు వేరువేరుగా వున్నారు.

ఒక ప్రతివాది ఖిలాఫత్ కార్యదర్శిగానో సహాయనిరాకాణోద్యమానికి సంబంధించిన వాడో అయినట్లయితే ఇక అతనికి విమోచనం లేదు. అతనిపట్ల న్యాయమూర్తులకు ఎలాంటి దయాగుణమూవుండదు. హత్యానేరం ఆరోపించబడ్డ, ఆరుగురు ప్రతివాదులలో ఒకరు ఆ నేరం జరిగినప్పుడు జైలులోనే వున్నారు.

ఉద్యమకారులలో నిజానికి సాక్ష్యాల బాధ్యత వాదుల పక్షంలో లేదు. ప్రతివాదుల పక్షంలో వుండేది. ప్రతివాదులకు సంబంధించి, సాక్ష్యం చెప్పడానికి అందరికీ భయంగా వుండేది. ఆ విధంగా ధైర్యంతో సాక్ష్యం చెప్పడానికి వస్తే వాళ్లు మర్నాడు నేరస్థులు కావలసివచ్చేది.

అనేక మాసాలు కొనసాగిన ఈ ఉద్యమ ఫలితంగా, ఎందరు చనిపోయారో లెక్కగట్టి చెప్పలేము. పదివేలకు తగ్గకుండా ఉంటారని చెప్పడం

అతిశయోక్తికాదు. ఆరునెలలు గడిచిన తర్వాత, పోరాటం తగ్గి ప్రశాంత వాతావరణం ఏర్పడినప్పటికీ, దాని పర్యవసానాలూ, దుష్ఫలితాలూ, నష్టం తగ్గడానికి కొంతకాలం పట్టింది.

# పోరాటం జరిగిన తర్వాత

ఒక భయంకరమైన సంఘటన జరిగినప్పుడు వెంటనే సాక్షులుగా వుండేవారు. తర్వాత దాన్ని వివరించేప్పుడు తమకు తెలియకుండానే ఉద్వేగపూరితులైపోయి, వాటిలో తమ స్వంత భావాలను కూడా కలిపేస్తారు. కొంతకాలం గడవాలి. అప్పుడే ఉద్వేగాల అలల నుంచి తేరుకుని, పరిశోధించి చూసినప్పుడే సూక్ష్మంగా జరిగిన పరిస్థితులు. కార్యకారణసంబంధాలు వివరంగా బోధపడతాయి. లేకుంటే మనం ఎన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ స్వచ్ఛమైన నిజాన్ని, అసలైనరూపంలో వెలుపలకి తీసుకురావడానికి వీలుకాదు. అది మనఃపూర్వకంగా చేసేతప్పు కాదు. మనకు తెలియకుండానే జరిగిపోయేతప్పు .

మలబారులో అనేక సందర్భాలలో జరిగిన ఉద్యమం గురించి చరిత్రలో, ముఖ్యంగా మలబార్ మాన్యువల్‌లో వివరంగా కనిపిస్తోంది. వాటి కారణాల గురించి చాలామంది చాలా అభిప్రాయాలు తెలియజేశారు. ఆ వ్యాఖ్యానాలు; చరిత్ర వ్రాసేప్పుడు అవసరమైనవి అయినప్పటికీ ఇటువంటి పుస్తకానికి అవి అవసరం కాదు. అయితే 1921వ సం|| జరిపిన ఉద్యమంలో కారణం ఎవరన్న విషయం గురించి ఏమాత్రం సందేహించనవసరం లేదు. దానికి కారణం పోలీసువారి దౌర్జన్యమే. ఖిలాఫత్ ఉద్యమం అణచివేయడానికి, అధికారులు తీసుకున్న మితిమీరిన అక్రమచర్యలే అందుకు ముఖ్యకారణం. వాటిని వదిలేసి, జన్మి పౌరుల తగాదా కారణం అనే, మతసంబంధమైన కీచులాట కారణంగా చెలరేగిందనే చెప్పడానికి లేదు. పోలీసుల దౌర్జన్యకాండ ప్రజలు భరించరానిదైనప్పుడు, అహింసను పాటించాలనే నియమాన్ని అధిగమించి, దుర్మార్గాన్ని దుర్మార్గంతో ఎదిరించడం సాధ్యం అని భావించి - దేశ ప్రజలు తెగించారు. ప్రభుత్వాధికారులు దీన్ని ఒక సవాలుగా భావించి ఎదుర్కొన్నారు. తర్వాత, ఇతర మతస్థులను హత్యచేయడానికి, వారికి వంచనతో కీడు తలపెట్టడానికి, ఉద్యమకారులు ప్రయత్నించడానికి కారణాలు వేరే!

ప్రారంభ ఘట్టంలో ఉద్యమకారులు హిందువులకు ఎలాంటి కీడు తలపెట్టలేదు. కొన్ని రోజులకు సైనికులు వేటాడ్డం ప్రారంభించిన తర్వాతే, పరిస్థితి మారింది. ఉద్యమకారులను వెతికి పట్టుకోవడంలో వాళ్లకు

హిందువుల సహాయం కావలసివచ్చింది. సైనికుల ఆజ్ఞ ప్రకారం జరగలేదంటే వాళ్లు హిందువులకి శిక్ష విధించేవారు. సైనికులతో చేరి ఉద్యమకారులను వెతకడం ప్రారంభిస్తే, ఉద్యమకారులు హిందువుల మీదే పగతీర్చుకునేవారు. ఈ విధంగా ప్రారంభమైన జాతి వైషమ్యం అతివేగంగా ఉదృతమైంది. అందువల్లనే ఉద్యమం చెలరేగిన ప్రాంతంలో హిందువులకు భద్రత లేకుండా పోయింది.

శిక్షకు భయపడే అధిక సంఖ్యాకులైన సగటుపౌరులు అపసవ్యమైన మార్గాలలో దిగకుండా శాంతిని కాపాడుతున్నారు. పాలకుల భద్రత లేకుండా, అరాచకం విజృంభించినప్పుడు, ఏం జరుగుతుందో చెప్పలేము. పోరాటం జరిగిన కొన్నాళ్లల్లో అటువంటి పరిస్థితే ఎరనాడులోను, ఇతర ప్రదేశాలలోనూ ఏర్పడింది. ఉద్యమకారులు చాలామంది పరిపాలకుల పట్ల ద్వేషంతో అధికారులను, వాళ్ల సహాయకులను వ్యతిరేకించడానికి తమ శక్తి సామర్థ్యాలను కేంద్రీకరించారు. అయితే, ఉద్యమం అని ప్రారంభమైన తర్వాత ఆ గుంపులో అటువంటి వారు మాత్రమే కాకుండా, ఏ మాత్రం జాలిలేని సంఘవిద్రోహులు, దొంగతనాలు, దోపిడీలు, నిర్బంధంగా మతం మార్పిడి చేయించడం వంటి కార్యాలకు తెగించే వాళ్లు చేరారు. పైగా మామూలు శాంతి నెలకొన్న రోజులలో, గుంపుల్లో చేరి ఎవరూ ఊహించని నీచకృత్యాలకు దిగడం కూడా కద్దు. వాళ్లకు జాలి, దయ మొదలైనవి మనసు నుంచి దూరమవుతాయి. మానాభిమానాలు కనిపించవు. సత్యం, నీతి అన్న భావనలు అదృశ్యమైపోతాయి. అవినీతి, అక్రమాలే తలెత్తి నిలుస్తాయి. మనలో అంతవరకు దాగివున్న జంతులక్షణాలు, వాటి సహజ రూపాలలో బయటపడతాయి. సాధారణంగా ఏ దేశంలోనైనా విచక్షణా జ్ఞానంలేని ప్రజాసమూహం అవకాశాలు లభించినప్పుడు చేసే అకృత్యాలే ఇవి. పోరాటకాలంలో ఎరనాడులోనూ, మరి ఇతర ప్రదేశాలలోనూ ఇదే జరిగింది.

పోరాటాన్ని అణచలేమని తెలియగానే, మేము ఆ తర్వాత పోరాటం జరిగిన స్థలాల నుంచి, శరణార్థులై వచ్చిన ప్రజలకు వుండడానికి బస, ఆహారం మొదలైన సౌకర్యాలు కల్పించడానికి ప్రయత్నించసాగాము. వేల సంఖ్యలో ప్రజలు బ్రతుకుతెరువును అన్వేషిస్తూ కోళిక్కోడ్‌కు వచ్చారు. మా విన్నపాల ఫలితంగా భారతదేశంలోని ఇతర ప్రాంతాల నుంచి మంచి సహాయం లభించింది. నిధి సేకరణకు మహాత్మాగాంధీ పూనుకున్నారు.

శరణార్థులు తలదాచుకోవడానికి మూడు నాలుగు ప్రాంతాలలో ఏర్పాటు చేశాము. ప్రతిరోజూ వాళ్ల ఆహారానికి కావలసిన పదార్థాలు అందజేశాము. వ్యాధిగ్రస్తులకు వైద్యసదుపాయం కల్పించాము. సూర్యోదయం నుంచి

మౌనంగా వుండడానికి వీలుకాలేదు. నాకు తెలిసినంతవరకు కొన్ని వాస్తవ విషయాలను వెల్లడించవలసి వచ్చింది.

నిర్బంధంగా మతం మార్పిడి చేయబడిన కొందరు కాంగ్రెస్ కార్యాలయానికి వచ్చి చెప్పిన వివరాలను, రికార్డుచేసి వుంచడం వల్ల ఆ వ్యాసానికి జవాబుగా నేనా వాస్తవాలను తెలియజేశాను. కొందరికి అది కోపం తెప్పిస్తుందని నాకు తెలుసు. 'హిందూ' పత్రికలో నా వ్యాసం వెలువడిన మర్నాడు జరిగిన సంఘటనలు ఇక్కడ తెలియజేస్తాము.

రాత్రి తొమ్మిది గంటలకు నేను భోజనం చేశాక, నేను, నా కుటుంబ సభ్యులు కార్యాలయం మేడమీద కూర్చుని వున్నాము. పిల్లలు నిద్రపోయారు. వెన్నెల రాత్రి, ఉత్తర దిశనుంచి ఒక రాయి కిటికీ గుండా వచ్చిపడింది. శబ్దం విన్న నేను దిగ్గున లేచి చూసే సరికి కప్పు మీద మరోరాయి వచ్చి పడింది. వెంటవెంటనే నాలుగైదు రాళ్లు పడ్డాయి. సాత్తుకట్టి నాయర్ క్రిందనుంచి పైకి పరుగెత్తుకు వచ్చారు. 'ఎవరది?' అని వరండా నుంచి మేము గట్టిగా అరిచాము. ఎక్కడా మనుషులు కనిపించలేదు. రాళ్లు మాత్రం నాలుగు వైపులనుంచి అప్పు డప్పు డు పడుతూనే వున్నాయి. కొద్దిదూరం నుంచి వాటిని విసురు తున్నారని తెలుసుకున్నాను. ఇద్దరు ముగ్గురు కలిసి విసురుతున్నట్లు తెలిసింది. దాదాపు పది నిముషాలు రాళ్లు విసరడం కొనసాగింది. శబ్దం విని మేలుకున్న పిల్లలు వెలుపలికి వచ్చారు. వరండాలో నిలబడడం సరికాదని మేము లోపలికి వెళ్లాము. రాళ్లుపడే చప్పు డు, సాత్తుకుట్టినాయర్ కంఠస్వరం విని పక్క ఇళ్లల్లో వున్నవాళ్లు వెలుపలికి వచ్చి చూశారు. నాలుగువైపులా సందడిగా అవడంతో రాళ్లు విసిరిన వాళ్లు వెళ్లిపోయారు.

మర్నాడు పోస్టులో నాకు కొన్ని ఆకాశరామన్న ఉత్తరాలు వచ్చాయి. నిర్బంధంగా మతం మార్పిడి జరిగిందని నేను పత్రికలో రాసిన వ్యాసాన్ని విమర్శిస్తూ అలా జరగలేదని వచ్చిన ఉత్తరాలు అవి. కాల్చి చంపుతామని, పొడిచి చంపుతామని బెదిరించి రాశారు నిజంగా జరిగిన సంఘటనలు నేను బయటపెట్టడం వల్ల ఎందరికో కోపం వచ్చిందని చెప్పడానికి మరో సంఘటన కూడా జరిగింది.

పైన చెప్పిన సంఘటన జరిగిన కొన్ని రోజులకు, రాజగోపాలాచారి కోళిక్కోడ్‌కు వచ్చారు. అప్పటికీ సైనిక పరిపాలన అమలుకావడం ముగిసింది. బహిరంగ సభలు జరపడానికి వున్న నిషేధాలు కూడా తొలగించబడ్డాయి. ఛిన్నాభిన్నమైన హిందూ-ముస్లిం ఐక్యతను మళ్లీ నిలబెట్టడానికి రాజగోపాలచారి అప్పు డు వచ్చారు. ఉద్యమం తర్వాత ఆయన

మధ్యాహ్నం వరకూ కాంగ్రెస్ కార్యాలయం ముందు ప్రజల గుంపు వుండేది. వాళ్ల అవసరాలు గమనించడానికి ఎందరో కాంగ్రెస్ సభ్యులు ముందుకు వచ్చారు. కె. మాధవన్ నాయర్, అంబాలక్కాడు, కరుణాకర మీనన్, పి. అచ్యుతన్, కె.బి. గోపాలమీనన్ మరికొందరు ఈ సేవలో ఉత్సాహంగా పాల్గొన్నారు. దాదాపు ఆరునెలలపాటు జరిగిన ఈ సహాయ కార్యక్రమాలలో, ఎంతో భక్తి శ్రద్ధలతో పాటుపడిన విధానం చూసి, కాంగ్రెస్ వ్యతిరేకులు సైతం మెచ్చుకోసాగారు. ఈ సహాయ నిధి నుంచి పోరాటకాలంలో మరణించిన వారి కుటుంబాలకూ, శిక్షపొందిన వారి కుటుంబాలకూ కావలసిన సహాయం అందజేశాము. ఆ కుటుంబాలలో హిందువులూ వున్నారు. మహమ్మదీయులూ వున్నారు.

శరణార్థుల శిబిరాన్ని భారత సేవాసంఘం అజమాయిషీలో ఏర్పాటు చేశాము. మెచ్చుకోతగ్గ రీతిలో వాళ్లు కృషిచేశారు. పోరాటం జరిగి చాలా రోజులైన తర్వాత కూడా భారతసేవాసంఘం పునరావాస కార్యక్రమాలు కొనసాగాయి. శరణార్థులలో సైనికుల చేత లేదా ఉద్యమకారుల చేత పగ తీర్చుకోబడ్డవారు చాలామంది వున్నారు. వాళ్లను కలుసుకుని వాళ్ల అనుభవాలు వివరించమని కోరాము. వాటిని రికార్డు చెయ్యడం కాంగ్రెస్ కమిటీకి మరొక కర్తవ్యం అయింది!

పోరాటం జరిగిన ప్రదేశాలలో జరిగిన వాటికీ, జరగని వాటికీ రంగూ, రూపం మార్చి మాట్లాడడమే చాలామందికి అలవాటుగా వుండేది. ఒక సంకుచిత సమాజానికి చెందిన మనస్తత్వం గలవారికి సంఘటనలలోని నిజస్వరూపం చూడడానికి మనస్కరించలేదు. ప్రత్యక్ష సత్యాన్ని అదే ధోరణిలో చూడడానికి కావలసిన మానసిక పరిపక్వత, చాలామందికి లేదు. ఉద్యమకారులు కొందరు నిర్బంధంగా కొందరిని మతం మార్పిడి చేసినట్లు వెలువడిన వార్తల మీద తీవ్రమైన వివాదాలు పత్రికల్లో వచ్చాయి. కొందరు వాటిని విపరీతంగా వివరించారు. ఆ వివాదంలో కాంగ్రెస్ వాళ్లు పాలుపంచుకోలేదు. వివరాలను సూక్ష్మంగా సేకరించి వాటిని భద్రపరిచారు.

'నిర్బంధంగా మతం మార్పిడి జరగడం, చేయించడం, పోరాటం జరిగిన ప్రదేశాలలో జరిగివుంటే వాటి గురించి కాంగ్రెస్ కార్యదర్శి చెప్పివుండేవారు. అటువంటి వివరం ఏదీ వెలువడకపోయేసరికి మతం మార్పిడి అన్నది కేవలం కట్టుకథ' అని మద్రాసు 'ది హిందూ' పత్రికలో ఒకరు రాశారు. దానికి కాంగ్రెస్ కార్యకర్త వద్ద నుంచి ప్రత్యుత్తరం వస్తుందని చాలామంది ఎదురుచూశారు. ఆ రోజులలో కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగా వున్న నేను,

రావడం అదే తొలిసారి. నాతోనే బసచేశారు. ఆరోజు సాయంకాలమే సముద్రతీరంలో మేము ఒక బహిరంగసభ ఏర్పాటు చేశాము. ఆయనతో పాటు ఆ సభలో పాల్గొనడానికి నేనూ వెళ్లాను. మేము వేదిక మీదకి వెళుతున్నప్పుడు కొందరు ఏవో నినాదాలు చేశారు. అవి నాకే అని గ్రహించాను. నేను పత్రికకు రాసినదానికి వ్యతిరేకంగా చెలరేగిన నినాదం అది. రాజగోపాలచారి ఉపన్యసించిన తర్వాత, నేను మాట్లాడడానికి లేచాను. అయిదు నిముషాలు నన్ను మాట్లాడనియ్యక అరిచారు. ప్రశాంతంగా వుండమని రాజగోపాలచారి చేసిన విజ్ఞప్తులు ఫలితం ఇవ్వలేదు. నేను మాట్లాడడానికే ప్రయత్నించాను.

'మతం మార్పిడి గురించి, నేను రాసిన వ్యాసమే మీరు ఈ విధంగా ప్రవర్తించడానికి కారణం అని నాకు తెలుసు. నినాదాలు ఇచ్చి తిట్లు, శాపనార్థాలు పెట్టి, వాస్తవాలను కప్పిపుచ్చడం వీలుకాదు. దేశభక్తి, సమాజ అభిమానం వున్నవాళ్లు ఇకమీదట ఇలాంటి సంఘటనలు జరగకుండా జాగ్రత్త పడటమే తగిన కర్తవ్యం. మతం మార్పిడికి లోనైన ప్రజలు. ఇచ్చిన వివరాలు ఆధారంగా వాటిని తెలియజేయడం అవసరమని భావించే నేను తెలియజేశాను. నేను పశ్చాత్తాప పడవలసిందేమీ లేదు. ఈ నిజాన్ని తెలుసుకున్న తర్వాత కూడా మీరు ఇప్పుడు వ్యవహరిస్తున్న తీరు బాధిస్తోంది. బాధ్యతారహితులైన కొందరి నీచకృత్యాలను, నిరోధించడం వీలుకానప్పుడు ఖండించడం, సమాజనాయకుల కర్తవ్యమని భావిస్తున్నాను'

నా ఉపన్యాసం లోని ఉద్దేశం అదే. నేను మాట్లాడుతున్నప్పుడు కూడా మధ్య మధ్య ఆటంకంగా కొందరు అరిచారు. నేను చెప్పవలసింది చెప్పిపూర్తి చేశాను. అయితే అల్లరి చేయాలనుకున్నవారికి, నా మాటలు తృప్తి కలిగించలేదు. అయినప్పటికీ చెప్పవలసిన విషయాలను మనసు విప్పి చెప్పానన్న తృప్తి కలిగింది!

ఇంతకుపూర్వం, ఆ తర్వాత ఇటువంటి అనుభవాలు నాకు చాలా కలిగాయి. ప్రజాజీవితంలో పాల్గొనే ఎవరికైనా ఇటువంటి అనుభవాలను ఎదుర్కొనక తప్పదు. దానికోసం మనం మనసు కష్టపెట్టుకోనవసరం లేదు. ఎవరినీ తప్పు పట్టనవసరం లేదు. ఇతరులు మనల్ని వ్యతిరేకించకుండానో, తప్పుగా భావించకుండానో మనం మన బాధ్యతలను నెరవేర్చాలను కుంటే అది సాధ్యమయ్యేపని కాదు. ఇది అనుభవమే తేటతెల్లం చేస్తుంది. కొందరు మనల్ని ద్వేషిస్తారు. కొందరు మనకు ఆదరణ చూపుతారు. మరికొందరు అభిమానిస్తారు. ఇవిమనకు సర్వసాధారణంగా కనిపించేవి. మన అంతరాత్మ ఆజ్ఞలకు లోబడి, అనుభవం చూపిన వెలుగులో ముందుకు అడుగువేస్తే

తప్పు జరిగే అవకాశం లేదు. అలా జరిగినా మనల్ని మనమే ఓదార్చుకోవడానికి అవకాశం వుంది.

ఇదే విధంగా నేను సైనికుల అక్రమాలను ఎత్తి చూపినప్పుడు ప్రభుత్వం వ్యతిరేకించింది. సైనికుల క్రూరచర్యలగురించి నాకు కొన్ని ఆచూకీలు తెలిసినప్పుడు, వాళ్ల దుశ్చర్యలకు బలి అయిన వారి దగ్గర్నుంచి కొన్ని సంగతులు రాబట్టి ఆ వివరాలు రాసిపెట్టాను. ఫరోక్ సమీపంలో నిండు గర్భిణియైన ఒక మహమ్మదీయ వనితను ఈటెతోపొడిచి గాయపరిచిన సంగతి, ఒక మహమ్మదీయ యువకుని కాళ్లు చేతులు నరికిన సంగతి తెలిసి నేను జాగ్రత్తగా వివరాలు సేకరించాను. వాళ్లిద్దర్ని శరణార్థుల శిబిరంలో వుంచి, చికిత్స చేస్తూవచ్చాము. వాళ్ల ఛాయాచిత్రాలు మా దగ్గర వుండేవి.

పోరాటం జరిగిన కొన్ని రోజుల తర్వాత, శ్రీమతి సరోజిని నాయుడు మద్రాసునుంచి కోళిక్కోడ్ వచ్చారు. పోరాటం గురించిన చాలా వివరాలు ఆమెకు తెలియజేశాను. ముఖ్యంగా పైన చెప్పిన రెండు విషయాలూ వివరంగా తెలియజెప్పాను. సరోజినీ నాయుడు బొంబాయి తిరిగి వెళ్లే దారిలో, మద్రాసు సముద్ర తీరంలో ఉపన్యసించినప్పుడు ఆమె కూడా సైనికు [illegible] కమాలను దుయ్యబట్టారు.

రెండు రోజుల తర్వాత, మద్రాసు ప్రభుత్వం ఒక ప్రకటన విడుదల చేసింది. సరోజినీ నాయుడు ఉపన్యాసంలో నిజంకాని విషయాలు చాలా వున్నాయనీ, సైనికుల అక్రమాల గురించి చెప్పిన విషయాలు సరికావనీ ప్రజల హృదయాలలో తప్పుడు అభిప్రాయాలు ఏర్పరచడానికి, కొన్ని సంగతులు రకరకాలుగా కల్పించి, ఉపన్యాసం చేశారనీ, వాటికి సరోజిని నాయుడు క్షమాపణలు చెప్పుకోకపోతే, ఆమె మీద తగిన చర్యలు తీసుకోవడం జరుగుతుందనీ ఆ ప్రభుత్వ ప్రకటన తెలియజేసింది. అది చదివిన వెంటనే నేను 'హిందూ' పత్రికకు ఒక ఉత్తరం రాశాను.

'మలబారులో జరిగిన విషయాల గురించి శ్రీమతి సరోజినీ నాయుడు మద్రాసు సముద్రతీరంలో చేసిన ఉపన్యాసంలో నిజం కాని సంగతులు వున్నట్లు ప్రభుత్వం చెబుతోంది. ఆమె చెప్పిన సంఘటనలన్నీ నిజంగా జరిగినవే. వాటి గురించి సరోజినీ నాయుడుకి నేనే చెప్పాను. నేను చెప్పిన వివరాలను బట్టి ఆమె ఉపన్యసించారు. అవి వాస్తవానికి విరుద్ధమైనదిగా ప్రభుత్వం భావించినట్లయితే వాళ్లు శ్రీమతి నాయుడు మీద చర్య తీసుకోవడం సరికాదు. నా మీదనే చర్యతీసుకోవాలి. నేను ఆమెకు తెలియజేసిన వివరాలు, సైనికుల దుండగాలకు బలిఅయిన ఇద్దరు వ్యక్తుల నుంచి స్వయంగా తెలుసుకున్నవే. వాటిని, ఛాయాచిత్రాలను పంపుతున్నాను. ప్రచురించండి

అని రాశాను. 'హిందూ' లో అవి ప్రచారింపబడ్డాయి. అయితే ప్రభుత్వం ఇందుకు జవాబు చెప్పలేదు.

అప్పుడప్పుడు దేశంలో జరిగే అకృత్యాలు, కలహాలు, నన్ను ఎంతో వేధించాయి. అయినప్పటికీ ఇవి మనదేశాన్ని విడిచిపోవు, చాలాకాలంగా వేళ్లూను తున్న విషవృక్షం ఇది. దీనిని సమూలంగా నాశనం చెయ్యలేము. నరికి కూల్చినా మళ్ళీ ఆ విషవృక్షం చిగురిస్తుంది అని కొందరు నిరాశతో చెప్పేవారు. నేను వాళ్లతో ఏకీభవించను. రకరకాల మతాల వారిని ఆహ్వానించి, వాళ్ల న్యాయపూరితమైన మత ప్రచారానికి వసతులు కల్పించిన పుణ్యభూమి ఇది. సహనమే మన నాగరికతకు పునాది అని చెప్పవచ్చును. రెండు శతాబ్దాలకాలం, సామాజిక విభేదాలు భారతదేశంలో అభివృద్ధి, చెందుతున్నాయంటే, దానికి ప్రధానకారణం పరాయి వారి పరిపాలన. అది ఇప్పుడు మారిపోయింది. మన పురాతన సంస్కృతిని పునరుజ్జీవనం కలిగించడం మనకు సాధ్యం కాదా? కరుణారహితుడైన మనిషి మతాల పట్ల ప్రేమ చూపించి సభ్యత ఎలా పాటించగలడు? సహనం లేకుండా సాంస్కృతికంగా అభివృద్ధి సాధించడం సాధ్యం అని ఎలా భావించడం? ఒక మతం వారి సిద్ధాంతాలను, విశ్వాసాలను, ఇతర మతస్థులు, తిరస్కరించి, విమర్శించడంలో అర్థమేమైనా వుందా?

వివిధ మతాలలో ఎందరో జ్ఞానులు జన్మించినప్పటికీ దేవుడికి మనిషికి మధ్యవున్న సంబంధం గురించిన విషయం యింకా ఆలోచించే దశలోనే వున్నది. ఆ ఆలోచనలు, అభిప్రాయాలన్నీ సమాజానికీ ఉమ్మడి సంపదగా భావించాలి. 'ఆవులు పలురంగుల్లో వున్నాయి. ఏ రంగులో వున్నా పాలు తెల్లనివే కదా? మతాచార్యులను గోవులుగా భావించండి, పాలు జ్ఞాన మవుతుంది' అన్న ఉపనిషత్ వాక్యాన్ని ఇక్కడ జ్ఞాపకం చేసుకోవాలి.

కొన్ని మౌలిక సత్యాలను అనుసరించి నడుచుకోవడం ధర్మమార్గం తప్పకుండా వుండడానికి మనకు ఉపకరిస్తుంది. మతంపేరుతో ప్రపంచంలో ఎన్ని యుద్ధాలు జరిగాయి? ఎన్ని అక్రమాలు జరుగుతున్నాయి? పదకొండో శతాబ్దం ప్రారంభం నుంచి పద్నాలుగో శతాబ్దం వరకు, క్రైస్తవ మతస్థుల, ముస్లిం మతస్థుల మధ్య లెక్కలేనన్ని యుద్ధాలు జరిగాయి. పదహారు, పదిహేడవ శతాబ్దం మధ్యకాలంలో క్రైస్తవ మతంలో రెండు శాఖలైన ప్రొటెస్టెంట్స్‌కు, కేథలిక్కులకు అవిరామంగా యుద్ధం జరుగుతూ వచ్చింది. ఆ విధంగానే ఈ దేశంలోనూ హిందూ-ముస్లింలకు మధ్య మతం పేరుతో ఇన్ని యుద్ధాలు జరిగాయి?

ధర్మచక్రవర్తి అశోకుడు ఒక శాశనంలో ఇలా చెక్కించాడు :

'ఒక కారణం చేతకాక పోయినప్పటికీ, మరొక కారణం ద్వారానైన అన్ని మతాలకు చెందినవారూ గౌరవనీయులే! ఇతర మతాలను గౌరవించేవ్యక్తి - తను స్వయంగా తన మతాన్ని గౌరవిస్తున్నాడు. ఇతర మతాలకు సంబంధించిన వారికి సేవ చేస్తున్నాడు'.

ఈ హితోక్తిని మనసులో ఉంచుకుని ప్రయత్నించినట్లయితే సమాజంలో ఎన్ని మంచి మార్పులను తీసుకురావచ్చు. అదే కదా మనం చేయవలసింది?

# ప్రజాకార్యాలలో మందగమనం

ఉద్యమం అణిగిన తర్వాత కొంతకాలం మలబార్‌లో ఎటువంటి ప్రజాహిత కార్యాలకు అవకాశం లేకుండా పోయింది. అన్ని దిశలలోనూ, కాంగ్రెసు పట్ల శత్రుభావం విస్తృతమవుతున్నట్లు కనిపించింది. 'ఖిలాఫత్' ప్రచారంలో పాలుపంచుకుని, దేశానికి అపాయం కలిగించిన వాళ్లు కాంగ్రెస్‌వాళ్లే అని అధికారులు చెప్పారు. 'ఖిలాఫత్' వాళ్లతో చేరిన కాంగ్రెస్‌వాళ్లు, సమాజానికి ద్రోహులు, అని హిందూ మతాధిపతులు ఖండించారు. మలబార్ కాంగ్రెస్ కార్యకర్తలను బంధించి జైల్లోపెట్టాలని కూడ వాళ్లు భావించకపోలేదు. తమను కాంగ్రెస్‌లో చేరండని ఉత్సాహ పరిచి, పోలీసువాళ్లు అణచివేతను, సైనికులు బాంబుల వర్షాన్ని ప్రారంభించినప్పుడు, కాంగ్రెస్ వాళ్లు తమను వదిలేస్తున్నట్టు మహమ్మదీయులు నేరారోపణ చేశారు. ఆ ఘట్టం కాంగ్రెస్ కోసం పాటుపడిన మాకు చాలా క్లిష్టమైనదనే చెప్పాలి. కాంగ్రెస్ వాళ్లతో కలిసిమెలసి తిరిగే వ్యక్తులు మామూలుగా చూపే కనీస మర్యాదలను కూడా చూపడం మానేశారు. మిత్రులు చూసినా, చూడనట్టు నటించేవాళ్లు. మమ్మల్ని వచ్చి చూడడానికి చాలా మంది జంకేవారు. ఏదైనా పనిమీద వాళ్లను చూడడానికి నేను వెళ్లినట్లయితే వెంటనే నన్ను పంపించేయడానికే వాళ్లు ఉత్సాహం చూపేవారు. చాలా మంది కాంగ్రెస్ కమిటీలు అదృశ్యమయ్యాయి. కొందరు కాంగ్రెస్‌వాదులు జైల్లో వున్నారు. మరి కొందరు కాంగ్రెస్ నుంచి రాజీనామా చేశారు. మిగిలివున్న కొద్దిమంది ఖర్చులకు కూడ లేకుండా బాధపడ్డారు. ప్రజాహితకార్యాలు నడపడానికి ఏమాత్రం అవకాశం లేకుండానే రోజులు గడిచాయి. దేశంలో మరి కొన్ని ప్రాంతాలలో సహాయ నిరాకరణోద్యమానికి సంబంధించిన దుర్ఘటనలు కొన్ని మలబార్ ప్రాంతంలోని కాంగ్రెస్ వాళ్లపట్ల ద్వేషాన్ని మరింత పెంచాయి.

ఈకాలంలోనే పూజ్యులు ఆంద్రూస్ కోళిక్కోడ్ వచ్చారు. ఉద్యమానికి గల కారణాలు, జరిగిన సంఘటనలు గురించి ప్రత్యక్షంగా తెలుసుకోవడానికి ఆయన వచ్చారు. ఒక వారం ఆయన కోళిక్కోడ్‌లో బసచేశారు. నేనూ కె. మాధవన్ నాయర్, యు. గోపాల మీనన్, చాలాసార్లు ఆయనను కలుసుకొని విషయాలను తెలియజేశాము.

ఒకసారి చూస్తే మరవలేనంతటి గొప్ప సంస్కారసంపన్నులు ఆండ్రూస్, భారతీయ సంప్రదాయం ప్రకారం పంచకట్టుకుని, తెల్లటి పొడవైన చొక్కావేసుకొని, నల్లటి పొడవైన గడ్డంతో చేతులు జోడించి శాంతం, ప్రేమ ప్రతిబింబిస్తుండగా మందహాసంతో మనల్ని సమీపించే ఆ దివ్యరూపాన్ని చూస్తే శరీరం గగుర్పొడుస్తుంది. ఆయన హృదయంలో కళంకం అన్న మాటకే ఆస్కారం లేదు. ఎక్కడెక్కడి ప్రజలు బాధలు పడుతున్నారో, ఎక్కడ అజ్ఞానం, బానిసత్వపు చీకట్లు అలుముకున్నాయో అక్కడికి ఆండ్రూస్ అనే దయామయుడు అరుదెంచేవాడు పుట్టుకలో ఆయన ఆంగ్లేయుడే అయినప్పటికీ, భారతదేశాన్ని మాతృభూమిగా స్వీకరించారు. భారతదేశంలో పలుప్రాంతాలను, దక్షిణాఫ్రికాలోనూ, శ్రీలంకలో, మలయా, మారిషస్ మొదలైన దేశాలలోనూ, భారత ప్రజల కష్టాలను తెలుసుకోవడానికి, వారికి ఆదరణ చూపడానికి, ఆయన పర్యటించారు. కట్టుకునే బట్టలు గురించి గాని, తినే తిండి గురించిగాని, దారి ఖర్చుల గురించిగాని ఆయన ఆలోచించేవారు కాదు. అవన్నీ భగవంతుడు ప్రసాదిస్తాడు. సేవచేయడమే మన కర్తవ్యం అని ఆయన విశ్వసించాడు.

రవీంద్రనాథ టాగూర్ శాంతినికేతన్‌లోనే ఆయన వుండేవాడు. అక్కడి విశ్వభారతిలో ఆయన ఉపాధ్యాయవృత్తి చేసేవారు. మహాత్మగాంధీకి ఆరోగ్యం బాగాలేదని తెలిస్తే వెంటనే ఆయనకు సేవలు చేయడానికి పరుగెత్తేవారు. టాగూర్ అనారోగ్యానికి గురైనా ఆయన అలాగే చేసేవారు.

ఒక వారం వుండి ఉద్యమం జరిగిన ప్రదేశాలను పర్యటించి, రకరకాల అభిప్రాయాలున్న వారితో కలిసి మాట్లాడిన తర్వాత ఆయన కలకత్తాకు తిరిగి వెళ్లారు. 'దారి ఖర్చులకు కావలసిన డబ్బులున్నాయా?' అని ఆయన్ను అడిగాను, చేతిలో రెండు రూపాయలున్నట్లు చెప్పారు. వెంటనే నేను నివారణ నిధి నుంచి తీసి రెండు వందల రూపాయలు యిచ్చాను. ఆ రోజు నాలుగు గంటలకు శరణార్థులు బసచేసివున్న శిబిరానికి ఒక గుర్రపు బండిలో వెళ్లాము; వెళ్లే దారిలో డబ్బును జాగ్రత్తగా తీసుకున్నారా? అని అడిగినప్పు డు ఆండ్రూస్ గతుక్కుమన్నారు.

'దాన్ని అక్కడే మేజా మీద వుంచాను, పాపం పనివాడు చూస్తే ఇబ్బంది పడతాడు, మనం తిరిగి పోదాం' అన్నారు ఆయన.

మేము బండిని వెనక్కు మరలించమన్నాము, వెళ్లి చూస్తే డబ్బు మేజాపైన అలాగే వుంది దాన్ని పెట్టిలో పెట్టి తాళం వేసి బయలుదేరాము.

స్వార్థరహితంగా యితరుల పట్ల ప్రేమ చూపే మనిషి ప్రపంచంలో వుంటాడా? అని ఎవరికైన అనుమానం కల్గినట్లయితే, వాళ్లు ఆండ్రూస్‌ను

చూస్తేచాలు. ఆయన శాంతినికేతన్‌కు తిరిగి వెళ్లినప్పుడు మా అబ్బాయి ఉణ్ణిని తీసుకుపోయారు. రెండేళ్లు వాడక్కడే చదివాడు.

ఉద్యమం అణగారినప్పటికీ దానికి సంబంధించిన సమస్యలు తీరిపోలేదు. కోళిక్కోడ్ మున్సిపల్ సరిహద్దుదాటి నేను పోకూడదని నా మీద ఆజ్ఞ జారీచేశారు. చౌరిచౌరాలో జరిగిన హింసాకృత్యాల తర్వాత గాంధీగారు చట్టాన్ని ఉల్లంఘించినందుకు కూడా ఆయన్ను ఖైదుచేశారు. దేశమంతా అశాంతి నెలకొన్న పరిస్థితి ఏర్పడింది. సహాయ నిరాకరణోద్యమం మళ్లీ చేపట్టడం అసాధ్యమని కొందరు భావించారు. గాంధీజీ మీద రాజద్రోహ నేరాన్ని మోపి విచారణ జరపమన్నారన్న వార్త కాంగ్రెస్ వాళ్లకు మాత్రమే కాకుండా యితరులకు కూడా భయాందోళనలు కలిగించింది. విచారణ జరగడానికి ముందు ఆయన్ని చూడాలన్న ఆశ, నాలో చెలరేగి నన్ను ఉత్సాహపరచసాగింది. అయితే నా మీద వున్న నిషేధాన్ని కాదని, కోళిక్కోడ్ వదిలి వెళ్లడం వీలుకాదుకదా? అందువల్ల నేను తగిన సమయంకోసం ఎదురుచూడసాగాను.

నా మీద విధించిన నిషేధం తొలగే రోజు ఆసన్నమయింది. మళ్లీ వాళ్లు నిషేధం పొడిగిస్తారేమో అన్న అనుమానం కొద్దీ, వాళ్లు దాన్ని పొడిగించడానికి ముందే కోళిక్కోడ్ వదలి వెళ్లడానికి మార్గాలు అన్వేషించసాగాను.

బొంబాయికి చెందిన పలువురు వ్యాపారులు కోళిక్కోడ్‌లో వుండేవారు. వాళ్ల సరకులు తరుచూ కోళిక్కోడ్‌నుంచి బొంబాయి పోతూ ఉండేవి. వాళ్లలో ఒకాయన హాజీ రంగీలా, నా కోర్కెను ఆయనకు రహస్యంగా తెలియజేశాను. ఆయన దానికి తగ్గ ఏర్పాట్లు చేస్తానని అంగీకరించారు. అది ఎండు కొబ్బరిని తీసుకుపోయే నౌక. సరకు నెక్కించుకుని, నౌక బయలుదేరేముందు నాతో వివరంగా చెప్పారు. ఆ రోజునే నా మీద విధించిన నిషేధాజ్ఞ ముగిసింది. అయినప్పటికీ ఆ నిషేధాజ్ఞను ఎప్పుడైనా మళ్లీ విధించవచ్చు. దానికి ముందే నౌకలో వెళ్లిపోవాలని నేను అనుకున్నాను. ప్రయాణానికి అవసరమైన సామాగ్రితో నేను సముద్రతీరానికి వెళ్లాను. హాజీ రంగీలా ఒక పడవలో అక్కడ సిద్ధంగా వున్నారు. ఆయన నాతోపాటు బొంబాయి వచ్చారు. ఆవేళ సాయంకాలానికల్లా మేము నౌక ఎక్కేశాము. రాత్రి నౌక రేవును వదిలింది. మర్నాడు తలైచ్చేరిలో కొంతసేపు ఆగింది. మంచి భోజనానికి రంగీలా ఏర్పాటు చేశారు. నౌక కేప్టన్ కూడా అప్పుడప్పుడు వచ్చి మా క్షేమసమాచారం తెలుసుకుంటూ వుండేవారు. ఐదు రోజుల ప్రయాణం చేశాక, నేను బొంబాయి రేవు చేరుకున్నాను. అక్కడ రంగీలా అతిధిగా ఒక రోజువుండి మర్నాడు అహమదాబాదు వెళ్లాను.

అక్కడికి వెళ్లిన మర్నాడే జైలులోవున్న మహాత్మాగాంధిని నేను చూశాను. అఖిల భారత నాయకులు చాలామంది అక్కడికి వచ్చారు. అక్కడికి వెళ్లిన మొదటి రోజు సబర్మతి ఆశ్రమంలో బసచేశాను. మర్నాడు అక్కడికి వచ్చిన విట్టల్‌బాయ్ పటేల్ నా వసతుల గురించి అడిగారు. ఆ తర్వాత ఆయన ఆహ్వానించగా వాళ్ల యింటికి వెళ్లి బసచేశాను. సర్దార్ పటేల్, ఆయన కుమార్తె ఆ రోజు అక్కడ వున్నారు.

మార్చి పద్దెనిమిదో తేదీ, గాంధీజీ కేసు విచారణకు వచ్చింది. అది న్యాయస్థానంలో జరగలేదు. ప్రయాణీకుల విశ్రాంతి నిలయంలో జరిగింది. విచారణ జరిగిన స్థలంలో శాంతికి భంగం కలగకుండా వుండడానికి తగిన జాగ్రత్తలు తీసుకోవడానికి, ఆయుధాలు ధరించిన సైనిక భటులు, ముందు జాగ్రత్త కోసం నియమించబడ్డారు. అయినప్పటికీ పెద్ద సంఖ్యలో ప్రజలు, విచారణ జరుగుతున్న స్థలంలో గుమికూడారు.

అందరూ కూర్చుని చూడడానికి అనువుగా విచారణ ఒక విశాలమైన స్థలంలో ఏర్పాటు చేయబడింది. పెద్ద అధికారులు, నాయకులు, నగర ప్రముఖులు అక్కడ గుమికూడారు. న్యాయమూర్తి రావడానికి కొంచెం ముందుగానే మహాత్మాగాంధి అక్కడికి వచ్చారు. మోకాలివరకు పంచ కట్టుకుని, వున్నట్లుండి ప్రవేశించిన ఆ సన్నటి ఆకారం గల మనిషిని చూడగానే అక్కడ వున్నవారంతా లేచినిలబడ్డారు. ఒక కుర్చీలో గాంధీజీ కూర్చున్నారు. పబ్లిక్ ప్రాసిక్యూటర్, పోలీస్ అధికారులు, ఆయనకు దగ్గరగా కూర్చున్నారు. అందరూ న్యాయమూర్తి రాక కోసం ఎదురుచూస్తూ వున్నారు.

సరిగ్గా పన్నెండు గంటలకు న్యాయమూర్తి వచ్చారు. దాంతో చారిత్రక ప్రాముఖ్యత సంతరించుకొన్న ఆ విచారణ ప్రారంభమయింది. మొదట నేరారోపణ పత్రాన్ని చదివి గాంధీకి తెలియజేశారు. ఆయన తను ఆ నేరాలు చేసినట్లు సందేహానికి ఏమాత్రం చోటులేకుండా న్యాయమూర్తి సమక్షంలో ఒప్పుకున్నారు. తన స్థితిని తేటతెల్లంచేసే విధంగా, ముందుగానే తయారుచేసి వుంచుకొన్న వివరణను న్యాయమూర్తి ముందు వుంచారు. బ్రిటిష్ ప్రభుత్వం అక్రమాలను, యథాతథంగా అసలు రూపంలో బయటపెట్టిన సుప్రసిద్ధమైన వాఙ్మూలం చాలా ఉత్సాహంకలిగించేదిగా వున్నది. దాన్ని చదివిన మహాత్మాగాంధి కంఠస్వరం భావం మరుపురానివి.

కోర్టు అమలులోకి తీసుకురావాలని, తీర్మానించే చట్టం న్యాయరహితమైనదనీ, నేను నిరపరాధిని అని మీకు అనిపిస్తే, ఒకటి-ఈ పదవిని రాజీనామా చేసి, ఈ అధర్మ కృత్యంలో పాల్గొనకుండా వుండండి; అలాకాదంటే, ఈ దేశ పరిపాలనా విధానం, దానిని ఆచరణలో పెట్టే విధానమూ

ప్రజాసంక్షేమాన్నే ఆశిస్తోందని, ఆ కారణంగా నా కృత్యం దేశానికి చెడే చేస్తుందనీ, కోర్టు భావించి నట్లయితే నాకు కఠినమైన శిక్ష విధించండి. ఈ రెంటిలో ఏదో ఒకటి తప్ప, కోర్టు వేరొక నిర్ణయాన్ని తీసుకోవడం సాధ్యంకాదు అన్న మాటలతో గాంధీగారు తన వాగ్మూలాన్ని ఆపారు. రెండు నిమిషాలు కోర్టులో ప్రశాంతత నెలకొన్నది. న్యాయమూర్తి పోలీసులు, అక్కడ చేరిన వారు గాంధీగారి మాటలు విని శిలలైనారు. న్యాయమూర్తి మాటలకు ఆయన యివ్వనున్న తీర్పుకు అప్పుడు ఎంతో ప్రాముఖ్యం ఏర్పడింది.

మీ దేశ ప్రజలైన కోట్లాది మంది మిమ్మల్ని మహా నాయకులుగా, దేశ భక్తులుగాను భావిస్తున్నారు. రాజకీయ సిద్ధాంతాలలో మీతో ఏకీభవించని వాళ్లుకూడా, మిమ్మల్ని మహాపురుషునిగా, కర్మయోగిగా భావిస్తున్నారు. చట్ట నిరాకరణ నేరాన్ని ఒప్పుకుని ప్రభుత్వానికి వ్యతిరేకంగా నేరం చేసిన వారుగా మాత్రమే నేను మిమ్మల్ని భావిస్తున్నాను. బాలగంగాధర్ తిలక్‌కు విధించిన విధంగా ఆరు సంవత్సరాల సాధారణ కారాగార శిక్ష మీకు విధిస్తున్నాను. ఇది మీరు ఎక్కువ అని భావించరనుకుంటాను. ఈ దేశ స్థితిలో మార్పు వచ్చి యీ శిక్షను తగ్గించమని ప్రభుత్వం తెలియచేసినట్లయితే, అందుకు నాకంటే ఎక్కువగా సంతోషించేవాళ్లు మరెవ్వరూ వుండరు. అని న్యాయమూర్తి తన ఆసనం నుంచి లేచి నిలబడ్డారు, కోర్టు ముగిసింది.

మహాత్మాగాంధి నుంచి వీడ్కోలు తీసుకోవడానికి ఆయన అనుచరులు చాలామంది ఆయన్ను సమీపించారు. ఉద్వేగపూరితమైన కొందరు నాయకులు వెక్కివెక్కి ఏడ్చారు. బాబు రాజేంద్రప్రసాద్‌ను గాంధి ఓదార్చడానికి ప్రయత్నించిన దృశ్యం నాకింకా జ్ఞాపకం వుంది. నేను ఆయన దగ్గర సెలవు తీసుకుని వచ్చిన తర్వాత మళ్లీ ఆయన నన్ను పిలిచారు. 'మరో విషయం గురించి నేను ఏర్పాటు చేసివున్నాను. దాన్ని గురించి విచార పడవద్దు', అని నాతో చెప్పారు. నాకు ప్రతి నెలా ఖర్చుకని గాంధీ కొంత మొత్తం పంపేవారు. దాన్ని గురించే ఆయన చెప్పారు. ఆ సమయంలోనూ, దాన్ని ఆయన జ్ఞాపకం వుంచుకున్నారు.

సెలవు తీసుకోవడానికి ఒక గంటకు పైగా పట్టింది. గాంధీజీని తీసుకువెళ్లడానికి బండి వాకిట కొచ్చింది. ఆయన అందులోకి ఎక్కారు. సరోజినినాయుడు ఆయనతో పాటు ఎక్కారు. ఆ కారు మా దృష్టినుంచి దూరమయ్యేవరకూ మేము అక్కడే వున్నాము.

ఆ విచారణ గురించి 'దిగ్రేట్ ట్రయల్స్' అని నేనొక ఆంగ్ల గ్రంథాన్ని వెలువరించాను. టి. ప్రకాశం దాన్ని రాయడానికి ప్రోత్సాహపరిచారు. ఆ పుస్తకం ఒక ప్రతి కూడా ప్రస్తుతానికి నా దగ్గర లేక పోవడం విచారకరం.

అంతా అయిపోయింది. స్వతంత్ర పోరాటం కూడా పూర్తయిపోయిందని కొందరు చెప్పకపోలేదు. అయితే అది స్వాతంత్ర్య పోరాటం ముగింపుకాదు, ప్రారంభం ఘట్టం అనే చెప్పాలి.

బొంబాయి నుంచి తిరిగి వచ్చిన తర్వాత కాంగ్రెస్ కార్యాలయాన్ని సాలపురంలోని మాధవన్ నాయర్ యింటి నుంచి కల్లాయి రోడ్‌లో వున్న ఒక మేడమీదకి మార్చాము. నా నివాసాన్ని మరో యింటిలో ఏర్పాటుచేసుకున్నాను. మాధవన్ నాయర్ తన యింట్లోనే వుంటూవచ్చారు.

ఆ సంవత్సరం 1922 కాంగ్రెస్ గయలో సమావేశమయింది. నేను అందులో పాల్గొనడానికి నిశ్చయించుకున్నాను. సాత్తుకుట్టి నాయర్ నాతోపాటు వచ్చారు. వెళ్లేదారిలో మేము కలకత్తాలో దిగి మూడు రోజులు శాంతనికేతన్‌లో గడిపాము. అక్కడ వున్న వసతిగృహంలోనే వున్నాము. ఆ ప్రసిద్ధ విద్యాలయాన్ని పూజ్యులు అండ్రూస్ మాకు తిప్పి చూపారు. బాలల ఉదయ గీతాలు, చెట్ల నీడలో వాళ్లు కూర్చుని చదవడం, వాళ్ల ఆటపాటలు మాకు కొత్తగా కనిపించాయి. నిడుపాటి శిరోజాలు, గడ్డంతో, పొడవైన దుస్తులతో హుందాగా అప్పు డప్పు డూ రవీంద్రనాథ్ టాగూర్ అటు వెళ్లడం చూశాము. అప్పు డు పిల్లలు ఆయనకు పాదాభివందనం చేసి పాదధూళిని తలమీద వుంచుకోడం చూసి మనసు పులకించింది. ఆయన తండ్రి మహర్షి దేవేంద్ర నాథ్ టాగూర్ కూర్చుని ధ్యానంచేసే స్థలాన్ని మాకు చూపారు. ఒక పెద్ద వృక్షం కింద వుందా స్థలం. మహాపురుషులు జీవించి, సంచరించిన స్థలాలు దర్శించినప్పు డు, మనసులో అనిర్వచనీయమైన భక్తి ప్రపత్తులు ఏర్పడతాయి. శాంతినికేతన్‌లో వున్న రోజులు, ఆ అనుభవాలు రవీంద్రనాథ్ టాగూర్‌ను ఒక సాయంకాలం కలుసుకుని మాట్లాడిన జ్ఞాపకాలు ఇంకా నా మనసులో మెదలుతూనే వున్నాయి.

వరండాలో ఒక వాలుకుర్చీలో రవీంద్రనాథ్ టాగూర్ కూర్చుని వున్నారు. సమీపంలో ఒక పేము కుర్చీలో నేను కూర్చున్నాను. గది కిటికీలనుంచి వెలుతురు ఏటవాలుగా పడుతోంది. ఆ మసకచికటి వెలుగులో టాగూర్ ముఖం స్పష్టంగా చూడ్డానికి వీలుకాలేదు. అయితే ప్రశాంతమైన ఆ సంధ్యా సమయంలో ఆయన మందస్వరంతో మాట్లాడిన మాటలు స్పష్టంగా వినిపించాయి. ఆ మాటల్లో ఒక ప్రత్యేకమైన మాధుర్యం తొణికిసలాడింది. శాంతినికేతనం గురించి ఆనాటి విద్యా బోధనా విధానం గురించి, వంగ నాట్యకళ గురించీ ఆయన ఎక్కువగా చెప్పారు. అరగంటకు పైగా మా సంభాషణ కొనసాగింది, తర్వాత నేను సెలవు తీసుకున్నాను. మర్నాడు ఉదయం శాంతినికేతన్ నుంచి బయలుదేరాము.

మహాత్మాగాంధీ సబర్మతీ ఆశ్రమంలోనూ, అనిబిసెంట్ బ్రహ్మవిద్యాలయంలోనూ, రవీంద్రనాథ్ టాగూర్ శాంతినికేతన్‌లోనూ, నేను వివిధ సందర్భాలలో పనిచేశాను. వాటిలో ఒక్కొక్క దాని ప్రత్యేకత నన్ను ఒక్కోవిధంగా ఆకర్షించాయి.

దైనందిన జీవితంలో క్రమశిక్షణను, ముఖ్యంగా సబర్మతీలో చేరిన వాళ్ల వెంటనే తెలుసుకోవచ్చు. వేకువ జామున నాలుగుగంటలకు లేచి సామూహిక ప్రార్థన చేయడం, ఒక పని ముగించి మరోపనిని ప్రారంభించడం, అక్కడ చాలా చక్కగా జరుగుతాయి. ఎన్నో విషయాలు చదివి, నాగరికత, సంస్కృతి అంటూ వివాదాలు చేస్తూ, అక్కడ ఆశ్రమములో గడిపింది లేదు. వాళ్ల దృష్టి అంతా పనుల మీదే కేంద్రీకరించబడివుంది. గ్రామసేవకు కావలసిన, శిక్షణ అక్కడ అందించారు. ధనార్జనాసక్తి లేకుండా సత్యం, అహింసలపట్ల విశ్వాసంతో, ప్రజలకు మనస్ఫూర్తిగా సేవచేసే మనోభావాన్ని అలవాటు చేయడమే సబర్మతీ ఆశ్రమ లక్ష్యం.

అడయార్‌లో సహజ సుందర ప్రకృతి వాతావరణంలో బ్రహ్మ విద్యామందిరం నెలకొల్పబడివుంది. అక్కడ కనిపించే, భవనాలు, గ్రంధాలయం, చక్కని పుష్పవనాలు, ఆ స్థలం ప్రత్యేక అంశాలు, పండితులు, చింతనావరులు, వివిధ ప్రాంతాల నుంచి వచ్చి సమావేశమయ్యే ఆ వాతావరణం ఆ నాగరికతా సంస్కృతులు, ఆడయార్‌లో అధ్యాత్మిక స్పష్టతను, ప్రశాంతతను, కలుగజేస్తున్నాయి. ప్రశాంతతకోసం ఒక చోట కూర్చుని చదివేప్పుడు, బాహ్య ప్రపంచపు రణధ్వనులకు దూరంగా ఆలోచించడానికి అనువైనది అడయార్ అనడంలో సందేహం లేదు. అనిబిసెంట్ కాలంలో వున్న పేరు ప్రఖ్యాతులు యిప్పుడు అక్కడ లేకపోవచ్చుకానీ, యిప్పుడు కూడా ఆ వారసత్వపు విశిష్టత కొనసాగుతూనే వుంది.

శాంతినికేతన్ ప్రత్యేకత మరొకటి యిక్కడ కళలకు ప్రాముఖ్యత నిచ్చారు. సంగీతం, నాటకం, నటన, చిత్రకళ మొదలైన లలిత కళలు యిక్కడ ప్రోత్సహించబడుతున్నాయి. గ్రామాల నుంచి వచ్చే కళాకారులు, అప్పుడప్పుడు శాంతినికేతన్‌లో ప్రదర్శనలివ్వడం పరిపాటి. విద్యార్థుల నాటకాలు అక్కడ ప్రదర్శింపబడుతూ వుంటాయి. రవీంద్రనాథ్ టాగూర్ కూడా వాళ్లతో పాటు వేషం వేసుకుని నటించడం కద్దు. విద్యా శిక్షణ ప్రధాన అంశం కళా శిక్షణ. విద్యావిధానంలోని ఒక లక్ష్యం చదువరులలో కళల పట్ల ఆసక్తి పెంపొందించ చేయడం. కళాజ్ఞానం లేని జీవితం, మనిషికి సంబంధించినది కాదు, అన్నదే శాంతినికేతన్ నిర్వాహకుల సిద్ధాంతం. ఒక్కొక్క

సంస్థ వాటిని స్థాపించిన వారి స్వభావానికి లక్ష్యానికి, సంబంధించిన రూపాలుగా, భావించడం పైన చెప్పిన మూడు సంస్థలలోనూ చూడవచ్చు, గ్రహించవచ్చు.

శాంతినికేతన్ నుంచి మేము గయ కాంగ్రెస్‌కు వెళ్లాము. కేరళ ప్రతినిధులకని ప్రత్యేకంగా ఒక శిబిరం ఏర్పాటు చేశారు. కె. మాధవన్ నాయర్, టి.ఆర్. కృష్ణస్వామిఅయ్యర్, మధురదాన్, ఏ.కె. పిళ్లై, డాక్టర్ ఎం. పెరుమాళ్ నాయుడు మొదలైన ప్రముఖులు అక్కడ వున్నారు. మహాత్మగాంధీ చెరసాలలో వుండడం వల్ల, కాంగ్రెస్ భవిష్యత్తు ఎలావుంటుందనీ పలువురు ఆందోళన చెందారు.

కాంగ్రెస్ కార్యకలాపాలలో మార్పులు తీసుకురావాలన్న విషయం గురించి, సభలో తీవ్రమైన వాదోపవాదాలు జరిగాయి. ఒక దానికొకటి వ్యతిరేకించే అభిప్రాయాలు కాంగ్రెస్ వాదుల మధ్య వుండడం తేటతెల్లమయింది. గాఢంగా జరిగిన ఒక సహాయనిరాకరణోద్యమానికి ప్రజలు యింకా ఆదరణ చూపడానికి సిద్ధంగా లేరన్న విషయం తెలుసుకోవడానికి దేశంలో జరిగిన శోచనీయమైన సంఘటనలే సాక్ష్యాలనీ, చట్టవ్యతిరేకతను అప్పటికి నిలిపివేసి, రాజ్యాంగచట్ట నిర్ణయసభలలో స్థానం సంపాయించి, స్వాతంత్ర్య పోరాటాన్ని, లోపలినుంచే కొనసాగించడం, ఉచితం, శ్రేయస్కరం, అని ప్రబలమైన ఒక పక్షం వాదం. గాంధిగారు తీర్మానించిన కార్యాచరణలో ఎలాంటి మార్పూ తీసుకురాకూడదు అన్నది, మరోపక్షం అభిప్రాయం, గయ కాంగ్రెస్‌లో ఉభయ పక్షాలు అభిప్రాయభేదాలు ఒక పెద్ద పోరాటంగానే సాగాయి.

ఆ సంవత్సరం అధ్యక్షత బాధ్యతను వహించింది, చిత్తరంజన్‌దాస్. త్యాగమూర్తి అయిన ఆయన జీవిత చరిత్రయే జాతీయ జీవనంలో పాల్గొన్నవారికి మంచి ప్రేరణను కలిగించేది. నెలనెలా వేలకు వేలు రూపాయలను సంపాయించే వృత్తిని వదలి, గాంధీజీ నాయకత్వంలో సాగే జాతీయ ఉద్యమంలో అడుగుపెట్టారు. చిత్తరంజన్‌దాస్ నిరాడంబర జీవితం, దేశసేవ తన జీవిత లక్ష్యాలుగా పోరాటంలో దిగిన చిత్తరంజన్ వాక్పటిమ అపూర్వమైనది. ఉత్సాహవంతమైన ఆయన నాయకత్వం ఏ సంస్థకైనాసరే నూతనోత్తేజాన్ని కల్గించేది. కాంగ్రెస్ కార్యకలాపాలలో మార్పు, తీసుకురావాలన్న పక్షానికి ఆయన నాయకత్వం వహించారు. అందువల్ల మార్పు న్యాయమైనదిగా వివరిస్తూ తన అధ్యక్షోపన్యాసంలో ఆయన అద్భుతంగా వాదించారు.

మార్పు అవసరంలేదన్న పక్షానికి సి. రాజగోపాలాచారి నాయకులు. కఠినమైన వాదప్రతివాదులు అక్కడ కొనసాగాయి. మహాత్మగాంధీ ఉద్దేశాలను, ఆలోచనలును గురించి కాంగ్రెస్ చేపట్టిన కార్యకలాపాలను, ఆయన

చెరసాలలో వుండగా వదులుకోవడం మహాత్మాగాంధీ పట్ల మనం చేసే మహాపరాధం అని మార్పు వద్దనే పక్షంవారు వాదించారు. కాలానుగుణంగా మార్పులు చేయడంలోనే స్వతంత్ర పోరాటప్రగతివుందని మరోపక్షం వారు వాదించారు. చివరికి మార్పుకి వ్యతిరేకంగానే, కాంగ్రెస్ మెజారిటీని సాధించింది.

తమ అభిప్రాయానికి ఆదరణ చూపిన వారందరినీ కలిపి సి.ఆర్.దాస్ స్వరాజ్య పార్టీ ప్రారంభించారు. ఆ పార్టీ మరో నాయకుడు పండిట్ మోతిలాల్ నెహ్రూ, యిద్దరు ప్రముఖనాయకులు నాయకత్వం వహించిన ఈ పార్టీకి వివిధ ప్రాంతాలనుంచి ఆదరణ లభించింది.

గయకు వచ్చిన కొందరు నాయకులను చూసినప్పుడు నాలో చాలా ఆలోచనలు చెలరేగాయి. అన్నిటినీ త్యాగంచేసి, స్వాతంత్రోద్యమంలో పాల్గొనడానికి నడుం బిగించి బయలుదేరిన చాలామంది చరిత్రలు, నాకు ఉద్వేగాన్ని కలిగించాయి. వీళ్లందరు ఇటువంటి త్యాగాలు చేయడానికి ప్రోత్సహించిన శక్తి ఏది? పెద్ద పెద్ద అధికారాలు గల పదవులను కాదన్నారు. చాలాకాలం అనుభవించిన సుఖాలను, వసతులను వద్దనుకున్నారు. తమ కార్యకలాపాలవల్ల పోలీసువాళ్ల లాఠీ దెబ్బలు తినవలసివస్తుందని తెలిసికూడా దానికి సిద్దపడ్డారు. దేశసేవ కోసరం కార్యరంగంలో దిగిన త్యాగజ్యోతుల జీవితాలు అందరికీ ప్రేరణ కలిగించేవికదా?

కాంగ్రెస్ మహాసభ తర్వాత మేము ఒక తీర్థయాత్రకు బయలుదేరాము. కాశీ, ప్రయాగ, గయ, మొదలైన స్థలాలను దర్శించాము. అక్కడంతా కనుపించిన అపరిశుభ్రత, లెక్కలేనంత మంది రోగగ్రస్తులు, వికలాంగులు, బిక్షగాళ్లు మొదలైన దృశ్యాలన్నీ నాకు వేదన కలిగించాయి. డబ్బే ప్రధానంగా దురాశాపరులైన, పండాలు చేతల్లో చూపిన, సోమరితనం నాకు బాధ కలిగించింది. దేశం స్వాతంత్రం పొందినా ప్రజల మధ్య ఎంతోకాలంగా వేళ్లూనివున్న మూఢవిశ్వాసాలు, ఆచార వ్యవహారాలు, పోగొట్టడానికి ఎంతో కాలం పడుతుందని అప్పుడు నాకు అనిపించింది.

ఆచార వ్యవహారాల అర్థాన్ని, అవసరాన్ని తెలుసుకోకుండా, విద్యావంతులైన వారు సైతం, గుడ్డిగా ప్రవర్తించడం, వివేకరహిత కార్యాలను చేయడం, చూసినప్పుడు ఎవరికైనా ఆశ్చర్యం కలుగుతుంది.

ఉత్తర భారతదేశం నుంచి తిరిగి రావడానికి ముందు, నేను బుద్ధగయకు వెళ్లాను. బుద్ధుని పవిత్ర నామంతో సంబంధమున్న పుణ్యస్థలం గయ ప్రపంచంలో పలుప్రాంతాల నుంచి రోజూ చాలామంది అక్కడికి వస్తూవుంటారు, యిక్కడ వున్న బోధివృక్షం క్రిందనే కదా సిద్ధార్థుడు జ్ఞానం

పొంది బుద్ధుడయ్యాడు! ఆ అవతార పురుషుని చరిత్ర ఎరిగినవారు హృదయం పులకరించే భావంతో ఆ బోధివృక్షాన్ని సమీపించేవారు. రెండువేల ఐదు సంవత్సరాల క్రితం, ఆ నీడలో, కళ్లుమూసుకుని ఏకాగ్ర చిత్తంతో ఆసీనుడైన ఆ దివ్య మంగళ రూపుని, నేను మనోనేత్రాల ముందు తిలకించాను. ఈ సుదీర్ఘకాలంలో, ఎన్నెన్ని తరాలవారు, ఆ పుణ్య పురుషుడు చూపిన మార్గంలో నడిచి ఆనందం పొందారు? ఎందరెందరి జీవితాలలో ఆయన కరుణాకటాక్షం వ్యాపించి వుంది? ఆయన సన్మార్గ జ్యోతిని చూపివుంది? శ్రీ బుద్ధుని జ్ఞాన జీవిత జ్యోతిగా భావించిన ప్రజలు యింకా కోటానుకోటి మంది వున్నారు. ప్రపంచ ప్రజల అశాశ్వతమైన ధోరణి, బాధలను చూసి ఆయన వేదనపాలయ్యాడు. దుఃఖానికి కారణాలను పరిశోధించి తెలుసుకోవడానికి, సర్వాన్ని త్యాగంచేసి తపస్సుకు బయలుదేరిన కరుణామూర్తిని, నేను మళ్లీ ఒకసారి శిరస్సువంచి నమస్కరిస్తున్నాను. ఇటువంటి తపోధనుడు, మహాపురషుడు జన్మించకపోతే ఈ ప్రపంచ స్థితి ఎలా వుండేది? బుద్ధుడు, క్రీస్తు, నబి, శ్రీరామకృష్ణ లేని ప్రపంచాన్ని ఊహించడానికైనా సాధ్యమవుతుందా?

# మాతృభూమి పుట్టుక

ఏ ఉద్యమం అయినా సరే అభివృద్ధి చెందాలంటే దానికి అండగా ఓ పత్రిక వుండాలి. సహాయ నిరాకరణోద్యమం ప్రారంభమయిన రోజులలో కోళిక్కోడ్ నుంచి నాలుగు మలయాళ పత్రికలూ రెండు ఆంగ్ల పత్రికలూ వెలువడేవి. 'కేరళ పత్రిక' 'మనోరమ' 'కేరళ సంచారి' 'మితవాది' మొదలైన మలయాళ పత్రికలన్నీ దినపత్రికలు.

సెంగుళత్తు కుఞ్ఞారామన్ మీనన్, 'కేరళ పత్రిక' సంపాదకుడు సుప్రసిద్ధుడు. కుఞ్ఞారామన్‌కు, గాంధీజీ పేరుకాని, సహాయనిరాకరణోద్యమం గురించి గాని ఎవరు ప్రస్తావించినా గిట్టదు. ఆ ఉద్యమాన్ని అందులో పాల్గొన్నవారిని విమర్శించడానికే తమ పత్రికలను ఎక్కువగా వినియోగిస్తూ వుండేవారు. అంత శక్తివంతమైనది కాకపోయినప్పటికీ 'మనోరమ' కూడ ఆ ఉద్యమాన్ని వ్యతిరేకించిన పత్రికయే. మొదట ఒక దినపత్రికగా ప్రారంభమైన 'మనోరమ' ఆ తర్వాత వారానికి మూడు సార్లు విడుదల అయ్యేది. పుళియం పార్త్రకుఞ్ఞకృష్ణమీనన్ దాని మొట్టమొదటి సంపాదకుడు, ఆయన మరణానంతరం, ఆయన మేనల్లుడు కృష్ణన్ నాయర్, పత్రిక బాధ్యతలు స్వీకరించి నడిపారు. ఆయన కూడా పత్రికలో చెప్పుకోదగ్గ మార్పులేవీ ప్రవేశపెట్టలేదు.

'కేరళ సంచారి' కూడా అలాంటిదే, ప్రభుత్వానికి వ్యతిరేకంగా దేనినీ ప్రచురించడానికి ఆయన యిష్టపడలేదు, జాతీయోద్యమానికి ఆదరణ చూపినప్పటికీ దానిని ఆయన బహిరంగంగా ప్రకటించుకోలేదు.

సి. కృష్ణన్ గారి 'మితవాది' కాంగ్రెస్ వాళ్లను తప్పులు పట్టడం, లోపాలు చూపడంలో అతివాదిగా వుండేది, బ్రిటిష్‌వాళ్లు ఈ దేశాన్ని వదలి వెళ్లినట్లయితే, ఈ దేశపరిస్థితి, కాపలావాళ్లులేని ఇల్లయిపోతుందని ఆయన విశ్వాసం. 'మితవాది' ఆయనకున్న ఆ లక్ష్యాన్ని ఆదరించేదిగానే వుండేది.

'వెస్ట్ కోస్ట్ స్పెక్టేటర్' 'వెస్ట్‌కోస్ట్ రిపోర్టర్' అన్న రెండు ఆంగ్ల దినపత్రికలూ కోళిక్కోడ్‌నుంచి వెలువడేవి. ప్రారంభకాలంలో జి. సుబ్బారావు పర్యవేక్షణలో వెలువడిన 'స్పెక్టేటర్' పేరు ప్రఖ్యాతులతో భాసించింది. జంకులేకుండా వ్యవహారాలు పరిశోధించి ప్రచురించే ఒకే పత్రిక అనే స్థాయిలో అది వుండేది.

సుబ్బారావు మరణం తర్వాత ఆ అర్హతను కోల్పోయింది. అటుపైన అది కూడా మిగతా పత్రికల్లాగే తయారయింది. 'రిపోర్టర్' పత్రికలోనూ ఎలాంటి ప్రత్యేకతగాని గొప్పదనం కాని కనిపించలేదు.

'మాతృభూమి' ప్రారంభించిన కాలంలో జాతీయోద్యమానికి చెందిన రెండు పత్రికలు మలయాళ భాషలో వెలువడుతూ వుండేవి. ఒకటి ఎ.కె. పిళ్లైని, అధినేతగాను, సంపాదకునిగానూ ఉంచారు. కొళం నుంచి వెలువడిన 'స్వరాట్' పత్రిక అది దానిని నిర్వహించడంలో ఆయన ఎన్నోకష్టనష్టాలు అనుభవించారు. మరొకటి 'యువభారతం' అన్న పేరుతో పాల్ఘాట్ నుంచి కృష్ణ స్వామి అయ్యర్ ప్రచురించిన పత్రిక. గాంధీజీ నడుపుతున్న 'యంగ్ఇండియా' లాగే అదే సైజులో వస్తున్న దినపత్రిక అది. జాతీయోద్యమం గురించి, ప్రజలకు బాగా తెలియాలి, అన్న లక్ష్యంతోనే ఆయన పత్రికను, నడుపుతూ వచ్చారు.

కేరళలో జాతీయోద్యమం పట్ల అమితోత్సాహంతో సేవ చేసిన వారు టి.ఆర్. కృష్ణస్వామి అయ్యర్, సహాయనిరాకరణోద్యమం ప్రారంభమైన కాలంలోనే పాల్ఘాట్లో వృత్తిని వదిలిన న్యాయవాది ఆయన. తర్వాత పాల్ఘాట్ తాలూకా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగా ఖద్దరు ప్రచారం, అస్పృశ్యతా నివారణ మొదలైన విభాగాలలో ఉదాత్తమైన సేవచేసినవారు. ఆయన హరిజనోద్ధరణకోసం నెలకొల్పిన 'శబరి ఆశ్రమం' ఒలవక్కోడ్లో యింకా వుంది. 'యువభారతం' ద్వారా ఉద్యమానికి ఇతోధిక ప్రచారం లభించింది. అయినప్పటికీ, గాంధీజీ లక్ష్యాలను సహాయనిరాకరణోద్యమ కార్యాచరణ వివరాల గురించి జన సామాన్యానికి తెలియచేసే విధంగా అది కొంతవరకు సహాయకారిగానే పనిచేసింది.

కాంగ్రెస్ పథకాలను గురించిగాని, కాంగ్రెస్ వాళ్లు ప్రయత్నాల గురించిగాని, ఏవైనా వార్తలు కోళిక్కోడ్ పత్రికలకు పంపినట్లయితే వాళ్లు దానిని ప్రచురించే వాళ్లుకారు. విమర్శలకు జవాబుగా ఏదైన వ్రాసినా దానిని వాళ్లు నిరాకరించేవాళ్లు. మా నివేదికలను, విజ్ఞాపనలను, ప్రత్యేకంగా అచ్చువేసి పంపడానికి మాకు వసతులు లేవు. వాటిని అచ్చువేసి యివ్వడానికి ముద్రణాలయాలవారికి భయం. ఈ కారణాలవల్ల మా ప్రచురణలను, అచ్చువేయించడానికి తిరుకూరుకో మరెక్కడికో వెళ్లాలి. అదీ సౌకర్యంగా లేదు. తర్వాత ఒక సైక్లోస్టైల్ యంత్రం కొని, అందులో నకళ్లు తీసి, యివ్వడానికి ఏర్పాటు చేశాము. ఈ పరిస్థితిలోనే మేము ఒక పత్రిక ప్రారంభించి నడిపే విషయం గురించి ఆలోచనలు చేయసాగాము.

'నవీన కేరళం' అన్న పేరుతో ఒక పత్రికను తీసుకురావచ్చునని మొదట తీర్మానించాము. హోమ్‌రూల్ ఉద్యమకాలంలో అనిబిసెంట్ పర్యవేక్షణలో వెలువడిన 'న్యూ ఇండియా' లా 'నవీన కేరళను' నూతన ఉద్యమానికి సంబంధించిన పత్రికగా భావించవచ్చునని అనుకున్నాము. అప్పుడు మలబార్ ఉద్యమం ప్రారంభంకావడానికి అది ఒక ఆటంకమయింది.

ఉద్యమం ప్రారంభంకాగానే, యు. గోపాలమీనన్, కె.బి. కుంజుణ్ణిమీనన్, మద్రాసు వెళ్లారు. అక్కడే వాళ్లు 'నవీన కేరళం' అన్న పేరుతో ఒక దినపత్రికను ప్రారంభించి ప్రచురించసాగారు. కుంజుణ్ణిమీనన్ చక్కనివచనం రాయడంలో సిద్ధహస్తుడు. ఆయన సహకారం యు. గోపాలమీనన్‌కు మంచి అవకాశంగా లభించింది. ఒక చిన్న ప్రెస్ కొని, వాళ్లు కొన్ని నెలల వరకు మద్రాసు నుంచి 'నవీన కేరళను' వెలువరించారు. ఉద్యమం సద్దుమణగి దేశపరిస్థితి మెరుగుపడి శాంతి ఏర్పడడంతో, ఒక పత్రిక తీసుకొచ్చే ఆలోచన మళ్లీ నాలో తలెత్తింది. మా న్యాయవాదవృత్తికి రావాలని నాకుగాని, మాధవన్ నాయర్‌కుగాని, కొంచెం కూడా అనిపించలేదు. ముఖ్యంగా కాంగ్రెస్‌కు సేవచేయడానికి నిలకడగా ఏమీ చేయలేని పరిస్థితివుండేది. అందువల్ల కొంతకాలంగా ప్రారంభించాలనుకుంటున్న పత్రికను, ఎలాగైనా సరే తీసుకురావాలని, మేము కృతనిశ్చయులమయాము.

ఇవాళ మంజేరిలో ప్రముఖ న్యాయవాదిగా వుంటూన్న కె. కేశవన్ నాయర్ ఆ రోజులలో కోళిక్కోడ్‌లో ప్రాక్టీసు చేస్తుండేవాడు. మాధవన్ నాయర్ సోదరులైన ఆయన నాకు చిరకాల మిత్రులే. 'మనం మొదట ఆలోచించి వుంచుకున్న పేరుతో ఇంతకు క్రితమే ఒక పత్రిక వచ్చేసింది. ఇకపైన నవీన కేరళం, అన్నపేరు బాగలేదు. కొత్తగా మంచి పేరు ఒకటి చూడాలి కదా!' అని కేశవన్ నాయర్ నన్ను ప్రశ్నించారు. ఒక పేరును ఆలోచించాను, అయితే దానిని యిప్పుడు చెప్పను, ఏర్పాట్లన్నీ పూర్తికానివ్వండి, చెబుతాను' అన్నాను నేను. నవీన కేరళం విడుదల అయిన తర్వాతే నేను వివిధ పేర్ల గురించి ఆలోచించాను. 'దేశోద్ధారిణి' 'స్వాతంత్ర్య కాహళం' 'అరుణోదయం' అంటూ ఏవేవో పేర్లు మనసులో కదిలాయి. 'మాతృభూమి' అన్న పేరు తట్టగానే మిగతా పేర్లన్నీ మాయమయ్యాయి. మాతృభూమి... మాతృభూమి... అని తనకుగానే మనసులో ఉదయించినట్లు అనిపించింది. చాలాసార్లు దానిని నా మనసులో చెప్పిచూసుకున్నాను. తర్వాత చెబుతాను అని నేను మొదట కేశవన్ నాయర్‌తో చెప్పినప్పటికీ దానిని రహస్యంగా వుంచుకునే ఓర్పు నాలోలేదు. ఆ పేరును నేను మొదట కేశవన్ నాయర్ దగ్గరే చెప్పాను. ఆయనకు కూడా అది బాగా నచ్చింది. మంచి పేరు అయితే బయటికి

చెప్పకండి అని నాకు ఆయన ఒక సలహా కూడా యిచ్చారు. కొన్ని రోజుల పాటు రహస్యంగా వుంచాలని తీర్మానించుకున్నప్పటికీ, మేమిద్దరం కూడా దానిని మరికొందరికి చెప్పకుండా వుండలేకపోయాము. విన్న వారందరూ పేరు బాగుందనే చెప్పారు. తర్వాత మాతృభూమి సంస్థ రిజిష్టర్ చెయ్యడానికి ఎక్కువకాలం పట్టలేదు.

అయిదు రూపాయలకి షేరుచొప్పున ఇరవై వేల షేర్స్‌కు, ఒక లక్ష పెట్టుబడి అనుకుని, 1922వ సం|| ఫిబ్రవరి పదిహేనవ తేదీన మాతృభూమి కంపెనీ రిజిష్టర్ చేశాము. మే నెలలో కంపెనీ పనులు ప్రారంభించాము. కె. మాధవన్ నాయర్, కారూర్ నీలకంఠన్ నంబూద్రిపాద్, అంబలకొట్టు కరుణాకర మీనన్, టి.వి. సుందర అయ్యర్, డా|| ఎ.ఆర్.మీనన్, బి. అచ్యుతన్, కె.టి. కేశవ మీనన్ మొదలైనవారు మాతృభూమి కంపెనీ రిజిష్టర్ చేసినప్పుడు దాని డైరెక్టర్లుగా వుండేవారు. డా|| ఎ.ఆర్. మీనన్ డైరెక్టర్ స్థాయినుంచి వైదొలగారు. మిగిలిన ఆరుమందీ తొలి డైరెక్టర్లు, మేనేజింగ్ డైరెక్టర్, కె. మాధవన్ నాయర్. లెక్కలు సక్రమంగా చూసుకోవడంలోనూ నిజంమీద, నిజాయితీ మీద నిలబడే మాధవన్ నాయర్ ఉత్సాహంతో కృషిచేస్తూ, దానికోసరమే జన్మించినట్లు కనిపించేవారు. అయితే మేనేజింగ్ డైరెక్టరు, మేనేజర్ ఒకరే వుండడం వీలుకాదు కాబట్టి ఆయన మేనేజర్ బాధ్యత స్వీకరించడం అవసరం కావడంవల్ల, నేను మేనేజింగ్ డైరెక్టరు బాధ్యత చేపట్టాను. నాకు నచ్చని పని అది. ఎందుకంటే నాకూ, లెక్కలకూ అంతగా పొత్తు కుదరదు. లెక్కలకు సంబంధించినంత వరకు మాధవన్ నాయర్ నాకు సహకరిస్తానని మాటయిచ్చిన తర్వాతే నేను ఆ బాధ్యతను చేపట్టడానికి సాహసించాను.

కంపెనీ 'రిజిష్టర్' చేయడమేమో జరిగింది కాని, షేర్స్ రాబట్టడం అంత సులభంగా లేదు. అందుకు ఎన్నో ఆటంకాలు ఎదురయ్యాయి. కాంగ్రెస్, సిద్ధాంతాలను, లక్ష్యాలను, ప్రజలకు వివరించి, స్వాతంత్ర్యోద్యమానికి ఆదరణ పెంపొందింప చేయడానికే మేము పత్రిక తీసుకురాదలిచాము. ఆ ఆశయం గురించి మా కంపెనీ నివేదికలో తెలియజేశాము. అటువంటి సంస్థలో భాగస్వాములు కావడానికి పలువురు వెనుకాడారు.

మా అభిప్రాయాన్ని ఆదరించేవారు సైతం తాము ఆ సంస్థలో షేర్స్ కొనుక్కుంటే బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకులమై పోతామని జంకారు. ఇటువంటి వాళ్లు మా దగ్గర ఏవేవో కుంటి సాకులు చెప్పి జారుకున్నారు. ఇదేమీ జరిగేది కాదు, ఎన్నో కంపెనీలు రిజిష్టర్ చేయబడి, షేర్స్ సేకరించిన తర్వాత కూడా మూసివేయడం మేము చూశాము. అదే విధంగా ఇది కూడ

అట్టేకాలం కొనసాగదు అన్నారు మరికొందరు. ప్రాక్టీసు వదిలేసి, మరే ఉద్యోగం లేకపోయేసరికి, షేర్స్ వసూలుచేయడానికి వచ్చారు. కంపెనీ ఎక్కడ రాబోతుంది? అని అనుకున్నప్పటికీ, మేము పనికట్టుకొని ఇళ్లకు వెళ్లడంతో అయిష్టంగానైనా ఒకటో రెండో వాటాలు కొందరు తీసుకున్నారు.

మేము వాటాలు సేకరించడానికి, చాలమందిని వెతుక్కుంటూ తిరిగిన రోజులలో ఎదుర్కొన్న యధార్థపరిస్థితులు యివి. అయినప్పటికీ మాతృభూమికి హృదయపూర్వకంగా సహాయం చేసిన మిత్రులు తక్కువమందికారు. మేము మలయాళ పత్రిక ప్రారంభించిన మూర్ఖత్వాన్ని పరిహాసంచేసిన మేధావులూ లేకపోలేదు. ఇలాంటి అమాయకత్వం ఎక్కడైనా వుంటుందా? అన్న భావ ప్రకటనతో ఇంగ్లీషు పత్రిక ప్రారంభిస్తున్నా మని చెప్పినా దానికి అర్థంవుంది. ఒక మలయాళ పత్రికకు కంపెనీ రిజిష్టర్ చేసుకుని ధనం సేకరించడానికి ఎవరైనా ప్రయత్నిస్తారా? అని విచారం వ్యక్తంచేసేవాళ్లు. మలయాళ పత్రిక ప్రారంభించడం గురించి ఒక కవి హాస్యంగా చెప్పిన వాక్యాలు నాకు జ్ఞాపకం వస్తున్నాయి.

'డబ్బులేని వాళ్లు, మరే పనిలేని వాళ్లు
పగసాధించేందుకు ప్రాకులాడేవాళ్లు
పనగల వాళ్లను పడిపొగిడేవాళ్లు
పరీక్షలురాసి, తప్పిపోయినవారు
కరువుకాలంలోని బిక్షగాళ్లందరూ భుజం, భుజం
కలిపి చేసే ఘనకార్యమేకదా.

చిన్న పత్రికలు ప్రారంభించడానికి ప్రయత్నించడం చాలామందికి ఇటువంటి అభిప్రాయమే ఉండేది. ఇది మంచి లాభాలు తెచ్చి పెట్టగల సంస్థ అని చెప్పి వాటాదారులను సేకరించడం మా చేత కాలేదు. ఇచ్చే డబ్బును ఏదో దానంగా తీసుకుంటున్నట్లే వాళ్లతో చెప్పాము. ఇందుకోసం, మద్రాసు బొంబాయి, మలబార్, కొచ్చిన్ మొదలైన ప్రాంతాలు తిరిగాము. మాధవన్ నాయర్, కారూర్ నీలకంఠన్ నంబూద్రిప్రసాద్, కె. మాధవన్ మీనన్, టి. ఆర్. కృష్ణస్వామి అయ్యర్, బి. రావుణ్ణి మీనన్ అచ్యుతన్ వక్కీలు, టి.పి. సాత్తుకుట్టి నాయర్ వాటాలు సేకరించే పనిలో ఉత్సాహంగా కృషి చేశారు. నేను కూడ పలుచోట్లకు వారితోపాటు వెళ్లాను. ఎక్కడికి వెళ్లినా మేము యిద్దరం ముగ్గురం కలిసి వెళ్లడం అలవాటు.

ఆ సమయంలో మాకెన్నో రసవత్తరమైన అనుభవాలు ఎదురయాయి. మాధవన్ నాయర్, నేనూ, ఒక మిత్రుణ్ణి కలుసుకోవడానికి వెళ్లాము. నాతోపాటు కలిసి చదువుకున్న మిత్రుడు, చాలా సన్నిహితుడు, మంచి

ఆస్తిపరుడూ కావడంతో కనీసం పదివాటాలైనా తీసుకోగలడని ఆశించాను. ఏరు, పొలం, కొండలు, కోనలు దాటుకుని మేము అతని ఇంటికి వెళ్లాము. ఒక మిత్రుని ఆహ్వానించే సంతోషం అతని ముఖంలో కనిపించలేదు. మా ఉద్దేశాన్ని మేము బయట పెట్టడంతో ఆయన మమ్మల్ని అట్టేసేపు ఎదురుచూసేలా చేయలేదు. మొదట నేను ఆయన పదివాటాలైనా తీసుకుగలడని ఆశించాను. అయితే అది అయిదు అయింది. చివరిగా కనీసం రెండు షేర్లయినా తీసుకోమని నచ్చజెప్పాను. ఉండనివ్వండి...! ఆ తర్వాత చూద్దాం అని ఆయన దాటవేశారు. మేము సెలవు తీసుకుని బయలుదేరాము. అదే ఆయనకు ఎంతో సంతోషాన్ని కలిగించి వుంటుంది.

మాధవన్ నాయర్ ముఖంలో నిరాశా నిస్పృహలు కదలాడాయి. అయినప్పటికి చిన్ననవ్వు తెచ్చుకుని ఇటువంటి మిత్రుల దగ్గరికి ఇంకా వెళ్లాలా? అని అడిగారు. నేను వెంటనే 'ఇటువంటి అనుభవాలు మనకింకా లభిస్తాయి' అన్నాను. ముప్పై సంవత్సరాల తర్వాత నేను మళ్లీ ఆ మిత్రుని చూశాను. 1955వ సం|| నా మిత్రుని కూతురు పెళ్లి సమయంలో నన్ను ఆయన చూశారు. చూసి చూడగానే మిమ్మల్ని చూసి ఎంత కాలమయింది? ఎన్ని రోజులుగా మిమ్మల్ని చూడాలని ఉబలాటపడుతున్నాను! మనం చివరగా కలుసుకున్నదెప్పుడు? అంటూ నన్ను సమీపించారు. నేనూ, మాధవన్ నాయర్ మాతృభూమి షేర్స్ చేర్పించడానికి వచ్చాం, జ్ఞాపకంవుందా? మనం చివరిగా కలుసుకొన్నదప్పుడే! అని అన్నాను.

అది వినగానే అతని మనసులో ఆ జ్ఞాపకంబాగా కదలాడివుండవచ్చు. కొంతసేపు ఏమీ మాట్లాడకుండా మౌనంగా వున్నారు. ఆయన ముఖంలో చిన్ననవ్వు తెచ్చుకున్నప్పటికీ, అది అతని మనోభావనను దాచలేకపోయింది.

మరో అనుభవంకూడా యిక్కడ చెప్పుకోవాలి, మంచి సంపన్నుడైన ఒక నాయర్ కుటుంబ పెద్ద ఆయన జాతీయ ఉద్యమానికి ఆదరణ చూపే యువకుడు, ఆయన నాకు బాగా పరిచయమే అయినప్పటికీ, నాతోపాటు టి. ఆర్. కృష్ణస్వామి అయ్యర్ కూడా వచ్చారు. మేము ఒక గంటకు పైగా క్రింద ఎదురుచూస్తూ వున్నాము. ఆయన మేడమీద వున్నారు. ఎంతసేపు ఇలా కూర్చోడం అని లోపలికెళ్లి కార్యదర్శిని చూశాము. అయ్యగారిని చూడడానికి వచ్చినట్లు మేము తెలియజేశాము. వాడు పైకెళ్లి కొద్ది నిముషాలలో తిరిగి వచ్చాడు. ఆయన స్నానం చేయడానికి బయలు దేరారు. మళ్లీ గుడికి వెళితే తిరిగి రావడానికి చాలాసేపు అవుతుంది. అందువల్ల మరో రోజు రమ్మని చెప్పారు అని తెలియజేశాడు. మేము ఏమీ చెప్పకుండా వెనుతిరిగాము. రెండు రోజులు గడిచిన తర్వాత, స్నానం చేసి, భోజనం చేసి, నిద్ర పోయిలేచి విశ్రాంతి

తీసుకుంటున్నప్పుడు వెళ్లడం మంచిది అనుకుని, సాయంకాలం నాలుగు గంటల ప్రాంతంలో అక్కడికి వెళ్లాము. అప్పుడు కూడా అరగంటసేపు కాచుకుని వున్నాము. తర్వాత అయ్యగారు దిగి వచ్చారు. మేము వచ్చిన విషయం చెప్పాము.

'ఈ సంవత్సరం బడ్జెట్ అంతా అయిపోయింది. వచ్చే సంవత్సరం చూద్దాం' అన్నారు. అంత పెద్ద మొత్తం మేము అడగలేదు. పది పదిహేను వాటాలు తీసుకుంటే చాలు అన్నాను. లేదు బడ్జెట్ పరిమితిని మించి నేను ఖర్చు చేయను అని ఆయన చెప్పేశారు. తర్వాత సంవత్సరం బడ్జెట్ పథకంలోనూ మాతృభూమి కోసరం ధనం మిగిలినట్లు తెలియలేదు. ఎందుకంటే రెండు సంవత్సరాల తర్వాత మాతృభూమి కొంత పేరు తెచ్చుకుంటున్న సమయంలో అనుకోకుండా ఆయన్ను కలిశాను, పత్రిక బాగా నడుస్తోంది కదా? నేను విడవకుండా చదువుతాను అని ఆయన చెప్పడానికి వెనుకాడలేదు. వాటాలు తీసుకోలేదు కానీ పత్రిక చదువుతున్నారు కదా అని నన్ను నేను సముదాయించుకున్నాను.

కొందరు మాట్లాడే పద్ధతి చూడగానే వీళ్ల దగ్గరికి వాటాలు అడగడానికి ఎందుకొచ్చాం అనే వెగటు, నిరాశ, బలహీనం అన్నీ మనసుకు వేధించేవి. అంతకు ముందు నాకు షేర్లు సేకరించడానికి వెళ్లిన అనుభవంలేదు ఆ తర్వాత కలగలేదు.

డబ్బు కొంత సేకరించగానే మేమొక అచ్చు యంత్రం కొనడానికి తీర్మానించాం. కుప్పత్తు కేశవమీనన్, ఆ రోజులలో ఎంబర్స్ విక్టోరియా ప్రెస్ అన్న పేరుతో ఒక ప్రెస్‌ను నడిపేవారు. స్థలం, అచ్చుయంత్రం, రెండూ ఆయనకే సొంతం. దానిని మేము పదిహేను వేలకు కొన్నాము. పూర్తి మొత్తం యివ్వడానికి అప్పుడు మా దగ్గర డబ్బుల్లేవు. కొంత చెల్లించి మిగతా మొత్తం అప్పుగా పెట్టాము. ఆ రోజులలో ఆ చిన్న ఇంట్లో ప్రారంభమై అభివృద్ధి చెందినదే ఈనాటి మాతృభూమి భవనం. ఇవాళ ప్రెస్, ఇతర విభాగాలు అభివృద్ధి చెందివున్నప్పటికీ, పాత అచ్చు యంత్రం వున్న ప్రాంతంలోనే ఈనాటి భవనం కూడా వుందన్న విషయం చెప్పుకోదగ్గ విషయం.

చేతిలోని డబ్బుతో అచ్చు యంత్రం కొనేశాము. పత్రిక తీసుకురావాలంటే యింకా డబ్బుకావాలి. దానిని కూడా సేకరించకుండా పత్రిక ప్రారంభించడం సాహస కార్యం అని మాలో కొందరు భావించాము. పత్రిక ప్రారంభించలేదంటే డబ్బు సేకరించడం కఠినమైపోతుంది. అందువల్ల ఎలాగైనాసరే త్వరగా పత్రికను తీసుకురావాలని కొందరు అభిప్రాయపడ్డారు. చివరగా ఏర్పాటు చేసిన సమావేశం గురించి జ్ఞాపకమొస్తోంది. తీవ్రమైన వివాదాలు కొనసాగాయి.

ఏ పనిలో దిగినా అస్థిరమైన పరిస్థితిని అధిగమించక తప్పదు. దానికి సిద్ధంగా లేకుంటే ఏ పని చేయ్యడానికి వీలుకాదు. వాటాదారుల్ని చేర్చడానికి ఇంకా ప్రయత్నిస్తూనే వుందాము. అయినప్పటికీ పత్రిక విషయం జాప్యం చేయడానికి లేదు. దానిని తీసుకురావలసిందే అని చివరికి తీర్మానించాము. సంపాదకుని బాధ్యతలు నేను తీసుకున్నాను. 1923వ సం॥ మార్చి పదిహేడో తేదీ శనివారం పత్రికను తీసుకురావడానికి తీర్మానించాము. ఆ తారీఖు నిర్ణయించడానికి కారణం వుంది. 1922వ సం॥ మార్చి పద్దెనిమిదో తేదీ, మహాత్మాగాంధీకి ఆరు సంవత్సరాలు పాటు కారాగారవాసం విధించారు. సహాయ నిరాకరణోద్యమనాయకులైన ఆయన, శిక్ష పొంది ఒక సంవత్సర కాలం ముగిసేరోజున మాతృభూమిని ప్రారంభించడం ఉచితమని భావించాను. పద్దెనిమిదో తేదీ ఆదివారం, అందువల్ల పదిహేడో తేదీ శనివారమే పత్రికను తీసుకురావాలని తీర్మానించాము. మొట్టమొదటి మాతృభూమి వారంలో మూడు రోజులపాటు వెలువడే పత్రికగానే ప్రారంభమయింది. మంగళ - గురు - శనివారాలలో పత్రిక విడుదలవుతుంది.

కొన్ని రోజులు రాత్రింబవళ్లు మేము కష్టపడవలసివచ్చింది. పత్రిక ఆశయం స్వభావం గురించి వివరించి, ప్రతినిధులను నియమించడానికి, కాగితం సంపాదించడానికి, రచయితలను నిర్ణయించడానికి మేము ఆలోచించాము. పత్రికతో ప్రత్యక్ష సంబంధం లేని మిత్రులు, చాలా మంది, స్వయంగా కార్యాలయానికి వచ్చి, మాకు సహాయం చేశారు.

మొదట పత్రిక ఊహల్లో తయారయింది. మాధవన్ నాయర్, మరికొందరు, అనేకసార్లు దీనిని గురించి ఆలోచించాము. నేను మొట్టమొదట రాసిన అధ్యక్షోపన్యాసం, సంపాదకీయం, వారిని చదువమని చెప్పి చేర్పులు, మార్పులు, తగ్గింపులు చేసి దానిని సరిచేశాను. కంపోజ్ చేసే వాళ్లకు నా రాత అర్థమయ్యేట్లు లేదు. అందులో ఆరితేరడానికి వారికి కొంత కాలం పట్టింది.

పి. రావుణ్ణి మీనన్, కె. మాధవమీనన్, కె.బి. కుంజుణ్ణిమీనన్, డి.బి.సి. కిడావ్, మొదలైనవారు అప్పట్లో, సంపాదకశాఖలో సహాయకులుగా వుండేవారు. నవీన కేరళను వదిలేసి, కుంజుణ్ణిమీనన్ మాతృభూమికి వచ్చారు. డి.బి.సి. కిడావ్ నాటినుంచి 1964వ సం॥ వరకు పనిచేశారు. కాగితం మడత పెట్టడానికి మాతృభూమి కార్యాలయానికి వచ్చిన ఒక యువకుడు, నారాయణన్, చాలాకాలం మాతృభూమికి సేవచేశాడు. అతనిప్పుడు కాలధర్మం చెందాడు.

మార్చి పదహారవతేదీ, ఉదయమే కార్యాలయానికి వెళ్లాము. మాధవన్ నాయర్‌కూ, నాకు పక్కపక్క గదులు. కంపోజింగ్ చేసే వాళ్లను చూసుకోవడం.

పైకెళ్లడం క్రిందికి రావడం అంతా ఉత్సాహంగా పనిచేశాము. ఒక పెద్ద విందు భోజనం ఏర్పాటు చేస్తున్నట్టు అచ్యుతన్ వకీల్ హడావుడి చేసేవారు. ఏమీ సిద్ధం కాలేదా? అంటూ చేతిలో ఒక బెత్తం పట్టుకుని ప్రెస్‌లో అటూఇటూ తిరిగేవారు. కార్మికులు సహాయకులు చూడడానికి వచ్చినవారు, ఇలా మాతృభూమి కార్యాలయంలో జనం నిండి పోయేవారు. సాయంత్రం భోజనం చేసి మళ్లీ కార్యాలయానికి వచ్చాము. 'గాలీప్రూఫ్' 'పేజ్ ప్రూఫ్' అంతా పూర్తయింది. 'ఫారం' అచ్చు యంత్రంలో ఎక్కించడానికి సిద్ధంచేశారు. ఫోర్‌మన్ సందుక్కుట్టి. అప్పుడే అచ్చు యంత్రంలో ఏదో యిబ్బంది. దానిని సరిచేయడానికి ఫోర్‌మాన్ సందుక్కుట్టికి, మెషిన్‌మేన్ సాత్తుక్కుట్టికి, సహాయకునికి మరి కొంతసేపు పట్టింది.

గోడగడియారాన్ని చూసుకుంటూ నేను అటూ ఇటూ నడుస్తున్నాను. వేకువజాము నాలుగు గంటలయింది. అంతా సిద్ధం అయిందని, సాత్తుక్కుట్టు యంత్రం నడుపసాగాడు. మేము దానిని కొంతసేపు అలాగే చూస్తూ నిలబడ్డాము. పేజీలు కలిపి, పత్రిక మడత పెట్టి తొలి ప్రతిని సాత్తుకుట్టి నాయర్ నా చేతికిచ్చాడు. దానిని నేను తెరచి చూశాను. మాధవన్ నాయర్ మరికొందరు నా దగ్గర వున్నారు. 'మాతృభూమి' జన్మించింది. ఆ మాతృభూమిని చేత బట్టుకుని నేను యింటికి వచ్చాను. కిడావ్ కూడా నాతోపాటు వచ్చాడు. తెల్లవారుతూ వుంది. కొన్ని కొట్లు తెరచివున్నాయి. తెల్లవారుజామున బండి కోసం బయలుదేరిన వాళ్లు. అది తప్పి పోతుందో ఏమోనని వేగంగా నడుస్తున్నారు. సరుకులు ఎక్కించుకుని వస్తూన్న బళ్లు ఒకటివెనక ఒకటిగా వరుసగా వస్తున్నాయి. వాటిని లాగే ఎద్లు నడిపే మనుషులు క్రుంగి కృశించి నడుస్తున్నారు. 'మాతృభూమి' విడుదల అయిన సంగతి వీళ్లకు తెలిసి వుంటుందా? అని నాకు అప్పుడు అనిపించింది.

ఇంటికి చేరగానే అందరినీ లేపి మాతృభూమిని వారికి చూపించాను. పుట్టిన బిడ్డను చూసినట్లు చూసిన ఆనందించారు. మొదటి రోజు రాత్రి పగలు పనిచేయడంతో నేను ఎంతో అలిసిపోయాను. తెల్లవారుతున్నప్పటికీ పడుకున్నాను, పడుకున్నవెంటనే అన్నీ మరిచి నిద్రపోయాను.

# ప్రాతికేయునిగా శిక్షణ

మర్నాడు ఉదయం కాఫీ తీసుకుని మాతృభూమిని తెరచి అందులోని విషయాలను మరోసారి పరిశీలించాను. సంపాదకీయాన్ని మరోసారి చదివాను. "దేశ సంక్షేమమే లక్ష్యంగా, సత్యాన్ని ధ్యేయంగా, ఏ ప్రత్యేక వర్గాన్ని గాని, మతానికి గాని, అనుబంధంగా కాకుండ కృషిచేయడానికే మేము ప్రయత్నిస్తున్నామన్న సంగతి మనసులో వుంచుకుని ప్రాథమిక హక్కులకు సంబంధించినంతవరకూ ప్రజలందరూ సమానమే అన్న విశ్వాసంతో, స్వతంత్ర వికాసానికి, జంకు లేకుండా పోరాడడానికి ఎప్పుడూ వెనుకాడము" అని వ్రాసిన భాగాన్ని చూసినప్పుడు అది కేరళ ప్రజల సమక్షంలో తీసుకున్న ప్రతిజ్ఞగా అనిపించింది. ఎలాగైనాసరే దానిని నెరవేర్చే ప్రయత్నంలో 'మాతృభూమి' అధైర్యమో, వెనుగో చెందలేదన్న విషయం 'మాతృభూమి' సుదీర్ఘ చరిత్ర తేటతెల్లం చేస్తోంది.

మంచి లక్ష్యాలను, తమ ధ్యేయంగా ప్రకటించడం కఠినం కాదు. అయితే వాటిని కార్యరూపంలో నెరవేర్చి చూపడం అన్నది అంత సులభమైన విషయం మాత్రం కాదు. ఇది నా అనుభవం. ఎవరిమీద గాని విహ్వం, భేదం, చూపని 'మాతృభూమి' విమర్శలు, జంకులేనివిగా, పక్షపాతంలేనివిగా వుండాలన్న లక్ష్యం కలవాణ్ణి నేను. జనసామాన్యానికి తెలియజేయవలసిన సంగతులను, రంగు, నాణ్యత తగ్గకుండా, మారకుండా, వారికి అందజేయాలన్న లక్ష్యం కలవాణ్ణి నేను. ఆ తొలి సంచిక రావడానికి ముందు ప్రజలు 'మాతృభూమి' రాకకు అమితోత్సాహంతో ఎదురు చూస్తున్నట్లు ఒక మిత్రుడు చెప్పడం నేను అనేకసార్లు జ్ఞాపకం చేసుకున్నాను.

విమర్శనావిధానం గురించి ఆలోచిస్తున్నప్పుడు, మహాత్మాగాంధి 'యంగ్ ఇండియా' మాకు ఒక ఆదర్శమైన ఉదాహరణగా వుండేది. 'మాతృభూమి' దాని అడుగు జాడల్లోనే పయనించింది. సంఘటనలను 'రిపోర్ట్' చేసేప్పుడు, ఎటువైపు మొగ్గు చూపకుండా, లక్ష్యమే గురిగా, విషయాన్ని గ్రహించి నడచుకోవాలని ప్రతినిధులకు నొక్కిచెప్పాను.

మేమందరమూ పత్రికా రంగంలో అనుభవం లేనివాళ్లమే. కుంజుణ్ణి మీనన్ 'మాతృభూమి' చేరడానికి ముందు కేరళ పత్రికలోను, స్వరాట్‌లోనూ, నవీన

కేరళలోనూ పనిచేసినప్పటికీ ఒక కొత్త పత్రికను ప్రారంభించేప్పుడు, సమీకరించడానికి అవసరమైన అనుభవం ఆయనకు లేదు. టి.పి.సి.కిడావ్ చదువు ఆపేసి పత్రికా రంగంలో కృషిచేయడానికి వచ్చిన యువకుడు. పత్రికా వృత్తిలో కోళిపురం మాధవమీనన్‌కు, మాకన్నా ఎక్కువ అనుభవం వున్నట్టు చెప్పడానికి లేదు. రావుణ్ణి మీనన్‌కు ఆంగ్లం, చేయి తిరిగిన భాషే కాని మలయాళంలో ఆయన ఒక వ్యాసాన్నీ కూడ ఏ పత్రికలోనూ ప్రచురించినది లేదు. అయినప్పటికి అతి త్వరలోనే మలయాళంలో అందమైన వచనా శైలిని ఆయన సృష్టించారు. సహాయ సంపాదకుడు రావుణ్ణి మీనన్‌గారే.

మేమందరం కూడ పత్రిక నడపడంలో పరిపక్వత, అనుభవం లేని యువకులమే. అయితే 'మాతృభూమి'ని మరింతగా అభివృద్ధి పరచాలన్న ఉత్సాహం మాలో వుండేది. అందువల్ల కాలాన్ని గాని సౌకర్యాలనుగాని, పట్టించుకోకుండా ఎంత వరకైనా సరే పనిచేయడానికి మేము సిద్ధపడ్డాము. ప్రారంభకాలంలో ఇలాంటి శ్రమ అవసరమయింది.

రాత్రి చాలాసేపు పనిచేయడం వల్ల, అసౌకర్యాలు, ఖర్చులు అధికమవుతున్నాయని మేనేజరు చాలాసార్లు నెచ్చుకున్నారు. అయినప్పటికి దగ్గర వుంచుకుని కాలం గడవడం తెలియకుండా తలవంచుకుని వ్రాసుకునే రావుణ్ణి మీనన్ అదంతా పట్టించుకునేవారు కారు. సాధారణంగా రాత్రి పదింటివరకు ఆయన పనిచేసేవారు. ఒక్కొక్కసారి రాత్రి రెండు గంటలవరకు కూడా పనిచేసేవారు.

'మాతృభూమి' దోషాలు, ఆ పత్రికను మాత్రమేకాదు, అందులో పనిచేసే వారినందరినీ పీడించాయి. రోజువచ్చే ఆదాయం - కాగితం, తపాలా బిళ్లలు, కొనడానికి ప్రెస్‌కు కావలసిన వాటికి మాత్రమే సరిపోయేవి. వాటి ఖర్చులు, పోను ఏదైనాకొంత మిగిలితేనే మా దైనందిన ఖర్చులకు లభించేది. ఎన్నో రోజులు ఒట్టి చేతులతో యింటి గడప తొక్కడంతో కుటుంబ బాధ్యతలను నిర్వహించే వారికి ఏమిచెప్పాలో తోచలేదు. రెండు మూడు రోజులయితే ఏదో విధంగా ఓర్చుకోవచ్చు. అదే ప్రతిరోజు కొనసాగినట్లుయితే, మితిమీరిన తెగింపు, ధైర్యం కూడా నిరాశగా మారిపోవచ్చు. కార్యాలయంలో పనిచేస్తున్నప్పుడు తరుచూ యింటి వంటగది జ్ఞాపకం వస్తూవుంటుంది. కలం పట్టుకుని అలాగే కూర్చునేవాణ్ణి. ఒక మంచి ప్రయత్నాన్ని ప్రారంభించాననే, ప్రారంభంలో యిలాంటి యిక్కట్లు సహజమేనని నా మనసుకు ధైర్యం చెప్పుకునేవాణ్ణి. అయినప్పటికీ ఒక్కోసారి కష్టం వచ్చేప్పుడు, మనస్సు తాత్త్వికమైన అభిప్రాయాలను అంగీకరించదు. ముఖంలో చిరునవ్వు, మనసులో ఆవేదనగా గడిచిన రోజులు అవి. అయినప్పటికీ మా 'వ్యక్తిగత జీవిత

అనుభవాలు పత్రికాభివృద్ధికి ఆటంకంగా లేవు. ఒక్కొక్క సంచికా నిర్ణీతకాలంలో విడుదల అయ్యేది. ఒక దానిని మించి మరొకటి వుండే విధంగా తీర్చిదిద్దడానికి ఆలోచించేవాళ్లం.

వార్తలు అందించడం మాత్రమే కాకుండ పాఠకుల జ్ఞానం వికసించాలన్న అభిప్రాయంతో 'మాతృభూమి' కోసం కృషిచేయాలని మేము నిశ్చయించాము. వాటికి దోహదం చేసే విధంగా వ్యాసాలు, ప్రచురించాము. ఇంకా 'ప్రపంచము-ప్రజలు' వారు-అవి 'ఆక్షేపణలు- అభిప్రాయాలు' మొదలైన శీర్షికలు ప్రారంభించి నూతనత్వం చూపాము. పాఠకులు వాటిని ఎంతో మెచ్చుకున్నారు. 'సత్యం, సమత్వం, స్వాతంత్ర్యం' అన్న మాటలు సంపాదకీయం పై భాగంలో వుండేవి. ఆ మాటలు 'మాతృభూమి' లక్ష్యాలని యితరులకు చూపడమే కాకుండా, కార్యరంగంలో చూపడానికి చేసే ప్రయత్నంలో 'మాతృభూమి' అధికార వర్గంతోనూ, వారి మద్ధతు దార్లతోనూ ఘర్షణ పడవలసి వచ్చింది. 'మాతృభూమి' చరిత్రలో అలాంటి సందర్భాలు ఎన్నో తలెత్తాయి. అలాంటప్పుడల్లా ద్రవ్య నష్టాన్ని గాని, యితర యిబ్బందులను గాని ఎదుర్కోడానికి సిద్ధంగా లక్ష్యం నుంచి జారుకోకుండా దృఢంగా నిలబడ్డాము. ఈ సత్యాలను ఉప్పొంగే మనసుతో ఇవాళ జ్ఞాపకం చేసుకుంటున్నాను.

ఒక గౌరవనీయుడైన వ్యక్తి నోరు తెరచి చెప్పలేని మాటలు ఒక గౌరవనీయమైన పత్రికలోను, ప్రచురింపలేనివే' అని సుప్రసిద్ధులై ఒక పత్రికా సంపాదకులు, చెప్పిన మాట నేను జ్ఞాపకం తెచ్చుకుంటాను. ద్వేషం, విరోధం లేకుండా, ఎటువైపు పక్షపాతం చూపకుండా జంకు లేకుండా వ్రాసే విమర్శలు ఒక పత్రిక గౌరవాన్ని విలువను మరింత పెంచుతుంది అన్న విషయాన్ని అనుభవపూర్వకంగా తెలుసుకోడానికి మాకు ఎంతో కాలం పట్టలేదు.

'మాతృభూమి' ప్రారంభించి ఒక సంవత్సరం పూర్తి కావడానికి ముందు జరిగిన ఒక సంఘటన ఇది!

ఆనాటి 'కౌన్సిల్ ఆఫ్ స్టేట్'లో కవళప్పార మూప్పిల్ నాయర్ ఒక సభ్యుడు. ఆయన రెండవసారిగా కౌన్సిల్ ఎన్నికలలో పోటీ చేసినప్పుడు, మరొక అభ్యర్థి ముల్లసేరి గోపాలమీనన్, కవళప్పార నాయర్‌కు ఓటు చేయవద్దనడానికి తగ్గ కారణాలు చూపి ఒక ప్రకటనను ప్రచురణకోసరం మాకు పంపారు.. మేము దానిని ప్రచురించాము. 'కౌన్సిల్ ఆఫ్‌స్టేట్'లో ఉప్పు పన్ను గురించిన విషయం-వివాదం ముగిసిన తర్వాత, ఓటింగ్‌కు పెట్టినప్పుడు కవళప్పార నాయర్ అక్కడ వుండలేదని, అది ఆయన దేశప్రజలకు చేసిన అపకారమనీ, ప్రజోపకార విషయాలలో వాళ్లకు మద్దతుగా ఓటు చేయవలసిన

సమయంలో సభలో లేకుండా జారుకున్నందువల్ల, ఆయన ప్రజల విశ్వాసానికి పాత్రుడు కాదనీ, ఆ ప్రకటన తెలియజేసింది.

'మాతృభూమి'లో వెలువడిన ఆ వ్యాసానికి కవళప్పార మూప్పిల్‌నాయర్ ఈ విధంగా సమాధానం రాశారు: 'తమరు ప్రచురించిన ఉత్తరంలో నేను ఉప్పు పన్ను విషయంలో ప్రభుత్వంవారికి అనుకూలంగా ఓటు వేసినట్టు తెలియజేసే విధంగా, అబద్ధంగానూ, ప్రజలకు తప్పుడు అభిప్రాయాన్ని ఏర్పరచే విధంగానూ, కొన్ని సంగతులు యిమిడివున్నాయి. కొందరు ఓటర్లు దానిని తప్పుగా భావించి, నాకు వ్యతిరేకంగా ఓటు చేసే అవకాశం వుంది, కాబట్టి దీన్ని నేను ముఖ్యమైనదిగా భావిస్తున్నాను. అందువల్ల ఈ ఉత్తరం చూసిన ఒకవారంలోగా పైన కనబరచిన సంగతులకు తగిన ఆధారం వుందని తెలియజెయ్యాలి లేదా తమరు ప్రచురించిన ప్రకటన వాపస్ తీసుకుని, నా మంచి పేరుకు కలిగించిన కళంకానికి క్షమాపణలు కోరాలి. అలాచేయకపోతే ఆ ఉత్తరం ప్రచురించినందుకు మీ మీద నేను తగ్గ చర్య తీసుకుంటాను. దీనికి తగిన జవాబును నా వకీలుకు పంపితే చాలు.'

ఇదే ఉత్తరాన్ని, ఆ వ్యాసాన్ని ప్రచురించిన మరో రెండు పత్రికలకు కూడా ఆయన పంపారు. అవి రెండూ క్షమాపణలు చెప్పుకుంటూ ప్రకటనలను ప్రచురించాయి 'మాతృభూమి' అందుకు సిద్ధంగా లేదు.

పత్రిక తీసుకున్న చర్య సరైనదా? కాదా అన్న విషయంలో నాకు ఎలాంటి అనుమానమూ లేదు. కేసుకు భయపడి 'మాతృభూమి' గౌరవానికి, ఆత్మసాక్షికి, విరుద్ధంగా ప్రచురించిన వార్తలను వాపసు తీసుకోవడానికో, క్షమాపణలు చెప్పుకోవడానికో, 'మాతృభూమి' సిద్ధంగాలేదు. ఈ సంగతిని నాయర్ వకీలుకు రాశాను. ఆ ఉత్తరం "కవళప్పారనాయర్ గారు ఉప్పు పన్ను-'మాతృభూమి' అన్న శీర్షిక కింద 'మాతృభూమి'లో వెలువడింది" అది ఇదే.

"1923వ సం॥ అక్టోబర్ తొమ్మిదో తారీఖున 'మాతృభూమి' పత్రికలో ప్రచురించబడ్డ ఒక ఉత్తరం, తమ పార్టీదారు లెఫ్టినెంట్ కవళప్పార మూప్పిల్ నాయర్ ఈ నెల ఇరవై నాలుగో తేది పంపిన ఉత్తరం అందింది. ఉప్పు పన్నుకు సంబంధించిన వివాదం జరిగిన తర్వాత, వోటింగ్ జరిగినప్పుడల్లా ప్రజాప్రతినిధి అన్న స్థాయిలో ఓటు చేసినట్టు మూప్పిల్ నాయర్ పేరు కనిపించడం లేదు. ఉప్పు పన్ను కారణంగా, వైస్రాయి సర్టిఫికేట్ అధికారం గురించి వివాదంలో ప్రభుత్వ పక్షంగా ఓటుచేసిన వారి జాబితాలో అతని పేరు వుండడంవల్ల, మామూలుగా ప్రజలెవరైనా సరే తెలుసుకోగల సాధారణ సత్యాన్నే ఆ ఉత్తరం తెలియజేస్తున్నది. ప్రజా ప్రతినిధి అయిన ఒక

సభ్యుడు యిలాంటి ముఖ్యమైన సందర్భాలల్లో, ప్రజల పట్ల తనకున్న బాధ్యతను ఏ విధంగా నెరవేరుస్తున్నారన్న వివరాన్ని, రెండవసారిగా ఆయన ఎన్నికలకు పోటీ చేస్తున్నప్పుడు ప్రజలకు తెలియజెయ్యడం అవసరమన్న పత్రికాధర్మాన్ని అనుసరించి, ఆ ఉత్తరాన్ని ప్రచురించాము. సత్యదూరమైన సంగతులు ఏవీ అందులో వున్నట్టు మాకు అనిపించడంలేదు. గోపాల్ మీనన్ ఉత్తరానికి, మూప్పిల్ నాయర్ ఏదైనా సమాధానంగా రాయదలిస్తే, తప్పకుండా మా 'పాఠకుల లేఖలు' శీర్షికలో దానికి చోటువుంటుంది. అంతేకాని మేము ప్రచురించిన ఉత్తరాన్ని వాపసు తీసుకోవడానికో, చెయ్యని నేరానికి క్షమాపణలు చెప్పుకోడానికో 'మాతృభూమి' అంగీకరించదు.

ఆ తర్వాత కవళప్పార నాయర్‌గారి దగ్గరనుంచి గాని, వకీలునుంచిగాని ఎలాంటి ఉత్తరమురాలేదు. కేసుపెట్టనూ లేదు. దీనిని చూసిన తర్వాత మిగతా రెండు పత్రికలవాళ్ళు కూడా తాము క్షమాపణలు చెప్పు కోకుండా వుండివుంటే సరిపోయేదే అనిపించింది. ఈ సంఘటన 'మాతృభూమి' గౌరవాన్ని మరింత పెంచింది. దాని నిజాయితీని ప్రశంసిస్తూ చాలా మంది ప్రముఖులు ఉత్తరాలు రాశారు. కొందరు నేరుగానే వచ్చి అభినందించారు. ఒకరిని కించపరచడం మరొకరిని పొగడడం, ఒక జాతి వారిని ద్వేషంచడం, మరో జాతివారిని పొగడడం, 'మాతృభూమి' పద్ధతికి విరుద్ధమైనదన్న విశ్వాసం, గౌరవం, ప్రజలకు క్రమంగా దృఢంగా ఏర్పడింది. దాన్ని 'మాతృభూమి' యింకా నిలబెట్టుకుంటున్నది.

పాత్రికేయులను యిబ్బందుల పాలుచేసే చాలా విషయాలలో రెండింటిని గురించి యిక్కడ చెప్పాలనుకుంటాను. పేరు ప్రతిష్ఠలకు ఆశించి, అందుకోసరం పత్రికలలో చోటు సంపాయించడానికి తంటాలు పడే రచయితల యిబ్బందులు ఒకటి; మరొకటి నిజంగానే జరిగిన సంఘటనలలో కొన్నింటిలో రహస్యంగా సంబంధం వున్నవాళ్ళు, దాన్ని బయట పెట్టవద్దని కోరే కోరికలు. ఈ రెండు రకాల వాళ్లతో ఎవరు ఎక్కువగా వచ్చి యిబ్బందులు పెడతారని చెప్పడం కష్టం. పాత్రికేయుని ఓర్పును యిద్దరూ పరిశోధించే వాళ్లే, ఒకటి రెండు అనుభవాలను యిక్కడ చూడవచ్చు.

ఒకనాడు మధ్యాహ్నం, కొన్ని రసీదులను పుస్తకాలను చేతిలో పెట్టుకుని ఒకాయన నన్ను చూడడానికి కార్యాలయానికి వచ్చారు. రసీదులను, మేజాపై వుంచారు. లెక్కలపుస్తకం తెరచివుంచారు, విషయం యిదే. ఒక మంత్రి అతని చోటికి విజయం చేశారు. ఆయనే ఖర్చుపెట్టి స్వాగతం చెప్పడానికి ఒక పెద్ద మాలకొని పందిళ్ళను అలంకరించి అంతా అట్టహాసంగా చేశారు. అక్కడవున్న నాయకులు కొందరు దాన్ని ఆశించినందువల్లే ఆయన అలా చేశారు.

మంత్రిగారి ఆగమనం పత్రికలో వార్తగా వచ్చింది. అయితే స్వాగతం జరిపిన వారి విషయంలో అతని పేరులేదు. ఇదే నేరం. ఖర్చు పెట్టింది ఆయనే అని నిరూపించడానికి ఆయన రసీదు, లెక్కల పుస్తకాలు తెచ్చి చూపారు. ద్వేషం, నిరాశ, తాండవమాడుతున్న ఆయన ముఖం చూసి నేను జాలిబడ్డాను. 'నన్ను గురించి ఏదైనా పత్రికలో రావాలి. నా పేరు పత్రికలో వస్తుందని యిన్ని ఖర్చులు భరించాను' అని ఆయన ఎంతో అణుకువగా చెప్పినప్పుడు, నేను ఆ విషయం గురించి ఆ శాఖను చూసే వారికి చేబుతానని ఓదార్చి పంపివేశాను. డబ్బు ఖర్చు చేసింది ఆ అమాయక వ్యక్తి అన్న సంగతి 'మాతృభూమి' విలేఖరికి తెలియలేదు. తెలిసివున్నా దాన్ని రాయడానికి లేదు. డబ్బు ఖర్చుతనకూ, పేరుప్రఖ్యాతులు మరొక్కరికి అంటే ఆ అదృష్టంలేని మనిషికి నిరాశ ఏర్పడడంలో ఆశ్చర్యంలేదు.

ఇంకొకటి యిది. ఒక సందర్భంలో ఉత్తర భారత దేశంలో ఒక దేవాలయంలోకి వినోభాజీ హరిజనులతోపాటు ప్రవేశించడానికి ప్రయత్నించినప్పుడు, కొందరు ఆయనను అవమానించారన్న విషయం పత్రికలలో వచ్చిన సంగతి పాఠకులకు గుర్తు వుండేవుంటుంది. ఆ సంఘటన జరిగిన కొన్నాళ్ల తర్వాత నాకొక ఉత్తరం వచ్చింది. వినోభాజీకి కష్టం ఏర్పడిందని తెలిసినప్పటినుంచీ, తాను ఆహారం తీసుకోవడంలేదని, ఆ సంఘటన తనకు చెప్పలేని విషాదాన్ని కల్గించిందనీ ఈ సంగతి పత్రికలో ప్రచురించామని రాశారాయన. దానితోపాటు ప్రచురించడానికి తన ఛాయాచిత్రాన్ని ఒకటి జత చేశారు; చాలా రోజులు ఎదురుచూసి, ఆయన ఉత్తరము, ఛాయాచిత్రమూ రాకపోయే సరికి ఆయనకు కలిగిన ఆశాభంగాన్ని నేను ఊహించగలను; పత్రికనూ, సంపాదకునీ, ఆయన బాగా శపించి వుంటాడు.

పేరు ప్రతిష్ఠలకు మనుషులందరూ ఒకే విధంగా ఆశపడతారన్నది నిజమే అయినప్పటికీ, కొందరు దాన్ని గుప్తంగా వుంచుకోలేరు. నాకు పేరు ప్రతిష్ఠలు ఇష్టం లేదని చెప్పేవాళ్లు కూడా దాన్ని పత్రికలో ప్రచురించమని చెబుతారు. మనిషిని కార్యచరణకు ఆకర్షించి పురికొల్పి పెద్ద ఉత్సాహం కలిగించేది కీర్తి. పాత్రికేయులు దానిని గ్రహించడం మంచిది. ఇతరుల ఈ న్యాయమైన ఆశను పూరించవలసిన వివేకం వారికి వుండాలి. అయితే అదే సమయంలో మనుషుల గర్వాన్ని 'తామే గొప్ప' అనే అహంభావాన్ని పాత్రికేయులు పెంచవలసింది లేదు.

తమను గురించి కొన్ని విషయాలను పత్రికలలో చూడాలని ఆశించే వాళ్లే, మరికొన్ని చర్యలను రహస్యంగా ఉంచడానికి ఎంతగానో ప్రాకులాడుతారు.

తాము ఆచరించే పత్రికా ధర్మానికీ, ఇతరులకు సహాయం చేయాలన్న అభిప్రాయానికి మధ్య ఏర్పడే సంఘర్షణను అనుభవించే సందర్భాలు పాత్రికేయులకు రావడం కద్దు. అటువంటి పలు సందర్భాలలో ఒకటి గుర్తుకు వస్తోంది.

ముఖ్యమైన ఒక వార్తను నాకు తెలియజేయడంకోసరం నా మిత్రుడు మరోకర్ని నా వద్దకు పంపారు. మిత్రుడు గౌరవనీయమైన వారు పెద్ద పదవిలో వున్నవారు. ఆయన ఒక కుమారుణ్ణి ఒక కేసు విషయంగా పోలీసువాళ్లు ఖైదు చేసి మేజిస్ట్రేట్ ముందు నిలిపి, ఆ తర్వాత జామీనుపై వదిలారు. ఈ సంగతి పత్రికలో వెలువడినట్టయితే ఆయనా, ఆయన కుటుంబం ఎంతో బాధపడతారు. అందువల్ల దానిని ప్రచురించ వద్దన్న సమాచారంతో, ఆ దూత నా దగ్గరకు వచ్చారు. ఒక ఉన్నత పదవిలో వున్న వారి పెద్ద కొడుకు ఒక నీచకృత్యంచేశాడన్న నేరం మీద ఖైదు చేయబడిన సంగతిని ప్రచురిస్తే, వాళ్లందరు బాధపడతారన్న సంగతి నాకు బాగా తెలుసు. అయినప్పటికీ ఆ వార్తను తీసివేయడానికి వీలులేని స్థితిలో వున్నాము. నేను ఆ సంగతిని ఆయనకు తెలియజేయడానికి కూడా వెనుకాడలేదు.

ఒక వార్త, పత్రికలో చోటు చేసుకోడానికి తగినదా? కాదా? అన్నది తీర్మానించడానికి ముందు, రెండు విషయాలను ఆలోచించి చూడాలి. మొదటిది అది నమ్మతగ్గ విషయమా అన్నది, తర్వాత ఒక వార్తకు అనువైన ప్రాముఖ్యత దానికి వుందా? అని చూడాలి. ఈ వివరాలు నమ్మదగ్గవా? అన్న ప్రశ్నకే చోటులేదు. నా మిత్రుని పదవి గురించి ఆలోచించేప్పుడు వార్త ముఖ్యమైనదనడంలో సందేహంలేదు. అందువల్ల ఆ వార్తను పాఠకులనుంచి దాచడానికి వీలుకాదు. ఆయన నా నిర్ణయాన్ని ఎలా అనుకున్నారో ఏమో తెలియదు; అయితే 'పాత్రికేయులకు తప్పనిసరిగా ఏర్పడే అనుభవాలు యివి' అని మాత్రమే నన్ను నేను సముదాయించుకున్నాను

ఎంత జాగ్రత్తగా ఉన్నప్పటికీ, కొన్ని సందర్భాలలో కొన్ని ప్రచురించడానికి తగని వార్తలు, అభిప్రాయాలు పత్రిక విభాగాలలో చోటు చేసుకుంటాయి. వాటిని ప్రచురించే తీరాలి అన్న బాధ్యతనుంచి పత్రికా సంపాదకుడు వెనకాడడానికి వీలులేదు కదా? చాలా విషాదానికి గురిచేసిన ఒకరి అనుభవం యిది:

నేను 'మాతృభూమి' సంపాదకుడిగా వున్నప్పుడు కేరళ ప్రదేశ కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి బాధ్యతనూ వహించి వున్నాను. అయితే మలబార్ ఉద్యమం ఫలితంగా వాటిల్లిన అవాంఛనీయ నష్టాలు, కాంగ్రెస్ కార్యకలాపాలను

మళ్లీ ప్రారంభించి జరపడానికి ఆటంకంగా నిలిచాయి. ఇష్టప్రకారం తిరగడానికి, సభలు ఏర్పాటు చేయడానికీ, వసతులు లేవు. అది మాత్రమే కాదు ఉద్యమ కాలంలో సాధారణ ప్రజలను పట్టుకున్న భయం యింకా పూర్తిగా వదలలేదు. ఈ స్థితిలో రెండవ కేరళ కాంగ్రెస్ మహాసభ సమావేశపరచడానికి మేము ఏర్పాటు చేశాము. 1923వ సంవత్సరం మే ఆరో తేది పాల్ఘాట్‌లో మహాసభ సమావేశమయింది. అప్పుడు 'మాతృభూమి' వెలువడడం ప్రారంభమై కొన్ని నెలలైంది. ఆ కాలంలో కోళిక్కోడ్ వదలి బయటి వూళ్లకు వెళ్లినా నాకు కష్టంగా వుండేది. అయినా కాంగ్రెస్ సభ ఏర్పాట్లకోసం నేను తరచుగా పాల్ఘాట్ వెళ్లవలసి వచ్చేది.

ఆ మహాసభకు శ్రీమతి సరోజినీనాయుడు అధ్యక్షత వహించారు. అలీ సోదరు తల్లి పిళమ్మ, రాజగోపాలాచారి, దేవదాస్‌గాంధి మొదలైనవారు సభకు వచ్చారు. వాళ్లందరూ ఒలవక్కోట్‌కు సమీపంలోవున్న నా అత్తాళచ్చిర గృహంలోనే బస చేశారు. మహాసభ పందిరిని, సమీపంలోవున్న మైదానంలోనే వేశాము. సభ ప్రారంభించడానికి మొదటిరోజు - సుదూరంలోవున్న పర్వతశ్రేణులను చూస్తూ సరోజినీనాయుడు 'ఎంతటి మనోహరమైన దృశ్యం! దీనిని చూసిన వారి హృదయాల్లో కవిత్వం పుట్టకుండా వుంటుందా?' అని ఆశ్చర్యంతో చెబుతూ పందిరిలోనికి నడిచారు. ఆనాటి ఆమె ఉపన్యాసం ఒక కవితలాగేవున్నది. కేరళ ప్రకృతి సౌందర్యాన్ని ప్రశంసిస్తూ ఆమె తన ఉపన్యాసాన్ని ప్రారంభించారు. ఆనాటి స్థితిలో ముఖ్యంగా వున్న సామాజిక సమస్యలను, ప్రత్యేకంగా వివరించిన తర్వాత, భారత దేశంలో వున్న పరిస్థితిని, తనకేవున్న ప్రత్యేక వాక్చాతుర్యంతో ఆమె ఉపన్యసించారు. ఆమె ఆంగ్ల ఉపన్యాసాన్ని మలయాళంలోకి అనువాదం చేసినవారు పుత్తెళుత్తురామన్ మీనన్. అతని అనువాదశక్తి ద్వారా, శ్రీమతి నాయుడు గారి ఉపన్యాసంలో పొంగి పొరలిన మాధుర్యాన్ని శ్రోతలు విని ఆనందించగలిగారు.

భారత స్వాతంత్ర్య ఉద్యమం నడిపిన వాళ్లలో శ్రీమతి నాయుడుకి సమున్నతమైన స్థానంవుంది. ఉత్సాహం కలిగించే ఆమె వాగ్ధాటి మాత్రమే అందుకు కారణం కాదు. అచంచలమైన దేశభక్తి, మధురంగా వ్యవహరించే స్వభావం, సమస్యలను పక్షపాతరహితంగా అవగాహనచేసుకునే తీరు, సరోజినీ నాయుడును భారతీయ ప్రజలు ప్రశంసించే ఒక నాయకురాలిగా చేశాయి. ఎటువంటి క్లిష్టసమయాల్లోనూ, సరోజినీ నిరుత్సాహం చెందిందిలేదు. మహాత్మాగాంధీ సబర్మతీ జైలులో వున్నప్పుడు నేను సరోజినీనాయుడుతో కలిసి ఆయన్ను చూడడానికి వెళ్లాను. జైలులో ప్రధాన ద్వారం తలుపులో వున్నచిన్న మార్గాన్నే వాళ్లు తెరిచారు. సాధారణంగా అనుమతి తీసుకుని

వెళ్లడానికి వాళ్లు పోయే మార్గం అదే! ఇందులో స్త్రీలెలా వెళ్లడానికి సాధ్యం అవుతోంది? తలుపు అంతా తెరవండి అని శ్రీమతి నాయుడు ఆజ్ఞాపించారు. జైలు నిబంధనలను అప్పటికి మరచి తలుపులు వెంటనే తెరిచారు, మేము లోపలికి వెళ్లాము.

నమస్కరించతగ్గ వయోవృద్ధురాలు పీళమ్మరాక, ఆ మహాసభ విజయానికి మరొక కారణమయింది. నడవడానికి కూడ వీలులేని పరిస్థితి అయినప్పటికీ, చాలాదూరం ప్రయాణం చేసి, సభలలో పాల్గొని స్వతంత్ర్య ఉద్యమానికి బలం సమకూర్చిన ఆమె సేవానిరతి అనుపమానమైనది.

జాతీయ మహాసభ పూర్తి కాగానే అక్కడ ఒక సాహితీ సభకూడ జరిగింది. దానికి సర్దార్ కె.ఎం. ఫణిక్కర్ అధ్యక్షత వహించారు.

ఆఖరి అంశంగా మహాసభ పందిరిలో వివిధ జాతులవాళ్లు కలుసుకునే ఒక సహపంక్తి భోజనం ఏర్పాటు చేశాము. నాయర్, వేడువన్, బ్రాహ్మణుడు, కూలీచేసేవాడు అందరూ అందులో పాల్గొన్నారు. ఈ సహపంక్తిభోజనాలు తర్వాత కొందరికి మనసుకు కష్టం కలిగించింది. ఉన్నతజాతికి చెందిన కొందరు సంప్రదాయ వాదులను తృప్తిపరచడానికి ప్రాయశ్చిత్తం చేయవలసివచ్చింది. ఈ సంఘటన మరో ఉద్యమానికి బీజంవేస్తుందేమోనని కూడా భయపడ్డాము. ఏ విధంగా నైనా పాల్ఘాట్ మహాసభ అస్పృశ్యతా నివారణ ప్రయత్నంలో ఒక నూతనోత్సాహాన్ని కలిగించడానికి దారి చూపింది.

# వైక్కమ్ సత్యాగ్రహం

కేరళలో కాంగ్రెస్ ఉద్యమానికి రెండవసారిగా ఒక నూతనోత్తేజం కల్పించాలని ఆలోచిస్తున్నప్పుడు ఒక రోజు 'దేశాభిమాని' సంపాదకులు శ్రీ టి.కె. మాధవన్ నన్ను చూడడానికి కోళిక్కోడ్ వచ్చారు. ఆయన మహత్తర సాంఘిక సేవలు, నిర్వహణా దక్షత సర్వజనవిదితమే. చిరకాలం స్వార్ధరహితమైన సేవచేసి, సమాజంలో ఒక ఉన్నత స్థానాన్ని పొందిన వారాయన. 'భద్రాధిపర్' అనే చాలామంది ఆయన్ని పిలిచేవారు. రచనల్లోను, మాటల్లోనూ ఒక విశిష్టమైన శైలిని అనుసరించిన దిట్ట ఆయన. ప్రేమపూరితంగానూ, హాస్యయుక్తంగానూ, ఆయన మాట్లాడేతీరు, ఆయన విరోధుల్ని కూడా ఆకర్షించి ఆనందంలో ముంచేత్తేవి. దగ్గుతో అప్పుడప్పుడు ఆయన బాధపడుతున్నప్పటికీ, ఆయన శ్రమపడే విధానంలో ఎలాంటి మార్పూ వుండేదికాదు. ఎప్పుడూ ఉత్సాహంతో వుండే మాధవన్ ఇతరులతో సైతం ఆ ఉత్సాహాన్ని కలిగించేవారు. మాధవన్ వలె మనస్ఫూర్తిగా స్నేహితులతో కలసిమెలసి వుండి, సహకరించేవారు ఏ కొద్దిమందో వుంటారు. ఎదుటివారి వాదనలు మనసులో బాగా ఆకళింపు చేసుకొని, ధార్మిక దృష్టితో విమర్శించడం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య. ఆయన సంపూర్ణదృష్టి దళిత వర్గాల పునరుజ్జీవనం మీదే కేంద్రీకరించబడి వుండడం వల్ల జాతీయరంగంలో పూర్తిగా పాల్గొన లేక పోయారు. అస్పృశ్యతా నివారణను కాంగ్రెసు ఒక ముఖ్య పథకంగా రూపొందించిన సమయంలో ఆయన మునుపటి కన్న ఎక్కువ ఆసక్తి కనబరచడం ప్రారంభించారు. నిమ్నజాతుల వారు అనుభవించే అవమానాలు, వాళ్ల దుస్థితి నివారించిన తర్వాతే స్వాతంత్ర్యం కోసరం పాటుపడాలని ఆయన వాదించలేదు. కాని, రెండు రంగాలలోనూ కలిసి కట్టుగా పోరాడాలన్నది ఆయన అభిప్రాయం. శ్రీ నారాయణ గురుస్వామిని ఆయన ఆత్మగురువుగా భావించి, స్వామివారి లక్ష్యాలకు, ఉపదేశాలకు కార్యరూపం ఇవ్వడానికి నిర్విరామంగా కృషిచేశారు.

'ముట్టుకో తగని వాళ్లు, తాకకూడని వాళ్లు,
చూపులకి తగిలినా తప్పు చేసిన వాళ్లు
కలిసి భోజనం చేయడానికి అసలు తగని వారు'

అని మహాకవి ఆసాన్ వివరించిన అర్థాలను ఈనాటి వారు అర్థం చేసుకోలేదు. ఆ రోజుల్లో ఆ దురాచారాలను సమూలంగా నిర్మూలన చెయ్యడానికి ప్రయత్నించిన భద్రాధిపర్ మాధవన్ ఒక సాంఘిక యుద్ధవీరుడుగా వెలిగారు.

అస్పృశ్యతా నివారణ విషయంలో కాంగ్రెస్ తీవ్రంగా ఆలోచించడానికి ప్రారంభించిన కాలఘట్టం అది. ఆ రోజుల్లో అందుకు కార్యాచరణ ఎలా వుండాలి? అన్న విషయం గురించే చర్చలు జరిపాము. లక్ష్యంలోనూ, స్వభావంలోనూ, సిద్ధాంతరీత్యానూ, నాకు తగిన, నన్ను పోలిన మిత్రుడని మాధవన్‌ని చూడగానే ఇట్టే గ్రహించాను. ఆ తరువాత మేము వివిధ ఉద్యమాలలో కలిసి పోరాడాము. వివిధ సమావేశాల్లో మమ్మల్ని ఒకటిగా చూడవచ్చు. కలిసి ఆలోచించేవాళ్లం. ఆ రోజుల్లో ప్రారంభమైన స్నేహం అచిరకాలం లోనే ప్రేమగా వ్రేళ్లూని అభివృద్ధి చెందింది.

దాదాపు ఒక గంట సేపు మేము కాంగ్రెస్ కార్యాలయంలో కూర్చుని మాట్లాడాము. తర్వాత మాధవన్ నా వద్ద సెలవు తీసుకున్నారు. తర్వాత మేము 1923వ సంవత్సరం డిసెంబర్ నెలలో కాకినాడ కాంగ్రెస్ మహాసభకు వెళ్లినప్పు డుకలుసుకున్నాము.

మాధవన్, సర్దార్ కె.ఎమ్. ఫణిక్కర్, నేను కలిసే మద్రాసు నుంచి కాకినాడకు బయలుదేరాము. ఆ రోజులలో ఫణిక్కర్ 'స్వరాజ్య' సంపాదకులుగా వుండేవారు. ఫణిక్కర్ ఉత్సాహ భరితమైన మాటలు, మాధవన్ హాస్యరసపు జల్లులు మాకు ప్రయాణబడలిక తెలియకుండా చేశాయి. కాకినాడలో, నాతో పాటు కేరళనుంచి వచ్చిన వారి విడిదిలోనే మాధవన్ కూడా బసచేశారు. చాలా చలిగా వున్న ఆ కాలంలో ప్రాతఃకాలాన్నే మేలుకొని 'భారతదేశంలో అస్పృశ్యుల కోసరం అఖిలభారత కాంగ్రెస్ కమిటీకి విన్నపం' అన్న ఉపన్యాసం వ్రాసి ముగించారు. ఆ సంవత్సరం కాంగ్రెస్ అధ్యక్షులు మౌలానా మహమ్మద్ అలీ ఆ విన్నప పత్రాన్ని అచ్చొత్తించి, అధ్యక్షునికి, అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సభ్యులకు, పత్రికా ప్రతినిధులకు ఆయన పంచిపెట్టారు. దాంతోపాటు అధ్యక్షునికి అందులోని విషయం గురించి వివరంగా తెలియజేశారు. ఆయన ప్రయత్నాల ఫలితంగా అస్పృశ్యతా నివారణ కార్యక్రమాన్ని తీవ్రతరం చేసి అందుకోసరం పథకాలను రూపొందించడానికి, ఆనతిని ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీలకు జారీ చేయడానికి మహాసభలో ప్రయత్నాలు జరిగాయి.

అధ్యక్షులు మౌలానా మహమ్మదాలీ, మాధవన్ చెప్పినదల్లా శ్రద్ధగా వినడంవల్ల - అస్పృశ్యతా నివారణ కోసరం ఆ సంవత్సరం తీర్మానం

నెరవేర్చడం కష్టంగా కనిపించలేదు. మౌలానా మహమ్మదాలీ, మౌలానా షౌకత్‌అలీ ఆ రోజుల్లో కాంగ్రెస్ మూల స్థంభాలలో ప్రముఖులుగా వుండేవారు. వాళ్ళు గాంధీగారి సన్నిహిత మిత్రులు. ఖిలాఫత్ ఉద్యమమే వాళ్లను కాంగ్రెస్ వైపు ఆకర్షించింది.

కాకినాడ కాంగ్రెస్ సమావేశం తర్వాత మాధవన్‌కు కాంగ్రెస్ మీద ఎంతో నమ్మకం కుదిరింది. అందులో చేరారు. కాకినాడ నుంచి తిరిగి రాగానే కాంగ్రెస్ తీర్మానాలకు కార్యరూపం ఇవ్వడానికి మేము కార్యరంగంలోకి దిగాము.

1924వ సంవత్సరం జనవరి 24వ తేదీ ఎర్నాకుళంలో సమావేశమైన ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ సభలో, అస్పృశ్యతా నివారణకు ఒక ప్రముఖ సమస్యగా భావించి దానికి కావలసిన కార్యాచరణ పథకాలను రూపొందించడానికి ఒక ప్రత్యేక బృందాన్ని ఏర్పాటు చేశాము. కాంగ్రెస్ కార్యక్రమాలను ప్రజలకు వివరించడం కోసరం కేరళలో పలుప్రాంతాలలో పర్యటన జరపడానికని మరో కమిటీని కూడా ఏర్పాటు చేశాము. ఈ రెండవ కమిటీలో, ఎ.కె. పిళ్లై, హసన్ కోయముల్లా, కారూర్ నీలకంఠ నంబూద్రి పాద్, నేను బాధ్యతలు స్వీకరించాము. పర్యటన కార్యక్రమం ఎ.కె. పిళ్లై రూపొందించారు. ఆయన నేను కలిసే అన్ని ప్రదేశాలకూ వెళ్లాము. ఒక కొస నుంచి మరో కొసకి ప్రయాణం చేసి అన్ని నగరాలు, గ్రామాలు పర్యటించి, లెక్కలేనన్ని బహిరంగ సభల్లో ఉపన్యసించాము. ఆనాటి జ్ఞాపకాలే ఎంతో ఉత్సాహాన్ని కలిగించేవి. రోజూ వివిధ ప్రాంతాలలో మా బహిరంగ సభలు ఏర్పాటు చేసేవారు. అన్ని చోట్లా మాకు లభించిన ఉత్సాహపూరితమైన ఆదరణ చూసి మేమెంతో ఆనందించాము. జాతి, మత భేధాలు మరచి ప్రజలు బహిరంగ సభల్లో తండోపతండాలుగా గుమికూడేవారు. ఇరవైనాలుగు రోజులు కొనసాగిన ఆ పర్యటనలో కొన్ని రసవత్తరమైన అనుభవాలు ఏర్పడ్డాయి. జాతీయోద్యమం పట్ల ప్రజలకు గల ఆసక్తిని వాటి ద్వారా ప్రత్యక్షంగా తెలుసుకోగలిగాము.

ఒక రోజు రాత్రి సభ ముగించుకుని మాకు ఏర్పాటు చేసిన బసకు వచ్చిచేరాము. కొంతసేపయ్యాక, మమ్మల్ని ఆహ్వానించిన వారిలో ఒకరు నాకు ఒక గ్లాసు పాలు, పళ్ళు తెచ్చి ఇచ్చారు. వాటిని తీసుకున్నాక నేను అక్కడికి వచ్చిన మిత్రులతో మాట్లాడుతున్నాను. తర్వాత స్నానం చేసి, రాత్రి భోజనం కోసరం ఎదురుచూస్తున్నాను. పదిగంటలు అయింది. భోజనం గురించి అజపజాలేదు. నాకు బాగా ఆకలి వేసింది. ఎలాగైనా సరే భోజనం గురించి అడగాలనుకున్నాను. 'భోజనానికి ఇంకా చాలాసేపు పడుతుందా?' అని నేను

అక్కడ బస ఏర్పాటు చేసిన వ్యక్తిని అడిగినప్పుడు ఆయన ఆశ్చర్యంతో చూశారు. ఆయన ఆశ్చర్యానికి కారణం నేను గ్రహించలేకపోయాను.

'రాత్రులలో పాలు-పళ్ళు మాత్రమే తీసుకుంటారని మేము అనుకున్నాము' అని అతని తరపున మరొకరు నాకు జవాబు చెప్పారు.

'పాలు-పళ్ళు తీసుకుంటాను. అయినా అవి భోజనం తర్వాత అని నేను అన్నప్పుడు వాళ్లు నవ్వారు. తర్వాత హడావుడిన వెళ్లి భోజనం వండి తీసుకొచ్చారు.

అందరిలాగే మేమూ ఆ సమయంలో భోజనం చెయ్యమని వాళ్లు భావించారు! ఆనాటి సహాయ నిరాకరణోద్యపు కార్యకర్తలు భోజనం, దుస్తులు అలవాట్లలో కొన్ని నిర్దిష్ట సిద్ధాంతాలను ఆచరించేవారు.

మామూలుగా దుస్తులు ధరించి, భోజనం చేసి మిగతా వారితో కలిసిమెలిసి మాట్లాడడం సహాయ నిరాకరణోద్యమానికి చెందిన త్యాగుల లక్షణం కాదని కొందరు అనుకునేవారు. ఆ విశ్వాసం పర్యవసానమే నాకు కలిగిన అనుభవం.

పర్యటన కార్యక్రమం ప్రకారం, 1924 వ సం॥ ఫిబ్రవరి 28వ తేదీ మేము వైక్కం చేరుకున్నాము. అప్పుడే వైక్కం ఆలయసమీపంలో వున్న వీధులలో కూడా నిమ్నజాతి ప్రజలు నడవడానికి కూడా హక్కు కలిగివుండలేదన్న నిజం తెలిసింది. ఆ రోజు సాయంత్రం అక్కడ ఏర్పాటు చేసిన బహిరంగ సభలో ఈ ఘోరాన్ని ఖండించి ఉపన్యసించాను. విదేశీయులు మనపట్ల న్యాయంగా నడుచుకోవడం లేదన్న విషయం గురించి తప్పు పట్టే మనం, మన దేశప్రజల పట్ల న్యాయంగా నడచుకోకపోవడం, సమంజసమేనా? అంటరానివారు అని మనం చూపే ఈ దుర్నీతిని నిర్మూలించ వలసిన బాధ్యత మనకు లేదా?' అని ప్రశ్నించినప్పుడు కరతాళధ్వనులు మిన్నుముట్టాయి.

చప్పట్లు కొట్టడం కష్టంకాదు. కార్యాచరణలో దిగేప్పుడే ఇబ్బందులు ఎదురవుతాయి. నిమ్నజాతుల వారితో కలిసి ఈ ఆలయం ముందున్న బాటపై ఒక ఊరేగింపు ఏర్పాటు చేసినట్లయితే, ఇక్కడ గుమికూడివున్న వారిలో ఎంతమంది అందులో పాల్గొనగలరు? అని నేను ప్రశ్నించనప్పుడు 'అందరమూ!.....అందరమూ!.....' అని వారు ముక్త కంఠంతో అరిచారు.

'అలా అయితే రేపే మనం ఊరేగింపు ఏర్పాటు చేద్దాం!' అని నేను చెప్పిన తర్వాత అయిదు నిముషాల వరకూ కరతాళధ్వనులు మ్రోగుతూనేవున్నాయి. ఆవేళ ప్రజలు అమితోత్సాహంతో సభనుంచి వెళ్లారు.

సభ ముగిసిన తర్వాత నేను బసకు తిరిగి రాగానే అక్కడికి మేజిస్ట్రేటు, తహసీల్దారు, పోలీసు అధికారి, ఊరిపెద్దలూ అందరూ వచ్చారు. నేను సభలో తెలయజేసినట్లు మర్నాడే - నిమ్నజాతులవారితో పాటు ఆలయం

ముందు ఊరేగింపుగా వెళితే పెద్ద అలజడి, రక్తపాతం జరగవచ్చుని, అప్పటికి దీనిని ఆపి, దానికి అనువైన సమయం ఆసన్నం కావడానికి అవసరమైన ప్రచారం చేయడం శ్రేయస్కరమనీ, చాలామంది అభిప్రాయం వెలిబుచ్చారు. నేను కూడా ఈ కార్యక్రమంలో భాగస్వాములుగా వున్న మిత్రులతో ఆలోచించిన తర్వాత, అది సరైన ఆలోచనే అనిపించింది. అందువల్ల మర్నాడు ఊరేగింపు లేదని నిర్ణయించాము. ఒక నెల తర్వాత ఊరేగింపు జరిగేట్టు వాయిదావేసి కోళిక్కోడ్ బయలుదేరాము.

వైక్కం ఆలయ ప్రాంగణపు వీధిలో అన్ని జాతులవారూ నడవడానికి హక్కు కోరే ప్రచారం కోసరం చాలా శ్రద్ధగా పనిచేశాము. దీని కోసరం పలుప్రాంతాలకు వక్తలను పంపాము. సరళమైన భాషలో ఉపన్యాసాలు అచ్చువేసి పంచాము. నాయకులను కలుసుకుని పరిస్థితి వివరించాము. పత్రికల ఆదరణ కావలసి వచ్చింది. చాలారోజులు ప్రచారం చేసిన తర్వాత కూడా దేవస్థానం నిర్వహణాధికారి, ఎలాంటి ఉదారతనూ చూపడానికి అంగీకరించలేదు. స్వతంత్రంగా అన్నిజాతులవారూ నడవగలిగిన సమస్యాపరిష్కారానికి సత్యాగ్రహం ఒక్కటే సరైన మార్గమని నిర్ణయించాము. అందువల్ల సత్యాగ్రహం జరపాలని తీర్మానించాము.

దానిని ప్రారంభించడానికి ముందు, మహాత్మాగాంధీకి వైక్కం పరిస్థితి గురించి, మమ్మల్ని సత్యాగ్రహం చెయ్యడానికి పురికొల్పిన వాతావరణం గురించి ఒక ఉత్తరం వ్రాసి, అందుకు ఆయన ఆశీస్సులు కూడా కోరాము. అందుకు ఆయన వ్రాసిన ఉత్తరం :-

అంధేరి,
19-3-24

ప్రియమైన కేశవమీనన్,

మీ ఉత్తరం అందింది. మీరు చెప్పే మీప్రాంత ప్రజలస్థితి భారతదేశంలో మిగతా ప్రాంతాల స్థితికన్నా శోచనీయమైనదన్న విషయం నాకు తెలుసు. మీరు చెప్పే విధంగా వాళ్లు 'అంటరానివారు' మాత్రమే కాదు; కొన్ని వీధులలో నడవకూడదన్న స్థితి ఎంతటి దయనీయమైనది! మనకింకా స్వరాజ్యం లభించలేదంటే అందుకు ఆశ్చర్యం లేదు. మనదేశంలో నిమ్నవర్గాలు మామూలుగా వీధులలో నడిచే హక్కు పొందితీరాలి. హద్దులు నిర్దేశించబడిన వీధులలో కేరళ కాంగ్రెస్ కమిటీవారు, వెనుకబడిన ప్రజలతో కలిసి ఒక ఊరేగింపు జరపాలని ఆశిస్తున్నాను. ఇది ఒక విధమైన సత్యాగ్రహం. ఈ విషయం పట్ల ప్రత్యేక శ్రద్ధ కనబరచాలని మీకు వేరే చెప్పనక్కరలేదు. మన ప్రజలే మిమ్మల్ని వ్యతిరేకించినప్పటికీ మీరు జరిపేతీరాలి. మీరు దెబ్బలు

తినవలసివచ్చినా భరించి, ప్రశాంతంగా, మీ కార్యక్రమాన్ని నిర్వర్తించండి. ఈ సత్యాగ్రహంలో పాలుపంచుకునే అందరికీ ఈ అభిప్రాయాన్ని నొక్కిచెప్పి వారందరూ ఆత్మ విశ్వాసంతో ఇందులో పాల్గొనేటట్లు చూడండి. ఒకసారికి కొందరే వెళ్లినా చాలు. అయినా అందరూ శాంతంగా, వినయంగా నడుచుకునేవారుగా వుండాలి. మరో ముఖ్యమైన విషయం జ్ఞాపకం వుంచుకోవాలి. ఈ నిబంధనలను, పాల్గొనేవారెవరైనా తిరస్కరించినట్లయితే ఊరేగింపును ఆపడానికి వెనుకంజవేయకూడదు. ఇలాంటి సంస్కారానికి విరుద్ధంగా వున్నవారిని మన సన్నిహితులుగా చేసుకునే స్థితిలో మనంలేము. అందువల్ల జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం. ఈ కార్యక్రమం అంత సులభమైనది కాదు. ఇక్కడ నేను జబ్బుతో బాధపడుతూ మీకు ఉపదేశాలు వ్రాయడం తేలికే. అయినా మీరు ప్రత్యేకంగా జాగ్రత్త వహించ వలసిన విషయాలను గుర్తుచేసి, మీ ప్రయత్నాలకు సంపూర్ణ విజయం సమకూరగలదని ఆశీస్సులు అందజేసి సెలవు తీసుకోవడం మంచిదని భావిస్తున్నాను.

ఎం.కె. గాంధి.

1924వ సం॥ మార్చి 30వ తేదీన మేము సత్యాగ్రహం ప్రారంభించడానికి తీర్మానించి, అందుకు నాలుగు రోజులముందే వైక్కం బయలుదేరివచ్చాము. సత్యాగ్రహానికి మద్దతు ఇవ్వడానికి చాలామంది మిత్రులు, సభ్యులు, అక్కడికి వచ్చారు. వారితో జరిపిన సమాలోచనలు, ఉపన్యాసాలు, ఆ ఉత్సాహకరమైన ఏర్పాట్లు, ఒక ఉత్సవం జరుగుతున్నట్లుగా అనిపించాయి. మందత్తు పద్మనాభ పిళ్లై, సంగణాచ్చేరి, పరమేశ్వరన్ పిళ్లై, ఎం.ఆర్. నాయర్, సి.వి. కుఞ్ఞరామన్, ఆలమ్ముట్టిల్ సాన్నార్ మొదలైన నాయకులందరూ వచ్చారు. నిధి సేకరణకు, వస్తువులు సేకరించాడానికి, ప్రచారం చేయడానికి, ప్రజలను ఆహ్వానించడానికి, ప్రతినిధులను నిర్ణయించడానికి, విడివిడిగా శాఖలు ఏర్పరచాము. నాయకులను ఖైదుచేసి నప్పటికీ సత్యాగ్రహం పథకం ఆగిపోకుండా కొనసాగడానికి ముందు జాగ్రత్తలో ఏర్పాట్లు చేశాము.

ఇరవై తొమ్మిదో తేదీ రాత్రి పడుకోబోయేటప్పటికి బాగా రాత్రయింది. అర్ధరాత్రి వేళ నన్ను కొందరు తట్టిలేపారు. వాళ్లు నాతో కొన్ని ముఖ్యమైన సంగతులు చెప్పడానికి, చర్చించడానికీ వచ్చినట్లు చెప్పారు. సంఘంలో ప్రముఖులు వాళ్లు. తీర్మానించిన ప్రకారం మర్నాడు ఉదయం సత్యాగ్రహం ప్రారంభించినట్లయితే ఎన్నో చిక్కులు ఎదురవుతాయనీ సత్యాగ్రహం పర్యవసానంగా అస్పృశ్య నివారణోద్యమం వెనుకంజవేయవచ్చనీ, అందువల్ల

మర్నాడు ఉదయం దానిని ప్రారంభించడం వివేకవంతమైన చర్యకాదనీ, వైక్కం రహదారికి సంబంధించినంతవరకు అధికారులు తీవ్రంగానే ఆలోచిస్తున్నట్లు తెలియజేశారు. ఈ మాటలు నాకు దిగ్భ్రాంతి కలిగించాయి.

ఆ రోజువరకు నాతోకలిసి, నాకు సమమైన ఉత్సాహంతో సత్యాగ్రహ లక్ష్యసాధనకు పాలుపంచుకున్న కొందరు మిత్రులు వారి మధ్య కనిపించారు. ఉన్నట్టుండి వచ్చిన ఈ మార్పుకు కారణం ఏమిటన్నది అంతుబట్టలేదు. వారు చెప్పినదంతా విన్నాను. మర్నాడు ఉదయం సత్యాగ్రహం ప్రారంభించలేదంటే అవకాశం చేయిజారిపోయినట్లు అవుతుందే? అలా వదిలి వేయడానికి కారణాలు ఏమిలేవే? అందువల్ల ఉత్సాహం విడువకుండా సత్యాగ్రహానికి సమీకరించాలని వారికి మనవి చేశాను.

'మన మందరమూ కలిసి సమగ్రంగా ఆలోచించిన కార్యక్రమంలో అడుగుపెట్టబోతున్నాము. ఇప్పుడు దానిని మార్చడం సరైనదేనా? జయమో, అపజయమో అనుకున్నట్లు రేపు సత్యాగ్రహం ప్రారంభిద్దాం' అని వారితో చెప్పి మళ్లీ నిద్రకు ఉపక్రమించాను.

ముప్పైయ్యవ తేది తెల్లవారింది. సత్యాగ్రహ ఉద్యమంలో వున్న వారంతా స్నానం చేసి, బొట్టు పెట్టుకుని, ఆలయ వీధికి బయలుదేరడానికి సిద్ధమయ్యాము. మొదటి రోజు సత్యాగ్రహానికి ముగ్గురు బయలుదేరాము. కుఞ్ఞప్పి అన్న పేరుగల ఒక పులైయార్. హువేయన్ అన్న ఒక ఈళవర్; మూడవ వ్యక్తి గోవింద ఫణిక్కర్ అన్న ఒక నాయర్. ఉదయం ఏడు గంటలకు, మా బసనుంచి ఇద్దరిద్దరుగా ముందుకు నడిచాము. మేము బస చేసిన చోటు నుంచి గుడికి దాదాపు ఒక మైలు దూరం ఉంటుంది. ఎలాంటి సంచలనమూ లేకుండా ప్రశాంతంగా నడిచి వెళ్లాము. గుడికి నూరు గజాల దూరంలో వీధిలో నాటబడిన ఒక పలకమీద 'అంటరాని జాతివారు దీనిని దాటి ప్రవేశంచకూడదు' అని వ్రాసివుంది. ఆ ప్రకటన బల్లకు యాభై గజాల దూరానికి వెళ్లాక అందరం అక్కడే ఆగాము. సత్యాగ్రహానికి సిద్ధంగా ముగ్గురు మాత్రం ముందుకు నడిచారు. ప్రజలు ఆవేదనతో, ఉద్వేగంతో నిలబడి వున్నారు. పోలీసులు అటూఇటూ తిరుగుతూ జనాన్ని ఒక పక్కకు నిలబెడుతున్నారు. ముగ్గురు సత్యాగ్రహులు ప్రకటన బల్లవద్దకు వెళ్లారు. అక్కడ పోలీసువారు ఏడెనిమిది మంది వరుసగా నిలబడి వున్నారు. సత్యాగ్రహులు అక్కడే నిలబడ్డారు.

'మీరు ఒక్కొక్కరు ఏ జాతివాళ్లు' అని ఒక పోలీసు అధికారి అడిగారు.

'నేను పులైయన్'

'నేను ఈళవన్'

నేను నాయర్'

అని వారు బదులు పలికారు.

'నాయర్ దాటి వెళ్లవచ్చు. మిగతా ఇద్దరూ దీనిని దాటి అడుగు పెట్టకూడదు' అని ఆజ్ఞాపించాడు ఆ అధికారి.

'మిగతా ఇద్దరినీ నాతో తీసుకువెళ్లడానికే నేను వచ్చాను. వారితో కలిసే ముందుకు నడుస్తాను' అని గోవింద ఫణిక్కర్ జవాబిచ్చాడు. పోలీసులు అడ్డుపడ్డారు. సత్యాగ్రహులు ముగ్గురూ పోలీసు వారి ముందు నిలబడ్డారు. కొంత సమయం గడిచింది. 'ఒకటి మమ్మల్ని ఈ దారిలో వెళ్లనివ్వండి లేదా ఖైదు చెయ్యండి. ఈ రెండిటిలో ఏదో ఒకటి జరగాలి. అంతవరకూ మేము తిరిగి వెళ్లం' అని సత్యాగ్రహులు అక్కడే నిలబడ్డారు.

జిల్లా మెజిస్ట్రేటు, పోలిసు అధికారులు ఆలోచించారు. సత్యాగ్రహుల్ని ఖైదు చెయ్యమని ఆజ్ఞాపించారు. వారిని ఖైదుచేసి తీసుకువెళ్లిన తర్వాత మేమందరమూ మా శిబిరానికి చేరాము. మొదటి రోజు సత్యాగ్రహం ఆ విధంగా జరిగింది.

మర్నాడు మేజిస్ట్రేటు వారిమీద విచారణ సాగించి ఒక్కొక్కరికి ఆరునెలలు జైలు శిక్ష విధించారు. ఆరోజు కూడా మరో ముగ్గురు సత్యాగ్రహం జరిపారు. వారిని కూడా జైలుకు తీసుకెళ్లారు.

ఈ రెండు రోజుల్లో అవాంఛనీయమైన సంఘటన లేవీ జరగలేదు. సత్యాగ్రహం శాంతియుతంగా జరిగినందుకు సంతోషించాము. అయినా కొందరు అగ్రజాతి హిందువులకు ఈ పద్ధతి ఆశ్చర్యాన్ని కలుగజేసింది. కొన్ని వదంతులు వ్యాపించాయి. 'దేవాలయంలోకి కొందరు అంటరానివారు ప్రవేశిస్తున్నారు. ఉద్యమానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి' అన్నట్లు వదంతులు బయలుదేరాయి. వీటితో పాటుగా నాకు కొన్ని ఉత్తరాలూ వచ్చాయి. కొందరు మిత్రులు సత్యాగ్రహాన్ని రెండు రోజులు ఆపి, అగ్రవర్ణాల వారిని సంప్రదించి, వారి ఆదరణ పొందడానికి తిరిగి ప్రయత్నించాలని అభిప్రాయపడ్డారు. నేనూ అందుకు సమ్మతించి రెండు రోజులు సత్యాగ్రహాన్ని ఆపాను. ఈ సందర్భంలో మహాత్మాగాంధీ మరొక ఉత్తరాన్ని వ్రాశారు. ఆ ఉత్తరం ఇంది.

అంధేరి, ఏప్రిల్ 1.

ప్రియమైన కేశవమీనన్,

మీ సత్యాగ్రహం గురించి కొన్ని విషయాలు నాతో చెప్పడానికి శ్రీ శివరామ అయ్యర్, శ్రీ వాంజీశ్వర అయ్యర్ ఇక్కడికి వచ్చారు. వివాదాస్పదమైన విధులు ఆలయానికి చెందినవనీ, దేవాలయ ధర్మకర్తల అజమాయిషికి

లోబడివున్నవనీ, వారికి ఆ వీధులలో ప్రజల రాకపోకలను నిర్ణయించే సంపూర్ణ అధికారం వుందనీ వారు నాకు తెలియజేశారు. ఆ విధులు బ్రాహ్మణులు మాత్రమే ఉపయోగించడానికి హక్కున్న ప్రత్యేకమైన సొత్తా? లేదా బ్రాహ్మణేతరులు కూడా ఆ వీధులలో నడువవచ్చా? అని నేను వారిని అడిగాను. అందుకు వారు ఆ మార్గంలో బ్రాహ్మణేతరులు కూడా నడువవచ్చని తెలియజేశారు. ఒక బ్రాహ్మణేతరుడికి అక్కడ నడవడానికి హక్కువున్నప్పుడు నిమ్నజాతికి చెందినవారికీ ఆ హక్కు ఇవ్వాలని వారిని కోరాను. అందుకు వారు అంగీకరించలేరు. అయినప్పటికీ దేవాలయం విధుల గురించి బాధ్యత, హక్కులు గల ధర్మకర్తలతోనూ, ఇతర బ్రాహ్మణులతోనూ సంప్రదించి వివరించడానికి కొన్ని రోజులు పడుతుందని వారు తెలియజేస్తున్నారు.

రెండు నెలలో అక్కడికి ములవ్యాజీ వస్తారని తెలుస్తోంది. దళిత జాతి వర్గాల ప్రతినిధిగా మీరూ, ఆలయ హక్కుదారు మాలవ్యాజిని మధ్యవర్తిగా వుంచుకుని కలిసి మాట్లాడి ఒక నిర్ణయం తీసుకోండి. ఆయన తీర్పును ఒక నిర్ణీతకాలంలో వెలువరించడానికి, బ్రాహ్మణులు అందుకు ఒప్పుకున్నట్లయితే 'ఈ చర్యకు మధ్యవర్తి ద్వారా మాట్లాడి పరిష్కరించుకోవడానికి తీర్మానించడంవల్ల, సత్యాగ్రహం ప్రస్తుతానికి నిలిపివేయబడుతున్నది' అని ప్రకటించి సత్యాగ్రహాన్ని నిలిపివుంచమని నేను సలహా యిస్తున్నాను.

పైన చెప్పిన ఇద్దరు సోదరులూ, నాతో చెప్పిన కొన్ని ముఖ్యమైన సంగతులు నిజమైన వన్న నమ్మకంతోనే నేను మీకీ సలహా ఇస్తున్నాను. ఈ సంస్కరణకు సంబంధించిన ప్రయత్నాలను విజయవంతం చేయడంలో వారుకూడా మనలాగే ఉత్సాహంతో వున్నట్టు చెపుతున్నారు. అదే నిజం అయితే మనం వారిని కూడా మన లక్ష్యాలను ఆదరించేవారన్న అభిప్రాయంతో వారిని మనతో కలుపుకోవడానికి స్నేహం, సాన్నిహిత్యం చూపాలి.

ఎల్లప్పుడూ మీ విశ్వసనీయమైన

ఎం.కె. గాంధీ.

ఈ ఉత్తరాన్ని ఆయన ఏప్రిల్ ఒకటో తేదీన పంపినప్పటికి నాలుగో తేదీన ఈ ఉత్తరం వివరాలు నేను 'హిందూ' పత్రిక చూసే తెలుసుకున్నాను. విషయం ముఖ్యమైనది కావడంతో ఉత్తరం నా చేతికి అందకముందే నేను మహాత్మాజీకి ఇలా ఒక ఉత్తరం వ్రాసిపంపాను.

వైక్కం,
6–4–'24

ప్రియమైన మహాత్మాజీ,

సత్యాగ్రహాన్ని ప్రస్తుతానికి నిలిపివేయడం గురించి మీరు నాకు పంపిన ఉత్తరం వివరాలు నాలుగోతేదీ 'హిందూ' లో చదివి తెలుసు కున్నాను. ఈ ఉత్తరం ఇంకా నా చేతికి అందలేదు. అది వైక్కంకు వస్తూవుంటుంది. ఇక్కడ వున్న యదార్థపరిస్థితులు మీకు వివరంగా చెప్పడానికి ఆ ఉత్తరం అందేవరకూ వేచివుండాలని లేదు.

మహాత్మాజీ...మీ ఉత్తరంలో తెలియజేసిన శ్రీ శివరామ కృష్ణ అయ్యర్, శ్రీ వాంజిశ్వర అయ్యర్ నాకు ప్రత్యక్షంగా తెలియదు. వారు అక్కడ తెలియజేసిన విషయాలు సరైనవని అనిపించడంలేదు. వైక్కం దేవాలయంగాని, వివాదాస్పదమైన వీధులు గాని, లేక ప్రస్తుతం ఒక ప్రత్యేకమైన వ్యక్తి ఆస్తి గానో లేక ధర్మకర్తల సొత్తుగానో లేదు. ఆలం తిరువిదంకూర్ రాజు పాలనకు లోబడినది. దాని నిర్వహణా బాధ్యతల చూసుకునే వారు రాజుగారికీ, ప్రభుత్వానికీ సంబంధించిన అధికారులు. ప్రభుత్వమూ, ప్రజలూ చెల్లించే పన్నుల పైకం నుంచే ఆలయానికి వెళ్లే వీధులను, బాటలను నిర్వహిస్తున్నారు. ఈ దారులలో బ్రాహ్మణులు మిగతా అదే వర్గం హిందువులు మాత్రమే అక్కడ నడిచే హక్కు కలిగి వుండడం లేదు. క్రైస్తవులు, మహమ్మదీయులు ఇష్టప్రకారం రాకపోకలు సాగించవచ్చు. తీయార్, పులైయార్ లాంటి దళిత జాతి ప్రజలకు మాత్రమే ఆ దారులలో నడిచే హక్కులేదు. చట్టప్రకారం బ్రాహ్మణులకు, బ్రాహ్మణేతరులకు వున్నట్టుగానే, నిమ్నజాతులకు కూడా అక్కడ నడిచే హక్కువుంది. ఈ పరిస్థితిలో సత్యాగ్రహాన్ని ఆపకుండా కొనసాగించడానికి మీరు మాకు సలహా యివ్వగలరని ధృఢంగా విశ్వసిస్తున్నాను.

మాలవ్యాజీ మధ్యవర్తిత్వ సంభాషణల గురించి తప్పకుండా చెప్పాలని మీరు ఆశించడానికి నేను ఇదే చెబుతాను. ఆలయం బ్రాహ్మణధర్మకర్తల సొంత ఆస్తిఅనీ, వారు మాలవ్యాజీ మధ్యవర్తిత్వ తీర్పును ఒకవేళ అంగీకరించవచ్చనీ మీరు అనుకుని వుండవచ్చు. అయినా పైన తెలియచేసిన విధంగా, దేవాలయ హక్కుదార్లు తిరువాదాన్కూర్ ప్రభుత్వమే. ఆ ప్రభుత్వం, మహాత్మాజీ అభిప్రాయాన్ని అంగీకరించి నడుచుకోవడానికి సిద్ధంగా వున్నట్లయితే, మేము నిమ్నజాతి ప్రజల ప్రతినిధులు అన్న ధోరణిలో మీ సలహాను సవినయంగా, సగౌరవంగా అంగీకరించడానికి సిద్ధంగా వున్నాము. అయితే అంతవరకు ఈ పోరాటాన్ని కొనసాగించడం తప్పవేరే దారిలేదు.

మేము కొన్ని రోజులపాటు సత్యాగ్రహం నిలిపివేసే విషయంగా మీకు తంతి పంపాము కదా? ప్రస్తుతం ఇక్కడి పరిస్థితులు సానుకూలంగా కనిపించడంవల్ల రేపు ఏప్రిల్ ఏడో తేదీ సోమవారం మళ్లీ సత్యాగ్రహం ప్రారంభిస్తాము.

త్వరలో నన్నూ, నాతో కృషిచేస్తున్న మరికొందర్ని ఖైదు చేయవచ్చునని భావిస్తున్నాను. మిస్టర్ జార్జ్ జోసఫ్ ప్రస్తుతం ఇక్కడ వున్నారు. ఆయన నాయకత్వంలో ఈ పోరాటం మరింత శక్తివంతంగా ఉత్సాహంగా జరగగలదని దృఢంగా నమ్ముతున్నాను. వారు ఇక్కడ వున్న పరిస్థితుల గురించి అప్పుడప్పుడు మీకు తెలియజేస్తారు. మీ ఆశీస్సులు అర్థిస్తున్నాము.

ఎప్పుడూ విశ్వసనీయమైన
కె.పి. కేశవమీనన్.

వర్ణాశ్రమ హిందువుల సభకు వెళ్లి, నిమ్నజాతుల వారికి న్యాయం కల్పించాలని మొరపెట్టాను. వారికి ఆలయవీధులలో నడిచే హక్కును కల్పించడానికి విజ్ఞప్తి చేసే బాధ్యత వారికి వుందనీ, ఈ సదవకాశాన్ని వారు ఉపయోగించుకోవాలని వారికి వివరించాను. దానికి మంచి ఫలితం లభించిందని చెప్పే ధైర్యం నాకులేదు. శిబిరానికి తిరిగివచ్చిన తర్వాత తక్కిన వారిని సంప్రదించి మర్నాడు సత్యాగ్రహం ప్రారంభించాలని తీర్మానించాము.

టి.కె. మాధవన్, నేను, ఆ రోజు సత్యాగ్రహానికి సిద్ధమయ్యాము. సత్యాగ్రహం జరుగనున్నదని తెలుసుకున్న ప్రజలు ఆలయం దగ్గర వీధుల్లో గుమిగూడారు. శిబిరంనుంచి బయలుదేరి మేము వీధి దగ్గరకి వచ్చాము. మిగతావారిని విడిచి నేను, మాధవన్ ఆలయం సన్నిధివీధిలో నడిచాము. కొంత ముందుకు నడిచాక, అధికారులు మమ్మల్ని ఖైదు చేసి పోలిసు శిబిరానికి తీసుకువెళ్లారు. మధ్యాహ్నం భోజనం తర్వాత న్యాయస్థానంలో న్యాయవిచారణ ప్రారంభమయింది.

మేజిస్ట్రేటు శ్రీ అండిపిళ్లై సమక్షంలో విచారణ జరిగింది. అంటరానివారిని దేవాలయ సన్నిధివీధిలో నడవడానికి మేము పురికొల్పామనీ, అలా వాళ్లు నడిచినట్లయితే అది అగ్రజాతి హిందువులలో కొందరికి ఆగ్రహం తెప్పించి, కొందరిని అలజడికి పురికొల్పుతోందన్నదే సాక్ష్యాలసారం. నేను, మాధవన్ సాక్షుల్ని 'క్రాస్‌ఎగ్జామిన్' చేయలేదు. న్యాయస్థానం ముందు నేను ఇదే నొక్కిచెప్పాను.

జిల్లా మెజిస్ట్రేటు ఆనతి ప్రకారం, నిషేధించబడ్డ ఆలయ వీధిలో నిమ్నజాతులవారని చెప్పబడే ఈళవర్, పులైవర్ మొదలైనవారు నడవడానికి నేను పురికొల్పానన్నది ముమ్మాటికీ నిజం. ఆ ఉత్తర్వు వుండేంత వరకు, వారు మరింత ఉత్సాహంతో దానికి అధిగమించాలని ప్రోత్సహిస్తాను. అగ్రజాతి

హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు ఆ వీధుల్లో రాకపోకలు సాగించడానికి హక్కు వుందంటే 'అంటరానివార'న్న కోవకి చెందినవారికి కూడా ఆ హక్కు కల్పించడానికి మేము ప్రయత్నిస్తున్నాము. మా లక్ష్యాన్ని గురించి కొందరికి దురభిప్రాయం ఏర్పడివుంది. అంటరానివారిని ఆలయం లోపలికి తీసుకువెళ్లే ఉద్యేశ్యం మాకులేదనీ, మామూలు వీధుల్లో నడిచే హక్కును కోరుతున్నామనీ ఇక్కడ వివరణ చెబుతున్నాను. చాలాకాలంగా అడుగుతున్నప్పటికీ, వినతి పత్రాలు పంపినప్పటికీ, అనుమతి లభించకపోవడంవల్ల ఈ హక్కును సత్యాగ్రహం ద్వారా పొందగలమని మేము నమ్మాము. ఆ నమ్మకంతో మేము అనుభవించనున్న శిక్ష, ఈ దురాచారాన్ని కేరళనుంచి నిర్మూలించడానికి దోహదం చేస్తుందంటే అంతకన్న మించిన ఆనందం మరొకటి లేదు'

విచారణ ముగిసిన తర్వాత కోర్టువారు మాకు తలొక అయిదు పందల రూపాయలు జరీమాన విధించారు. మేము అందుకు సిద్ధంగా లేక పోవడంతో ఆరునెలలు సాధారణ జైలు శిక్ష విధించారు.

శిక్షకు పైవారికి అప్పీలు చేయమన్న విషయం కూడా అప్పుడే మెజిస్ట్రేటుకు తెలియజేశాము. అప్పీల్ చేసేట్లయితే అది పూర్తయ్యేవరకు కోట్టమం సబ్‌జైలులో వుంచడమే ఆనవాయితీ. అది లేకపోవడంతో, ఆ రోజే మమ్మల్ని తిరువనంతపురం జైలుకు తీసుకు వెళ్లడానికి తీర్మానించారు. మూడుగంటలకు నేనూ, మాధవన్, ఒక సబ్‌ఇన్‌స్పెక్టరు కార్లో తిరువనంతపురం బయలుదేరాము. కోట్టయంలో కొంతసేపు ఆగిన తర్వాత రాత్రి పదిగంటలకు మేము తిరువనంతపురం చేరుకున్నాము.

# బూజప్పురలో సుఖవాసం

తిరువనంతపురం నుంచి మూడు మైళ్ల దూరంలో బూజప్పుర అన్న ప్రదేశంలో ఒక గుట్టమీద సెంట్రల్ జెయిల్ వుంది. ఆ గుట్టపైనుంచి చూస్తే, నగరం యొక్క సుందరమైన దృశ్యాలు చూడవచ్చు. వరుసలు వరుసలుగా కనిపించే చిన్న చిన్న గుట్టలు, దూరాన కొబ్బరి తోటలు, కనుచూపు మేరలో అందమైన భవనాలు, దగ్గరలో ఓ చిన్న ఏరూ, ఆ వాతావరణంలోని ప్రశాంతత, ఆ ఆనందం వర్ణనాతీతం.

తిరువనంతపురం చేరగానే మేము మొట్టమొదట సూపరింటెండెంట్ శ్రీ పోతన్ బంగళాకు వెళ్లాము. అక్కడ టీ తీసుకున్న తర్వాత జైలుకు వెళ్లాము. సూపరింటెండెంట్ మాతో వచ్చారు. చెరసాల తలుపులకు కుడివైపున వున్న కట్టడాలను మాకు కేటాయించారు. జైలరు నీలకంఠపిళ్లై ఇంటినుంచే మాకు ఆ రోజు భోజనం వచ్చింది. అందులో పప్పు నుంచి పాయసం వరకు అన్ని వున్నాయి. ఆరు నెలల వరకు మేము అనుభవించనున్న సుఖాలకు అది సూచనలా అనిపించింది. చుట్టూ విశాలంగా వున్న ఒక గదిలో మాధవన్‌కూ, నాకూ నిద్రపోడానికి మంచాలు వేసివుంచారు. స్నానంగది, వ్రాసుకోవడానికి, చదువుకోవడానికి సౌకర్యంగా వున్న చోటు, నడవడానికి వరండా వున్నాయి. ఆయా సమయాలకు తగినట్లుగా మంచి భోజనమే లభించింది. మా అవసరాలను గ్రహించి వెనువెంటనే సమకూర్చడానికి సూపరింటెండెంట్ పోతన్, జైయిలర్ నీలకంఠపిళ్లై, డిప్యూటీ జైయిలర్ రామకృష్ణయ్యర్ చాలా శ్రద్ధ కనబరిచారు.

వార్తా పత్రికలు, పుస్తకాలు మాకు తెచ్చి యిచ్చారు. బంధువులకు మిత్రులకు, ఉత్తరాలు వ్రాయడానికి, వారి దగ్గరి నుంచి వచ్చే ప్రత్యుత్తరాలను తీసుకోవడానికి కూడా అనుమతించారు. ప్రతిరోజు నిర్ణీత సమయాలలో మమ్మల్ని కలుసుకోవడానికి వచ్చే వారితో మాట్లాడడానికి ఎలాంటి అడ్డులేదు. చెరసాల నుంచి వెలుపలికి వెళ్లడానికి వీలుకాదన్న ఒక్క కొరత తప్ప మిగతా దైనందిన వసతులు అన్నీ సులభంగానే లభించాయి. అయినప్పటికీ నాలుగు వైపులా నిలబడిన ప్రహరీగోడ, మా అస్వతంత్రతను జ్ఞాపకం చేస్తూ వచ్చింది.

మాధవన్, నేను సెంట్రల్ జైయిల్‌కు వచ్చి రెండురోజులు గడిచిన తర్వాత మొట్టమొదటిసారిగా శిక్షపొందిన కుంజప్పిని, బాహులేయిన్‌నూ, గోవింద ఫణిక్కర్‌నూ, అక్కడికి రాగా చూశాము. వైక్కంనుంచి తిరువనంతపురంవరకు వాళ్లను నడిపించే తీసుకువచ్చారు. వాళ్ల ముగ్గుర్నీ మామూలు ఖైదీలు వుంచే చోటికి తీసుకువెళ్లారు. ఇంకా రెండు రోజులు గడచిన తర్వాత ఏ.కె.పిళ్లై, కె.కేళప్పన్, వేలాయుధమీనన్, టి. ఆర్. కృష్ణస్వామి అయ్యర్ మొదలైనవారు మాకు ఎదురుగా వున్న సివిల్‌వార్డుకు వచ్చారు. ఒక వారం తర్వాత జార్జ్ జోసఫ్ కూడా అక్కడికి వచ్చారు. ఆయన్ను మాతో వుంచారు. హైందవేతరులు సత్యాగ్రహంలో పాల్గొనడం ఉచితమా? అన్న విషయం మీద ఆ సమయంలో పత్రికలలో వాదోపవాదాలు చెలరేగాయి.

జార్జ్‌జోసఫ్ లబ్ధ ప్రతిష్ఠులైన దేశ నాయకులు. వేదిక ఉపన్యాసాలలోనూ, పత్రికా రంగంలోనూ ప్రసిద్ధులైన జోసఫ్, సహాయ నిరాకరణోద్యమం ఆరంభ దినాల్లలోనే అందులో చేరారు. అంతకుముందు కూడా ప్రజా జీవితంలో మనఃపూర్వకంగా పాల్గొన్నవారు. ఆయన ఎన్నోసార్లు జైలుశిక్ష అనుభవించారు. మహాత్మాగాంధి చెరసాలలో వున్నప్పుడు ఆయన 'యంగ్ ఇండియా' వార్తాపత్రిక సంపాదక బాధ్యతలను కొంత కాలంపాటు జార్జ్ జోసఫ్ నిర్వహించిన వారు.

సత్యాగ్రహ ఖైదీలను మూడు రకాలుగా విభజించి వుంచారు. మేమందరం ఒకే లక్ష్యం కోసరమే ప్రయత్నించాము. ఒకే కార్యం కోసరమే జైలు శిక్ష అనుభవిస్తున్నాము. అలా వున్నప్పుడు మాలో కొందరికి ప్రత్యేకమైన వసతులు కల్పించడం, మాతో ఒకటిగా కలిసి కృషి చేసిన కొందరికి మామూలు ఖైదీలకు లభించే కనీస సౌకర్యాలు కూడా తిరస్కరించడం చూసినప్పుడు అదో నిజాయితీ రహితమైన ఏర్పాటుగా అనిపించింది. ఈ లోపాన్ని సూచిస్తూ సూపరెంటెండెంట్ పోతన్‌కు మేము ఒక ఉత్తరం పంపాము.

ఆ ఉత్తరం పోతన్‌ను ఆశ్చర్య పరచింది. దాని వివరాలు పైవారికి తెలియజేశారు. కొన్నాళ్లు గడిచిన తర్వాత ఇతర సత్యాగ్రహకులకు కూడా మాకు వున్న సౌకర్యాలు కల్పించడానికి తీర్మానించబడింది. ఈ విధంగా మా జైలు శిక్షను అందరం ఒకటిగానే గడిపాము.

తెల్లవారుఝామున స్నానంచేసి కాఫీ తీసుకున్న తర్వాత రెండు గంటలసేపు వ్రాసేవాణ్ణి. హెచ్. డి. వెల్స్ 'ప్రపంచ చరిత్ర'ను ఆధారంగా తీసుకుని మలయాళంలో అలాంటి ఒక చరిత్రను వ్రాయడానికి పూనుకున్నాను. అయితే కొంత వ్రాసేనుగాని పూర్తి చేయలేదు. నాకు కావలసిన పుస్తకాలు తిరువనంతపురం గ్రంథాలయం నుంచి లభించాయి.

'తళైగళిలిరుందు' అన్న పుస్తకాన్ని చెరసాలలో వున్నప్పుడే వ్రాశాను. భోజనం చేశాక కాసేపు విశ్రాంతి తీసుకుని ఏవైన పుస్తకాలు చదివేవాణ్ణి. సాయం సమయాలలో అలవాటు ప్రకారం ప్రార్ధనా, సమావేశాలు జరిపేవాళ్లం. కృష్ణస్వామి అయ్యర్, అష్టపది పాడేవారు. మరికొన్ని భక్తి గీతాలు కూడా ఆయన ఆలపించేవారు. రాత్రి తొమ్మిదింటికి పడక - ప్రతిరోజూ కార్యక్రమాలు ఇవి.

చెరసాలలో ఎలాంటి ఇబ్బందీ లేనప్పటికీ నా కుటుంబ పరిస్థితులు ఆలోచించి చాలా సందర్భాలలో బాధపడ్డాను. వాళ్లూ దైనందిన జీవితంలో ఖర్చులకు లేకుండా కష్టపడతారు, అన్నది మాత్రమే కాదు నా దిగులు. నాలక్ష్యం సిద్ధాంతాలపట్ల ఏ మాత్రం సానుభూతి చూపలేని నా బంధువులు కొందరు సూటి పోటీ మాటలతో మా వాళ్లను వేధిస్తారన్న బాధ నన్ను మరింత దిగులుకు గురి చేసింది. నాకు ఓదార్పుగా 'అలా ఏమీలేదు' అంటూ లక్ష్మి నాకు ఉత్తర వ్రాసింది కాని నా ప్రియసతి అప్పటి పరిస్థితి, అనుభవాలు నేను బాగా గ్రహించాను. నన్ను ఖైదు చేసిన కొన్నాళ్లకు లక్ష్మి నాకు ఉత్తరం వ్రాసింది (16-4-24) 'అరెస్టు' చేయడం గురించి మితిమీరిన వేదనతో ఆపద ముంచుకొచ్చినట్లు నేను అనుకోనేలేదు. మొదట మీకు వ్రాసే ఉత్తరాన్ని తిరువనంతపురం జైలుకు వ్రాస్తానని నేను కలలో కూడా అనుకోలేదు అని నేను ముందు చెప్పిన కారణాలవల్ల వ్రాయలేదు. బ్రిటీష్ ప్రభుత్వం మూడు సంవత్సరాలుగా పలువిధాలుగా ఖైదు చెయ్యడానికి ప్రయత్నించి వీలుకాలేదు. ఆ పరిస్థితిలో తిరువితాంగూర్ ప్రభుత్వం, ఇంత త్వరలో దీనిని సాధించడం తలచుకుని ఆశ్చర్యపడుతూన్నాను. ఆ తొలి ఉత్తరంలో ఆ విషయాన్నే వ్రాశాను'.

ఉంగరాన్ని చిన్నన్ తీసుకొచ్చి యిచ్చారు. (నన్ను ఖైదు చేయడానికి ముందు రోజు నా చేతిలో వున్న వుంగరాన్ని నా సోదరుడు చిన్నన్ ద్వారా నేను లక్ష్మికి ఇచ్చిపంపాను.) ఉత్తరం చదివిన చాలాసేపు తర్వాతే దానిని ఇచ్చాడు. ఉంగరాన్ని చూడగానే నాకు కలిగిన శోకాన్ని అనుభవిస్తేనే తెలుస్తుంది. వ్రాయడానికి వీలుకాదు. ఉంగరాన్ని పెట్టెలో పెట్టడానికి మనసులేదు. నా వ్రేలికి ధరించాను. దానిని చూస్తూ వుండటమే అప్పటికీ నాకు ఓదార్పు.

'ఆఫీసునుంచి వచ్చేప్పుడు, భోజనం చేయడానికి కూర్చునేప్పుడు, టీ కలిపేప్పుడు నాకు చెప్పలేనంత విషాదం ముంచుకొస్తుంది. స్నానంచేయడానికి, మరికొన్ని నిత్యావసర సౌకర్యాలకు తక్కువలేదు. అని వ్రాయడం ఎంతో ఓదార్పు కలిగిస్తోంది. నాకు అక్కడికి వచ్చి మిమ్మల్ని చూడాలని చాలా ఆశగా వుంది. నేను మాత్రం విధిగా రావడానికి పిల్లలు వదులుతున్నారా? నేను, వాళ్లూ

వస్తామంటే డబ్బు ఖర్చు ఎక్కువవుతుందికదా? అందుకు కావలసినంత డబ్బు మనకు వుందా?

'నేను మాత్రం ప్రత్యేకంగా వచ్చి మిమ్మల్ని చూస్తే మిమ్మల్ని వదిలి ఒంటరిగా తిరిగి వెళ్లే ధైర్యం నాకు వుందా?'

ఈ ఉత్తరంలోని మరొక భావాన్ని కూడా ఇక్కడ వివరిస్తాను. కె.ఎం ఫణిక్కర్ వైక్కం సత్యాగ్రహంలో ప్రముఖ పాత్ర వహించారు. ఫణిక్కర్ దగ్గరి నుంచి వచ్చిన ఉత్తరం గురించే ఉత్తరం చివరి భాగం తెలియచేసింది.

'కె.ఎం. ఫణిక్కర్ ఉత్తరం అందింది. మిమ్మల్ని ఖైదుచేసిన సంగతి గురించి విచారపడకూడదని, మన కష్టాలు అన్నీ బాగా ఎరిగివున్నారనీ, అమృతసర్‌లో చిక్కుకుపోవడంవల్ల వైక్కం సత్యాగ్రహంలో పాల్గొనలేకపోయిందనీ, ఏదైన సహాయం కావలసివస్తే వివరంగా తెలియచేయమని, సంకోచించవద్దని వ్రాసివున్నారు.'

నా పెద్దకూతురు చెల్లమ్మాళ్ కూడా నాకు తరచూ వ్రాస్తువుండేది. ఆమె ఉత్తరాల ద్వారా ఆ రోజులలో వైక్కం సత్యాగ్రహం గురించి కొందరి అభిప్రాయాలు తెలుసుకోవడానికి వీలయింది. 1924 వ సం॥ మే పదిహేనవ తేది ఆమె వ్రాసిన ఉత్తరంలో చెబుతుంది.

'రెండు రోజులకు ముందు ఇక్కడ వచ్చివున్నాడు. నాన్న ఇందులో పాల్గొనకుండా వుండవలసింది అని చెప్పాడు. నేను వాడితో కొంతసేపు వాదించాను. మిగతా వాళ్లందరూ వివరంగా చెబితే అర్థం చేసుకుంటున్నారు. అతడు మాత్రం ఎంతచెప్పినా ఒప్పుకోవటం లేదు. ప్రతిదానికి అపశకునంగానే మాట్లాడుతున్నాడు. వైక్కం పరిస్థితే ఇలా అయితే ఇక అన్నీ సక్రమం కావడానికి కొంతకాలం పడుతుందని కొందరి అభిప్రాయం. నాన్నగారు ఏమనుకుంటున్నారు? నేను నాన్నగారి ప్రతి ప్రయత్నంలోను విజయం సాధించాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను.'

అప్పట్లో చెల్లమ్మాళ్‌కు పదిహేనేళ్లు అక్కడికి వచ్చి రెండు నెలలు గడిచాక మా ఆవిడ, కూతురు, ఆఖరి కూతురు లీల నన్ను చూడడానికి పాల్‌ఘాట్ నుంచి తిరువనంతపురంకి వచ్చారు. నేను చాలా రోజులుగానే వారి రాకకోసం ఎదురుచూస్తున్నాను. సూపరింటెండెంట్ కార్యాలయంలోనే వారిని నేను కలుసుకున్నాను. అక్కడికి మెట్లెక్కి వెళ్లగానే మా చిన్న అమ్మాయి లీలను ఎత్తుకుని కౌగిలించుకున్నాను. అప్పుడు నేను జైలులో వున్నానన్న భావనే నాకు లేదు. సూపరింటెండెంట్ అప్పుడు ఒక చిన్న నవ్వుతో 'మీరిప్పుడు జైలులోవున్నారు.' అని జ్ఞాపకం చేసినప్పుడే తగని పనిచేశానని నొచ్చుకున్నాను. రెండు గంటలసేపు వాళ్లు నాతో గడిపారు. కొంతసేపు

అలావుండి వాళ్ళు వెళ్లేప్పుడు వాళ్ళు రాకుండా వుండి వుంటేనే బావుండేదనిపించింది.

ఒక రోజు మధ్యాహ్నం భోజనానికి కూర్చున్నప్పుడు జైలులోనే కొద్దిదూరంలో రహస్యంగా ఒక శబ్దం నా చెవిలో పడింది. కొరడా ఎవరినో కొట్టేచప్పుడు. వెనువెంటనే వేదనాభరితమైన కేకలు వినడానికి సహించలేరు. ఒక ఖైదీని ఏదో కారణం కోసరం మోకాళ్ళు కట్టి కొట్టే శబ్దం అది. కొందరు సంఘ ద్రోహులకు, దుష్టకృత్యాలు చేసిన వారికి అలాంటి దండన విధిస్తారనడం సరే. అయితే వాళ్ళ చేతులు కట్టేసి ఒక మనిషిని పెద్ద కొరడాతో కొట్టే అలవాటు నిలిపివేయాలని నాకు ఆవేళ అనిపించింది. మరే దండనకు లొంగని కొందరు ఖైదీలకు దెబ్బలే సరైన శిక్ష అని సమాధానం చెబుతారు. మన చెరసాలలు ఇంకా దండన ఇవ్వడానికి తగిన గృహాలుగానే ఇంకా వుంటున్నాయి. పాశ్చాత్యదేశాలలో ఇందులోనూ కొన్ని ప్రయోగాలు, పరిశోధనలు జరుపుతున్నారు అవి చెప్పుకోదగ్గవి. నిజాయితీ లేకుండా పనులుచేసే గుణమే ఒక వ్యాధి. దానికీ మిగతా వ్యాధుల్లాగే ప్రత్యేకంగా చికిత్స జరపాలి. ఈ నిజాన్ని దృష్టిలో వుంచుకొని చేసే సంస్కరణలు మన జైళ్లలో కూడా ఆచరణకు రావాలి.

ఈకాలంలో వైక్కం సత్యాగ్రహం అఖిల భారత ప్రసిద్ధిగాంచింది. తమిళనాడు నుంచి ఇ.వి. రామస్వామినాయకర్ వైక్కం వచ్చి సత్యాగ్రహం జరిపి తిరువనంతపురం జైలుకు వచ్చారు. ఎన్. శ్రీనివాస అయ్యంగార్, స్వామీ శ్రద్ధానంద, మొదలైన నాయకులు మమ్మల్ని చూడడానికి జైలుకు వచ్చారు. పంజాబు నుంచి ఒక అకాలీల సంఘం వైక్కం వచ్చింది. చూపరులకు ఇతరులకు వాళ్ళు అక్కడ సహపంక్తి భోజనశాల నడిపారు. భారతదేశం పలు ప్రాంతాలు నుంచి ప్రతిరోజు లెక్కలేనంతమంది చూపరులు వైక్కం రాసాగారు. పోలీసువాళ్ళు సత్యాగ్రహం చేసే వాళ్లను ఖైదు చేయడం మానేశారు. అయితే వాళ్ళు సత్యాగ్రహుల చుట్టూ నిలబడడం ప్రారంభించారు. రెండు రోజులు నిరాహారదీక్ష జరిపి స్పృహ తప్పి పడిపోయిన సాత్తుక్కట్టి నాయర్‌ను డాక్టర్ల సహాయంతో ఆస్పత్రికి తీసుకెళ్లారు. ఆ దృశ్యం ప్రజలకు ఉద్రేకాన్ని కలిగించింది. ఆ సంఘటన వైక్కం సత్యాగ్రహానికి కొత్త ఊపిరి నిచ్చింది. సహాయనిరాకరణోద్యమం నుంచి కాంగ్రెసులో చేరి సేవ చేస్తున్నవారు సాత్తుకుట్టినాయర్. ఎలాంటి క్లిష్ట పరిస్థితిలోనైనా సరే ఉత్సాహాన్ని వదలకుండా చిరునవ్వుతో కృషిచేయడానికి సిద్ధంగా వున్న వ్యక్తి సాత్తుకుట్టినాయర్. మరికొందరికి విధంగానే అయన్నూ కుటుంబానికి సంబంధించిన సమస్యలు - ప్రజాకార్యాలకు వదిలివేసి రావడానికి

ఆటంకాలుగా నిలిచాయి. అయినప్పటికి ఇంకా క్లిష్టమైన పరిస్థితులలో సైతం కాంగ్రెసుకు సహాయం చేయడానికి సిద్ధంగా వచ్చేవారు. దానికి కావలసిన శక్తి సాత్తుకుట్టినాయర్‌కు వుంది.

సత్యాగ్రహులకు, అధికారులకు మధ్య ఏవిధమైన అవగాహన లేకుండా సత్యాగ్రహం కొనసాగింది.

ఆ కాల ఘట్టంలో ఎదురు చూడని విధంగా ఒక సంఘటన జరిగింది. తిరువాన్కూర మహారాజా శ్రీ మూలం తిరునాళ్ కాలం చేశారు. చిత్తిరై తిరునాళ్ మహారాజుకు వయసు చాలకపోవడంవల్ల, మహారాణి సేతు లక్ష్మిబాయి పరిపాలనా బాధ్యతలు స్వీకరించారు. కీర్తిశేషులైన మహారాజాకు సంతాప సూచకంగా సత్యాగ్రహ ఖైదీలను విడుదల చేయడానికి తీర్మానించారు.

మమ్మల్ని జైలునుంచి విడుదల చేయనున్నారని ఒకరోజు ఉదయమే తెలుసుకున్నాం. ఐదు నెలలు సుఖంగా గడిపిన ప్రదేశాన్ని వదలి వెళ్లాలంటే బాధ కలుగక పోలేదు. సూపరింటెండెంట్ పోతన్‌ను, చెరసాలలోని ఇతర అధికారులను చూసి, గౌరవంగా వాళ్లు మాతో వ్యవహరించి, కావలసిన సౌకర్యాలన్నిటిని కల్పించి, జైలువాసాన్ని తియ్యటి అనుభవంగా చేసినందుకు వారికి కృతజ్ఞతలు తెలియజేసి సెలవు తీసుకున్నాము. ఉదయం అల్పాహారం తర్వాత చెరసాల నుంచి బయలుదేరాము. సత్యాగ్రహ కాలంలో మాకు సహాయం చేసిన శ్రీ కె.జి. కుజ్జు కృష్ణ పిళ్లైతో కలిసి మధ్యాహ్నం భోజనం చేశాము. నేను ఆ రోజే వైక్కం బయలుదేరాను. మాకు స్వాగతం పలికే విధంగా వైక్కంలో ఏర్పాటు చేసిన బహిరంగ సభలో పాల్గొన్నతర్వాతే, మరురోజు నేను కుటుంబ సభ్యుల్ని కలుసుకోవడానికి పాల్‌ఘాట్‌కు వెళ్లాను.

మమ్మల్ని చెరసాలనుంచి విడుదల చేసినప్పటికీ, వైక్కం పోరాటం పూర్తి కాలేదు. పోరాట కార్యచరణ మాత్రం అప్పుడప్పుడూ మారుతూ వచ్చింది. ఓ సందర్భంలోనే మహాత్మాగాంధీ వైక్కం విజయం చేశారు. ఆయన అక్కడ పలువురితో చర్చలు జరిపిన తర్వాత అధికారులు తమ ధోరణిని సడలించడానికి ఒప్పుకున్నారు. క్రైస్తవులు, మహమ్మదీయులు, నడిచే ఆలయంముందు వీధులలో జాతిభేదాలు చూపకుండా హిందువులందరూ నడిచే హక్కు ఇవ్వవచ్చునని తీర్మానించారు. అయితే అగ్రవర్ణులైన హిందువులు మాత్రమే ప్రవేశించడానికి అర్హులైన ఆలయ సరిహద్దులలో - నిమ్నవర్గాలవారు ప్రవేశించాలని సత్యాగ్రహులు పట్టుపట్టరాదన్నారు. దాని ఫలితంగానే నిమ్నజాతుల రాక పోకలను నిషేధించే నోటీస్ బోర్డును అక్కడ

నుంచి తొలగించారు. సత్యాగ్రహాన్ని ఆపాము. వైక్కం సత్యాగ్రహం లక్ష్యంగా వున్న సమస్యలో ఒక భాగం పరిష్కరించామేగాని, అస్పృశ్యతా దురన్యాయాన్ని పూర్తిగా రూపు మాపలేకపోయాము. గాంధీజీ సలహాలమేరకు, మా లక్ష్య సాధనకై ప్రయత్నాలు ఆ తర్వాత కూడా కొనసాగించాము.

వైక్కం నుంచి తిరువనంతపురం వెళ్లడానికి, త్వరలో నిమ్నజాతుల వారు లేని ఒక హిందువుల బృందం పాదయాత్ర చేయాలని తీర్మానించాము. మందత్తుపద్మనాభ పిళ్లై, ఎ.కె. పిళ్లై, ఎం.ఎన్.నాయర్, సంగనాచ్చేరి పరమేశ్వరన్ పిళ్లై మొదలైన నాయకులు ఉత్సాహంగా నిలబడి నడిపించిన పాదయాత్రకు దారి పొడువునా ప్రజలు ఉద్వేగపూరితంగా స్వాగతం పలికారు. దారిలో అక్కడక్కడా బహిరంగ సభలు, ఏర్పాటు చేశారు. ఒక్కొక్కచోట యాత్రికులు వచ్చేప్పుడు అక్కడ వారితోపాటు మరికొందరు కొత్తవాళ్లు చేరేవారు. జెండా పట్టుకుని, గీతాలు ఆలపిస్తూ నినాదాలు చేస్తూ యాత్ర చేసిన ఆ బృందం - అస్పృశ్యతా రాక్షసునితో యుద్ధానికి సిద్ధమైన పెద్ద సేనగా కనిపించింది. అదేవిధంగా మరొక బృందం డాక్టర్ నాయర్ నాయకత్వంలో నాగర్ కోయిల్ నుంచి బయలుదేరింది. తిరుంనంతపురం సముద్రతీరంలో ఏర్పాటు చేసిన పెద్ద బహిరంగ సభలో అస్పృశ్యతను సమూలంగా నాశనంచేసే చర్యలు తీసుకోమని పాలకులను కోరుతూ తీర్మానించాము.

సంగనాచ్చేరి పరమేశ్వరన్ పిళ్లై నాయకత్వంలో వర్ణాశ్రమ హిందువుల ఒక ప్రతినిధి బృందం, మహారాణిని చూసి దాదాపు ఇరవై అయిదువేలమంది సవర్ణ హిందువులు సంతకంచేసిన వినతి సమర్పించింది. ఈ సంఘటనలన్నీ కూడా అస్పృశ్యతా నివారణ విషయంలో నూతనోత్సాహాన్ని, వేగాన్ని ఏర్పరచాయి.

వైక్కం సత్యాగ్రహం, పలుదశలలో ఇరవై నెలలపాటు కొనసాగింది. అది కేరళలో మాత్రమే కాకుండా భారతదేశంలో వివిధ ప్రాంతాలలోనూ అస్పృశ్యతను నివారించి, నిమ్నజాతి ప్రజల ప్రేమను పొందడానికి పునాదిగా ఏర్పడింది. నూతన సమాజ సృష్టికి కావలసిన పరిస్థితులకు ఏర్పరచింది. హృద్యమైన కేరళ కాంగ్రెస్ ఉద్యమ చరిత్రలో అది ఉద్వేగ పూరితమైన అధ్యాయం.

# ఎదురుచూడని కష్టాలు

'ప్రజా జీవితంలో పాల్గొనేవారికి కొన్ని సందర్భాలలో పూమాలలు లభించవచ్చు; అయితే ఎక్కువగా వారికి కష్టాలే ఎదురవుతాయి. అయితే అది యితరులకు తెలియదు' అని గోపాలకృష్ణగోఖలే ఒకసారి చెప్పారు. ఆయన చెప్పిన ఆ మాటలను నిరాశ ఎక్కువయినపుడల్లా నేను తలచుకునేది కద్దు. ప్రజాజీవితం సుఖ జీవితం కాదన్నదని నాకు తెలుసును కాని వివరించలేని ఒక శక్తి నన్ను ప్రజాజీవితంవైపు ఆకర్షిస్తూ వుండేది.

జైలునుంచి విడుదల అయిన నేను ఊరు వచ్చినపుడు నా భార్య; బంధువులతో తనకు ఎదురైన అనుభవాలను గురించి చెప్పింది. 'ఎంత ఉన్నతమైన స్థితికి రాగలవని మేము ఆశించాము. ఎంత ఖర్చు చేసి చదివించి వున్నారు. అయితే జైలుకు వెళ్లిరానున్నారని విన్నాం. భార్య పిల్లలు అన్న బాధ్యత కొంచెమైనా వుందా? వీళ్లందరిని ఎవరు కాపాడగలరని ఇలా బయలుదేరాడు? అన్న ధోరణిలో కటువైన మాటలు వినని రోజులేదని చెప్పి బాధపడింది. ఖర్చుకు పైకం కావలసివస్తే వాళ్లను ఆశ్రయించేకదా తీరాలి? ఓదార్పు చెప్పడానికి ఎవరూ లేరు. ప్రజాసేవకు పూనుకున్నవారి త్యాగం గురించి మనం మాట్లాడుతాము. అయితే వారి కుటుంబ సభ్యులు చేసే త్యాగాన్ని మనం జ్ఞాపకముంచుకుంటామా? వాళ్లే కదా గొప్ప త్యాగం చేసే వాళ్లు.

1921వ సం॥ ప్రారంభంలో సహాయ నిరాకరణోద్యమంలో చేరడానికి వృత్తిని వదిలిపెట్టి నేను కోళిక్కోడ్ వెళ్లినప్పుడు కొన్ని రోజులకు మాత్రమే చాలిన డబ్బు నా దగ్గర వున్నది. డబ్బు పట్ల జాగ్రత్త వహిస్తూ క్రమబద్ధంగా ఖర్చు చేసే అలవాటు నాకు లేదు. డబ్బును పొదుపు చేయాలనే ఆలోచనే నాకు కలుగలేదు. అందువల్ల నేను చాలాసార్లు కష్టపడ్డాను. అప్పుడల్లా కొన్ని రోజులు లెక్కరాయడం, అణాపైసలు లెక్కపెట్టడం, రానున్న ఖర్చులు గురించి పథకం ప్రకారం ఖర్చు చేయడం గురించి కొన్ని రోజులు శ్రద్ధగా వుండేవాణ్ణి. అయితే కొన్నాళ్లు తర్వాత మళ్లీ పాత ధోరణికి, లెక్కచేయనటువంటి స్థితికి వచ్చేసే వాణ్ణి!

జైలు నుంచి వచ్చిన తర్వాత నేను డబ్బును ఎలా సంపాదించ గలననే దిగులు నాకు ఏర్పడింది. భార్యను, అయిదుగురు పిల్లలను సంరక్షించడానికి ఏది మార్గం? నాకు ఇంకా మరికొన్ని బాధ్యతలు వున్నాయే! ఇలాంటి సమస్యలు నన్ను కలచి వేసేవి. ఏదైనా ఒక మార్గం లేకుండా పోతుందా? అని నన్ను నేనే సముధాయించుకొనేవాణ్ణి.

వృత్తిని వదలి ప్రజా జీవితంలో పాల్గొనడానికి వచ్చిన వారికి సహాయం చేయడం కోసరం కాంగ్రెసులో కార్యదర్శిగా వున్న జమ్నాలాల్ బజాజ్ ఒక లక్ష రూపాయలు కేటాయించారు. ఆ నిధి నుంచి ప్రతి నెలా వంద రూపాయలకు తగ్గకుండా ఒక మొత్తం నాకు అందుతూ వుండేది. గాంధీజీ విడిగా నాకు ప్రతినెలా వందరూపాయలు పంపుతూ వుండేవారు. దాదాపు ఒక సంవత్సరం ఆ డబ్బుతోనే కాలం గడిపాను. 1922వ సం॥ మార్చి నెలలో గాంధీజీ ఖైదుఅయిన తర్వాత అవన్నీ మారిపోయాయి. బజాజ్ నిధిలోని మొత్తం అయిపోయింది. గాంధీజీ నాకు పంపుతున్న డబ్బు కూడా ఆయన చెరసాలకు వెళ్లిన తర్వాత రెండు, మూడు నెలలు మాత్రమే లభించింది. తర్వాత అది కూడా రాలేదు. సంపాదన లేదు, ఖర్చులు ఆపడానికి దారిలేదు; అత్యవసరమైన దైనందిన అవసరాలను పూర్తి చేయకుండా వుండనూ వీలులేదు. బియ్యం కొనడానికి అర్థరూపాయి చేతిలో లేకుండా అవస్థ పడ్డ సందర్భాలు ఎన్నో.

ఆ రోజులలో ఒకసారి ఎర్నాకుళంలో కేరళ ప్రదేశ కాంగ్రెస్ కమిటీ సభ సమావేశమయింది. కొన్ని ముఖ్యమైన విషయాలను గురించి చర్చించి తీర్మానం చేయడానికి ఏర్పాటు చేయబడిన సమావేశం అది. ఆ రోజులలో నేను ప్రదేశ కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిని. అందువల్ల సమావేశానికి పోకుండా వుండడానికి వీలులేదు. వెళ్లడానికి దారి ఖర్చులకు డబ్బులేదు. నా చేతిలో రెండు రూపాయలే వున్నాయి. దానిని నేను తీసుకువెళ్లినట్లయితే ఇంటి ఖర్చులకు అసలు వుండదు. దీనిని తలుచుకొని విచారిస్తున్నప్పుడు నాకొక ఆలోచన తట్టింది. కల్లాయిల్ నుంచి తిరుచ్చూర్‌కు టికెట్ కొనడానికి రూపాయి చిల్లరే అవుతుంది. మిగితావున్న చిల్లర నేను ఇంటికి ఇచ్చి పంపాను. కారూర్ నీలకంఠన్ నంబూద్రిపాద్, ఆ రోజులలో ప్రదేశ కమిటీలో సభ్యులు. ఆయన అదే బండిలో తిరుచ్చూర్ నుంచి ఎర్నాకుళం వస్తారు. తిరుచ్చూర్ చేరుకున్నట్లయితే అక్కడ నుంచి ఎర్నాకుళానికి నంబూద్రిపాద్‌ను టికెట్ కొనమని చెప్పవచ్చు నన్నది నా ఆలోచన. మంచి కాలం అది అలాగే జరిగింది. ప్రయాణ టికెట్ కన్నా మరో ముఖ్యమైన అవసరం వుంది. అదే కాఫీ. చేతిలో చిల్లర లేకపోవడంవల్ల ఉదయం

షొరానూర్‌లో కాఫీ తీసుకోలేక పోయాను. దానికి కూడా నంబూద్రిపాద్ విశాల హృదయాన్నే ఆశ్రయించ వలసివచ్చింది. ఎర్నాకుళం నుంచి కోళిక్కోడ్ కూడా ఆయనతోనే తిరిగి వచ్చాను.

ఢిల్లిలోనే, కలకత్తాలోనే, మరే ఇతర ప్రాంతాలలోనే, అఖిల భారత కాంగ్రెస్ కమిటి తరుచుగా సమావేశమయ్యేది. అక్కడికి వెళ్లాలంటే ఖర్చులు కూడా ఎక్కువగా అయ్యేవి. ఆ రోజులలో కేరళకు చెందిన ఏడెనిమిది మంది అఖిల భారత కమిటీలో సభ్యులు వుండేవారు. వారిలో చాలా మంది తమ సొంత ఖర్చుతో సమావేశాల్లో పాల్గొన లేనివాళ్లే. అలాంటి వాళ్లలో నేనూ ఒకణ్ణి. ఒక్కొక్కసారి అఖిల భారత కాంగ్రెస్ కమిటి సమావేశాల్లో పాల్గొనడానికి దాతృత్వ హృదయం కల మిత్రుల నెవరినైనా ఆశ్రయించవలసివచ్చేది. ఒకటి రెండుసార్లు సంతోషంగా సహాయం చేసేవారు. మళ్లీ, మళ్లీ వాళ్లను డబ్బులడిగి ఇబ్బంది పెడితే 'త్యాగులు ద్రోహులు' అని అనిపించక పోదు. మాకు వేరే మార్గంలేదు. అయినప్పటికీ మేము అడగలేదు - అని తిరిగి వచ్చిన సందర్భాలు లేవనే చెప్పాలి. ఈకాల ఘట్టంలో నాకు ఏర్పడ్డ మరో అనుభవాన్ని కూడా ఇక్కడ చెబుతాను.

ఇంటి ఖర్చుకు చేతిలో ఒక పైసాకూడా లేని ఒక రోజు నేను అలవాటు ప్రకారం 'మాతృభూమి' కార్యాలయానికి వెళ్లాను. ఇంటికి తిరిగి వెళ్లేప్పుడు చిల్లర డబ్బులు ఏవైనా తీసుకుని వెళ్లగలననే అనుకున్నాను. ఇంటినుంచి బయలుదేరేప్పుడు కూడా ఆ విధంగానే చెప్పివచ్చాను. కార్యాలయానికి వచ్చి పనులు చూస్తూన్నపుడు మధ్య, మధ్య డబ్బు గురించి ఆలోచన వచ్చేది. పోస్టు వచ్చినప్పుడు ఏదైన డబ్బు వచ్చిందా? అని అడిగాను. ఇరవై రెండు రూపాయలు వచ్చాయనీ, కాగితాలు, తపాళా బిళ్లలు కొనవలసిరావడంతో దానికి పోను మిగతా వున్నదానిని కంపోజిటర్లకు ఇచ్చినట్లు మేనేజర్ చెప్పారు. ఆ మాటలు వినడంతో నేను నిరాశ చెందాను. అయితే నేనెలా ఇంటికి తిరిగి వెళ్లగలను? మనసు వేదనతో తపించింది. దేవుని తలచుకుని ప్రార్థిస్తూ ఎలాగో మూడు గంటలసేపు పని కొనసాగించాను. మధ్యాహ్నం ఇంటికి వెళ్లే సమయమయింది. భోజనం సిద్ధంగా వుంటుందన్నదే అనుమానం. ఆ రోజు చాలా వేదనతో నిరుత్సాహంతో రిక్షాలో కూర్చున్నాను. అప్పుడే పోస్ట్‌మాన్ రావడం చూశాను. పోస్టు చూసి ఇంటికి వెళ్లదామన్న ఉద్దేశ్యంతో, మళ్లీ ఆఫీసులోకి అడుగుపెట్టాను. ఆ రోజు పోస్టులో ఒక కవరు విప్పడంతో అందులో వందరూపాయల నోటు, ఒక ఉత్తరం కనిపించాయి. 'మీకు చాలా కష్టంగా వుందని తెలుసుకున్నాను. ఆందోళన చెందకండి. డబ్బు ఇంకా వస్తుంది. ప్రస్తుతానికి దీనిని పంపుతున్నాను' అని ఉత్తరంలో వుంది. దానిని

ఎవరు పంపారన్నదీ అప్పటికి నాకు తెలియదు. అది ఆ తర్వాతే తెలుసుకున్నాను. ఆ ఉత్తరం చూడగానే నాకు కలిగిన సంతోషాన్ని, మనశ్శాంతిని ఎలా వివరించగలను? అందులో కొంతభాగాన్ని ఉపసంపాదకులకు, మిగతా పనిచేసేవాళ్లకు, మరికొన్ని అత్యావసరాలకని పంచియిచ్చాను. మిగిలిన దానిని తీసుకొని నేను ఇంటికి బయలుదేరాను. ఆ రోజు డబ్బు రాకపోతే నా పరిస్థితిని గురించి చెప్పనవసరం లేదు. అలాంటి పరిస్థితిలో డబ్బు పంపించాలనీ, ఆ మిత్రునికి ఎలా అనిపించిందనీ నాకు ఇంకా అంతుబట్టలేదు. అలాంటి అనుభవం నాకు ఒకసారి మాత్రమే జరగలేదు. ఆ మహాశక్తి మీద నమ్మకం మరీ, మరీ, పెరిగే విధంగా ఇలాంటి సంఘటనలు ఎన్నో! నేను పూర్తిగా దిక్కులేని వాణ్ణి కాదని చాలా క్లిష్ట పరిస్థితులలో ఆ పరాశక్తిని శరణుజొచ్చే ఆలోచన ఇటువంటి అనుభవాల ద్వారా ఎక్కువ కాసాగింది.

భార్యను, పిల్లల్ని తీసుకొని నేను పాల్‌ఘాట్‌నుంచి కోళిక్కోడ్‌కు తిరుగు ప్రయాణం పట్టాను. కొన్ని రోజులు గడిచిన తర్వాత వైక్కం నుంచి తిరువనంత పురానికి బయలుదేరిన ఒక సవర్ణ హిందువుల పాదయాత్రకు వీడ్కోలు చెప్పడానికి నేను వైక్కం వెళ్లవలసి వచ్చింది. అక్కడ ఒక వారం బసచేసి తగిన ఏర్పాట్లు చేశాను. ఆ బృందంతో చేరి నేను కూడా తిరువనంతపురం వెళ్లడానికి ఉద్దేశించాను. అప్పుడు నా భార్యకు ఆరోగ్యం బాగాలేదని వెంటనే కోళిక్కోడ్‌కు తిరిగి రావాలని తంతి వచ్చింది. ఆ రోజే వైక్కం నుంచి బయలుదేరి మర్నాడు సాయంకాలం కోళిక్కోడ్ చేరాను.

విపరీతమైన జ్వరంతో అవస్థపడుతూ బలహీనంగా పడుకుని వున్న నాభార్యను చూసినప్పుడు అది మామూలు జ్వరంకాదని నాకు అనిపించింది. కొన్ని రోజులవరకూ డాక్టరు నాకు ఏ సంగతీ చెప్పలేదు. ఆ తర్వాత నిజంచెప్పారు. 'నా సందేహం తీరిన తర్వాత చెబుదామనుకున్నాను. మీభార్యకు క్షయరోగం ప్రారంభమైంది. ఏ మాత్రం అశ్రద్ధ చేయకుండా తొందరగా మద్రాసుకు తీసుకెళ్లి చికిత్స చేయించడం మంచిది' అన్నారు డాక్టరు.

అయితే ఆయన సలహాను నేనెలా పాటించగలను? దైనందిన ఖర్చులకే అవస్థ పడుతున్న నేను, మద్రాసు వెళ్లడానికి అక్కడ బసచేసి చికిత్స చేయించడానికి, డబ్బును ఎక్కడనుంచి తేగలను? లేకపోతే చికిత్స చేయించకుండా ఆమెను కోళిక్కోడ్‌లోనే ఎలా వుంచ గలను?

ఆమె తండ్రి కొంత డబ్బు తీసుకొచ్చారు. అయితే అది చాలలేదు. చేతిలో డబ్బులేకుండా ఎలా బయలుదేరగలను? ఈశ్వరా! ఇదేమి పరీక్ష?

ఎలాగైనాసరే బయలు దేరుతాం; మద్రాసు వెళ్లాక ఆలోచిద్దాం అనుకుని బయలుదేరవలసిన రోజును నిర్ణయించాను. బయలుదేరడానికి ముందు రోజు ఒక సెకండ్ క్లాస్ టికెట్ తీసి సీట్ రిజర్వు చేసినట్లు ఒక మిత్రుడు చెప్పారు. అది ఎంతో ఓదార్పు నిచ్చింది. మర్నాడు మమ్మల్ని మద్రాసుకు సాగనంపడానికి, కోళిక్కోడ్ రైల్వేస్టేషన్‌కు కొందరు మిత్రులు వచ్చారు. జబ్బు మనిషిని రైల్లో ఎక్కించాము. నేనూ ఎక్కాను. వారివద్ద సెలవు తీసుకున్నాను. బండి బయలు దేరింది. ఒక సేఠ్ నాదగ్గరికి వచ్చి ఒక కవరు అందించారు. దానిని విప్పిచూసినప్పుడు అందులో నాలుగువందల రూపాయలు కనిపించాయి. రెండుసార్లు వాటిని లెక్కబెట్టి చూసుకుని, దానిని చేతిలో వుంచుకుని, దయనీయంగా పడుకునివున్న నా భార్య వైపు చూసినప్పుడు నాకు తెలియకుండానే మూడు కన్నీటి బొట్లు రాలాయి. అప్పటి నా దయనీయ స్థితిని తలుచుకోవడం వల్ల వచ్చిన కన్నీళ్లో, మిత్రుల ఔదార్యాన్ని తలుచుకోగా వచ్చిన కృతజ్ఞతాభావమో – కన్నీటికి కారణం ఫలానా అని కచ్చితంగా చెప్పలేని స్థితి.

మన కళ్లకు కనిపించని ఏదో శక్తికి లోబడేమనం నడుచుకుంటూ వున్నామని నాకు చాలా సందర్భాలలో అనిపించేది. ఎప్పుడు ఏవైపు నుంచి ఎదురుచూడని దెబ్బ తగులుతుందనీ చెప్పలేము. అయినప్పటికీ మనిషి ప్రవహిస్తున్న నదిలో తేలిపోయే ఆకులాంటి దూదిపింజ అని నాకు అనిపించేది. మనం అడ్డు చెప్పలేని బాధలు మనల్ని వేధించవచ్చు. అయినప్పటికీ అనుభవాల ద్వారా, ప్రయత్నాలవల్ల వెతుక్కునే మంచిని కూడా చెడగొట్టే చెడు లేకపోలేదని గ్రహించవచ్చు. జీవిత పయనంలో మనం ఒక దృఢమైన విశ్వాసాన్ని ఏర్పరచుకోవాలి. కొన్ని ఆధార ప్రమాణాల మీద విశ్వాసం, అవిశ్వాసాన్ని వారివారికి తగిన విధంగా వాళ్లు వాళ్లు వెతుక్కోవచ్చు. వివిధ స్థాయిలలో, వివిధ కారకాల మిత్రులతో కలిసి తిరిగే అవకాశాలు నాకు లభించాయి. అయితే నా అవసరాలకు, ఆ స్నేహాన్ని గాలంగా నేను ఎప్పుడూ భావించలేదు. అందువల్లనే వారి స్నేహం దృఢమైనదనీ అనుకోని విధంగా ఎన్నో సందర్భాలలో వారి దగ్గరి నుంచి సహాయం లభించడానికి దోహదంచేసిందనీ అనుకున్నాను.

నేను పలుసందర్భాలలో వ్యక్తులలో వంచన, స్వార్థం, అబద్ధం, అన్నింటినీ చూడవలసి వచ్చింది. అదేవిధంగా సత్యంపట్ల పట్టుదల, మాటలతో మరింత మంచితనం, ప్రేమ, ఎల్లలు లేని మానవత, స్వార్థరహిత త్యాగనిరతితో నన్ను ముగ్ధుల్ని చేసిన కొందరు విశిష్టమైన వ్యక్తులను నేను జ్ఞాపకం చేసుకుంటున్నాను. ఈ రెండు పక్షాలవాళ్లూ ప్రపంచంలో అల్పసంఖ్యాకులే.

ఈ రెండు పక్షాలకు కూడా చెందని మామూలు మనుషులే అధిక సంఖ్యాకులు. మామూలు మనిషి క్రూరమైనవాడు కాదు, త్యాగీ కాదు, తన క్షేమానికి ఇబ్బంది రానంతవరకు ఇతరులతో స్నేహం పాటించడానికే చూస్తాడు. రెండిటి మధ్య జీవించడమే అలాంటి వ్యక్తుల దిగులు.

అయిదు నెలలపాటు భార్య చికిత్స కోసరం నేను మద్రాసులో వున్నాను. క్షయ వ్యాధికి చికిత్స ఇవాళలా ఆ రోజులలో అభివృద్ధి చెందలేదు. ఆ రోజులలో క్షయవ్యాధి చికిత్సలో పేరుపొందిన వైద్యులు కేశవన్ నా నుంచి ఎలాంటి ప్రతిఫలాపేక్ష చూడకుండా చికిత్సచేశారాయన. రోగిపట్ల చాలా ప్రేమాదరాలతో ఆయన ఉచితమైన మందులెన్నో ఇప్పించారు. వృత్తిని వదలి ప్రజాజీవితంలో దిగిన వ్యక్తిని కనుకనే అంత ఉదారంతో నడుచుకున్నారు కాబోలు!

జబ్బు మనిషి ఆరోగ్యాన్ని చూసుకుంటూ, అప్పుడప్పుడు మద్రాసు నుంచి పనిమీద పొరుగూళ్లకు వెళ్లేవాడిని. టి.వి. సాత్తుక్కుట్టి నాయర్‌తో 'మాతృభూమి'కి కంపెనీలో ఇంకా ఎక్కువ షేర్స్ చేర్పించడానికి కోలార్ వెళ్లాను. ఆ రోజులలో అక్కడ బంగారు గనులలో చాలామంది మలయాళీలు పనిచేస్తూవుండేవారు, అధికారులుగానూ వున్నారు. షేర్స్ కోసరం ప్రయాణం వృధాకాలేదు. అక్కడికి నేను వెళ్లడంవల్ల 'మాతృభూమి'కి ఒక మాదిరిగా మలయాళీ సౌజన్యం వల్ల విజయం లభించింది. లిఫ్ట్‌లో దిగి నేల అడుగున వున్న బంగారు గనులను చూడడానికి వెళ్లాము. బంగారం వున్న బండరాళ్లను, పగలగొట్టి వెలికితీయడం, పైకెక్కి బండలను పగులగొట్టి పిండి చేసి బంగారును విడదీసి కరిగించి గడ్డచేయడం చూశాము. ఒకవారం కొలార్‌లో గడిపి తిరిగి వచ్చేశాము.

ఈ కాలంలో అస్పృశ్యతా నివారణ గురించి ముఖ్యంగా వైక్కం సత్యాగ్రహం గురించి తెలుసుకోవడానికి పూజ్యులు అండ్రూస్ తిరువిదాన్కూర్‌కు బయలుదేరారు. మధ్యలో మద్రాసులో ఆయన రెండు రోజులు వున్నారు. నేను మద్రాసులో విషయం తెలుసుకుని రైల్వేస్టేషన్లో నన్ను కలుసుకోవడానికి ఇష్టపడుతున్నట్లు నాకు తంతి ద్వారా తెలియజేశారు. నన్ను చూడగానే వైక్కం సత్యాగ్రహం గురించి మాట్లాడాలని ఆ రోజు మధ్యాహ్నం మైలాపూరులో ఆయన బసచేసివున్న చోటుకు రమ్మని నన్ను పిలిచారు. అక్కడే మధ్యాహ్నం భోజనం చేయవచ్చని చెప్పారు. నేను మధ్యాహ్నం పన్నెండు గంటలకు అక్కడికి వెళినప్పుడు అండ్రూస్ అక్కడ లేరు. ఆయన బయటికి వెళ్లివున్నట్లు, త్వరలో వస్తారని అక్కడవున్న వాళ్లు తెలియజేశారు. నేను ఎదురుచూస్తూ కూర్చున్నాను. ఒక గంట దాటినా ఆయన రాలేదు; నాకు

ఆకలి ఎక్కువయింది; సుమారు రెండు గంటలకు ఆయన చెమటలు పోస్తూ తొందర, తొందరగా మెట్లెక్కి వచ్చారు. నన్ను చూడగానే 'చాలసేపుగా ఎదురు చూస్తున్నారా? అనుకున్నదానికన్నా కాలాతీతమయిపోయింది; కాసేపు వుండండి, నేను భోజనం చేసివస్తాను' అన్నారు. నన్ను భోజనానికి పిలిచిన విషయం ఆయన మరిచిపోయారు, ఏమి చెయ్యడం నాకు తోచలేదు. మాట్లాడకుండా వుండడానికి నా ఆకలి నన్ను అనుమతించలేదు. నన్ను భోజనానికి పిలిచిన మాట మర్చిపోయారా మిస్టర్ ఆండ్రూస్? అని నేను ప్రశ్నించగానే ఆయన చాలా సిగ్గుపడిపోయారు. అయ్యయ్యో సిగ్గుచేటు, నేను మరిచేపోయాను. వెయ్యిసార్లు క్షమాపణ చెప్పుకుంటాను, మనం భోం చేద్దాం రండి! అని పిలుచుకుని వెళ్లారు. భోజనాలయ్యాక రెండు గంటలసేపు నాతో చర్చించారు. అదే మా చివరి సమావేశం అని నేను అప్పుడు అనుకోలేదు; తర్వాత మా మధ్య ఉత్తరాలు నడుస్తూనేవున్నాయి. కాని నేను సింగపూర్‌లో వున్నరోజులలో ఆయన మరణం గురించి వార్త అందింది. సింగపూర్‌లో భారతీయులు ఏర్పాటు చేసిన బహిరంగసభలో నేను శ్రద్ధాంజలి ఘటించాను.

నాలుగయిదు నెలలు వరుసగా మద్రాసులో వుండవలసి రావడంతో, నేను 'మాతృభూమి' సంపాదక బాధ్యతలను వదలివేయవలసివచ్చింది. 'మాతృభూమి' పాఠకులనుంచి నేను వీడ్కోలు తీసుకుంటూ రాసిన వ్యాసం 1925 జనవరి ముప్పై ఒకటో తారీఖున వెలువడింది.

'మూడేళ్లునిండని ఒక పాపాయిని వదలి వెళ్లడానికి ఆ పాపాయి తండ్రి ఎలా బాధపడతాడో దానికి కొంచెంకూడా తగ్గని ఆవేదనతో నేను 'మాతృభూమి'ని వదలి వెళుతున్నాను, జీవితంలో నాకు ఎన్ని కష్టాలు ఎదురయినప్పటికీ 'మాతృభూమి' కోసరం పనిచేయడంలో, వ్రాయడంలో, దానికోసరం కృషిచేయడంలో, దానికోసరం బాధలు ఎదుర్కోవడంలో ఒక విధంగా వివరించి చెప్పలేని ఆనందం మనశ్శాంతి నాకు ఏర్పడేవి. ఈ పత్రికా వృత్తిని ప్రారంభించే భాగ్యం నాకు లభించినందుకు నేను కృతజ్ఞుణ్ణయి వుంటాను. తన దేశప్రజలలో దేశభక్తిని, సోదర ప్రేమను, ఆత్మాభిమానాన్ని రేకెత్తింపజేసి వ్యాపింపచేయడానికి కారణంగా వున్న సందర్భాలను, సత్కార్యాలను ఏ భారతీయులు మాత్రం అంగీకరించకుండా వుండగలరు? దేశసేవకోసరమే జీవించే భాగ్యం కొందరికి మాత్రమే కలుగుతుంది. 'మాతృభూమి'ని వదలి వెళ్లడానికి దోహదం చేస్తున్న బలమైన కారణాలను నేను ఇక్కడ వివరించవలసిన అవసరం లేదు. చాలా ముఖ్యమైనవి అని మాత్రం తెలియజేస్తున్నాను. 'మాతృభూమి'కి రాసే కలాన్ని నేనెప్పుడూ

ఉపయోగించుకుంటూ వుంటాను. సంపాదకుని బాధ్యతనుంచి వైదొలగడంవల్ల, పత్రికతో మరోవిధంగా సంబంధం కొనసాగిస్తూ 'మాతృభూమి'కి వ్రాయడంలో అధిక స్వేచ్ఛ, సామర్థ్యం నాకు కలుగ గలవని విశ్వసిస్తున్నాను. పత్రిక భవిష్యత్తు గురించి, దిగులు పడవలసిన అవసరం లేదు అన్న విషయం నాకు ఎంతో మనశ్శాంతినిస్తోంది. "మూడేళ్లు ముందు ఒక మహోన్నత జాతీయోద్యమం ప్రారంభ ఘట్టంలో ఆవిర్భవించిన 'మాతృభూమి' ఇవాళ కేరళలో ఒక సంస్థగా అభివృద్ధిచెంది సుస్థిరంగా నిలబడగలిగింది. కేరళలోనూ, వెలుపలా నివసించే కేరళ ప్రజలు, 'మాతృభూమి'కి సహాయం చేయడానికి ఏవిధంగా సిద్ధంగా వున్నారన్న విషయం నాకు తెలుసు; పెరుగుతున్న చందాదారుల సంఖ్యయే 'మాతృభూమి' పట్ల ప్రజా వాహినిలోవున్న ప్రేమ తేటతెల్లమవుతోంది. ఎలాంటి ప్రతిఫలాపేక్ష లేకుండా రాత్రింబవళ్లు 'మాతృభూమి' కోసరం శ్రమించేవాళ్లు, ఇకపై కూడా అదేవిధంగా కృషిచేయగలరనడంలో నాకు ఎలాంటి సందేహము లేదు. నా గౌరవ పాత్రులైన మిత్రులే బాధ్యతలు స్వీకరిస్తున్నారు. సత్యం - సమానత - స్వతంత్రం అన్న లక్ష్యాలను, 'మాతృభూమి' తన లక్ష్యాలుగా ఉద్ఘటిస్తూ వుంటుంది. మహోన్నత సేవచేసే బాధ్యతలు స్వీకరించడానికి అవసరమైన హృదయపూర్వక సహకారాన్ని 'మాతృభూమి'కి పాఠకులు కొనసాగించాలన్నదే ఈ సందర్భంలో నేను కోరుకునేది. 'నా విజ్ఞప్తి ఇదే'.

కేరళ ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి పదవీ బాధ్యత నుంచి నేను వైదొలిగాను. 1925వ సం॥ ఫిబ్రవరి నెలలో వైక్కంలో సమావేశమైన కేరళ ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ సభలో నా రాజీనామా అంగీకరించబడింది. ఆ స్థితిలో పి. రావుణ్ణిమేనన్, ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగా బాధ్యతలు స్వీకరించారు.

భార్య చికిత్సకోసరం మేము మద్రాసులో ఒకటిగా వున్నప్పుడే నా భార్య తల్లి అమ్మవారుపోసి చనిపోయారు. నిరాధారంగావున్న స్థితిలో మాకు ఇంకా కష్టాలు అధికమయ్యాయి.

భార్య ఆరోగ్యం కూడా రోజు రోజుకూ దిగజారడంతో ఆయుర్వేద చికిత్స చేయిద్దామని, ఫిబ్రవరి నెలలో పాల్ఘాట్ తిరుగు ప్రయాణమయాము. తక్కిన అన్ని పనులనూ అలానే వదిలి, ఆమె ఆరోగ్యంకోసరమే నేను పూర్తిగా శ్రద్ధ తీసుకున్నాను.

ప్రతిసంవత్సరమూ లక్షలాదిమంది ప్రజలు క్షయవ్యాధివల్ల మరణిస్తున్నారు. దానికన్నా పదిరెట్ల మందిని ఈ వ్యాధి పీడిస్తున్నట్లు లెక్కల వివరాలు తెలియజేస్తున్నాయి. వారిలో చాలా మంది వైద్య సౌకర్యాలు, చికిత్స

సౌకర్యాలు అందుబాటులో లేనివాళ్లే ఎక్కువ. మన పరిస్థితి ఎలాంటి దైన్యమైనది? వ్యాధులకంటూ ప్రత్యేకంగా ఆస్పత్రులు ఇటీవల ఎక్కువయ్యాయి. కొత్తమందులు కనిపెడుతున్నారు. కాని ఈ దారుణ రోగాన్ని రూపుమాపే చికిత్సా సౌకర్యాలు ఇంకా చాలినంతలేని పరిస్థితే వుంది. భారత ప్రజలను వేధించి నాశనం చేసే 5 భయంకర వ్యాధులలో ముఖ్యమైనది క్షయవ్యాధి.

వ్యాధి భయంకర స్థితిని, ఆమె తెలుసుకోకుండా వుండాలని, పుస్తకాలు చదివి వినిపించడం, సంతోషంగా మాట్లాడ్డం, పిల్లలను పాడమని చెప్పడంతోనే కాలం గడపవలసి వచ్చేది. ఏప్రిల్ చివరి రోజుల్లో పరిస్థితులు మారాయి. రాత్రంతా నిద్రపట్టని స్థితి. కాళ్లకు నీరుదిగి వాచాయి. నోటిలో పుళ్ళు దగ్గడానికిగాని, కఫం ఉమ్మడానికి గానీ శక్తిలేదు. తను ఇలా పడివున్న దీనస్థితి వల్ల ఏర్పడిన వేదన ఆమె ముఖంలో గూడుకట్టుకుంది. ఒక వారం ఇలాగే సాగింది. తర్వాత రెండు మూడు రోజులు ఆమె కొంత మెరుగయినట్లు కనిపించింది. 1925వ సం॥ ఏప్రిల్ ఇరవై ఆరో తేది అర్థరాత్రి దాటింది, లక్ష్మి పడుకున్న గదిలో ఒక చిన్నదీపం వెలుగుతోంది; అంతవరకు ఆమె దాపునవున్న నేను వరండాలోకి వెళ్లి కాస్త కళ్లు మూశాను; భయపడవలసినట్లు అప్పుడేమీ కనిపించలేదు. నేను రెండు మూడు గంటలసేపు నిద్రపోయాను. సుమారు నాలుగు గంటల ప్రాంతంలో ఎవరో నన్ను తట్టి లేపారు, నేను వెంటనే లక్ష్మి దగ్గరికి వెళ్లాను. ఒక పెద్ద దగ్గు ప్రారంభమయింది; కఫం బయటికి రాలేదు. కళ్లు రూపుమారాయి. నా ప్రేమకు పాత్రురాలైన ఆమె పడ్డ అవస్థ నన్ను ద్రవింపచేసింది. తెరుచుకుని వున్న లక్ష్మి కళ్లు అలాగే మూతపడ్డాయి; తర్వాత కొంతసేపు ఎలాంటి కదలికాలేదు; ఇంట్లో పడుకున్న వాళ్లంతా ఒక్కొక్కరుగా అందరూ ఆ గదికి వచ్చి చేరారు. లక్ష్మి మళ్లీ కళ్లు తెరిచింది, ఏదో చెప్పడానికి ప్రయత్నించింది కానీ వీలుకాలేదు. తెల్లవారింది. కోళ్లు కాకులు అరుస్తున్నాయి. ఆ చిన్న గదిలో గుంపుగా చేరివున్న వాళ్లను చూసినా ఆమె గుర్తు పట్టే స్థితిలో లేదు. తెరచిన కళ్లు సగం వరకు మూతపడ్డాయి. శ్వాస ఆగింది; అంతా అయిపోయింది, లక్ష్మి లేని నిర్భాగ్య గృహంలో ఉదయం సూర్యుని కిరణాలు మెల్లిగా తొంగి చూశాయి.

# మరణం తర్వాత జీవితం

పందొమ్మిది సంవత్సరాలు కొనసాగిన నా వైవాహిక జీవితం ముగిసింది. 'ఒక భార్య ఎలావుండాలి'' అన్న దానికి ఉదాహరణగా లక్ష్మి జీవించింది. వంటపనులు, ఇంటిపనులు ... వీటి గురించిన ఆలోచనలు చేతలతోనే ఆమె జీవితం గడిచింది. రోజువారి ఖర్చులు ఎక్కువై క్లిష్టపరిస్థితి ఏర్పడినప్పటికీ, ఆ విషయం బయటపెట్టకుండా (నేను బాధపడతానేమోనని) మౌనంగా వుండేది. ఎలాగో సర్దివంట చేసి నాకు అమృతంలాంటి ఆహారం వడ్డించేది. పుస్తకాలు చదవడానికి వివిధ విషయాలను గురించి చర్చించడానికి ఆసక్తి కనబరచేది. నా అభిప్రాయాలతో ఏకీభవించక పోయినప్పటికీ ఆ విషయం పైకి చెప్పి నన్ను వ్యతిరేకించేది కాదు. అలా చెప్పడం నాకు బాధ కలిగిస్తుందని మౌనంగా వుండి పోయేది. అయినప్పటికీ లక్ష్మి పెదవుల చివర మెరిసే ఆ వ్యంగ్య దరహాసం నుంచి ఆమె నా అభిప్రాయాన్ని అంగీకరించలేదన్నది తెలిసిపోయేది!

ఆరోగ్యం దెబ్బతిని ఆమె మంచమెక్కిన రోజులలో ఒక రోజు నాతో 'నేను చనిపోయినా మిమ్మల్ని విడిచి వెళ్లను. నేను మీ దగ్గరే వుంటాను. వద్దనకండి' అన్నది.

ఆ మాటలు ఎన్నోసార్లు నాకు జ్ఞాపకం వచ్చేవి. ఆ మాటల సంగతి అలా వుంచి - లక్ష్మిరూపం మాత్రం నా మనసునుంచి దూరం కాలేదు. ఆమె ధరించిన దుస్తులలోనూ ఆభరణాలలోనూ, ఉపయోగించిన వస్తువుల పట్ల నాకు మునుపటి కన్నా శ్రద్ధ ఎక్కువయ్యింది. వాటన్నిటిలోనూ నేను లక్ష్మిని చూసేవాణ్ణి. నా చుట్టూ ఎందరో వున్నప్పటికీ నేను మాత్రం ఏకాకిగా మిగిలిపోయినట్టే అనుభూతి చెందేవాణ్ణి.

ప్రపంచంలో ప్రతిరోజూ లక్షలాదిమంది చనిపోతారు. అది మనల్ని బాధించడంలేదు. అది ఒక సాధారణ సంఘటనే అనుకుని దాని గురించి అంతగా పట్టించుకోకుండా ప్రాపంచిక వ్యవహారాలలో యధలాపంగా మునిగితేలుతూ కాలం గడువుతాము. మనమీద ప్రేమ చూపేవారిని కాలుడు తీసుకువెళ్లినప్పుడు ఆ మృత్యువు క్రూర స్వభావాన్ని, దానివల్ల ఏర్పడే పరిణామాలను మనం గ్రహించగలుగుతాము.

విధిని మనం తిట్టుకుంటాము. పూరించలేని లోటు ఏర్పడినట్లు బాధపడతాం.... ఎందరో మనుషులు మన చుట్టూ వున్నప్పటికీ మనం

ఏకాకిగా వున్నామనే భావన మనసును అల్లుకుంటుంది. ఇతరులు చెప్పే ఓదార్పు మాట లేపీ ఆ సమయంలో మనకు ఉపశమనం కలిగించవు. విషాదాగ్ని రగులుతూంటే ఏకాంతంగా ఒక చోట కూర్చుని, శాశ్వతంగా దూరమైన ఆ ప్రేమమూర్తిని మనసులో నిలుపుకుని, గడిచిపోయిన ఆ కాలాన్ని తలచుకుంటూ కన్నీటిలో కరగిపోవడంలోనే కొంత ఉపశమనం లభిస్తుంది.

నాకు ఏర్పడిన ఈ విపరీతమైన విషాదాన్ని తలచుకున్నప్పుడు, సర్వశక్తిసమన్వితుడైన ఆ కరుణామయుని దయ నాకెందుకు లభించలేదని ఆవేదన చెందాను. అది నా బలహీనమైన ఆలోచనే! ఈశ్వరుని తీర్పును మనం తప్పు పట్టగలమా? అన్యాయం అని చెప్పగలమా? కాలచర్య పరిభ్రమణంలో, ఆ సర్వశక్తి లయ తప్పకుండా నడుస్తోంది. తెలుసుకోవడానికి వీలుకాని తత్వాన్ని మన మిడిమిడి జ్ఞానంతో తెలుసుకోవడానికి ప్రయత్నిస్తున్నప్పుడు కార్యాకారణ సంబంధానికి, సంఘటనలకు అర్థాలు అంతుబట్టవు. కొట్టుమిట్టాడుతాము. సాధారణ మానవులకు లేని శక్తి, మునులకు, జ్ఞానులకు వుందని మనం విన్నాము. మనం తెలుసుకోలేని అనేక సత్యాలను వాళ్ళు దైవానుగ్రహశక్తితో తెలుసుకుంటారు. మనిషిలో లేని అనేక సామర్థ్యాలను అల్పజీవుల వద్ద చూస్తున్నాము. కొన్ని మగ పట్టుపురుగులు చాలాదూరంలో ఎగిరే ఆడ పురుగుల్ని వాసన ద్వారా తెలుసుకుంటాయి. తీపి పదార్థాలు వున్న చోటును తెలుసుకుని, ఏ మాత్రం దారి తప్పకుండా వరుసగా బారులుతీర్చి, వెళతాయి చీమలు. మనిషి వద్ద లేని వినికిడి శక్తి, కొన్ని జంతువులకు వుండడం పరిశోధనల ద్వారా తెలిసింది. ఒక చోట కూడా ఆగకుండా ఏభై రోజులకు పైగా ఎగురుకుంటూ వెళ్లే సీతాకోకచిలకలు వున్నట్టు జీవశాస్త్రవేత్త చెబుతారు. మనం అర్థం చేసుకోలేని అద్భుత శక్తి కొన్ని ప్రాణుల దగ్గర తప్పకుండా వుంది. జీవితంలో అంతుబట్టని ఈ రహస్యాలు, ప్రకృతి దయాగుణాన్నే కదా సూచిస్తున్నాయి!

రాత్రి నీలాకాశాన్ని చూసేప్పుడు, మన మనసులో ఏర్పడే భావాలు, ఉద్వేగాలు మాటలకు అందవు. కోట్లకొలది నక్షత్రాలను చూస్తాము. మన దృష్టికి అందకుండా ఇంకా ఎన్నోకోట్లకొలది నక్షత్రాలు వున్నాయి. ఇవన్నీ మనం అల్పదృష్టితో వేసుకునే కొలతలను, సృష్టి తత్వంలోని ఔన్నత్యాన్ని, భగవంతుని అపరిమిత శక్తి సామర్థ్యాలనే కదా సూచిస్తాయి!

అయినప్పటికీ, ఈ ఆలోచనలేవీ నా మనసుకు ప్రశాంతతను చేకూర్చడం లేదు. మరణ రహస్యం తెలుసుకోవడానికి నేను ఆరాటపడుతున్నాను.

**వాసాంశి జీర్ణాని యథా విహాయ**

నవాని గృహ్ణాతి నరో అపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణాని
అన్యాని సమ్యాతి నవాని దేహీ
(చినిగిన దుస్తుల్ని విడిచి మనిషి కొత్తదుస్తులు ధరించే విధంగా, ఆత్మకూడా చివికిన దేహాన్ని విడిచి కొత్త దేహాన్ని పొందుతుంది.)

అన్న గీత వాక్యం కూడా నాకు ఓదార్పు నివ్వలేదు. నా దైనందిన కృత్యాలను నేను మనస్ఫూర్తిగా చేయలేకపోయాను. ఎందుకోసం పని చెయ్యాలి అనిపించేది. పుస్తకాలు, మిత్రుల ద్వారా పొందలేని మనశ్శాంతి కోసం నేను పాండిచ్చేరి అరవిందాశ్రమానికి బయలుదేరాను.

నా ప్రియమిత్రుడు దురైస్వామికి అరవిందుల దర్శనానికి తరుచు పాండిచ్చేరికి వెళ్లడం అలవాటు. నేను ఆశ్రమంలో చేరడానికి, అరవిందులవారిని దర్శించడానికి ఆయనే నాకు సౌకర్యాలు కల్పించారు.

1925వ సం॥ ఆగస్టునెలలో ఒక రోజు ఉదయం పాండిచ్చేరి చేరుకున్నాను. ఒక మిత్రుడు తమ నివాసస్థలానికి నన్ను తీసుకువెళ్లారు. ఆ రోజు ఉదయం పదకొండు గంటలకు అరవిందుల దర్శనానికి సమయం నిర్ణయించాను. అంతకు ముందే నేను ఆశ్రమం చేరుకున్నాను.

అరవింద ఘోష్‌ను చూడడానికి వెళ్లేవారు ఆ వివరాలు సమీపంలో వున్న పోలిస్ స్టేషన్‌కు తెలియజేయాలి. అరవిందుడు ఒక విప్లవవీరుడు కదా.... జాతీయ చింతనకు ఆవలివైపుగా ఆధ్యాత్మిక జీవితంలో ఆయన లీనమైనప్పటికీ బ్రిటిష్ వారి సందేహం మాయలేదు. అందువల్ల, ఆయన్ను కలుసుకోవడానికి వెళ్లేవారు, తమ గురించిన వివరాలను, పోలీసులకి ముందుగానే తెలియజేయాలి. దానికి అనుగుణంగా, నా రాక గురించి, నేను ఎన్ని రోజులు అక్కడ బసచేయనున్నదీ ముందుగానే పోలిసు వారికి తెలియజేశాను.

ఆ రోజు అరవిందులవారి తమ్ముడు ఆశ్రమంలో వున్నారు. ఆయన నన్ను అక్కడున్న కొందరికి పరిచయం చేశారు. నేను వారితో కొంతసేపు మాట్లాడుతూ గడిపాను. అరవిందుల వారి సమక్షానికి వెళ్లే సమయం ఆసన్నం కావడంతో నన్ను అక్కడికి ఒకరు తీసుకువెళ్లారు. ఆ భవంతి మెట్లవరకూ ఆయన నాతో వచ్చారు. ఆ తర్వాత నన్ను మెట్లెక్కి వెళ్లమని చెప్పారు. ఆ తర్వాతి రోజులలో అమలులో వున్నట్లు - సంవత్సరానికి ఒకసారి మాత్రమే బయటి ప్రజలకు చూసే పద్ధతి అప్పట్లో లేకపోవడం వల్ల, ప్రతిరోజూ, మధ్యాహ్నం - భోజనం తర్వాత కొంతసేపు ఆయన మేడపైన వరండాలోకి వచ్చి కూర్చునేవారు. అదే అందరూ వారిని దర్శించేసమయం.

నేను వెళ్లిన ఆరోజు. ఆయన నన్ను మాత్రమే చూశారు. అందువల్ల దాదాపు అరగంటకు పైగా ఆయనతో మాట్లాడే అవకాశం కలిగింది.

మెట్లెక్కి వరండాకు వెళ్లగానే, ద్వారానికి సమీపంలో ఒక కుర్చీలో ఆయన కూర్చుని వున్నారు. ఇంకెవ్వరూ అక్కడ లేరు. రెండు వరుసలుగా అక్కడ కుర్చీలు వేయబడివున్నాయి. నేను చేతులు జోడించి దగ్గరకు వెళ్లినప్పుడు, నన్ను ఆయన దగ్గరగా వున్న కుర్చీలో కూర్చోమని సైగ చేశారు.

అప్పట్లో ఆయనకు దాదాపు ఏభైఏళ్లుంటాయి. కాస్త స్థూల శరీరం, జుత్తు, గడ్డంతో గంభీరంగా వున్నారు. ఒక తెల్లని వస్త్రాన్ని కట్టుకుని పైపంచతో శరీరాన్ని కప్పుకుని వున్నారు. చాలా నెమ్మదిగా తగ్గు స్వరంతో ఒక్కొక్క మాటగా ఆగి ఆగి మాట్లాడారు. మధ్యలో ఏదైనా నొక్కి చెప్పవలసి వస్తే చేత్తో సైగ చేసేవారు. ప్రశాంతంగా, గంభీరంగా వున్న ఆ ముఖంలో చిరునవ్వు చూడడం అపూర్వ విషయం. ఆయనను ఏమి అడగాలి? ఎలా సంభాషణ ప్రారంభించాలి? అని అంతుపట్టక కొంతసేపు తికమక పడ్డాను. అది కొన్ని నిమిషాలే. మరణం తర్వాత ఏర్పడే స్థితి గురించి తెలుసుకోవడానికి నేను ఉబలాటపడ్డాను. మరణంతో అన్నీ అంతమైపోతాయా? లేక మరో ప్రపంచానికి మార్గమా అది?

శవాలతో సంభాషణలు జరిపిన వారి గురించిన కథలు నేను పుస్తకాలలో చదివాను. అవి నమ్మదగ్గవా? దయ్యాలను చూడగలమా? మరో లోకంలో మరో రూపంలో పరిస్థితికి తగ్గట్టు మారే దయ్యాలకు ఈ లోకంలో అవి జీవించిన కాలంలో ప్రేమించిన వారి గురించిన ఆలోచన వుంటుందా? జ్ఞాపకం వుంటుందా? వారితో మళ్లీ సంబంధం పెట్టుకోవాలని ఆశిస్తుందా? ఇలాంటి ఎన్నో ప్రశ్నలకు ఆయన దగ్గర నేను వివరణలు అర్థించాను. ఒక ప్రశ్నకు ఆయన సమాధానం చెప్పేలోపల మరో ప్రశ్న వేసేవాణ్ణి. ఏవేవో ప్రశ్నలు అడిగాను. నేను అడిగిన కొన్ని ప్రశ్నలు ఆయనకు చాలా అమాయకంగా అనిపించి వుండవచ్చు.

మరణంతో పాటు స్వర్గం అంతమైపోవడం లేదని, మరణం ఒక స్థితికి సంబంధించిన మార్పు మాత్రమేనని, కొన్ని ప్రత్యేక పరిస్థితులలో, మరణానికి తర్వాత కూడా ప్రేమకు పాత్రమైన వారితో సంబంధం పెంచుకోవడం సాధ్యమేనని ఆయన నాతో చెప్పారు.

మరణం ఒక స్థితిలో ఏర్పడే మార్పు అని, ఈ దేహాన్ని వదిలి వేసిన తర్వాత కూడా జీవితం మరోవిధంగా కొనసాగుతుందనీ, ఆధ్యాత్మిక చింతనలో అనుభవజ్ఞుడైన ఓ వేదాంతి నాతో చెప్పారు. నేను ఇప్పుడు మీతో సంభాషిస్తున్న విధంగా దయ్యాల లోకంలో వున్నవారితో నేను మాట్లాడగలను

అని ఆయన నాతో అన్నప్పుడు నేను అసాధ్యం కాదు అని చెప్పలేక పోయాను. చెప్పలేక పోయానే గాని నమ్మడానికి శక్యం కాలేదు.

శ్రీ అరవిందుల వద్ద సెలవు తీసుకుని వచ్చాక ఒక శిష్యుడు కొన్ని పుష్పాలు తీసుకువచ్చి ఆయన ముందుంచి నమస్కరించి వెళ్లడం గమనించాను. శ్రీ అరవిందుల సమక్షం నుంచి క్రిందికి దిగివచ్చేప్పుడు, నాలో ఎలాంటి ఆలోచనలు, ఉద్వేగాలు చెలరేగాయో నాకు ఇప్పుడు జ్ఞాపకం లేదు. అయినా దూరంగా ఏదో ఒక మిణుకు మిణుకు మంటున్న దీపం కనిపించినట్లయింది. తినడం, నిద్రపోవడం తీసుకోవడం, ఇవ్వడం, ద్వేషించడం, ప్రేమచూపడం, వీటి కోసరం ఈ జీవితం కాదు. వాటికి అతీతంగా, వాటికన్న ఉన్నతమైన అర్థం, ఒక లక్ష్యం వున్నదన్న విషయం నేను గ్రహించాను.

ఆ కాలంలోనూ, ఆ తర్వాత మరణానంతర స్థితిగురించి తెలుసుకునే ఉత్సాహం నాలో అధిక మవుతూనేవచ్చింది. ఆ విషయానికి సంబంధించిన పలు పుస్తకాలు చదివాను. 'మరణానికి ముందు' - మరణం సంభవించేప్పుడు మరణానికి తర్వాత అన్న పేర్లలో ఒక ఫ్రెంచి రచయిత రాసిన మూడు పుస్తకాలు నన్ను బాగా ఆకర్షించాయి. అనుభవాలను, సంఘటనలను ఆధారంగా తీసుకుని విజ్ఞాన దృక్పథంతో రచించిన గ్రంథాలవి. కేవలం అభిప్రాయాల సేకరణ మాత్రమే కాదు. ఇంగ్లండు నుంచి వెలువడిన 'స్పిరిట్యువలిస్ట్' అన్న వారపత్రికను నేను క్రమం తప్పకుండా చదివాను. నమ్మశక్యంగాని ఎన్నో సంగతులు అందులో వున్నప్పటికీ, నన్ను గాఢంగా ఆలోచింపచేయడానికి దోహదం చేసిన కొన్ని సంఘటనల గురించి అందులో చదివాను.

స్వామి వివేకానంద ఉపన్యాసాలు-వ్యాసాలు అన్న శీర్షికపై ప్రచురించబడిన ఏడు సంపుటాలను నేను చాలా సార్లు చదివాను. నా మనసులో ఉత్సాహం రేకెత్తించడానికి ఇప్పుడు కూడా తరుచుగా వాటిని చదవడం కద్దు. ఆత్మశాంతి కోరేవారికి ఆశ్రయమిచ్చే అద్భుత గ్రంథాలు అవి. ఆధ్యాత్మిక విషయానికి సంబంధించినవీ, నిజజీవితానికి పనికి వచ్చేవి. సాధారణ ప్రజాహృదయాలలో హత్తుకునే విధంగా వివరించి చెప్పడంలో స్వామి వివేకానంద అసాధారణ ప్రజ్ఞకలవారని పేరొందినవారు కదా? భగవద్గీత ప్రసాదించే ఉత్కృష్టమైన ఆధ్యాత్మిక బోధలు, వివరణల సహాయం చదువుతూ నేను ఉపశమనం కోసరం ప్రయత్నించాను. నేను ప్రతిరోజూ గీతాపారాయణం చేసేవాణ్ణి కాదు. క్లిష్ట పరిస్థితులలోను విషాదాలలోను మనశ్శాంతి కోసం కొన్ని భాగాలను మాత్రం ఎన్నుకుని చదివేవాణ్ణి.

మనకు తెలియని వాటిని గురించి తెలుసుకోవడానికి ఇష్టమైన వాటి గుర్తించి ఇతమిత్థంగా అభిప్రాయాలు వెలిబుచ్చడం ఒక విధంగా తెగింపే అనాలి. మన అనుభవ పరిధులకు లోబడని విషయాల గురించి మరెవరైనా చెప్పగా విన్నప్పుడు, అది అజ్ఞానమనే, అసాధ్యమనే కొట్టి పారేయడం సరికాదు. జరగడానికి అసాధ్యమైనవని ఒకప్పుడు అనుకున్న ఎన్నో ఇవాళ జరగడం సాధ్యమవుతోంది. ప్రకృతికి విరుద్ధమైనదని భావించిన కొన్ని విషయాలు ప్రకృతి సహజాలన్న విషయం ఇవాళ గ్రహించడం ప్రారంభించాము.

సుప్రసిద్ధ విజ్ఞానవేత్త కోపర్నికస్ కాలానికి ముందు సూర్యుడు భూమి చుట్టూ పరిభ్రమిస్తున్నాడనే కదా ప్రపంచం విశ్వసించింది! 1543 సం॥లో కోపర్నికస్ తను కనుగొన్న విషయాన్ని వెలువరించినప్పుడు ఆ సత్యం ప్రపంచం గురించి మనకున్న అభిప్రాయంలో గొప్ప విప్లవాత్మకమైన మార్పుకు దోహదం చేసింది. సూర్యుడు కదలడం లేదనీ, భూమి పరిభ్రమిస్తోందని కోపర్నికస్ వాదించినప్పుడు, ప్రజలు ఆయన అసంబద్ధమైన అభిప్రాయాలను వ్యాపింపజేస్తున్నాడని విమర్శించారు. ఆ విధంగానే కొత్తకొత్త పరిశోధనల వల్ల సాధనలవల్ల ప్రపంచానికి ఎంతోమంచి చేసిన గలీలియో, ప్లాటో మొదలైన శాస్త్రవేత్తలందరూ తమ అభిప్రాయాలను స్వతంత్రంగా వెలువరించినందుకు, ఆనాటి అధికార వర్గపు కఠిన శిక్షలను అనుభవించవలసి వచ్చింది. ఇవాళ వారి అభిప్రాయాలను విజ్ఞాన శాస్త్రి సూత్రాలుగా ప్రపంచం ప్రశంసిస్తోంది.

ఎలాంటి సంశయానికీ ఆస్కారం లేకుండా మరణం తర్వాత స్థితి గురించి తెలుసుకోవడమూ ఒక రోజు సాధ్యం కావచ్చు! ఈ రోజు మనం ఆ స్థితిని ఇంకా అందుకోలేదు. అనుభవపూర్వకమైన విజ్ఞానవేత్తల అభిప్రాయాలను విజ్ఞానపు వెలుగులో మనం అంగీకరించి తీరాలి. కొన్ని విశ్వాసాల పట్ల ఏర్పడే సంశయాలకు, పరిష్కరించుకోలేని కారణాల వల్ల, వాటికి తిరస్కరించడం సబబుకాదు. వాటికి సంబంధించి తీవ్రమైన పరిశోధనలు చేస్తూ, ఆలోచనలను కొనసాగించడం చాలా మంచిది.

## మలేషియా ప్రయాణం

1925వ సం॥ జూలై నెలలో నేను మళ్లీ మద్రాసులో ప్రాక్టీసు చేయడం మొదలుపెట్టాను. నాలుగు సంవత్సరాలు ప్రాక్టీసు వదిలిపెట్టి, మళ్లీ ప్రారంభించడంవల్ల పార్టీలు రావడానికి కొన్నాళ్లు పడుతుంది కదా? అయితే ఓర్పుతో ఎదురుచూస్తూ వుండడానికి కావలసిన ఆర్థిక స్తోమత నాకు లేదు. 'మళ్లీ దీన్ని వదలిపెట్టి ఎప్పుడు వెళ్లిపోతారో? మీనన్‌కు పాలిటిక్సే ఫస్ట్ స్టైవ్' అని ఒక మిత్రుడు నా గురించి చెప్పేవారు; అలాంటి అభిప్రాయమే చాలామందికి వుండేది. అది నాకు మరో ఆటంకంగా తయారయ్యింది.

దైనందిన ఖర్చులకే అవస్థపడేవారు ప్రజాజీవితానికి వేరే బయలుదేరవచ్చా? అందువల్ల వృత్తి ఒక దారికి వచ్చేవరకు అందులోనే శ్రద్ధ చూపడానికి నిశ్చయించాను. అవసరమైన విషయాలలో జోక్యం కల్పించుకోకుండా ప్రాక్టీసు కొనసాగించి వుంటే, ఇవాళ్టికి ఎంత ఉన్నతంగా వుండివుండవచ్చు! ఇక పైనైనా యిక్కడికీ అక్కడికీ పరుగెత్తకుండా, మీ పని మీరు చూసుకోవాలి అని నా శ్రేయోభిలాషులు కొందరు సలహాయిచ్చారు.

నాకు పెద్ద కుటుంబాన్ని పోషించవలసిన బాధ్యతవుంది. రెండోసారి నేను పెళ్లిచేసుకున్నాను. లక్ష్మి సోదరి అమ్ముకు నేను రెండో పెళ్లి చేసుకున్నాను; అమ్ము అప్పుడు వితంతువుగా వుంది. యిద్దరు పిల్లలు కూడా; చెల్లప్పన్, కొచ్చుణ్ణి అని పేర్లు; అమ్ము శాంత స్వభావం, దయాచింతన నాకు తన సంసార జీవితానికి మంచిని మాధుర్యాన్ని, సమకూర్చగలిగాయి. అయినప్పటికీ దైనందిన ఖర్చులకయినా డబ్బులు కావాలికదా? దానికే కష్టంగా వుండేది. అప్పు అడగకూడదు. ఇవ్వనూకూడదు. అన్న షేక్స్‌పియర్ ఉపదేశం కార్యాచరణకు తగినదిగా నాకు అనిపించలేదు. అప్పు చేయకుండా జీవించే మనిషి, పుణ్యవంతుడని చెప్పడంలో సందేహం లేదు. అవసరమని వచ్చిన ఒక మిత్రునికి అప్పు యిచ్చి సహాయం చేయడం అన్నది మరీ భాగ్యం నాలుక ఎండి వచ్చే వానిని దాహం తీరేట్టు నీళ్లు ఇచ్చేప్పుడు వుండే తృప్తిని అందులో పొందవచ్చు. దానికి వీలుకాని స్థితిలో నేను చాలాసార్లు

బాధపడివున్నాను. అయితే అప్పు అడగడం, అలా కాదు ఇలాంటి ఆవేదనకు, అల్పత్వానికి గురిచేసే కృత్యం మరొకటిలేదు. దీనదయాళువైన దేవుడు నా ముందు ప్రత్యక్షమైన ఏదైనా వరం కోరుకో అంటే అయ్యా నన్ను అప్పు అడిగే స్థితి నుంచి రక్షించు తండ్రీ అంటాను. ఈ రోజువరకు ఎన్ని సార్లని నేను ఈ అల్పత్వాన్ని అనుభవించి వున్నాను! ఒక అప్పుల వాడిగానే నేను నా జీవితాన్ని గడపవలసివస్తుందా? ఎవరికీ ఏమి యివ్వవలసింది లేదు అన్న తృప్తి నాకు ఎప్పుడైనా వస్తుందా? నేను చాలా సార్లు యిలా అనుకున్నాను.

మద్రాసులో ప్రాక్టీసు చేస్తున్న రోజులలో, ఒకసారి, పెనాంగ్‌లో చాలకాలం ప్రాక్టీసు చేసి కీర్తి, సంపద నార్జించిన బారిష్టర్ బి.కె. నంబియార్ నన్ను చూడడానికి వచ్చారు. ఆయన అంతకు పూర్వం మద్రాసులో ప్రాక్టీసుచేసిన వారే తర్వాతే పెనాంగ్ వెళ్లారు. అక్కడ ప్రాక్టీసుచేస్తూ ఆయన అప్పుడప్పుడూ మద్రాసు వచ్చేవారు. ఆ విధంగా వచ్చిన సందర్భాలలోనే నన్ను చూశారు. మలేషియాలో ప్రాక్టీసు చేసే బారిష్టర్ల గురించి, అక్కడి స్థితిగతుల గురించి ఆయన నాతో చెప్పారు. అక్కడికి రావాలనే ఉద్దేశ్యం వుంటే, అవసరమైన సహాయం చేస్తానని కూడా నంబియార్ తెలియ జేశారు. అప్పటి పరిస్థితిలో నంబియార్ రాక నాకు భాగ్యంగా కనిపించింది. ఆయన మాటలు, నాలో మలేషియాకు వెళ్లే, ఆశను రేకెత్తించాయి. ఆ రోజు నేనేదీ నిశ్చయించుకోలేదు; ఆలోచించిన తర్వాత, ఇంకా వివరాలు తెలుసుకోడానికి, వివరాలకు ఆయనకు పెనాంగ్‌కు రాస్తానని జవాబు చెప్పాను. నంబియార్ కొన్ని రోజులలోనే మలేషియా తిరిగి వెళ్లారు.

బి.కె. నంబియార్‌ను చూడడానికి కొన్నాళ్లు ముందు ఒక సంఘటన జరిగింది. ఒక రోజు వేకువ జామున ఒక సన్యాసి నా యింటి గడప మెట్లెక్కి వచ్చారు. జుట్టు, గడ్డంతో చిరిగిన కాషాయ బట్టలు ధరించిన ఆ సన్యాసి చేతిలో ఒక దండాన్ని కూడా పట్టుకుని వున్నారు. నేను రెండణాలు ఆయనకు యివ్వబోయాను. ఆయన దానిని తీసుకోవడానికి నిరాకరించారు. ఆయనకు వస్త్రమే కావాలన్నారు. ఆయన అడిగింది యిచ్చాను.

అప్పుడాయన దాపున వున్న ఒక చెట్టు నుంచి ఒక ఆకు తుంచి నా చేతిలో పెట్టారు. నా చేతిలో వున్నది విభూతి అయింది. నేను ఆశ్చర్యంతో ఆయన ముఖం కేసి చూసినప్పుడు, నాకు ఏదో మనశ్శాంతి కలిగి నట్టయింది. మీరు కుటుంబంగా ఓడనెక్కి కొన్ని నెలల్లో ఈ దేశం వదిలి వెళతారు అని చెప్పారు. నేను మలయా వెళ్లడానికి నాలుగయిదు నెలల ముందు ఈ సంఘటన

జరిగింది. సన్యాసిని చూసినప్పుడు మలయా ప్రయాణం గురించి అనుకోలేదు. రెండు మూడు నెలల తర్వాత మలయా వెళ్లడానికి నేను సిద్ధపడినప్పుడు సన్యాసి మాటలు నాకు అద్భుతంగా అనిపించాయి.

మద్రాసులో రెండవసారిగా నేను ప్రాక్టీసు ప్రారంభించి ఒక సంవత్సరం కాగానే మా పెద్దమ్మాయి చెల్లమ్మ రోగగ్రస్తురాలయింది. తల్లి వ్యాధే ఆమెకు పట్టుకుంది. పది నెలల పాటు మంచం పట్టిన ఆమెకు కూడా డాక్టర్ కేశవ పై చికిత్స చేశారు. ఆయుర్వేద చికిత్స ప్రకృతి చికిత్సతో చేసి చూశాము. ఎటువంటి ప్రయోజనమూ కనిపించలేదు. రోజురోజుకూ ఆమె వ్యాధితో కరిగిపోయి చిక్కి శల్యమైపోయింది. చికిత్స ఖర్చులను చేతిలో డబ్బులు లేక నేను పడే యాతన చూసి, ఆమె దగ్గర వున్నప్పుడు ఒకనాడు అడిగింది. దీనికంతా అర్థం ఏమిటినాన్నా? నేను తీరని రోగంతో బాధపడడానికి మీరిలా అవస్థపడడానికి. ఈ బాధలకు మనమే పాపం చేశాం నాన్నా?

సమాధానం చెప్పలేని ప్రశ్నలు చాలసార్లు నన్ను నేనే ప్రశ్నించుకున్న ప్రశ్నలు.

'నయం చేయలేని జబ్బుకదా తల్లీ, నువ్వెందుకిలా అడుగుతావు!' అని మాత్రమే నేను ఓదార్పు చెప్పగలిగాను. తను మరణాన్ని సమీపిస్తున్నట్టు ఆమె గ్రహించసాగింది. దాన్ని గురించి తరుచూ చెప్పేది. తన భౌతికకాయాన్ని శ్మశానానికి ఏవిధంగా తీసుకుపోవాలన్న సంగతి కూడ ఆమె చెప్పసాగింది. అటువంటి సమయాల్లో నేనామె దృష్టిని మరోవైపుకు మరల్చడానికి ప్రయత్నించాను.

'అత్తాళచ్చిర బావి నీళ్లు తాగాలి' అని ఒక రోజు ఆమె తన ఆశను వెలిబుచ్చింది. ఒలవక్కోట్‌కు సమీపంలో వున్న మా యింటికి పేరు 'అత్తాళచ్చిర! వార్తను నేను ఒలవక్కోట్‌కు తెలియజేశాను. మర్నాడు ప్రొద్దునే ఒక గాజు జాడీలో ఆ నీళ్లు నింపి ఒక మనిషి మద్రాసు తీసుకు వచ్చారు. దానిని ఎంతో ఉద్వేగంతో తాగింది. రెండు గంటల తర్వాత నెత్తురు కలిసినట్టు వాంతి చేసింది. చాలసేపు అలసిపోయి స్పృహతప్పి వున్నది. మధ్యాహ్న సమయంలో ముఖం కాస్త తేట పడింది. కాస్త మనశ్శాంతితో మేము భోజనం చేయడానికి వెళ్లాము. పగలంతా అదే స్థితిలో వున్నది. రాత్రి అందరూ పడుకునేవరకూ ఏమీ తోచలేదు. పడుకోవడం, లేచి కూర్చోవడం, నడవడం అలా ఆమె మంచం దగ్గరే నేను పొద్దుపుచ్చాను. అమ్మ కూడా ఆమె దగ్గరే వుంది, రాత్రి ఒంటిగంట కాగానే ఆమె నన్ను పిలిచింది; పిల్లలందరినీ తీసుకురమ్మంది, అందరూ వచ్చారు, ఒక్కొక్కరినీ చూసింది, 'నాన్నా నేను

వెళుతున్నాను! అన్నది గట్టిగా ఆ మాటలు చెబుతూ చెల్లమ్మ మమ్మల్నందరినీ వదిలి పరలోకం వెళ్లిపోయింది.

మరణం ఒక మార్పుమాత్రమే అయినప్పటికీ నా ప్రియమైన కుమార్తె ఆమె పడుకున్న పడక ఖాళీగా వుండడం చూసేప్పుడు, అవిశ్వాసంనాకు మనశ్శాంతిని యివ్వలేదే? మరెవ్వరికీ జరగనిది నాకు జరిగిపోలేదు. జీవన ప్రయాణంలో ప్రీతి పాత్రమైన చాలా మందిని దారిలో వదిలి వెళ్లవలసివుంటుంది. ప్రయాణాన్ని ఎలాంటి పరిస్థితులలోనూ కొనసాగించే తీరాలి, వేరే మార్గం లేదు. చనిపోయేప్పుడు ఆమెకు పద్ధెనిమిది సంవత్సరాలే. నేను పసిదాన్నే కదా? నాకు జీవితం యిప్పుడే కదా ఆరంభమవుతోంది? మరి యిప్పుడే అదీ ముగింపు వెతుక్కుంటొంది. ఎందువల్ల నాన్నా అని ఒకసారి ఆమె నన్నడిగిన సంగతి ఎలా మరిచిపోను?

'దేవుని సమక్షాన్ని కోరండి. ఆయన చూపే వెలుగులో హృదయం వికసించనీయండి. ఆ మహాశక్తి అనుబంధం రోజు రోజుకూ దృఢపడనీయండి. కూర్చునేప్పుడు, నడిచేప్పుడు, పడుకునేప్పుడు అది జ్ఞాపకాలనుంచి తొలగి పోకుండా వుండనీయండి, మాసిపోకుండా వుండనీయండి. ఎటువంటి పరిస్థితినైనా ఎదుర్కోనే ధైర్యాన్ని మీకు యివ్వనీయండి' అన్న కరుణా వాక్యాలను తలచుకుని నేను మనశ్శాంతిని పొందడానికి ప్రయత్నించాను.

మద్రాసు వదిలి వెళ్లాలన్న కోర్కెనాలో ఎక్కువయింది, మలయాలో వున్న మరికొందరి మిత్రులకు కూడా అక్కడవున్న పరిస్థితులను గురించి తెలియజేయమని రాశాను. వాళ్లూ నేను అక్కడికి రావడానికి ఉత్సాహాన్ని వెలిబుచ్చారు. మలయాకు వెళ్లడం నిశ్చయమైపోయింది. అయితే వెళ్లడానికి మార్గం తెలియకుండానే నిశ్చయించుకున్నాను! దైనందిన ఖర్చులకే బాధపడే నేను, నాకు, నా కుటుంబానికి అయ్యే ఓడ ఖర్చులకు ఎక్కడినుంచి డబ్బు తేగలను? వాళ్లను ఊళ్లో వదిలి ఒంటరిగా వెళ్లడానికి నాకు మనసురాలేదు. డబ్బు యిబ్బంది వచ్చినప్పుడు అప్పు యివ్వడానికి కూడా యితరులు జంకుతారు. ఈ సమయంలో చెప్పలేనంత విరక్తి, బాధ కలిగిందంటే ఆశ్చర్యం లేదు కదా? ఎటువంటి రకరకాల మాటలను, సాకులను, ఉపదేశాలను నేను వినవలసి వచ్చింది? అయినప్పటికీ అటువంటి క్లిష్టపరిస్థితులలోనూ, నాకు హృదయ పూర్వకంగా సహాయం చేసిన ఒకరిద్దరు మిత్రులనూ, కురుప్పత్తు కుట్టి కృష్ణమీనన్నూ, కారూర్ నీలకంఠన్ నంబూద్రిపాద్నూ నేను

మరచిపోలేను. ఇంటి సామాన్లను అమ్మడంలో వచ్చిన డబ్బు అప్పుగా తెచ్చుకున్న డబ్బు ఓడ టిక్కెట్లకూ దారి ఖర్చులకూ సరిపోయేట్టుంది.

1927వ సంవత్సరం ఆగస్టు పందొమ్మిదో తేదీ సకుటుంబంగా నేను మద్రాసులో ఓడ ఎక్కాను. కుట్టి కృష్ణమీనన్, మరి యిద్దరు ముగ్గురు మాకు వీడ్కోలు చెప్పడానికి హార్బరుకు వచ్చారు. ఒక చోట మనకు ఏర్పడే అనుభవాలు బట్టే మనకు ఆ చోటు మీద అభిమానమో, విరక్తో, ఏర్పడుతుంది. మద్రాసులో నాకు కలిగిన విషాదపు అనుభవాలవల్ల కాబోలు, నేను ఆ చోటు నుంచి బయలుదేరేప్పుడు వేదన కల్గలేదు. సాయంత్రం నాలుగు గంటల ప్రాంతంలో ఓడ హార్బర్ నుంచి బయలుదేరింది. మద్రాసును విడిచిపెడుతూ దూరంగా వెళ్లింది. తీరం కనపడేవరకు మేము పై అంతస్తులో నిలబడి చూశాము.

ఆ ఓడలో చాలామంది కార్మికులు వున్నారు. మలయాకు వెళ్లే అన్ని ఓడల్లో నూ, వాళ్లు వుంటారు. వాళ్లు కూర్చోవడానికి, పడుకోవడానికి, భోజనం చేయడానికీ సౌకర్యం లేని స్థితిలోనే ప్రయాణం చేశారు. ఓడ అధికారుల మాటలు కూడా అలాగే వున్నాయి.

వివిధ దేశాలకు కూలికోసరం మనదేశం నుంచి చాలామంది వెళ్లారు. తెల్లవారికి సొంతంగా వున్న తోటలలో పనిచేయడానికి వాళ్లు అవసరమయ్యారు. అందుకోసరమే మలయా, లంక, మారిషస్, పశ్చిమ భారత దీవులు, ఫిజీ, దక్షిణాఫ్రికా మొదలైన ప్రాంతాలలో కూలిపనులు చేయడానికి భారతీయులను వాళ్లు తీసుకుపోయారు. అది మన దేశ జనాభాను తగ్గించి సంపదను పెంచడానికి దోహదం చేసి వుండవచ్చు. అయితే మన జాతీయ గౌరవాన్ని దేశభక్తికి నశింపచేయడానికి దోహదం చేసింది. భారతీయులు కూలి వాళ్లు అని, విదేశీయులు మనల్ని అంచనా వేయడానికి అది దోహదం చేసింది. ద్వితీయ ప్రపంచ సంగ్రామం తర్వాత అనేక దేశాలు స్వాతంత్రం పొందాక అక్కడక్కడ వున్న భారతీయుల సమస్యలు మనకూ, ఆ దేశస్తులకూ పెద్ద తలనొప్పిగా తయారయింది. అది యింకా పరిష్కారం కాలేదు.

విశ్రాంతి కాలం ముగిసి మలయా తిరుగు ప్రయాణమవుతున్న భారతీయ అధికారులు ఆ ఓడలో కొందరున్నారు. వారితో మాట్లాడినందువల్ల, మలయాలో బాగానే బతక వచ్చునిపించింది. మద్రాసు విషాద అనుభవాలు మరుగున పడసాగాయి. అయినప్పటికీ ఏకాంతంలో రకరకాల ఆలోచనలు రాసాగాయి. కొన్ని సందర్భాలలో ఉత్సాహం కలిగించే ఆలోచనలు, మరికొన్ని

సమయాలలో విపాద జ్ఞాపకాలు, మిత్రులతో సన్నిహితంగా కలిసి మాట్లాడడానికి ఓడ ప్రయాణం అవకాశం యిచ్చినా, ఏకాంతంలో కూర్చుని ఆలోచనలను రేకెత్తించే సందర్భాలు కూడ ఓడ ప్రయాణంలో తటస్థిస్తాయి.

ఉదయం సముద్రం నుంచి పైకి వచ్చే ఉదయభానుని అహ్లాదకరమైన దృశ్యం, సాయం సంధ్యలో సముద్ర గర్భంలో దాక్కునే సాయం సూర్యకిరణాలు వివరించలేని భావాలను మనసులో కలిగిస్తాయి. అలలు వరుసగా చంద్రుని కిరణాలలో పైకి లేచిపడే దృశ్యం చూసే ఆనందంలో, ఆకాశంలో మెరిసే కోటానుకోటి నక్షత్రాలను తిలకించే పరవశమైన అనుభవం వర్ణనాతీతం!

గత కాలం గురించిన ఆలోచనలు ఒక్కొక్కటిగా నా మనసులో మెదలసాగాయి. నాకు నలభై ఒక్క సంవత్సరాలు అయినప్పటికీ యితరుల సహాయం లేకుండా నేనూ నా కుటుంబం బతకడానికి కావలసిన ధనం నేను సంపాయించలేదు. నా వయసులో చాలామంది మిత్రులు మంచి స్థితిలో వున్నారు. నేను అప్పు మాత్రమే సమకూర్చుకుని వున్నాను. భవిష్యత్తు గురించి దిగులు ఏదీ లేకుండా హాయిగా ప్రాక్టీసు చేసుకుంటూ వుండవలసిన వయసులో కొత్త జీవితం ప్రారంభించడానికి మరో దేశానికి బయలుదేరాను. ఇది నా విధి జీవితాన్ని ఉపయోగించుకోవడానికి తిరస్కరించాను. దానికి తగ్గ శిక్షా అనుభవించాను. ఆర్థిక స్వాతంత్ర్యం పొందడానికే మొదట ప్రయత్నం చెయ్యాలి. అది లేకుండా మరేదీ చేయలేము. ఇక మీదటైనా ప్రయత్నించి అవకాశాలను ఉపయోగించుకోవాలని నిశ్చయించుకున్నాను.

అయితే యింతవరకూ, జీవించిన జీవితం, ఓడిపోయినదని మనసు ఒప్పుకోలేదు. ముందు జాగ్రత్తలేని వాడిగా వుండవచ్చు. అయితే జీవితాన్ని వృధాచేసినట్టు భావించ వచ్చునా? ధనార్జన విషయంలో ఓటమినే చవిచూశాను. అయితే జీవిత జయాపజయాలను ఒక్క డబ్బే నిర్ణయిస్తుందా?

ఒక స్థితిలో చూస్తే విపాద అనుభవాలు జీవితానికి అవసరమైనవే అని భావిస్తువున్నాను. ఆత్మవిశ్వాసం కలిగించడానికి, ఆత్మధైర్యం పెంపొందించుకోవడానికీ ఆ స్థితి దారిచూపుతుంది. ఆధ్యాత్మిక భావాలను గుర్తుచేయడానికి అదొక అవకాశంగానే అమరుతున్నది. అంతరాత్మకి ద్రోహం లేకుండా జీవితాన్ని కొనసాగించ వచ్చు అంటే విధి చూపిన కఠినమైన మార్గాలు అంతగా భరించరానివిగా అనిపించడంలేదు. విపాధ అనుభవాలతో పోరాడుతూ జీవితంలో విజయం సాధించిన చాలామంది చరిత్రలను నేను జ్ఞాపకం తెచ్చుకొన్నాను. జీవితంలో ఓటమి అన్నదే మనలో దాగివున్న శక్తిని వీలైనంత వరకూ ఉపయోగించక పోవడం వల్లనే కదా? మనలో చాలామంది ఎలాగైనా

జీవించాలనే ఉత్సాహం కలిగివున్నారు. జీవితాన్ని ఒక బాధ్యతగా మనం భావించడం లేదు. దానికొక లక్ష్యంలేదు; నిశ్చయంలేదు. ఉన్నత లక్ష్యం అన్నభావమూ లేదు. అయితే ఆదర్శమూ, కర్తవ్యనిర్వహణ, లక్ష్యసాధనపట్ల ఉత్సాహం ఉన్నవాళ్లే ప్రపంచాన్ని ఉన్నత స్థితికి తోసుకొచ్చారు. ఇవాళ మనం అనుభవించే మంచికి, జీవితపు వసతులకూ, వాళ్లే కారణం!

ఆగస్టు ఇరవై అయిదో తేదీ ఓడ స్వెట్టన్ హామ్ రేవు చేరింది. ముందుగానే నిర్ణయించిన ప్రకారం పెనాంగ్‌కు వెళ్లలేదు. బి.కె. నంబియార్ ఆరోగ్యం సరిగ్గాలేక చికిత్స పొందుతూ వున్నారు. అందువల్ల కౌలాలంపూర్‌లో ప్రాక్టీసు చేస్తున్న వీరాస్వామి అనే బారిష్టర్‌కు నా గురించి ఆయన రాశారు. వీరాసామితో వున్న జి.కె. నారాయణన్‌అనే బారిష్టరును మద్రాసులోనే నాకు పరిచయం చేశారు. ఆయన నన్ను తనతో చేర్చుకునేందుకు అంగీకరించారు. అందువల్లే కౌలాలంపూర్‌కు బయలుదేరాను. జి.కె. నారాయణన్, స్వెట్టన్‌హామ్ రేవులో నన్ను తీసుకువెళ్లడానికి వచ్చారు. ఓడ నుంచి దిగినప్పుడు నా దగ్గర పదహారు రూపాయలే వున్నవి. వాటిని మార్చి పది డాలర్లు చేసుకుని, నేను నా కుటుంబసభ్యులు కౌలాలంపూర్‌లో వున్న అతని యింటికి వెళ్లాము. మలయా దేశంలో కొత్త జీవితం ప్రారంభించాను.

# కొత్త జీవితం

ఆ రోజులలో మలయాకు ఇవాళ చూస్తున్న మలయాకు చాలా భేదం వుంది. పెనాంగు, మలాక్కా, సింగపూర్ మొదలైన ప్రదేశాలు ప్రత్యక్షంగా బ్రిటిష్‌వారి పరిపాలనకు లోబడి వుండేవి. 'స్టేట్ సెటిల్ మెంట్స్' అని వాటిని వ్యవహరించేవారు. వాటి రాజధాని నగరం సింగపూర్. తొమ్మిది 'స్టేట్' లు మలయాలో వుండేవి. 'బేరాక్', 'సిలాంగూర్', 'నికరీ', సెంపిలాన్', 'బహాంగ్', మొదలైన నాలుగు స్టేట్‌లు ఒక పరిపాలనలో వుండేవి. దానిని 'ఎఫ్.ఎమ్.ఎస్.' అని వ్యవహరించేవాళ్ళు. ఆ రాష్ట్రాల రాజధాని కౌలాలంపూర్. ఈ నాలుగు ప్రదేశాలలోనూ, బ్రిటిష్ వాళ్లు సుల్తానుల పేర్లతో పరిపాలన సాగించారు. మిగిలిన అయిదు స్టేట్లలో 'జోహూర్' 'కెలన్‌దాన్' 'పేర్లిస్' 'ట్రెంకానో' 'కెడా' మొదలైన ప్రాంతాలలో సుల్తానులే పరిపాలన జరిపారు. ఒక్కొక్క స్టేట్‌లోనూ, బ్రిటిష్ అధికారి వుండేవారు. సలహాదారు పేరుతో ఆయన వున్నప్పటికీ నిజానికి అయనే పరిపాలకుడు.. ఈ విధంగా మూడు రకాల పరిపాలనా పద్ధతులు ఆ రోజులలో మలయాలో వుండేవి. రెండవ ప్రపంచ సంగ్రామం ముగిసిన తర్వాత మలయా స్టేట్స్ ఒక ఫెడరేషన్ అయింది. కౌలాలంపూర్ దాని రాజధాని నగరం. ఇప్పుడు, మలయా, సింగపూర్ వేరు వేరు రాజ్యాలు.

దాదాపు అరవైలక్షల జనాభాగల మలయాలో నలభైనాలుగు శాతం మలయా వాళ్లు, ముప్పైఎనిమిది శాతం చైనీయులూ, పదకొండు శాతం భారతీయులు వున్నారు. మిగిలిన వాళ్లలో యూరోపియన్లు, మిగతా తెగలవాళ్లూ వుండేవారు. అక్కడ వున్న భారతీయులలో నూటికి ఎనభైఅయిదుమంది రబ్బరు తోటలలోనే, నగరపాలక సంఘాలలోనే, పబ్లిక్‌వర్క్స్ డిపార్ట్‌మెంట్‌లోనే, పనిచేసేవాళ్లు, మిగతా వాళ్లు చిన్న చిన్న అధికారులు, గుమాస్తాలు, ఉపాధ్యాయులు, డాక్టర్లు, బారిస్టర్లు, వ్యాపారులు అందరూ వుండేవాళ్లు. ఆర్థికపరంగా మలయా చాలా అభివృద్ధి చెందిన దేశం, అడవిగా వున్న ప్రదేశాలు మంచిరోడ్డు, పెద్ద భవనాలు, ఇతర వసతులుగా ఏర్పడ్డాయి. ఆ కాలంలో మలయాలో జాతీయ భావం అంటూ ప్రజలలో ఎలాంటి వికాసమూ

ఏర్పడలేదు. భారతీయులలో చాలామంది ఉద్యోగం, వ్యాపారం చేస్తూ రోజులు గడిపే వాళ్లు.

అక్కడ వకీలు ప్రాక్టీసు చేసే విధానంలో కొన్ని ప్రత్యేకమైన అలవాట్లు వుండేవి. భారతదేశం నుంచి వచ్చే న్యాయమూర్తులను, అక్కడ ప్రాక్టీసు చేయడానికి అనుమతించడంలేదు. బారిష్టర్లు సొలిసిటర్లు మాత్రమే అక్కడ ప్రాక్టీసు చేయడం సాధ్యం. లేకుంటే అక్కడ నిర్వహించే ఒక ప్రత్యేకమైన చట్ట పరీక్షలో వుత్తీర్ణులయితే ప్రాక్టీసు చేయవచ్చు. అలాంటివారు చాలా తక్కువగా వుండేవారు. ఆనాటి బ్రిటిష్ వారయిన బారిష్టర్లు; సొలిసిటర్లు మాత్రమే అక్కడ ఎక్కువగా ప్రాక్టీసు చేసేవారు. కొందరు చైనావాళ్లు, భారతీయులు, కూడ వుండేవారు. ఇవాళ చైనా, మలయా, బారిష్టర్లు సంఖ్యలో పెరిగివున్నారు. ఆ కాలంలో యింతమంది లేరు. కౌలాలంపూర్‌లోనూ, సింగపూర్‌లోనూ విడి, విడిగా ఉన్నత న్యాయస్థానాలు వుండేవి.

మలయాలో న్యాయవాది విడిగా ప్రాక్టీసుచేయడం లేదు. ముగ్గురు నలుగురో లేదా యింకా ఎక్కువ మందో కలిసి ఒక కంపెనీగా ఏర్పడి ప్రాక్టీసు చేయడం అలవాటుగా వుండేది. ఈ పద్ధతిలో కొంత సదుపాయం కూడా వుంది. కొందరికి కోర్టుకు వెళ్లి కేసు వాదించడానికి ఆసక్తి వుంటుంది. వాళ్లు దానిని ఉత్సాహంగా చేపట్టవచ్చు. మరికొందరికి న్యాయస్థానంలో సంబంధం వుండదు. కార్యాలయంలో వుంటూ, పార్టీవారికి కావలసిన సలహాలివ్వడం, కేసు నిర్వహించడానికి కావలసిన పత్రాలు సరిచేయడంలో ఎక్కువ ఆసక్తి సామర్థ్యం కలిగివుంటారు. అందరూ వారి వారి నైజానికి, ఆసక్తికి తగ్గట్టుగా ప్రాక్టీసు జరుపవచ్చు. ఒకరు కొత్తగా ప్రాక్టీసు ప్రారంభించేప్పుడు ఇలాంటి ఏదైన ఓ వృత్తి సంస్థలో చేరినట్లయితే, ప్రాక్టీసు కోసం పార్టీలను ఎదురుచూడవలసిన అవసరం లేదు. కొంతకాలం ఒక కంపెనీలో జీతానికి ఉద్యోగం చేసిన తర్వాత, అందులో ఒక భాగస్వామిగానే చేరవచ్చు. ఒక్కొక్కరి దగ్గరా విడివిడిగా ఫీజు తీసుకోవడం సాధ్యం కాదు. మొత్తం ఆదాయాన్ని మొత్తం రాబడిమీద కార్యాలయనిర్వహణ ఖర్చులు పోను, మిగిలిన దానిని ఒప్పందం ప్రకారం ప్రాక్టీసు చేసే భాగస్వాములు పంచుకుంటారు. పలుచోట్లలో ఒకే కంపెనీవాళ్లు కార్యాలయాలు ఏర్పాటు చేసుకుంటారు. ప్రధాన కార్యాలయం ఒక చోట, శాఖలు వేర్వేరు ప్రాంతాలలో వుంటాయి. ఆ రోజులలో మలయా; సింగపూర్‌లో వున్న వృత్తి విధానం ఇది.

జి.కె. నారాయణన్, వీరాస్వామి యిద్దరూ భారతీయులు. 'సాండేర్స్ అండ్ కంపెనీ' అన్న పేరుతో ఒక సంస్థను ఏర్పరచి, భాగస్వాములుగా కౌలాలంపూర్‌లో ప్రాక్టీసు జరిపేవారు. వీరాస్వామి, అక్కడ చట్ట నిర్ణయ

సభలో భారతీయ సభ్యులుగా వుండేవారు. మధుర స్వభావం, వాక్చాతుర్యం గల ఆయన ప్రజల మధ్య మంచి పలుకుబడి వున్న బారిష్టరుగా వెలుగొందారు. కౌలాలంపూర్ నుంచి నూరు మైళ్ల దూరంలో మలాక్కా అనే చోట కొత్తగా ఒక కార్యాలయం తెరిచి, అక్కడ నన్ను బసచేయడానికి నిర్ణయించారు. ఆ రోజుల్లో, మలయాలో వచ్చి ఆరునెలలు గడిపిన తర్వాతే ప్రాక్టీసు చేయవచ్చు అన్న చట్టం అమలులో వుండేది. ఆ ఆరునెలల కాలానికి నాకు ఒక కొంత మొత్తం జీతంగా యివ్వడానికి తర్వాత జీతాన్ని పెంచేట్టు, నిర్ణయించారు. ఈ ఏర్పాటుకు ఒప్పుకుని, నేను నా కుటుంబం మలాక్కా వెళ్లాము, అక్క 'సాండేర్స్ అండ్ కంపెనీ' వాళ్లు కొత్తగా తెరిచిన కార్యాలయాన్ని నాకు అప్పగించారు. నా వల్ల న్యాయస్థానం వెళ్లి కేసు జరపడం సాధ్యం కాదు కాబట్టి; వారానికొకసారి నారాయణన్‌గాని, వీరాస్వామిగాని వచ్చేవారు. ఈ విధంగా ఆరు నెలలు గడిచింది. నాకు నెలానెలా లభించే జీతం, ఖర్చుకు చాలేది కాదు. ఆరు నెలలు గడిచిన తర్వాత వాళ్లు అదనంగా ఇస్తామన్న మొత్తం కూడా అంత ఎక్కువేమీకాదు. పైగా నేను ప్రాక్టీసు చేయడానికి ప్రభుత్వ అనుమతి కోసరం ఫీజువేరే ఐదువందల డాలర్లు కట్టవలసివచ్చింది. అందువల్ల ఆలోచించిన తర్వాత నాకు ఈ ఏర్పాటు తృప్తికరంగా లేదు. సాండర్స్ కంపెనీని వదలి, సొంతంగా ప్రాక్టీసు చేయడమే మేలు అని భావించాను. అందుకోసరం ఏర్పాట్లు చేయసాగాను. అది అంత సులభంకాదు.

కొంతైనా పెట్టుబడి లేకుండా, అక్కడ ప్రాక్టీసు ప్రారంభించడం సాధ్యం కాదు. బసచేయడానికి మాత్రమే కాకుండా, కార్యాలయానికి తగిన ఒక స్థలం, అద్దెకు తీసుకోవాలి. కార్యాలయానికి కావలసిన సాధన సామాగ్రి కొనాలి. ప్రాక్టీసు బాగా స్థిరపడేంతవరకు మూడు నాలుగు మాసాలు కార్యాలయం నిర్వహించడానికి డబ్బుకావాలి.

నలుగురైదుగురు గుమాస్తాలకు జీతం ఇతర ఖర్చులు, అన్నిటికీ కలిపి ఒక పెద్ద మొత్తం ఖర్చుపెట్టాలి. నా చేతిలో ఏమి లేదు. సాండర్స్ కంపెనీ వదలి సాయంకాలం నేను ఇల్లుచేరిన తర్వాత, మర్నాడు ఏం చేయడానికి ఒక నిర్ణయం లేదు.

ఒక వారం గడిచింది. ఆరు నెలలుగా అక్కడికి వచ్చివుండడంవల్ల అక్కడ చాలామందిని పరిచయం చేసుకునే అవకాశం ఏర్పడింది. ఆ విధంగా పరిచయమైన ఒకాయన నాకు వేయిడాలర్లు కార్యాలయం ప్రారంభించడానికి అప్పు గా యివ్వడానికి సిద్ధపడ్డారు. ఆ సహాయం పొంది, 1928వ సం॥ జూన్ నెలలో మలాక్కాలో ప్రాక్టీసు ప్రారంభించాను. ఎక్కువ కాలం జాప్యం

చేయకుండా అక్కడ నుంచి ముప్పైమైళ్ళ దూరంలో మూవార్ అనే చోట ఒక కార్యాలయం ప్రారంభించాను. అది జోహూర్ స్టేట్‌లో వుండేది. మలాక్కా బ్రిటిష్ వారి ప్రత్యక్ష అధికారానికి లోబడిందని చెప్పాను కదా! సోమవారం నుంచి శనివారం వరకు అయిదు రోజులు నేను మలాక్కాలో వుండేవాణ్ణి. శని-ఆదివారాలలో నేను మూవార్‌కు వెళ్లాను. జోహూర్ సుల్తాన్ మహమ్మదీయుడు కావడం వల్ల అక్కడ గురు-శుక్రవారాలు సెలవురోజులు. అందువల్ల విరామం లేకుండా వారంలో ఏడురోజులూ పనిచేశాను.

వ్యాజ్యపు దారుల్లో చైనావాళ్లు, తమిళులు, మలయావాళ్లు అందరూ వుండేవారు. ఆయా భాషలు తెలిసిన గుమాస్తా కావలసి వచ్చింది. పార్టీలు వారిని చూసి, వాళ్లు చెప్పినదాన్ని రాసుకుని, ఆంగ్లంలోని అనువదించి 'స్టేట్‌మెంట్స్' తయారుచేయాలి, అది ఒక గుమాస్తాపని. న్యాయస్థానానికి వెళ్లి అక్కడ కాగితాలను సక్రమంగా పెట్టుకోవడానికి, విచారణకు వచ్చే కేసులను గురించి తెలుసుకుని పనిచేయడానికి ఒక కోర్టు క్లర్క్ వుంటాడు. భూమికి సంబంధించిన కేసులను, పత్రాలను రిజిస్టర్ చేయడానికి, లాండ్ ఆఫీస్‌కు వెళ్లి పనులు చూడడానికి ఒక లాండ్ ఆఫీస్ క్లర్క్ కావాలి. పత్రాలు రాసి సిద్ధం చేయడానికి 'కన్వేసింగ్' గుమాస్తా ఒకడు కావాలి. వీళ్లందరూ కాకుండా, టైపిస్టు, అటెండర్ అంటూ ఒక్కొక్క న్యాయవాది ఆఫీసులోను ఏడెనిమిది మంది దాకా జీతాలు పుచ్చుకునేవారు వుండేవారు. రెండు కార్యాలయాలలో ఆ రోజుల్లో నాకు నెలకు వెయ్యిడాలర్లు ఖర్చుపెట్టవలసి వస్తుందని అనిపించింది.

కార్యాలయం ప్రారంభించి ఎక్కువ రోజులు గడిచే లోపలే, ఉత్సాహం కలిగించేవిధంగా ఆదాయం రాసాగింది. క్లిష్టపరిస్థితులు తగ్గాయి. మంచి కాలం ప్రారంభమయింది అని నేను తృప్తితో సంతోషంతో పనిచేయసాగాను. పరిస్థితి ఇదే విధంగా కొనసాగినట్లయితే కొంత డబ్బు సంపాదించుకుని మాతృదేశానికి తిరిగి వెళ్లవచ్చన్న విశ్వాసం కూడ నాలో వేళ్లూన సాగింది.

మలక్కా ఒక పెద్ద నగరం కాదు. పదిహేనవ శతాబ్దం ప్రారంభంలో పోర్చుగీసు వారు మలక్కాలో వచ్చి స్థిర పడ్డారు. చాలాకాలం అది వారి కాలనీగా వుండేది. పోర్చుగీసు నాగరికత చిహ్నాలు అక్కడ విరివిగా చూడవచ్చు. పోర్చుగీసు జాతికి చెందిన ప్రజలు చాలామంది ఇంకా మలాక్కాలో వున్నారు. వాళ్ల మాతృభాష పోర్చుగీసే, ఆచార వ్యవహారాలలో చాలా మార్పులు వచ్చినప్పటికీ వాళ్లు తమను పోర్చుగీసుకు చెందిన వారుగానే అభిమానంతో భావిస్తున్నారు.

మలాక్కాలో చైనీయులు, మలాక్కావారు కాకుండా, అధిక సంఖ్యలో భారతీయులు కూడా వున్నారు. 'మలాక్కా భారతీయులు' అన్న ప్రత్యేక తెగ

వాళ్లు అక్కడ వుండేవారు. వాళ్లు ఎక్కువగా లేరు. తరతరాలుగా వాళ్లు స్థిరంగా జీవిస్తున్నారు. వారి పూర్వీకులు తమిళులే. అయినప్పటికీ తమిళ భాషను మరిచిపోయారు. మలాయ్‌భాష మాట్లాడుతూ కొన్ని మార్పులతో హిందువుల ఆచారవ్యవహారాలను ఆచరిస్తూ వస్తున్నారు.

సమీపంలో వున్న రబ్బరుతోటలలో గుమాస్తాలుగానూ, అధికారులుగాను, చాలామంది మలయాళీలు వుండేవారు. పనులు ముగిశాక, సాయం సమయాలలో భారతీయులందరూ కలిసి, సంతోషంగా పొద్దుపుచ్చడానికి ఒక క్లబ్ ఏర్పరచడానికి నేను మొట్టమొదట ప్రయత్నించాను. భారతీయుల సాంఘిక జీవనంలో కొంతైనా అది మార్పు తీసుకువచ్చింది. పట్టణాలలో నివసించే వారు మాత్రమే కాకుండా సమీపంలో వున్న రబ్బరు తోటలలో పనిచేసేవారు కూడ అందులో సభ్యులయ్యారు. ప్రతిరోజూ సాయంకాలం అక్కడ చేరే రకరకాల భారతీయులు క్లబ్ నిర్వహించడానికి ఉత్సాహంగా సహకరించారు. ఆ సంవత్సరం దీపావళి సందర్భంగా 'మలాక్కా క్లబ్'లో మేము ఏర్పాటు చేసిన ఉత్సవాలు విజయవంతం అయిన ఫలితాలు యిచ్చాయి. మూడురోజుల పాటు ఏర్పాటుచేయబడిన ఆ ఉత్సవాలను చూడడానికి చాలామంది చాలా దూరం నుంచి మలాక్కా వచ్చారు. రెండు సంవత్సరాల పాటు నేను ఆ క్లబ్ అధ్యక్షునిగా వున్నాను. మలాక్కా నుంచి సింగపూర్ కు వెళ్లే ముందే ఆపదవినుంచి విరమించాను. ఆ క్లబ్ ఇంకా మంచి స్థాయిలో కొనసాగుతూనే వుంది.

నా పాత మిత్రులు కొందరు, నేను మలాక్కాలో వున్నప్పుడు భారతదేశం నుంచి వచ్చారు. వాళ్లలో చెప్పుకోదగ్గవారు ఆంధ్ర నాయకులు ప్రకాశం, ఆయన సతీమణి వచ్చారు. మద్రాసులో 'స్వరాజ్య' అన్న పత్రికను ప్రారంభించి, ప్రచురించడానికి 'స్వరాజ్య' కంపెనీకి వాటాలు (షేర్స్) సేకరించడానికి ఆయన వచ్చారు. ఆ రోజులలో ప్రకాశం రాజ్యసభలో ఒక సభ్యుడు. ఆయన సతీమణితో పాటు నా వద్ద ఒక వారం పాటు గడిపారు. ఆ రోజుల్లో జరిగిన ఒక సంఘటన ఇప్పటికీ నా మనసులో స్పష్టంగా గుర్తుకు వస్తోంది.

ఒక రోజు ఉదయం నేను, ప్రకాశం, ఆయన సతీమణి మలాక్కా నుంచి బయలుదేరి వెళ్లాము. నా కార్యాలయం నుంచి బయలుదేరాము. మలయాలో మంచి రహదార్లు వున్నాయి. మామూలుగా నా డ్రైవర్ అగస్త్యన్ వేగంగా కారు నడిపేవాడు. ఆరోజు మేము ముఖ్యంగా ఒక చోటకి పోవలసి వచ్చింది. అతి వేగంగా కారు నడపడం తనకు చేతనవును అని ఆ డ్రైవరు తన ప్రతిభ చూపెట్టేవాడు. ఆ రోజూ సామర్థ్యంగా కారు నడిపాడు. కారులో కూర్చున్న పది

నిమిషాలలో మేము అనుకున్న దానికన్న ఎక్కువ దూరం చేరుకున్నాము. నేను అతనితో వేగాన్ని తగ్గించమని చెప్పాను. రెండు మూడుసార్లు చెప్పినా కూడా, వాడు మా వాహనాన్ని మరో వాహనం దాటిపోనంత వేగంగా నడిపాడు. అర గంట గడిచాక కారు ఒక పొడవైన రోడ్డును చేరుకుంది. రోడ్డుకు ఒక వైపుగా కాలువ వుంది, గంటకు యాభైమైళ్ళ వేగంతో పోతున్న కారు దారి తప్పి కాలువలోకి జారింది. కాలువ వెడల్పయినది కాదు. అందువల్ల కారు కింద పడలేదు. కాలువ గట్టుకు అనుకుని పక్కగా ఒరిగిపోయింది. మాలో ఎవ్వరికీ ఏమీ జరగలేదు. ఆయుస్సు గట్టిగా వుండడం వల్ల బయట పడ్డాము. అయినప్పటికీ కారునుంచి బయటికి రావడానికి ఇతరులు సహాయం చేయవలసివచ్చింది. ఆగస్త్యన్ దీనివల్ల భయపడిపోలేదు. తన అజాగ్రత్త వల్లే ఏవత్తు వాటిల్లిందని కూడా అతను భావించలేదు. రోడ్డుసక్రమంగా లేకపోవడం వల్లే బండి దారి తప్పి, పక్కకు ఒరిగి పోయిందని చెప్పాడు. ఇలాంటి ఏవత్తులలో నేనూ ఆగస్త్యయన్ చాలా సార్లు ఇరుక్కుని బయటపడ్డాము.

కౌలాలంపూర్ నుంచి ఒకనాడు అర్ధరాత్రి మలాక్కాకు వెళ్లవలసి వచ్చింది. ఆగస్త్యన్ యథాప్రకారం కారును వేగంగా నడిపాడు. మలాక్కా నుంచి ముప్పై మైళ్ళ దూరంలో వుండే ఒక స్థలాన్ని చేరినప్పుడు, బండి దారిలో పడుకుని వున్న ఒక ఎద్దుమీదెక్కి దాపున వున్న కాలువలోకి దిగిపోయింది. కాలువ ఎక్కువ లోతులేదు. అప్పుడు నేను నిద్రపోతున్నాను. ఉన్నట్టుండి మేల్కొని చూసినప్పుడు, బయటకి దిగడానికి వీలులేకుండా కారు దిగబడి వుండడం గమనించాను. అదేదో ఒక గ్రామం. కారు చీకటిలో ఏమీ తెలియలేదు. కారు దొర్లిన చప్పుడు విని దాపున వున్న ఇళ్లనుంచి కొందరు మలయా వాళ్లు దీపాలతో వచ్చారు. నాకు ఆశ్చర్యం భయం వేసింది. ఎద్దు చచ్చి పడివుంది. ఆగస్త్యన్ వల్లగాని, నా వల్లగాని లేవడానికి వీలుకాలేదు. తెల్ల వారాక కొందరు వచ్చి సహాయంచేసి బండిని కాలువ నుంచి తీసి, రోడ్డు మీదికి చేర్చిన తర్వాత మేము ప్రయాణం కొనసాగించాము. ఆ రోజు మాత్రమే ఆగస్త్యన్ కారును కాస్త నిదానంగా నడిపాడు. కారణం అతను బాగా అలిసిపోవడం కావచ్చు!

తాను కారు నడుపుతున్నప్పుడు ఎవరెవ్వరి వాహనమూ తన్ను దాటిపోవడం అతను ఏమాత్రమూ సహించడు. ముందు వెళ్లే బండిని దాటి పోతేనేగాని అతనికి తృప్తి వుండదు. ఒకసారి మలాక్కా నుంచి ముర్వారు అనే చోటికి వెళ్లేప్పుడు, ఒక ఆంగ్లేయుని కారుని ఓవర్‌టేక్ చేసి దాటిపోయాడు. ఆ తెల్లవాడు అది పోలీస్‌కు తెలియజేశాడు. ఇతరుల క్షేమానికి భంగం కలిగించే విధంగా కారు నడిపాడన్న నేరం ఆగస్త్యన్ మీద మోపబడింది. అతని వైపు సాక్షిగా నిలబడ్డ నన్ను విచారించారు. కారు గంటకు యాభైమైళ్ళు, దాని కన్నా

ఎక్కువ వేగంతో వెళ్లినట్టు నాకు గుర్తు. న్యాయస్థానంలోనూ, అదే చెప్పాను. ఆ సాక్ష్యం ద్వారా యాభై రూపాయలు జరిమానా విధించారు. జరిమానా చెల్లించలేదంటే రెండు వారాలు జైల్లోవుండాలి. డబ్బు నేను చెల్లించినప్పటికీ, ఆగస్త్యన్‌కు శిక్ష పడడం నచ్చలేదు. 'ముప్పైమైళ్లు వేగంతోనే నడిపానని యజమాని చెప్పివుంటే శిక్ష పడివుండేది కాదు' అని ఆగస్త్యన్ బాధపడ్డాడు. 'అది సరేగాని ఆగస్త్యన్ నువ్వు యాభైమైళ్లు వేగంతోనే కదా నడిపావు?' అన్నాను. 'దాన్ని కోర్టులో చెప్పవచ్చా' అన్నాడు జవాబుగా.

ఆగస్త్యన్ గట్టివాడు మాత్రమే కాదు, విశ్వాసపాత్రుడు కూడా. పనిచేయడానికి బద్ధకం లేని వాడు. కారు నడిపేప్పుడు వేగం తగ్గించమంటే మాత్రం అతనికి గిట్టదు. వేగంగా నడపలేదంటే మోటారు కారు వుంచుకోవలసిన అవసరమే లేదన్నది అతని వాదం.

ఆగస్త్యన్ కొన్ని నెలల పాటు నాతోనే వున్నాడు. తర్వాత గ్రామం వెళ్లాడు. ఒక సంవత్సరం గడిచాక ఆగస్త్యన్ మరణవార్తవిని, ప్రియమైన మిత్రుని పోగొట్టుకున్న బాధ ఏర్పడింది.

ద్రావిడ కళగ నాయకుడు ఈ.వి. రామస్వామి నాయకర్ నేను మలయాలో వున్నప్పుడు అక్కడికి వచ్చారు. ఆత్మగౌరవ ఉద్యమ ప్రచారం చేసుకుంటూ, నాయకర్ మలయాలో చాలా ప్రదేశాలు పర్యటించారు. రెండు రోజులు ఆయన, ఆయన సతీమణి మా యింట్లో బసచేశారు. సహాయనిరాకరణోద్యమంలో పాల్గొన్న వారిగా మేము తరుచూ కలుసుకుని మాట్లాడే అవకాశం వుండేది. తర్వాత నాయకర్ కాంగ్రెస్ నుంచి విడిపోవడం మాత్రమే కాకుండా, కాంగ్రెస్‌కు వ్యతిరేకంగానూ మారారు. అయినప్పటికీ అది మా వ్యక్తి గత సంబంధాలకు అటంకంగా లేదు. మలయాలో ద్రావిడ, కళగం వాళ్లు నాయకర్ రజతోత్సవం జరిపినప్పుడు, ఆ సమావేశానికి నన్ను అధ్యక్షత వహించమని ఆహ్వానించారు. జాతీయ భావాల విషయంలో మా యిద్దరి మధ్యా ఐకమత్యం లేకపోయినప్పటికీ, ఆయన సామాజిక పురోగతికి చేస్తున్న కృషి అభినందించడానికి ఆ సందర్భాన్ని వినియోగించుకున్నాను. నాయకర్ మంచి వక్త, మంచి వాడు, ప్రజా సేవానురక్తితో పాటు, నాయకత్వం వహించే లక్షణం కూడా ఆయనలో వుండేవి. నలభైయేళ్లు కు పైగా ప్రజాసేవ చేస్తున్న నాయకర్‌ను ఆయన భావాలతో అంగీకరించలేనివాళ్లు సైతం ఆయనను ఒక సమర్థవంతమైన వ్యక్తి అని అంగీకరిస్తారు.

దాదాపు రెండు సంవత్సరాలు నేను మలాక్కాలో ప్రాక్టీసు చేశాను. నాట్టు కొట్టై చెట్టియార్‌లు చాలామంది ఇక్కడవుండేవారు. డబ్బును వడ్డీకి యివ్వడమే వారి వ్యాపారం. ఈ విధంగా వాళ్లు మలయాలో పలుప్రాంతాలలో

లక్షల కొద్దీ డబ్బును యిచ్చారు. వాళ్లల్లో చాలామంది మిత్రులుగాను, పార్టీలుగాను నాతో చాలా స్నేహంగా వుండేవారు.

చెట్టినాడు రాజాసర్ అణ్ణామలై చెట్టియార్ మలాక్కాకు వచ్చినప్పుడు ఆయనకు స్వాగతం చెప్పడానికి ఒక పెద్ద బహిరంగసభ ఏర్పాటు చేశారు. దానికి నన్ను అధ్యక్షత వహించమని పిలిచారు. ఆ రోజే అణ్ణామలై చెట్టియార్ నాకు పరిచయమయ్యారు. చెట్టియార్ వంశస్థులు ఆయన్ను చాలా ప్రేమగా ఆహ్వానించి గౌరవించారు. మలాక్కాలో జరిగిన ఆ స్వాగత సభలో నేను పాల్గొన్నది యింకా నాకు జ్ఞాపకం వుంది. అణ్ణామలై చెట్టియార్ వాక్చాతుర్యం, ఆకర్షణ ఒక్కసారి చూస్తే మరిచిపోలేనివి.

చెట్టియార్ల గురించి చెప్పేప్పుడు మలాక్కాలో నేను ప్రాక్టీసు చేస్తున్న రోజులలో ఒక క్రిమినల్ కేసులో చిక్కుకున్న చెట్టియార్ కోసరం, నేను కేసు వాదించడానికి వచ్చిన సంఘటన గుర్తుకొస్తొంది. చెట్టియార్‌ను జామీనులో విడిపించమని నేను కోర్టువారిని కోరాను. అక్కడ చెట్టియార్ వంశస్థులు గుమిగూడివున్నారు. ప్రతివాది కూడా మధ్యలో వున్నాడు. చెట్టియార్‌ను జామీన్‌లో వదలమని కోర్టువారిని కోరాను. అపరాధం ఎలాంటిదో తెలుసుకోవడానికి న్యాయమూర్తి కొంతసేపు ఆలోచించారు. చివరికి జామీన్‌మీద విడిపించమని ఆజ్ఞాపించారు. జామీన్ వివరం తెలియజేయడానికి నేను చెట్టియార్‌ను వెతికాను. ఆయన కనిపించలేదు. నాలుగు ప్రక్కలా చూశాను. పోలీసువాళ్లు వెతికారు. పోలీస్‌స్టేషన్‌లో వివరం తెలియచేశాను. చెట్టియార్‌ను చూడ్డానికి వీలుకాలేదు. న్యాయస్థానంలో గుంపులుగా ప్రజలు వున్నప్పుడు, ఎవరికీ తెలియకుండా పట్టపగలు రెండు గంటలకు తప్పించుకుపోయిన చెట్టియార్ సామర్థ్యం అందరినీ ఆశ్చర్యపరిచింది. 'నిరపరాధి' యైన నా పార్టీదారు చర్య నాకూ ఆశ్చర్యం కలిగింది. తర్వాత ఈనాటి వరకూ ఆ చెట్టియార్ గురించి ఎటువంటి సంగతీ తెలియలేదు. అతడు అక్కణ్ణించి పారిపోవడం ఎలా సాధ్యమయిందనీ నాకు యింకా అర్థంకాలేదు.

# సంక్షోభం ప్రారంభం

రబ్బరు, సీసం విరివిగా లభించే ప్రదేశం మలయా. వాటి ధరలను బట్టి మలయా దేశ వాణిజ్యం, ఎక్కువ తక్కువలు, ఆర్థిక బలాబలాలు ఆధారపడి వుంటాయి. నేను అక్కడికి వెళ్లిన రోజులలో రబ్బరుకు మంచి గిరాకీ వుండేది. రబ్బరు తోటలను కొనడం, అమ్మడం విరివిగా వర్తకం జరుగుతూ వుండేది. దానికి సంబంధించిన పత్రాలు రాసి తయారుచేయడానికి, రిజిష్టర్ చేయడానికి, చట్టానికి సంబంధించిన వారి అవసరం ఎక్కువగా వుండడంవల్ల, న్యాయవాదులకు అది సరైన ఉద్యోగంగా వుండేది. ఒక్కరిద్దరు సహాయకులతో మాత్రమే గమనిస్తూ వుండేవారు. నా మలాక్కా కార్యాలయంలో ఆ పని చేసిన వ్యక్తి చైనీయుడు. సుత్తోంగ్ అనే పేరుగల అతనికి ఆ రంగంలో మంచి అనుభవం, తెలివితేటలు వుండేవి. తన మిత్రుడైన ఒక చైనీయునికి వెయ్యి డాలర్లు అప్పు కావాలని, అతని రబ్బరు తోటను తాకట్టుగా రాసి యిచ్చేట్టు, ఎవరైన చెట్టిగారి వద్ద డబ్బు తీసివ్వమని సుత్తోంగ్ నన్ను అడిగాడు. నాకు తెలిసిన ఒక చెట్టియార్ నేను అడిగిన ప్రకారం అప్పు యివ్వడానికి అంగీకరించారు. ఆ తోటకు సంబంధించిన పత్రాలను బాగా పరిశీలించి, చూసిన తర్వాతే అప్పు యివ్వడం మంచిదని నేను చెట్టియార్‌కు సలహా చెప్పాను. అప్పు తీసుకున్న వ్యక్తి పత్రంలో నా ఎదుటే సంతకం పెట్టాడు. ఆ తర్వాత రిజిష్టర్ చేయడానికి నేను పత్రాలను లాండ్ ఆఫీసరుకు పంపాను. రెండు రోజులు గడిచిన తర్వాత పత్రం రిజిష్టర్ అవకుండా తిరిగి వచ్చింది. తోటకు స్వంతదారు చనిపోయాడని, పత్రంలో సంతకం చేసిన వ్యక్తి దొంగ సంతకం చేశాడనీ, తెలిసింది. సుత్తోంగ్‌కు ఎరిగిన వాడని నేను చెట్టియార్‌ను డబ్బుయివ్వమన్నాను. రిజిష్టర్ కాకుండా పత్రం తిరిగి రాగానే కన్నీళ్లతో చెట్టియార్ నా ఆఫీసుకు వచ్చారు. మిత్రుడు తన్ను మోసంచేసినట్లు సుత్తోంగ్ విచారించాడు. చెట్టియార్ నష్టానికి నేను చట్ట ప్రకారం బాధ్యుణ్ణి కాక పోయినప్పటికి నామాటను నమ్మి ఆయన డబ్బు యిచ్చాడన్న విషయం కాదనడానికి లేదు. డబ్బు పుచ్చుకున్న వ్యక్తి వెంటనే వూరు వదిలి వెళ్లిపోయాడు. అతను డబ్బు తిరిగి చెల్లించలేదంటే దాన్ని నేను యిచ్చేట్టు చెట్టిగారికి మాట యిచ్చాను. ఆయన కొన్ని రోజులు ఎదురుచూశారు.

పారిపోయిన వ్యక్తి గురించి ఏ సంగతీ తెలియలేదు. పోలీసువాళ్లు ఆచూకీ కనిపెట్టడానికి వీలుకాలేదు. అతను చైనాకు పారిపోయాడు. చెట్టిగారికి యివ్వడానికి నా చేతిలో డబ్బు లేదు. అందువల్ల ఆ మొత్తానికి నేను ఆయనకు ప్రామిసరీ నోట్ రాసి యిచ్చాను. అందులో నేను సంతకం చేస్తున్నప్పుడు చెట్టియార్ ముఖంలో కృతజ్ఞతా భావం, ఆశ్చర్యం, కనిపించాయి. ఆ అప్పు తీర్చడానికి రెండేళ్లు పట్టింది.

మువ్వారు కార్యాలయంలో ఇంకో అనుభవం కూడా కలిగింది. అది దీనికన్నా ఘోరమైనది. మువ్వారు కార్యాలయంలో పత్రాలను రిజిష్టర్ చేసుకుని రావడానికి వెళ్లే వ్యక్తి ఒక ఫణిక్కర్, నల్లగా కొంచెం లావుగా, పొట్టిగా చిన్న మీసంతో వుండే ఫణిక్కర్ పార్టీలతో కలుపు గోలుతనంగా వుంటూ, విషయాలు సేకరించేవాడు. పలుకుబడి కలవాడు. పార్టీలకు అతని మీద మంచి విశ్వాసం వుండేది. నేనూ అతన్ని నమ్మాను. మువ్వారు కార్యాలయానికి నేను వారంలో రెండు రోజులే వెళ్లేవాణ్ణి. పార్టీలు పత్రాలలో నా ముందు సంతకాలు చేశాక, రిజిష్టర్ చేయడానికి కావలసిన డబ్బులను నేను ఫణిక్కర్‌కు ఇచ్చేవాణ్ణి. పత్రాలు రిజిష్టర్ చేసి తిరిగివచ్చిన తర్వాత హక్కుదార్లకు వాటిని పంపేవాణ్ణి, పార్టీల పేర్లూ, పత్రాలలో సంతకాలైన తేదీ, వివరంగా తెలుసు కొవడానికి కార్యాలయంలో ఒక రిజిష్టర్ పుస్తకం పెట్టాము. పత్రాలును తిరిగి యిచ్చేప్పుడు, ఆ వివరం కోసరం హక్కుదారు సంతకం అందులో తీసుకోవాలని నేను కార్యాలయంలో నొక్కి చెప్పాను. మువ్వారు కార్యాలయానికి వెళ్లేప్పుడల్లా, నేనా రిజిష్టర్ పుస్తకాన్ని జాగ్రత్తగా పరిశీలించడం కద్దు. ఒక్కసారి కూడా అందులో తప్పు కనిపించలేదు. కొన్ని నెలలు గడిచాయి.

మలాక్కా సంఘటన జరిగి రెండు నెలలు గడిచిన తర్వాత, ఒక శనివారం నేను మువ్వారు వెళ్లినప్పుడు ఒక చెట్టియార్ నా దగ్గరికి వచ్చారు. తనకు కొన్ని పత్రాలు తిరిగిరాలేదని చెప్పారు. నేను ఫణిక్కర్‌ను పిలిచి ఎందుకు యివ్వలేదని అడిగినప్పుడు, దాన్ని ఇంట్లో పెట్టినట్లు చెప్పి తీసుకు వస్తానని వెళ్లాడు. చాలాసేపు అయినా ఫణిక్కర్ తిరిగి రాలేదు. నేను అనుమానంతో అతని యింటికి మనిషిని పంపాను. ఫణిక్కర్ ఇంటికి వెళ్లనేలేదు. వెంటనే నేను పరిశోధించి చూసినప్పుడే, నేను విశ్వాసముంచిన ఫణిక్కర్ మోసకృత్యం బయటపడింది. దాదాపు నలభై పత్రాలను అతను రిజిష్టర్ చేయడానికి పంపనేలేదు. కార్యాలయంలో వుంచిన రిజిష్టర్ పుస్తకంలో, వాటిని పుచ్చుకున్నట్టు చేసిన సంతకాలన్నీ పార్టీల నుంచి తీసుకున్నది కాదు. అవన్నీ అతనే చేశాడన్న నిజం, ఆ తర్వాతే తెలుసుకున్నాను. నేను రిజిష్టర్ చేయడానికి యిచ్చిన పైకాన్నంతా అతను తన సొంత ఖర్చుకు వాడుకున్నాడు.

ఆ మొత్తం ఎక్కువగానే వుంది. పత్రంలో సంతకం చేసిన మూడు మాసాలలోపల పత్రం రిజిష్టర్ చేయకపోతే, ఎనిమిదిరెట్లు అధికంగా రిజిష్టర్ ఫీజు చెల్లించాలి. లెక్కచూసి చూస్తే నాలుగు వేల డాలర్లుకు తక్కువ కాకుండా కట్టవలసి వచ్చింది. నేను వెంటనే 'లాండ్ ఆఫీసు' కు పోయి అధికారిని కలిశాను. ఆయనతో విషయాలు చెప్పాను. ఆయన నా మీద ప్రేమతో దయ తలచి ఆ ఊబినుంచి నన్ను కాపాడారు. అన్ని పత్రాలు రిజిష్టర్ చేయడానికి కావలసిన మొత్తాన్ని నేను నా దగ్గరనుంచి యిచ్చాను. దానికి వేయి డాలర్లు కన్నా ఎక్కువే అయింది. అయినప్పటికీ పార్టీలకు దీనివల్ల నష్టం రాలేదు.

ఒక మాసం గడిచాక, కౌలాలంపూర్‌లో ఫణిక్కర్‌ను పట్టుకుని ఖైదు చేశారు. నమ్మక ద్రోహం చేసిన ఫణిక్కర్‌కు ఎనిమిది నెలలు కారాగార శిక్ష పడింది. జైలునుంచి అతను నా కొక ఉత్తరం వ్రాశాడు. పశ్చాత్తాపంలో అతను వ్రాసిన ఉత్తరం అది. మరొకటి కూడా అతను కోరాడు. లడ్డు తినడం అంటే అతనికి యిష్టంఅట. ఎవరి ద్వారానైనా జైలుకు నాలుగయిదు లడ్డూలు పంపమని అతను రాశాడు! ఈ అసాధారణమైన కోరికను నెరవేర్చడానికి నేను జైలు అధికారుల అనుమతి పొంది లడ్డూలు పంపాను. శిక్ష ముగిసి వచ్చిన వాడు రోగగ్రస్థుడయ్యాడు. అతన్ని నా యింట్లోనే వుంచుకున్నాను. తర్వాత చికిత్స కోసం ఆస్పత్రికి పంపవలసి వచ్చింది. తర్వాత స్వస్థత పొంది ఆరోగ్యంతో తిరిగి వచ్చాక ఏదైన ఉద్యోగం యిప్పించమన్నాడు. నాకు ఆశ్చర్యం వేసింది. వెంటనే ఫణిక్కర్ 'తమరు ఒక ఉత్తరం ఇస్తేనే నాకు ఉద్యోగం దొరుకుతుంది, లేకుంటే చాలాకష్టం' అని ఏడ్చినప్పుడు నా మనసు కరిగింది. ఒకసారి తప్పు చేసినందుకు అతనికి ఏదారీ లేకుంటే వాళ్లు ఎలా బ్రతికేది? అయినప్పటికీ చేసిన తప్పును అతను దాచనూలేదు. అందువల్ల ఫణిక్కర్ కోరిన ప్రకారం నేనొక సిఫార్సు ఉత్తరం యిచ్చాను.

'నమ్మక ద్రోహం చేసి శిక్ష అనుభవించినవాడనీ, శిక్ష అనుభవించి వచ్చిన తర్వాత చేసిన తప్పుకు బాధపడుతున్నాడనీ, వృత్తికి సంబంధించినంతవరకు మంచి అనుభవమూ, తెలివితేటలు కలవాడనీ, అతనికి మంచి ఉద్యోగం దొరికినట్లయితే సంతోషిస్తానని ఉత్తరం రాసి యిచ్చాను. చాలా రోజులు గడిచిన తర్వాతే అతనికి ఉద్యోగం లభించింది. ఒక సంవత్సరం అతను పనిచేశాడు. తర్వాత ఒక రోజు పేకాట ఆడుతూ వుంది, ఛాతీలో నొప్పి అని బాధపడుతూ అలాగే చనిపోయాడు. అతని వల్ల ఏర్పడిన నష్టాన్ని ఎలాగైన తీర్చాలని అనుకుంటున్నట్టు అతను చాలాసార్లు నాకు ఉత్తరం రాశాడు. కొంతకాలం పాటు బతికివుండి వుంటే అతను ఆ ఆశ నెరవేర్చుకుని వుండేవాడేమో!

ఈ కాలఘట్టంలోనే మరో గందరగోళానికి లోనయ్యాను నేను. 1930వ సం॥ జూన్ నెలలో కౌలాలంపూర్ ఉన్నత న్యాయస్థానంలో నన్ను అడ్వకేట్‌గా రిజిష్టర్ చేసుకోవడానికి నేను వేసిన అప్లికేషన్‌ను ఆ రోజుల్లో అక్కడ వున్న న్యాయవాదుల సంఘం వ్యతిరేకించింది. నేను మొదట సింగపూర్ ఉన్నత న్యాయస్థానంలోనే కదా ఉద్యోగం చేయడానికి హక్కు పొంది చేరాను. ఎఫ్.ఎం.స్టేట్ న్యాయస్థానాలలో ఉద్యోగం చేసే వారికి కౌలాలంపూర్ ఉన్నత న్యాయస్థానంలో రిజిష్టర్ చేసుకోవాలి. 1927వ సం॥ మలయా కు వచ్చినప్పుడు నేను దాని కోసరం అప్లికేషన్ పంపాను. 1930వ సం॥ జూన్ నెలలోనే, అది పరిశీలనకు స్వీకరించబడింది. నేను రాజద్రోహనేరానికి భారతదేశంలో శిక్షపొందిన వాణ్ణనీ, అక్కడ నేను న్యాయస్థానాన్ని బహిష్కరించి సహాయనిరాకరణోద్యమంలో శిక్ష అనుభవించిన వాణ్ణనీ, న్యాయవాదుల సంఘం వాళ్లు కారణం చూపి, నా అప్లికేషన్‌ను వ్యతిరేకించారు. ఆ పైన కౌలాలంపూర్ న్యాయవాదుల సంఘ కమిటీ కార్యదర్శి జత చేసిన ప్రమాణ పత్రంలో జి.కె. నారాయణన్ రాసిన ఒక ఉత్తరం, మద్రాసు పోలీసువాళ్లు కౌలాలంపూర్ పోలీసు కమీషనర్‌కు పంపిన ఒక నివేదిక, సాక్ష్యాలుగా యిచ్చారు. అందులో చెప్పిన విషయాలు చెప్పు కోదగ్గవి.

నారాయణన్ రాశారు '1919వ సంవత్సరం నుంచి కేశవమీనన్ నాకు తెలుసు, నేను మద్రాసులో ప్రాక్టీసు చేసిన రోజులలో ఆయన కూడా అక్కడ ప్రాక్టీసు చేశారు. 1921వ సంవత్సరం ప్రారంభంలో ఆయన ప్రాక్టీసును వదిలి సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనడానికి కేరళ వెళ్లారు. పాలకులతో సహకరించకూడదన్న లక్ష్యంతో ప్రారంభమైన ఉద్యమం అది. 'న్యాయవాదులు వృత్తిని ఆపి న్యాయస్థానాలను బహిష్కరించండి, పన్నులు చెల్లించవద్దు' మొదలైనవి ఆ ఉద్యమ సిద్ధాంతాలు. 1921వ సంవత్సరం తర్వాత, ఏ సంవత్సరం అని నాకు జ్ఞాపకంలేదు. కేశవమీనన్ జైలుశిక్ష అనుభవించారు. ఏమి తప్పు చేశారో యితమిత్థంగా తెలియదు. '1922వ సంవత్సరం మలబార్‌లో జరిగిన ఉద్యమం. ఆ ఉద్యమం పర్యవసానంగా జరిగినదే.' అని ఆయన ఉత్తరంలో తెలియజేశారు.

సాండేర్స్ కంపెనీలో భాగస్వామిగా వున్నవారు కదా నారాయణన్? ఆ కంపెనీ వదలి నేను సొంతంగా ప్రాక్టీసు చేయడం ఆయనకు ఆమోదయోగ్యంగా లేదు. అందువల్ల నాకొక గుణపాఠంగా వుండడం కోసం ఈ విధంగా రాశారు కాబోలు! ఆయన చేసిన ఈ దయారహిత చర్య వల్ల నాకు ఏర్పడగల కష్టాలను ఆ అమాయక వ్యక్తి ఆలోచించి చూడలేదు కాబోలు!

నేను మలయాదేశానికి బయలుదేరు తున్నట్లు తెలియగానే 1927వ సం॥ ఏప్రిల్‌లో ఆయన నాకొక ఉత్తరం రాశారు. అందులో నా త్యాగం గురించి ఎంతో పొగిడారు. అయినా ఇప్పు డు అవన్నీ మరిచిపోయారో లేక కాదనిచేశారో?

మద్రాసు పోలీసువాళ్ళు కౌలాలంపూర్ పోలీసు కమీషనరుకు నన్ను గురించి రాసి పంపిన రిపోర్టు ఇది. పేరు: కె.బి. కేశవమీనన్, వృత్తి: సహాయనిరాకరణోద్యమదారుడు, తిరుగుబాటుదారు; చరిత్ర: మద్రాసులో పలు కార్మిక ఉద్యమాలలో సంపూర్ణంగా పాల్గొన్నవారు, ట్రామ్‌వే కార్మిక సంఘం స్థాపించడానికి ప్రయత్నించినవారిలో ఒకరు, 1921వ సంవత్సరం ఫిబ్రవరిలో కోళిక్కోడ్‌లో యాకొబ్ హసన్‌ను, ఇతరులను ఖైదుచేసినప్పు డు ప్రాక్టీసు వదిలి సహాయనిరాకరణోద్యమంలో పాల్గొనడానికి మలబార్ వెళ్లారు. మలబార్ పలు ప్రాంతాలలో పర్యటించి, ఖిలాఫత్ సహాయనిరాకరణోద్యమాలకు ప్రచారం చేశారు. కేరళ సహాయనిరాకరణోద్యమం జీవనాడి ఈయన. వైక్కం సత్యాగ్రహం సంబంధంగా 1924వ సంవత్సరం ఏప్రిల్ ఏడేతేది ఈయన్ను ఖైదు చేశారు. కోర్టు తీర్పుకు ఒగ్గి జామీను యివ్వడానికి అంగీకరించక పోవడంతో ఆరునెలలు శిక్ష పొందారు. ఆ సంవత్సరం సెప్టెంబర్ ఒకటో తేదీ చెరసాల నుంచి విడుదల పొందారు. కోళిక్కోడ్ నుంచి వెలువడే ఒక సహాయనిరాకరణోద్యమ పత్రికకు సంపాదకులుగా వున్నారు. 1925వ సంవత్సరం జూలై నెలలో మద్రాసు తిరిగి వచ్చి మళ్లీ ప్రాక్టీసు కొనసాగించారు.

నా చర్యలను, అభిప్రాయాలను న్యాయస్థానంలో తెలియజేసే ఉద్దేశ్యం నాకు లేదు. కోర్టులో నేను సమర్పించిన ప్రమాణపత్రంలో నేను ఆ విషయం తెలియజేశాను. 1915 సంవత్సరం కోళిక్కోడ్‌లో నేను ప్రాక్టీసు చేయడం ప్రారంభించిన కాలం నుంచి మలయా దేశానికి వచ్చిచేరేవరకు నేను పాల్గొని జరిపిన కార్యకలాపాలను క్లుప్తంగా తెలియజేశాను.

విచారణ వినడానికి, న్యాయస్థానంలో జనం గుమికూడారు. నా కోసం వాదించిన వారు బారిష్టర్ 'క్యాంబెల్'! న్యాయవాదుల సంఘం తరపున 'షేన్' అనే బారిష్టర్ హాజరయ్యారు. ప్రధాన న్యాయమూర్తి సమక్షంలో కేసు విచారణకు వచ్చింది. ఆయన అప్పు డే తీర్పు రాసేశారు.

'జాతీయ చింతనకు న్యాయవాది వృత్తికీ ఎటువంటి సంబంధము లేదనీ, విన్నపం చేసిన వారి దగ్గర, వృత్తి చేయడానికి సంబంధించిన తప్పు ఏమీ లేదన్నంతవరకూ ఆయన అప్లికేషన్‌ను అనుమతించ కుండా వుండడానికి ఎలాంటి కారణమూ లేదనీ అందువల్ల విన్నపదారుని ఉన్నత న్యాయస్థానంలో

అడ్వకేట్‌గా ఎన్‌రోల్ చేసుకోవడానికి అజ్ఞాపించబడింది అని న్యాయమూర్తి తెలియజేశారు.

'మీకు అన్ని విజయాలు చేకూరాలని అభినందిస్తున్నాను' అని న్యాయమూర్తి అభినందించారు.

నన్ను చాలా వేదనకూ, దిగులుకూ లోనయ్యేలా చేసిన ఈ కేసు ఈ విధంగా అనుకూలంగానే ముగిసింది.

ఆ కేసు మలయా దేశంలో మాత్రమే కాకుండా భారతదేశంలో కూడా పలువురి మిత్రుల్ని ఆకర్షించింది. విజయాన్ని అభినందిస్తూ 'హిందూ' దిన పత్రిక సంపాదకీయమే ప్రచురించింది. 'మాతృభూమి' కూడా అలాగే అభినందించింది.

రామస్వామి నాయకర్ పర్యవేక్షణలో వెలువడిన 'కుడి అరసు' పత్రిలలోనూ, వరదరాజులు నాయుడు నాయకత్వంలో వెలువడుతున్న 'తమిళనాడు' పత్రికలోనూ దీనికి సంబంధించిన సంపాదకీయాలు వెలువడ్డాయి.

కేసులో ఈ విధంగా నేను విజయం సాధించినప్పటికీ, అది తెచ్చిన చిక్కులు తీరడానికి కొంతకాలం పట్టింది.

# మలక్కానుంచి సింగపూర్‌కు

కోలాలంపూర్ సుప్రిమ్ కోర్టులో నేను న్యాయవాదిగా ప్రాక్టీసు చేయడానికి రిజిష్టర్ చేయడాన్ని వ్యతిరేకించి, న్యాయవాదుల సంఘం పనిచేసే వివరాలను మలయా సింగపూర్ పత్రికలు ప్రచురించాయి. మలక్కాలోనూ, జోహూర్‌లోనూ, నేను ప్రాక్టీసు చేస్తున్న రోజులు కదా అవి! కౌలాలంపూర్ కోర్టులో నేను వృత్తి చేయడానికి వ్యతిరేకత బయలుదేరిన వార్తను తెలుసుకున్న తరువాత, మలక్కాలోనూ, సింగపూర్‌లో వున్న న్యాయవాదుల సంఘం కూడా నా మీద చర్యతీసుకుంటున్న వదంతి వ్యాపించింది. ఈ వివరాలు నిజమా? కాదా? అన్న విషయం తెలుసుకునే ఓర్పుకాని నిదానం కాని, ప్రజలకు లేదు. వాళ్లు విన్నదంతా నమ్ముతారు. అంతేకాదు విన్నదాన్ని మరికొంత మందితో ఎక్కువ చేసి చెబుతారు. ఏమయితేనేం, జోహూర్ లోనూ, మలక్కాలోనూ, నా ఆదాయం కొంతవరకు తగ్గడానికి అది దోహదం చేసింది. కొత్త పార్టీలు రావడానికి వెనుకాడారు. వాడుకగా వచ్చేవాళ్లు క్రమేణా మరోచోటికి పోసాగారు. నా బాధలు బాగా ఎరిగిన వాళ్లే అయినప్పటికి, కొత్త కేసులు నాకు అప్పగించడానికి వెనుకాడారు. కార్యాలయంలోనూ, ఇంట్లోనూ, ఖర్చుకు చేతిలో డబ్బులేని పరిస్థితి ఏర్పడింది. అప్పు యిచ్చిన వాళ్లు తొందరచేయసాగారు. మళ్లీ అప్పు చేయడం తప్పనిసరైంది. అప్పు దొరకలేదు. 'ఎన్‌రోల్‌మెంట్' కేసు నడిపించడానికే పెద్ద మొత్తం కావలసి వచ్చింది. నేను ఏంచేయాలో తెలియక తికమక పడ్డాను.

ఈ సమయంలో పెనాంగ్‌లో వెలువడిన ఒక పత్రిక నా గురించి తప్పు గా ఒక వ్యాసాన్ని ప్రచురించింది. ఇండియాలో కార్మిక ఉద్యమాలన్నిటిలోనూ నేను పూర్తిగా పాల్గొన్నానని, నన్ను మలయాలో వుండనిస్తే, అధిక సంఖ్యాకులైన భారతీయ కార్మికులున్న ఈ దేశంలో అనవసరమైన చిక్కులను, ఉద్యమాలను నేను సృష్టించవచ్చునని, ఆ పత్రిక రాసింది. దీనిని చూడగానే ఆ వ్యాసాన్ని రాసి ప్రచురించిన ఆ పత్రిక మీద పరువు నష్టం దావా వేయడానికి నిశ్చయించాను. పెనాంగు వెళ్లి అందుకు కావలసిన ఏర్పాట్లు చేశాను. పత్రిక మీద కేసుపెట్టగానే ఆ పత్రిక వాళ్లు వాదించడానికి సాహసం చేయలేదు. అందువల్ల వారు క్షమాపణ కోరారు. నష్టపరిహారంగా కోర్టులో

కొంత మొత్తం చెల్లించారు. కేసు ముగిసింది. అయితే ఆ మొత్తానికన్నా ఎక్కువే ఆ కేసు నడపడానికి నాకు ఖర్చయింది. అది కూడ నేను అప్పులను మరింత ఎక్కువ చేయడానికి కారణమయింది. ఈ కాలఘట్టంలో నన్ను ఎక్కువగా వేధించిన ఒక సంఘటన గురించి చెబుతాను.

ముఖ్యమైన ఒక అప్పును తీర్చవలసి వచ్చింది. అందుకోసం చాల సన్నిహితుడైన మిత్రుని అడగడానికి నిశ్చయించాను. నాకు ఏ మాత్రం నచ్చని ఈ పనిని నిర్బంధంగా చేయవలసిన వచ్చింది. ఋణగ్రస్తుడు అవన్నీ చూడడానికి వీలులేదు. రోజూ మా యింటికి వచ్చే స్నేహితుడే నాతో ఎంతో స్నేహంతో నడచుకునే వ్యక్తి అయినప్పటికీ నాకు బాధలు రావడం ప్రారంభించగానే ఆయన మా యింటికి రావడం మానేశారు; బాగా ధన సౌకర్యం వున్న ఆయన్ను మరే దారీ కనిపించకపోయేసరికి ఆశ్రయించవలసి వచ్చింది. నన్ను చూడగానే కారణాన్ని ఆయన ఊహించి వుంటారు. నేను నా క్లిష్టపరిస్థితిని జంకుతూనే తెలియజేశాను. మరెక్కడా డబ్బు పుట్టని విషయం కూడా చెప్పాను.

'నేనెవ్వరికీ డబ్బు అప్పు యివ్వడం అలవాటు లేదు. అప్పు అడిగే వాళ్లంటే నాకిష్టం వుండదు' అన్నారు.

నేను యింటికి వచ్చేశాను. ఏ మాత్రం కనికరం లేని ఆయన సమాధానం వినగానే హఠాత్తుగా నాలో విషాదం ముంచుకొచ్చింది. డబ్బు విషయంలో ఆయన చాలాగట్టి వారన్న విషయం నాకు తెలుసు. అయినా నా విన్నపాన్ని కాస్త సభ్యతతో తిరస్కరించి వుండవచ్చు. నా మనసులో యిటువంటి అప్పుల భారం వల్ల చిన్న చిన్న కష్ట నష్టాలకే విరక్తి ఎక్కువయింది. మనుషుల్ని చూడడానికి యిష్టపడలేదు. కార్యాలయంలో పనిచేయడానికి కుదరలేదు. యింటికి రావడానికి మనసు లేదు. అప్పుల వాళ్ల కేకలు వినలేక పోయాను. కొందరు నా మీద కేసు పెట్టారు. అప్పు తీర్చడానికి ఎటువంటి మార్గమూ కనిపించలేదు. ఏ విధంగా నన్ను నేను ఓదార్చు కోడానికి ప్రయత్నించినా మనసు వేదనతో వుండయింది. అప్పు పడ్డ వాడి ఆవేదన ఆ అనుభవం చాలా కష్టమయినవి. అటువంటి వాడు భయపడి భయపడి బతుకుతాడు. తిండి, నిద్రా, ఏదీ అతని వంట బట్టవు. బలహీనం, నిరాశ మరీ మరీ వేధిస్తాయి. అటువంటి వ్యక్తి సత్యాన్నే నిరాకరిస్తాడు. పురుషాహంకారం వదిలేస్తాడు, పిల్లలను మరిచి పోతాడు, జీవితాన్ని ద్వేషిస్తాడు, మరణాన్ని ఆశిస్తాడు.

శ్రీరామునితో రావణుడు యుద్ధానికి బయలుదేరినపుడు, రావణుని హృదయావేదనను కంబర్ 'ఋణగ్రస్తుని హృదయంతో విల విల లాడాడు

లంకాధినేత' అనే వివరించి వున్నారు. అప్పు ఒక మనిషిని పిరికిపందను చేస్తుందనడానికి యిది తేట తెల్లంచేస్తోంది.

ఆ రోజులలో నేను, మనుషులు లేని ప్రదేశానికి వెళ్లి ఏకాంతాన్ని ఆశించాను. ఒకరోజు కారెక్కి, మలక్కా నుంచి కాస్త దూరంలో వున్న ఒక చోటికి వెళ్లి చేతిలో వున్న 'తత్వజ్ఞానం ఇచ్చే ఒదార్పు' అనే పుస్తకం తెరిచి చదవసాగాను. అప్పు డప్పు డు పుస్తకం నుంచి దృష్టి మళ్లించి చుట్టూవున్న ప్రకృతి అందాలను చూస్తూ మైమరచాను. పక్షుల కిలకిల రాగాలు, భ్రమరగీతాలు, అక్కడక్కడ మేస్తున్న పశువులూ, నా మనసును కాస్సేపు, ఆకర్షించాయి. ఆవేదనను కాసేపు మరిచి పోవడానికి ప్రయత్నించాను.

వాటి జీవితాలు, నా జీవితం కన్నా ఎంతో శ్రేష్టమైనవి అన్నట్టు అనిపించింది. 'అప్పుడు పక్షులు, పశువుల్లా రూపాంతరం చెందడానికి, వాటికి నా జీవితాన్ని యివ్వడానికి సాధ్యమయితే' అని ఆలోచించసాగాను.

మనుషుల్లా యితర ప్రాణులు కూడా బాధలు అనుభవించవలసి వస్తుంది. అయినప్పటికీ మనోవేదన అన్నది మనిషికి మాత్రమే ప్రత్యేకంగా ఏర్పడే అనుభవం. అది శారీరకమైన బాధ కన్నా భరించలేని వేదన. నిరాశ ఎక్కువయ్యేప్పు డల్లా నేను మనశ్శాంతి కోసం మంచి పుస్తకాలను ఆశ్రయించేవాణ్ణి.

నా బాధలు తెలిసిన కొందరు మిత్రులు నాకు సహాయం చేయడానికి నిధి సేకరించారు. చాలా రహస్యంగా చేసిన ప్రయత్నం అది. మొత్తం ఎక్కువ కాకపోయినప్పటికీ దాన్ని అందించడానికి పూనుకొన్న మిత్రుల సమక్షంలో నేను కృతజ్ఞతా భారంతో తలెత్తలేకపోయాను. మలయాలోనూ, సింగపూర్‌లోను వున్న మలయాళీ మిత్రులే అందుకు సహకరించారు. నా స్థితి కాస్త మెరుగవగానే, వాళ్లలో కొందరికి ఆ మొత్తాన్ని తిరిగి యిచ్చేశాను. డబ్బులిచ్చిన వాళ్ల పేర్లన్నీ నాకు తెలియదు. నాకు తెలిసిపోతుందని కొందరుపేర్లు యివ్వలేదు మరి!

ఈ రోజుల్లో నాకు చాలా సంతోషం కలిగించిన యిద్దరు మిత్రుల స్నేహాన్ని గురించి చెప్పు కోవాలి. ఒకటి 'టామీ' అన్న పేరుపెట్టి సాకుతున్న నా కుక్క. 'రాముడు' అని పేరుపెట్టి సాకుతున్న ఒక కోతిపిల్ల మరొకటి. కార్యాలయం నుంచి వచ్చాక వాటితో కాస్సేపు ఆడుకునేవాణ్ణి, రాముడు, టామీ కలిసి ఆడుకోవడం, చూడ్డం చాలా తమాషాగా వుంటుంది. రాముణ్ణి మామూలుగా కట్టి వుంచుతాం. సాయంకాలం కాస్సేపు ఆటలాడడానికి వదులుతాం. అప్పు డు యింట్లోనూ, వెలుపలా, చెట్టుకిందా, చెట్టుమీద టామీ మీద అది ఎగిరి గంతులేస్తుంది. సంతోషంగా అరుస్తుంది. సంతోషం, విరక్తి, కోపం, విషాదం

మొదలైన భావావేశాలకు అనుగుణంగా రాముడి కంఠస్వరంలో కూడా తేడా కనిపించేది.

టామి ఎంతో మర్యాదగా ప్రవర్తించే కుక్క. ఒక పనిచేయకూడదని చెబితే అది ఆ పనిచేసేదికాదు. నన్ను చూడడానికి వచ్చేవాళ్లమీద శత్రుభావంతో దూకదు. అయితే నేను వాహ్యాళికి వెళ్లేప్పుడు దానిని తీసుకెళ్లలేదంటే అది శాంతం కోల్పోతుంది. నేను వెళ్లే దారి తెలుసుకుని వెంటబడివచ్చేప్పుడు నేను కోపంతో ఏమీ అనకూడదన్న ఉద్దేశంతో, నాకు సంతోషం కలిగించడానికి ప్రయత్నించేది. తోక ఆడించుకుంటూ నన్ను చుట్టి చుట్టి వచ్చేది. దారి చూపే విధంగా నా ముందు పరుగులు తీసేది, మళ్లీ వెనక్కు వచ్చి నా వెనుక నడిచేది. దాని ఆటలు చూస్తే కోపం తెచ్చుకోవాలని పించదు. రోజుకో వైపుకు నేను వాహ్యాళికి వెళ్లేవాణ్ణి. కొన్ని రోజులు అడవి మార్గాల మీదుగానే, అడ్డదారులలోనే, వాహ్యాళికి వెళ్లినపుడు, టామీ వెంటరావడం తోడుగానే వుంటుంది. నా అప్పుల బాధను గ్రహించి ఆ బాధను తగ్గించడానికి ఏమైనా చేయగలమని టామీకి అనిపించివుంటే తప్పకుండా అది చేసే వుండేది. తన ప్రాణం యివ్వాలన్నా యిచ్చివుండేది. కుక్క ఒక అద్భుతమైన ప్రాణి. దాని స్నేహం, త్యాగశీలం, భక్తి, మనిషి ఆదర్శంగా తీసుకోదగ్గ అపూర్వగుణాలు. ఒక నాడు ఉదయం నేను మలక్కా నుంచి కొంత దూరంలో ఒక కేసు కోసరం వెళ్లవలసివచ్చింది. ఆ రోజు సాయంకాలం నేను యింటికి వచ్చినప్పుడు అలవాటు ప్రకారం, వాకిట్లో ఎదురువచ్చే టామీ కనిపించలేదు. విషయం తరవాతే తెలిసింది, ఒక కారు కిందపడి కుక్క చనిపోయింది. ఇంటి చుట్టూ వున్న స్థలంలో టామీని పాతిపెట్టాము. టామీ ఎడబాటువల్ల ఏర్పడిన విషాదం మరచిపోవడానికి నాకు కొన్ని రోజులు పట్టింది. కుక్క ఎడబాటు వల్ల మాకు ఏర్పడ్డ విషాదం కన్నా, రాముడి విషాదం తక్కువయినదేం కాదు అన్న విషయం తెలుసుకుని మేము ఆశ్చర్యం చెందాము. అది ఆ విధంగా ఏడ్చి తన విషాదాన్ని తెలియజేసింది.

నా బాధలకన్నిటికీ 'రాముడే' కారణమని చెప్పాడు ఒక మిత్రుడు. యింట్లో కోతిని సాకడం మంచిది కాదట, ఈ విశ్వాసానికి ఆధారం ఏమిటో నాకు తెలియలేదు, ఏమయితే నేం? ఆ మిత్రుడు ఒకనాడు ఎవరికీ తెలియకుండా రాముణ్ణి అడవిలోని తీసుకెళ్లి వదలిపెట్టాడు.

నేను మర్నాడు పొద్దునే ఆ విషయం తెలుసుకున్నాను. రాముడు పోయినంత మాత్రాన నా కష్టాలు తీరిపోలేదు. దానికి బదులుగా రాముడి ఎడబాటు వల్ల నా బాధ మరింత ఎక్కువయింది.

నేను మలయాకు వచ్చి ఒక యేడాది నిండే లోపలే అప్పు కుట్టన్ అక్కడికి వచ్చారు. మువ్వారులో నా కార్యాలయంలో వుంటూ పనిచేయసాగారు. మలాక్కాలో నాకు వాటిల్లిన బాధలు మువ్వారు కార్యాలయాన్ని కూడ వేధించింది. 'అప్పు, ఎలుకలూ త్వరగా పెరుగుతాయి' అని ఒక సామెత వున్నది. రెండూ కూడా చెప్పలేనంతగా నాశనానికి దారితీస్తాయి. మలాక్కా నుంచి మువ్వారు వెళ్లే దారిలో ఒక పెద్ద నదిని దాటాలి. కొన్ని సందర్భాలలో కారుసు గట్టుమీదనే ఆపి, పడవ మీద ఎక్కి అవతలి గట్టు చేరవలసి వుంటుంది. ఏరు దాటడానికి ఐదు నిమిషాలు పడుతుంది. అనేక సార్లు పడవలోంచి నదిలోకి దూకి, అప్పుల బాధనుంచి బయట పడదామన్న ఆలోచన నాలోకలిగేది. అయితే ఆవిధంగా నేను స్వేచ్ఛను పొందితే.... నా పిల్లల పరిస్థితి.... వాళ్లు పరదేశాలలో కష్టాలపాలు కావలసి వస్తుంది కదా! ఈ ఆలోచనే ఆ సమయాలలో నన్ను ఆ సాహసకృత్యానికి ప్రోత్సహించకుండా నిరోధించేది. కుటుంబం ఎందుకు? పిల్లలు ఎందుకు? ఎన్నాళ్లు నేనీ నరక జీవితంలో పడికొట్టిమిట్టాడేది? దీని కొక పరిష్కారం యింకా తెలుసుకోకుండా వున్నాను? అనే ఆలోచనలు నాలో మళ్లీ మళ్లీ ఏర్పడి నన్ను వేధించేవి. ఒక పిచ్చివాడికన్నా పిచ్చివాడిగా వివేక రహితమైన దుస్థితిలో కొట్టుమిట్టాడాను.

'మీరెందు కిలా బాధ పడుతూ మమ్మల్నే మీరు వేధించు కుంటారు? రానున్నది రానీ' అని మా ఆవిడ ఓదార్చేప్పుడు నేను కూడ అలాగే అనుకుని కాస్త ధైర్యం తెచ్చుకునేవాణ్ణి. ఇంతకూ అంత పెద్ద అపాయమేమీ ముంచుకురాలేదు. దిగులు లేని మనుషులు ఎక్కడ వున్నారు? అప్పులు చేసింది తప్పా? బాధలను నిరోధించే మార్గం తెలియకుండా వున్నాననే తీసుకోవాలి, వాటిని ఎదుర్కోవలసిన వాణ్ణి కదా నేను?

'మీ దిగులు ఎలాంటిదైనాసరే, మీ సాహసానికి, శక్తి సామర్థ్యాలకూ వచ్చే సవాలుగా భావించండి, మీ భవిష్యత్తును దృఢంగా అమర్చే రాళ్లే అవి' అని ఒక ఆచార్యులు చెప్పిన మాటను నేను జ్ఞాపకం చేసుకున్నాను.

కౌలాలంపూర్ న్యాయవాదుల సంఘం కమిటీపై వేసిన కేసు ముగిసిన తర్వాత నేను సింగపూర్ వెళ్లాలని నిశ్చయించుకున్నాను. కేసు నడుస్తున్న రోజులలోనే నాలో ఆ ఆలోచన ఉదయించింది. అయితే నేను అప్పుడు ఆ విషయం ఎవరితోనూ చెప్పలేదు. మలాక్కాలో అప్పు యిచ్చిన వాళ్లు కొందరు కేసుపెట్టి తమకు అనుకూలంగా తీర్పుకూడ పొందారు. నేను కొందరికి పరిస్థితిని వివరించి, వేడుకున్నప్పటికీ వాళ్లు నామీద కనికరం చూపడానికి సిద్ధంగా లేరు. ముఖ్యమైన కార్యాచరణలోకి దిగారు. కార్యాలయంలోనూ, యింట్లోనూ వున్న సామానులను 'జప్తు' చేశారు. చట్టప్రకారం నేను

వుంచుకోవలసిన కొన్ని వస్తువులను మాత్రమే నేను తీసుకోగలిగాను. ఒక రోజు వేకువ జామున నేను భార్యా పిల్లలతో కారెక్కి మలాక్కా నుంచి సింగపూర్‌కు బయలు దేరాను. నా చిన్న కూతురు పద్మిని ఆటబొమ్మ ఒకటి జప్తు చేయబడ్డ వస్తువులలో కలిసిపోయింది. మేము కారెక్కే సమయంలో ఆ అమ్మాయి 'నాన్నా నా బొమ్మను తీసుకురాలేదే?' అని జ్ఞాపకం తెచ్చుకుని దానిని తీసుకురావడానికి కిందికి దిగింది. దానిని తీసుకోవడానికి వీలుకాదన్న నిజం నేను ఆ అమ్మాయితో ఎలా చెప్పగలను? 'అది అక్కడే వుండనీ అమ్మాయ్... మిగతా సామాన్లతో తీసుకుని వస్తాం' అని సాకు చెప్పి కారెక్కమన్నాను. పాపం, అమ్మాయి అది నమ్మింది, 'జప్తు' చేయబడ్డ వస్తువులలో ఖరీదైనవీ కొన్ని వున్నాయి. అయితే నా చిన్న కూతురి బొమ్మ పాపను అక్కడే వదిలి రావడంతో ఆమెకు ఏర్పడ్డ బాధ నాకు కలిగింది. దారి పొడవునా, ఆ బాధతెలియకుండా పాపతో ఏవేవో కబుర్లు చెబుతూ వచ్చాను. అయితే పాప మాత్రం మళ్లీ, మళ్లీ ఆ బొమ్మను గురించే మాట్లాడసాగింది. అమాయికమైన పిల్లలు, ఒక అప్పు లవాడి బాధలను ఎలా గ్రహించగలరు?

మలాక్కానుంచి సింగపూర్‌కు రోడ్డు దారి 120 మైళ్ల దూరంలో వున్నది. మంచి మార్గం కావడంతో ప్రయాణం బాగా సాగింది. దారిలో మేము అక్కడక్కడ ఆగడం వల్ల, సింగపూర్ చేరడానికి సాయంకాలం అయింది. సింగపూర్‌లో నాకు చాలామంది మిత్రులు వుండేవారు. అందువల్ల ఎంతో నమ్మకంతో నేను అక్కడ జీవితాన్ని ఊహించాను. అయితే మలక్కా నుంచి సింగపూర్‌కు రావడం 'పెనం మీది నుంచి మండే పొయ్యిలో పడినట్లు' అయింది నా అనుభవం.

# కొన్ని వ్యాజ్యాలు

సింగపూర్‌లోనూ నాకు కొన్ని విషాదమైన అనుభవాలు ఏర్పడ్డాయి. అయినప్పటికీ ఆ నగరం కన్నా ఎక్కువగా నాకు నచ్చిన నగరం మరొకటిలేదు. ఆ నగరం పరిశుభ్రత, సౌందర్యం, నివసించడానికి కావలసిన మంచి సౌకర్యాలు, అక్కడ నివసించే ప్రజలు కలిసిమెలసి ఒకరితో ఒకరు మసిలేతీరు, అలవాట్లు, పరిపాలనావిధానం, బాధ్యతాయుతంగా పనిచేసే తీరు, సింగపూర్ పట్ల నాలో ఎంతో అభిమానం కలిగేటట్లు చేశాయి. ఇంచుమించు ఒకటిన్నర శతాబ్దం క్రితం, ఆ ద్వీపం ఒక బెస్తవాళ్ల గ్రామంగా వుండేది. అదే ఇవాళ ఎంతో సంపన్నమైన, జీవతావసరసౌకర్యాలు నిండిన నగరంగా అభివృద్ధిచెందింది. ఆ చరిత్ర ఉద్వేగ రసభరితమైన కథలాంటిది.

1819వ సం॥ ఈస్టిండియా కంపెనీలో ఒక అధికారిగా వున్న 'థామస్ స్టాన్‌ఫోర్డ్‌రాఫిల్స్' అనే వ్యక్తి మరికొందరితో పాటు ఈ ద్వీపానికి వచ్చినప్పుడు చిట్టడవులతోను, కొందరు చేపలపట్టేవాళ్ల గుడిసెలతోనూ వుండేది. ఆ రోజులలో ఆ ద్వీపం జోహూర్‌సుల్తాన్ ఆధిపత్యంలో వుండేది. ఒక కాలంలో సింహపురి అన్న పేరుతో ఒక మహానగరం ఆ ద్వీపంలో వుండేదని, పద్నాలుగో శతాబ్దంలో జావానీయులు ఆ నగరాన్ని నాశనం చేశారని కొన్ని చరిత్ర అంశాలు తెలియజేస్తున్నాయి. సింగపురి గతకాలపు ప్రభావాన్ని మళ్లీ తీసుకురావడానికి రాఫిల్స్ తీర్మానించారు. 1824వ సం॥ లో జోహూర్‌సుల్తాన్ దగ్గరనుంచి ఆ ద్వీపానికి సంబంధించిన సకల అధికారాలను బ్రిటిష్‌వాళ్లు సంపాయించారు.

ఆ ద్వీపం ప్రాముఖ్యతను భౌగోళిక రీతిగా తెలుసుకున్న రాఫిల్స్, సింగపూర్ అభివృద్ధి కోసరం తొలి ప్రయత్నాలు ప్రారంభించారు. ఇంకా ఆ అభివృద్ధి ప్రయత్నాలు కొన్ని కొన్ని రంగాలలో కొనసాగుతూనే వున్నాయి. కొంతకాలంపాటు సింగపూర్ ఇండియా ప్రభుత్వం క్రింద కూడా వుండేది. 1867వ సం॥లో ఆ సంబంధం తెగతెంపులు చేయబడింది.

పన్నెండు లక్షల జనాభావున్న సింగపూర్‌లో ఎనిమిదిన్నర లక్షలకు పైగా చైనీయులే వున్నారు. ఒకటిన్నర లక్షలమంది మలయావాళ్లు, భారతీయులు ఎనభైఏడువేలమంది నివసిస్తున్నారు. మిగతా వాళ్లలో యూరోపియన్లు

మొదలైనవారు వుంటారు. సింగపూర్‌లో దిగుమతి పన్నులేదు. అందువల్ల అక్కడ అధిక శాతం వ్యాపారం జరుగుతుంది. ఆ రోజులలో నేను చూసిన పరిపాలనా విధానం వేరు; ప్రస్తుత పరిపాలనా విధానం లాంటిది కాదది. ఏమాత్రం కల్తీలేని ప్రత్యేక కాలనీ పరిపాలనా విధానం ఆ రోజులలో అమలులో వుండేది. దానిని గురించి ఎవరూ పట్టించుకోలేదు. ఆ విధానానికి తగ్గట్టు, అక్కడ ఆ రోజులలో పరిపాలన చాలాచక్కగా జరిగేది. ఆ రోజులలో ఎవరూ కూడా ఎన్నికల విధానం ఇంత త్వరలో ప్రారంభమై మంత్రుల పరిపాలన జరుగుతుందని ఊహించలేదు. దేశానికి సంబంధించినంతవరకు సింగపూర్ ఎదురు చూడనంతగా అభివృద్ధిని సాధించింది.

అక్కడ న్యాయవాదుల కార్యాలయాలు చాలావుండేవి. పెద్ద కార్యాలయాలున్న వాళ్లు చాలావరకు తెల్లవాళ్లే. చైనావాళ్లు, భారతీయులు, సింహళీయులు, మొదలైన వాళ్లు అక్కడ న్యాయవాద వృత్తిచేసే వాళ్లు. భారతీయుల సంఖ్య స్వల్పమే. ఆ రోజులలో నలుగురైదుగురు భారతీయ న్యాయవాదులు మాత్రమే వుండేవారు.

మలక్కాలో కార్యాలయం ప్రారంభించడానికి కావలసిన దానికన్నా సింగపూర్‌లో కార్యాలయం ప్రారంభంచడానికి ఎక్కువగా ఖర్చుచేయవలసి వచ్చింది. ఇక్కడ జీవన వ్యయం ఎక్కువ. నిలిపివేయడానికి వీలుకాని కొన్ని అప్పు లను తప్పకుండా తీర్చవలసి వచ్చింది. లేకుంటే సింగపూర్‌లో ప్రాక్టీసు చేయడం కఠినమై పోయేది. కార్యాలయం ప్రారంభించడానికి మరికొంత డబ్బు అవసరం. రెండిటికీ కలిపి పెద్ద మొత్తమే కావాలి. దానిని నేను ఎలావెతికి సమకూర్చుకోగలను? కోర్టు తీర్పుతో జప్తి చేయబడిన వ్యక్తికి ఎవరైనా అప్పు ఇవ్వగలరా? అయినప్పటికీ నా అవసరాలను, ఎవరికీ చెప్పకుండా వుంటే ఎలా పనులు జరుగుతాయి? ఒక మిత్రునితో నా స్థితిని మనసు విప్పి చెప్పాను. ఆయనకు దయ కలిగింది. అయినప్పటికీ నాకు సహాయం చేసేంత స్తోమత కలవారు కారు ఆయన. అలా సహాయం చేయగల కొందరిని ఆయన సంప్రదించారు. ఆయన 'జామీను' కింద నాకు కావలసిన ఒక మొత్తాన్ని ఒక నాట్టుకోట్టై చెట్టిగారు అప్పుగా ఇచ్చారు. నేను సింగపూర్‌లో ప్రాక్టీసు ప్రారంభించాను. చాలావేదన కలిగించిన అతిక్లిష్టమైన సమయంలో నాకు సహాయం చేయడానికి ప్రయత్నించి, ఏర్పాటు చేసిన మిత్రుని పట్లనాకు ఎంతో కృతజ్ఞతాభావం ఏర్పడింది. దానిని వివరించడానికి వీలుకాదు. ఎటువంటి ప్రతిఫలాపేక్షలేకుండా ఆయన నాకు దారి చూపారు.

ప్రాక్టీసు పుంజుకోవడానికి నేను చాలా కాలం వేచివుండవలసిన అవసరం లేకుండా పోయింది. అక్కడ సివిల్ కేసులే చాలా వరకు వచ్చాయి. క్రిమినల్

కోర్టుకు కొన్ని కేసులు వచ్చాయి. అక్కడ నేను నడిపిన కేసులు కొన్నిటిని నేనింకా జ్ఞాపకం చేసుకుంటూ వుంటాను. మానవసహజమైన స్వభావాల రంగులను, వాటి ప్రత్యేకతను, ఆ కేసుల్లో స్పష్టంగా చూడగలిగాను.

సింగపూర్ నౌకాదళంలో చాలామంది మలయాళీలు పనిచేసేవాళ్ళు. వాళ్లందరూ 'సెలట్రార్' అన్న ప్రదేశంలో నివసించేవాళ్ళు. అనేక జాతులకు చెందిన వాళ్ళు అందరూ పెద్ద పెద్ద పాకలలోనే నివసించేవాళ్ళు. వాళ్లలో గోపాలన్ అనే వడ్రంగి తెగకు చెందిన యువకుడు, పిళ్లైయార్ జాతికి చెందిన యువకుడు వుండేవారు. ఇద్దరూ ఒకే ఇంట్లో నివసించేవారు. పిళ్లై తాను ఉపయోగించిన సబ్బును ఒక పెట్టెలో పెట్టి ఒక చోట వుంచాడు. గోపాలన్ స్నానానికి వెళ్లినప్పుడు, దానిని పట్టుకెళ్లాడు. సబ్బు రుద్దుకుని స్నానంచేసి మళ్లీ యథాస్థానంలో వుంచేశాడు. పిళ్లై మళ్లీ వచ్చి సబ్బును చూడడంతో, దానిని ఎవరో తీసినట్టుగా గ్రహించాడు. ఎవరు తీశారని అడిగాడు. నేనే తీశానని గోపాలన్ ఒప్పుకున్నాడు. ఉన్నత కులానికి చెందిన తన సబ్బును ఆచారియైన గోపాలన్ తీసుకుని రాసుకున్నాడని తెలియగానే పిళ్లైకు మితిమించిన కోపం వచ్చింది. గోపాలన్ చెంప చెళ్లుమనిపించాడు. నలుగురి ముందు ఈ విధంగా తనను, అవమానపరిచే విధంగా తనే తప్పు చేసినట్టు గోపాలన్‌కు అనిపించలేదు. అయినప్పటికీ అతను అప్పుడు నోరుతెరవలేదు. కొంతసేపు ఏడ్చాడు. ఆ రాత్రి భోజనాలయ్యాక అందరూ వచ్చి పడుకున్నారు. పిళ్లై ఆ ఇంటి వెలుపల ఒక బెంచి మీద పడుకున్నాడు. అర్ధరాత్రి సమయంలో ఒక పెద్ద శబ్దం వినిపించింది. పిళ్లై పడుకున్న చోటునుంచే వచ్చింది. అక్కడికి వెళ్లి చూసేసరికి పిళ్లై ఒకవైపుకి వాలిపోయిపడివున్నాడు. అతని వీపుకు ఎడమవైపు ఒక గొడ్డలి దిగి వ్రేలాడుతోంది. ఒకే రక్తప్రవాహం. పిళ్లై ప్రాణాలు పోయాయి. అక్కడ ఎవరూ కనిపించలేదు.

పిళ్లైను హత్యచేసిన నేరానికి గోపాలన్‌ను ఖైదుచేశారు. మేజిస్ట్రేట్ ముందు తొలివిచారణ ముగిసిన తర్వాత హైకోర్టుకు విచారణ వచ్చింది. జ్యూరీల సాయంతోనే జడ్జి కేసును విచారణ జరిపారు. నేను గోపాలన్ తరఫున కేసు నిర్వహించాను. గోపాలన్ నేరం చేసింది ఎవరూ చూడలేదు. హత్య జరిగిన ఆ రోజు గోపాలన్‌కు పిళ్లైకు మధ్య గొడవ జరిగిన విషయం గురించి సాక్ష్యాలు వున్నాయి. జ్యూరీలు అతన్ని దోషిగానే భావించారు. దోషికి న్యాయమూర్తి మరణశిక్ష విధించారు. అప్పీల్ చేసీ ప్రయోజనం లేదు. పై కోర్టు కూడ అతని నేరానికి తగిన శిక్ష అదే అని తీర్పు చెప్పింది.

చాలినన్ని అంశాలు వున్నట్లయితే శిక్షను తగ్గించే అధికారం గవర్నరుకు వుండేది. దానికోసరం వినతి పత్రంలో సంతకం కోసం నేను గోపాలన్‌ను

చూడడానికి వెళ్లాను. మరణశిక్షకు లోనైన వారిని వుంచే ప్రత్యేకమైన గదిలో ఒంటరిగా కూర్చునివున్నాడు. నన్ను చూడగానే గట్టిగా పట్టుకొని, 'నన్ను ఎలాగైనా కాపాడాలి, నేను మా అమ్మకు ఒక కొడుకుని' అని ఏడ్చి ప్రాధేయపడ్డాడు, బ్రతిమాలాడు. ఆ దౌర్భాగ్యునికి నేను ఓదార్పు చెప్పడానికి ప్రయత్నించాను. రెండు వారాల తర్వాత అతని క్షమాభిక్షకి చెందిన పిటిషన్‌ను తిరస్కరించినట్లు తెలిసింది. ఉరికంబం దగ్గరికి గోపాలన్‌ను తీసుకెళ్లడం చాలా కష్టమయిందని ఆ తర్వాత విన్నాను. కాళ్లు, చేతులు కొట్టుకుంటూ, తనశక్తి నంతా కూడగట్టుకుని, చివరిదాకా తన ప్రాణాలు కాపాడుకోవడానికి ప్రయత్నించాడట. చట్టప్రకారం ఆ కఠిన కృత్యాన్ని నెరవేర్చే వాళ్లకు అది పెద్ద సమస్య అయిందట. అయినప్పటికీ వాళ్లు ఆ శిక్షను నెరవేర్చారు. ఈ విధంగా గోపాలన్ కూడా జాతులు లేని లోకానికి పిళ్లైను అనుసరించి వెళ్లాడు.

కొందరు మలయాళీలు ప్రతివాదులుగా వున్న మరొక కేసు నా జ్ఞానానికి వస్తుంది. ఈ కేసు సింగపూర్ పక్కనే వున్న జోహూర్‌లో జరిగింది. అక్కడ జపాన్‌వారి రబ్బరు తోటలలో కొందరు మలయాళీలు పనిచేసేవారు. వాళ్లు అక్కడే నివాసం ఏర్పాటుచేసుకున్నారు. ఒకరోజు ఉదయం, ఆ తోటలో ఒక చెట్టుకు ఒక మలయాళీ శవం వ్రేలాడుతూ ఉండడం అందరూ చూశారు. పోలీసు వాళ్లకు ఆ వ్యక్తిని ఎవరో హత్యచేసి అలావ్రేలాడదీసినట్లు అనుమానం వచ్చింది. ఆ తోటలో పనిచేస్తున్న ఎనిమిది మందిని వాళ్లు ఖైదుచేశారు. మేజిస్ట్రేట్ విచారణ జరిపి, వాళ్లలో ఐదుమందిని విడుదల చేశారు. మిగిలిన ముగ్గురి మీద హత్యానేరాన్ని ఆరోపించి హైకోర్టుకు విచారణకు పంపారు. మేజిస్ట్రేట్ ముందు ప్రతివాదుల పక్షం నేనే వాదించాను. వాళ్లలో నంబియార్ చాలా గౌరవమైన వ్యక్తి మాత్రమే కాదు డబ్బువున్న మనిషికూడా. మేజిస్ట్రేట్ ద్వారా విడుదల పొందిన వాళ్లలో ఆయనకూడా ఒకరు. కేసులో విజయం, విడుదల సాధించిన వెంటనే వారు అక్కడ నుంచి వెళ్లిపోయారు. హత్యానేరారోపణ చేయబడిన ముగ్గురూ, నంబియార్ క్రింద పనిచేసిన కార్మికులు. వారి కోసరం అప్పటివరకూ నంబియార్ ఖర్చు చేశారు. నంబియార్ వెళ్లిన తర్వాత కేసు జరిపించడానికి వారి వద్ద డబ్బులేదు. ఆ విషయం నాతో చెప్పి, మాకు ఊళ్లో ఆస్తి వుంది, కేసు జయించి విడుదలయ్యామంటే ఎలాగైనసరే మీకు డబ్బు చెల్లిస్తాము. ఇప్పుడు మీరు సహాయం చెయ్యలేదంటే మాకు వేరే దారిలేదు' అని బ్రతిమలాడేరు. వారి దగ్గర డబ్బుల్లేవని వారి కెవరూ సహాయం చెయ్యరని నాకు తెలుసు. డబ్బులు లేవన్న కారణంవల్లే వారిని ఆ స్థితిలో వదలడం నాకు ఇష్టం లేదు. 'కేసు జరిపిస్తాను, డబ్బు తర్వాత ఇస్తే చాలు' అని చెప్పి వారిని సమాధాన

పరిచాను. సుప్రీంకోర్టులో వారికోసరం నేను వాదించడానికి సిద్ధమయ్యాను. కేసులో ఎన్నో చిక్కులు ఎదురయ్యాయి.

నంబియార్ ఆ తోటలో 'మాండూర్'గా (సూపర్‌వైజర్‌గా) ఉండేవాడు. తోటపని కార్మికులను సూపర్‌వైజ్ చేసేవాళ్లను అలా అంటారు. చనిపోయిన వాడు నంబియార్‌ను ఎదిరించి ఏదో మాట్లాడాడట. అతనికి ఒక మంచి గుణపాఠం నేర్పాలని నంబియార్ కొందరు శ్రామికులతో చెబుతూ వచ్చినట్టు, దాని ప్రకారం కొందరు కార్మికులు అతని గొంతుపట్టి చంపి రబ్బరు చెట్టు కొమ్మకు వ్రేలాడదీశారని అరోపించి కేసు పెట్టబడింది. ఎవరో హత్యచేయలేదు, అతడే ఆత్మహత్య చేసుకున్నాడన్నది ప్రతివాదుల వాదం. కేసు విచారణ మూడు రోజులు కొనసాగింది. ప్రతివాదులు ముగ్గురూ కూడా బలుక్కుని హత్యచేశారని అసెస్సర్స్ (న్యాయమూర్తికి సలహాదారులు) అభిప్రాయపడ్డారు. న్యాయమూర్తి కూడా ఈ వాదాన్ని అంగీకరించారు. వారికి మరణదండన విధిస్తూ తీర్పు రాశాడు.

నేను వాళ్లకోసరం అప్పీల్ చేశాను. ముగ్గురు న్యాయమూర్తుల సమక్షంలో విచారణ జరిగింది. పై కోర్టు శిక్షను ఖాయపరచింది. శిక్షను తగ్గించమని సుల్తాన్‌కు నేను పిటిషన్ వేశాను. ఆ పిటిషన్‌లో సంతకం కోసం నేను ప్రతివాదుల దగ్గరికి వెళ్లినప్పుడు వారు ఒక్కొక్కరు ఒక్కొక్క గదిలో విడివిడిగా కనిపించారు. మమ్మల్ని కాపాడండి, మా ఆస్తంతా మీదే' అని వాళ్లు కన్నీళ్లు కారుస్తూ చెప్పారు. ఒక సోమవారం ఉదయమే వాళ్లను ఉరితీయడానికి నిర్ణయించారు. ఆదివారం నాడు వారి శిక్ష పదేళ్ల కారాగారం వాసంగా తగ్గించబడిన వెంటనే వారికి ఈ విషయం తెలియజేశాను. ఆ తర్వాత నేను ఇంకొక కేసు విషయం వివరాలు సేకరించడానికి ప్రతివాది దగ్గరికి వెళ్లినప్పుడు జైలుకి అలవాటుపడ్డ ఖైదీలుగా వాళ్లను చూశాను. ఆరోగ్యవంతులుగానే కనిపించారు. 1941వ సం॥ మలయాదేశంలో యుద్ధం ప్రజ్వరిల్లినప్పుడు చెరసాల ఖైదీలను విడుదల చేసినప్పుడు వీళ్లను కూడా వదిలేశారు. ఉరికంబం అంచు నుంచి మళ్లీ వాళ్లు విడుదల పొంది బయటకి వచ్చారు. ఆ తర్వాత నేను వాళ్లను చూడలేదు!

మరొక కేసు గురించి చెబుతాను. అది కూడా జోహూర్ తోటలో జరిగిందే. చిన్నప్పన్ అనే కార్మికుడు ఆ తోటలో పనిచేస్తూ వుండేవాడు. ఒక సంవత్సరం పనిచేసిన తర్వాత కొంత డబ్బుకూడా పోగుచేసుకున్నాడు. ఇది తెలిసిన మరొక కార్మికుడు తన కుమార్తెను చిన్నప్పన్‌కు యిచ్చి పెళ్లిచేస్తానని మాట అప్పుడప్పుడు కొన్ని వాయిదాల మీద అతని దగ్గర వున్న డబ్బునంతా గుంజేశాడు. పెళ్లి గడువు మాత్రం ఆ సాకు ఈ సాకు చెబుతూ కాలాన్ని తోస్తూ

వచ్చారు. చిన్నప్పన్ చేతిలోని డబ్బు కరిగిపోవడంతో పొన్నమ్మను వేరొకనికిచ్చి పెళ్ళిచేయడానికి నిశ్చయించాడు. ఈ విషయం చిన్నప్పన్ గ్రహించాడు. 'పొన్నమ్మ నాది. ఆమె మరొకరిని ఎలా పెళ్లాడగలదు? అలా జరగడానికి వీలులేదు!' అనుకున్న చిన్నప్పన్ ఎలాగైనాసరే పొన్నమ్మను పెళ్లిచేసుకుని తీరాలని నిశ్చయించుకున్నాడు. పొన్నమ్మ కూడా అదే తోటలోనే పనిచేసేది. ఒక రోజు ఉదయం అతను ఆమె పనిచేసే స్థలానికి వెళ్లి, ఆమెను నరికి చంపాడు. తనంటే పొన్నమ్మకు ఇష్టం అని వాడికి తెలుసు. తండ్రి మాటమీద మరొకనిని పెళ్లాడడం తప్ప మరో మార్గం లేదని ఆమె భావించడంతో అలా జరగకూడదని అతనా ఘోరం చేశాడు.

హత్యజరిగినప్పుడు అక్కడ ఎవ్వరూ లేరు. చిన్నప్పన్ హత్యచేశాడని చెప్పడానికి ఎలాంటి సాక్ష్యాలు ఆధారాలు లేవు. చిన్నప్పన్ నేరు మెదపకుండా వుండివుంటే వాడు దండన నుంచి తప్పించుకుని వుండేవాడే. కాని వాడు అందుకు స్థిరంగా లేడు. 'పొన్నమ్మ నాకోసం స్వర్గంలో కాచుకుని వుంటుంది. నేను అక్కడికి త్వరగా చేరుకోవాలి' అని తహ తహ లాడాడు. వాడికోసరం నేను వాదించాను. కాని చిన్నప్పన్ మొండిగా పట్టుదలతో వుండడం వల్ల, నేనేమీ చెయ్యలేక పోయాను. ఉరికంబం మీదికి, పెళ్లి పీటలు మీదికి వెళ్లేట్టు పరమ సంతోషంగా వెళ్లాడు. పొన్నమ్మా ఇదే వచ్చేశాను! అంటూ ఉరికంబం మీద అతను చివరిసారిగా అరిచాడు.

ఈ సంఘటన ఆధారంగా తీసుకుని మాతృభూమి వారపత్రికలో 'స్వర్గంలో పెళ్లి' అన్న పేరుతో నేనొక చిన్నకథ కూడా రాశాను.

నాకు కేసులు వచ్చినప్పటికీ ఆదాయం చాలినంత రాలేదు. కాబట్టి ఇతర విధాలుగా కూడాఆదాయాన్ని అన్వేషించవలసి వచ్చింది.

సింగపూర్‌లో వై.యం.సి.ఏ. వారు ఒక వర్తక విద్యాసంస్థను జరుపుతూ వచ్చారు. వారానికి రెండు రోజులు అక్కడ విద్యార్థులకు పాఠాలు చెప్పే బాధ్యతను అంగీకరించాను. తరగతులు సాయంకాలంలోనే వుండడం వల్ల, నా ఇతర పనులకు అది ఆటంకంగా లేదు. స్వల్పమైన మొత్తమే అయినప్పటికీ, దాని ద్వార వచ్చిన ఆదాయం అప్పటి స్థితికి పెద్ద సహాయకారిగా వుండేది. ఆరునెలలు ఆ ఉద్యోగం చేశాను. ఉపాధ్యాయ వృత్తి చేయడానికి ఆ విధంగా ఒక అవకాశం లభించింది.

# నిరాశకు మధ్య

మన సుఖదుఃఖాలు, జయాపజయాలు అన్నవి ప్రధానంగా మన ప్రయత్నాలమీద, సామర్థ్యం మీద ఆధారపడి వుంటాయి. అయినప్పటికీ, మనం తెలుసుకోలేని, తప్పించజాలని, కొన్ని కారణాలు కూడా మన కష్టాలకు కారణాలవుతాయి. చెయ్యవలసినదంతా చేసినప్పటికీ, ఫలితాలు తారుమారైనప్పుడు నిరాశ ఏర్పడటం సహజమే. కాలం కరాళ హస్తాల నుంచి బయటపడడానికి సాధ్యం కాదేమో అనిపిస్తుంది. నాకు ఆవిధంగా అనేక సందర్భాలలో అనిపించింది. 'ఇదే చేస్తాను, ఇలా చెయ్యను' అని మనసులో దృఢనిశ్చయంలో ప్రయత్నించినప్పటికీ నా ప్రయత్నాలకు తగిన విధంగా నేను ఆశించినవి జరగలేదు. అనుభవాలు ఎదురుచూడని విధంగా వేరుమార్గాలలో పయనించేట్టు చేశాయి. మలక్కాలో నాకు ఏర్పడిన కష్టాలు, రాకూడదని ఎంతో ప్రయత్నించినప్పటికీ, దయలేని విధి నన్ను వెన్నంటి వచ్చింది. నన్ను క్రూరంగానే మోసగించింది.

సింగపూర్ వచ్చి ఒక యేడాది గడచిన తర్వాత మొదట ఒక ఐరోపా న్యాయవాది ద్వారా తన కేసును నడిపిన ఒక పార్టీ, నా దగ్గరికి వచ్చి ఆ కేసును నన్ను చేపట్టమన్నారు. ఈ విధంగా న్యాయవాదులను మార్చుకోవడం మామూలే అయినప్పటికీ, అలా మార్చుకునేప్పుడు కొన్ని ఆనవాయితీలు అక్కడ ఆచరణలో వుండేవి. అంతవరకు కేసును చేపట్టినడిపినందుకు పైకాన్ని ఆ న్యాయవాదికి చెల్లించిన తర్వాతే పత్రాలు తిరిగి పొందడం సాధ్యం. తనకు ముట్టవలసిన డబ్బు అందేవరకు కేసుకు సంబంధించిన కాగితాలన్నిటినీ తన అధీనంలో వుంచుకోవడానికి ఆ న్యాయవాదికి అధికారం వుంది. పార్టీ డబ్బు యివ్వలేదంటే, ఆయనకు చేరవలసిన మొత్తాన్ని పార్టీనుంచి రాబట్టి యిచ్చే బాధ్యతను కొత్త న్యాయవాది తీసుకొనేవాడు. ఈ వివరాలతో కొత్తవకీలు, పాతవకీలుకు వ్రాతపూర్వకంగా తెలియజేసినట్లయితే, ఆయన పత్రాలు భద్రంగా పంపేవారు. పార్టీ నుంచి డబ్బు వచ్చినా రాకపోయినా కొత్త న్యాయవాదియే పాత న్యాయవాదికి చేరవలసిన ఫీజును అందచేసితీరాలి.

నన్ను వెతుక్కుంటూ వచ్చిన పార్టీ కేసును తీసుకుని నడిపించమని చెప్పినప్పుడు, నేను ఐరోపా లాయర్‌కు కేసుకు సంబంధించిన కాగితాలు పంపమని వ్రాశాను. డబ్బు ఏమైనా యివ్వవలసివుంటే నేనే చెల్లిస్తానని ఒప్పుకున్నాను. నా యీ హామీమీద అయన నాకు కాగితాలు పంపారు. అయనకు చేరవలసింది నూరు డాలర్లు వుందని నేను తెలిసుకున్నాను. కేసు విచారణ వచ్చేంతవరకు కొన్ని ముందు జాగ్రత్తలు, తీసుకోడానికి ప్రయత్నించాను. విచారణకు వారం వుందన్నప్పుడు, ఆ ఐరోపా న్యాయవాది నుంచి మరొక ఉత్తరం వచ్చింది. ఆ కేసులో వాదించడానికి, పార్టీవాళ్లు మళ్లీ అతన్నే ఆశ్రయించినట్లు, అందువల్ల కాగితాలను అతనికే త్రిప్పిపంపమనీ, నాకు రావలసిన పైకం ఏదైనా వుంటే, దానిని ఆయన చెల్లించే విధంగానూ, ఆయన రాశారు. నేను వెంటనే కాగితాలు త్రిప్పి పంపాను. నాకు నూటఇరవైఒక్క డాలర్లు రావాలని నేను తెలియజేశాను. అందుకు ఆయన అంగీకరించారు.

కొన్ని రోజులు గడిచిన తర్వాత అయనకు నేను చెల్లిస్తానని తెలియచేసిన నూరు డాలర్లు పంపమని ఉత్తరం రాశారు. నాకు చేరవలసిన నూటఇరవైఒక్క డాలర్లలో నూరు డాలర్లు తగ్గించుకుని మిగతా ఇరవై ఒక్క డాలర్లు పంపమని నేను జవాబు రాశాను. దానిని ఆయన లెక్కచేయలేదు. నేను పంపవలసిన వంద డాలర్లు మొదట పంపమని, ఆ తర్వాత అతను పంపవలసిన నూటఇరవైఒక్క డాలర్లు పంపుతానని ఆయన తెలియజేశాడు. నాకు ఇది తిక్క కేసుగా కనిపించింది. నేను అయనకు చెల్లించి వలసిన దానికన్నా, అయన నాకు ఎక్కువగా చెల్లించాలి అనే పరిస్థితిలో, ఆ డబ్బు కోసం ఆయన అంతగా తొందరచేయడం ఉచితంగా కనిపించలేదు. నేను కూడా చాలా కఠినంగా వుండగలను. ఎందుకంటే దీనికి సంబంధించి మా మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. మాట ప్రకారం నేను వ్యవహరించలేదని న్యాయవాదుల సంఘానికి తెలియజేసి, నామీద చర్య తీసుకోమన్నాడు. కమిటీ వాళ్లు వివరాలు అడిగారు. నేను నా స్థితిని కమిటీ ముందు వుంచాను. ఎదుటివారి నుంచి నాకు, నేను యివ్వవలసిన దానికంటే అదనపు మొత్తం రావలసి వున్నప్పటికీ నేను యివ్వవలసిన బాకీని తీర్చడమే పద్ధతి అని, దానిని నేను తిరస్కరించడం మర్యాదకు విరుద్ధమైనదనీ, అందువల్ల నాచర్యను న్యాయవాదుల సంఘం విమర్శిస్తూ కోర్టువారికి తెలియజేసింది. న్యాయవాదుల సంఘం నిర్ణయాన్ని న్యాయమూర్తి అంగీకరించి తీర్పుచెప్పారు. దానికి శిక్షగా, నేను రెండు నెలలు ప్రాక్టీసు చేయకూడదని, న్యాయస్థానానికి అయన ఖర్చును నేను న్యాయవాదుల సంఘానికి ముట్టచెప్పాలని

అజ్ఞాపించారు. ఆ మొత్తం ఆరువందల యాభై డాలర్లు. సింగపూర్‌లో ప్రాక్టీసు ప్రేళ్లానుతున్న కాలఘట్టంలో నాకు ఏర్పడ్డ పెద్ద నష్టం ఇది.

రెండు నెలల పాటు ఆదాయం లేదు. అంతేకాదు. నా భవిష్యత్తు ఆపదకు గురయినట్లు నాలో ఒక విధమైన భయం పుట్టు కొచ్చింది. ఆయన అడిగిన నూరు డాలర్లు మొదట చెల్లించి, ఆ తర్వాత నాకు రావలసిన నూటఇరవైఒక్కడాలర్లు అడిగి తీసుకుని వుంటే సరిపోయేదికదు? అని అనుకున్నాను. నాతో కొందరు ఆయనతో పేచీ పెట్టుకోవద్దని చెప్పకపోలేదు. అయితే నేను వ్యవహరించిన తీరు సరైనదేఅని నేను నమ్మాను. ఇవాళ కూడ నాకు ఆ విషయంలో అభిప్రాయభేదంలేదు.

చెప్పడానికి వీలులేని కష్టాలు ఆ రోజులలో నేను అనుభవించాను. ఎవరిని చూడాలన్నా అయిష్టంగానే వుండేది. నగరం నుంచి నాలుగు మైళ్లలో మా యిల్లు వుండేది. దేనికైనా నగరానికి వెళ్లవలసివస్తే, నడిచి వెళ్లవలసిన పరిస్థితి ఏర్పడింది. బస్సు ఛార్జీకి కూడా లేకుండా మండుటెండలో నేను నడిచివెళ్లడం తలుచుకుంటున్నాను. ఆ రోజులలో నా హృదయభారం, కష్టాలు ఎలా వివరించగలను?

రెండు నెలలు ఎలాగో గడిపాను. మళ్లీ ప్రాక్టీసు ప్రారంభించాను. అప్పు యిచ్చిన వాళ్లు అందుకోసరమేకాచుక్కూర్చున్నారేమో! నేను సంపాదించే డబ్బులో ఇంటి ఖర్చుకు మాత్రం తీసుకుని మిగతాదంతా అప్పులు తీర్చడానికే వినియోగించాను. అయినప్పటికీ యిబ్బందులు తగ్గలేదు.

రకరకాల వ్యక్తులకు నేను అప్పుపడ్డాను. నేను మరెవరితోనైనా మాట్లాడుతున్నప్పుడు నాకు అప్పుయిచ్చిన వాళ్లు వచ్చేవారు. వారిని చూడగానే నాకు ముచ్చెమటలు పోసినట్లయ్యేది. నేనెవరితోనైనా మాట్లాడుతున్నప్పుడు అప్పు అడగకూడదన్న సంస్కారం వాళ్లకు వుండదు మరి! అందువల్ల వాళ్లను చూసీచూడగానే లేచివెళ్లి వాళ్లను పక్కకు తీసుకెళ్లి చేతిలో వున్నది వారిచేతిలో పెట్టిపంపేవాణ్ణి. దానిని వాళ్లు లెక్కలో చేర్చేవాళ్లుకాదు. అది అప్పటికప్పుడు వాళ్లుకు యిచ్చిన లంచం లాంటిది. నేను యివ్వవలసిన అసలులోగాని వడ్డీలో గాని ఆ డబ్బును జమకట్టే వాళ్లుకారు.

మరొక రకం వున్నారు. వాళ్లు మరీగట్టివాళ్లు. కష్టాలు చూసి బాధపడేవారు. నా కష్టాలు పోగొట్టమని దేవుని ప్రార్థించేట్టు చెప్పేవాళ్లు. నాకు ఎవరైనా పార్టీలు డబ్బుయివ్వవలసివస్తే దాన్ని జాగ్రత్తగా అడిగితెలుసుకునేవాళ్లు. పార్టీలు వచ్చివెళ్లిన వెంటనే, డబ్బుకోసరం వచ్చికూర్చునేవాళ్లు. గడువు చెప్పలేము. చేతికి వచ్చిన దాంట్లో సగమో

మూడు వంతులో అప్పు తేలేది. అప్పు యిచ్చిన వ్యక్తికి కోర్టులో ఏదైనా పనివుందనుకోండి. దానికి నా సహాయం కోరేవారు. కాని అందుకు ఎలాంటి డబ్బు యిచ్చేవాళ్లు కాదు. నేను అడగడానికి సాధ్యమయ్యేదికాదు.

ఈ రెండు రకాల వారికీ మించిన వాళ్లు మనసులో ఏ మాత్రం దయాదాక్షిణ్యాలు లేని మూడో రకం వాళ్లు. వారిని ప్రత్యక్షంగా చూడడానికి వీలుపడదు. వారి పనులన్నీ న్యాయవాదుల ద్వారానే సాధించేవాళ్లు. గడువు అడిగినా, డబ్బు కాస్త తక్కువగా వుందన్నా మరేదైనా లాయర్‌తో చెప్పుకో అతనికే బాధ్యత అప్పగించాము అనే వాళ్లు. అయితే ఆ న్యాయవాదిని సంప్రదిస్తే తాను తన పార్టీ చెప్పిన ప్రకారమే నడుస్తున్నట్లు, తాను స్వయంగా ఏమీ చేయలేననీ తిరస్కరించేవారు. ఎటువంటి దాక్షిణ్యం ఆయన చూపేవారుకాదు. ఒకరికి నేనే అప్పు పడ్డ వెయ్యిన్ని ఐదువందల డాలర్ల బాకీకోసం, అసలూ వడ్డీ, కోర్టు ఖర్చులు అంతాకలిపి నాలుగు వేల మూడువందల డాలర్లు చెల్లించాను. ఈ మధ్య కాలంలో ఆయన యింటిని పదమూడు సార్లు జప్తి చేశారు. ఇక్కడ అప్పు యిచ్చిన ఒకరిని గురించి మాత్రమే చెప్పాను. ఈవిధంగా ఎంతోమంది అప్పులవాళ్లతో నేను పోరాడవలసివచ్చింది.

'మీనన్ రావడం చూస్తే మనసులో ఏమీ దిగులువున్నట్లు కనిపించడంలేదు' అని నన్ను చూసిన ఒక న్యాయవాది మిత్రుడు మరో న్యాయవాదితో చెప్పడం నేనువిన్నాను. కొందరికి, నా కష్టాలు, దుఃఖాలు, బాగా తెలుసు. నా మనసులోనే స్థిరపడి నన్ను వేధించే విషాదాన్ని నేను బహిర్గతం చెయ్యకుండా ఎన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ, కొన్ని సందర్భాలలో ముఖంలో ఆ ఛాయలు ప్రస్ఫుటంగా తెలిసిపోయేవి.

ఈ కాలఘట్టంలో జరిగిన ఒక సంఘటన గురించి చెబుతాను. ఒక రోజు ఒక అప్పులవాడు, నా మీద దావావేసి నా ఆస్తులు పొందడానికి తీర్పును పొంది నా కార్యాలయంలోని వస్తువులన్నిటికీ జప్తిచేసుకుని వెళ్లాడు. ఆరోజే అప్పు యిచ్చిన వాళ్లలో మరికొంత మంది, నేను వాళ్లకు యివ్వవలసిన మొత్తం కోసరం కేసు నమోదు చేశారు. వాళ్లుకూడ ఆ తర్వాత తమకు చేరవలసిన సొమ్ము రాబట్టడం కోసం జప్తి చేయడానికి వస్తారు. నేను బసచేసిన యింటి అద్దె బకాయికి యిల్లు గలావిడ జప్తిచేసుకోవడానికి కూడా ఆర్డరు పొందిందని తెలిసింది. మొత్తం ఎక్కువగా లేదుకాని అస్థితిలో పెద్ద మొత్తం చిన్నమొత్తం అంతా ఒకటిగానే కనిపించింది. నిరాశా నిస్పృహలతో నేను తల్లడిల్లిపోతూ, ఆ సాయంకాలం యింటికి చేరాను. రెండుమూడు రోజుల పాటు కరెంటు బిల్లు చెల్లించలేదు. కాబట్టి 'కనెక్షన్' తీసేశారని యింటికి వచ్చిన తర్వాత తెలిసింది.

ఒక లాంతరు రెండు మూడు కొవ్వొత్తులు వెలిగించుకుని పిల్లలతో కూర్చునివుంది మా ఆవిడ. ఆరోజు జరిగిన సంగతుల గురించి, మర్నాడు జరగనున్న విషయాల గురించి నేనేమీ చెప్పలేదు. మనసులో భరించలేని వేదన దహించింది. దుస్తులు మార్చుకుని వరండాలోని కుర్చీలో కూర్చున్నాను. కిటికీ దగ్గర ఒక కొవ్వొత్తి వెలుగుతోంది. అక్కడినుంచి బయటికి చూస్తే ఒకేచీకటి. నా భవిష్యత్తు కూడా అలాంటిదే అన్నట్లుంది. పక్కగదిలో పిల్లలు మెల్లిగా ఏదేదో మాట్లాడుకుంటున్నారు. ఆ లేత హృదయాలకు దిగులూ, బాధలూ లేవు. నేను అక్కడ కూర్చుని వున్నదికూడా వాళ్లు గ్రహించలేదు. కొంతసేపు అలాగే కూర్చున్నాను.

మా ఆవిడ స్నానం చేయడానికి వెళ్లింది. కొంతసేపు కూర్చున్న తర్వాత అక్కడనుంచి పడకగదికి వెళ్లాను. తలుపులు మూశాను. పిల్లలు ఇదంతా గమనించలేదు. ఆనాటి సంఘటనలకన్నా, ఘోరమైన స్థితికి నన్ను పడద్రోసే సంఘటనలు నాకోసం ఎదురుచూస్తూ వున్నాయన్న బాధ నన్ను వేధించింది. నాలో పెరిగిపోయే బలహీనతను జయించే సామర్థ్యం నాలో లేకపోయింది. దుస్తులు తగిలించిన స్టాండునుంచి బెల్టు తీసుకుని మెడకు తగిలించుకుని బిగించాను. అదేవిధంగా రెండు నిమిషాలు వున్నాను. నేనేం చేస్తున్నానో నాకే స్పష్టంగా తెలియడంలేదు. ఉన్నట్టుండి తలుపు చప్పుడు వినిపించింది. లాంతరు పట్టుకుని, దుస్తులు మార్చుకోవడానికి అమ్ము లోపలికి వచ్చింది. నా మూర్ఖత్వం బయటపడిపోయింది.

'ఏం చేస్తూవున్నారు?' అని అడుగుతూ నా చెయ్యి పట్టుకుంది అమ్ము. నేను ఏమీ ఎరుగనట్టు నిలబడ్డా జరిగిందేదో అమ్ము గ్రహించకపోలేదు. నాలుగయిదు నిమిషాలు గడిచిన తర్వాత అమ్ము అక్కడికి వచ్చివున్నట్లయితే, ఏం జరిగివుండేదో ఇప్పుడు చెప్పలేను. ఎంతో వేదనతో, విచారంతో మేమా రాత్రిని గడిపాము.

అనుకున్నట్లుగా మర్నాడు ఏమీ జరగలేదు. దయా, దాక్షిణ్యం వున్న ఆ యిల్లు గలావిడ యింటి అద్దెను రెండు వారాల తర్వాత తీసుకోవడానికి అంగీకరించింది.

ఇటువంటి కష్టాల పాలుకావడానికి నేనేం పాపం చేశాను? ప్రతిఒక్కరు తను చేసిన ఫలితాలనే అనుభవిస్తారని చెప్పడం కద్దు. సాధారణంగా అలాగే జరుగుతుంది. తత్వజ్ఞానం కూడా ఒక్కోసారి మనల్ని పూర్తిగా మోసం చేస్తుంది. నేను అటువంటి పరిస్థితులలోనే వున్నాను. జీవితం దుర్భరమయింది. ఎలాగైనా సరే నాకు మరణం వాటిల్లినట్లయితే సంతోషంగా

ఆహ్వానించివుండేవాణ్ణి. అయినప్పటికీ ఆత్మహత్య చేసుకోవడానికి మనసు తెగించలేదు. అందుకు కావలసిన ధైర్యంలేదు.

రకరకాలుగా ఆలోచిస్తున్న మనసును అదుపుచేయడానికి ప్రయత్నించాను. అయినా నా ప్రయత్నాలలో విజయం సాధించలేకపోయాను. తట్టుకోలేని కష్టాలు వచ్చినప్పుడు వాటిని సహించడమే ధైర్యం. మిగతా వారి ధైర్యాన్ని మనం పొగడ్డం లేదా? ఎందుకు అలాంటి వారిని అనుసరించకూడదు? ఆపద సమయాలలోనే గదా దృఢ చిత్తంతో నిలబడే తెగువకావాలి? కష్టాలు, అనుభవించని మనిషి వుంటాడా? అప్పు చేసిన మరికొందరి మిత్రుల గురించి ఇతరులు చెప్పుకోవడం నేను విని వున్నాను.

'దొంగలు కావాలనే అప్పు తీర్చరు' అని చెప్పేవాళ్లు వారి పరిస్థితిని, స్వభావం బాగా ఎరిగిన నాకు ఆ మాటలు వినడం వేదన కలిగించేది. 'అప్పుల వాడు మాట నిలబెట్టుకోలేరు' అని ఒకరు చెప్పింది నేను ఆలోచించి చూశాను. ఒక విధంగా అది నిజమే. నిర్ణీత సమయానికి డబ్బుతీర్చడం వీలుకాదని తెలిసికూడా, చాలాసార్లు, ఒక గడువు చెప్పి, ఆ రోజుకు తిరిగి యిస్తామని అప్పు యిచ్చిన వాళ్లతో చెప్పవలసివస్తుంది? ఏ దారీ కనిపించనప్పుడు, అప్పటికి బయటపడడానికి చెప్పేమాట అది. అప్పు చేశామంటే అలాంటి పరిస్థితికి గురికావడం తప్పనిసరి!

పెద్ద అపాయాలు ముంచు కొచ్చేప్పుడు మనలో వున్న సామర్థ్యం బయటపడుతుంది. ఈత రాదనేవాడు, అంతవరకూ నీళ్లలో దిగడానికి భయపడిన వాడుకూడా, తన బిడ్డచెరువులోపడగానే, అందులోకి దూకి కాపాడిన ఉదంతాలు వినివున్నాము. అదేవిధంగా, క్లిష్టపరిస్థితులలో చిక్కుకుని అవస్థపడుతున్నప్పుడు, ఎదురుచూడని సహాయాలు మనల్ని వెతుక్కుంటూ రావడం కద్దు. ఆ అనుభవానే నేను ముందు చెప్పాను.

ఒక అప్పు తీర్చడానికి దారి కనిపించక నిరాశతో నేను వున్నప్పుడు ఒక మిత్రుడు కావలసిన డబ్బుతో నాదగ్గరికి వచ్చాడు. అప్పుడు నేను చెప్పలేనంత ఆశ్చర్యం చెందాను. న్యాయస్థానంలో కట్టవలసిన సమయానికి సరిగ్గా పదిహేనునిమిషాలకు ముందు ఆయన డబ్బు తీసుకుని వచ్చారు. చాలారోజులు గడిచిన తర్వాత మరొక విధంగా ఒక సందర్భంలో నేను సహాయం చేయగలిగినప్పుడు ఆయన తన కృతజ్ఞతలు తెలియజేశారు.

కష్టాలు ఎదురైనప్పుడు, దైవవిశ్వాసాన్ని వదులుకోకుండా, మంచిది జరుగుతుందని నమ్మడమే మంచిది. ఎప్పుడు ఆ విధంగా నమ్మడమే సాధ్యంకాదు. మనం ఉద్వేగ పూరితులై కొన్ని సమయాలలో విషాదంతో కంటనీరుపెట్టుకుంటాం. ఎన్ని సందర్భాలలో నేనలా కంటతడిపెట్టుకున్నానో?

ఏకాంతంలో పసిపాపలా వెక్కివెక్కి ఏడ్వడంలో ఎంత మనశ్శాంతి లభిస్తుంది?' ఏడ్వడం భీరువు లక్షణం కాదా? అని కొందరు అడుగవచ్చు. అవును భీరువు లక్షణమే అయినప్పటికీ కొన్ని సందర్భాలలో, ఈ బలహీనతకు లోనుకాని వీరసింహాలు వున్నారా? అన్నది సందేహాస్పదమే. ఎన్నెన్నో మహాయుద్ధాలు చేసి విజయం సాధించి వీరునిగా ఖ్యాతి గాంచిన నెపోలియన్ సైతం, కొన్ని సందర్భాలలో ఉద్వేగానికి లోనై కంటతడి పెట్టేవారు ఏడ్చినట్టు వినివున్నాము. ఒక మామూలు మనిషి నైన నేను పెద్దకష్టాలు ఎదుర్కొన్నప్పుడు, క్లిష్టసమయాలలోను నా స్థితి నుంచి దిగజారి కన్నీళ్లు కార్చడం మహాపరాధం కాదే?

చీకటిలో దారి తెలియకుండా తారట్లాడుతున్నప్పుడు, చలి, గాలి వాన చుట్టుముట్టిన పరిస్థితిలో ఆశ్రయాన్ని వెదుక్కుంటున్న బాటసారి ఒక పాడుబడ్డ బావిలో జారిపడ్డట్టు, నాకు మరొక విషాదం సంభవించింది. నా మూడో అమ్మాయి పద్మనికి ఉన్నట్టుండి ఆరోగ్యం పాడయి చనిపోయింది. 1934వ సం॥ జూన్ నెలలో ఈ దుర్ఘటన జరిగింది. అప్పట్లో ఆమెకు వయసు పద్దెనిమిది సంవత్సరాలే. ఇంటి పనులలోనూ, వంటపనులలోనూ, చేయితిరిగిన మా అమ్మాయి ఎదుటివారికి సహాయం చెయ్యాలంటే ఎంతో ఉత్సాహం చూపేది. మా హృదయాలలో గాఢమైన ముద్రను మిగిల్చి, మమ్మల్ని వర్ణనాతీతమైన విషాదానికి గురిచేసి వెళ్లిపోయింది.

గదినుంచి ఆమె భౌతికకాయాన్ని వాకిట వుంచినప్పుడు ఎక్కడినుంచో వినపడిన గీతం, నా హృదయ శోకానికి ప్రతిధ్వనిగా వినిపించింది. ఇప్పుడు ఆ పాటను ఎక్కడైనా విన్నట్లయితే నేను ద్రవించిపోతాను. నా ప్రియమైన కుమార్తె జ్ఞాపకాలు వచ్చేవి. ఆ ఊహాలోకంలోనే కదా నా కుమార్తెను చూడగలను!

ఈ కాలంలో 'అస్తమనం' అనే పుస్తకం వ్రాయడం ప్రారంభించాను. అందులోని కథలన్నిటిలోనూ, నా సొంత అనుభవాలలోని విషాద ఛాయలు చూడవచ్చును. దానిని వ్రాయడంలో కొంత బరువును దించేసినట్లు కొంత మనశ్శాంతి కలిగింది. పాఠకులు కూడా నేను అనుకున్న దానికన్నా ఎక్కువగానే ఆదరించారు. ఇంకా ఆ ఆదరణ తగ్గలేదు.

నన్ను కొందరు మిత్రులు, 'మీరు ఎప్పుడూ వ్రాస్తారు కదా, వ్రాయడానికి ఏదైనా ప్రత్యేక నియమావళి అంటూ ఏదైనా వుందా? అని అడగడం అలవాటు. మరొకరి అవసరం కోసరం ఒకటి రూపొందించాలంటే, వ్యక్తిగత నియమావళి ఏర్పరచుకోడం కష్టం. వ్రాయడానికి ఒక ప్రేరణ ఏర్పడాలి. ఉత్సాహం, పట్టుదల కూడా కావాలి. అప్పుడే వ్రాయడం సాధ్యం. ఉదయం అయిదు గంటల నుంచి ఏడు గంటల వరకు నేను కూర్చుని వ్రాసేవాణ్ణి. ఇది

చాలాకాలంగా వుంటున్న అలవాటు. సువిశాలమైన పొలాలుగాని ఎత్తైనకొండగాని, ప్రవహించేనదిగాని, సముద్రం కానీ కనిపించే స్థలంలో కూర్చుని రాయడం అంటే నాకు చాలా ఇష్టం. దానికి అవకాశం లేదంటే ఒక తోట అయినా సరే కంటి ముందు వుంటే సంతోషంగా వ్రాస్తాను. నేను ఏకాంతంలో కూర్చుని మాత్రమే వ్రాయగలను. కొందరు మిత్రులు ఎటువంటి వాతావరణంలోనైనా సరే వ్రాస్తారు. నాకది సాధ్యం కాదు.

1934వ సం||లో ఒక కేసు విషయంగా నేను 'బోర్నియో' వెళ్లవలసి వచ్చింది. మహమ్మదీయులైన ఒక ధర్మకర్త, నమ్మక ద్రోహం ఆరోపించబడి, కేసులో ఇరుక్కున్నాడు. ఆయన ఎప్పుడో కేసుకోసరం, సింగపూర్ వచ్చినప్పుడు, నాగురించి విన్నారు కాబోలు! అందువల్ల, అతని కేసు, నడిపించమని నాకు తంతి పంపారు. మంచి ఆదాయానికి కూడా అవకాశం వుంది. సింగపూర్ నుంచి 'బోర్నియో' రాజధానీ నగరం 'శాండేక్కన్' కు ఆరు రోజులు ఓడ ప్రయాణం చేయ్యాలి. ఉత్తర బోర్నియోను ఆ రోజుల్లో ఈస్ట్ ఇండియా కంపెనీ లాంటి బ్రిటిష్ బోర్నియో కంపెనీ వారు పరిపాలించేవారు. బోర్నియో అడవి ప్రాంతాలను నరికి, సారవంతమైన భూములుగా మార్చుకున్నారు. జనసంఖ్య ఎక్కువగా వున్న ప్రాంతాలనుంచి కొందరిని అక్కడికి తరలించడానికి అనుకూలమైన వసతులు వుండేవి. ఇండియా ప్రభుత్వం కొన్ని కుటుంబాలను అక్కడ నివసించేలా చేయడానికి ఆలోచించడం పాఠకులకు జ్ఞాపకం వుండేవుంటుంది. బోర్నియో వాతావరణం మన ప్రజలకు అలవాటైనదే. నేను అక్కడ ఒక వారం రోజుల పాటువున్నాను. కేసులో నా పార్టీకి అనుకూలంగా తీర్పు చెప్పబడింది. మంచి ఆరోగ్యంగా వున్న అతనికి నలభై అయిదు సంవత్సరాలు వుంటాయి. కేసులో జయించినందువల్ల, సంతోషించి నాతో ఒప్పందమైన దానికన్నా అదనంగా డబ్బు ఇచ్చాడు.

నేను సింగపూర్ తిరిగి వచ్చిన తర్వాత అతనిని గురించి విన్న విషయం నాకు ఆశ్చర్యం కలిగించింది. ఫలానా కారణం అని తెలియకుండానే ఒకరోజు ఆయన రెండు కళ్లకూ చూపు తగ్గిపోయింది. సాధువులకు చెందవలసిన ఆస్తిని మోసగించిన దుర్మార్గానికి ఫలితంగా, దేవుడు అతనికి సరైన శిక్ష విధించాడని అతని విరోధులు సంతోషించారు. దేవునికి నిజం తెలుసు. ఆయన్ను చూసినప్పుడు నాకేమో శాంత, దయాస్వభావాలు గల వ్యక్తిగానే కనిపించారు. కారణం ఏదైనా ఆయన పూర్తిగా గుడ్డివాడయ్యాడు అని తెలిసినప్పుడు, నా ఆశ్చర్యం, విషాదం, వర్ణనాతీతమయ్యాయి.

# కొన్ని విశ్వాసాలూ, అభిప్రాయాలూ

మనం చేపట్టే వృత్తి, అలవాట్లు, మాత్రమే మన ప్రత్యేకతను రూపొందించడం లేదు. మన అభిప్రాయాలను అనుసరించే మన ప్రత్యేకత రూపొందుతుంది. పుట్టి పెరిగే పరిసరాలు, అనుభవాలు, విశ్వాసాలు ఏర్పడడానికి దోహదం చేస్తాయి. అలవాటయ్యే పరిసరాల ప్రభావం వల్ల ఏర్పడే అనుభవాలకు, సొంత అనుభవాలను బట్టి మన విశ్వాసాలను కాస్త అటూ, ఇటూ మార్చుకోవటానికి ఆస్కారం వుంది. నాలోని వెనుకటి కొన్ని అభిప్రాయాలకూ, ఇప్పుడు నాలోచోటులేదు. ఒక కాలంలో ఉచితమైనది కాదనుకున్న కొన్ని అభిప్రాయాలు, ఇవాళ సరైనవే అని విశ్వసించవలసివుంది.

పంచేంద్రియాలను ఉపయోగించి ఎదుటి వస్తువుల స్వభావాన్ని తెలుసుకోవడానికి ఆస్కారం వుంది. పంచేంద్రియాలను ఉపయోగించి తెలుసుకోవడం వల్లే ఫలానాది వుందా? లేదా? అని నిర్ణయించగలం. కంటి చూపులేని వాడు అందమైన పువ్వు గొప్పదనాన్ని తెలుసుకోలేడు. వినికిడి శక్తిలేనివాడు సంగీతంలోని మాధుర్యాన్ని పూర్తిగా గ్రహించలేడు. పువ్వులోని అందాలను చెవిటివాడు వివరించేప్పుడు, చూపులేనివాడు ఆశ్చర్యంలో మునిగేవిధంగానే, సంగీత మాధురిని గురించి గ్రుడ్డివాడు ప్రశంసించినప్పుడు చెవిటివాడు ఆశ్చర్యపడతాడు. అయితే తమ వల్ల తెలుసుకోలేని దానిని ఇరువురూ లేదని వాదించుకోవడంలో ఏదైనా అర్థంవుందా? ఎదుటవారి అభిప్రాయాలకు, విశ్వాసాలను, ఓపికతో తెలుసుకోవడానికి ప్రయత్నించడం నాగరికతా వికాసానికి గుర్తు. తర్కం ద్వారా ఎదుటి వారి వాదాలను జయించవచ్చు. అయితే ఎదుటివారిని ఓటమికి గురిచేయడం మాత్రమే ఒకని ఉన్నత గుణాన్ని వ్యక్తం చేసే క్రియకాదు. ఎదుటి వారి హృదయాన్ని ఆకర్షించడమే ఉత్తమమైనది. బుద్ధికి అదే పరిపూర్ణత ప్రసాదిస్తుంది.

నా విశ్వాసాలను, మూఢనమ్మకాలని, కొందరు భావించవచ్చు. అయితే అవి నా నమ్మకాలు, నన్ను 'నేనుగా' గుర్తింపచేసే కొన్ని అంశాలు. అనుభవాలు వేరైనప్పుడు అభిప్రాయాలు మారకుండా వుండవు. మారలేదు

అనుకున్నప్పటికీ ఆ అభిప్రాయాలను పునఃపరిశీలన చేసుకోవలసివస్తుంది. నా అనుభవాన్ని చెబుతాను.

తిరువిదాన్కూర్ నుంచి ఒక ఫణిక్కర్ మలయా దేశంలో స్థిరపడ్డాడు. హస్త సాముద్రికంలో ఆయనకు మంచి పాండిత్యం వుంది. పలువురి చేతులు ఆయన పరిశీలించి వారి గత జీవితానుభవాలను, రానున్న సంఘటనలను, తెలియజేశారు. హస్తసాముద్రికం చెప్పడానికి సింగపూర్‌లో నిషేధం వుండేది. అతను హస్తసాముద్రికం చెప్పినందుకు పోలీసులు అతనిమీద నేరం మోపారు. అప్పుడు ఫణిక్కర్ పక్షంలో నేను వాదించాను. హస్తసాముద్రికం విజ్ఞాన శాస్త్రమనీ, అది మూఢవిశ్వాసం, మూఢనమ్మకం కాదన్నది ఫణిక్కర్ వాదం. ఆ కేసు కోసమే నేను అనేకమైన హస్తసాముద్రిక గ్రంథాలను పరిశీలించాను, చదివాను. అందులో నాకు ఆసక్తి ఎక్కువయింది. కేసు విచారణ జరిగేప్పుడు ప్రతివాది శక్తిని పరిశీలించడానికి మేజిస్ట్రేట్ అనేక ప్రశ్నలు అడిగారు. ఫణిక్కర్ సమాధానాలు ఆయన్ను ఆశ్చర్యపరచాయి, చివరికి ప్రతివాది నిరపరాధి అని విడుదల చేశారు.

కొన్ని రోజుల తర్వాత ఆ మేజిస్ట్రేట్ ఫణిక్కర్‌కు తన చేయి చూపాడట. ఒక రోజు నన్ను చూసినప్పుడు మేజిస్ట్రేట్ ఆ ఫణిక్కర్ నా చేయి చూసి గత జీవితానుభవాలన్నిటినీ పుస్తకంలో చూసి చదివినట్లు చెప్పేశారు. భవిష్యత్తును కూడా చెప్పారు, వేచిచూడాలి మరి అన్నారు.

కేసులో గెలిచాక ఫణిక్కర్ పేరు ప్రఖ్యాతులు మరింతగా పెరిగాయి. అప్పుడు ఒక రోజు రాత్రి బారిష్టరు మిత్రుడు ఒకాయన ఫణిక్కర్‌ను కలుసుకోవడానికి నన్ను తీసుకెళ్లాలని నా దగ్గరకి వచ్చారు. ఆయన ఒక కేసులో చిక్కుకున్నారు. అప్పుడు ఏం జరుగుతుందో తెలుసుకోవాలని ఆయన ఆశించారు. అది ఆయనకు అనుకూలంగా లేదంటే ఆయనకు భవిష్యత్తే శూన్యమైపోతుంది.

నేను అప్పుడు ఫణిక్కర్ కోసం మనిషిని పంపి రప్పించాను. రాత్రి సమయం కావడం వల్ల అరచేతిని పరిశీలించడం కాస్తా ఇబ్బందిగానే వుంది. కొంత ఎక్కువ వెలుతురు వున్న బల్బు క్రింద బారిష్టరు చేతిని పరిశీలించారు ఫణిక్కర్. రేఖలను పరిశీలించి అతని స్వభావాన్ని వివరించారు. ఫణిక్కర్ ఇంతకు ముందు అతన్ని చూసిందేలేదు. ఆయన ఎవరని కూడా తెలియదు. అయినప్పటికీ చెప్పడం సరిగ్గానే వుంది. నేను ఆశ్చర్యపడ్డాను. ఆయన గుణస్వభావాలను వివరించిన తర్వాత భవిష్యత్తును కూడా వివరించారు. ఆ హస్తం గలవారు ఒక క్లిష్టమైన కేసులో చిక్కుకుపోయినట్లు, దాని నుంచి ఆయన బయటపడవచ్చునని, అయినప్పటికీ దానివల్ల వచ్చే చెడ్డపేరు

కొంతకాలం వరకూపోదని, అది ఆయన వృత్తి సంబంధమైన విషయాలను బాగా ప్రభావితంచేస్తుందనీ, ఫణిక్కర్ వివరించారు. ఆ తర్వాత అతని అనుభావాలు ఫణిక్కర్ చెప్పినట్లే జరిగాయి.

హస్తసాముద్రికం గురించి నా అభిప్రాయాన్ని ఏర్పరచుకునేప్పుడు ఈ అనుభవాన్ని అలక్ష్యం చేయగలమా? ఉదాహరణకు ఈ సంఘటన గురించి చెప్పాను.

కొన్ని రోజుల తర్వాత నా అభిప్రాయాలను గురించి మాతృభూమి పత్రికలో రాశాను. అందులో కొంత భాగాన్ని ఇక్కడ చెబుతాను.

'రకరకాల వ్యక్తులున్న లోకంలో అందరి విశ్వాసాలు, అభిప్రాయాలు, ఒకటిగా చేసి చూడడం అన్నది సాధ్యం కానిపని. ఏ విషయంలోనైన సరే కొన్ని కొన్ని కోణాలను మాత్రమే మనం చూడగలం. విశ్వాసాలు, అభిప్రాయాలు వాటి ననుసరించే ఏర్పడుతాయి. ఆ విధంగా మనం తెలుసుకునేవి, నమ్మేవి, రంగులు ఎక్కువకాకుండా, తక్కువకాకుండా వాటిని వివరించడానికి ప్రయత్నించాలి. అప్పు డే వాటిని సొంత అభిప్రాయంగా తీసుకోవచ్చు. జీవిత రహస్యం ఏదైనా సరే. నేను జీవితానందం అనుభవించడానికి ఉత్సాహం కలవాణ్ణి. జీవితరహస్యాన్ని అన్వేషించడానికి ఈ ఉత్సాహం అడ్డుగా వుందని నాకు అనిపించలేదు. శరీరం, మనసు వున్న పరిసరాలు, అపరిశుభ్రం కాకుండా, చూసుకోవాలన్నది మాత్రమే కాకుండా, వాటిని మరింత సౌందర్య సంపన్నం చేయాలని నేను భావిస్తాను. ప్రకృతి సౌందర్యం ప్రతిబింబించే ప్రదేశం, సౌకర్యాలువున్న గృహం, విశాలమైన తోట, రకరకాల ఫలాలు, కనులవిందుచేసే పుష్పాలు, కపటంలేని స్నేహం, ఉత్తమ గ్రంథాలు, ఆటలాడుకునే పాపలు, మధురమైన గీతాలు, అన్నీ నాకు ఇష్టమే. అయితే ఇవన్నీ లేని స్థితిలో బ్రతకాలన్న పరిస్థితిఎదురైనప్పటికీ, నేను నిరాశ చెందుతానని అనుకోను.

అదృష్టవంతులు వున్న ఈ ప్రపంచంలో, ఒక విధంగా కాకపోయినా మరొక విధంగా అయినా సహాయం కోరివచ్చే వాళ్ళు ప్రతిచోటా వుంటారు. అందరికీ ఒకే విధంగా సహాయం చెయ్యలేము. అయినప్పటికీ కొందరి బ్రతుకు భారాలనైనా తగ్గించడం మనకు సాధ్యమయిన పనే. ఒకరికి సహాయం చేసినందువల్ల మనం నష్టానికి గురియైనప్పటికీ, అందుకు విచారపడకుండా తృప్తిచెందడం మన కర్తవ్యం. అది ఎదుటివారికి ఓదార్పునిస్తుంది. మన ధార్మిక ప్రవృత్తిని విశాలం చేస్తుంది. తగిన వారికి సహాయం చేయలేక బాధపడిన పలు సందర్భాలను తలుచుకుంటూవుంటాను. నేను మౌనంగా

వుండడం తప్పు గా తలిచివుండవచ్చును. ఇవి తప్పించ రాని పరిస్థితులు అని మనసును దిటవు చేసుకోవడం తప్ప నాకు వేరు దారి లేదుకదా!

కొన్ని విషయాలలో పొరపాటైన అభిప్రాయాలు కలిగించకుండా వుండడం వీలుకాదు. విరోధులే వుండకూడదు అనుకుంటే ప్రాక్టీసు మానేయాలి. మన అభిప్రాయాన్ని ఎదుటి వారు సక్రమంగానే అర్థం చేసుకున్నారని అనుకోవడానికి వీలులేదు. పదవి, సంపద, పలుకుబడి, అధికారం, ఇవి ఎవరికి కలిగినా, వారికి విరోధులు కూడా తప్పకుండా ఏర్పడతారు. ఒకవేళ మన అభివృద్ధికి ఆ పరిస్థితి అవసరమవుతుందేమో! నాపట్ల విరోధ భావంగల వారి గురించి ఆలోచించి నా మనసును పాడుచేసుకోను. పగ సాధించే ఆలోచన కూడా నా మనస్సులో ఎప్పు డూ ఏర్పడలేదు. నాకు చెడుచేసిన వారికి కూడా ఆ తర్వాత నేను మంచి చేసిన సందర్భాలు వున్నాయి. దానివల్ల వాళ్లలో మార్పురావడం చూసి నేను సంతోషించిన సందర్భాలూ ఎన్నో వున్నాయి. ఎవరిపట్లనైనా మీకు విరక్తి, ద్వేషం, విరోధం వుందా? అంటే నేను చెప్పడానికి ఏమీలేదు. రకరకాల బాధలను నేను అనుభవించవలసి వచ్చినా, ఈ కారణంవల్లే, కష్టాలను అనుభవించే మనోధైర్యం, ఓర్పు, నిదానం, పొందడానికి సాధ్యమైనదేమో ననే అభిప్రాయం ఏర్పడుతోంది.

కీర్తి, పదవి, నిలకడ లేనివి అని అర్థం చేసుకోవడం కఠినం కాదు. దానికి మనచుట్టూ వున్న పరిస్థితులను కాస్త పరిశీలిస్తేనే చాలు. వాటికి సంబంధించిన సుఖాలు శాశ్వతాలు కావు. కల్లాకపటం లేని మనస్సులో మాత్రమే జీవితంలోని అందాలను, సుఖాలను, ఆస్వాదించి అనుభవించడం సాధ్యం.

మరణంతో సర్వం అంతమవుతుందని నేను అనుకోను. మరణానికి అవతలి స్థితి గురించీ నాకు తెలియదు. అయితే చివరిదాకా కొనసాగే జీవితం ఎదుటి వారికి, నాకూ ఉపయోగపడేదిగా వుండాలని నేను ఆశిస్తాను.

చాలామంది చెప్పేవిధంగా, మనిషి దయలేనివాడో, క్రూరమైనవాడో, కాదు. మన ఒక్కొక్కరిలోనూ, మంచి, చెడూ రెండూ వున్నాయి. ఇతరుల హృదయాలలో అంతర్గతంగా వున్న మంచి స్వభావాలను, స్పృశించే విధంగా మనం ప్రేమతో మాట్లాడి మసలుకోవడమే నాగరికత.

'నేను మరొకరు కంట తడిపెట్టే విధంగా దేన్నీ చెయ్యడం లేదు. ఎదుటి వారిని కష్టాలలో ఆదుకోవడానికే సహాయం చేశాను.' అని చెప్పగలిగామంటే అది ఎంతటి ఆనందాన్ని అందమైన అనుభూతిని కలిగిస్తుందో మరి!

సర్వాంతర్యామిగా వున్న మహత్తర శక్తి దయమీద అచంచలమైన విశ్వాసం వున్నవారికి మనశ్శాంతి సిద్ధించకపోదు. అది నా దగ్గర లేకుండా వుంటే నాలో నిరాశ తలెత్తినపుడల్లా, నేనేమి చేసివుండేవాణ్ణి ఇప్పుడు చెప్పలేను.

'నా జీవితం నాశనమైపోయిందే! నేను అనుకున్నట్లు ఏదీ జరగలేదే!' అని వాపోయే కొందరు మిత్రులు నాకు తెలుసు. నిజానికి అలా వాపోవడానికి వారికి ఎలాంటి కారణమూ లేదు. ఒకటిగా చదువుకుని ఉద్యోగంలో చేరాము. కాని అతనిలాగా మనం అభివృద్ధి చెందలేక పోయాము. నాకన్నా తక్కువ స్థాయిలోని వారు ఎంతగానో ఎదిగి పోయారు. ఎంతో వెనకేసుకుని ప్రముఖులైపోయారు. మాకు ఆ భాగ్యం లేదు. అని నొచ్చుకుంటూ వుంటారు. జీవిత సమరంలో ఓడిపోయామన్నదే వాళ్ల అభిప్రాయం. ఇది ఆస్తి అంతస్తుల ఆధారంగా ఏర్పరచుకున్న దురభిప్రాయాల దుష్పరిణామమే. డబ్బు, పదవి, కీర్తి, మొదలైన వాటి అశాశ్వత స్వభావాన్ని బాగా ఎరిగినవారు వాటికోసరం ప్రాకులాడటం లేదు. ఇటీవలి కాలంలో జరిగిన కొన్ని ప్రపంచ సంఘటనలు గురించి పరిశీలిద్దాం.

ఈజిప్టులో సర్వాధికారం చెలాయించిన ఫరూక్‌రాజు, ఒకరోజు ఉదయం, తన దేశం, పదవి అన్నీ చేయిజారడంతో పొరుగు దేశాలలో ఆశ్రయంకోసరం అల్లాడ వలసి వచ్చింది. ఫరూక్‌ను గెంటేసి అధికారాన్ని చేపట్టిన నజీబ్, త్వరలోనే దానిని నాసర్‌కు వదిలి వేయవలసి వచ్చింది. పారశీక, ప్రథమ మంత్రిగా వున్న మొసాదిక్ ఆ తర్వాత ఒక ఖైదీగానే జీవితాన్ని గడిపారు. స్టాలిన్ అధికారానికి రాగానే, 'ట్రాట్‌స్కీ' పేరును, కృషిని గుర్తుచేసే చిహ్నాలను నాశనం చేశారు. స్టాలిన్ కాలధర్మం చెందాక ఆయన స్మృతిచిహ్నాన్ని ఆయన తర్వాత వచ్చిన వాళ్లు రూపుమాపడానికి ప్రయత్నించారు. ఇండోనేషియాకు స్వాతంత్ర్యం సాధించిన మహా నాయకుడు డాక్టర్ సుకర్నోకు, ఆ తర్వాత ఏర్పడిన అనుభవాలను చూసి ఆయన్ను పదవీభ్రష్టుని చేశారు. ఆ మహానాయకుడు అలంకరించిన పదవులు, బాధ్యతలు, అన్నిటినీ అపహరించారు, విధి మనుషులతో చెలగాటం ఆడడంలో ఒక ప్రత్యేకతను చూపించినట్లయింది.

చారిత్రక సంఘటనలనే మార్చి, తలక్రిందులు చేయడానికి ప్రయత్నాలు కొనసాగే ప్రపంచంలో, పేరుకోసరం, ప్రతిష్ఠకోసరం, ఆశపడ్డం, వృథాకాదా?

రెండే రెండు విషయాలలో మాత్రం చెక్కుచెదరని నమ్మకం ఏర్పరచుకోవచ్చు అవి - జననం, మరణం. వాటి మధ్య జరిగేవన్నీ నిలకడలేనివి. డబ్బు, పదవి, ఆరోగ్యం, అధికారం, అన్నీ మారుతూ వుంటాయి. శాశ్వతం కాని ఈ జీవితంలో మనకు ఓదార్పు నిచ్చేది ఒకటే.

మనస్ఫూర్తిగా ఒకరికి సహాయం చెయ్యడం, మనస్ఫూర్తిగా ప్రేమ చూపడం, ఈ రెండే చేయదగ్గవి. తత్వజ్ఞాని, విజ్ఞానవేత్త అయిన ఆల్బర్ట్ ఐన్‌స్టెయిన్ చెప్పినట్లు జీవిత లక్ష్యం విజయం సాధించడం కాదు, సేవచేయడమే. ఇచ్చిన దానికన్నా ఎక్కువగా పొందేవారినే మామూలుగా మనం విజయం సాధించిన వారుగా భావిస్తాము. దానికి వ్యతిరేకంగా మనం భావించాలి. ఇక్కడ పొందడం కన్నా, ఎక్కువగా ఇవ్వాలన్నదే జీవిత విజయానికి సోపానం.

నా విశ్వాసాలకు తగిన విధంగా, కృషిచేయడానికి నా కెప్పు డూ వీలుకాలేదు. కొన్ని సందర్భాలలో అందుకు పూర్తిగా వ్యతిరేకంగా నేను నడుచుకోవలసి వచ్చేది. బలహీనతను ముఖాముఖిగా ఎదుర్కొని గెలువకపోవడం వల్ల, చాలినంత మనోధైర్యం సహజంగానే లేకపోవడం వల్లనే అలా జరుగుతుంది కాబోలు! జీవిత విజయాలు, సంతోషాలు, చాలావరకు మన నైజాన్ని బట్టే ఏర్పడతాయి. మనం కాలాన్ని వినియోగించే పద్ధతిలోనూ, సమస్యలు ఎదుర్కొనే విధానంలోనూ, ఎదుటివారితో మసలుకునే తీరులోనూ, బాధ్యతల గురించి మనకున్న అభిప్రాయాలలోనూ, మన నైజస్వభావం ద్యోతకమవుతుంది. అదృష్టం మన మీద దృష్టి సారించినప్పటికీ, ధనం కావలసినప్పుడు లభించినప్పటికీ, మంచి స్వభావాన్ని మనం రూపొందించుకోవడానికి మనం ప్రయత్నించలేదంటే, మరేదీ కూడా మనకు శాంతియుత సుఖ జీవనానికి దారి చూపదు. నిర్మలమైన మనస్సాక్షితోనే విరోధుల భయాన్నుంచీ విపరీత కాలం నుంచీ కష్టాలనుంచీ మనం విముక్తి పొందగలం.'

# మళ్లీ ప్రజాజీవితం

1934వ సంవత్సరం ఒక కేసు నిమిత్తమై నేను బోర్నియోకి వెళ్లానని చెప్పాను కదా! అక్కడి నుంచి వచ్చిన తర్వాత నా అప్పుల బాధలు కొంత తగ్గాయి. అప్పులను పూర్తిగా తీర్చడం కుదరక పోయినప్పటికీ తీర్చే అవకాశాలు ఎక్కువయ్యాయి. అప్పులు తీర్చడానికి నాలుగేళ్లు పట్టింది. శ్రద్ధతో పాటుపడడానికి మనస్సు ఉవ్విళ్లూరింది. ప్రజాజీవితంలో పాల్గొనడానికి కూడా సౌకర్యాలు ఏర్పడ్డాయి.

సింగపూరుకు వచ్చిన తర్వాత, ప్రజాహిత కార్యాలలో ఎక్కువగా పాల్గొనడానికి వీలు కాలేదు. ఒకటి రెండు సార్లు రామకృష్ణామిషన్ లోనూ, భారతీయ సంఘంలోనూ, మలయాళ సమాజంలోనూ ఉపన్యాసాలు ఇవ్వడం తప్ప నేను ఆశించినట్టు గాని, మిత్రులు బలవంతం చేసినట్టుగాని, చెప్పు కోతగ్గ పనులేవీ చేయడం సాధ్యంకాలేదు. బాకీ దారుడుగానే వుంటూ, అప్పులు తీర్చడానికి నా ప్రయత్నాలన్నిటినీ కేంద్రీకరించడంతో కాలం గడచిపోయింది. అప్పులనుంచి విముక్తి పొందిన తర్వాతే ప్రజాజీవితంలో పాల్గొనడం సాధ్యమని భావించాను. అయినప్పటికీ కొన్ని సందర్భాలలో అలా వుండడం సాధ్యం కాలేదు. 1935వ సంవత్సరం అలాంటి సందర్భం వచ్చింది. ఆ సంవత్సరం జూన్ నెలలో, బ్రిటిషు రాజు అయిదవ జార్జ్ చక్రవర్తి రజతోత్సవం జరపడానికి సింగపూర్‌లో భారీ ఏర్పాట్లు చేశారు. ఆ సందర్భంగా సింగపూర్‌లో వెలువడిన ఒక ప్రచురణలో మార్టిన్ అన్నపేరు గల ఒక ఆంగ్లేయుడు భారతీయుల్ని అవమాన పరిచేట్టు ఒక వ్యాసం వ్రాశాడు. అందులో ఇలా వుంది.

'మలయా దేశంలో వుంటున్న భారతీయులు వివిధ జాతులకు చెందినవారు. వాళ్లను యథాతథంగా గుర్తించడం కష్టం. జాతిబేధాలు వారిని బాగా వేరు చేస్తున్నాయి. అయినా వారి వద్ద సామాన్యమైన ప్రత్యేకతను చూడవచ్చును. వాళ్లు నమ్మడానికి వీలులేని మనుషులు. ఆ రకం ప్రజలు ప్రపంచంలో వుంటారు? అన్నది సందేహమే. లంకలో వారి మధ్య నేను నివసించాను. మలయాలోనూ వారి అలవాట్లు, ఆచారాలు అర్థం చేసుకోవడానికి నాకు ఎన్నో అవకాశాలు కలిగాయి.

'ఇక్కడి పెద్ద భారతీయ వాణిజ్య సంస్థలను గురించి నేను చెప్పడం లేదు. అలాంటి సంస్థలు, వ్యాపార సంప్రదాయాలను చక్కగా అనుసరిస్తున్నాయని చెప్పవచ్చు. చిన్నవ్యాపారుల విధానాలలోనే చాలా లోపాలున్నాయి. మలయాలో అటువంటి వారిని అధిక సంఖ్యలో చూడవచ్చును. వ్యాపార విషయంలో వారితో సంబంధం పెట్టుకోవడం వృధా అన్న విషయాన్ని ఆంగ్లేయులందరూ అంగీకరిస్తారు.'

భారతీయుల గురించి ఇంత అవమానకరంగా వ్రాయబడిన ఈ వ్యాసం సింగపూర్ భారతీయుల్లో సంచలనాన్ని రేకెత్తించింది. వారు సభలు ఏర్పాటు చేసి తమ నిరసనను వ్యక్తం చేశారు. అసత్యాలమయంగా వున్న ఆ వ్యాసాన్ని ప్రచురించిన వారి మీద చర్య తీసుకోవాలని అధికారులను కోరారు. భారతీయ సంస్థలకు చెందిన ఒక పెద్ద నిరసన సభ సింగపూర్ టౌన్‌హాల్లో ఏర్పాటు చేశారు. అలాంటి పెద్ద సభ అంతకు ముందు జరిగినట్లు లేదు. ఆ తర్వాత కూడా జరగలేదు!

మార్టిన్ వ్యాసాన్ని విమర్శించే తొలి తీర్మానాన్ని ప్రవేశపెట్టే బాధ్యతను నాకు అప్పగించారు. ఆ సందర్భం, అప్పటి పరిస్థితులు, ప్రజాసందోహం నన్ను ఉద్వేగ పూరితుణ్ణి చేశాయి. 'తమ దేశాన్ని గురించిగాని, దేశ ప్రజల గురించిగాని మాట్లాడడం ప్రారంభిస్తే - మీనన్‌కు ఆవేశం ముంచుకు వస్తుంది. ఆవేళ నిజంగా ఆయన అలాగే వున్నారు' అని ఆ సభను సమీక్షించిన ఒక ఆంగ్లేయుడు ఒక పత్రికలో వ్రాశాడు. నేను ఆవేశపూరితుణ్ణయ్యాను. అయినా చెప్పకూడని విషయాలను చెప్పకుండా వుండడానికే జాగ్రత్త పడ్డాను. ఆ ఉపన్యాసం లోని కొన్ని భాగాలను ఇక్కడ చూద్దాం.

'దీనికన్నా అభ్యంతరకరమైన ఒక వ్యాసం గురించి ఊహించడానికి వీలుకావడం లేదు. ఈ వ్యాసాన్ని చదివిన ఏ భారతీయునికైనా రక్తం వుడుకెత్తకుండా వుంటుందా! మనుష్యుల వర్గాభిమానం గౌరవించతగ్గది. మనదేశపు ప్రాచీన సంస్కృతి పట్ల, నాగరికత పట్ల మనకెంతో అభిమానం వుంది. వ్యక్తిగతంగా నన్నెవరైనా విమర్శించినట్లయితే దానిని నేను లెక్కచెయ్యకుండా వుండవచ్చు. కాని నా దేశాన్ని గాని, దేశ ప్రజలను గాని, ఎవరైనా అగౌరవపరచే విధంగా నిందించేప్పు డు, ఎప్పటికైనా సరే మరచిపోలేని విధంగా అతనికి ఒక గుణపాఠం నేర్పే ఆవేశం నాలో పెల్లుబుకుతుంది. అన్న విషయం ఈ సందర్భంలో జ్ఞాపకం చెయ్యడం మంచిది'.

ఆ సభలో అలుముకున్న నిశ్శబ్దం, సభికుల ఆసక్తి ప్రోత్సాహకరంగా కనిపించాయి.

ఒక సుప్రసిద్ధ ఐరోపా న్యాయవాది ఆ సభను గురించి పత్రికలో ఇలా వ్రాశారు :

'నేను చాలా రోజులుగా ఈ నగరంలో నివసిస్తున్నాను. భారతీయులు, ఇతర జాతీయులు ఏర్పాటుచేసిన సభలను చూసి వున్నాను. కాని మే ఇరవైఎనిమిదో తారీఖున విక్టోరియా మెమోరియల్ హాల్లో జరిగిన భారతీయుల మహాసభ వంటి సభ సింగపూర్‌లో ఇంతకు మునుపెన్నడూ జరిగినట్లు నాకు జ్ఞాపకం లేదు.

అది నిజమే. సింగపూర్‌లో అన్ని పత్రికలూ మార్టిన్ అహంభావాన్ని తీవ్రంగా విమర్శించాయి. తర్వాత మార్టిన్ సింగపూర్ పత్రికల ద్వారా క్షమార్పణ కోరాడు. కాని అది ఆ సందర్భానికి అనుగుణంగాను, నిజంగానే క్షమార్పణ కోరే తీరులోనూ లేదు. అది చదివినప్పుడు, అతను తను చేసిన తప్పుకు మనస్ఫూర్తిగా విచారం వెలిబుచ్చినట్లుగా కనిపించలేదు. పేరుకి క్షమార్పణ చెప్పినట్లుగా అనిపించింది. అలాంటి వారికి కనీసం అలాంటి భావన ఏర్పడడంకూడా కష్టమే. ఎలాగైతేనేం గొప్ప సంచలనాన్ని రేకెత్తించిన మార్టిన్ వ్యాసాన్ని గురించిన ప్రతిధ్వనులు అణిగిపోయాయి!

సింగపూర్‌లో రామకృష్ణా మిషన్ కృషి ప్రారంభంనుంచే నన్ను ఎంతో ఆకర్షించింది. ఆ సంస్థ నిర్వహించే అభివృద్ధి కార్యక్రమాలలో కొందరు మిత్రులు కనబరచిన ఉత్సాహం, చేసిన త్యాగం ఇతరులకు మార్గదర్శకంగా వుండేది. ఒక మంచి భవనం, అనాధశరణాలయం, విద్యాలయం, మిషన్ అనుబంధ సంస్థలుగా వెలిశాయి. అవి ప్రశంసార్హంగా నిర్వహింపబడుతూ వుండేవి. త్యాగబుద్ధి, కార్యనిరవ్వహణా దక్షతగల సన్యాసులు, సింగపూర్ శాఖకు లభించడం గొప్ప భాగ్యమనే చెప్పాలి. ఆ సంస్థల ప్రతిష్టకు, విజయానికి వారి కృషే కారణం.

నేను అక్కడ వున్న కాలంలో శ్రీ భాస్వదానంద స్వాములు సింగపూర్ రామకృష్ణా మిషన్ కార్యక్రమాలను ఎంతో శాంతియుతంగానూ, నిరంతర దరహాసంతోనూ నిర్వహించేవారు. దాదాపు పదిహేను సంవత్సరాల కాలం ఆయన అక్కడ వున్నారు.

1936వ సంవత్సరం జనవరిలో శ్రీ రామకృష్ణ పరమహంస శతజయంతి సంపూర్తి ఉత్సవాలు జరపడానికి తీర్మానించాము. దానిని పురస్కరించుకుని ఒక సర్వమత మహాసభను ఏర్పాటుచేశాము. ఆ సభ ఏర్పాటు చేయడంలోని గొప్పతనం సింగపూర్‌లో వివిధ మతాల వారినీ ఆకర్షించాయి. హిందూ మతం, ఇస్లాంమతం, క్రైస్తవ మతం, జరాతుష్ట్రమతం మొదలైన వివిధ శాఖలకు చెందిన ప్రతినిధులు ఆ మహాసభలో పాల్గొన్నారు. వివిధ మతాలవారు

పాల్గొన్న ఆ మహాసభలో హిందూమతం గురించి ఉపన్యసించే జ్ఞానం గాని, అర్హతగానీ నాకు లేదు. హిందూమతానికి చెందినవాడిగా ఆ మహాసభ ముందు నిలబడడానికి, నా మతాభిమానం ఒక్కటే నాకు ఉత్సాహాన్నిచ్చింది. భాస్వరస్వామి వారు ప్రేమపూర్వకంగా ఇచ్చిన అనుజ్ఞప్రకారం వేదాంత ఔన్నత్యాన్ని గురించి, రామకృష్ణ పరమహంస మానవతాభిమానం గురించి నేను ఆ రోజు ఉపన్యసించాను. ఆ ఉపన్యాసాన్ని నిండు మనస్సుతో ఇప్పుడు కూడా తలుచుకుంటున్నాను.

ఈ అధ్యాయాన్ని ముగించేముందు మరో అనుభవాన్ని కూడా ఇక్కడ చెప్పాలి.

భారతీయులైన కార్మికులు సింగపూర్‌లో ఎక్కువగా వుండేవారు. నగరంలో పలు విభాగాలలో, పబ్లిక్ వర్క్సులోనూ ఉద్యోగం చేసే వాళ్లే ఎక్కువ. ఆ రోజుల్లో కంటే, ఇవాళ కార్మిక సంఘాలకు అనేక రెట్లు గౌరవం, శక్తి వున్నాయి. సింగపూర్‌లో వున్న కార్మికులు, భారతీయ కార్మికులకన్న సంక్షేమ సౌకర్యాలను కోరేవారు. కాలానికి తగ్గట్టు వివిధ శాఖలలో పనిచేసే కార్మికులకు ఆ రోజులలో చెల్లించేవేతనాలు అంత తక్కువేమి కాకపోయినప్పటికీ వాళ్లు లభించిన దానితో తృప్తిపడే స్థితిలో లేరు. ఇంకా వేతనాలు పెంచాలనీ, పనిలో సౌకర్యాలు మెరుగుపరచాలనీ, తరుచుగా విన్నపాలు ప్రకటించేవారు. వివాదాలు లేకుండానే తమ కోర్కెలను వాళ్లు అధికారులకు తెలియజేసేవారు. కాలక్రమేణ వారి విధానం, ధోరణి మారాయి. అయినప్పటికీ వాళ్లు సమ్మె చేయడానికి ముందుకు రాలేదు. కొన్ని కొన్ని సందర్భాలలో అది అవసరమైంది. 1936 నవంబర్‌లో అలాంటి పరిస్థితి ఒకటి ఏర్పడింది. సింగపూర్‌లో వివిధ శాఖలలో పనిచేసే కార్మికులు సమ్మెచేయడం ప్రారంభించారు. సమ్మెకుగల కారణాలను ఇక్కడ వివరించ నవసరం లేదు. కార్మికులు వేతనాలు పెంచమని కోరారు. కొందరిని పనినుంచి తీసివేయడం సరికాదని, వాళ్లను మళ్లీ పనిలో చేర్చుకోవాలనీ పట్టు బట్టారు. అధికారులు అందుకు అంగీకరించలేదు. కార్మికులకు మున్సిపల్ అధికారులకు మధ్య నడిచిన ఉత్తరాల వ్యవహారం నేను చూశాను. (ఒక న్యాయవాది హోదాలో నాకా బాధ్యత వుంది). అయినప్పటికీ చెప్పు కోదగ్గ ఫలితం ఏదీ ఏర్పడలేదు. కార్మికులు బహిరంగ సభ ఏర్పాటు చేసి సమ్మెచేయ్యాలని తీర్మానించారు. వేలాది కార్మికులు సమ్మెకు సన్నద్ధులయ్యారు. సింగపూర్ పరిస్థితి పూర్తిగా మారిపోయింది. నేను ఒక న్యాయవాది హోదానుంచి వున్నట్టుండి కార్మిక నాయకుడిగా మారే పరిణామం! ఇంటిలోనూ, కార్యాలయంలోనూ, ఇతరమైన పనులు చూడడానికి నాకు వ్యవధి, అవకాశాలూ తక్కువయ్యాయి.

కార్యాలయానికి, కోర్టుకు సంబంధించిన అన్ని పనుల్ని రెండు వారాలు నిలిపివేశాను. సమ్మె విరమణకు, కార్మికుల కోరికలు నెరవేరడానికి నేను పలువిధాలుగా ప్రయత్నించాను. అందుకోసరం ఎన్నోసార్లు మునిసిపల్ అధికారుల్ని కలుసుకుని మాట్లాడవలసి వచ్చింది. నేను ఏలాంటి నిర్ణయం తీసుకున్నప్పటికీ, దానికి అంగీకరిస్తామని కార్మికులు తెలియజేయడంతో, నా బాధ్యత మరింతగా పెరిగింది. ఇటువంటి సందర్భాలలో అధికారులు తీసుకునే కొన్ని నిర్ణయాలు న్యాయమైనవిగా నా మనసుకు అనిపించినప్పటికీ, కార్మికుల్ని తృప్తిపరచడం చాలా కష్టం అయినప్పటికీ, ఆ బాధ్యతను స్వీకరించాను. రెండుమూడురోజులు కార్మిక నాయకులతోను, మునిసిపల్ అధికారులతో సమాలోచనలు జరిపాను. చివరికి ఒక నిర్ణయానికి వచ్చాము.

సింగపూర్‌లో కార్మికుల పరిస్థితి గురించి, సమగ్రంగా ఒక సర్వే జరపడానికి మునిసిపల్ అధికారులు సమ్మతించారు. ఆ సర్వే పర్యవసానంగా కార్మికులకు జరగవలసిన సదుపాయాలు ఏవైనాసరే. వాటిని 1936 డిసెంబర్ ఒకటిన అమలు జరపడం గురించి ఆలోచించాలని నిర్ణయించాము. సమ్మె కారణంగా పనినుంచి తొలగించిన కార్మికులను మళ్లీ పనిలోకి తీసుకోవడానికి అధికారులు అంగీకరించారు. దక్షిణ భారతీయులు చేస్తున్న ఉద్యోగాలను ఇతరులకు ఇచ్చేదిలేదని అధికారులు హామీ ఇచ్చారు. ఆనాటి పరిస్థితిలో ఇది చాలా తృప్తినిచ్చే తీర్పు అని అనడంలో సందేహంలేదు. తర్వాత ఈ వాగ్దానాలు నెరవేర్చడానికి అధికారులు వెనుకాడలేదు. ఈ సంఘటన జరిగిన వెంటనే, గౌరవనీయులైన శ్రీనివాస శాస్త్రి మలయాలో భారతీయ కార్మికుల స్థితిగతులను పరిశీలించడానికి భారత ప్రభుత్వ ప్రతినిధిగా సింగపూర్ వచ్చారు.

బ్రిటిష్ సామ్రాజ్యంలో పేరు ప్రతిష్ఠలు గడించిన శ్రీనివాస శాస్త్రి గారిలా ఆంగ్లంలో ఉపన్యసించ గలిగినవారు చాలా కొద్దిమందే వుంటారు. ఆయన భాషా ప్రావీణ్యం, అందమైన శైలి, నిర్దుష్టమైన ఉచ్చారణ, అర్థపుష్టిగల పదాలు సుప్రసిద్ధమైనవి. రాజకీయాలలో మితవాద ధోరణులు ఉన్నప్పటికీ, దేశసేవలో ఆయన ఒక ఉత్తమ భారతీయ పౌరుడు. కార్మికులకు సంబంధించిన వ్యవహారాలలో ఆయన ఒక విప్లవాత్మకమైన విధానాన్ని ఏర్పరుస్తారని ఎవరూ ఊహించలేదు. అయినా మలయా కార్మికుల స్థితిగతుల గురించి శ్రీనివాస శాస్త్రి వెలిబుచ్చిన అభిప్రాయాలు, సిఫారసులు అనుకోని విధంగా అధ్వాన్నంగా వున్నాయి. అవి కార్మికులకు మాత్రమే కాదు. ఇతరులకు కూడా దిగ్భ్రాంతిని కలిగించాయి. కౌలాలంపూర్‌లో 'ఇండియన్' అన్న పేరుతో వెలువడుతున్న పత్రికలో ఒక వ్యాసకర్త ఈ విధంగా వ్రాశారు. 'ఇది

తోటలయజమానులకూ, మలయా ప్రభుత్వానికి ఒక ఘన విజయం అన్నట్టుగానే వుంది. మలయాలో భారతీయ కార్మికుల గురించి, అసలు సమస్యలు గ్రహించకుండానే, నివేదికను సమర్పించారన్నది, నివేదికను చదివితే తెలుస్తోంది. ఆ అభిప్రాయాలు, సిఫారసులు మనం ప్రశంసించే విధంగా లేవు.'

మున్సిపల్ కార్మికుల సమ్మె గురించి వివాదం పరిష్కారమైన వెంటనే శ్రీనివాస శాస్త్రి అక్కడికి వచ్చారని చెప్పాను కదా? మలయాలో భారతీయ కార్మికుల పరిస్థితి పరిశీలించడానికి వచ్చిన శాస్త్రిగారు, తప్పకుండా మునిసిపల్ కార్మికుల సమ్మెగురించి, దానికి దోహదం చేసిన పరిస్థితుల గురించి తెలుసుకుని వుండాలి. అందుకోసరం నేను ఆయన్ను కలుసుకోవడానికి తగిన సమయం కోసరం ఒక ఉత్తరం రాశాను. అయినా నేను ఆయనతో పాటు వచ్చిన మిస్టర్ పాన్‌మెన్‌ను మాత్రమే చూడడం సాధ్యమయింది. తన ఆరోగ్యం బాగా లేదన్న సాకుతో నన్ను చూడడానికి శాస్త్రిగారు వెనుకాడారు.

ఆ తరువాత పత్రికలలో కొన్ని నివేదికలు, వివాదాలు వెలువడ్డాయి. అప్పుడు ఒక ప్రముఖుడు నాకు వ్రాసిన ఉత్తరంలోని కొన్ని భాగాలను ఇక్కడ వివరిస్తాను. ఆ రోజులలో భారతీయుల మధ్య చెలరేగిన వాగ్వాదాల గురించి కొన్ని అభిప్రాయాలను వీటిద్వారా తెలుసుకోవచ్చు.

'మీ పత్రికల్లోని ప్రకటనను నేను శ్రద్ధగా చదివాను. మునిసిపల్ కార్మికుల స్థితిగతులను శాస్త్రిగారికి స్పష్టం చేయడానికి మీరు మనస్ఫూర్తిగా ప్రయత్నించారని అర్థమవుతోంది. రగిలి రగిలి భగ్గుమన్న ఆ ఉద్వేగాగ్నిని, చల్లార్చడానికి మీరు తీసుకున్న చర్యలను, ఎవరైనాసరే అభినందించకుండా వుండలేరు. మలయా ప్రజలు ఆ సమ్మెకు సంబంధించిన సంఘటనలను, ఆందోళనతోను, దైన్యంతోను తీవ్రంగా గమనిస్తూనే వున్నారు. అలాంటి ముఖ్యమైన సంఘటన గురించి తెలుసుకునే అవకాశాన్ని శ్రీ శాస్త్రి ఎందుకో మరి ఉపయోగించుకోలేదు.

అది విచారించ తగిన సంఘటనే. అందుకు బాధ్యులు శ్రీనివాస శాస్త్రి గారో లేక ఆయన సహచరులో తెలియదు. ఆయన నివేదికను పూర్తిగా, జాగ్రత్తగా పరిశీలించినట్లయితే, మరో అభిప్రాయం ఏర్పడడానికి ఎలాంటి అవకాశమూ లేదు.

# అంధకారం అలుముకున్నప్పుడు

జీవితంలో ఎంతటి చీకటి కమ్ముకున్నప్పటికి అప్పుడప్పుడు కొంత వెలుతురు కనిపించడం అపూర్వం కాదు చీకటి నుంచి విముక్తి పొందడానికి కావలసిన వెలుగును నేను చూడగలిగాను. జీవితంలోని ఇరుకైన చీకటి గది నుంచి వెలుపలికి వచ్చిన నేను, ధారాళంగా మంచి గాలిని శ్వాసించడం ప్రారంభించాను. అప్పు యిచ్చిన వారికి బానిసగా వున్న స్థితినుంచి విముక్తి పొంది, ఒక స్వతంత్ర మానవుడిగా మంచి జీవితాన్ని అనుభవించే కాలం ఆసన్నమయింది.

నేను తిరిగి చెల్లించిన అప్పు మొత్తాన్ని కూడి చూసినప్పుడు, నాకే ఆశ్చర్యం వేసింది. తిరిగి తీసుకున్న ప్రామిసరీనోట్ లను తీర్పులను ఇతర కాగితాలను నిప్పు పెట్టి కాల్చివేశాను. అవి మండి బూడిద అయినప్పుడు నాకు కలిగిన ఆనందాన్ని వివరించడానికి వీలుకాదు. ఋణగ్రస్తులకు వుండే చిన్నతనం, బాధలు యికనైనా నన్ను బాధించకుండా వుండాలని దేవుని ప్రార్థించి నేను నా పనిలో శ్రద్ధ చూపసాగాను. ఆదాయం పెరిగింది, మిత్రులు పెరిగారు మనసులో ఆనందోత్సాహాలు ఎక్కువయ్యాయి. వృత్తిమీద ఉత్సాహం యినుమడించింది.

నా రెండవ కూతురు తంగానికి 1936వ సంవత్సర సెప్టెంబర్ నెలలో పెళ్లి చేశాను. సింగపూర్ లో 'మక్-ఆలిస్టర్' కంపెనీలో ఉద్యోగం చేస్తోన్న కె.కె.మీనన్ నా అల్లుడయ్యాడు. చిరకాలంలో పలువిధాలుగా బాధలే అనుభవించిన నాకు అది మితిమీరిన ఆనందాన్ని కలిగించే అపూర్వమైన ఘట్టం. మూడేళ్లు గడిచిన తర్వాత, నా ఆఖరి కుమార్తె లీల వివాహం చేశాను. సి.ఎమ్. తలావ్ అని క్లుప్తంగా పిలువబడే తలాప్పిల్ సాత్తుణ్ణిమీనన్ ఆమె భర్త. కూతురు పెళ్లికైనా స్వదేశానికి రావాలని నాకు అనిపించింది, కాని అది నెరవేరలేదు.

1936వ సం॥ కాంగ్రెస్ స్వర్ణోత్సవం జరుపుకునే సందర్భం వచ్చింది. దానికి సంబంధించిన బహిరంగ సభలో అధ్యక్షత వహించడానికి నన్ను ఆహ్వానించారు. మద్రాసులో ప్రథమ కాంగ్రెస్ మంత్రిమండలిలో న్యాయశాఖ మంత్రిగా వున్న కె. రామన్ మీనన్ ఆ రోజుల్లో కేరళ ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడుగా కాంగ్రెస్ కమిటీ తరఫున నన్ను ఆహ్వానించారు. ఆ ఆహ్వానాన్ని అంగీకరించడానికి వీలుకాకపోయినప్పటికీ, ఆ సందర్భంలో నా స్వల్ప సేవను

జ్ఞాపకం వుంచుకొని నన్ను గౌరవించి ఆహ్వానించిన మిత్రుల పట్ల నాలో అపరిమితమైన కృతజ్ఞతాభావం ఏర్పడింది.

. సింగపూర్‌లో భారతీయ సంఘ సభ్యులను విభజించే విధంగా ఒక సంఘటన 1939వ సం॥ ఏప్రిల్ లో జరిగింది. భారతదేశంలో భారతీయుల మధ్య ప్రగాఢ జాతీయ భావం వ్యక్తమైన కాలం అది. భారతీయ సంఘంలో సభ్యులు సమావేశమయినప్పుడల్లా, భారత దేశంలో జరిగే సంఘటనలను గురించే మాట్లాడుకోవడం అలవాటు. ఆనాటి స్థితిలో బ్రిటిష్ పరిపాలకుల కార్యకలాపాల గురించి గాఢంగా విమర్శించకుండా, భారతీయులు యితర విషయాలను, ఏమీ మాట్లాడడానికి లేదు. అటువంటి మాటలు, సంభాషణలూ, సంఘంలో జరపడం వివేకవంతమైన చర్యకాదనడం మాత్రమే కాదు అపాయం అని కూడా కొందరు భావించారు. భారతీయ సంఘంలో 'భారతీయ రాజకీయ విషయాలను గురించి మాట్లాడటం, వివాదించడం, సరికాదు అన్న' ఒక తీర్మానాన్ని ప్రతిపాదించాలని అందుకోసరమే ఏర్పాటు చేసిన ఒక సమావేశం వారు నిర్ణయించారు. ప్రభుత్వ ఉద్యోగాలలోనూ, వాణిజ్య రంగంలో వుంటున్న వాట, జాతీయ వ్యవహారాలలో సంబంధంలేని వారు ఆ సంఘంలో సభ్యులుగా కొనసాగాలంటే అటువంటి ఒక హామికావాలని, వాదించారు. అటువంటి తీర్మానం నెగ్గినట్లయితే భారతీయ సంఘం ఉనికికే భంగం ఏర్పడుతుందని నేను భావించాను. సభ్యులు చాలామంది నా అభిప్రాయానికి ఆమోదాన్ని వెలిబుచ్చారు. అటువంటి తీర్మానాన్ని ఆమోదించిన తర్వాత సంఘమే అవసరం లేదనిపించింది. అందువల్ల తీర్మానానికి అంగీకరించడం కన్నా, సంఘాన్ని లేకుండా చేయడమే మంచిదని మాలో చాలామంది భావించాము. బహిరంగసభకు చాలారోజులు ముందునుంచే ఇరు పక్షాలవాళ్లు తమ మద్దతు దార్లను వెతకడం ప్రారంభించారు. ఒకనాడు ఉదయం ప్రత్యేక సమావేశం ఏర్పాటయింది. మూడుగంటల సేపు కొనసాగిన వివాదం తర్వాత తీర్మానాన్ని మెజారిటీ ఆమోదానికి వదిలారు. అది నెగ్గలేదు. దాన్ని మేము గొప్ప విజయంగా భావించాము. కొన్నిరోజులపాటు భారతీయ ప్రజలు దాని గురించే మాట్లాడుకోసాగారు.

ఒక్కొక్కటిగా సంఘటనలు అతి త్వరగా కొనసాగాయి. రెండవ ప్రపంచ యుద్ధం, ప్రారంభమయ్యే సూచనలు పొడసూపాయి. దాన్ని దృష్టిలో వుంచుకునే కాబోలు కోట్లకొద్ది ఖర్చుపెట్టి, సింగపూర్‌లో గొప్పనౌకాదళానికి కావలసిన ఏర్పాట్లు జరిగాయి.

ఐరోపాలో జరిగిన సంఘటనలను, మలయా దేశ ప్రజలు చాలా ఉత్సాహంతో జాగ్రత్తగా గమనిస్తూ వచ్చారు. హిట్లర్ పదవీ, ప్రతిభ ఉచ్ఛస్థితికి చేరుకున్న కాలం అది. జర్మనీలో 'ఫ్యూరర్' ఏం

మాట్లాడుతున్నారు? ఏం చేస్తున్నారు? అని ప్రపంచ ప్రజలందరూ గమనించ సాగారు. నెపోలియన్‌కు తర్వాత హిట్లర్ లాగా ఐరోపాను, భయపెట్టిన మనిషి ప్రపంచ చరిత్రలో ఎవరూ లేరు. హిట్లర్ ముసోలినీ కొంత కాలంపాటు ప్రపంచ రంగంలో ముఖ్యమైన ఆటగాళ్ళుగా వెలిగారు. అయినప్పటికీ ఈ యిరువురి అంతిమ కాలమూ, ఎటువంటి దయనీయ స్థితిలో వుంది!

1939వ సంవత్సరంలో ఐరోపాలో యుద్ధం ప్రారంభంకాగానే, సింగపూర్ లోనూ, పరిస్థితి మారింది. యుద్ధానికి కావలసిన ముందు ఏర్పాట్లు జాగ్రత్తగా చేయడం ప్రారంభమయింది. భారతదేశంనుంచి ఆస్ట్రేలియా నుంచి, న్యూజిలాండ్‌నుంచి సైన్యం అక్కడికి వచ్చింది. ఎదురు దాడిని ఎదుర్కోవడానికి నగర ప్రజలకు శిక్షణ యివ్వసాగారు. ఐరోపాలో ప్రారంభమయిన యుద్ధం మలయాకు ఎప్పుడు వచ్చేస్తుందో నని ప్రజలు భయపడసాగారు.

యుద్ధకాలంలో భారతీయుల స్వభావం బ్రిటిష్‌వారికి అసంతృప్తి కలిగించింది. ప్రజాస్వామ్యం పట్ల స్వతంత్రం పట్ల శ్రద్ధవున్న వారిలా తాము జర్మనీలో యుద్ధం ప్రారంభించినట్టు ఉద్ఘాటిస్తున్నప్పటికీ, ఆ రెండు హక్కులూ భారతీయులకులేవు. దానికి బ్రిటిష్ వారే కారణం. అప్పుడు వాళ్ళు తమ అధికారాన్ని ఇండియాలో చలాయిస్తూ భారతీయుల నుంచి యుద్ధానికి సాయం పొందే దృష్టితో మసలసాగారు.

భారతీయులలో ఒకరికొకరికి ఐకమత్యం లేని కారణంగానే వారికి స్వతంత్రపు హక్కు యివ్వలేదని భారతీయ జాతీయ పరిస్థితికి అనుగుణంగా పరిపాలనా విధానంలో సంస్కరణలు చేసివున్నట్టు వాళ్ళు ప్రపంచానికి ప్రచారం చేశారు. ఆ ప్రచారాన్ని రూఢీచేసే విధంగా 'ఎడ్విన్ హెూవర్డ్' అన్న ఒక ప్రత్యేక అధికారీ, ఆయనకు సహాయకులుగా మరికొందరూ సింగపూర్ వచ్చారు.

యుద్ధకాలంలో భారతీయుల సాధారణ చర్యలను విమర్శించే విధంగా సింగపూర్ నుంచి ప్రచురించబడే ఒక ప్రముఖ పత్రిక 'ఫ్రీప్రెస్' సంపాదకీయాన్ని వెలువరించింది. దానికి జవాబుగా, భారతీయుల స్థితిని వివరించే విధంగా నేను సుదీర్ఘమైన ఒక వ్యాసం రాసి పంపాను. ప్రజాస్వామ్యం కోసరం నడుపుతున్న యుద్ధం, ఐరోపా యుద్ధ భూముల్లో కాదు, భారత చెరసాలల్లో జరుగుతోంది అని నేను రాసింది ఎడ్విన్ హెూవర్డ్ కు తగిలింది కాబోలు! భారతదేశంలో బ్రిటిష్ వాళ్ళు తీసుకొచ్చిన పరిపాలనా సంస్కరణలను ఆయన నా వ్యాసానికి సమాధానంగా తెలియజేశారు.

'నూతన పరిపాలనా సంస్కరణలను మేము బ్రిటిష్ వారి నుంచి ఆశించలేదు, భారతీయులకు వున్న సంపూర్ణ స్వాతంత్ర్యపు హక్కులను, మేము కోరుతున్నాము' అని నేను దానికి ప్రత్యుత్తరం రాశాను. ఫ్రీప్రెస్

పత్రికలో మేము జరిపిన వివాదం, భారతీయుల మధ్య ఎంతో ఉత్సాహాన్ని రేకెత్తించింది. ఆ రోజుల్లో మా యింటికి ఎప్పుడూ చాలామంది వస్తూవుండేవారు, యుద్ధ సమయం... జాగ్రత్తగా వుండండి! అని కొందరు సలహా యిచ్చారు.

నన్ను చూడాలని ఆశిస్తున్నట్టు తెలియచేసి నన్ను తేనీటి విందుకు ఒకసారి ఎడ్విన్ హొవర్డ్ నన్ను ఆహ్వానించాడు. మేము యిరువురమూ, సింగపూర్ ఆడల్ఫి హొటల్‌లో కలుసుకున్నాము. మేము యిద్దరం మాత్రమే వున్నాము. భారతీయుల స్థితి గురించి మేము రెండు గంటలపాటు చర్చించుకున్నాము. ఇద్దరం అభిప్రాయాలు మార్చుకోకుండానే విడిపోయాము. ఇంకొక రోజు చర్చలను కొనసాగిద్దామని భావించాము. దానికి అవకాశం లభించలేదు. మలయాలో అప్పటికీ యుద్ధం వచ్చేసింది.

1941వ సం॥ డిసెంబర్ ఎనిమిదో తేదీ వేకువజామున ఎటువంటి ముందు హెచ్చరికలు లేకుండా సింగపూర్ నగర మధ్య భాగంలో రెండు బాంబులు పడ్డాయి. వాటి శబ్దం విని నగర ప్రజలు మేల్కొన్నారు. ఏమనీ తెలియకుండా కొందరు ఆశ్చర్యపడ్డారు. జపాన్ చక్రవర్తి, బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా యుద్ధ ప్రకటన చేసిన వివరం, తెల్లవారిన తర్వాతే ప్రజలకు తెలియవచ్చింది. రెండు రోజులు గడిచిన తర్వాత డిసెంబర్ పదో తేదీ జపాన్ సైనికులు కోట్టంపారు, సింగోరా, పట్టాణి మొదలైన మూడు ప్రదేశాలలో దిగారని వేగంగా ముందడుగు వేస్తున్నారనీ విని ప్రజలు భయపడి ఏమి చేయడానికి తోచక దిగులుపడ్డారు. చాలామంది మలయా దేశాన్ని వదలి వెళ్లడానికి సిద్ధపడ్డారు. అయితే అందుకు అవసరమైన నౌకలు లేవు. ఉన్న నౌకల్లో ప్రజలు క్రిక్కిరిసి వేగంగా బయలుదేరారు. కొన్ని నౌకలను జపాన్‌వారు బాంబులు పేల్చి నాశనం చేశారు. నౌకలు చాలావరకు అనుకున్న స్థలాలను చేరలేకపోయాయి. భార్యలు భర్తల నుంచి విడిపోవలసివచ్చింది. బిడ్డలు తల్లిదండ్రులకు దూరం కావలసివచ్చింది. ఎలాగైనా సరే యుద్ధ ప్రాంతాల నుంచి పారిపోవాలని చాలామంది ప్రజలు భావించారు. వెళ్లడానికి వీలుకానివారు భద్రతకోసరం ప్రయత్నించసాగారు. బాంబులకు నాశనం కాని 'షెల్టర్'లను ఏర్పాటు చేశారు. ఆహార పదార్థాలను సేకరించి పెట్టుకున్నారు. మామూలు ఏర్పాట్లన్నీ కొనసాగాయి. నేను కార్యాలయానికి వెళ్లడం మానేశాను. పత్రికలు, రేడియో, యింకా ప్రజల ద్వారా వ్యాపించే వార్తలు మొదలైన వాటితో మేము అక్కడక్కడ జరిగే సంఘటనలను గురించి తెలుసుకునేవాళ్లం, అందరం దిగులులో గడిపాము.

కొత్త ప్రాంతాలను జపాన్ వాళ్లు చేపట్టే విషయాలను, ప్రతి రోజు ఉదయం తెలుసుకోవచ్చు. సింగపూర్‌లో శరణార్థులు వచ్చి చేరారు. ఏమైనప్పటికీ జపాన్‌వాళ్లు సింగపూర్‌ను పట్టుకోలేరని ప్రజలు నమ్మారు. ఈ సందర్భంలోనే

విన్స్టన్ చర్చిల్ ప్రజలు ఆ విధంగా విశ్వాసముంచినన్నాళ్లు, జపాన్‌వారి దాడి గురించి భయపడనవసరం లేదని చెప్పారు. అయినా ఏ అడ్డంకునూ లెక్కచేయకుండా విరోధులు అనాయాసంగా పురోగమించారు. జపాన్ వారు సింగపూర్ వైపు పురోగమిస్తున్నారు. పినాంగ్, కోలాలంపూర్, మలక్కా, అన్న ప్రదేశాలు వారి వశమయ్యాయి.

1942వ సం॥ జనవరి ముప్ఫై ఒకటో తేదీ, జపాన్ సైన్యం సింగపూర్ పక్కన వున్న జోహార్‌ను చేరుకుందన్న వార్త అందినప్పుడు సింగపూర్ నగరం పరిసరాలు ఉన్నట్టుండి మార్పుచెందాయి. సింగపూర్ సైనిక సిబ్బంది ఆయుధాలతో పెద్ద కోటగా రూపొందింది.

జోహరార్ నుంచి సింగపూర్‌కు వెనుకంజవేసిన బ్రిటిష్ సైన్యం, దానితో పాటు లెక్కలేనన్ని వాహనాలు, ఆయుధ సామాగ్రి వెల్లువలా వ్యాపించిన దృశ్యం మరిచిపోలేని దృశ్యంగా రూపొందింది. నేను నివసించే యింటి నుంచి చూసినప్పుడు ఆ సైనిక ప్రవాహం ఆగడానికి మూడురోజులు పట్టింది. జోహరార్‌ను! సింగపూర్‌ను కలిపే వంతెనను బ్రిటిష్‌వాళ్లు బాంబు ప్రేల్చిపడగొట్టారు. విరోధుల పురోగమనాన్ని అది ఆపగలదని వారు భావించారు. జపాన్ వారి పురోగమనాన్ని అలా నిరోధించడం సాధ్యపడలేదు. 'సింగపూర్‌ను చేపట్టే పోరాటాన్ని వెంటనే ప్రారంభిస్తాం అది ఎంతోసేపు పట్టదు. జపాన్ సైనికులు దానికి కావలసిన ఏర్పాట్లు చేస్తున్నారు అని టోక్యో రేడియో తెలియచేసినప్పుడు, భయంకరమైన అనుభవాలు ఎదురుకానున్నట్లు మేము గ్రహించాము.

నాలుగు రోజులు గడిచాయి. 'సింగపూర్ విరోధులు ఎప్పుడూ చేపట్టలేరు. ఒక్కొక్క అంగుళానికి మేము పోరాడుతాం. తుది విజయం మనదే అనడంలో సందేహం లేదు' అని సింగపూర్ గవర్నర్ సర్‌షన్‌టన్ థామన్ ప్రకటించినప్పుడు బ్రిటిష్ వారు పెద్ద యుద్ధానికి సిద్ధంగా వున్నట్లే అందరూ భావించారు. అయినా జరిగింది వేరు. అతి త్వరలోనే అంతా అయిపోయింది.

# యుద్ధం తర్వాత

నా యుద్ధ కాల అనుభవాల గురించి 'వర్తమానకాలము-భవిష్యత్కాలము' అన్న గ్రంథంలో వివరంగా వ్రాశాను. అయినప్పటికీ స్వీయచరిత్రను వివరించే ఈ పుస్తకంలో జీవితాన్ని సన్నిహితంగా స్పృశించే విషయాలను విడిచిపెట్టడం భావ్యంకాదు కదా!

యుద్ధం ప్రారంభమైన ఆ రోజు నేను సింగపూర్ నగరం నుంచి నాలుగు మైళ్ల దూరంలో వున్న 'పయోలేపర్' అన్న ప్రాంతంలో వుండేవాణ్ణి. మా కుటుంబం మాత్రమే కాదు. కొందరు మిత్రులు వారి కుటుంబాలతో మాతో పాటు వుండేవారు. భద్రతకు కావలసిన అన్ని ఏర్పాట్లు చేసుకున్నాము. కొన్నాళ్ల వరకు అవసరమయ్యే ఆహార పదార్థాలు సేకరించి వుంచాము. బాంబులు వేసే విమానాలు వచ్చేప్పుడు సురక్షితంగా దాక్కోవడానికి 'షెల్టర్లు' నిర్మించుకున్నాము. ఎప్పుడు జపానీయులు సింగపూర్‌ను వశం చేసుకోవడానికి వస్తారో అన్న భయాందోళనలతో మేము రోజులు నెట్టుకువచ్చాము.

1942వ సంవత్సరం ఫిబ్రవరి 8వ తేది సాయంకాలం మా ఇంటి ముందు బాంబు ప్రేలిన భయంకర ధ్వని వినిపించింది. ఉన్నట్టుండి పెద్ద వెలుగు, ఆ వెంటనే భయంకరమైన ధ్వని, మమ్మల్ని దిగ్భ్రాంతుల్ని చేశాయి. అయిదు నిముషాలలో మరో బాంబు ప్రేలింది. జపానీయులు దాడి ప్రారంభించారు. మాకు భయం మరీ ఎక్కువయింది. వాళ్లు ఏ దారి గుండా సింగపూర్ వస్తారన్నదీ మాకు తెలియలేదు. వెంటవెంటనే మళ్లీ రెండు మూడు బాంబులు ప్రేలడం విన్నాము. ఏం చేద్దామా? అని మేము ఆలోచించడం ప్రారంభించాము. ఇంకా అక్కడే నివసించడం అపాయకరమని గ్రహించాము. నగరానికి వెళ్లాలని తీర్మానించుకున్నాము. అక్కడ రెండు కార్లు వున్నాయి. మూడు నాలుగు సార్లు మేమందరమూ నగరంలోని ఒక ఇంటికి చేరుకున్నాము. నాలుగైదు రోజులు గడిచాయి. జపాన్ విమానాలు అక్కడ కూడా బాంబులు వేయడం ప్రారంభించాయి. నగరాన్నంతా, బాంబుల దాడి జరిపి నాశనం చేయాలని వారు భావిస్తున్నట్లు వదంతులు బయలుదేరాయి. ప్రజలు భయభ్రాంతులతో అటు ఇటు పరుగులు తీస్తూ అల్లల్లాడి

పోయారు. మళ్లీ మేము అక్కడి నుంచి 'పయలేపర్' ఇంటికి తిరిగి వెళ్లడానికి నిశ్చయించుకున్నాము. భోజనం చేయడానికి కూడా సమయం లేదు. ఒక్క కారు మాత్రమే అక్కడ వుంది. అందులోనే అనేక సార్లు వంతులవారీగా ప్రయాణం చేసి, అందరం 'పయలేపర్' ఇల్లు చేరుకున్నాము.

అప్పుడు మూడు గంటలు అయివుంటుంది. బాంబులు, ఫిరంగులు ప్రేలే శబ్దం అప్పుడప్పుడు వింటున్నప్పటికీ, ఆకలితో అలసిసొలసి పోయిన మేము టీనీళ్లయినా తాగడానికి సిద్ధపడ్డాము. అందుకోసరం బయలుదేరాము. అప్పుడే ఒక బాంబు ప్రేలి వంటగది పైకప్పును కూల్చివేసింది. గుండెల్లో భయంతో మేము 'షెల్టర్' వైపు పరుగుతీశాము. 'షెల్టర్' కు చేరే లోపల మరో బాంబు ప్రేలింది. అదీ వంటగది గోడ మీద పడింది. అనేకచోట్ల నుంచి ప్రజల హాహాకారాలు వినిపించాయి. ఎవరూ బయటకు రావడానికి వీలుకాదు. ఆ సౌకర్యమూ లేదు. బాంబులు విడవకుండా వర్షించసాగాయి. ఆ ఇంటికి సంబంధించిన ఒక్కొక్క భాగమూ కూలి పోసాగింది. చెట్లు వ్రేళ్లతో సహావడిపోయాయి. దగ్గరున్న ఇళ్లు నిప్పంటుకుని మండిపోసాగాయి. దిగ్భ్రమ చెందిన ప్రజలు గట్టిగా దైవప్రార్థనలు చేయసాగారు. ఒక్క క్షణంలో ఆ ప్రదేశం భయంకరమైన నరకంగా మారిపోయింది. ఒక్కొక్క బాంబుప్రేలే శబ్దం వినగానే 'ఎవరైనా ప్రమాదానికి గురైనారా?' అని గట్టిగా కేకవేసి అడిగేవాణ్ణి. ఉన్నచోటునుంచి జరగడానికి కూడా సాధ్యంకాదాయె మరి. ఇలాగే ఒక చీకటి రాత్రి కరిగిపోయింది.

తెల్లవారింది. చుట్టుపట్ల చూసిన ఆ భీభత్సమయమైన దృశ్యాలను నేను ఎలా వివరించను! ఆ ఇంట్లో ఇక నివసించడం సాధ్యంకాని విధంగా వివిధ భాగాలు విరిగి నాశనమైపోయాయి. వేరే ఇల్లు ఏదైనా వుందా? అని చూడాలంటే, బయటకు వెళ్లడం కుదరదు. అప్పుడే యుద్ధం ముగిసిందన్న వార్త విన్నాము. ఆ వార్త వినగానే మాకు కాస్త నిబ్బరం కలిగింది. 1942 ఫిబ్రవరి 16వ తేది, సూర్యోదయమవుతూ వుండగా, జపాన్ వారి ఉదయ సూర్యచిహ్నంగల పతాకం సింగపూర్ 'కాదె' భవనం మీద ఎగురుతోంది!

రెండు రోజులు గడిచాక ఒక జపాన్, సైనికాధికారి మా ఇంటికి వచ్చాడు. అతనిపై అధికారి నన్ను చూడాలని ఆశిస్తున్నట్లు, మర్నాడు ఉదయం కలుసుకోవడానికి సిద్ధంగా వుండమనీ చెప్పాడు. మర్నాడు నిర్ణీత సమయానికి, కారులో వచ్చాడు. నేను అతని కారులోనే ఆ పై అధికారిని చూడడానికి వెళ్లాను.

దారిపొడుగునా నేను చూసిన దృశ్యాలు మరుపురానివి. బాంబులు పడి గోతులమయం అయిన రోడ్లు, విరిగిన చెట్లు, కుళ్లిన శవాలు, రెండురోజుల

ముందే ముగిసిన యుద్ధ భీభత్సాన్ని జ్ఞాపకం చేశాయి. దారిలో అక్కడక్కడ సాయుధులైన సైనిక భటులు కారు ఆపి తణిఖీ చేశారు. కూడా వున్నవాళ్లు జపాన్ సైన్యానికి చెందినవారు కావడంతో, త్వరగా ముందుకు వెళ్లడానికి అనుమతించారు. అరగంటసేపు ప్రయాణం చేసిన తర్వాత, ఒక పెద్ద భవనం ముందు కారు ఆగింది. వెంటనే నన్ను మేజర్ ఫూజివరా ముందుకి తీసుకువెళ్లారు. ఆ రోజులలో మేజర్ ఫ్యూజివరా కు నలభైయేళ్ల కన్న ఎక్కువ వయసు వుండదు. నవ్వు ముఖం. ఆయన చక్కగా, సమర్థవంతంగా మాట్లాడేవారు. ఒక్కొక్క చోటుకి వచ్చేప్పుడు భారతీయులతో స్నేహంచేసి ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ స్థాపించడం ఆయన అలవాటు. ఈ విషయంలో జపానీయులతో పాటు భారతీయ అధికారులు కూడా కొందరు సహకరించారు. ఫూజివరాకు సరిగ్గా ఆంగ్లంలో మాట్లాడడం రాదు. అందువల్ల ఆయన నాతో మాట్లాడేప్పుడు, అనువాదకునిగా 'గునిషిక్' అనుపేరు గల మరో జపానీయుడు కూడా దగ్గరే వుండేవారు. దాదాపు రెండు గంటల సేపు ఆయన మాట్లాడారు. నేను అన్నీ విన్నాను. అంతే. ఆంగ్లేయులు భారతీయులను బానిసలుగా పరిపాలించడం ఒక ఆసియా వాసునిగా తనకు బాధాకరంగా వుందనీ, భారతీయులకు స్వాతంత్ర్యం ఇప్పించడమే తన జీవిత లక్ష్యంగా భావిస్తున్నట్లు ఆయన చెప్పారు. అందుకు తగిన సమయం కూడా అప్పుడే ఆసన్నమైనదనీ భారతీయులందరూ ఏకమై పోరాడాలనీ ఆయన నాకు వివరించారు. వెంటనే ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ శాఖను అక్కడ స్థాపించాలన్నారు. మాట్లాడిన తర్వాత నన్ను ఒక సైనికాధికారితో పాటు ఆ కారులోనే ఇంటికి పంపారు. మళ్లిమళ్లీ రెండుమూడుసార్లు మేజర్ ఫ్యూజివరా నా కోసరం మనిషిని పంపడంతో వెళ్లి ఆయనను కలుసుకున్నాను.

రెండు వారాలు గడిచిన తర్వాత మా ఇంట్లోనే ఒక సభ జరిగింది. ఆ రోజే సింగపూర్‌లో 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' శాఖను ప్రారంభించాము. సింగపూర్‌లో సుప్రసిద్ధ బారిస్టర్ కోహూ దాని అధ్యక్షుడు. నేను ఉపాధ్యక్షుణ్ణి. కోహూ చాలాకాలంగా సింగపూర్‌లో వుంటూ పేరు ప్రతిష్ఠలు పొందిన వంగదేశస్థుడు. ఇండిపెండెన్స్ లీగ్ స్థాపనలోనూ, కార్యనిర్వాహకులను ఎన్నుకోవడంలోనూ జపానీయులు నేపథ్యంలో సహకరిస్తూ మా హక్కును సమర్థించారు.

ఆనాటి పరిస్థితులలో జపానీయులతో వున్న సంబంధం ఒక వరప్రసాదంగా వున్నది. సైనికులవల్ల ప్రజలు అనేక ఇబ్బందులకు గురిఅయ్యారు. ముఖ్యంగా యుద్ధం ముగిసిన కొన్నాళ్లవరకు సైనికులు ప్రజలపట్ల మృగాల్లా వ్యవహరించారు. ఇళ్లల్లో జొరబడి తమకు కావలసినవి తీసుకువెళ్లేవారు.

ప్రజలను ఇబ్బందులపాలు చేయడం, స్త్రీలను అవమానపరచడం సాధారణకృత్యాలయ్యాయి. ప్రజలు ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని గడిపిన రోజులు అవి. ఆ భయంనుంచి మాకు విమోచనం కలిగించే విధంగా మేజర్ ఫ్యూజివరా మా ఇంటిముందు ఒక బోర్డు తగిలించే ఏర్పాటు చేశారు. అది చూసిన సైనికులు మా ఇంటి వైపు రాకుండా వెళ్లేవారు. అది మాకు మాత్రమే కాదు. కొందరు మిత్రులకి కూడా వరప్రసాదం అయింది. రెండువారాలు గడిచాయి.

మార్చినెల మొదటి వారంలో ఒకరోజు ఫ్యూజివర్రా నన్ను చూడాలని కబురు పంపాడు. ఆ రోజు కలుసుకున్నప్పుడే నేను టోక్యోకి బయలుదేరాలని తెలియజేశారు. భారత స్వాతంత్ర్యం గురించి చర్చించడానికి, భారతీయ మహాసభ జరపడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. అందుకోసరం, నేను మరికొందరు భారతీయ మిత్రులు మలయా నుంచి టోక్యో వెళ్లాలని ఆయన తెలియజేశారు. నాకు ఉత్సాహంగానే వుంది. మార్చి పదిహేను ఉదయం ఏడు గంటలకు నేను విమానంలో జపానుకు బయలుదేరాను.

మేము ఒక ప్రత్యేక విమానంలో ప్రయాణమయ్యాము. ఎనిమిదిమంది బృందంలో ముగ్గురు జపానీయులు. మేజర్ ఫ్యూజివరా కాకుండా, కల్నల్ ఇవాగురు, మరొక జపానీయుడూ వున్నారు. మేజర్ ఫ్యూజివర్రా 'కు బదులుగా 'ఇండియన్ ఇండిపెండెన్సీ లీగ్' కొత్త లమాజన్ అధికారిగా ఇవాగురు నియమింపబడ్డారు.

నాతో వున్న మరో నలుగురు భారతీయులు - మోహన్ సింగ్, కల్నల్ గిల్, ఎన్. రాఘవన్, ఎన్.సి. కోహా బ్రిటిష్ సైన్యంలో ఒక కేప్టన్‌గా వున్న మోహన్ సింగ్ జపాన్ వారి సాయంతో తయారైన భారతీయ జాతీయ సేనకి జనరల్. అరుదైన శక్తి సామర్థ్యాలు గల మోహన్ సింగ్, జంకు గొంకు లేని వ్యక్తి. దేశభిమాని. ఆయన నాకు పరిచయమైనా నాటినుంచే మేము ఎంతో స్నేహంగా మెలిగే వాళ్లం. ఇంకా ఆ స్నేహం కొనసాగుతూనే వుంది. బ్రిటిష్ సైన్యంలో వున్న రోజులలో కల్నల్‌గిల్ పదవి మోహన్ సింగ్ పదవి కన్నా ఉన్నతంగా వున్నప్పటికీ, భారతీయ సైన్యంలో ఆయన మోహన్ సింగ్‌కు తక్కువ స్థాయి అయిన పదవిలోనే వుండేవారు. ఆయన సలహాలు, సహకారం మోహన్ సింగ్‌కు ఎంతగానో దోహదం చేశాయి. కల్నల్ గిల్ మన దేశరాయబారిగా వివిధ దేశాలలో కృషి చేసిన తర్వాత ప్రస్తుతం పదవీ విరమణచేసి విశ్రాంతి తీసుకుంటున్నారు.

ఎన్. రాఘవన్, పెనాంగ్‌లో ప్రాక్టీసుచేస్తున్న బారిస్టరు. మలయా-భారత సంబంధించిన వ్యవహారాలలో పాల్గొని ఆయన ఎంతో దక్షతతో నిర్వహించారు.

రాఘవన్ కూడా పలు దేశాలలో రాయబారిగా వ్యవహరించిన తర్వాత విశ్రాంతి తీసుకుంటున్నారు. సింగపూర్‌లో రాయబారిగా వున్న కోహ్ గురించి ముందే వివరించాను. ఆయన కూడా మరో ప్రయాణం చేసిన వారిలో ఒకరు.

సింగపూర్‌నుంచి మేము బయలుదేరి, సైగాన్, హైనాన్, పొంగై, తైహోక్ మొదలైన ప్రాంతాలలో ఒక్కొక్క రోజు బసచేశాము. అయిదవరోజు టోక్యో చేరుకున్నాము. ప్రయాణం దారిపొడవునా కావలసిన సౌకర్యాలను జపానీయులు ఏర్పాటు చేశారు.

మేము జపాన్ చేరిన రెండు రోజుల తర్వాతే మరికొందరు భారతీయులను ఎక్కించుకుని మాకంటే ముందే బయలుదేరిన విమానం జపాన్ కొండ శిఖరాల మధ్య కూలిపోయిందన్న వార్త విన్నాము. వాళ్లు కూడ జపాన్‌లో జరగనున్న మహాసభకు మలయా నుంచి బయలుదేరారు. నీలకంఠ అయ్యర్ కేప్టన్ అక్రమ్ సింగ్, స్వామి సత్యానందపురి, ప్రీతమ్‌సింగ్ మొదలైన పలువురు ఆ విమాన దుర్ఘటనలో ప్రాణాలు కోల్పోయారు.

వీళ్లల్లో నీలకంఠ అయ్యర్ గురించి ముఖ్యంగా చెప్పాలి. ఆయన చాలాకాలం మలయాలో వుంటే, పలు కార్యక్రమాలలో పాలుపంచుకున్న ప్రముఖులు. ముఖ్యంగా భారతీయులకు సంబంధించిన కార్యక్రమాలలో ఉత్సాహంగా కృషి చేసిన వ్యక్తి. అక్కణ్ణుంచి స్వదేశానికి చేరుకోవాలని ఆయన అనుకుంటున్నప్పుడే యుద్ధం ప్రారంభమైంది. 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' ప్రారంభించినప్పుడు అందులోనూ అయ్యర్ ఉత్సాహంగా పాల్గొన్నారు. అందువల్లనే అయ్యర్‌ను కూడా టోక్యోకు ఆహ్వానించారు.

టోక్యోకు బయలుదేరేముందు ఒకరోజు సాయంకాలం మా ఇంటికి వచ్చారాయన. రాత్రి ఎనిమిది గంటలకు జపానీయులు అక్కడికి వచ్చారు. అప్పుడు అయ్యర్ అక్కడే వున్నారు. మరునాడు జపానుకు వెళ్లడానిక ఒక విమానం సిద్ధంగా వున్నట్లూ, అందులో కొందరు వెళ్లవచ్చనీ చెప్పారు. ఆ రోజే బయలుదేరడానికి నాకు వీలుకాలేదు. అందువల్ల 'సరే నేను రేపు బయలుదేరుతాను' అన్నారు అయ్యర్. నాకు బదులుగా అయ్యర్ ఆ విమానంలో బయలుదేరి వెళ్లారు.

అది వారి వారి విధి.... కాదంటే మరి...? ఏం చెప్పడం ఆ విమానమే కొండశిఖరానికి తగిలి కూలిపోయింది. మొదట అనుకున్న ప్రకారం నేనా విమానంలో వెళ్లివుంటే ఇవాళ ఇది రాసే అవకాశమే నాకు వుండేదికాదు.

టోక్యోలో కార్యక్రమాలు ప్రారంభమయ్యే సమయంలో ఈ దుర్ఘటన గురించి విని మేము దిగ్భ్రాంతి చెందాము. మరణించిన మా మిత్రుల ఆత్మశాంతి కోసరం మేము జరిపిన ప్రార్థన సభలో ఆనాటి జపాన్ ముఖ్యమంత్రి జనరల్

టోజా టోక్యో నగర ప్రముఖులు, ఉన్నత పదవుల్లో వున్న ప్రభుత్వోద్యోగులూ పాల్గొన్నారు.

చివరికి, ఆ ప్రియమిత్రులు లేకుండానే మేము జపాన్‌లో కార్యక్రమాలు నిర్వహించవలసి వచ్చింది.

# జపాన్‌లోనూ — బాంకాక్‌లోనూ

జపాన్ పర్యటనకు వచ్చే వాళ్లందరూ జపాన్‌లో మూడు దృశ్యాలను ముఖ్యంగా చూడాలి.

ఒకటి, ఫూజియామా పర్వతం; రెండవది జపాన్ గెయ్‌షా స్త్రీలు, మూడవది మనసును దోచుకునే విధంగా పుష్పాలతో కళ కళలాడే చెర్రీ చెట్లు. విమానంలో టోక్యో వెళ్లేప్పుడు ఫూజియామా (అగ్ని) పర్వతం అద్భుత దృశ్యాన్ని దూరంనుంచి చూసే అవకాశం లభించింది. ఒకసారి చూస్తే మరిచిపోలేని దృశ్యం. గెయ్‌షా స్త్రీలు లేకుండా అతిథి సత్కారాలే లేవని చెప్పవచ్చు. విచిత్రమైన దుస్తులు ధరించి, ఆకర్షణీయంగా మాట్లాడుతూ అతిథులను ఆకట్టుకునే సామర్థ్యం చూసినప్పుడు, అతిథిని వాళ్లు ఆకర్షించే కారణం అర్థమవుతుంది. జపానులో స్త్రీలు పురుషులతో సమంగా విందులు, సత్కారాలు సభలలో పాల్గొనలేని కాలం ఒకప్పుడు వుండేది. ఆ కాలంలో, అతిథులను సత్కరించడానికి, కొందరు స్త్రీలకు ప్రత్యేక శిక్షణ యివ్వబడింది. అటువంటి జాతికి చెందిన వాళ్లే గెయ్‌షా స్త్రీలు.

చెర్రీ వృక్షాలు పువ్వులతో కళకళలాడే దృశ్యం కూడా చూడడానికి అద్భుతమైనది. వసంతకాలంలో రెండుమూడువారాలు మాత్రమే. ఈ దృశ్యం చూడడానికి వీలవుతుంది. మేము ఆ రుతువులో జపాన్ వెళ్లాము. ప్రకృతి అద్భుత సౌందర్యాన్ని దర్శించే సదవకాశం, ప్రయోజనం సిద్ధించింది. కనుచూపుమేరకు వ్యాపించిన చెర్రీ వృక్షాలలో సూర్యరశ్మి కిరణాలు పడేప్పుడు కనిపించే అందాలు వర్ణనాతీతం!

జపాన్ వెళ్లిన రెండు మూడు రోజుల తరువాత మాకు ఒక విందు ఏర్పాటయింది. దాదాపు ఆరువందల మంది జపాన్ వాళ్లు ఆ విందులో పాల్గొన్నారు. మంత్రులు, సేనాధిపతులు, నగర ప్రముఖులు ఆ విందులో పాల్గొన్నారు. భారతదేశం, బ్రిటిష్ ఏకాధిపత్యం నుంచి విడివడే ప్రయత్నాలలో ఎటువంటి త్యాగం చేయడానికైనా సిద్ధంగా వున్నామని వాళ్లలో చాలామంది మాట్లాడారు. అంత భారీ ఎత్తున కాకపోయినా, ఆ తరువాత మాకు మరికొన్ని విందు ఏర్పాట్లు జరిగాయి. జపాన్‌లో ముఖ్యమైన ప్రదేశాలు, సుప్రసిద్ధ సంస్థలు, పురాతన కళా వస్తువులు, మొదలైన వాటినన్నిటినీ మేము

చూడడానికి కావలసిన సకల సదుపాయాలు ఏర్పాటు చేశారు. జపాన్‌వారి దేశభక్తి, ప్రత్యేక నాగరికతా విశిష్టత పరిశ్రమించే గుణం, వినయం, చూపరులందరినీ ఆకర్షిస్తాయి. జపాన్‌లో బసచేసిన కొన్నిరోజులు మాకు ఆనందదాయకంగాను! ప్రయోజనాత్మకంగాను పరిణమించాయి. ఆ దేశాన్ని మేము కేవలం పర్యటించి, ఆ అందాలు చూడడానికి మాత్రమే వెళ్లలేదు! భారత స్వాతంత్ర్యం గురించి, జరిపిన ఆలోచనలూ, వివరాలు గురించి చెబుతాను.

మేము టోక్యో చేరిన రెండు రోజుల తరవాతే, మలయా, హాంకాంగ్, షాంగ్‌హై, జపాన్ మొదలైన ప్రాంతాల ప్రతినిధులుగా వచ్చిన కొందరు భారతీయులతో మహాసభ ప్రారంభమయింది. ఇరవైమంది మాత్రమే మహాసభకు వచ్చారు. కర్నల్ ఇవాగురు స్వాగతోపన్యాసం చేశారు. భారత స్వాతంత్ర్యం కోసరం, ఎటువంటి సహాయాన్నయినా చేయడానికి జపాన్ సిద్ధంగా వుందనీ, అందుకు ఏమేం చెయ్యాలి? ఎలా చెయ్యాలి? అన్న విషయాలు మేము చెప్పాలని ఇవాగురు వివరించారు.

చాలా రోజులుగా జపాన్‌లో నివసిస్తున్న రాష్‌బిహారిబోస్, మహాసభకు అధ్యక్షత వహించారు. భారతీయ వైస్రాయ్ హార్డింజ్ ప్రభువు మీద బాంబు పేల్చిన నేరానికి తనను ఖైదు చేయనున్నారని తెలియగానే, రాష్‌బిహారి ఇండియాను వదిలి జపాన్‌కు వెళ్లారు. అప్పటినుంచి ఆయన జపాన్‌లోనే వుంటున్నారు. చాలాకాలం జపాన్‌లోనే వుండడంవల్ల, ఆయన లక్ష్యాలు, కార్యకలాపాలు మాత్రమే కాకుండా ఆలోచనా ధోరణి, జీవన విధానం కూడా, జపానీయుల్లాగే వుండేవి. రాష్‌బిహారిబోస్ ఒక మంచి మనిషి. అయితే స్వతంత్రంగా ఆలోచించే శక్తిగాని, తన సొంత అభిప్రాయాలకు అనుగుణంగా కార్యాచరణను చేపట్టే మనేబలమో ఆయనకు లేదు. 'ఇండియన్ ఇండిపెండెట్స్ లీగ్' కార్యకలాపాలను ఆయన నాయకత్వంలో నడిపించడానికి జపాన్‌వాళ్లు తీర్మానించారు.

లీగ్‌ను నడిపించడానికి అన్ని అధికారాలనూ పొందిన నాయకుడుగా రాష్‌బిహారీబోస్‌ని నియమించిన తర్వాత, ఆయనకు సహాయం చేయడానికి, సలహాలు చెప్పడానికి, ఒక కమిటీని ఏర్పాటు చేయాలి. ఈ విధంగా, లీగ్ తమ పోరాటానికిగాను ఒక ఉద్యమ సంస్థగా ఉపయోగించుకోవాలి. అదే జపాన్‌వాళ్ల సలహా.

ఈ తంత్రాన్ని కొందరు అర్థంచేసుకోగలిగినా దాన్ని ప్రకటించడానికి వీలుకాలేదు. అయినప్పటికీ, దీని అసలు ఉద్దేశాన్ని బాగా ఆకళింపు చేసుకున్న తరవాతే కార్యరంగంలోకి దిగాలని భావించారు.

'ఇండిపెండెంట్స్ లీగ్' వంటి ఒక విప్లవ ఉద్యమాన్ని నడపడం గురించి వివిధ విషయాలను నిర్ణయించడానికి ముందు ఆగ్నేయాసియాలో వున్న భారతీయ ప్రతినిధులు అందరూ పాల్గొనే పెద్ద సభ జరిపి అందులో ఎన్నుకునే ఒక కార్యకమిటీకి ఈ ఉద్యమ బాధ్యతలను అప్పగించడం సబబు అని మేము భావించాము. అందువల్ల రంగూన్‌లోకాని, బాంకాక్‌లోకాని ఒక మహాసభను ఏర్పాటుచేయడం మంచిదని మేము చెప్పాము. ఆఖరుగా టోక్యో మహాసభ అదే విధంగానే తీర్మానించింది.

టోక్యోనుంచి మేము వెనుతిరగడానికి ముందు ముఖ్యమంత్రి టోజోను సందర్శించాము. టోజో సామర్థ్యం, కీర్తి, శిఖరాగ్రంలో వున్న రోజులవి. మేము ఆయన్ను సైనికాధికారుల కార్యాలయంలో కలిశాము. దాదాపు ముప్పావుగంట సేపు మాట్లాడుకున్నాం. ఆ పదవి విశిష్టతను పోగొట్టుకుని, మరికొన్ని రోజులలోనే ఆయన ఉరికంబం ఎక్కుతారని ఎవరు అనుకున్నారు? విధి, మనిషిని ఎన్నెన్ని వేషాలు వేసి చూస్తుంది!

విమానం ద్వారా మేము జపాన్‌నుంచి వెనుతిరిగాము. పడిపోయిన విమానంలో ప్రయాణం చేసిన మిత్రుల గురించిన ఆలోచనలను మమ్మల్ని వదిలిపెట్టలేదు. విమానంలో ఎటువంటి కుదుపులూ లేకపోయినప్పటికీ, దాన్ని వదిలి కిందికి దిగేంతవరకు నా మనసుకు నెమ్మదిలేదు. సింగపూర్ నుంచి మేము బయలుదేరిన తరువాత ఒక నెల గడిచాకనే మేము ఊరు చేరాము. బాంకాక్ మహాసభ రెండు నెలల తరవాత జరిగింది. అంతవరకు చెప్పుకోదగ్గ కార్యకలాపాలేవీలేవు. అక్కడక్కడ లీగ్ శాఖలు నెలకొల్పి, మా లక్ష్యాలను, భారతీయులకు తెలియజేయడానికి ప్రయత్నించాను, అంతే.

ఆ రోజులలో మలయాలోని చైనా ప్రజలను జపాన్‌వాళ్లు రకరకాలుగా వేధించారు. వేలమంది చైనావాళ్లను నరికారు, కాల్చి చంపారు. భారతీయుల పరిస్థితి అంత దారుణంగా లేదు. అయినప్పటికీ చుట్టూ జరుగుతున్న దురాగతాలను చూస్తూ ఊరికే వుండగలమా? అయినా ఏం చేయగలం? వాళ్ల సైనికులు చేసే అన్యాయాలను గురించి జపాన్ వాళ్లతో చెప్పే సాహసం ఎవరికీ లేదు. జపానువాళ్లు దాన్ని హర్షించరు కూడా. మరోదారి లేక అదంతా చూస్తూ వుండవలసిన పరిస్థితి ఏర్పడింది.

1942వ సంవత్సరం జూన్ పదిహేనవ తేదీ, బాంకాక్ మహాసభ ప్రారంభమయింది. ఆ సభలో మలయా నుంచి యాభైకి పైగా ప్రతినిధులు పాల్గొన్నారు. వాళ్లల్లో భారతీయ జాతీయ సైన్య ప్రతినిధులు కూడా వున్నారు. సింగపూర్ నుంచి బాంకాక్ ప్రయాణం చేయడానికి ఒక ప్రత్యేక రైలు ఏర్పాటు చేయబడింది.

యుద్ధం వల్ల ఏర్పడిన విధ్వంసాలను దారిపొడవునా చూశాము. బాంకాక్ చేరడానికి మూడురోజులు పట్టింది. మహాసభలో పాల్గొనడానికి జపాన్, మంచుకో, హాంకాంగ్, బోర్నియో, జావా, మలెయా, షాంగ్‌హాయ్, మనీలా, ఇండోచైనా మొదలైన ప్రాంతాల నుంచి ప్రతినిధులు వచ్చారు. థాయ్‌లాండ్ నుంచి కొందరు భారతీయులు కూడా వచ్చారు. ప్రతినిధులు బసచేయడానికి కావలసిన వసతులు అన్నీ జపానువాళ్లు ఏర్పాటు చేశారు. అందుకోసరం ఎంతో ఖర్చుపెట్టారు.

ఆ సభకు రాష్‌బిహారిబోస్ అధ్యక్షత వహించారు. సమీప భవిష్యత్తులో భారత దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం సాధించడమే 'ఇండియన్ ఇండిపెండెట్స్ లీగ్' లక్ష్యం అన్న విషయాన్ని మహాసభ వివరించింది. అందుకోసరం పోరాటంలో జపాన్‌వాళ్ల ఆధీనంలో వున్న భారతీయ సైన్యం, కొత్తగా ప్రజలచేత ఎన్నుకోబడిన శిక్షణ పొందిన సైనిక వీరులు కలిసి భారత జాతీయ సైన్యం రూపొందించాలనీ తీర్మానించబడింది.

అందుకు కావలసిన మరెన్నో విషయాలగురించి మహాసభ చర్చ జరిపింది. 'ఇండిపెండెన్స్ లీగ్' కు సంబంధించిన అన్ని అధికారాలు, అయిదుగురు సభ్యులు గల ఒక కమిటీకి వుంటాయని ఆ కమిటీకి అధ్యక్షుడు, ఇద్దరు సైనిక ప్రతినిధులు, ప్రజాప్రతినిధులుగా ఇద్దరు సభ్యులు వుండాలని నిశ్చయించారు. కార్యకమిటీ సభ్యులు అప్పుడే ఎన్నుకోబడ్డారు. ఎన్. రాఘవన్, నేనూ కౌన్సిల్ ఆఫ్ యాక్షన్ అన్న ఆ కమిటీలో యిద్దరు 'సివిలియన్' సభ్యులయ్యాము. జనరల్ మోహన్ సింగ్, కర్నల్ ఖిలానీ యిరువురు సైనిక సభ్యులు, రాష్‌బిహారీబోస్ అధ్యక్షులు. బాంకాక్ సభ ముగిసింది.

బాంకాక్‌లో ఏర్పడిన మొదటి కౌన్సిల్ ఆఫ్ యాక్షన్ సమావేశంలో దాని సభ్యులైన మా ఒక్కొక్కరి బాధ్యతలను, అధికారాలను పథకం ప్రకారం ఏర్పరచుకున్నాము. నేను ప్రచార ప్రచురణ మంత్రి నయ్యాను. ఇండిపెండెట్స్ లీగ్ శాఖ బాధ్యతను రాఘవన్‌కు కేటాయించారు. సైనిక విభాగం బాధ్యతలను మోహన్ సింగ్ చేపట్టారు. ఆర్థిక బాధ్యతలు, అధ్యక్షుని అధికారానికి లోబడివుంటాయి. ఈ విధంగా లీగ్ పనిచేయడం ప్రారంభించింది.

'ఇండియన్ ఇండిపెండెట్స్ లీగ్' ప్రధాన కార్యాలయం బాంకాక్‌లోనే వుంటుందని మేము అప్పుడు భావించాము. అయితే అందులో చాలా యిబ్బందులు ఏర్పడ్డాయి. యుద్ధకాలంగా వుండడం వల్ల కుటుంబ సభ్యులను సింగపూర్‌లో వదిలిపెట్టి నేను బాంకాక్‌లో వుండడానికి యిష్టపడలేదు.

జాతీయ సైన్యం కార్యాలయం కూడ సింగపూర్‌లోనే వుండాలని మోహన్ సింగ్ కూడా భావించారు. మహాసభ ముగిసిన ఒక వారం వరకూ నేను బాంకాక్‌లో గడిపాను. ఆ తర్వాత సింగపూర్ తిరిగి వచ్చాను.

# మంత్రి పదవి

నన్ను 'కౌన్సిల్ ఆఫ్ యాక్షన్' లో ఒక సభ్యునిగా ఎన్నుకొన్న వార్త నేను సింగపూర్ తిరిగి రావడానికి ముందే అక్కడి భారతీయుల మధ్య వ్యాపించింది. బాంకాక్‌నుంచి సింగపూర్‌కు నేను ఆ రాత్రి చేరుకున్నాను. మర్నాడు ఉదయం చాలామంది మిత్రులు నా కోసరం వచ్చారు. కొందరు జపాన్ సైనికాధికారులూ వచ్చారు. ప్రచార ప్రచురణలశాఖ మంత్రిగా నన్ను నియమించినందుకు అభినందించారు. వారి వినయం, కలుపుకోలుతనం, భారత స్వాతంత్ర్యంకోసరం వారు చూపిన ఉత్సాహం నా కెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. వారి ప్రవర్తన, నాపట్ల చూపిన గౌరవం నేను ఉన్నత పదవిలో వున్న విషయం గ్రహించేట్టు చేసేవిగా కనిపించాయి.

రెండు రోజుల తర్వాత, జపాన్ ప్రచార ప్రచురణల శాఖ అధికారులు, నేను 'ఇండియన్ ఇండిపెండెట్స్ లీగ్' ప్రచురణల విషయంగా సమాలోచనలు జరిపిన తర్వాత, కొన్ని నిర్ణయాలు తీసుకొన్నాము. వాటికి అనుగుణంగా, సింగపూర్ రేడియో కేంద్రం నుంచి 'ఇండిపెండెన్స్ లీగ్' ప్రచారం ప్రారంభమయింది. టోక్యో నుంచి జపాన్ వరకు జపాన్ వారి పరిపాలన క్రింద వున్న అన్ని రేడియో కేంద్రాలలోనూ, 'ఇండిపెండెన్స్ లీగ్' ప్రచార ప్రసారాలు అన్నీ నా పర్యవేక్షణలో వున్నమాట నిజం అయితే నాకు తెలియకుండా కూడా ముందు మేము తీర్మానించిన వాటికి విరుద్ధంగానూ, జపాన్‌వారు రకరకాలుగా ప్రచారం చేయసాగారు. ప్రచార ప్రచురణ శాఖలో అధికారులను నియమించడానికి, అలాగే వాళ్లను తీసివేయడానికీ నాకు అధికారం వున్నట్లు జ్ఞాపకం, అయినప్పటికీ ఆ విషయంలో కూడా చాలా సమయాలలో నా అభీష్టానికి విరుద్ధంగా వాళ్లు వ్యవహరించక తప్పలేదు. వాటిని గురించి నేను అడిగితే ఏవో సాకులు చెప్పారు. ప్రత్యేకించి నా శాఖ గురించే వాళ్లు అలా వ్యవహరించేరని కాదు. జాతీయ సైన్యం విషయంలో ఈ విధంగానే జనరల్ మెహన్‌సింగ్‌కు తెలియకుండా ఎన్నో వ్యవహారాలు జరిగాయి. వాటి గురించి ఆయన నాతో చెప్పి విచారించారు.

1942వ సం॥ ఆగష్టు పన్నెండవ తేదీ సాయంత్రం 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' తీర్మానాలను జనసామాన్యానికి తెలియచేయడం కోసం

'సింగపూర్ ఫారర్ పార్క్' లో ఒక పెద్ద బహిరంగ సభ జరపడానికి భారీ ఎత్తున ఏర్పాట్లు చేశారు. భారతీయుల ఇళ్లల్లోనూ, వ్యాపారస్థలాలలోనూ, ఆ రోజు జాతీయ పతాకాన్ని ఎగురవేయాలని అనుజ్ఞ జారీచేశారు. సభలో హిందీ, ఆంగ్లం, తమిళంలో ఉపన్యసించడానికి నిశ్చయించారు. ఇవి కాకుండా 'ఇండిపెండెన్స్ లీగ్' కార్యాలయం నుంచి ఒక పెద్ద ఊరేగింపు జరపాలనుకున్నారు. ప్రచార శాఖామంత్రి స్థాయిలో ఆ బహిరంగ సభ ఏర్పాట్లను నేనే పర్యవేక్షించాను. ఆ బహిరంగ సభ కార్యక్రమాలు భారతదేశంలోనూ ప్రసారం చేయడానికి ఏర్పాట్లు చేశాను.

ఆ రోజు ఉదయం పదిగంటలకు నేను ఇంట్లో ఏదో పని మీద వున్నప్పుడు 'అరబ్' వీధిలో భారతీయుల మధ్య ఏదో ఘర్షణ ఆరంభమైందని, అందులో చాలామందికి నష్టం ఏర్పడిందనీ నేను అక్కడికి వెంటనే రావాలనీ, లీగ్ కార్యాలయం నుంచి ఫోన్ వచ్చింది. ఏమాత్రం ఆలస్యం చేయకుండా నేను బయలుదేరాను. ఆ సమయంలో డ్రైవర్ లేకపోవడంతో అబ్బాయి ఉణ్ణి కారు నడిపాడు. పది నిమిషాలలో నేను 'అరబ్' వీధి చేరుకున్నాను. వీధిలో ఎలాంటి అలికిడీ లేదు. కొట్లు అన్నీ మూసేసివున్నాయి. ఒక దుకాణం మేడ మీది నుంచి కొందరు ముస్లిం మిత్రులు నన్ను అక్కడికి రమ్మన్నారు. జాతీయ పతాకానికి బదులుగా కొందరు 'ముస్లిం లీగ్' జెండాను ఎగురవేయడమే ఆ ఘర్షణకు కారణం అని నేను గ్రహించాను. నేను పైకి వెళ్లగానే అంతకు ముందు అక్కడ జరిగిన సంఘటన గురించి వివరించారు. కొందరు గాయపడ్డారు. చాలామందిని ఖైదు చేసి తీసుకెళ్లారు. అప్పుడే నేను అక్కడికి వెళ్లాను. నేను వారిని ఓదార్చి, గాయపడిన వారి గురించి తెలుసుకుంటానని వారికి మాటయిచ్చి క్రిందికి దిగి వచ్చాను. మళ్లీ వాళ్లెందుకో నన్ను పిలిచారు. ఎందుకోసమో తెలుసుకోవడానికి నేను తలపైకెత్తి చూసినప్పుడు, వున్నట్టుండి ఎవరో నన్ను బూటు కాలితో తన్నారు. తిరిగి చూస్తే నన్ను తన్నిన వాడు ఒక జపాన్ సైనికుడని గ్రహించాను. నేను వానితో ఆంగ్లంలో 'ఏం చేశావ్?' అన్నాను. దానికి బదులుగా ఛళ్లుమని ఓ లాఠీదెబ్బ తగిలింది. నా కళ్లజోడు క్రింద పడి పగిలిపోయింది. 'నాన్న అతనితో ఏం మాట్లాడవద్దు. వానికి మనిషి ఎవరనీ తెలయలేదులా వుంది. మనం పోదాం రండి' అని చెప్పి కారు తలుపు తెరిచి మా అబ్బాయి నడపడానికి కూర్చున్నాడు. నేను కార్లో కూర్చున్నాను. అప్పుడు మరొక జపాన్ సైనికుడు అక్కడికి వచ్చాడు. తన చేతి బెత్తంతో ఉణ్ణి తలమీద బలంగా కొట్టాడు. గాయపడి రక్తం పెల్లుబికింది. వాళ్లు నన్నూ, వానినీ చర చర మని కారు నుంచి క్రిందికి లాగి తోశారు. మా యిద్దర్ని ఒక మిలిటరీ బండిలో ఎక్కించారు. నా

కారు అక్కడే వుండిపోయింది. మమ్మల్ని వాళ్లు సైనిక పోలీస్ కార్యాలయానికి తీసుకువెళ్లారు. సింగపూర్ లో వై.యం.సి.ఏ. భవనాన్నే వాళ్లు తమ కార్యాలయంగా వాడుకుంటున్నారు. మేము కొంతసేపు అక్కడే వున్నాము. అప్పుడే పరిస్థితి మారింది. నన్ను ఖైదు చేసి తీసుకొచ్చిన సంగతి పై అధికారులు తెలుసుకున్నారు. ఏదో తప్పు జరిగిపోయిందని గ్రహించి కొందరు వై.యం.సి.ఏ. భవనానికి పరుగెత్తుకొచ్చారు. పై అధికారి నమస్కరించి చేతులు జోడించి తప్పు జరిగి పోయినట్లు తెలియజేశారు. ఆ సైనికులు నేను ఘర్షణ పడిన వాళ్లల్లో ఒకడినని అపోహపడ్డారు. పై అధికారులు నాతో వినయపూర్వకంగానూ, మర్యాదతో మసలు కోవడం చూసి వారు దిగ్భ్రాంతి చెందారు. తెల్లమొహం చేశారు. తమకు తగిన శిక్ష లభిస్తుందని భయపడ్డారు. ఇంతలో చాలామంది అధికారులు అక్కడకు వచ్చారు. తేనీరు, సిగరెట్టు యిచ్చారు. చాలాసార్లు చేతులు జోడించి క్షమాపణలు కోరారు. 'అరబ్' వీధి నుంచి నా కారు తీసుకొచ్చారు. ఇవన్నీ ముగిసేప్పటికి రెండయింది. ఇంటికి వచ్చి, భోజనం చేసి కాస్త విశ్రాంతి తీసుకున్న తర్వాత నేను ఊరేగింపులో పాల్గొనడానికి బయలు దేరాను. సైనికులు నన్ను తన్ని తోసినందువల్ల నడవడం కాస్త బాధాకరంగా వుంది . ఈ సంఘటన మిత్రులందరికీ తెలిసిపోయింది.

పెద్దగా చెప్పు కునేట్టు ఏమీ జరగలేదు. అనుకుని నేను నిర్ణీత సమయానికి ఊరేగింపు ప్రారంభం కానున్న నిర్ణీత స్థలానికి చేరుకున్నాను.

గుంపు చాలా పెద్దదిగా ఉంది. పది వేల మంది పోలీసు వాళ్లున్నారు. యాభైవేలమంది కంటే జనం తగ్గివుండరు. మొదట నేనే ఉపన్యాసించాను. ఆంగ్లంలోనే మాట్లాడాను. ఆ తర్వాత ఇంకొకాయన తమిళంలో ఉపన్యసించేట్టు వుంది. తర్వాత మోహన్‌సింగ్ హిందుస్థానీలో మాట్లాడడానికి సిద్ధంగావున్నారు. మోహన్‌సింగ్ కార్యక్రమాన్ని సమయాన్ని కుదించాలనుకున్నారు. ఎందుకంటే సాయంత్రంలోగా సైనికులను శిబిరానికి పంపివేయవలసివుంది. అందువల్ల మోహన్‌సింగ్ ఉపన్యాసం తర్వాత తమిళ ఉపన్యాసం వుండేలా మోహన్‌సింగ్ మాట్లాడడం ప్రారంభించారు. ఆయన నలభై నిమిషాలు మాట్లాడారు. చీకటవుతోంది. ఇంతలో తమిళంలో మాట్లాడరనే వదంతి జనంలో వ్యాపించింది. వేలకొలదీ తమిళులు సభలో వున్నారు. ఎవరీ వదంతిని వ్యాపింపచేశారో తెలియదు. దానిని విన్న తమిళులు ఆవేశం చెందారు. సభలో కలకలం చెలరేగింది. మైక్ చెడిపోయింది. దీపాలు ఆరిపోయాయి. తమిళంలో మాట్లాడవద్దని నేనే ఆపివేశానని అనుకుని 'మార్చు, దానిని మార్చు' అని అరవడం ప్రారంభించారు. ఆవేశ పూరితులైన జనం నిజాన్ని గ్రహిస్తారనీ

ఒర్పును, నిదానాన్ని పాటిస్తారనీ ఎదురుచూడడం సాధ్యమా? అరుస్తూ, కేకలు పెడుతూ ప్రజలు నా మీదికి దూకారు.

వేదిక మీద నేను మరికొందరం వున్నాం, ప్రజలు వేదిక మీదకు తోసుకు రావడం గమనించిన మిత్రులు నా చుట్టూ చేరారు. చుట్టు ముట్టిన చీకటిలో మనుషుల్ని గుర్తు పట్టడం సాధ్యం కాలేదు. అయినప్పటికీ ఒకరు నన్ను గుర్తుపట్టి, పరుగెత్తుకొచ్చి నా కళ్లద్దాలను తోసివేశాడు. ఆ రోజు ఉదయమే జపాన్ సైనికునిచే దెబ్బతిని నా కళ్లద్దాలు క్రింద పడిపోయాయని చెప్పాను కదా! ఆ తర్వాత నేను చదువుకునే అద్దాన్నే చూడడానికి వుంచుకున్నాను. ఇప్పుడు అదీ పోయింది. చుట్టూ ఏం జరుగుతుందో చూడ్డం నా వల్ల కాలేదు. ఆ పెద్ద మైదానం పలుదిశల నుంచి అరపులు వినిపించాయి. ప్రజలు ఇంకా పై బడుతున్నారు. 'ఇంకా ఇక్కడ వుండడం అపాయం. చీకటిలో ఎవరూ చూడకుండానే జారుకోడమే మంచిది' అని ఒక మిత్రుడు సలహాయిచ్చారు. అందుకు నేను అంగీకరించలేదు.

సభ వున్నట్టుండి ముగిసింది. 'ఫారర్ పార్క్' కొంత సేపట్లో పిచ్చివాళ్ల శిబిరంలా మారిపోయింది. అప్పుడు అక్కడికి కొందరు జపాన్ వాళ్లు వచ్చారు. నన్ను కాపాడి తీసుకెళ్లడానికి వచ్చిన జపాన్ అధికారులు వాళ్లు. వారి కారులో ఎక్కించుకుని నన్ను యింటికి చేర్చారు. అప్పుడు రాత్రి పదయింది. నేను స్నానం చేసి, భోజనం చేసి పడకకు చేరుకున్నాను. ఘర్షణ జరిపిన వాళ్లు యింటిమీదికి దాడి జరుపుతారేమోనని భయపడి, ఆనాటి రాత్రంతా జపాన్ సైనికులు కాపలా వున్నారు.

ఇలాంటి అనుభవమే నాకు ఇంతకు ముందూ, ఆ తర్వాతా జరిగింది. ప్రజాజీవితంలో పాల్గొనే వారికి ఇలాంటి అనుభవాలు కలగడం సహజమే. తమిళ ఉపన్యాసం అవసరమని ఘర్షణ జరిపిన వారి కన్నా నేను ఎక్కువగా భావించాను. ఆనాటి కార్యక్రమాల జాబితాలో అందుకు ప్రాముఖ్యం యిచ్చాం కూడా. వద్దని తిరస్కరించలేదు. కొన్ని ముఖ్యమైన కారణాల వల్ల వరుస క్రమం మార్చవలసి వచ్చింది. దానిని గురించి తెలుసుకునే నిదానమూ, ఒర్పూ ప్రజలకు లేదు. కోపంతో ఉప్పొంగిన ప్రజానీకం గట్టు తెగిన వెల్లువలాంటిది. అది ఎటువైపు ప్రవహిస్తుంది? ఎలాంటి వినాశనాన్ని ఏర్పరుస్తుందని చెప్పడం, సాధ్యం కాదు. శాంతి స్వభావం గలవారు కూడా వెర్రి ఆవేశంతో పిచ్చివాళ్లలా ప్రవర్తిస్తారు. పైన చెప్పిన రెండు సంఘటనలూ, ఒకే రోజున జరిగాయి. 1942వ సం॥ ఆగష్టు పన్నెండవ తేదీని ఎలా మరువగలను?

'ఇండిపెండెన్స్ లీగ్' తో గల సంబంధాన్ని కొనసాగించడం వీలుకాకుండా పోయింది. జపాన్ వారి మాటలు చేతలు, వారి అంతరంగ ఉద్దేశాన్ని మరింతగా

వివరించే ధోరణిలో వున్నాయి. జపాన్ వారి సాయం, సలహాల ననుసరించే 'లీగ్' పరిస్థితి నిర్ణయించబడేది. మరి దానినెందుకు జపాన్ ఆధిపత్యంలోనే తీసుకురాకూడదు? ఈ అంతరార్థాన్ని జనసామాన్యం తెలుసుకోనవసరంలేదని ఒక జపాన్ సైనికాధికారి నాతో అన్నప్పు డు, వారి అంతరార్థాన్ని నేను బాగా అర్థం చేసుకోగల్గాను.

ఈ పరిస్థితిలో ఏం చెయ్యాలన్న విషయం గురించి, 'కౌన్సిల్ ఆఫ్ యాక్షన్' సభ్యులు సమాలోచన జరిపారు. దాని ఫలితంగా, 'ఇండిపెండెన్స్ లీగ్' కార్యకలాపాల గురించి కొన్ని విషయాలను వివరించమని కోరుతూ జపాన్ వారికి ఉత్తరం రాయాలని తీర్మానించాము. బాంకాక్ మహాసభ జరిగిన వెంటనే అందులో ప్రతిపాదించిన తీర్మానాలను జనరల్ టోజో పరిశీలనకు తీసుకొచ్చి, వాటిని గురించి జపాన్ ధోరణిని స్పష్టం చెయాలని మేము కోరాము. నాలుగు నెలలు గడిచిన తర్వాత కూడా ఉత్తరానికి జవాబు రాలేదు. ఈ ఉత్తరానికి జవాబు రాయమనీ, అంతవరకూ లీగ్ కార్యకలాపాలు జరపడానికి వీలుకాదనీ మేము ఉత్తరంలో సూచించాము. ఈ విషయంలో కూడా, 'కౌన్సిల్ ఆఫ్ యాక్షన్' సభ్యుల అభిప్రాయం ఏకగ్రీవంగా వుందని చెప్పలేము. జపాన్ వారి మనస్సుకు కష్టం కలిగే విధంగా ఏదైనా రాయడమే అపాయకరమని యాక్షన్ కౌన్సిల్ లో కొందరు భావించారు. అయినప్పటికి అలా ఒక ఉత్తరం రాయకుండా వుండడం కూడ ఆత్మగౌరవానికి దేశ సంక్షేమానికి సరైనది కాదని చాలామందికి అనిపించింది. ఆ ఉత్తరం పంపి రెండు రోజుల తర్వాత, కర్నల్ ఇవాగురు (లయసాన్ అధికారి) మమ్మల్ని ప్రత్యక్ష సంప్రదింపులకు ఆహ్వానించారు.

కర్నల్ ఇవాగురు తో పాటు నలుగురయిదుగురు అధికారులు సమాలోచనల్లో పాల్గొన్నారు. కౌన్సిల్ ఆఫ్ యాక్షన్ సభ్యులైన మేము అయిదుగురమూ, కౌన్సిల్ కార్యదర్శి శ్రీ బి.కె. దాన్, లీగ్ ప్రతినిధులుగా అక్కడ వున్నాము. మా అభిప్రాయం, కర్నల్ ఇవాగురుకు ఆగ్రహం కలిగించిన విషయం ఆయన మాటల ద్వారా, వ్యవహరించిన తీరు ద్వారా గ్రహించాము. ఎందుకు మేము అలాంటి ఉత్తరం వ్రాయాలి? అని కర్నల్ ఇవాగురు అడిగారు. అందుకు 'కౌన్సిల్ ఆఫ్ యాక్షన్' ధోరణిని వివరించి, నేను సమాధానం యిచ్చాను. రెండు గంటలసేపు జరిగిన ఆ సమాలోచనలలో మోహన్ సింగ్, రాఘవన్ కూడ పాల్గొన్నారు. ఇవాగురు కంఠస్వరం కోపంతో ధ్వనించింది. మేము ఏర్పరచుకున్న అభిప్రాయాన్ని మార్చుకోవడానికి మేము సిద్ధపడలేదు.

ఆ సమావేశ సంఘటనల గురించి పునరాలోచన జరపడానికి రెండు రోజులు గడిచాక 'కౌన్సిల్ ఆఫ్ యాక్షన్' మళ్లీ సమావేశమయింది. ఇంకా కొన్ని రోజులు వేచి చూస్తామని అధ్యక్షులు రాష్‌బిహారీబోస్ అభిప్రాయ పడినప్పటికీ అందుకు సభ్యులెవ్వరూ అంగీకరించలేదు. మాలో సంచలనం కలిగించడానికి మరో సంఘటన కూడా దోహదం చేసింది. 'కర్నల్ గిల్' ను జపాన్ వాళ్లు ఖైదు చేసి తీసుకువెళ్లారన్న విషయం తెలుసుకున్నాము. ఇక ఈ పదవీ బాధ్యత నుంచి మేము వైదొలగాలని నిశ్చయించుకున్నాము. 1942వ సం॥ డిసెంబర్ ఎనిమిదవ తేదీ, నేను, మోహన్‌సింగ్, గిలాని, కౌన్సిల్ ఆఫ్ యాక్షన్ సభ్యుల పదవులకు రాజినామా చేసిన సంగతిని అధ్యక్షునికి తెలియజేశాము. కారణాన్ని కూడ ఉత్తరంలో వివరించాము. ఆరు నెలల కాలం ప్రచార, ప్రచురణ శాఖ మంత్రిగా వున్న తర్వాత 'ఇండిపెండెన్స్ లీగ్' తో వున్న సంబంధాన్ని తెంచుకుని, మళ్లీ నేను సొంత జీవితంలోకి అడుగుపెట్టాను.

# జపాన్‌లో ఖైదీ

'ఇండిపెండెన్స్ లీగ్' నుంచి వైదొలగిన తర్వాత జపాను వారికి నామీద సందేహం కలిగింది. నా యింటికి ఎవరెవరు వస్తున్నారో తెలుసుకోవడానికి రహస్య పోలీసులు తిరగడం ఆరంభించారు. సన్నిహిత మిత్రులు కూడా నా దగ్గరికి రావడానికి జంకసాగారు. సాయంకాలం వాహ్యాళికి వెళ్లడం తప్ప, నేను ఇల్లు వదిలి వెళ్లడం లేదు. పేరుకు మాత్రమే కార్యాలయం తెరచి వుంచానే తప్ప, అక్కడ చెప్పుకోతగ్గ పనులేవీ జరగలేదు. ఆ రోజులలో సింగపూర్‌లో నివసించిన కుటుంబీకులు రోజు గడవడానికే అవస్థపడేవారు. ఒక పూట గంజి, ఒక పూట తిండి, కొన్ని రోజులకు కూర దుంపలు. కొన్ని రోజులు కర్ర చిలగడ దుంపలు తింటూ రోజులు గడిపాము. ఆహారం సమస్య కూడా పెద్దది కాదు. భయంతో దిగులుతో ఏమి జరుగుతుందో అని తెలియకుండానే కాలం గడిపాము. స్త్రీలు, పిల్లలతో మేము ఆ విధంగా ఇంట్లోనే కాలం గడపడం గురించి ఇవాళ ఆలోచిస్తే...ఊహు...సాధ్యం కాదు!

ఒకటి రెండు సార్లు జపాన్ మిలిటరీ పోలీసులు, నా మనసును స్పష్టంగా తెలుసుకోవడానికి పిలిపించారు. ముగ్గురు, నలుగురు మనుషులను పంపి పిలిపించారు. మూడు నాలుగు గంటలసేపు నా మీద ప్రశ్నల వర్షం కురిపించారు. నా జవాబులను వ్రాసుకొని, మళ్లీ యింటి వద్ద దించారు. ఈలోగా 'ఇండిపెండెన్స్ లీగ్' నూతననాయకత్వంలో మళ్లీ కార్యకలాపాలు ప్రారంభించింది. 1943వ సం॥ జూలై రెండవ తేదీ సుభాష్ చంద్రబోస్, టోక్యో నుంచి విమానంలో సింగపూర్ వచ్చారు. భారతీయుల్లో కొత్త ఉత్సాహం ఉప్పొంగింది. ఇండియా సంపూర్ణ స్వాతంత్ర్యం పొందాలన్నదే సుభాష్ చంద్రబోస్ లక్ష్యం. అందుకు ఎలాంటి మార్గాన్నయినా సరే అనుసరించడానికి ఆయన సిద్ధంగా వున్నారు. సింగపూర్‌లోనూ, మలయాలోనూ మాత్రమే కాకుండా, బర్మా, థాయ్‌లాండ్ మొదలైన ప్రాంతాలలో పర్యటించి ప్రజలలో నూతనోత్తేజాన్ని కలిగించారు. జాతీయ సైన్యానికి బలం సమకూర్చారు. బర్మాకు సైన్యాన్ని నడిపించడానికి పథకం వేశారు. 1943వ సంవత్సరం అక్టోబర్ ఇరవైఒకటో తేదీ ఆజాద్ హింద్ ప్రభుత్వాన్ని స్వతంత్ర భారత ప్రభుత్వాన్ని ఆయన ప్రారంభించారు. దానికి అధ్యక్షులుగా నేతాజీ సుభాష్

చంద్రబోస్, జాతీయ సైన్యాధ్యక్ష బాధ్యతలను స్వీకరించారు. 'కౌన్సిల్ ఆఫ్ యాక్షన్' రాజీనామా తర్వాత జాతీయ సైన్యం నుంచి వైదొలగిన చాలామంది మళ్లీ వచ్చి చేరారు. 1944వ సం|| ప్రారంభంలో, ఆజాద్ హింద్ ప్రభుత్వ రాజధాని, సింగపూర్ నుంచి రంగూన్‌కు బదిలీ అయింది. ఈ లోగా సైనికులు బర్మాకు బయలుదేరారు.

'ఇండిపెండెన్స్ లీగ్' తో నాకున్న సంబంధం లేకపోయినప్పటికీ, నాతో పనిచేసిన చాలామంది మిత్రులు నన్ను చూడడానికి తరుచూ, వచ్చేవాళ్లు, వారితో మాట్లాడేప్పుడు నా అభిప్రాయాలను మనసు విప్పి వారితో చెప్పకుండ వుంటే బావుండునని నేను తర్వాత గ్రహించాను. జపాన్‌వారి సహాయంతో ఇండియా స్వాతంత్ర్యం సాధించినట్లయితే, అది సంపూర్ణమైన స్వాతంత్ర్యంగా వుండదని నేను దృఢంగా నమ్మాను. ఆ మిత్రులతో మాటల మధ్య ఆ అభిప్రాయాన్ని వెలిబుచ్చకుండా వుండలేకపోయాను. ఆ మాటల ద్వారా నన్ను బంధించే సంకెళ్లను నేనే తయారు చేసుకున్నానని అప్పుడు నాకు తెలియలేదు. ఎలాంటి ముందు జాగ్రత్తతో మసలుకున్నప్పటికీ, కొన్ని సందర్భాలలో మన వివేకం నెమ్మదిగా ఆలోచించి మాట్లాడే తీరు మనల్ని వదలి వేస్తుంది. అటువంటి సందర్భం నాకు ఏర్పడింది. నాతో సంభాషించి తెలుసుకున్న విషయాలన్నిటినీ, ఆ మిత్రులు జపాన్‌వారికి తెలియజేశారు. నేను చెప్పని వాటిని కూడా చెప్పినట్లు తెలిసింది!

కొందరు మిత్రులు నా పరిస్థితిని గ్రహించి నా అభిప్రాయాన్ని మార్చుకోమని సలహాయిచ్చారు. నా అభిప్రాయం సరైనదీ అన్న భావం నాలో వుంది, అయితే అది నా భద్రతకు దోహదకారి కాదని వారు నచ్చచెప్పారు. కనీసం పేరుకైనా 'ఇండిపెండెన్స్ లీగ్' తో సంబంధం పెంచుకోవడం శ్రేయస్కరమైనదని నన్ను అందుకు అంగీకరించమనీ చెప్పారు. నేను అంగీకరించలేదు. అలా చెయ్యడం నా అంతరాత్మకి చేసే ద్రోహంగా నేను భావించాను. జపాన్ వారు భారత భూమి మీద అడుగు పెడితే, జరుగగల దారుణాలను నేను ఊహలో, నా మనోనేత్రాల ముందు చూశాను. మాట, చేత, నడత, రూపేణా నేను ఏ విధంగా అం[?]కు సహాయం చేసినప్పటికీ, అది క్షమార్హం కానీ అపరాధంగానే నాకు అ[?]పించింది. నా అభిప్రాయం అంత దృఢంగా వున్నప్పుడు దానికి విరుద్ధంగా వ్యవహరించడానికి వీలుకాలేదు. ఇదే స్థితిలో నేను వున్నట్లయితే నాకు రాగల అపాయం గురించి నాకు తెలియకపోలేదు. అయినప్పటికీ నా విశ్వాసానికి ద్రోహం చేయకుండా నడుచుకోవడం ఆ క్లిష్ట సమయంలోనూ నాకు మనశ్శాంతిని కలుగజేసింది. సరైన మార్గంలో నా తెలివి తేటలు ఉపయోగించే దారి కనబడకుండా, నేను

అయోమయస్థితికి లోనయ్యాను. చివరికి ఒక నిర్ణయానికి వచ్చేవరకూ, మనసు అటూ ఇటూ చలిస్తూ అవస్థ పడవలసివచ్చింది. ఈ స్థితిలో నేనెలా దృఢంగా ఎదిరించి, నిలబడ్డాను?

జీవితంలో మనకు వుండే లక్ష్యం గురించి దృఢమైన అభిప్రాయం మనం ఎదుర్కొనే సమస్యలను ప్రశాంతంగా ఎదుర్కొనే తెగువనూ, ధైర్యాన్ని సమకూరుస్తుంది. మన ఆధ్యాత్మిక విశ్వాసం వట్టి విశ్వాసంగా వుంటే మాత్రం చాలదు. అది మన జీవితంలో ఆచరిస్తూ క్రమక్రమంగా జీవించి అనుభవించాలి. ఆ విధంగా అనుభవించేప్పుడు, తడబాటులేకుండా, తత్తరపాటు లేకుండా జీవితంలో ఎదురయ్యే సమస్యలను, ఇబ్బందులను, ఎదుర్కోవడం సాధ్యమవుతుంది. ఇతరుల బాధలను మనము అనుభవించవలసి వుంటుంది. అయితే మన ఆధ్యాత్మిక విశ్వాసం నుంచి వచ్చే శక్తి, అటువంటి చింతలను, బాధలను ప్రశాంతంగా అంగీకరించడానికి దోహదం చేస్తుంది.

దైవ నమ్మకం మనం నిరాధారంగా వున్నట్లు గ్రహించినప్పుడు మనలో ఆత్మస్థైర్యాన్ని పుట్టిస్తుంది. నిరాశలో వున్నప్పుడు ఉత్సాహంగా మనకు వరప్రసాదాన్నిస్తుంది. చాలామంది మన స్థితిని, పొరబాటుగా భావించే సందర్భాలు కద్దు. కొందరు దానిని తీవ్రంగా విమర్శిస్తారు కూడా. మన మనోస్థైర్యాల్యాన్ని సంశయించడానికి కూడ వెనుకాడరు. ఈ అన్ని పరిస్థితులలోనూ, మనకు చెట్టు నీడలా, ఆధారంగా, ఆదరంగా ఆ 'విశ్వాసం' తోడుగా వుంటుంది. ఇటువంటి సందర్భాలలో పలు ప్రముఖుల జీవిత చరిత్రలు నా కెంతో విశ్వాసాన్ని, ఓదార్పును కలిగించాయి. వారి మాటలు, చర్యలు, అభిరుచులు, అనుభవాలు, తలచుకున్న కొద్దీ, తెలుసుకున్న కొద్దీ యింకా యింకా విస్తృతమైన అర్థాలను చెబుతూ ఉత్సాహం యిచ్చాయి. ఒక కాలంలో పొదుపు చేసిన ద్రవ్యం, కరువు సమయాలలో బ్రహ్మాండంగా ఉపయోగపడేట్టు, కొందరి అనుభవాలను చదివి తెలుసుకున్న అనుభవం, అదే స్థితిలో మనం వున్నప్పుడు మనకు తెగువను, ఓదార్పును కలిగించి తోడుగా నిలబడతాయి.

నన్ను జపాను వారు ఖైదు చెయ్యనున్నారన్న వార్త, కొన్ని రోజులుగా నాకు తెలుసు, మిత్రులు అలాంటి పరిస్థితిని గ్రహించి కొన్ని ముందు జాగ్రత్తలు తీసుకోమని చెప్పారు. జపాన్ వారి ఖైదీగా వుండడానికి, బ్రిటిష్ వారి ఖైదీగా వుండడానికి చాలా తేడా వుంది. జపాను వారు ఖైదు చేసి తీసుకెళ్లిన వ్యక్తులు తిరిగి రావడం చాల అపూర్వం. నా కుటుంబం గురించే నాకు చాలా విచారంగా వుండేది. నాకు వాళ్లు దూరమైతే ఆదరణ లేని వాళ్లవుతారు. ఆ రోజులలో

సింగపూర్‌లో నా కుటుంబం చాలా పెద్దది. జపాన్ వారి కంట పడకూడదని భావించి, కొన్ని ముఖ్యమైన కాగితాలను నేను మరికొందరికి అందజేశాను.

1944వ సం॥ ఏప్రిల్ ఇరవైనాలుగో తేదీ, వేకువ జామున నాలుగు గంటలకు యింటి తలుపులు ఎవరో తడుతున్నట్లు చప్పుడు వినిపించింది. తలుపు తెరవగానే ఎనిమిది, పది మంది జపానీయులు లోపలికి వచ్చారు. వాళ్లు మిలిటరీ పోలీసు అధికారులు. నన్ను ఖైదు చేసి తీసుకెళ్లడానికే వచ్చారని గ్రహించాను.

ఇంట్లో నిద్ర పోతున్నవారిని తట్టి లేపాను. పిల్లలు, పనిచేసే వాళ్లు అందరూ కలిసి ఇరవై మంది వున్నారు. వారి నందరినీ ఒక గదిలోకి నెట్టి బయట తుపాకితో ఒకడు నిలబడ్డాడు. మరో గదిలో నేనున్నాను. ఇంటికి రెండు వైపులా సైనికులున్నారు. ఇంటినంతా జాగ్రత్తగా నాలుగు గంటలసేపు సోదా చేసి చూశారు. పుస్తకాలు, పటాలు ఇంకా కొన్ని పరికరాలు అన్నిటినీ, ఒక కారులో నింపారు. మరో కారులో ఇద్దరు సైనికులు కాపలాతో నన్ను కూర్చోమన్నారు. తొమ్మిది గంటల ప్రాంతంలో యింటినుంచి బండ్లు బయలుదేరాయి.

జపాన్ వారు ఖైదుచేసి తీసుకెళ్లిన వారి అనుభవాలను, పరిస్థితులను, చూసి, విని తెలుసుకున్న నాకు నా భవిష్యత్తు గురించి ఆందోళన, దిగులు చీకటిలా అలుముకుంది.

ఖైదు చేస్తే చాలు.... ఆ తర్వాత జపాన్‌వారు ఎవరినీ మాట్లాడనివ్వరు. నా కుటుంబం సభ్యులనుంచి వీడ్కోలు పొందడానికి వీలుకాలేదు. జపాన్‌వారి కారులో సైనికుల కాపలాతో, పోయేచోటు తెలియకుండా నేను వెళుతున్నప్పుడు, అస్పష్టమైన రకరకాల భావాలు ఆందోళనలు, నాలో చెలరేగాయి. ఆ రోజు, నా కుమార్తె తంగమ్ అనారోగ్యంతో ఆస్పత్రిలో పడుకుని వుంది. కుటుంబం గురించి దిగులును నేను మరిచిపోవడానికి ప్రయత్నించినప్పటికీ, అదే నాకు భరించలేని వేదనగా పరిణమించింది.

నన్ను ఒక చీకటి గది గుమ్మంలోనికి నడిపించారు. లోపలికి పోయే ముందు, నేను ధరించిన చొక్కా, లాగు తప్ప దుస్తులన్నిటినీ, జపాన్ వారు లాక్కున్నారు. నా కళ్ల జోడు కూడా తీసేసుకున్నారు. అది లేకుండా నేను దేనినీ సరిగ్గా చూడలేనని బ్రతిమాలినా ప్రయోజనం కనిపించలేదు. పన్నెండడుగులు పొడవు అదే కొలత వెడల్పు వున్న ఆ గదిలో గాలీ వెలుతురూ రావడానికి గోడలో ఆరేడు ద్వారాలే కనిపించాయి. గదిలో వున్నవారికి రాత్రి పగలు ఒక్కటే. గదిలో ఒక మూల కొయ్యపలక వెలుపలికి వెళ్లే కొళాయి కనిపించాయి. నాతోపాటు లోపల ఎనిమిది మంది వున్నారు.

కూర్చోడానికి వీలుగా నేలమీద దూరందూరంగా కొయ్యపలకలు వున్నాయి. వారి వారి స్థలాల్లో కూర్చోవాలే తప్ప అటూఇటూ నడవడానికి అనుమతిలేదు. ఖైదీలు ఒకరితో ఒకరు మాట్లాడుకోకూడదు. పగలంతా చదరంగం బోర్డు మీద నిలబెట్టబడిన పావుల్లా గడపవలసిందే. రెండు మూడు గంటలకు ఒకసారి రక్షకభటులు మమ్మల్ని అటూఇటూ నడవడానికి అనుమతించేవారు. అది అందరికీ ఎంతో ఓదార్పుగా వుండేది. ఒకే గదిలో, పురుషులను, స్త్రీలను, కలిపి ఖైదీచేశారు. ప్రశ్నలడిగి వేధించడానికో, మరే విధంగా గానీ వెలుపలికి తీసుకెళ్లే సమయంలలో తప్ప, లోపలే వుండి తీరాలి. కూలివాళ్లు, లక్షాధికారులు, మేధావులు, రోగులూ అందరూ ఒకే స్థితిలో గదిలో బంధించబడ్డారు.

వంటగదిలో నిప్పు మండుతున్నప్పుడు చెలరేగే పొగలు, సెగలూ ఆ చెరసాలలో మేము అనుభవించాము. లోపలకు అడుగు పెట్టగానే ఊపిరి కూడా తిరగలేదు. ఆహారం గురించి చెప్పనవసరం లేదు. ఉదయం ఏడు గంటలకు ఒక చిన్న పాత్రలో గంజి, ఎండుచేప ముక్క యిచ్చే వాళ్లు, కొన్ని సమయాలలో చేపకు బదులుగా ఏదైన ఉడికిన కాయనుగాని, [illegible]పనుగాని యిచ్చేవారు. మళ్లి సాయంకాలం ఐదుగంటలకు అటువంటి [illegible]. అదే పాత్రలో తాగడానికి కొద్దిగా చల్లారిన నీళ్లు యిచ్చేవారు. రెండు మూడు రోజులకోసారి, గంజికి బదులుగా ఒకప్పుడు కొద్దిగా అన్నం కూడా లభించేది.

నాలుగు నెలల పాటు నేను లాకప్పులో వుండవలసివచ్చింది. ఏ క్షణం జపాన్ వారు ఏం చేస్తారో అని భయపడి వణికే కాలం అది. వీరత్వం, వికాసం, మందగించింది. ఆత్మవిశ్వాసం నశించింది. ఆత్మరక్షణ గురించి ఎల్లప్పుడూ ఆలోచించే మృగజీవితం అది. అక్కడ చూసిన భయంకర దృశ్యాలు, చెవుల్లో పడ్డ దీనస్వరాలు, అనుభవించిన బాధలు, ఎప్పటికీ నేను మరచి పోకుండా మనసులో నిలిచిపోయాయి. మనిషి కౄరస్వభావం, ఎంత దూరం పోతుందో అప్పుడే నేను గ్రహించాను.

నన్ను ప్రతిరోజూ ప్రశ్నలతో వేధించడానికి అక్కడినుంచి మరో చోటికి తీసుకు వెళ్లేవారు. భరించలేని అనుభవాలకు అక్కడ గురయ్యాను. ఒక సామాన్య వ్యక్తి, వారిలోని దుడుకుతనం, అహంభావాలు ముందు భయపడి నిలబడినప్పుడు వంచన మోసం ప్రతిబింబించే ఒక గుంటనక్క ముందు నిలబడ్డ మేకపిల్లలా వుండేవాడు. జపాన్ వారి చిత్రవధను భరించలేక ప్రక్కగదిలోని వారు చేసే దీన స్వరాలు, నా చెవిని పడి నాలోని నవనాడులూ గడగడ లాడేవి. మనసూ, తనువు, ఒకటిగా కృంగి, కృశించేలా, ప్రతిరోజు

ఐదారు గంటలసేపు పలు విధాలుగా పలు కోణాల్లో ప్రశ్నల బాణాలతో హృదయాన్ని జల్లెడలా పొడిచి నాశనం చేసేవారు.

ఒక రోజు సైన్యాధికారి ఒకరు అడిగిన ప్రశ్నకు నేను చెప్పిన జవాబు తృప్తికరంగా లేదు. నా జవాబు అబద్ధమని భావించి నన్ను అతను పై అధికారి దగ్గరికి తీసుకెళ్లమన్నాడు. కొంతసేపటి కల్లా నన్ను అతి భయంకరమైన వాడి ముందుకు తీసుకువెళ్లారు. వాడి కంఠం ఆకారం, చేతులాడించడం, కృశించి నశించి పోతున్న నా హృదయంలో చెప్పలేని భయాన్ని కలిగించాయి. వాడు జపాన్ భాషలో కఠినత్వాన్నంతా కక్కుతూ అదిలించి ప్రశ్నించాడు. దానికి ఏమాత్రం తగ్గని కాఠిన్యంతో ఆ ప్రశ్నలు ఆంగ్లంలోకి అనువదించాడు ఒక కొరియావాడు. వాడు పిడుగులు గురిసినట్టు గర్జించాడు, 'జరిగేది మహాయుద్ధం. మేము ప్రతిరోజూ వేలకొలదీ మనుషులను హతమారుస్తాం. దాంతో పాటు అదనంగా ఒక తలను తుంచి పారేయడం పెద్ద పనేం కాదు. రేపు పదిగంటలకు నీ కథ ముగుస్తుంది. నిన్ను ఉరికంబం ఎక్కిస్తాము. కాల్చి చంపుతాం, లేదంటే గొంతుకోసి పారేస్తాం, రేపు పదిగంటలు. తీసుకెళ్లండి వీణ్ణి

వాడి మాటలు నన్ను ఎలా చంపవచ్చు అన్నది నిర్ణయించకుండా వుండడమే నేనింకా ప్రాణాలతో వుండడానికి కారణం అనిపించింది. ఎలాగైనా మర్నాడు ఉదయం నా ప్రాణం అపహరింపబడుతుంది. పిడుగులాంటి ఆ మాటలు, నా చెవుల్లో ప్రతిధ్వనిస్తూనే వున్నాయి. ఒక సిగరెట్ టిన్‌లో గంజి వచ్చినప్పుడే ఐదుగంటలయిందనే జ్ఞాపకం వచ్చింది. తిండి తీసుకోవాలనిపించలేదు. ఇంటిని గురించి దిగులు... పిల్లల జ్ఞాపకాలు.... మరచిపోవాలన్నా నన్ను వదలడం లేదు. కళ్లను బలవంతంగా మూసుకుంటే రేపు జరుగనున్న దృశ్యాలు చిత్రాలుగా మెదిలేవి. ఉరికంబం మీద చేతులు కాళ్లు కట్టేసినట్లుగా నేను నిలబడ్డాను. గొంతుకు ఉరిబిగించడానికి రక్షకభటుడు వస్తాడు. ఒక గొయ్యికి ముందు వెనకకు కట్టబడిన చేతులతో తలవంచుకొని నేను మోకాళ్ల మీద కూర్చుని వున్నాను. తలను నరకడానికి జపాన్‌వాడు కత్తిని పైకెత్తాడు. కళ్లను, చేతులనూ, కట్టి నన్ను గోడవారగా నిలబెట్టి వున్నారు. నన్ను కాల్చడానికి సైనికులు తుపాకులు పైకెత్తి గురిచూస్తున్నారు. ఉద్వేగాన్ని అణచుకోలేక, నేను వెక్కి వెక్కి ఏడ్చాను. 'పడుకునే సమయం' అని కాపలావాడు చెబుతున్న కంఠస్వరం వినబడింది. నేను పడుకున్నాను. నిద్ర ఎలా వస్తుంది? ఎలా పడుకున్నప్పటికీ, ఉరికంబం, కత్తి, తుపాకీ నా కళ్లముందు కొస్తున్నాయి. భయంకరమైన నిశ్శబ్దం అలముకుంది. గంటకొట్టే చప్పుడు మాత్రమే వినిపించసాగింది. మూడు

గంటలు కొట్టాయి. నేను లేచి కూర్చుని మనసును బలవంతంగా అదుపులో పెట్టుకుని, ఈ లౌకిక ఆలోచనలకు అతీతంగా ప్రార్థన చేయడానికి పూనుకున్నాను. అది కూడా సాధ్యం కాలేదు. పొద్దు పొడిచేసరికి కాస్త ధైర్యం వచ్చినట్లయింది. అయినప్పటికీ ఉదయం ఏడు గంటలకు వచ్చిన గంజి తాగడానికి మనసొప్పలేదు. ఎనిమిది గంటలకు తలుపులు తెరిచారు. నా చరమ యాత్రకు నేను బయలు దేరాను.

నన్ను ఎప్పుడూ మామూలుగా ప్రశ్నలు అడిగి వేధించే వ్యక్తి సమక్షానికి తీసుకుపోయారు. మొదటిరోజు చెప్పిన విషయాలను గురించి ఆలోచించావా? అని అడిగాడు, నిజానికి నేను వాటి గురించి ఆలోచించక పోయినప్పటికీ 'అవును' అని జవాబు యిచ్చాను. దాన్ని నిన్ననే ఆలోచించి సరైన సమాధానం యిచ్చివుండవచ్చునీ, యింకా రెండు గంటలసేపు నేను ఆవిధంగా సమాధానం చెప్పకుండా గడిపినట్లయితే నా తల దొర్లుతుంది అని మళ్లీ నొక్కి చెప్పాడు. అయితే ఆ ఇరవైనాలుగు గంటలూ నేను అనుభవించిన భయంకరమైన వేదనను ఎలా వివరించను?

'మీరు ఎందుకు రేడియో వింటారు? జపాన్‌వాళ్లు ఓడిపోవడం వినడానికా?' అన్నదే వాళ్లు మొదటి రోజు నన్ను అడిగిన ప్రశ్న.

'లేదు యుద్ధం ఎలా జరుగుతున్నాదో తెలుసుకునే ఉత్సాహంతో విన్నాను' అన్నాను. 'నిజం చెప్పకపోతే ఏం జరుగుతుందో తెలుసా?'

ఇది వినగానే నా తల తిరగడం ప్రారంభమయింది. మౌనం వహించాను. అతని కోపం ఎక్కువయింది, 'నువ్వు సరైన జవాబు చెప్పలేదంటే ఏం జరుగుతుందో చెబుతాను'.

ఆ తర్వాతే పై అధికారి వద్దకు నన్ను తీసుకుపోయి నిలబెట్టారు. మొదటి రోజు అడిగిన ప్రశ్న నన్ను అడిగాడు. నేను దానికి ఈ విధంగా సమాధానం చెప్పాను.

'నా దేశం బ్రిటిష్ వారిని తరమగొట్టడానికి పెద్ద పోరాటం జరుపుతున్నది. వాళ్లు ఆ పోరాటంలో ఎంతవరకు విజయం సాధించారు? అన్న విషయం తెలుసుకోవాలన్న ఉత్సాహం నాకు సహజంగానే వుండదా? అందుకే రేడియో విన్నాను' అన్నాను.

'ఆ విధంగా చెప్పు. బ్రిటిష్ వాళ్లు ఇండియా నుంచి వెళ్లిపోవాలికదా? ఈ సమాధానం నిన్న చెప్పి వుండవచ్చు కదా? సరి ఈ గండం నుంచి తప్పించుకున్నావు. ఇప్పుడు నువ్వు యిది చెప్పి వుండకపోతే, మరో రెండుగంటల్లో నీ తల కింద దొర్లి వుండేది, బతికిపోయావు!' అన్నాడు. మళ్లీ తాత్కాలికంగానైనా నేను మరణం నుంచి తప్పించుకున్నాను.

నాలుగు నెలలు గడిచిన తరువాత, నన్ను అక్కడి నుంచి సైనిక జైలుకు మార్చారు. అక్కడ ఒక గదిలో యిద్దరు చొప్పున బంధించబడ్డారు. ఉదయం తొమ్మిది గంటలకు స్నానం చేయడానికి బయటికి తీసుకువచ్చేవాళ్లు. శరీరంపై దుస్తులే లేకుండా, ఖైదీలను తీసుకుపోయే దృశ్యం జపాన్ జైళ్లలో మాత్రమే చూడడానికి సాధ్యమవుతుంది. ఖైదీలందరూ ఒకే విధంగా వున్నప్పుడు ఒకరిని గురించి మరొకరు నీచంగా చూడడం, ఎలా వీలవుతుంది? రోగగ్రస్తుని, బాగున్నవాణ్ణి, ఒకే గదిలో వేసి తాళం వేసేవాళ్లు. రోగికి మందు అన్న మాటే లేదు. నాకు తెలిసి పరిచయమైన చాలా మంది అధికారులు అక్కడ ఖైదీలుగా వున్నారు. గజ్జి మొదలైన జబ్బులతో చాలామంది అక్కడే చచ్చిపోయారు. ఇద్దరు ముగ్గురికి ఆఖరి శుశ్రూషలు చేసే సదవకాశం నాకు కలిగింది. హృదయాన్ని ద్రవింపజేసే దృశ్యాలు అవి. మలయాలో ఆ తరువాత కమీషన్ జనరల్‌గా పనిచేసిన సర్ జాన్ స్కాట్ ఆ రోజులలో ఆ జైలులో వుండేవారు. జపాన్ సైనికుల పాదరక్షలకు పాలిష్ చేసే పని నాకూ, ఆయనకూ యిచ్చారు. దెబ్బలు తినకుండా పనిచేసే భాగ్యం ఏ కొందరికి మాత్రమే లభించింది. ఆ జైలు నుంచి నన్ను విచారణ చేయడానికి సైనిక న్యాయస్థానానికి తీసుకుపోయారు. విచారణ అన్నది కేవలం ఎగతాళి వ్యవహారమే 'కౌన్సిల్ ఆఫ్ యాక్షన్' నుంచి నేను జపాను వాళ్లతో శత్రుభావం కలిగివుండడం కారణంగా వైదొలగాను అన్నదే నా మీద మోపబడిన ప్రధాన నేరం. 'ఆజాద్ హింద్' ప్రభుత్వంతో సహకరించనిది మరొక నేరం, సైనిక న్యాయస్థానం నాకు ఆరేళ్లు కఠిన కారాగార శిక్ష విధించింది.

తీర్పుకు తరవాత నన్ను మరొక చెరసాలకు తీసుకుపోయారు. యుద్ధం ముగిసేంతవరకు నేను ఆ చెరసాలలోనే గడిపాను. పడుకోవడానికి ఒక చెక్కపలక, తలకిందకు ఒక కొయ్యదొరికాయి. భోజనం, పొద్దున మెతుకులు లేక గంజి, రెండు పిడికెళ్ల కూడు, మధ్యాహ్నం, సాయంకాలం యిచ్చేవారు. నాకు మామూలుగానే ఆకలి ఎక్కువ. రోజూ తప్పకుండా పది, పదిహేను మంది ఖైదీలు చచ్చిపోయేవారు. చాలామందిని ఉరితీశారు. తాళ్లుపేనడం, చెప్పులు తుడిచి, మెరుగుపెట్టడం, సైనికుల దుస్తులు మడిచిపెట్టడం మొదలైన పనులు నాకు అప్పటికప్పుడు అప్పగించారు. చెరసాలలో దొరికే తిండి తిని బతకడం కష్టం. మామూలుగానే ఎక్కువగా ఆకలి వేసే నాకు, మెతుకులు లేని పలుచటి గంజి, రెండు పిడికిళ్ల కూడు ఎలా సరిపోతుంది? ఎన్నో బాధలు నన్ను వేధించినప్పటికీ చెరసాలలో నన్ను అమితంగా బాధించింది ఈ భయంకరమైన ఆకలి బాధే.

ఒక రోజు సాయంకాలం మమ్మల్ని గదిలో బంధించిన తరవాత 'కొంచెం అన్నం వుంది కావాలా?' అని ఒక వార్డర్ నన్ను అడిగాడు. ఆ మాటలు నా చెవికి ఎంతో యింపుగా వినిపించాయి. 'కావాలి' అన్నాను. కాని గదిని తెరిచే తాళం వార్డర్ దగ్గర లేదు. గది వాకిట్లో వున్న ఒక సందుగుండా అన్నం వున్నచోటును చూడడం మాత్రమే సాధ్యమయింది. నాకు ఒక మార్గం స్ఫురించింది. మూసిన తలుపుల కింద, అరంగుళం స్థలం ఖాళీగా వున్నది. నేను ధరించిన చొక్కా విప్పి ఆ సందుగుండా అవతలికి పంపాను. వార్డర్ అన్నం దాని మీద పరిచాడు. నేను లోపలినుంచే చొక్కాను ఒక అంచు పట్టుకొని జాగ్రత్తగా లోపలికి లాక్కున్నాను. ఆమెతుకుల్ని నేనెంత ఉద్వేగంతో తిన్నాను? వట్టి మెతుకులు....తాగడానికి నీళ్లు కూడా లేవు, అయినప్పటికీ ఆ కూడు అప్పుడు ఎంత రుచిగా వున్నది? ఆకలి పోగొట్టుకోవడానికి మనిషి ఏమైనా చేస్తాడు!

చెరసాలలో దొరికిన తిండి మాత్రం తిని వుంటే నేను ప్రాణాలతో బయటపడివుండనని చెప్పవచ్చు. మొదట నాకూ 'బెరిబెరి' రోగం పట్టుకున్నది. మా యింటినుంచి అనుమతి లభించినపుడల్లా ఆహార పదార్థాలు పంపుతూ వచ్చారు. ఆ చెరసాలలో ఉన్నత అధికారిగా వున్న ఒక దళపతి, ఈ విధంగా నాకు వసతులు కల్పించి యిచ్చారు. చిన్నచిన్న సహాయాలు కొన్ని సందర్భాలలో గొప్ప దయాగుణాలుగా మారిపోతాయి.

మానవ స్వభావంలో రెండు వైపుల్నీ - మంచీ, చెడూ..., చెరసాలలో చూడవచ్చు. కొందరి స్వభావాలలో సహజంగా క్రౌర్యమూ, మరికొందరి స్వభావాలలో సహజ త్యాగనిరతీ, దయాగుణమూ నన్ను ఆశ్చర్యపరిచేవి. ఒక మనిషి అసలైన స్వభావస్వరూపాన్ని యిటువంటి సందర్భాలలోనే చూడడం సాధ్యమవుతుంది.

# జైలునుంచి విడుదల

నా కుమార్తె తంగమ్ ఆరోగ్యం బాగాలేక ఆస్పత్రిలో వున్నదని చెప్పానుకదా? ఆమె వ్యాధి తీవ్రతను తెలుసుకుని నేను చాలా వేదన చెందాను. ఆ రోజుల్లో ఒకనాడు ఉదయం జైలు సూపర్నెంటు గదికి నన్ను పిలుస్తున్నట్టు వార్డర్ వచ్చి చెప్పాడు. అక్కడికి మా అబ్బాయి ఉణ్ణి నన్ను చూడడానికి వచ్చాడు. తంగమ్ కాలధర్మంచెందింది. ఆమె పెళ్లి చేశాను. ఇద్దరు పిల్లలకు తల్లి అయిన తంగం ఈ లోకం నుంచి వెళ్లిపోయింది. ప్రతిరోజూ చాలామంది మరణిస్తున్నారు, కొన్ని కుటుంబాలు అసలు లేకుండా పోయాయి. వాతావరణమంతా చావు నీలినీడలో దాగివున్నప్పటికీ, అటువంటి మామూలు విషయాలు నాకు మనశ్శాంతినివ్వలేదు. నా కూతురి రూపాన్ని మనోనేత్రాలలో చూస్తూ కన్నీళ్లతో జైలులో ఏకాకిగా రోజులు గడుపుతూ వచ్చాను.

యుద్ధం స్థితిగతులు అప్పుడప్పుడూ కొందరు జైలు అధికారుల ద్వారా తెలుసుకున్నాను. ఆగస్టు పదిహేనోతేది, జపాన్ వారు లొంగిపోయారన్న వార్త మేము నమ్మలేకపోయాము. జైలులో జరిగిన కొన్ని సంఘటనలు ఆ వార్త నిజమేనని ఖాయం చేశాయి.

జపాన్‌వాళ్లు ఓడిపోయిన విషయం విని సంతోషించిన హృదయాలలో, మళ్లీ భయాందోళనలు వీచాయి. చెరసాలలో ఒక భయంకరమైన సమస్య తలెత్తి మెల్లిగా వ్యాపించింది. బ్రిటిష్ వాళ్లు వచ్చేలోగా జపాన్‌వాళ్లు జైలు ఖైదీలను చంపివేస్తారన్నదే ఆ వార్త. ఇది ఎక్కడ ప్రారంభమై ఎలా వ్యాపించిందో తెలియదు. అయినప్పటికీ అది అతి వేగంగా జైలంతా వ్యాపించింది. ఆ వార్త నిరాధారమైనదికాదని మరో సంఘటన ద్వారా తెలిసింది. ఆగస్టు పద్దెనిమిదో తేదీనో పందొమ్మిదో తేదీనో ఉదయం, చెరసాల మురికి కాలువలో రక్తం కలిసిరావడం కొందరు చూశారు. అది తలలు నరకగా పెల్లుబికి పారిన రక్తమే అని తెలుసుకొని భయకంపితులమయ్యాము. దీనికన్న మించి మమ్మల్ని భయపెట్టడానికి మరే సంఘటన జరగాలి? మరణం వాకిట నిలబడ్డ జంతువుల్లా మేము విషాదానికి గురయ్యాము. ఆ సమయాన్ని యిప్పుడు తలుచుకున్నా నాకు లోలోపల భయంవేస్తుంది. ఆ రోజు మధ్యాహ్నం భారతీయుడైన ఒక జైలు అధికారి, మా దగ్గరికి వచ్చి అసలు విషయం

వివరించిన తర్వాతే నిజం తెలిసింది. ఖైదీల భోజనం కోసం చంపిన పందుల శరీరం నుంచి కారిన రక్తమే అలా మురికి కాల్వలో కలిసిందట! ఈ విషయం ఎంతో ఓదార్పును సంతోషాన్ని కలిగించింది!

1945వ సం॥ ఆగస్టు ఇరవయ్యో తేదీ మధ్యాహ్నం భోజనం తర్వాత నేను గదిలో వున్నాను. ఒక వార్డర్ వచ్చి నన్ను సూపర్నెంటు పిలుస్తున్నట్టు చెప్పాడు. నేను వారితో పాటు వెళ్లాను. జైలు దుస్తులను విప్పమన్నారు. నా పాత చిరిగిన చొక్కాను నా చేతికిచ్చారు. నన్ను జైలు నుంచి విడుదల చేశారు.

ఇంటినుంచి వచ్చిన కొత్త దుస్తులను ధరించి కారులో సాయంకాలం మూడు గంటల ప్రాంతాలలో నేను యింటికి బయలుదేరాను. నేను మెట్లు ఎక్కలేకపోయాను. తిరిగి చూడడానికి వీలుకాలేదు. ఇంట్లో అందరూ నా రాకకోసరం ఎదురుచూస్తున్నారు. అయితే అక్కడ తంగాన్ని మాత్రం నేను చూడలేదు. ఆమె వుండివుంటే నన్నెంత సంతోషంగా ఆహ్వానించి వుండేది. విడుదల అయిన సంతోషాన్ని ఆ గొప్పలోటువల్ల ఏర్పడిన విషాదం, అంతంచేసింది. విధి ఆజ్ఞను ఎవరు నిరోధించగలరు. అనుభవించి తీరాలి.

ఒక వారం నేను ఇంట్లో విశ్రాంతి తీసుకున్నాను. జపాన్‌వారి అధికార ప్రభుత్వం అంతంకావడం వల్ల ఏర్పడిన సంతోషం అందరి ముఖాలలోను ద్యోతకమయింది. మూడు సంవత్సరాలకు ముందు బ్రిటిష్ వాళ్లు వెళ్లిపోవడం, జపాన్‌వాళ్లు అధికారాన్ని చేపట్టడం చూశాను. జపాన్ వారు వెళ్లిపోయి మళ్లీ బ్రిటిష్ వాళ్లు పరిపాలనను చేపట్టడం, యిప్పుడు చూడగలిగాను. ప్రభుత్వ పాలన ముగిసి మరో ప్రభుత్వపాలన ప్రారంభమయ్యే సంధి కాలం చాలా అపాయాలను కలిగిస్తుంది. అధికారులకు భయపడవలసింది లేదు. చట్టంలేదు, దేన్నయినా చెయ్యవచ్చు. అయితే బ్రిటిష్ వాళ్లు రెండోసారి ప్రభుత్వ పాలనకు వచ్చినప్పుడు అంతకు ముందు అధికార మార్పిడి జరిగినప్పుడు ఏర్పడినంత దారుణంగా లేదు.

యుద్ధం ముగిసిన తర్వాత కొంతకాలంపాటు సింగపూర్‌లో సైనిక పాలనే కొనసాగింది. యుద్ధ సమయంలో జపాన్‌వారికి సాయంచేసినందుకు చాలామందికి సైనిక కోర్టు విచారణ జరిపింది. వాళ్లలో భారతీయులూ వున్నారు. అటువంటి కేసుల్లో భారతీయులైన ప్రతివాదుల పక్షంలో వాదించడానికి ఒక న్యాయవాదుల బృందం భారతదేశం నుంచి సింగపూర్ వచ్చింది. మద్రాసు నుంచి అడ్వకేట్ కె. భాష్యం, బొంబాయి నుంచి బారిష్టర్ సరిమన్, అలహాబాదు నుంచి బారిష్టర్ సప్రూ అక్కడికి వచ్చారు. అదే విధంగా భారత సేవాసంఘం ప్రతినిధులైన పండిత హృదయనాథ్ కుంస్రూ కోదండరావు భారతీయుల స్థితి గతులను ప్రత్యక్షంగా తెలుసుకోడానికి

సింగపూర్ వచ్చారు. వీళ్లందరూ కూడ మా యింటికి చాలాసార్లు వచ్చి, యుద్ధకాలంలో జరిగిన సంగతులను నానుంచి సేకరించినారు. పత్రికా ప్రతినిధులు చాలామంది ఇండియా నుంచి సింగపూర్ వచ్చారు. మా యింట్లో దాదాపు మూడు నెలలపాటు, రకరకాల అతిథులు రెండు పూట్లా భోజనానికి సిద్ధమయ్యేవారు. వాళ్లు నా నుంచి యుద్ధసమయంలో మలయా దేశం స్థితి గతులను తెలుసుకోవడానికి ఉత్సాహం చూసినట్లే, నాకు కూడా మాతృదేశం గురించి తెలుసుకోవాలన్న ఉత్సాహం ఏర్పడింది.

యుద్ధం ముగిసిన తర్వాత మొదట సింగపూర్ చేరుకున్న చాలామంది సైనికాధికారులలో కర్నల్ ఉణ్ణినాయర్ ఒకరు. యుద్ధానికి ముందు బ్రాడ్‌కాస్టింగ్ శాఖలో ఒక అధికారిగా ఆయన సింగపూర్‌లో వుండేవారు. ఆయన అనేక సార్లు మా యింటికి వచ్చారు. భోజనంలో 'సాంబార్' వుంటే ఆయన తప్పకుండా వచ్చేవారు. ఉణ్ణినాయర్ కు సాంబార్ అంటే ఎంత యిష్టమో అదేవిధంగా మిత్రుల పట్ల చాలా ప్రేమతో వ్యవహరించేవారు. స్నేహితులకు సహాయపడడానికి ఏ మాత్రం వెనుకాడేవారు కాదు. ఐదేళ్లు గడిచిన తర్వాత కొరియాలో ఆయన వీరమరణం పొందిన వార్తవిని, మా కుటుంబంలో ఒకరిని పోగొట్టు కున్నట్లు బాధపడ్డాము.

ఒక నెల తర్వాత నేను మళ్లీ ప్రాక్టీసు ప్రారంభించాను. మంచి ఆదాయం వచ్చింది. ఆ పరిణామ దశలో, యుద్ధానికి తర్వాత సైనిక న్యాయస్థానాలే అవసరమయ్యాయి. జపాన్ వారికి సహాయం చేశారన్న నెపంతో కొందరు మిత్రులమీద ఆ కోర్టులు నేరారోపణ చేశాయి. జపాన్‌వారికి ప్రారంభదశలో సాయపడినందుకు నన్నుకూడా ఖైదుచేసే ఉద్దేశ్యం వారికి వున్నది. తర్వాత వద్దనుకున్నారు. అయినప్పటికీ నా సన్నిహిత మిత్రులు కొందరిని బ్రిటిష్ వారు ఖైదు చేయడం నాకు చాలా బాధ కలిగించింది. వారిని ఏ చిన్న సహాయం అందించడమైనా మహాద్భాగ్యంగా భావించాను.

కొందరు ప్రతివాదుల కోసరం, నేను సైనిక న్యాయస్థానాలలో వాదించడానికి సిద్ధపడ్డాను. చాలాముఖ్యమైన ఎన్నోకేసులు ఆ రోజుల్లో జరిగాయి. వాటిలో ఒక దానిని యిక్కడ వివరిస్తాను.

అది బోర్నియోలో జరిగింది. సోహన్‌సింగ్ అనే ఒక శిక్కు, బోర్నియో రాజధాని 'సాండేక్కన్' లో పోలీసు అధికారిగా వుండేవారు. జపాన్‌వారు బోర్నియోను చేపట్టిన తర్వాత సోహన్‌సింగ్ పోలీసు శాఖలో ఓ ఉన్నత పదవిని యిచ్చారు. ఆ రోజుల్లో బోర్నియోలో చైనా వాళ్లు ఎక్కువ. వాళ్లలో కొందరు అడవుల్లో దాక్కునివుండి, జపాన్ వాళ్లతో గెరిల్లా యుద్ధం చేసేవాళ్లు. అందుకు అడవి ప్రదేశాలు చాలా అనుకూలంగా కనిపించాయి. అలా దాగి పోరాటం

సాగిస్తున్న చైనా వాళ్లను పట్టుకుని చంపమని జపాన్‌వాళ్లు సోహన్‌సింగ్‌కు అజ్ఞాపించారు. సోహన్‌సింగ్ ఒక పోలీసు బృందంతో అడవిలో దాక్కున్న ఏడుగురు చైనీయులను పట్టుకుని అందర్నీ కాల్చి చంపాడు. జపాన్‌వారికి సోహన్‌సింగ్ మీద మంచి గౌరవం ఏర్పడింది. అందువల్ల అతనికి యింకా ఉన్నత పదవిని యిచ్చారు. అయితే ఆ పదవిని సోహన్‌సింగ్ ఎంతోకాలం అనుభవించలేదు. అంతలో యుద్ధం ముగిసింది. బ్రిటిష్‌వాళ్లు మళ్లీ వచ్చారు. జపాన్ వారికి సాయపడ్డట్టు నేరారోపణచేసేరు. అంతేకాదు, అతని మీద హత్యారోపణ కూడా చేశారు. బ్రిటిష్ సైనిక న్యాయస్థానం విచారణ జరిపి సోహన్‌సింగ్‌కు మరణ దండన విధించింది.

ఆ రోజుల్లో మలయా మొదలైన దేశాలలో వున్న సైనిక ప్రభుత్వ నాయకుడు మౌంట్‌బాటన్ సింగపూర్‌నే రాజధానిగా భావించాడు. జపాన్‌వారి ఆజ్ఞ మేరకే సింగ్ చైనావారిని చంపాడనీ, చట్టప్రకారం అతను దోషికాదని, విచారణ జరిగినప్పుడు చట్టం తెలిసిన వారి సహాయం తనకు లభించలేదనీ, అందువల్ల సైనిక న్యాయస్థానం తీర్పుతోసేసి, మళ్లీ విచారణకు ఆజ్ఞాపించాలని కోరుతూ మౌంట్‌బాటన్‌కు ఒక వినతి పత్రాన్ని పంపాడు. మౌంట్‌బాటన్ అందుకు అనుమతించాడు. సోహన్‌సింగ్ కేసు మళ్లీ విచారణకు వచ్చింది.

బోర్నియోకు సమీపంలో లాబువాన్ అన్న ప్రదేశంలో కేసును రెండోసారి విచారించాలని నిర్ణయించారు. భారతప్రభుత్వం కోరిన ప్రకారం, సోహన్‌సింగ్ కోసరం సైనిక న్యాయస్థానంలో కేసు నిర్వహించడానికి 1946వ సం॥ ఫిబ్రవరిలో నేను విమానంలో లాబువాన్‌కు బయలుదేరాను. యుద్ధసమయంలో లాబువాన్ పెద్ద సైనిక కేంద్రంగా వుండేది. అక్కడ జపాన్ వారి సైన్యం వుండేది. అమెరికన్లు బాంబువేసి భవనాలను కూల్చారు. అన్ని భవనాలూ శిథిలమైపోయాయి. సైనికులు గుడారాలలోనే నివసించారు. నేను బసచేయడానికి కూడా అలాంటి గుడారమే ఏర్పాటుచేశారు.

నేను అక్కడికి వెళ్లిన రోజే సోహన్‌సింగ్‌ను కలుసుకున్నాను. కేసుకు సంబంధించిన వివరాలు తెలుసుకున్నాను. ఇద్దరు సలహాదారుల సహాయంతో ఒక బ్రిటిష్ న్యాయమూర్తి కేసు విచారణ జరిపారు. యుద్ధకాలంలో బోర్నియోలో జపాన్‌వారి పరిపాలన ఏర్పడడంవల్ల వారి ఆజ్ఞప్రకారం చైనావారిని చంపడం నేరంకాదు అన్నది నా వాదం. జరిగిన సంఘటనలను జరగలేదని నేను వాదించలేదు. చట్టప్రకారం సోహన్‌సింగ్ నేరస్థుడు కాదు అని వారించాను. సలహాదారులిద్దరూ భారతీయసైనిక అధికారులు. వాళ్లుకూడా ప్రతివాది నేరస్థుడు కాదని భావించారు. న్యాయమూర్తి ఆ అభిప్రాయాన్ని అంగీకరించలేదు. అతను నేరస్థుడే అని

మరణదండన విధించారు. ఆ తీర్పు మీద అప్పీల్ చేసిన తర్వాత నేను సింగపూర్ తిరుగు ప్రయాణమయ్యాను.

ఒక నెల తర్వాత 'అప్పీల్' విచారణకు వచ్చింది. బోర్నియోలో జెఫిల్‌డన్ అన్న స్థలంలో అది జరిగింది. ప్రథమ న్యాయమూర్తి, బోర్నియో గవర్నర్, మరొక న్యాయమూర్తి అప్పీల్ కోర్టు న్యాయమూర్తులు.

నేను ప్రభుత్వం తరఫు న్యాయవాది వాదించిన తర్వాత న్యాయమూర్తులు కేసు తీర్పును చర్చించడానికి లోపలికి వెళ్లారు. పావుగంట తర్వాత వాళ్లు మళ్లీ వచ్చారు. అప్పీల్‌ను తోసివేసినట్టు తీర్పురాశారు. ఇది ముగిసిన తర్వాత నేను నా గదికి పోయి గౌను విప్పి దుస్తులు మార్చుకొంటున్నాను. అప్పుడు రిజిస్ట్రార్ వచ్చి ప్రథమ న్యాయమూర్తి నన్ను చూడాలని చెప్పారని అన్నారు. నేను ఆయన గదికి వెళ్లాను. సోహన్‌సింగ్ కోసరం బ్రహ్మాండంగా వాదించినందుకు నన్ను మెచ్చుకున్నారు. అది నిష్ప్రయోజనమయిందే అని బాధపడవద్దు. సోహన్‌సింగ్‌కు మరణదండన తగ్గించండి చంపకండి అని సిఫార్సు చేశాము. సంతోషంగా సింగపూర్ వెళ్లిరండి అని చెప్పారు. దానికి తగ్గట్టు ఏర్పాటు చేయడానికి వెనుకాడలేదు. సోహన్‌సింగ్‌కు మరణదండనకు మారుగా పదేళ్లు కఠిన కారాగారాశిక్ష విధించి ఆయన యితర న్యాయమూర్తులు సైనిక అధికారికి రాశారు. సోహన్‌సింగ్ ఉరికంబం నుంచి తప్పించుకున్నాడు. అది కొంత ఓదార్పుగా వుంది.

యుద్ధ సమయంలో 'మాతృభూమి' ని చూడడానికి వీలుకాలేదు. యుద్ధం ముగిసిన తర్వాత కొందరు మలయాళీ అధికారులు అక్కడికి వచ్చినప్పుడే చాలా రోజుల తర్వాత నేను 'మాతృభూమి' ని చూశాను. కొంతకాలం దూరమైన కన్న బిడ్డను చూసిన భావంతో సంతోషపడ్డాను. మలయా సంఘటనల గురించి 'మాతృభూమి' ఏమనుకుంటున్నదీ తెలుసుకోవడానికి ఉత్సాహం పుట్టుకొచ్చింది. ఇక్కడి అనుభవాల గురించి 'మాతృభూమి'కి రాసిపంపలేదా? అని ఆ సైనికాధికారులలో ఒకరు నన్ను అడిగారు. కొంతకాలం కానీయండి అన్నాను నేను.

ఆయన చెప్పడానికి ముందే నా అనుభవాలను గురించి 'మాతృభూమి'లో రాయడానికి నేను నిశ్చయించాను. అయితే అందుకు కావలసిన సమయం నాకు లభించలేదు. ఐ.ఎన్.ఏ. విచారణ మరోవైపు ప్రారంభమైన కాలం కాంగ్రెస్ సాధారణ ఎన్నికలకు, సిద్ధమవుతున్న సమయం అది. యుద్ధ సమయంలో మలయాలో జరిగిన సంఘటనలకు దానికీ సన్నిహిత సంబంధాలు వుండేవి. అలాంటప్పుడు నేను రాసే వివరాలు, వెలువడే సందర్భం ఎన్నికలకు ఉపయోగపడేలా దోహదం చేయ్యాలి. చారిత్రక

ప్రాముఖ్యత సంతరించుకున్న విషయాలను, నా దేశ ప్రజలకు తెలియచేయవలసిన బాధ్యత నాకువుంది. నేను చేపట్టిన కార్యం సరికాదని చాలామంది భావిస్తున్నట్లు నాకు తెలిసింది. 'ఇండిపెండెన్స్ లీగ్' లో నేను మొదట చేరడం, తర్వాత నేను దాని నుంచి వైదొలగిన విషయం, అనాటి పరిస్థితులను, నా దృక్పధాన్ని ఏవిధమైన మార్పు లేకుండా నా దేశప్రజల ముందు వుంచాలని తీర్మానించాను. ప్రారంభ కాలంలోని హడావుడి తగ్గిన తర్వాత 'మాతృభూమి'కి రాయాలని కాచుకున్నాను.

యుద్ధం ముగిసి ఎనిమిది నెలలు గడిచిన తర్వాత యుద్ధసమయపు అనుభవాలను గురించి నేను 'మాతృభూమి'కి రాయడం ప్రారంభించాను. మొదట అరేడు వ్యాసాలు ప్రచురించిన తర్వాత ఆ వ్యాసావళి కొనసాగాలా? అని కొందరు మిత్రులు ఉత్తరాల ద్వారా అడిగారు. చెప్పడమంతా నిజమే కావచ్చు కాని దాని వల్ల ఏమైనా మంచి జరుగగలదా? అని కొందరు అనుమానాన్ని వ్యక్తం చేశారు. ఆ వ్యాసపరంపర ద్వారా వచ్చిన కొత్త మార్పును నేను మాతృదేశానికి తిరిగి వచ్చిన తర్వాతే గ్రహించాను.

# మాతృదేశంలో మూడునెలలు

యుద్ధం ముగిసిన తర్వాత చాలామంది భారతీయులు స్వదేశానికి వెళ్లడానికి ఉవ్విళ్లూరసాగారు. అయితే అందరూ వెళ్లడానికి కావలసిన ఓడలు సిద్ధంగా లేవు. తర్వాత భారత ప్రతినిధిగా సింగపూర్‌కు ఎన్.కె. సెట్టూర్ నియమింపబడ్డారు. రకరకాల యిబ్బందులకు గురి అయిన కాలం అది. భారతీయులకు సంబంధించిన చాలా సమస్యలను ఆయన యుద్ధానికి ఎదుర్కోవలసి వచ్చింది. వేలకొద్దీ భారతీయులు స్వదేశానికి వెళ్లాలంటే దానికి కావలసిన ఓడలను ఏర్పాటు చేయవలసిన బాధ్యత కూడా సమస్యగా తయారయింది. సెట్టూర్ చాలా సామర్థ్యంతో ఆ బాధ్యతను నిర్వహించారు. ఎదుటివారి పొగడ్తనుగాని విమర్శనుగాని, లెక్కచేయకుండా ముఖ్యమైన దేదో దాన్ని వెంటనే నెరవేర్చడానికి ఆయన వెనుకాడింది లేదు.

నా కుటుంబంలో కొందరిని యుద్ధం ముగిసిన వెంటనే స్వదేశానికి పంపాను. నేను వెళ్లడానికి సిద్ధమయ్యాను. కార్యాలయంలో పనులు చాలా వున్నాయి. అయినప్పటికీ మాతృభూమికి వెళ్లాలన్న ఉత్సాహం విపరీతంగా వుంది. మూడు నెలలపాటు వుండడానికి కావలసిన ఏర్పాట్లు చేశాను. 1946వ సం॥ అక్టోబరులో నేను మాతృదేశానికి బయలుదేరాను.

మద్రాసు గుండా వెళ్లడానికి మాకు ఓడలు లభించకపోవడంతో కలకత్తా గుండా మేము పయనమయ్యాము. నేను కాకులను చూసి చాలా కాలమయింది. కలకత్తా సమీపిస్తున్నప్పుడు కాకులు ఎగరడం కూడా నాకు క్రొత్తగా కనిపించింది. 1927వ సం॥ ఆగష్టులో నేను మలయా వెళ్లాను. పందొమ్మిది సంవత్సరాలు గడిచిన తర్వాత మాతృదేశానికి వస్తున్నాను. ఈ కాలఘట్టంలో ఎన్నెన్నో జరిగిపోయాయి! ఎన్నెన్ని బాధలు అనుభవించవలసి వచ్చింది. ఓడనుంచి దిగాను. కలకత్తా ఓడరేవులో అడుగుపెట్టగానే నాలో ఎన్నెన్నో ఆలోచనలు చెలరేగాయి!

నేను కలకత్తాలో రెండు రోజులు గడిపాను. నా చిరకాల మిత్రుడు ఎ.ఆర్. నాయర్ అక్కడ వున్నారు. ఆయన అతిథిగా వుండే అవకాశం పొందాను. కలకత్తాలోని కేరళ సమాజం వాళ్లు ఒక స్వాగత సభ జరిపారు. అక్కడే నేను మొట్టమొదటి సారి నా యుద్ధకాలం అనుభవాలను గురించి మాట్లాడాను.

రెండు రోజుల తర్వాత నేను మద్రాసు చేరాను. హృదయపూర్వకమైన ప్రేమతో అక్కడి మిత్రులు నాకు స్వాగతం పలికి గౌరవించారు. మలయాల్లో జరిగిన సంఘటనలను గురించి, నేను తీసుకున్న నిర్ణయాల గురించీ, చాలామంది నన్ను వివరాలు అడిగారు. అప్పుడు దేశంలో నా పట్ల కొన్ని తప్పుడు భావాలు వ్యాపించి వున్నట్టు గ్రహించాను.

మూడు రోజులు మద్రాసులో గడిపి నేను మలబారు బయలుదేరాను. నాకు స్వాగతం చెప్పడానికి ఒలవక్కోట్టుకు చాలామంది మిత్రులు వచ్చారు. 'మాతృభూమి'లో నేను రాసిన వ్యాసపరంపర కలిగించిన సంచలనాన్ని గురించి వాళ్లు చెప్పకపోలేదు. అక్టోబర్ ఇరవై అయిదో తేదీ, పగలు బండిలో నేను ఒలవక్కోడు నుంచి కోళిక్కోడ్‌కు బయలుదేరాను. భార్య, మరికొందరు నాతో వున్నారు. రైలు కల్లాయి చేరగానే నల్లజెండాలు పట్టుకొని కొందరు ఫుట్‌బోర్డ్‌లోకి జొరబడ్డారు. వాళ్లేవే నినాదాలు చేశారు. నన్ను వాళ్లు 'తిరిగిపో' అని అరవడం నాకు బాగా వినిపించింది. నా రాకకోసరం కోళిక్కోడ్ రైల్వే నిలయంలో ఒక పెద్ద గుంపు ఎదురుచూస్తూ వుంది. నాకు ఆహ్వానం చెప్పి గౌరవించడానికి వచ్చిన మిత్రులతోపాటు నన్ను వ్యతిరేకించడానికి వచ్చిన ప్రజలు వున్నారు. రెండవరకానికి చెందిన వాళ్లే ఎక్కువమంది. బండి రైల్వేస్టేషన్‌లోకి రాగానే కోపావేశంతో కొందరు నేను వున్న పెట్టె దగ్గరికి వచ్చారు. మిత్రులు వుండడం వల్ల వాళ్లు నన్ను సమీపించలేక పోయారు. నా మిత్రులు, వ్యతిరేకుల మధ్య బయట ఘర్షణ మొదలైంది. పది నిమిషాల పాటు నేను కంపార్ట్‌మెంట్‌లోనే వున్నాను. రైలు దిగడానికి దారిలేదు. ఆగ్రహం చెందిన వాళ్ల చవకబారు ధోరణిని చూస్తూ వూరుకోవడం తప్ప వేరే దారిలేదు.

తర్వాత జరిగిన సంఘటనలను గురించి మర్నాడు 'మాతృభూమి' ప్రచురించింది. అది ఏమంటే--

'ఇవాళ సాయంకాలం రైలులో శ్రీ కె.పి. కేశవమీనన్ ఒలవక్కోడ్ నుంచి యిక్కడికి వచ్చారు. ఆయనకు స్వాగతం చెప్పడానికి ఒలవక్కోడ్ రైలుస్టేషన్‌లో జనం గుమికూడారు. కమ్యూనిస్టు నాయకులు కూడా పాల్గొన్నారు. రైల్వేస్టేషన్‌లో, నల్లజెండాలు పట్టుకుని నల్లబాడ్జీలు పెట్టుకొని కొందరు వచ్చారు. కొందరు నల్లజెండాల వాళ్లు కల్లాయి స్టేషన్‌లోనే బండిలోకి ఎక్కారు. శ్రీ కేశవమీనన్ రైలు నుంచి దిగనీయకుండా వాళ్లు చుట్టుముట్టారు. ఆ నల్ల జెండాలవాళ్లు 'కేశవమీనన్ గోబేక్ (తిరిగిపో) 'మాతృభూమి' నశించాలి!' అని అరిచారు. ఇంకా నీచమైన నినాదాలను కూడా చేశారు. కేరళ ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ 'మాతృభూమి' తాలూకా కాంగ్రెస్ కమిటీ, నగర కాంగ్రెస్ కమిటీ మొదలైన సంస్థల ప్రతినిధులు, శ్రీ కేశవమీనన్‌కు మాలలు వేశారు.

ఈలోగా నల్లజెండాలు పట్టుకొచ్చిన వాళ్లు మాలలులాగేసి, కేశవమీనన్ చొక్కాను కూడా చింపారు. నాయకులు గట్టి ప్రయత్నం మీద కేశవమీనన్‌ను స్టేషన్ బయటకు తీసుకువచ్చారు. రైలుస్టేషన్‌కు వెలుపల కూడా నల్లజెండాలవాళ్లు ఏమాత్రం మర్యాద లేకుండా వ్యవహరించారు. ఆయన కారులో ఎక్కినప్పుడు కూడా ఆయన మీదకు బురదతీసి చల్లారు. కొందరు కారుమీదికెక్కి ఆయన్ను కొట్టి కారు అద్దాలను పగులకొట్టి హింసించారు. రాళ్ల విసురుకు ఒకరు గాయపడ్డారు. కొందరి చేతుల్లోని జాతీయ పతాకాలను పట్టి లాగారు. మరికొందరు జెండా కొయ్యను విరిచారు. చాలామందికి గాయాలు తగిలాయి. చాలామందికి వస్తు నష్టం వాటిల్లింది. 'మాతృభూమి' సిబ్బందిలో కొందరు చిన్న చిన్న గాయాలకు గురిఅయ్యారు. ఆయన బంధువులను కూడా నల్లజెండా వాళ్లు భయపెట్టారు. చిరిగిన చొక్కా, బురదతో శ్రీ కేశవమీనన్ తిన్నగా 'మాతృభూమి' కార్యాలయం చేరారు. ఏమాత్రం కోపం లేకుండా శాంతం కోల్పోకుండా చిరునవ్వుతో తన ఎదుటే తనకు వ్యతిరేకంగా జరిగిన ఆర్భాటాన్ని తిలకిస్తూ వున్నారు. నల్లజెండాల వాళ్లు 'మాతృభూమి' కార్యాలయం ముందు నల్లజెండాలు చూపి ఆర్భాటం చేశారు.

కోపావేశం చెందిన ప్రజాసమూహాన్ని వ్యతిరేకించి ప్రయోజనం లేదు. 'మాబ్' అని చెప్పబడే గుంపు క్రమశిక్షణా రహితంగా రెచ్చిపోయినప్పుడు, ఆలోచనా శక్తి, ఓర్పు, దయాదాక్షిణ్యం, దేనికీ అవకాశం వుండదు. ఒకరు చేసింది మరొకరు చేస్తారు. ఒకరు చెప్పిందే మరొకరు చెపుతారు. సుప్రసిద్ధమైన గాల్స్‌వర్ధీ 'మాబ్' అన్న నాటకంలో గాయకుని వ్యతిరేకించి వచ్చే 'మాబ్' అన్న ప్రజాసమూహాన్ని ఓదార్చడానికి చెప్పిన మాటలు యిప్పుడు స్మరించతగ్గవి. కథానాయకుడు చెబుతాడు. హింసే మీకు తెలుసు పిచ్చి వాడి మీద రాయి విసురుతారు. స్త్రీలను మీరు అవమానపరుస్తారు. మీకు యిష్టం లేని విషయాలు చెప్పేవారిని మీరు దూషిస్తారు. ఇవాళ ఒకటి రేపు ఇంకొకటి మీకు అది వుంటే చాలు. మీ తలల్లో మెదడు లేదు. ధైర్యం లేదు. మీరు దుర్మార్గులు కాదు. అంటే ఇంతకంటే దుర్మార్గులు మరెవ్వరుంటారు? దేశభక్తి మీకు ఏమాత్రం లేదా? మీరు నన్ను నాశనం చెయ్యగలరు. అయితే నా విశ్వాసాన్ని మీరు నాశనం చెయ్యలేరు. నేను ఒక వ్యక్తినే మీరు వేయిమంది వున్నప్పటికీ మీరు నా నమ్మకాన్ని ఏమీ చెయ్యలేరు.'

కోళిక్కోడ్ చేరిన మూడవరోజు విక్టోరియా టౌన్‌హాల్లో కేరళ కాంగ్రెస్ కమిటీ నాకో ఆహ్వాన పత్రాన్ని చదివి సమర్పించింది. అక్కడ కూడా నన్ను వ్యతిరేకించే ప్రజలు గుమికూడారు. నేను మాట్లాడడానికి లేచినప్పుడు నానా

విధాలుగా గోలపెట్టి పదినిమిషాల వరకు నన్ను మాట్లాడనీయలేదు. అక్కడ కూడా యుద్ధ కాలసంఘటనల గురించే మాట్లాడాను. సభ జరుగుతున్నప్పుడు చాలాసార్లు కేకలు పెడుతూనే వచ్చారు. సభ ముగిసి 'మాతృభూమి' కార్యాలయానికి బయలు దేరినప్పుడు వ్యతిరేకుల దాడినుంచి నన్ను కాపాడడంకోసరం కొందరు మిత్రులు నా చుట్టూ వున్నారు. నేను కోళిక్కోడ్‌లో మూడురోజులు గడిపాను. రకరకాల బెదిరింపు ఉత్తరాలు నాకు వచ్చాయి. నేను అక్కడనుంచి బయలుదేరిన తర్వాత నా మిత్రులు శ్రేయోభిలాషులు దీర్ఘంగా నిట్టూర్చి వుంటారు.

అంతరాత్మకు ద్రోహం చెయ్యకుండా, మనం నమ్మిన విశ్వాసాల కనుగుణంగా, నడుచుకోవడం వల్ల, జీవితంలో చాలామంది వ్యతిరేకతకు, దూషణకు గురికావలసివస్తుంది. ప్రజాజీవితంలో పాల్గొన్నవారిని ముఖ్యంగా ఇంగ్లండ్‌లో ముఖ్యమంత్రిగా వున్న లాయడ్‌జార్జ్‌కి ఒకసారి జరిగిన అనుభవం జ్ఞాపకానికి వస్తోంది. 1903వ సం॥లో ఇంగ్లండుకూ, దక్షిణాఫ్రికాకు మధ్య జరిగిన యుద్ధంలో ఇంగ్లండు ప్రజాభిప్రాయానికి విరుద్ధంగా లాయడ్‌జార్జ్ అభిప్రాయాలు వుండేవి. ఇంగ్లండు దక్షిణాఫ్రికాతో యుద్ధానికి దిగడం సరికాదు, అని ఆయన వాదించారు. దానిని వివరంగా చెప్పడానికి ఆయన వెనుకాడలేదు. ఒక బహిరంగ సభలో ఆయన తన అభిప్రాయాలను వెలిబుచ్చారు. అక్కడ చేరిన ప్రజలు యుద్ధం గురించి ఆలోచనలతో వున్నారు. లాయడ్‌జార్జ్ ఉపన్యాసం వినగానే ఆగ్రహం చెందిన ప్రజలు అల్లకల్లోలం సృష్టించారు. ఆయన శరీరానికే నష్టం కలిగించడానికి ఉద్యుక్తులయ్యారు. పరిస్థితి దారుణంగా మారడంతో, ఆయన ఒక పోలీసు అధికారి దుస్తులు ధరించి ఎవరికీ తెలియకుండా అక్కడనుంచి తప్పించుకున్నారు. మొదటి ప్రపంచ సంగ్రామం జరిగినప్పుడు ఇంగ్లండు ప్రధాన మంత్రిగా వున్న ఒక పెద్ద మనిషి అనుభవం ఇది.

మరొక ముఖ్యమంత్రి రామ్‌సే మగ్డనాల్డ్ అనుభవం కూడా యిక్కడ చెప్పుకోదగిందే. అది కూడా ప్రథమ ప్రపంచ సంగ్రామం జరిగిన రోజుల్లోనే. మగ్డనాల్డ్ ఇంగ్లాండ్, జర్మనీతో యుద్ధం జరపడానికి సుముఖమైన అభిప్రాయం లేనివారు. అందువల్ల ఆయనకు ఏమాత్రం పలుకుబడి లేకుండా పోయింది. బయటికి వాహ్యాళికి వెళ్లడానికి కూడ ఆయనకు దుర్లభమైపోయింది. ఎంచేతంటే అప్పుడు కూడా ఇంగ్లండ్ ప్రజలందరూ యుద్ధానికి ఆదరణ చూపారు. అందరూ యుద్ధానికి ఆదరణ చూపుతూ ఉత్సాహంగా కృషి చేస్తున్నప్పుడు, యుద్ధానికి వ్యతిరేకంగా ఏదైనా మాట్లాడినా, చేసినా ఆయన ఎంత గొప్పవాడుగా వున్నప్పటికీ, ప్రజలు ఆయనపట్ల

గౌరవాదరాలు చూపడం లేదు. ఆ రోజుల్లో ఆయన ఒకసారి ఫ్రాన్స్‌కు వెళ్లడానికి స్టీమర్ ఎక్కారు. నౌకా సిబ్బంది మగ్డనాల్డ్‌ను గుర్తు పట్టారు. వాళ్లు వెంటనే మగ్డనాల్డ్ ఓడనుంచి దిగిపోవాలనీ, లేకుంటే తామే అతన్ని దించటానికి కేప్టెన్ అనుమతించాలని, పట్టుబట్టారు. మగ్డనాల్డ్ ఓడలో వుంటే తాము పనిచేయమని తేటతెల్లంగా చెప్పేశారు. వేరే దారిలేకుండా కేప్టెన్ మగ్డనాల్డ్‌ను దించివేయమని ఆజ్ఞజారీచేశారు. మగ్డనాల్డ్ స్టీమర్‌నుంచి కిందికి దిగారు. యుద్ధానికి తర్వాత అత్యధికమైన ఓట్లు పొంది ఎన్నికలలో 'లేబర్' పార్టీ ఘనవిజయం సాధించింది. మగ్డనాల్డ్ ప్రధానమంత్రి అయ్యారు.

ఇటువంటి అనుభవాలు చాలామందికి ఏర్పడ్డాయి. ప్రజలప్రేమను, ఆదరణ మాత్రమే పొందాలంటే స్వతంత్ర భావాలతో జీవించలేము. తన అంతరాత్మకు అనుగుణంగా జీవించేప్పుడు లభించే తృప్తి సంతోషం మరెందులోనూ చూడలేము. ప్రజల అభిప్రాయం మరోలా వుంటుంది. ఆలోచనారహితమైన ప్రజల గుంపుకు అనుగుణంగా అంతరాత్మను అనుసరించే మనిషి మారలేదు. వీలైనంతవరకు వారినుంచి దూరంగా వుండడానికే ప్రయత్నిస్తాడు. ఆ తర్వాత ప్రజలు తాము విచక్షణా రహితంగా నడుచుకున్నది గ్రహించకపోరు. ఇది అన్ని దేశాలలోనూ, అన్ని కాలాల్లోనూ జరుగుతున్నదే.

కోళిక్కోడ్‌నుంచి బయలుదేరడానికి ముందు నేను 'నిరుదురిత్తి' వెళ్లాను. ఐక్య కేరళ గురించి సమాలోచన జరిపే ఒక సభలో పాల్గొని ఉపన్యసించడానికి నన్ను ఆహ్వానించారు.

మహాకవి వళ్లత్తోళ్, కేళప్పన్, కె.ఏ. దామోదర మీనన్, యు. గోపాలమీనన్, మిస్. అనిమస్కరీనన్ మొదలైనవారు ఆ సభకు వచ్చారు. కేరళ ప్రదేశాన్ని రూపొందించే విషయంగా సమాలోచన జరపడానికి కేరళలోని పలు రాష్ట్రాలనుంచి ప్రతినిధులను రప్పించి, ఒక సదస్సు ఏర్పాటుచేయడానికి ఒక కార్యకమిటీని ఏర్పాటుచేశాము. ఐక్య కేరళ ఆవిర్భావానికి జరిగిన ప్రాథమిక ప్రయత్నమే అది. ఆ తర్వాత నేను పాలక్కాడ్ బయలుదేరాను.

కాంగ్రెస్, ముస్లింలీగ్ ఒకదానితో ఒకటి ఘర్షణ పడుతూ వుండడం వల్ల దేశ పరిస్థితి అప్పుడు అల్లకల్లోలంగా వుంది. రాజప్రతినిధుల సభలో కాంగ్రెస్ - ముస్లింలీగ్ రెండు పక్షాలకు ప్రతినిధులుగా వున్నవారు కలిసి పనిచేయడం సాధ్యంకాని స్థితికి వచ్చింది. ప్రతిరోజూ అనుకోని వివాదాలు రావడం మొదలయ్యాయి. అయినప్పటికీ అప్పుడు ఎవరూ భారతదేశాన్ని విభజించవలసి వస్తుందని అనుకోలేదు. పరిస్థితి ప్రత్యక్షంగా

తెలుసుకోవడానికి నేను ఢిల్లీ వెళ్లాను. జనరల్ మోహన్‌సింగ్ కూడా అక్కడికి వచ్చారు. యుద్ధ సమయంలో సింగపూర్‌లో వున్న చాలామంది సైనికులు అధికారులను చూసే అవకాశం లభించింది. జనరల్ మోహన్‌సింగ్‌తో పాటు నేను మీరట్‌లో సమావేశమైన కాంగ్రెస్ సభకు వెళ్లాను. అక్కడ ఒక ప్రత్యేక గుడారంలో పండిట్ నెహ్రూ బసచేశారు. నన్ను మోహన్‌సింగ్‌నూ ఆయన అక్కడికి పిలిచారు. సింగపూర్‌లో జరిగిన విషయాలన్నిటినీ అప్పుడే ఆయనతో చెప్పాము.

రాజగోపాలచారి ఆ రోజులలో మంత్రి మండలి సభ్యులు. ఢిల్లీలో నేను ఆయన్ను కలుసుకుని మాట్లాడి సంతోషించాను. ఆయన్ను చూసి ఇరవైయేళ్లు దాటింది. సింగపూర్‌లో యుద్ధసమయంలో జపాన్‌వారితో జరిపిన పోరాటంలో నేను అనుసరించిన విధానాన్ని మెచ్చుకున్నారు.

రెండువారాల పాటు నేను ఉత్తర భారతదేశంలో పర్యటించిన తర్వాత మలబార్ వెళ్లాను. రోజులు ఎలా గడిచినవీ తెలియలేదు. ఇంకా కొన్ని రోజులు ఊళ్లో వుండాలనిపించింది. అయితే సింగపూర్ చేరవలసిన రోజు సమీపించడంతో నేను ఓడలోనే బయలు దేరాను.

# మలయా నుంచి సెలవుతీసుకోవడం

యుద్ధం ముగిసిన తర్వాత మలయాలోనూ, సింగపూర్‌లోను ఎలాంటి మార్పులు చోటుచేసుకున్నాయి! ఎటువైపుచూసినా నూతన నిర్మాణ సూచనలు కనిపించసాగాయి! ప్రజలలో ఆత్మవిశ్వాసం, నూతనోత్తేజం వెల్లివిరిసాయి. జాతీయరంగంలోనూ, విప్లవాత్మకమైన మార్పులు చోటుచేసుకున్నాయి. వాణిజ్యం ఆశ్చర్యం కలిగించే అభివృద్ధిని సాధించింది. స్వాతంత్ర్యోత్సాహం ప్రజలలో దేదీప్యమానంగా ప్రజ్వరిల్లసాగింది. ఒక నూతన మలయాదేశాన్ని నిర్మించే ఉత్సాహం పెల్లుబికింది.

వృత్తికి సంబంధించినంతవరకు నాకు మంచి ఆరంభమయింది. యుద్ధం తర్వాత సింగపూర్‌లో యుద్ధం వల్ల ఏర్పడిన కేసుల సంఖ్య ప్రమాణాలు పెరిగాయి. ఆదాయం పెరిగింది.

భారతదేశంలో ప్రారంభమైన స్వాతంత్ర్యోద్యమం బర్మా, ఇండోనేషియా, మలయా మొదలైన అన్ని దేశాలకు వ్యాపించి అభివృద్ధి చెందింది. భారత స్వతంత్ర శుభదినాన్ని ఉచితరీతిలో మేము సింగపూర్‌లో జరుపుకుని సంతోషించాము. భారతదేశంలో జరిగే సంఘటనలను, మలయా దేశ ప్రజలు అమితోత్సాహంతో గమనిస్తూవచ్చారు.

1947వ సం|| ఆగస్టు పదిహేనోతేదీ భారతీయ పరిపాలనా బాధ్యతను, బ్రిటిష్ వారి తరఫున మౌంట్‌బాటన్ ప్రభువు భారతీయులకు అప్పజెప్పినప్పుడు కొత్త ఢిల్లీలో జరిగిన సంఘటనలను గురించిన వర్ణనలను నేను అమితోత్సాహంతో రేడియో ద్వారా పరవశించి విన్నాను. రెండు శతాబ్దాల బ్రిటిష్ పరిపాలన ముగిసిందన్న నిజాన్ని తలచినపుడు చాలా ఆశ్చర్యం కలిగింది. విదేశాలలోని భారతీయులపట్ల గౌరవం ఉన్నట్టుండి పెరిగిపోయింది. ఆ దేశాలలోని భారతీయులు స్వదేశానికి తిరిగివెళ్లే వాతావరణం కూడా కనిపించింది. స్వతంత్రం పొందిన తర్వాత భారతీయులలో ఏర్పడిన ఆత్మవిశ్వాసం, దేశభక్తి తెచ్చిన మార్పులు ఆశ్చర్యం కలిగించేవిగా కనిపించాయి. అణగి మణగి వాళ్ళు చెప్పిన పనులు చేసి కాలం గడపడం తప్ప స్వతంత్రంగా ఏ బాధ్యతనూ స్వీకరించే అర్హత మనకు లేదన్నట్టు మనల్ని తయారుచేశారు తెల్లవారు.

ఇవాళ్టి యువతరం వీటన్నిటినీ గ్రహించడానికి వీలుకాదు. వాళ్లు స్వతంత్ర భారతదేశంలోనే కదా కళ్లు తెరిచారు! వాళ్లు చేపట్టలేని పదవి ఇవాళ ఏదీ లేదు. వాళ్ల మంచి అభివృద్ధిని నిరోధించే శక్తి ఏదీ లేదు.

స్వాతంత్ర్య దినోత్సవ సంరంభం యింకా పూర్తికానేలేదు. అప్పుడే మహాత్మాగాంధీ మరణవార్తను విని దిగ్భ్రాంతి చెందాము. అహింసనే జీవనలక్ష్యంగా భావించి తన దైనందిన జీవితంలో ఆ జీవన ధర్మాన్ని చేపట్టి జీవించి మానవజాతికి ఒక ఆదర్శమూర్తిగా వెలసిన మహాత్మాగాంధీ ప్రాణం ఒక మతోన్మాదిచేతి తుపాకీ గుండుకు ఎర కావడం గురించి తెలిసినప్పుడు విధి క్రౌర్యాన్ని తిట్టుకోకుండా వుండగలమా? మరికొన్ని ప్రాంతాలలో జరిగినట్లే, సింగపూర్‌లోనూ ఒక పెద్ద సంతాపసభ జరిగింది. చైనావాళ్లు, తెల్లవాళ్లు మలయా ప్రజలు యింకా చాలామంది ఆ సభలో గాంధీకి శ్రద్ధాంజలి ఘటించారు. ప్రజలందరూ మహాత్మాగాంధీని ఒక ప్రపంచ నాయకునిగా, పూజ్యులైన ఆచార్యుడుగా భావించారు. కొన్ని రోజులు గడిచాక, మహాత్మాగాంధీ చితి నుంచి విభూతిని తీసుకువచ్చినప్పుడు సింగపూర్‌లో దానిని స్వీకరించి సింగపూర్ చివరి శ్రద్ధాంజలి ఘటించడానికి మంచి ఏర్పాట్లు చేశారు. నేనూ అందులో పాల్గొన్నాను. ఒక బ్రిటిష్ వృద్ధురాలు ప్రతిరోజూ అస్తికల కలశం వుంచిన విక్టోరియా టౌన్‌హాల్‌కు వచ్చి, భక్తితో నమస్కరించేది. అది చూసి నేను చాలా ఆశ్చర్యపడ్డాను. చాలా దగ్గరి బంధువు పోయినట్టు బాధపడిన ఆమె కొంతకాలం భారతదేశంలో గడిపారట. ఆమె ఏకైక కుమారుడు నౌకాదళంలో అధికారి. అతను తరచూ సింగపూర్ వచ్చేవారు. అతణ్ణి చూసే అవకాశం కోసరమే ఆమె సింగపూర్‌లో వుంటున్నారు. అయినప్పటికీ తన జీవిత ఖర్చులకు ఆమె ఎవర్నీ చేయి చాపడం లేదు. అన్న నియమంతో రకరకాల వస్తువులను కొని అమ్మి వ్యాపారం చేసి దానితో వచ్చే డబ్బుతో రోజులు గడిపేది. దైవభక్తి, సేవాప్రవృత్తి గల ఆ వృద్ధురాలు ఎటువంటి స్థితిలోనూ ఎదుటివారికి సహాయం చెయ్యవచ్చు అన్నదానికి ఉదాహరణగా జీవించారు. గాంధీగారి అస్థికల కలశం ముందు మూడురోజుల పాటు ప్రార్థనలు జరిపాము. ఆ మూడురోజులు కూడా ఆ వృద్ధురాలే అన్ని ఏర్పాట్లు చేశారు. ఆవిధంగా కష్టపడ్డవారు ఆ రోజుల్లో అక్కడ ఎవరూలేరు. కోటానుకోటి ప్రజల హృదయాలను దోచిన గాంధీగారి అద్భుతశక్తి చూసి ఆశ్చర్యం చెందకుండా వుండగలమా? ఆయన జీవించిన కాలంలో జీవించడానికి, ఆ మహానుభావుని త్యాగశీలత, సేవానిరతిలో అంశంగా మన హృదయాలను స్పృశించేట్టు అవకాశం పొందిన వాళ్లు మహా భాగ్యవంతులే. గాంధీపుట్టిన దేశంలో మనం పుట్టాము. అన్న నిజమే మన

బాధ్యతలను, సేవాభావాన్ని మరీ ఎక్కువచేస్తాయి. ఎడతెరపిలేని ప్రయత్నం, చలనం లేని పట్టుదలతో మనిషి ఉన్నత స్థితిని పొందవచ్చు. అన్న దానికి గాంధీగారి అద్భుత చరిత్రయే ఉదాహరణ. మనిషి ఏస్థాయికి ధార్మిక జీవనం గడపవచ్చు అని ఆయన జీవించి చూపి వివరించారు.

ఆ రోజుల్లో జరిగిన మరో సంఘటనను యిక్కడ చెబుతాను. నా మనసును స్పృశించిన సంఘటన అది. నన్ను చాలా వేదన పాలుచేసిన అప్పు యిచ్చిన అతనిని గురించి చెప్పాను. కదా? ఆయన నాకు పన్నెండు వందల డాలర్లు అప్పు యిచ్చారు. ఆ అప్పు తీర్చడానికి నాకు కొంత కాలం పట్టింది. ఆ కాలంలో నేను చేసిన అప్పుకు మూడింతలు నాలుగువేల మూడు వందల డాలర్లు తిప్పియివ్వవలసివచ్చింది. ఈలోపల పదమూడుసార్లు, నా యింటి వస్తువులను, కార్యాలయసామాగ్రిని జప్తుచేసి తీసేసుకున్నారు. ఏమాత్రం దయలేకుండా వ్యవహరించాడు. ఆయన కొంతకాలం ఎదురుచూసినంత మాత్రాన ఏమీ పోగొట్టుకునేది లేదు. అయితే నా పరిస్థితి వెంటనే అప్పు తీర్చడానికి అనుకూలంగా లేదు. అందువల్ల అప్పుడు నాకు అతని మీద కోపంవచ్చిందంటే పాఠకులు అర్థంచేసుకోగలరు. ఇదంతా జరిగి పదేళ్లు గడిచిపోయింది. ఆ కోపం ద్వేషం చల్లారిపోయింది. నా పరిస్థితి మెరుగయింది. అయినా విధి సుడిగుండంలో ఆయన చిక్కుకున్నారు. యుద్ధ సమయంలో ఆస్తులు నష్టమయినాయి. సంరక్షించడానికి పెద్ద కుటుంబం వుంది. చేతి ఖర్చులకు డబ్బులేకుండా, నన్ను చూడవలసిన పరిస్థితి ఆ కుటుంబానికి కలిగింది. వాళ్ల అబ్బాయి నా దగ్గరికి వచ్చి అయిదువందల డాలర్లు అడిగాడు. నేను దాన్ని యిచ్చినప్పుడు నా దగ్గర బంధువు ఒకాయన 'వెనకటికి వాళ్లు చేసిందంతా మరచిపోయావా?' అని జ్ఞాపకం చేశాడు. 'నేను మరచిపోలేదు, అందువల్లే అవసరం అని రాగానే నేను వెంటనే యివ్వడానికి సిద్ధపడ్డాను. యిప్పుడైనా వాళ్లు అప్పటినా పరిస్థితులను గ్రహిస్తారు. ఈ ప్రపంచంలో ఏదీ శాశ్వతం కాదు, అదృష్టం, దురదృష్టం, కలిమి, లేమి, కీర్తి, అపకీర్తి మారుతూనే వుంటాయి' అన్నాను.

ఇటువంటిదే మరో సంఘటన ఈ కాలంలో జరిగింది. నేను జపాన్ వారి సైనిక జైలులో ఖైదిగా వున్నప్పుడు బట్టలులేక బాధపడ్డ ఒక ఖైదీకి నా పొంటు ఒక దాన్ని యిచ్చాను. ఆ విధంగా ఒక ఆంగ్లోయిండియన్‌కు నేను యివ్వడంవల్ల, నాకు ఆయనకూ మధ్య ఏదో సంబంధం వుందనీ దాన్ని చెప్పమనీ జైలు అధికారులు వేధించారు. నేను అతని కష్టం చూసి యిచ్చాను తప్ప మరేమీకాదని నేను ఎన్నిసార్లు చెప్పినప్పటికీ, వాళ్లకు తృప్తి కలగలేదు. యువకుడైన ఒక జపాన్ అధికారి, నేను అబద్ధం చెబుతున్నానని తన

చేతనున్న ఇనుపబెత్తంతో నన్ను కొట్టడానికి కూడా వెనుకాడలేదు. ఒకసారి కాదు పలుసార్లు నన్ను అతను కొట్టాడు. అతను దగ్గరికి వచ్చినప్పుడల్లా భయంవేసేది.

యుద్ధం ముగిసిన తర్వాత, యుద్ధకాలంలో ప్రజల్ని అక్రమంగా వేధించనందుకు జపాన్‌వారిమీద ప్రత్యేకంగా విచారణ జరిపారు. అటువంటి జపాన్‌వారిలో ఒకరికోసరం వాదించాలని నా దగ్గరికి అతని మిత్రుడు వచ్చారు. నేను ఒప్పుకున్నాను. అప్పుడే తెలిసింది నాపార్టీ వ్యక్తి ఎవరన్నదీ, వివరాలు తెలుసుకోవడానికి నేను చెరసాలకు వెళ్లినప్పుడే నేను ఎవరి కోసం వాదించనున్నాననీ తెలిసింది. నన్ను చెరసాలలో ఇనుపబెత్తంతో కొట్టిన యువకుడే ఆ వ్యక్తి. నన్ను చూడగానే అతను పసిపిల్లవాడిలా ఏడుస్తూ 'నేను మిమ్మల్ని కొట్టి వేధించాను. నాకు మీ ముందు నిలబడడానికే సిగ్గుగా వుంది, నేనేం ప్రాయశ్చిత్తం చేసుకోగలను' అని బాధపడ్డాడు.

'జరిగింది మరచిపో. ఇప్పుడు నేను కేసు విషయంగా మాట్లాడడానికి వచ్చాను' అని అతన్ని ఓదార్చాను. విచారణ తర్వాత ప్రతివాది దోషి అని తేలింది. తీర్పు తెలియజేసినప్పుడు న్యాయమూర్తి చెప్పారు. 'దిక్కులేని నిరపరాధులపట్ల ప్రతివాది మృగంలా మొరటుగా వ్యవహరించి వేధించినట్టు కోర్టువారి ముందు నిరూపణఅయింది. దీనికి దండన పదేళ్లు కారాగారవాసం. దాన్ని తగ్గించడానికి తగిన కారణాలు లేవు. అయినప్పటికీ నేను ఒక విషయాన్ని నిశితంగా చూస్తున్నాను. ప్రతివాదిచేత వేధించబడివుండి కూడా, దాన్ని గురించి ఏమాత్రం తలచుకోకుండా, అతనికోసం వాదించడానికి వచ్చిన న్యాయవాది సంస్కృతి దృష్ట్యా దోషికి ఇరవైఒక్క నెలల, కఠిన కారాగారశిక్ష విధిస్తున్నాను' ఎంత ఉపశమనం పొందుతూ దోషి ఆ తీర్పును విన్నాడు, ఆ సమయంలో అతనికి విధించిన దండన చాలా తక్కువ అనడంలో సందేహంలేదు.

ఒక తత్వవేత్త చెప్పిన మాటలు నాకు యిప్పుడు జ్ఞాపకం వస్తున్నాయి. 'మీకు ఎవరిమీదనైనా కోపంవచ్చినట్లయితే, ఆ భావం మీ మానవత్వానికే కీడు తెస్తుంది. దాని ఫలితం మిమ్మల్ని మాత్రమే కాదు. మీ రోజులను మిత్రులను మీతో చేరిన వాళ్లను కూడా చెడుపుతుంది. ఎదుటివారిని దోషించకుండా వాళ్లను క్షమించండి. అప్పుడు మీ మనసులో శాంతి నెలకొంటుంది. మీకు సామర్థ్యం పెంపొందుతుంది'.

1946వ సం॥ ఆఖర్లో నేను మాతృదేశానికి వచ్చినప్పుడు యింకా ఎక్కువకాలం సింగపూర్‌లోనే వుండకుండా, మాతృదేశానికి రావాలని నన్ను మిత్రులు కోరారు. వాళ్లు చెప్పడానికి ముందే నాలో ఆ

ఆలోచన కలిగింది. ఇరవైయేళ్ల క్రితం ధనాన్ని వెతుక్కుంటూ నేను మాతృదేశం వదిలివెళ్లాను. దానికి విరుద్ధంగా నేను చాలాకాలం అప్పుల బాధలోనే గడపవలసివచ్చింది. అప్పు తీర్చడానికి కొంతకాలం పట్టింది. డబ్బు సంపాయించడం ప్రారంభంకాగానే యుద్ధం ప్రారంభమయింది. యుద్ధం తర్వాత ఆదాయానికి సంబంధించినంతవరకు మంచి కాలమనే చెప్పాలి. అయితే నేను అక్కడే వుండడానికి యిష్టపడలేదు. నా మనసు మాతృదేశంలోనే వుంది. వెంటనే తిరిగి వెళ్లాలన్న ఉత్సాహం రోజురోజుకీ ఎక్కువ కాసాగింది. బంధువులు, మిత్రులు నా తెలివి తక్కువతనాన్ని గురించి మాట్లాడకపోలేదు. కుటుంబ భారం ఎక్కువయింది. దానిని భరించే సామర్థ్యం తక్కువే. స్వదేశానికి వెళ్లి ఏం చెయ్యగలము? ప్రజాజీవితంలో పాల్గొనడానికి ఉత్సాహం వున్నప్పటికీ, నా సొంత బుద్ధితో నడుచుకోవాలంటే ఖర్చుకోసరం యితరులను ఆశ్రయించలేము. ఇవన్నీ ఆలోచించతగ్గవే. అయితే వాస్తవజీవితానికి తగ్గట్టు ఆలోచించడం నాకు తెలియలేదు. నన్ను స్వదేశానికి రమ్మన్న మిత్రులకు నా ఆర్థిక పరిస్థితులు తెలిసివుండదు. సింగపూర్ వెళ్లిన వాళ్లంతా బాగా సంపాయిస్తున్నారు. అదేవిధంగా నేను బాగానే సంపాయించి వుంటానని వాళ్లు భావించివుంటారు. నా పరిస్థితి వేరు అన్న విషయం నేను వాళ్లకు చెప్పడానికి యిష్టపడలేదు. ఎలాగైనా సరే నేను స్వదేశం వెళ్లాలని నిశ్చయించాను. దానికోసరం ఏర్పాట్లలో దిగాను. ఇరవైయేళ్లు పనిచేసిన కార్యాలయం మాత్రమే నేను సంపాయించిన ఆస్తి. దానిని ఇంకొకరికి అమ్మినట్టయితే ఆ సొమ్మును నేను పొదుపుచేసి సంపాయించినట్టు అనుకోవచ్చు. దానికి అనుకూలంగా పరిస్థితులువున్నాయి. అయితే చదువుకోసరం మా అబ్బాయిని విదేశాలకు పంపడంవల్ల ఆ ఖర్చుకు ఆ మొత్తం కావలసి వచ్చింది. వాడి చదువుకు అది చాలకుండా యింకా అప్పు చేయవలసి వచ్చింది. మలయానుంచి నేను తిరిగి వచ్చినప్పుడు ఆవిధంగా నేను ఒక అప్పులవాడిగానే వున్నాను. జీవితంలో చాలాభాగం అప్పులవాడిగా వుండే స్థితినుంచి బయటపడడానికి నేను చాలా ప్రయత్నించవలసి వచ్చింది. అయినప్పటికీ అప్పులవాడు అన్న స్థితిలో అప్పటికీ యిప్పటికీ కాస్త మెరుగేనన్న మాటేగాని దానినుంచి పూర్తిగా విడుదలపొందలేదు. డికెన్స్ నవలలో వచ్చే 'మిక్కబర్' పాత్రలా మంచికాలం వస్తుందని ఆశతో వున్నాను. అయినా దాన్ని గురించి నాకు పెద్ద విచారం లేదు. అయినప్పటికీ ఖర్చును అదుపులో పెట్టడం సాధ్యం కాలేదు. రకరకాలుగా ప్రయత్నించాను. చెప్పదగ్గ ఫలితం లభించలేదు. ఫలితం లభిస్తుంది అన్నది కూడా సందేహమే.

ఇరవైయేళ్లు గడిపిన సింగపూర్‌నుంచి వీడ్కోలు పొందడం కష్టమే అనిపించింది. అక్కడనుంచి బయలుదేరడానికి కొన్నిరోజులు ముందు నుంచే మాకు విందులు, సత్కారాలు ప్రారంభమయ్యాయి. చివరిగా 'ఖాదే' రెస్టారెంట్‌లో అన్ని సమాజాల వాళ్లు కలిసి, మాకు చేసిన వీడ్కోలు సభని చూసి నా మనస్సు కృతజ్ఞతతో నిండిపోయింది. న్యాయమూర్తులు, బారిష్టర్లు, వ్యాపారులు, అధికారులు అందరూ ఎంతో ప్రేమతో వచ్చి జరిపిన ఆ పార్టీ నా మధుర స్మృతుల్లో ఒకటిగా యింకా బాగా గుర్తుంది.

న్యాయవాదిగా నేను చేసిన చివరి కృత్యం కూడా చెప్పదగినదే. యుద్ధం ముగిసిన తర్వాత భారతీయ ప్రతినిధి సింగపూర్‌లోనే శాశ్వతంగా స్థిరపడ్డారు. ప్రతినిధి యింటికి కార్యాలయానికి అని రెండు పెద్ద భవనాలు కొనడానికి ప్రభుత్వం సిద్ధపడింది. దానికి కావలసిన స్థలాలను పరిశీలించి కావలసిన డాక్యుమెంట్స్ తయారుచేసి, ఆ పని పూర్తిచేసి పెట్టాను. సింగపూర్ వదలివచ్చే రోజుల్లో భారతదేశానికి మలయాకు మధ్యవున్న సంబంధాన్ని కొత్తరకంగా అభివృద్ధి చెందడానికి దోహదం చేసే విధంగా జరిగిన ఒక కార్యక్రమంలో పాల్గొన్నందుకు సంతోషించాను.

1948వ సం॥ జూలై పదిహేడవ తేది సింగపూర్‌నుంచి సెలవు తీసుకున్నాను. హార్బర్‌లో నాకు వీడ్కోలు చెప్పడానికి వచ్చిన ప్రతి ఒక్కరి దగ్గరా సెలవు తీసుకుని, నేను ఓడలో ఎక్కి కూర్చున్నాను. ఓడ ప్రయాణం కావడానికి సూచనగా సైరన్ మ్రోగింది. ఓడ మెల్లిగా కదిలింది. తీరంలో వున్న మిత్రులను చూస్తూ నేను కొంతసేపు బాల్కనీలో నిలబడ్డాను. జీవితమే మిత్రులను కలుసుకోడం, విడిపోవడం; ఈ రెండు సంఘటనల్లో కొనసాగేదని చెబుతారు. మిత్రులనుంచి దూరంగా పోవడం చాలావేదన కలిగించేదే, అయినప్పటికీ ఈ విడిపోవడం శాశ్వతం అని తెలిసినప్పుడు మనసు భరించలేని వేదనకు గురిఅవుతుంది.

హార్బర్‌ను వదలి ఓడ సముద్రంలో సాగేప్పుడు పెరిగి విరిగి పెరిగే అలలు జోలలూపాయి, ఇరవైయేళ్లు కాలం అనుభవాలను తలుచుకుంటూ నేను అక్కడ చాలా సేపు నిలబడ్డాను. నా ఆలోచనల నుంచి నేను బయటపడినప్పుడు సింగపూర్ నాకు దూరమయివుంది. అయినప్పటికి బాల్కనీలో తిరిగేప్పుడూ, భోజనానికి కూర్చున్నప్పుడూ, మిత్రులతో మాట్లాడేప్పుడూ, సింగపూర్ నా మనసునుంచి దూరం కాలేదు.

ఓడలో ప్రయాణం చేయడం అంటే నాకు చాలా యిష్టం. విమాన పయనం కన్నా యిందులో విశేషం వుంది. రకరకాల మనుషుల్ని ఒకేచోట చూడగలం. స్వార్థపూరితుల్ని, స్వార్థరహితుల్ని, అదృష్టవంతులనూ,

దురదృష్టవంతులనూ, సామర్థ్యమైనవారినీ, అప్రయోజకుల్నీ, మనుషులంటే యిష్టపడేవాళ్లను, ఏకాంతంగా వుండే వాళ్లను ఓడలో చూడవచ్చు. కాలనియమం, యితరుల సౌకర్యాలను తెలుసుకొని నడుచుకునే స్వభావం, పరిశుభ్రతనూ క్రమశిక్షణను, అనుసరించే గొప్ప అవకాశం, ఓడ ప్రయణంలో లభిస్తుంది.

సింగపూర్‌ను వదలి మూడు రోజులయింది. బంగాళాఖాతంలో ఓడ తన గమ్యంవైపు సాగుతోంది. ఉదయం ఫలహారం చేసిన తర్వాత బాల్కనీ మీదకెళ్లి నురుగులతో, ఒక దాని వెనుక రకరకాల రంగులతో సూర్యకిరణాలతో మెరిసే అలలను సంతోషంగా చూస్తూ గడిపాము మేము. అగాధ జలనిధి గొప్పతనాన్ని గురించి ఆలోచించని వారెవరు? పెద్దపెద్ద బండలను చిన్నచిన్న ఇసుక రేణువులను తనలో యిముడ్చుకునివుంది. చిన్నా పెద్ద అనే భేదం దానికి లేదు. సువిశాలమైన మహాశక్తి, చిన్న క్రిమికీటకాల వద్ద, ఆలోచనా శక్తిగల మనిషి వద్దా వున్న అద్భుతంలాంటిదే అదికూడా! ఆ మహాశక్తిలో ఒక అణువే మనం' అని భావించేప్పుడు జీవితాన్ని ఒక నూతన కోణంలో నిశితంగా చూసి పరిశోధించడం వీలవుతుంది. రాగద్వేషాలు, నిమ్నోన్నతాలు, సుఖదుఃఖాలు, జీవన్మరణాలు, అన్నీ ఎవరిచేత మార్చడానికి వీలుకాని ఒక నియమానికి లోబడి వుందికదా! ఇది బాగా తెలిసివుండి కూడా మనం తప్పు పనులు చేస్తాం. మనం చేసిన తప్పులకు ఎదుటివారిని నిందిస్తాం. అర్థంలేని గౌరవాలకు, పదవులకు, వృధాగా ప్రాకులాడి బాధ పడతాం. విరోధులని అనుకున్నవారిని నాశనం చేయడానికి ప్రయత్నిస్తాం. తృప్తిలేని ఆశలో కొట్టు మిట్టాడుతూ మరణిస్తాం.

ఒకరోజు వీటన్నిటికి ఉన్నట్టుండి ఒక పరిష్కారం వచ్చేస్తుంది. దాంతో జీవితం లేకుండా పోతుంది. తర్వాత....తర్వాత ఏమిటి?

ఓడ సైరన్ మ్రోగుతోంది. పనిచేసేవాళ్లు అటూఇటూ పరుగెడుతున్నారు. ఓడ వేగం తగ్గింది. సముద్రం మధ్య నెమ్మదిగా ఆగింది. పడవలను దించుతున్నారు వేగంగా. ఏమయింది? ఒక ప్రయాణీకుడు సముద్రంలో పడిపోయాడు. తెలియకుండా జరిగిన ఆపత్తా? కావాలనే దూకాడా? ఎవరికి తెలుసు? అతనిని కాపాడడానికి సిబ్బంది ఎంతో ప్రయత్నించింది. నాలుగైదు పడవలమీద వాళ్లు చుట్టుపక్కల చూశారు. ఆ అదృష్టహీనుడిని కనిపెట్టలేకపోయారు. వాళ్లు నౌక దగ్గరికి వచ్చి పడవలను నౌకకు తగిలించారు. ప్రయాణం మళ్లీ సాగింది. నాలుగు రోజుల తర్వాత మేము మద్రాసు చేరాము.

చాలా మంది పాత మిత్రులు నాకు స్వాగతం చెప్పడానికి హార్బర్‌కు వచ్చారు. ఆవాళ సాయంకాలం రాజాజీహాల్‌లో మలయాళీలు చాలామంది నాకోసం ఒక స్వాగతసభ జరిపారు. ఆ రోజుల్లో మద్రాసు మంత్రిమండలిలో ఒక మంత్రిగా వున్న కోళిపురత్తు మాధవమీనన్ ఏర్పాట్లన్నీ చేశారు.

ఓడ నుంచి దిగిన వెంటనే నాకు 1948వ సం॥ జూన్ ఇరవైయేడో తేదీ మాతృభూమి డైరెక్టర్లు పంపిన ఉత్తరం చేరింది. అందులో వున్న విషయం యిదే! మాతృదేశానికి తిరిగి వస్తున్న 'మాతృభూమి' తొలి సంపాదకులు శ్రీ కె.పి. కేశవమీనన్‌కు 'మాతృభూమి' డైరెక్టర్ల స్వాగతం! వీలైనంత త్వరలో వారిని 'మాతృభూమి' సంపాదక బాధ్యతలు స్వీకరించమని కోరుతున్నాను.

మాతృభూమితో నాకున్న సంబంధం ఈ విధంగా మళ్లీ ఏర్పడింది. కేరళ ప్రజాజీవితంలో మళ్లీ పాలుపంచుకునే అవకాశం నాకు లభించింది.

# మళ్లీ పత్రికా సంపాదకుడిగా

1948వ సంవత్సరం ఆగష్టు ఒకటో తారీఖు నుంచి నేను మళ్లీ 'మాతృభూమి' సంపాదక బాధ్యతలను చేపట్టాను. పన్నెండు సంవత్సరాల కాలం ఆ పత్రిక సంపాదకుడిగా పని చేసిన శ్రీ కె. ఎ. దామోదర మీనన్ జూలై యిర్వై తారీఖున ఆ పదవీ విరమణ చేశారు. స్వతంత్ర పోరాటంలో అగ్రగామిగా పాల్గొన్న 'మాతృభూమి'ని చాలా సమర్థవంతంగా నిర్వహించిన దామోదర మీనన్ పత్రికావృత్తిని వదలి, ప్రత్యక్ష దేశ సేవలో దిగాలని నిశ్చయించారు. మంచి విషయావగాహనతో, స్వయంగా ఆలోచించడానికి, శక్తివంతంగా రాయడానికి, ఉపన్యసించడానికి గల అర్హతలు, నైపుణ్యంగల ఆయనకు కేరళ ప్రజా జీవితంలోనూ మంచి పలుకుబడి వుండేది. లక్ష్యాలను గురించి వట్టిమాటల గారడి చేయడం ఆయనకు గిట్టదు. వాస్తవజీవితంలో ఆచరణలో పెట్టగల విషయాల గురించే ఆయన మాట్లాడేవారు. నేను సింగపూర్ నుంచి తిరిగి వచ్చిన తర్వాత, ప్రజా జీవితంలో పాల్గొనడానికి, నాకు హృదయపూర్వకంగా సహకరించిన మిత్రుడు దామోదర మీనన్. ఆయన అభిప్రాయాలతో నాకు ఏకాలంలోగాని ఏకీభావం వున్నట్టు చెప్పడానికి లేదు. కాని ఆలోచించదగ్గ విషయాలను ఎత్తి చూపడంలో దామోదరమీనన్ శక్తి మెచ్చుకోదగ్గది.

ప్రతిపక్షం వారితో హృదయపూర్వకంగా సహకరించడం అన్నది అందరివల్ల అయ్యే పనికాదు. మన ప్రజా జీవితంలో చాలా వరకు ఈ నాగరికతలేమినే చూస్తున్నాము. అయితే దామోదరమీనన్ అటువంటి వారు కాదు. ప్రతిపక్షానికి చెందిన వారితోనూ, విరుద్ధమైన అభిప్రాయాలు కలవారితోనూ, ఆయన స్నేహపూర్వకంగా మసలుకోగలరు.

సంపాదక బాధ్యతను చేపట్టిన తర్వాత 1948వ సంవత్సరం ఆగష్టు ఒకటో తేదీ సంచికలో నేను వ్రాశాను. 1925 సం॥ జనవరి ముప్ఫై ఒకటో తేదీ, 'మాతృభూమి' సంపాదకుడుగా పాఠకుల నుంచి సెలవు తీసుకున్నాను. ఆ రోజు సంపాదకీయంలో 'ఈ బాధ్యతను మళ్లీ కొనసాగించే భాగ్యం కలిగినట్టయితే అది నా హృదయ పూర్వక కృతజ్ఞతకు కారణమవుతుంది' అని వివరించాను. ఆ అదృష్టం మళ్లీ ఇప్పుడు నాకు లభించింది. నేను బాల్య

దశలో వదిలివెళ్లిన 'మాతృభూమి', ఇవాళ యౌవనాన్ని సంతరించుకున్నది. విదేశీ పాలననుంచి భారతదేశం విముక్తి పొందడానికి, 'మాతృభూమి' తన కర్తవ్యాన్ని నెరవేర్చింది అని తలుచుకున్నప్పుడు మనసు ఆనందం చెందుతోంది. వ్యక్తి స్వాతంత్ర్యం, దేశం వంటి వివిధ శాఖలలోనూ, అభివృద్ధి సాధించడమే లక్ష్యంగా ఒక పత్రిక నడవాలి. ఈ విధంగా రెండు ముఖ్యమైన విషయాలను, మనసులో వుంచుకోవడం మంచిది.

1. పత్రికావృత్తిని, మిగతా వృత్తుల్లాగా ఒక వ్యాపారంగా మాత్రం భావించకూడదు. ఆదాయ వ్యయాలను క్రమబద్ధం చేయకపోయినట్టయితే ఏ వ్యాపారం గాని అట్టేకాలం కొనసాగదు కదా! వ్యాపార ముఖ్య లక్ష్యం అయితే పత్రికావృత్తి ప్రధాన లక్ష్యం అదికాదు. ప్రజాసేవయే పత్రికావృత్తి ప్రధాన లక్ష్యం.
2. పార్టీ మనస్తత్వాలలోగాని, సంకుచిత భావంతో గాని వ్యవహరించకుండా, విషాగ్నికి చోటు యివ్వకుండా, పత్రికను జాగ్రత్తగా కాపాడాలి. ప్రజలకు చేసే సేవే ప్రధానంగా భావించి ఒక సాధారణ మనిషి సంక్షేమాన్ని, స్వతంత్రాన్ని అభివృద్ధి చేయడానికి ఒక శక్తివంతమైన సంస్థగా 'మాతృభూమి'ని యింకా అభివృద్ధిచేయడానికి నేను నిర్విరామ కృషి చేస్తాను.

ఈ ప్రయత్నంలో కొంతైనా విజయం సాధించానంటే నేను వినయంగా చెప్పడానికి పూనుకునేదంతా దానికి ఈ పెద్ద సంస్థలో పనిచేసే డైరెక్టర్లు నుంచి మామూలు స్థితిలో వున్న ఉద్యోగుల వరకూ, ఐక్యమత్యంతో అందజేసిన సహకారమే కారణం అవుతుంది. కొందరు తగవులకు లాగే మనస్తత్వం కలవాళ్లే, అయినప్పటికీ సంస్థ పెరిగే కొద్దీ అవకాశాలు పెరుగుతూ వుంటాయి. అందువలన లోపాలను సరిదిద్దు కొనడానికి ఏక చిత్తంతో, వివేకంతో, దూరదృష్టితో పత్రికలలో పనిచేసే వాళ్లు నడచుకోవడం అవసరం.

డైరెక్టర్లు అందరూ చాలాకాలంగా నాకు పరిచయం వున్న మిత్రులే.

సహాయ నిరాకరణోద్యమ కాలంలోనే, కారూర్ నీలకంఠ నంబూద్రిపాడ్ నాతో సన్నిహితమైన మైత్రి నెరపిన స్నేహితులు, రూపంలో గాని, స్వభావంలో గాని, నాటికి, నేటికి ఎలాంటి మార్పు కనిపించలేదు. వయస్సు డెబ్బైయేళ్లు అయినప్పటికీ, యింకా ఉత్సాహవంతుడైన ఒక యువకునిలా నడుచుకునేవారు. 'మాతృభూమి' కంపెనీ ప్రారంభమైన నాటినుంచే, ఆయన డైరెక్టరు కొంతకాలంపాటు మేనేజింగ్ డైరెక్టరుగా వున్నారు. 'మాతృభూమి' అభివృద్ధి గురించి చెప్పేటప్పుడు స్వంతకుటుంబం అభివృద్ధిని గురించి మాట్లాడేటట్టుగా సంతోషంతో ఆయన ముఖం వెలిగి పోవడం చూడవచ్చు.

వినయం, వివేకవంతం అయిన మాటలు, నడుచుకునే తీరూ, ఆయన ప్రత్యేకతలు. ఈ పుస్తకాన్ని ప్రచురిస్తున్న ఈ రోజున ఆయన డైరెక్టర్‌గా లేక పోయినప్పటికీ 'మాతృభూమి' ముద్రణ, ప్రచురణకర్త ఆయనే. 'మాతృభూమి'కి సంబంధించినంతవరకూ ఆయన ప్రేమకు లోటు లేదు.

అంబలకాట్టు కురుణాకరమీనన్, మరొక డైరెక్టర్ మలబార్ కాంగ్రెస్‌లోనూ, హరిజన పురోగతిలోను, పాటుబడిన గౌరవనీయులైన సభ్యులు. చట్ట నిరాకరణ సిద్ధాంతం పట్ల విశ్వాసంతో, ఉద్యమాన్ని ఆదరించినప్పటికీ, చట్ట నియమాలను అధిగమించడానికి యిష్టపడనివారు. ఆయా పనులను, వాటి వాటికి తగినట్టు జరపాలన్నది ఆయన సిద్ధాంతం. దయ, కరుణ చూపడం సక్రమమైన పనులకు ఆటంకం కలిగిస్తాయని ఆయన చెప్పేవారు. సత్యాన్ని అనుసరించడంలోనూ, కార్యక్రమాలను సక్రమంగా నిర్వహించడంలోనూ, ఆయన కనపరచిన మానవత్వం తక్కినవారికి మార్గదర్శకమైనది.

టి.వి. సుందరం అయ్యర్ సుప్రసిద్ధులైన ఒక క్రిమినల్ లాయర్. కీర్తి కాంక్ష ఏ మాత్రం లేని మనిషి. ప్రారంభకాలంనుంచి నేటివరకు డైరెక్టర్‌గా వుంటున్నవారు. తన పార్టీ వారి కోసరం, న్యాయస్థానంలో చివరివరకూ పోరాడే వారయినప్పటికీ, డైరెక్టర్ల సమావేశాలలో పోరాడడానికి గాని, వాదించడానికి గాని యిష్టపడేవారుకాదు. వాదంలేని విషయాలను 'ఎక్స్‌పార్టీ' కేసుల్లా ఒక లెక్కన తీర్మానించవచ్చని, సుందరం అయ్యర్ చెప్పేవారు. డబ్బు విషయంలో చాలా ఖచ్చితమైన మనిషి అయినప్పటికీ, 'మాతృభూమి'కి సంబంధించిన బాధ్యతలను, పూర్తి చేసేందుకు వెనుకాడనివారు.

శ్రీమతి ఫి.వి. కుటి అమ్మాళ్ అమ్మ మరొక డైరెక్టర్ కేరళలో కాంగ్రెస్ సేవ చేసి పేరుపొందిన అతికొద్దిమంది స్త్రీలలో ఈమె ఒకరు. శ్రీ కె. మాధవ మీనన్ మరొక డైరెక్టర్. ఇవాళ ఆయన 'మాతృభూమి' డైరక్టర్స్ బోర్డు అధ్యక్షులుగానూ, కంపెనీ డిప్యూటీ మేనేజింగ్ డైరెక్టర్. వి.ఎమ్. నాయర్ మేనేజింగ్ డైరెక్టర్. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని, చాలాకాలం కేరళ కాంగ్రెస్‌తో సంబంధంవున్న మాధవ మీనన్ మద్రాసు మంత్రిమండలిలో ఒకరుగా కొంతకాలం పని చేశారు. ప్రారంభ కాలంనుంచే ఆయనకు 'మాతృభూమి' తో సంబంధం వుంది. సంపాదకులుగాను బాధ్యత వహించారు. నాకు చిన్నప్పటినుంచే బాగా తెలిసినవారు. డైరెక్టర్ల సమావేశంలో ఆయన చాలా ఉత్సాహం చూపేవారు. రకరకాలుగా 'మాతృభూమి' అభివృద్ధికి సహకరించినవారు.

నేను సింగపూర్‌నుంచి తిరిగి వచ్చిన తర్వాత కొంతకాలంపాటు డాక్టర్ చంద్ కూడా మాతృభూమి డైరెక్టర్‌గా వుండేవారు. అనారోగ్యకారణంగా ఆయన ఆ పదవిని కొనసాగించడానికి సాధ్యపడలేదు.

'మాతృభూమి' ఆవిర్భావానికి కృషి చేసినవారు మరొక డైరెక్టర్ శ్రీ కేశవన్ నాయర్. ఇటీవలి కాలంలో డైరెక్టర్స్ బోర్డులో సభ్యులైన వారాయన. కాని అంతకుపూర్వం నుంచే 'మాతృభూమి' అభివృద్ధికి ఎక్కువ ప్రోత్సాహం కనబరచినవారు.

శ్రీజిన చంద్రన్, కె. కుమారన్ నాయర్, కుట్టి కృష్ణ మీనన్ డైరెక్టర్స్ బోర్డు తక్కిన సభ్యులు కాంగ్రెస్‌లో చాలా కాలం పనిచేసిన శ్రీజిన చంద్రన్ కొంతకాలం పార్లమెంట్ సభ్యులుగా వున్నారు. 'మాతృభూమి' ప్రథమ మేనేజింగ్ డైరెక్టర్ దాని ప్రాథమిక స్థాపకులలో ఒకరైన కె. మాధవన్ నాయర్ కుమారుడు కుమారన్ నాయర్, కె. కుట్టి కృష్ణ మీనన్ డైరెక్టర్స్ బోర్డులో కొంతకాలమే సభ్యులుగా వున్నారు.

ఇరవై మూడేళ్ల తర్వాతనే కదా నేను మళ్లీ సంపాదన బాధ్యత చేపట్టాను! ఒకరిద్దరు తప్ప, ప్రారంభకాలంలో నాతో పనిచేసిన వారెవరూ నేను తిరిగి వచ్చిన తర్వాత 'మాతృభూమి'లో లేరు - టి.వి.సి. కిడావ్ తప్ప సంపాదక వర్గంలో నాకు సంబంధించినంతవరకు అంతా కొత్తవాళ్లే అయితే చాలా రోజులు కొనసాగవలసిన అనుబంధం కాబట్టి మా స్నేహబంధం కొద్ది కాలంలోనే నన్ను వాళ్లతో కలిపింది. పత్రికావృత్తినుంచి దూరమై చాలా కాలం గడిచిన నాకు, వాళ్ల సహాయం సలహాలు చాలా ఉపయోగపడ్డాయి.

కేరళ జాతీయరంగంలోను, ప్రజా జీవితంలోనూ ఎన్నో కొత్త అభిప్రాయాలు ఉత్పన్నమయ్యాయి. చాలామంది కొత్త నాయకులు తయారైవుండడం కూడా నేను చూశాను. చాలాకాలం మాతృదేశంలో లేని నాకు అందరి గురించి తెలుసుకొనడానికి, నా మిత్రుల సహాయం చాలా అవసరమయింది. పత్రికను బాగా నడపడానికి, వాళ్ల సహాయం కావాలన్న విషయం ప్రత్యేకంగా చెప్పాలా?

కాంగ్రెస్ లక్ష్యాలను నెరవేర్చడంలో ఒక ఆయుధంగానే 'మాతృభూమి' వుంటుంది అన్నదే 'మాతృభూమి' ప్రారంభకాల లక్ష్యంగా వుండేది. స్వతంత్ర పోరాటకాలంలో ఆ లక్ష్యాన్ననుసరించి పత్రికను నడపడం ఎలాంటి యిబ్బందీలేదు. స్వతంత్రం పొందిన తర్వాత కాంగ్రెస్ లక్ష్యం మారింది. ప్రజాక్షేమం మూర్తీభవించిన దేశాన్ని రూపొందించడం దాని ప్రస్తుత లక్ష్యం. దానికి తగ్గట్టుగానే 'మాతృభూమి' లక్ష్యం రూపొందించబడింది. అయినప్పటికీ ఆ లక్ష్యాన్ని అనుసరించడంవల్ల, కొన్ని యిబ్బందులు ఎదురయ్యాయి. కాంగ్రెస్ లక్ష్యానికి ఆదరణ అంటే దాని అర్థం, కాంగ్రెస్ ప్రభుత్వం

చేపట్టినదంతా సరియైనదని తలాడించమన్నది కాదు. ఒక ప్రజాక్షేమం నిండిన దేశాన్ని రూపొందించె గొప్పలక్ష్యాన్ని చేరుకోవడానికి మనల్ని తీసుకుపోయే మార్గంలో ప్రభుత్వం పయనించడంలేదు అని అనిపించే ధోరణిని, అది కాంగ్రెస్ అయినా, విమర్శించడానికి 'మాతృభూమి' వెనుకాడలేదు. పార్టీ బంధాన్నింటి సత్య దృక్పధంలో, వార్తలను అందచేసి, నిష్పక్షపాతంగా విమర్శలు చేస్తూ 'మాతృభూమి' ఒక ఉన్నతమైన ధోరణిలో నడుస్తూ వచ్చింది. 'మాతృభూమి' పట్ల ఆదరణ పెరగడానికి ఇదే కారణం.

'మాతృభూమి' కంపెనీ ప్రత్యేక విశిష్టత గురించి, చాలామందికి తెలియదు. కంపెనీ పెట్టుబడి ప్రస్తుతం పదిహేడు వేలకు పైగా లేదు. దాని ద్వారా ఎక్కువ లాభాలు ప్రతి యేటా ఎక్కువవుతున్నాయి. అయినా దాన్ని అలాగే భాగస్వాములు పంచుకోవడంలేదు. లాభంలో కొంత భాగాన్ని మాత్రమే వాళ్లు తీసుకుంటున్నారు. మిగతా ధనాన్ని 'మాతృభూమి' అభివృద్ధికే ఖర్చు పెడుతున్నాం. ఈ పెద్ద సంస్థ ఆవిధంగానే అభివృద్ధి సాధించింది. ఇవాళ ఒక నాణ్యమైన వార్తాపత్రిక, నడపడానికి కావలసిన యంత్ర పరికరాలు, 'మాతృభూమి' కి స్వంతంగా వున్నాయి. పనిచేసేవాళ్లకు న్యాయమైన జీతాలు, నిర్ధీత దినాలలో తప్పకుండా యిస్తున్నారు. 'బోనస్ ప్రావిడెంట్ ఫండ్' 'గ్ర్యాట్యుటి' 'పెన్షన్' అన్నీ వున్నాయి. ప్రభుత్వ కార్యాలయాలలో వుండే సెలవు సదుపాయంకూడా 'మాతృభూమి' సిబ్బందికి వుంది. 'మాతృభూమి' లాభాలు పొందడానికి స్థాపించిన వ్యాపార సంస్థకాదు. సేవ చేయడానికి ప్రారంభించబడ్డ ఒక జాతీయ సంస్థ భారతీయ వార్తా పత్రికలలో 'మాతృభూమి'కి ఒక ఉన్నతమైన స్థానం వుందంటే దానికున్న కారణాలు ఇవే.

భారత ప్రధాని నెహ్రూ 1955 సం|| డిసెంబర్ యిరవై ఎనిమిదో తేదీన 'మాతృభూమి' కార్యాలయానికి వచ్చారు. ఆ రోజున ఆయన అన్నారు.

'మాతృభూమి' ఈ ప్రదేశానికి చెందిన ఒక దిన పత్రిక అయినప్పటికీ యిది భారతదేశమంతా ఎరిగిన పత్రికగా వుంటోంది. ఈ సుప్రసిద్ధమైన దినపత్రిక, భారత స్వాతంత్ర్య పోరాటంలో, మహోన్నత పాత్ర వహించినది. ఇంకా ప్రజల మధ్య మంచి పేరు ప్రతిష్టలు పొంది 'మాతృభూమి' రోజు రోజుకీ అభివృద్ధి గాంచడం చూసి నేను ఆనందిస్తున్నాను. కేశవమీనన్ తన స్వాగతోపన్యాసంలో, 'మాతృభూమి' ముఖ్యమైన ఓ విషయాన్ని ప్రస్తావించ లేదు. నా గ్రంధాలు అనువదింపబడి 'మాతృభూమి'లో ప్రచురింపబడ్డాయి. ఇందువల్ల ఒక గ్రంధకర్తకు ప్రచురణ సంస్థకు మధ్య వున్న సంబంధం 'మాతృభూమి'కి నాకూ మధ్యవుంది. 'మాతృభూమి'కి నా శుభాకాంక్షలు.

ఈ విధంగా 'మాతృభూమి' నాయకుల నుంచి ప్రశంసలు పొందింది.

'మాతృభూమి' ఇటువంటి పేరు పొందడానికి చాలా మంది తమ శ్రమను ధారపోశారు, కీర్తిశేషులు సి. రాముణ్ణిమీనన్, కె. కేళప్పన్ కుంజ్ఞరారు పరియార్, పి. నారాయణన్ నాయర్, ఎం.కె. రాజా, కె.ఐ. దామోదర మీనన్, సి.హెచ్. కుంజ్ఞప్ప మున్నగు వారు ఒక్కొక్క సమయంలో 'మాతృభూమి' సంపాదక బాధ్యతలు నిర్వహించారు. దాని ప్రత్యేకతను రూపొందించడానికి పాటుపడ్డారు. 'మాతృభూమి' సహ సంపాదకుడు శ్రీ కుంజ్ఞప్ప కృషి యింకా కొనసాగుతూనేవుంది. కేరళ పత్రికేయుల్లో కుంజ్ఞప్పకు గల అనుభవం, సామర్థ్యం వున్నవారు చాలా కొద్దిమందే. అందరూ చదివి ఆనందించ తగ్గ శైలి, ఆయనకే వున్న ప్రత్యేకత. ఇంగ్లీషు మాటల అర్థం, ఉద్దేశ్యం, అణుమాత్రం తగ్గకుండా, వాటి తేటతెల్లమైన మలయాళంలో అందించగల దిట్ట. భారత దర్శనం, సమైక్య భారతం, స్వీయచరిత్ర (నెహ్రూ) మొదలైన గ్రంథాల అనువాదంలో ఆయన ప్రత్యేకమైన రచన శైలి, అందాన్ని స్పష్టంగా చూడవచ్చు.

సంపాదక వర్గంలో పనిచేసిన కొందరు ముఖ్యమైన మిత్రులను గురించి, చెప్పుకునేప్పుడు వార పత్రిక సంపాదక బాధ్యత స్వీకరించిన శ్రీ ఎన్.పి. కృష్ణ వారియర్‌ను గురించి చెప్పకుండా వుండలేము. మంచి పాండిత్యం, రచనాపాటవం గల వారియర్ ఏ విషయాన్నయినా సరే యిట్టే గ్రహించే సామర్థ్యం గలవారు. చాలా క్లిష్టమైన విషయాలను సైతం చాలా వేగంగా అర్థంచేసుకుని, ఎదుటివారికి సులభమైన శైలిలో వివరించగల సామర్థ్యం కలవారు. పైగా కొన్ని విషయాల పట్ల నిర్దిష్టమైన అభిప్రాయాలు గలవారు. ఆయన అభిప్రాయలలో ఏకీభవించనివారు సైతం, ఒక మంచి పండితుడు, ఆలోచనాపరుడు, అన్న స్థాయిలో వారియర్ మాటను కాదనలేరు.

సమర్థులు, ఉత్సాహవంతులు అయిన చాలామంది యువకులు 'మాతృభూమి' సంపాదకవర్గంలో పనిచేసేవారు.

అయినా 'మాతృభూమి'కి జీవనాడిగా వున్న వారు దాని మేనేజర్ శ్రీ యన్. కృష్ణన్ నాయర్ అసాధారణ సామర్థ్యం, వినయం గల వ్యక్తిత్వం కలవారాయన. ఆయన విశిష్టవ్యక్తిత్వాన్ని సన్నిహితంగా మసలేవాళ్లు మాత్రమే తెలుసుకోతగ్గది. అక్షరాల కంపోజింగ్ నుంచి రోటరీని తిప్పడంవరకూ-అచ్చు యంత్రానికి సంబంధించిన అన్ని విషయాలను, ఆకళింపుచేసుకొని వివరించగల సమర్థులు శ్రీ నాయర్. 'మాతృభూమి' ప్రెస్‌లోనూ, పత్రిక వివిధ విభాగాలలోను, పని చేసేతీరు బాగా తెలిసినవారు. అచ్చుయంత్రంలో ఏ భాగమైన చెడినట్లయితే, బాగు చేసే సామర్థ్యం గలవారు. ఒక మంచి వ్యాపారికి వుండవలసిన సూక్ష్మ బుద్ధి, ఒక కుటుంబ పెద్దకు వుండవలసిన

మర్యాద, మంచి నడవడిక, ఒక పారిశ్రామికవేత్తకువున్న బాధ్యతా నిర్వాహణ సామార్థ్యం, ఒక మత బోధకుని దగ్గర వుండే పట్టుదల, విశ్వాసం, యివన్నీవున్న ఒక మనిషిని చూడాలంటే 'మాతృభూమి' మేనేజర్ కృష్ణనాయర్‌నే చూడాలి. ఇన్ని వుండికూడా ఎప్పుడూ కృష్ణనాయర్ దగ్గర హడావుడి కనిపించదు. ఒక పని కూడా అస్తవ్యస్తంగా వుండదు. అక్కడ పని చేసే వాళ్లను వాళ్లకు తెలియకుండానే తన వెంట నడిపించేవారు. తన చేత కాని పనిని 'యిది వీలుకాదు' అని చెప్పడానికి వెనుకాడనివారు. 'మాతృభూమి' కార్యాలయంలో పని చేయడానికి అమితానందం చెందేవారాయన. కొందరు మనుషులకీ, కొన్ని సంస్థలకీ మధ్య వున్న సంబంధం వాళ్లు లేకుండా ఆ సంస్థలను ఊహించలేము. 'మాతృభూమి'కీ కృష్ణనాయర్‌కు వున్న సంభంధం అటువంటిది. వార్తలను త్వరగా సేకరించడానికి కావలసిన టెలిప్రింటర్ సౌకర్యాలను కల్పించడానికి పత్రికను తొందరగా ప్రచురించడానికి కావలసిన రోటరీప్రెస్ నెలకొల్పడానికీ, యింకా ఇటువంటి సౌకర్యాలను వెంట వెంటనే ప్రవేశపెట్టడానికి, నూతన పదుపాయాలు సమకూర్చడానికి ప్రయత్నించారు కృష్ణనాయర్.

మరో వ్యక్తి గురించి కూడా యిక్కడ చెప్పుకోవాలి. ఆయన మాధవఫణిక్కర్. 'మాతృభూమి'కి సేవచేయుటమే లక్ష్యంగా గలవారిలో మాధవఫణిక్కర్‌ను మించిన వాళ్లెవరూ లేరు ఇరవైయేళ్ల కాలం, ఫణిక్కర్ 'మాతృభూమి'లో ఒక అటెండర్‌గా పని చేశారు. నిజాయితీ, సక్రమ బాధ్యతా నిర్వహణ మొదలైన మంచి లక్షణాలు గలవారు ఫణిక్కర్. 1948 వ సం॥ నేను మళ్లీ బాధ్యత తీసుకోవడానికి వచ్చినప్పుడు ఫణిక్కర్‌కి యాభై యేళ్లు వుండవచ్చు. స్నానం చేసి, నుదుట బొట్టు పెట్టుకుని, శుభ్రమైన దుస్తులు ధరించి, నిర్ణీత సమయం తప్పకుండా ఫణిక్కర్ కార్యాలయానికి వచ్చేవారు. తను నిర్వర్తించవలసిన పనులను సక్రమంగా చేసే వారు. ఏదైన కొనడానికి డబ్బిచ్చినట్లయితే వస్తువుతో పాటు లెక్కకూడా పట్టుకు వచ్చేవారు. ఫణిక్కర్‌కు బంధువులెవరూ లేరు. ఆయన కుటుంబమే 'మాతృభూమి'. నేను మళ్లీ చేరి రెండేళ్లు గడిచిన తర్వాత వ్యాధిగ్రస్తులైన ఫణిక్కర్ వైద్య నిలయానికి వెళ్లేవరకు మా యింట్లోనే బసచేశారు. ఒక రోజు రాత్రి ఫణిక్కర్ ఆఖరి వార్త విన్నప్పుడు ఇంట్లోనూ, కార్యాలయంలోనూ, భర్తీ చేయలేని ఆయన లోటును తలచుకుని వేదన చెందాను. ఒక మనిషిని నిజంగానే గొప్పదనం అహ్వాదించేది. ఆయన నిర్వహించే పదవికాదు, సహజంగా ఆయనకున్న సుగుణాలు మాత్రమే ఒక మనిషి ఔన్నత్యాన్ని చాటుతాయి. అవిధంగా మాధవఫణిక్కర్ ఒక ఉదాహరణగా భాసించారు.

మాతృభూమి ప్రారంభకాలంకన్నా వేర్వేరు అంశాలలో పాఠకులు మార్పు చెంది వున్నారు. వారి అభిరుచులు మారాయి. అవసరాలు ఎక్కువయ్యాయి. వార్తలను తెలుసుకోవాలన్న ఉత్సాహం, ఎక్కువయింది. ఎంతటి ఏకాగ్రతతో పనిచేసినప్పటికీ పాఠకుని తృప్తిపరచటం అంత సులభంగా కనిపించలేదు.

'మాతృభూమి' ప్రచురించే వార్తలలో ఒక భాగం, కొందరు రచయితలు పంపే వ్యాసాల నుంచి తీపుకోబడేవే. వాటిగురించి పాఠకుల ఆమోదం పొందని ఉత్తరాలు రాకపోవడం చాలా తక్కువే. నిజాన్ని తెలుసుకునే దృక్పథంతో విషయ అవగాహనతో వార్తలను ప్రచురించాలని ప్రయత్నించినప్పటికీ కొన్ని సందర్భాలలో తెలిసీ తెలియకుండా వార్తల నాణ్యత స్వభావం మారిపోవడం సహజం. తప్పుచేయడం అన్నిరకాల మనుషులకీ సహజమే కదా!

వ్యక్తులనుగాని, ప్రజా సంస్థలను గాని, సంస్థలకు సంబంధించిన విషయాలలో గాని 'మాతృభూమి' దృక్పథం తమ అభిప్రాయాలకు అనుకూలంగా లేదని తెలిసినప్పుడు, స్వార్థపరులు ఆ స్థితిని మార్చే విధంగా 'మాతృభూమి'ని తాము స్వాధీనం చేసుకోవడానికి ప్రయత్నించక పోలేదు. కొందరు ప్రముఖ వ్యక్తులు, తమ పలుకుబడిని దీనికోసరం ఉపయోగించడానికి కూడా వెనుకాడలేదు. అయితే ప్రజాక్షేమం - [illegible]త్యం - ఈ రెండిటికీ విరుద్ధమైన ఒక ఆచరణలో దిగడానికి 'మాతృభూమి' ఎప్పుడూ అంగీకరించింది లేదు. ఆ కారణంగా కొందరు మిత్రుల విరోధాన్ని కూడా ఎదుర్కొనవలసివచ్చింది. అయినప్పటికీ 'చేయవలసిన దాన్ని చేశాము' అన్న సంతృప్తి మాకెంతో ఓదార్పునిచ్చింది.

ఆ రోజుల్లో పత్రికలో ప్రచురించడానికి కావలసిన విషయాలు, చర్చించతగ్గ సమస్యలు చాలా ఎక్కువయ్యాయి. సాధారణంగా జరిగే సంభవాల నుంచి విడివడి నడుచుకునే విధంగా వార్తల అంతస్తును బట్టి ప్రచురించే తీరును బట్టే, ఒక పత్రిక అంతస్తును, పలుకుబడిని నిర్ణయిస్తాయి. అయినప్పటికీ అలా ఎన్నుకోబడిన విషయాలు, ప్రచురించిన విధానం, కొన్ని సందర్భాలలో తృప్తిని యివ్వజాలవు. అయినప్పటికీ, సంపాదకులు వారి వారి సామర్థ్యానికి, అభిప్రాయానికి తగ్గవిధంగా చేసే పనిని బాగులేదని తిరస్కరించడానికి నాకు యిష్టం లేదు. తప్పును సూచించకపోవడం నిజాయితీ కాదు. మంచిని-చెడును వాటికి తగ్గ మంచిభాషలో వివరించే సామర్థ్యం కలిగివుండడం పాత్రికేయులకు వరప్రసాదం లాంటిది. అయినప్పటికీ చాలా కొద్దిమంది దగ్గరే అది వుంటోంది.

నేను వివిధ రంగాలలో పనులు చేశాను. వివిధ వృత్తులను చేపట్టి నడిపాను; అయినప్పటికీ 'మాతృభూమి' కార్యాలయంలో, నేను

పనిచేస్తున్నప్పుడు నాకు ఏర్పడ్డ ఆనందం సంతృప్తి మరే వృత్తిలోనూ నాకు కలుగలేదు. 'మాతృభూమి'తో నాకు ఏర్పడ్డ సన్నిహిత సంబంధమే నాకు ఏర్పడ్డ సంతృప్తికి కారణమేమో! పత్రికలో ఏదైనా తప్పు కనిపించినా, ఆ పత్రికాధోరణి గురించి ఎవరైన లోపంగా మాట్లాడినా, నా మనసులో చెప్పలేని బాధ కలిగేది. ఎలాంటి శ్రద్ధ కలిగివున్నప్పటికీ, విమర్శలు రాకపోవు. "ఒక వార్తా పత్రికగా 'మాతృభూమి'ని నేను ఒక ఆదర్శ దిన పత్రికగా భావిస్తున్నాను" అని ఒక ప్రభుత్వ అధికారి ఒకసారి నాతో అన్నారు. ఆ పొగడ్త నాకు అనంతమైన ఆనందాన్ని కల్గించినప్పటికీ, దాంతోపాటు ఆశ్చర్యాన్ని కూడా కలిగించింది. 'మాతృభూమి'కి సంబంధించినంతవరకూ నా ఊహల్లో ఉన్నతమైన ఆదర్శం కలిగివున్నాను. దాన్ని ఆచరణలో పెట్టే విధానంలో నాకు సంపూర్ణ విజయం లభించినట్టు నేను నమ్మలేదు. ఆచరణలో సాధ్యమా అన్న సందేహం నాలో వుంది. నా ఆశ్చర్యానికి అదే కారణం. 'మాతృభూమి' ఉన్నత ఆదర్శమే లక్ష్యంగా, దానితో సంబంధంవున్న అందరినీ, హృదయపూర్వకంగా ప్రయత్నించడం ఎంతటి మహాప్రసాదం!

'మాతృభూమి' ప్రచురించేదంతా నిజమని నమ్మే పాఠకులను నేనెరుగుదును. అందువల్ల వాటిలో కొన్ని అబద్ధమైన వార్తలను చూస్తే చాలా బాధ కలుగుతుంది. అభిప్రాయాలను వెలిబుచ్చేప్పుడు కూడా, సత్యానికి విరుద్ధమైన వాటికి తీసుకునేప్పుడు బాధ కలుగుతుంది. ప్రజా క్షేమమే మా లక్ష్యంగా నిష్పక్షపాతంగా నిలబడి, వార్తలను విమర్శించాలన్నదే 'మాతృభూమి' ఆదర్శం. రకరకాల అభిప్రాయాలు వున్నవారు సంపాదక వర్గంలో వున్నారు. అయినప్పటికీ 'మాతృభూమి' కంటూ ఒక ప్రత్యేక అభిప్రాయం వుందన్న విషయం వారందరికీ తెలుసు. వారు తమ వ్యక్తిగత అభిప్రాయాలను పత్రికద్వారా చెప్పడానికి వీలు కాదు. ప్రజాభిప్రాయాన్ని మాత్రమే కేంద్రంగా భావించి పత్రికను నడపకుండా, ప్రజాభిప్రాయాన్ని రూపొందించడం కూడా పత్రికలబాధ్యత అని భావించాలి. 'మాతృభూమి' అభిప్రాయం, సంపాదకుని వ్యక్తిగత అభిప్రాయం, ఎప్పటికీ ఒకటిగానే వుంటుందని భావించడానికి వీలులేదు. కొన్ని సందర్భాలలో ఏకీభవించక పోవచ్చు. అటువంటి సందర్భాలలో 'మాతృభూమి' సిద్ధాంతాలకు అనుగుణమైన అభిప్రాయానికే ప్రథమ స్థానమిస్తాను. సంపాదకీయంలో ధ్వనించే 'మనం' ఎవరి స్వరం అన్నది చెప్పడం సాధ్యంకాదు. అయితే అభిప్రాయం ప్రచురించడానికి, దీనికన్నా సులభమైన మాట ఏదైన వుండాలన్నది సందేహమే. పత్రికా ధర్మాల గురించి ఒకసారి 'మాతృభూమి'లో రాసింది యిక్కడ వివరిస్తున్నాను.

'స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత, మన దేశంలో పత్రికల సంఖ్య నాణ్యత ఎక్కువయ్యాయి. దిన పత్రికలు, వార, మాస పత్రికలు అన్నీ కలసి భారత దేశంలో మొత్తం ఆరువేల తొమ్మిది వందల ప్రచురణలు వెలువడుతున్నట్లు 'స్టాటిస్టిక్స్' వివరాలు తెలుపుతున్నాయి. వాటిలో ఆరు వందల్లు దిన పత్రికలు, వార పత్రికలను, మాస పత్రికలను కొని చదివే చందాదారులు మనదేశం మొత్తంమీద నలభై లక్షల కన్నా ఎక్కువ లేరు. భారతదేశం జనభా బట్టిచూస్తే యిది చాలా తక్కువే. ఇంగ్లండ్‌లో 'న్యూస్ ఆఫ్ ది వరల్డ్' అన్న ఒక పత్రికకు మాత్రం ఎనభై లక్షల చందాదారులు వున్నారు. ఈ విషయం తెలిసినప్పుడు మనం యింకా ఎంత పురోగమించాలి? అన్నది అర్థమవుతుంది. చందాదారుల సంఖ్య తక్కువగా వున్నప్పటికీ పత్రిక పాఠకుల సంఖ్య చదివించి వినేవారి సంఖ్య దానికి ఆరు రెట్లు, ఎనిమిది రెట్లు వుంటుందని భావించవచ్చు. ప్రజల మధ్య పత్రికల పట్ల ఆసక్తి రోజురోజుకీ ఎక్కువవుతుందనడంలో సందేహం లేదు. ఈస్థితి పత్రికల బాధ్యతను యింకా పెంచుతుంది. వార్తలను అందజేయడం, వాటిని గురించి విమర్శించడంతో సరిపోదు. పత్రికల బాధ్యత ప్రజల వివేకాన్ని, నాగరికతను పెంచడానికి, వారికి మంచి స్వభావాలను, ధైర్యాన్ని నూతనోత్తేజాన్ని కలిగించడానికి పత్రికలు బాధ్యత వహించాలి. అందువల్ల పత్రికలు అభిప్రాయాలు వెల్లడిచేయడంలోను, భాషను ఉపయోగించడంలోనూ, చాలా జాగ్రత్తగా వుండడం చాలా అవసరం. సంఖ్య అధికమయ్యేప్పుడు నాణ్యత తగ్గడం సహజమే. దేశంలో కొన్ని గొప్ప పత్రికలను గురించి చెప్పేప్పుడు కూడా, ఈ స్థితి యధార్థమైనదే. దాచనక్కరలేదు. అభిప్రాయం వెలిబుచ్చడం అన్న ముసుగులో, నిజం కాని వాటిని, అవమానకరమైన వ్యాసాలను, విమర్శలను, ఈ రోజుల్లో పత్రికల పేజీలు చోటు చేసుకుంటున్నాయి. ఇటువంటి నైచ్యాన్ని ఎత్తి చూపే పత్రికలు ఒకటి రెండు కావు; కొన్ని పత్రికల వైఖరిని, చూస్తున్నప్పుడు మనకున్న స్వాతంత్ర్యాన్ని మనం సక్రమంగా వినియోగించుకుంటున్నామా? అన్న అనుమానం కూడ కల్గుతుంది. దురాలోచనతో ఒక వ్యక్తి మీద నిందలు మోపడం, విమర్శించడం వల్ల అప్పటికప్పుడు పత్రికకు మంచి ప్రచారం లభించవచ్చు. అయితే ఒక పత్రిక గౌరవాన్ని నిర్ణయించేది అది కాదు. ధన సంపాదనకు మాత్రమే ఒక పత్రిక ఏర్పడినట్లయితే నిశ్చయంగా ఆ పత్రిక గౌరవం పెరగదు. వ్యక్తుల్లాగా పత్రికలు కూడా తమ గౌరవాన్ని, ఆత్మగౌరవాన్ని కాపాడుకోవాలి. నిజాలను బాగా పరిశీలించి, ప్రకటించడం, నిష్పక్షపాతంగా నిలబడి సంఘటనలను విమర్శించడం స్వార్థంకోసరం ఒక వ్యక్తి నడతను, వ్యక్తిగత జీవితాన్ని దెబ్బకొట్టే

విధంగా వ్యాసాలను ప్రచురించకుండా కాపాడుకోవాలి. అందరి వ్యక్తిగత జీవితాలను గౌరవించవలసింది మన బాధ్యత. ఒకరిని గురించి ఎవరైనా ఏదైనా చెప్పాలంటే పత్రికల పుటల్లో వాటికి స్థానం యివ్వకూడదు. సాధారణ ప్రజలందరూ కూడా ఒకరి గురించి చెడ్డ విశేషాలను వినడానికి ఉత్సాహం చూపడం సహజమే. అటువంటి ఉత్సాహం కలవారు బాధ్యతాయుతమైన పత్రికలు ఎర వేయవు 'క్రిస్టియన్ సైన్స్ మానిటర్' అన్న పత్రికను ప్రారంభించినప్పుడు దాని ధ్యేయం గురించి యిలా చెప్పారు. 'ఎవరికీ చెడు తలపెట్టకూడదు అందరికీ మంచి చేయాలి' అదే మానిటర్ లక్ష్యం.

వ్యక్తులకు వున్నట్టే పత్రికలకు కొన్ని ఉన్నతమైన లక్ష్యాలు వుండాలి. వాటిని నెరవేర్చడానికి మాంచెస్టర్ గార్డియన్ సంపాదకుడు సి.పి. స్కాట్ చెప్పినట్లు, మంచి విద్య, వివేకం సామర్థ్యం వుండాలి. వాటితో పాటు దృఢమైన మనసు బలహీనతకు చోటివ్వని, ధర్మ భావం పొందిక వుండాలి. ఒక నూతన దేశ పునర్వికాసాన్ని సంస్కృతి గొప్పతనాన్ని అభివృద్ధి చేస్తూ కాపాడుతూ వచ్చే గొప్ప కార్యక్రమంలో భాగస్వాములుగా వున్న మనం అందరమూ పత్రికలకు సంబంధించిన ఈ పవిత్ర ధర్మాన్ని జ్ఞాపకం వుంచుకోవడం చాలా మంచిది.

1962వ సం॥ 'మాతృభూమి' ఎర్నాకుళం నుంచి ప్రచురించడం ప్రారంభించగానే దాని కీర్తి ప్రకాశించింది. గౌరవం పెరిగింది. ఆదాయం కూడా బాగా ఎక్కువయింది. గత సంవత్సరం నికర ఆదాయం ఒక కోటిని దాటింది. ఈ రోజుల్లో రెండు లక్షలకన్నా ఎక్కువగానే పత్రికలు అచ్చవుతున్నాయి. కేరళ ప్రజల హృదయాలలో, 'మాతృభూమి'కి వున్న గౌరవాన్ని యిదే ఋజువు చేసింది. సాధారణ ప్రజలు కూడా 'మాతృభూమి'ని తమ పత్రికగానే భావిస్తున్నారు. 'మాతృభూమి' ఈర్ష్య కలిగించే ఈ అభివృద్ధిని నిరోధించడానికి ఎవరు ఏ కృత్యంలో దిగినప్పటికీ అది క్షమింపరాని నేరంగా భావించతగ్గది. అటువంటి సాహసకృత్యానికి ఎవరూ పూనుకోకూడదన్నదే నా హృదయ పూర్వకమైన ప్రార్థన.

# ఇతర రంగాలు

చాలాకాలం మాతృదేశం నుంచి విదేశానికి వెళ్లి తిరిగి వచ్చిన తర్వాత పాత సంబంధాలను పునరుద్ధరించుకోవడానికి, కొత్తవారిని కలుసుకొని పరిచయం ఏర్పరచుకోవడానికి ముఖ్యమైన రాజకీయ పక్షాల నాయకుల గురించి తెలుసుకొవడానికి కొంత కాలం పడుతుంది. నా పరిస్థితి కూడా అవిధంగానే వుండేది. పరిస్థితులను బాగా అకళింపు చేసుకున్నాకగాని నేను రాజకీయ రంగంలో అడుగుపెట్టడానికి యిష్టపడలేదు. మద్రాసులో ఓడ నుంచి దిగిన రోజునే ఆనాటి కేరళ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుని వద్ద నుంచి నేను శాసన సభలో సభ్యుణ్ణి కావాలని కోరుతూ ఒక తంతి వచ్చింది. నేను 'మాతృభూమి' బాధ్యతలు చేపట్టాలనే ఆశించాను.

మళ్లీ కాంగ్రెస్‌లో చేరి కృషి చేసే ఉత్సాహం నాకు లేదు. అయితే కేరళలో కాంగ్రెస్ కార్యకలాపాల గురించీ, ముఖ్యంగా అందు పాల్గొన్న కాంగ్రెస్‌వాదుల గురించీ నేను బాగా తెలుసుకున్నాను. కాంగ్రెస్‌వారి మధ్యవున్న తగాదాలు వ్యక్తి గత విరోధాలు నాకు విచారం కలిగించాయి. అధికార దాహం, పదవీ వ్యామోహం, విపరీతంగా వుండేవి. ప్రజాక్షేమం కోసం తన కార్యకలాపాలను దానికి తగ్గట్టు కల్పించుకుని కృషి చేయవచ్చు. దానికి పెద్ద త్యాగం చెయ్యవలసింది లేదు. మామూలుగా గౌరవంగా సమాజంలో సేవ చేస్తూ వుండేవారంతా ప్రజాక్షేమం కోసరం పాటు పడవచ్చు. అటువంటి మనస్తత్వమే లేకపోవడం చూసి చాలా వేదన చెందాను. ఈ వేదనకు కారణమైన పరిస్థితులు, ఈ పుస్తకం విడుదల కానున్న ఈ రోజులలో మార్పు లేకుండానే వున్నాయి. చెప్పాలంటే యింకా అధ్వాన్నంగా తయారయ్యాయి. ప్రముఖులైన కొందరు కాంగ్రెస్‌వాళ్ల మధ్య స్నేహాన్ని ఏర్పరచడానికి ఎంతో ప్రయత్నించాను. విజయం సాధించినట్లు చెప్పడానికి లేదు.

కాంగ్రెస్ ఉద్యమంలో బహిరంగంగా నేను చేరలేదన్న మాటేగాక, కాంగ్రెస్ లక్ష్యాలలోనూ, కార్యకలాపాలలోనూ నాకు విశ్వాసం వుండేది. 1915వ సం॥ నేను కాంగ్రెస్‌లో చేరినప్పటినుంచీ ఈనాటి వరకు ఆ మహా సంస్థ పట్ల నా ప్రేమ, విశ్వాసం ధృఢంగా మారకుండా వున్నాయి. కొందరు కాంగ్రెస్ వాదుల పనులు పార్టీకి పనికిరానివని నేను ఒప్పుకోకుండా వుండలేను. అయినప్పటికీ

ఆ మహాసంస్థ మీదున్న గౌరవం తగ్గిపోదు. ఆ సంస్థ పేరు మీదుగా వారు చేసే అవకతవక పనులు చూసి సహించలేక పోయాను. స్వాతంత్ర్యోద్యమ కాలంలో అందులో పూర్తిగా పాల్గొన్న జాతీయ పక్షం. అదొక్కటే అయితే, స్వతంత్రం పొందిన తర్వాత దేశంలో ఎన్నో రాజకీయ పక్షాలు ఆవిర్భవించాయి. వాటిలో కాంగ్రెస్ కూడ ఒక రాజకీయ పక్షంగా నిలబడింది. అయినప్పటికీ అధికార పక్షంగా ప్రత్యేక ప్రాముఖ్యతను సంతరించుకుంది.

నూతన ప్రజా స్వామ్య వ్యవస్థను సుస్థిరం చేయడానికి పార్టీలు రూపొందించడానికి, మనం ఇంగ్లండును అనుసరించే ప్రయత్నాలు చేశాము. కాంగ్రెస్ అన్న ఒక సంస్థ సక్రమంగా కార్యకలాపాలు కొనసాగించే విధంగా వాటి సభ్యుల మధ్య ఒక విధమైన తీరును, క్రమశిక్షణను ఏర్పరచి వుండవలసింది. ఈ రోజుల్లో 'ఖద్దరు ధరిస్తే' కాంగ్రెస్ వాళ్లు అని భావించే వాళ్లే ఎక్కువ. ఖద్దరు కట్టకపోతే కాంగ్రెస్‌వాళ్లు కాదని చెప్పడానికి వెనుకాడరు. కాంగ్రెస్ పార్టీ వాళ్లంటే ఎవరు? కాంగ్రెస్ సిద్ధాంతాలలో లక్ష్యాలలోనూ మనఃపూర్వకంగా విశ్వసిస్తూ దాని కోసరం పాటుబడేవారే కాంగ్రెస్ వారులు. కాంగ్రెస్ సభ్యులు కావడానికి అవే అర్హతలు సామర్థ్యం, కార్యశీలత, సేవాహృదయమే, పార్టీలో ఒకరి స్థానాన్ని సుస్థిరం చేస్తుంది.

ఖద్దరు ధరించడంలో నమ్మకం లేకపోయినప్పటికీ కాంగ్రెస్ యితర సిద్ధాంతాలలో లక్ష్యాలలో సంపూర్ణ విశ్వాసం వున్న వాళ్లున్నారు. అయితే వాళ్లను నిజమైన కాంగ్రెస్ వారులుగా అంగీకరించడం లేదు. మనం మన సిద్ధాంతాలకు తగిన జీవితాన్ని ఏర్పరచుకున్నప్పుడు మనసుకు తృప్తి ఏర్పడుతుంది. దీనినే మనం ఆశిస్తాము. ఇతరులను తృప్తిపరచడానికి తను నమ్మని దానిని చెప్పడానికి, చేయడానికి పూనుకున్నట్లయితే అది తనకు తానే ఏర్పరచుకునే కీడు అవుతుందే కాని ప్రజా జీవితంలో గౌరవాన్ని అధికం చేయదు. అధః పతనానికే దారి తీస్తుంది.

'కాంగ్రెస్‌లో చేరి కృషి చేయలేదు' అనుకున్నప్పటికీ ఇతర రంగాలలో కృషి చేసే అవకాశం నాకు లభించింది.- కేరళలోనూ ఇతరత్ర వివిధ బహిరంగ సభలలో పాల్గొనడానికి నాకు ఆహ్వానం వచ్చింది. విద్యార్థులు, ఉపాధ్యాయులు, కార్మికులు మొదలైన వారి మహాసభలలో మతం, సమాజం, రాజకీయాలు, సాహిత్యం, సాంస్కృతిక సంస్థలకు చెందిన సభలలో ఉపన్యసించడం నాకు ఒక అలవాటయిపోయింది. ఈవిధంగా రకరకాల మనుషులతో సంబంధాలు పెంచుకుని, వారి వారి అభిప్రాయాలను, సమస్యలను తెలుసుకునే అవకాశం లభించింది. దేశ ప్రజలతో సంబంధం పెంచుకోవడం వల్ల ఏర్పడే విస్తృతమైన జ్ఞానం అనుభవం, ప్రజా జీవితంలో పాల్గొనేవారికి ఒక వరప్రసాదమనే

చెప్పాలి. ఎన్ని పుస్తకాలు చదివినప్పటికీ, ప్రజలను ప్రత్యక్షంగా కలుసుకోవడం ద్వారా పొందే జ్ఞానం, అనుభవం ప్రత్యేకమైనవి.

1948 వ సం॥ అక్టోబర్‌లో 'గతకాలం భవిష్యత్కాలం' (భూతవుమ్ - భావియుం) అన్న పుస్తకాన్ని నేను ప్రచురించాను. సింగపూర్‌లో వున్నప్పుడే ఆ పుస్తకంలో మూడువంతులు నేను పూర్తిచేశాను. యుద్ధకాల అనుభవాలను గురించి, 'మాతృభూమి'లో ప్రచురించిన వ్యాసాలను, కొన్ని మార్పులు చేసి ప్రచురించిన ఆ పుస్తకంలో చారిత్రక ప్రాముఖ్యత పొందిన సంఘటనలను నా బుద్ధికి అందినవిధంగా వివరించడానికి ప్రయత్నించాను. నాకు ఏర్పడ్డ అనుభవాలు నాలో వున్న భావాలు, మాత్రమే నేను చర్చించాను. తన పుస్తకాన్ని ప్రజలు ఆదరిస్తున్నారని తెలుసుకోవడం రచయితకు ఎంతటి ఆనందాన్ని కలిగిస్తుంది? .

మలబారు లోకల్ లైబ్రరీ అథారిటీ అధ్యక్ష పదవిని నేను ఒక సంవత్సర కాలం వహించాను. మలబార్ జిల్లాలో గ్రంధాలయాలు అభివృద్ధి చేసే ఉద్దేశంతో మద్రాసు ప్రభుత్వం చేపట్టిన పథకం అది. గ్రామాలలోనూ, పంచాయతీలలోనూ, పట్టణాలలోనూ గ్రంథాలయాలు స్థాపించే నియమావళిని, నడిపించే పద్ధతిని మేము రూపొందించాము. మద్రాసు జనరల్ లైబ్రరీ చట్ట ప్రకారం స్థాపించిన ఉద్యమం యిది. ఇప్పుడది పురోగమిస్తోంది.

1949 సం॥లో కోళిక్కోడ్‌లో రోటరీ క్లబ్ ప్రారంభించిన నాటి నుంచి నేను అందులో సభ్యుణ్ణి. అంతకు పూర్వం నుంచే రోటరీ క్లబ్ కార్యకలాపాల పట్ల నాకు ఉత్సాహం వుండేది. ఇటీవలి స్వల్పకాలంలో మెచ్చుకోదగ్గ పలు కార్యక్రమాలను నిర్వహించింది కోళిక్కోడ్ రోటరీ క్లబ్. వివిధ వృత్తులు చేపట్టిన గౌరవనీయులైన వ్యక్తులమధ్య స్నేహభావాన్ని పెంపొందించడం, వ్యవహరించే తీరులో మంచి ఉదాహరణగా వుండడానికి రోగస్తులను, అనాధలను ఆదుకోవడానికి, సామాజిక జీవనంలో సంతోషాన్ని వికాసాన్ని పెంపొందించడానికి రోటరీ క్లబ్బు చేస్తున్న కృషి ప్రశంసనీయమైనది. దాని చరిత్ర లక్ష్యాలు ప్రయత్నాలు తెలుసుకున్న తర్వాత రోటరీ క్లబ్ పట్ల గౌరవం మరింత పెరుగుతుంది. మనిషిని ఉన్నతస్థితికి అభివృద్ధిచేసి సమాజానికి సేవ చేయడానికి రోటరీ ఉద్యమం చేస్తున్న ప్రయత్నాలను, దాని విజయాలను తెలుసుకున్నవారికి సంస్థ పట్ల మరింత గౌరవం ఏర్పడకపోదు.

అఖిల భారత పాత్రికేయుల మహాసభ కార్యకర్తల కమిటీలో నేను సభ్యునిగా వున్నాను. ఆ సభలో పాల్గొనడానికి తరుచుగా ఢిల్లీకి, ఇతర ప్రాంతాలకు వెళ్ళవలసివచ్చేది. పత్రికా రంగంలో వుంటున్నవారి సంఘాలు

దేశంలో ఎక్కువైపోయాయి. ఒకే వృత్తిలో వుంటున్న పలువురిని తెలుసుకుని, వృత్తి సంబంధమైన విషయాలను గురించి పరస్పరం తెలుసుకోవడానికి అవకాశం కల్పించిన పాత్రికేయుల మహాసభ, దాని కార్యకలాపాలు, ఇవాళ కూడా కొనసాగుతూనే వున్నాయి.

ఆ రోజులలో ఢిల్లీలో సమావేశమైన అఖిలభారత పాత్రికేయుల మహాసభలో జరిగిన ఒక సంఘటన జ్ఞాపకం చేసుకుంటున్నాను. మహాసభ కార్యక్రమాలను హిందీభాష లోనే జరిపించాలని తీర్మానం తీసుకొచ్చారు ఒక ఉత్తర భారతీయ సభ్యుడు. ఆ మహాసభలో దక్షిణాదివాళ్లు చాలామంది సభ్యులుగా వున్నారు. చాలావరకు వారికి హిందీ తెలియదు. అలా వున్నప్పుడు మహాసభ కార్యక్రమాలను హిందీలోనే జరపాలని తీర్మానం తీసుకొచ్చి ప్రవేశపెట్టడం అర్థరహితమని ఆ మిత్రుడు గ్రహించలేదు. ఆయన ఒక హిందీ అభిమాని. ఆంగ్లంలో మాట్లాడుకోవడం క్షమింపరాని అపరాధంగా భావించేవారు. తీర్మానాన్ని ఆయన ఉపసంహరించుకోలేదు. నేను తీర్మానాన్ని వ్యతిరేకించాను. మెజారిటీకి వదలడంతో తీర్మానాన్ని త్రోసివేశారు. ఇటువంటి మనస్తత్వం హిందీని వ్యాపింపజేయడానికి పెద్ద ఆటంకం అనడంలో సందేహంలేదు. అవసరం లేకుండానే హిందీని వ్యతిరేకించే వారిలాగానే హిందీని విస్తృతంగా విస్తరింపజేయాలన్న ఆలోచనను కార్యరూపంలో తీసుకురావడానికి ఒత్తిడి చేసే వారుకూడా, దేశ సమైక్యతకు అడ్డుగా నిలబడుతున్నారు.

# లంకలో భారత రాయబారి

1951 వ సంవత్సరం మార్చి నెలలో అఖిలభారత పాత్రికేయుల మహాసభ కార్యకమిటీ సమావేశానికి నేను ఢిల్లీ వెళ్లాను. మూడు రోజులు అక్కడ గడిపాను. మలబారుకు తిరిగి వెళ్లే రోజున ప్రధాని నెహ్రూ నన్ను కలుసుకోవడానికి రమ్మన్నట్టు వార్త అందింది. ప్రయాణాన్ని మర్నాడు వాయిదా వేశాను. అయన ఎందుకు నన్ను కలుసుకోమన్నారో కూడా ఊహించడానికి వీలుకాలేదు.

మర్నాడు ప్రధానమంత్రి భవనంలో అయన్ని కలుసుకున్నాను. నన్ను లంకకు భారతరాయబారిగా పంపడానికి ఉద్దేశించినట్లు అయన అప్పుడే తెలియజేశారు. ఆ విషయం గురించి మేము అరగంటసేపు మాట్లాడుకున్నాము. ముందుగా ఎటువంటి హెచ్చరికా లేకుండా ఉన్నట్టుండి, ఈ అభిప్రాయాన్ని వెలిబుచ్చడంతో, వెంటనే నేనేమి చెప్పలేక అంగీకారం తెలుపలేకపోయాను. మలబార్ వెళ్లిన తర్వాత తెలియజేస్తానని చెప్పి బయలుదేరాను.

సింగపూర్‌నుంచి వచ్చి రెండేళ్లు అయింది. మళ్లీ దేశం వదిలి వెళ్లడానికి నాకు యిష్టంలేదు. అయినప్పటికీ ప్రధాని ఆహ్వానాన్ని అంగీకరించాలనిపించింది. సి. రాజగోపాలచారి కూడా దానికి నన్ను ప్రోత్సహించారు. ఆ రోజుల్లో అయన ఢిల్లీ కేంద్ర మంత్రి మండలిలో సభ్యుల ఒకరుగా వున్నారు. ఢిల్లీ నుంచి వచ్చి ఎక్కువ రోజులు కావడానికి ముందే ఈ వార్తను తెలుపుతూ అధికారపూర్వకమైన ఒక ఉత్తరం విదేశ వ్యవహారాల మంత్రి కార్యాలయం నుంచి నాకు అందింది. సన్నిహిత మిత్రులతో చర్చించిన తర్వాత, నేను లంక వెళ్లడానికి అంగీకారం తెలియజేశాను.

వెంటనే 'మాతృభూమి' సంపాదక బాధ్యతను నిర్వహించడానికి సమర్థుడైన వ్యక్తిని వెతికే ప్రయత్నంలో దిగాను. అది అంత సులభంగా జరగలేదు. చాలామంది గొప్పవాళ్ల పేర్లు ఈ విషయంగా మేము ఆలోచించాము. శ్రీ ఏ.యం. నాయర్ జ్ఞాపకమే నాకు మొట్టమొదట వచ్చింది. ఆ రోజుల్లో అయన కలకత్తా నుంచి స్వస్థలం తిరిగి వచ్చారు. సహాయ నిరాకరణోద్యమ కాలంనుంచే అయన నాకు సుపరిచితులు. ఆరోజుల్లో ఏ.యం.నాయర్

బొంబాయిలో వుండేవారు. కేరళ కాంగ్రెస్ కార్యకలాపాలకు నిధి సేకరణ, 'మాతృభూమి' కంపెనీలో వాటాలు సేకరించడంలోనూ ఆయన ఎంతో సహాయం చేశారు. 'మాతృభూమి' ప్రారంభకాలంలోను, దాని అభివృద్ధి లోను ఆయన ఎంతో ఆసక్తి కనబరచారు. పత్రికా వృత్తిలోనూ ఆయన చాలా అనుభవజ్ఞులు. అప్పట్లో ఎ.యం. నాయర్‌లా కార్యదక్షత, అనుభవం, 'మాతృభూమి' పట్ల శ్రద్ధ, వున్న ఒక మిత్రుని ఎన్నుకోవడం సాధ్యంకాక పోయింది. నేను మొదట ఆయన్ను సంపాదక బాధ్యతలు స్వీకరించమన్నప్పుడు ఆయన అంగీకరించలేదు. అయినప్పటికీ నేను నిర్బంధం చేయగా తర్వాత అంగీకారం తెలియజేశారు. అది నా కెంతో ఒదార్పును, సంతోషాన్ని కలిగించింది. ఆయన పట్ల నేను వుంచిన విశ్వాసానికి తగ్గట్టు పదిహేను నెలల పాటు ఆ బాధ్యతను సక్రమంగా నెరవేర్చి, తన దక్షతను నిరూపించారు. ఇవాళ ఎ.యం.నాయర్ 'మాతృభూమి' పత్రిక నిర్వాహక సంపాదకులు, 'మాతృభూమి' కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్.

1951వ సం॥ మే నెల ముప్పయ్యోతేది 'మాతృభూమి' నుంచి, కోళిక్కోడ్ నుంచి సెలవు తీసుకుని నేను లంకకు బయలుదేరాను. నాతో భార్య, కూతురు లీల వచ్చారు. పాల్‌ఘాట్ లోనూ, మద్రాసులోను రెండు రోజులు గడిపి, మండపం ద్వారా పయనం చేసి జూన్ ఏడోతేది కొలంబోకు వచ్చాను. కొలంబో రైలు స్టేషన్‌లో నాకిచ్చిన స్వాగతం మరువలేనిది, ఒక రాయబారి అన్న ఉద్యోగికి యిచ్చిన స్వాగతం మాత్రం కాదది. లంక - భారతదేశంల సుహృద్భావం సంతోషాన్ని చాటేదిగా వున్నదది. మలయాళీలు అందులో పాల్గొన్నారు. ఆరోజు పదకొండు గంటలకు శ్రీ ఎన్.ఎ.యన్. రాఘవచారి నుంచి నేను బాధ్యతలు స్వీకరించాను. 1951వ సంవత్సరం జూన్ ఎడవతేదీన, నేను లంకలో భారత రాయబారినయ్యాను.

భారత దేశం, లంకకు మధ్య చాలా కాలంనుంచే సంబంధాలు వున్నాయి. దాదాపు రెండువేల అయిదువందల సంవత్సరాల క్రితమే ప్రప్రథంగా ఆర్యులు భారతదేశం నుంచి లంకకు వెళ్లారని చెప్పబడుతోంది. సింహాళీయుల పూర్వీకులు బెంగాల్ సమీపం నుంచి లంకకు వచ్చి చేరిన వాళ్లు. ప్రారంభంలో పలు ప్రాంతాలలో విడివిడిగా గుంపులుగా నివసించేవాళ్లు. తర్వాత ఒకరినొకరు జయించడానికి తమలో తాము పోట్లాడుకోసాగారు. ఆ పోరాటంలో కొన్ని గుంపులకు సహాయంగా మలబారు నుంచి సైనిక వీరులను తీసుకువెళ్లినట్లు చరిత్ర చెబుతోంది. ఆర్యులు అక్కడ చేరడానికి పూర్వమే దక్షిణ భారతం నుంచి తమిళులు లంకకు వలస వెళ్లి స్థిరపడటం ప్రారంభించారు. ఉత్తర భారతం నుంచి విజయన్ అనే రాజు, అతని

సహచరులు ఏడువందల మంది లంకకు వచ్చిన తర్వాతే లంక చరిత్ర ప్రారంభమయిందని మరికొందరు భావిస్తున్నారు. అది క్రీస్తు జన్మించడానికి ఆరువందల సంవత్సరాలక్రితం జరిగిన సంఘటన.

తర్వాత మూడు శతాబ్దాలు గడిచాయి. అశోక చక్రవర్తి కుమారుడు మహేంద్రుడు, బౌద్ధమత సిద్ధాంతాలను వ్యాపింపచేయడానికి శ్రీలంక వెళ్లాడు. సింహళీయులను బౌద్ధ మత స్వీకారానికి పురికొల్పినవాడు మహేంద్రుడు. వారి మితిమించిన భక్తి విశ్వాసాలకు ఉదాహరణగా పలు బౌద్ధ విహారాలు అక్కడ వెలిశాయి. వాటి చిహ్నాలను యింకా అక్కడ చూడవచ్చు. భారతీయుల సాంస్కృతిక ఆచారాలు అక్కడ చాలా వ్యాపించాయి. అయినప్పటికీ భారతదేశానికి భిన్నంగా వున్న లంక ద్వీపంలో ప్రజలు తమ ప్రత్యేకతలను నాగరికతను అభివృద్ధి చేసుకుంటూ వస్తున్నారు.

రకరకాల జాతుల వారిని శ్రీలంకలో చూడవచ్చు, కాని అక్కడ సింహళీయులు, తమిళులు మాత్రమే ఎక్కువగా నివసిస్తున్నారు. ఎనభై లక్షలకు పైగా వున్న జనాభా వున్న శ్రీలంకలో అరవైయేడు శాతం మంది సింహళీయులు, వాళ్లు బౌద్ధమతం అవలంబించేవారు. తమిళులు శ్రీలంకలో పది లక్షల మంది ఉన్నారు. హిందువులైన తమిళులు ముఖ్యంగా యాళ్‌పాను లోనే అధికంగా వుంటున్నారు. వీరే కాకుండా అరేబియన్లు, చట్టకారర్ (ఆంగ్లోయిండియన్స్), తెల్ల వాళ్లు శ్రీలంకలో వుంటున్నారు. భారతదేశం నుంచి కూలీ పనులు, యితర పనులు చేయడానికి అక్కడికి వెళ్లిన ఎనిమిది లక్షల మందిలో అధిక సంఖ్యాకులు తేయాకు తోటల్లో పనిచేస్తున్నారు. చిల్లరమల్లర వృత్తులు చేసేవాళ్లు, ఉద్యోగాలు చేసేవాళ్లు, గుమాస్తాలు, మొదలైన భారతీయులందరూ ఈ విభాగం కిందికే వస్తారు. శ్రీలంక - భారతీయుల సమస్య గురించి మనం రకరకాలుగా వింటున్నాం కదా? కూలి పనులు కోసరం, మిగతా తోటపనుల కోసరం అక్కడ నివసిస్తున్న భారతీయులకు సంబంధించిన సమస్యే అది.

ఒక కాలంలో శ్రీలంక మద్రాసు ప్రభుత్వానికి లోబడి వుండేది. 1802వ సం॥ తర్వాతే శ్రీలంక ఒక క్రౌన్ కాలనీ అయింది, వలసదేశంగా వుండడంవల్ల అక్కడున్న తేయాకు తోటలలోనూ, రబ్బరు తోటలలోనూ, పనులు చేయడానికి దక్షిణ భారతదేశం నుంచి చాలా మంది ప్రజలు శ్రీలంక వెళ్లారు. అలా వెళ్లిన వారు అందరూ తమిళనాడుకు చెందినవాళ్లే. క్రమ క్రమంగా అక్కడే స్థిరపడ్డారు. వాళ్ల శ్రమ ప్రయత్నం ఫలితంగానే శ్రీలంకలో తేయాకు తోటలు ఆశ్చర్యకరమైన అభివృద్ధిని సాధించాయి.

శ్రీ లంకలో రబ్బరు, కొబ్బరి, తేయాకు, ఈ మూడూ ముఖ్యమైన ఎగుమతి వస్తువులు. వీటిలో ప్రధమ స్థానం తేయాకు ఆక్రమిస్తుంది. 1952వ సం॥ లో ముప్పైరెండు కోట్ల రూపాయల విలువ వున్న తేయాకు అక్కడి నుంచి విదేశాలకు ఎగుమతి చేసినట్లు తెలుస్తోంది. ఎనిమిదిన్నర లక్షల మంది తేయాకు తోటలలో, పనిచేసి పొట్ట పోసుకుంటున్నారు. వాళ్లలో ఎనభై శాతం మంది భారతీయులే. తేయాకు తోటలలో పనిచేసే కార్మికులు చాలా అనుభవం, ప్రత్యేక శిక్షణ పొందినవాళ్లు. సింహాళీయులకు గాని, మిగతా వాళ్లకు గాని వాళ్లలా సమర్థతతో పనిచేయడం చేతకాలేదు. ఈవిధంగా శ్రీలంకలో తేయాకు తోటల్లో పెట్టుబడి పెట్టిన వారు - బంగారు పండించడానికి కావలసిన శరీర శ్రమ ధారపోసే తమిళులకు, ఆ నేల మీద జీవించడానికి కావలసిన పౌరహక్కులను యివ్వడానికి సింహాళీయులు ఒప్పుకోలేదు. తోట పనుల కోసరం, భారతదేశం నుంచి శ్రీలంకకు మనుష్యుల్ని తీసుకుపోయే అలవాటును మానేశారు. శ్రీలంకలో ఇవాళ వుంటున్న భారతీయులకు అక్కడ నివసించే పౌరహక్కులు సాధించి పెట్టడమే ఇవాల్టి సమస్య. ఆ భూమిని తమ సొంత భూమిగా భావించి, అక్కడే స్థిరంగా వుండాలనుకున్న భారతీయులకు పౌరహక్కులు ఇవ్వాలన్నది మన వాదం. భారతీయులకు పౌరహక్కులను యిచ్చే విషయంగా కొన్ని చట్టాలను శ్రీలంక ప్రభుత్వం ఏర్పరచింది. దానికి తగ్గట్టు శ్రీలంక పౌరహక్కుల కోసరం, చాలామంది భారతీయులు విజ్ఞాపనలు చేశారు. అయితే అలా కోరుకున్నవారిలో కొందరికి మాత్రమే పౌరహక్కులు యివ్వబడ్డాయి. ఏవేవో కారణాలు చూపి మిగతా వారి అభ్యర్థనలు చెల్లవని తోసి పారేశారు. ఈవిధంగా భారత - శ్రీలంక సమస్య క్లిష్టంగా వున్న రోజులలోనే నేను అక్కడికి రాయబారిగా బాధ్యతలు చేపట్టడానికి వెళ్లాను.

రాయబారిగా చేరి మూడురోజులు గడిచాక, నేను శ్రీలంక ప్రధాని సేనా నాయకాను, ఆయన కార్యాలయానికి వెళ్లి కలుసుకున్నాను. నాతో పాటు కౌన్సిలర్, ఎన్.ఇ.ఎన్ రాఘవచారి కూడ వచ్చారు. నేనూ, ప్రధాని అరగంటసేపు మాట్లాడుకున్నాము. ఒకరినొకరు పరిచయం చేసుకునే మొదటి సమావేశం అది. ఆ తర్వాత ఆయనను నేను చాలా సార్లు కలుసుకున్నాను. మా మధ్య వివిధ అభిప్రాయబేధాలు వున్నప్పటికీ, వ్యక్తిగతంగా స్నేహపూర్వకంగా మెలుగుతూ వచ్చాము. సేనా నాయకా నాయకత్వం, కార్యదక్షత, ఉదాత్త గుణాన్ని తెలుసుకునే అవకాశాలు ఎన్నో కలిగాయి. శ్రీలంక జాతీయ నాయకుల మధ్య చాలా ఉన్నతమైన గౌరవ స్థానాన్ని పొందనవారు ఆయన అనడంలో సందేహంలేదు.

సేనానాయకాను ఒక పరిపూర్ణ రాజకీయ మేధావి అని చెప్పడానికి లేదు. పెద్దగా వాగ్దాటిలేదు. అంతర్జాతీయ విషయాల గురించి అవగాహన కూడా ఆయనకు అంతగా లేదు. అటువంటి ప్రత్యేక అర్హతలేవీలేకుండా, స్వతంత్ర సింహాళ ప్రధానిగా తన దేశ ప్రజల, ప్రేమకు, గౌరవానికి, విశ్వాసానికి పాత్రుడు కావడం ఆశ్చర్యం కలిగించే అంశం! సేనానాయకా చరిత్రను విశిష్టత ఏమిటి? అని నేను ఆయన చిరకాల మిత్రుని అడిగినప్పుడు 'సేనా నాయకా హృదయ పూర్వకమైన నిబద్ధతే ఆయనకీ ఉన్నత స్థానాన్ని కల్పించింది' అన్నారు. మిత్రుల పట్ల తమ సహాయాన్ని కోరిన వారి పట్ల, తనతో కలిసి పనిచేసేవారి విషయంలోనూ ఆయన చూపే హృదయపూర్వకమైన ప్రేమానురాగాలు ఆయనలోని విశిష్టగుణం.

ఎటువంటి సమస్యనైనా అకళింపు చేసుకుని పరిష్కరించే సామర్థ్యం ఆయనకున్నది. చర్చించడంలో సేనానాయకాను మించే వాళ్లు వుండవచ్చు. అయినప్పటికీ చర్చ అంతా ముగిసిన తర్వాత సేనానాయకా ఆ విషయం గురించి కొన్ని మాటలు చెప్పడం ప్రారంభిస్తే, 'ఇంత సులభమా యిది' అని వినేవారు ఆశ్చర్యం చెందే విధంగా ఆయన సమస్యకు సంబంధించిన విషయాన్ని తేటతెల్లం చేసేవారు. ఒక తీర్మానానికి వచ్చినట్లయితే ఆ తర్వాత ఎంత చెప్పినా ఆ అభిప్రాయాన్ని మార్చుకోవడానికి సమ్మతించేవారు కారు. అహంభావం, పదవీగర్వం, దర్పం ఆయన వద్ద లేవు. ఒక సాధారణ రైతుగా వుండి దేశ ప్రధాని పదవికి ఎదిగిన సేనానాయకా, ప్రతి సమస్యనూ సగటు మనిషి దృక్కోణం నుంచే పరిశీలించేవారు.

ఒక రాయబారిగా నా అధికార పత్రాలను గవర్నర్ జనరల్ సమక్షంలో సమర్పించడానికి మూడు రోజులు వేచి వున్నాను. నేను కొలంబో వెళ్లిన సమయంలో గవర్నర్ జనరల్ సోల్‌బరీ ప్రభువు అక్కడ లేరు. అందువల్లే ఉద్యోగరీత్యా జరగవలసిన ఆ కార్యక్రమం నిర్వహించడానికి కొంత ఆలస్యమయింది. ఇటువంటి కార్యక్రమం నిర్వహించడానికి కొంత సక్రమంగా జరిపే విధానంలో, బ్రిటీష్‌వారు తమ సాంప్రదాయాన్ని గొప్పదనాన్ని కొనసాగిస్తున్నారు. నిర్ణీత సమయంలో, దౌత్యకార్యాలయం ప్రధాన కార్యదర్శితో పాటు నేను ప్రభుత్వ భవనానికి వెళ్లాను. అక్కడినుంచి అధికారులు నన్ను ఆహ్వానించి, మేడమీదికి తీసుకువెళ్లారు. పెద్దహాల్లో నేను అడుగుపెట్టగానే గవర్నర్ జనరల్ అక్కడికి వచ్చారు. కొంతసేపు మాట్లాడుకున్న తర్వాత నేను నా పదవికి సంబంధించిన పత్రాలను సమర్పించాను. తర్వాత తిరిగి వచ్చాను. ఈ కార్యక్రమంతో నేను పదవీ స్వీకారం చేసినట్లయింది.

సోల్‌బరీ ప్రభువు రాజనీతిలో ఆరితేరిన దిట్ట. శ్రీలంక పరిపాలనా సంస్కరణల గురించి విచారణ జరిపి, నివేదిక తయారు చేయడానికి ఏర్పడిన కమీషన్‌కు ఆయనే అధ్యక్షులు, అందువల్లనే శ్రీలంక స్వాతంత్ర్యం పొందగానే, ప్రప్రథమమంగా గవర్నర్ జనరల్‌గా సోల్‌బరీ ప్రభువును నియమించారు.

ఆరోజుల్లో ఆయనకు డెబ్బై ఏళ్లుండేవి. అయినప్పటికి మంచి దృఢమైన దేహారోగ్యంతోనూ, ఉత్సాహంతోనూ వుండేవారు. అన్ని పరిస్థితుల లోనూ ఇతరుల పట్ల ప్రేమతోనూ, గౌరవప్రదంగానూ, మసలుకునేవారు. ఏ విషయం గురించైనా ఉపన్యసించగల సమర్థులు. వ్యక్తులను పరిచయం చేసుకోవడానికీ, వారితో సరసంగా సంభాషణలు జరపడానికి సమర్థులు కావడంచేతే ఆయన ప్రజల ఆదరాభిమానాలు చూరగొన్న గవర్నర్‌గా భావించారు. సోల్‌బరీ పదవీ విరమణ చేసిన తర్వాత శ్రీలంకలో బ్రిటీష్ గవర్నర్ జనరల్ లేని పరిస్థితి ఏర్పడింది. ఆ పదవిని సింహళీయులే చేపట్టారు.

గవర్నర్ జనరల్, ప్రధాన మంత్రి, రాయబారులు భారతీయ సంస్థల ఆధ్వర్యంలో కొన్నాళ్లు పాటు విందులు కొనసాగాయి. హైకమీషనర్ వివిధ కార్యాకలాపాల్లో విందుల్లో పాల్గొనడం ఏర్పాటుచేయడం ద్వారా ప్రముఖులతో సంబంధాలు పెంచుకోవడం కూడ ఒకటి. విందు ఏర్పాట్లు చేయడంలో ఒక విధమైన కళాత్మకమైన అంశమూ వుంది. విందు సక్రమంగా జరగడానికి మొదట ఒక పథకం తయారు చేసుకోవాలి. వచ్చిన వారిని పట్టించుకోలేదనే, వాళ్లకు సౌకర్యాలు కల్పించడంలో లోపం వాటిల్లిందనే, ఎలాంటి లోపమూ కలుగకుండా, చిన్న చిన్న విషయాలలో కూడ, జాగ్రత్తగా వ్యవహరించాలి.

1952 సం॥ జనవరి నెలలో భారత రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా మా యింట్లో నేనొక విందు ఏర్పాటు చేశాను. ఆరువందలకు పైగా ఆహ్వానితులు వచ్చారు. రకరకాల వినోద కార్యక్రమాలు రకరకాల రుచికరమైన వంటకాలతోపాటు, ఉత్సాహకరమైన వినోద కార్యక్రమాలు, ఆహ్వానితులకు ఆనందం కలిగించాయి. విందు కార్యక్రమం తర్వాత అందులో పాల్గొన్న కొందరు ఆంగ్లేయులు నాతో ఇలా అన్నారు.

'ఈ విందు వైభవం, మాకెంతో ఆనందాన్ని కల్గించడం మాత్రమే కాదు. మీ దేశ గౌరవాన్ని కూడా పెంచింది'. రాయబారి నివసించే భవనంలో ఆనంద జీవనానికి కావలసిన సకల సదుపాయాలు వున్నాయి. భారత దేశ గౌరవ ప్రతిష్ఠలకు, తగ్గవిధంగా దౌత్యకార్యాలయం, రాయబారి నివాసం గొప్పగా వున్నాయి. గౌరవనీయమైన పదవుల్లో వున్న జీవితంలో ఒక క్రమం, ఔన్నత్యంతో జీవించడం, ఆ ఉన్నత పదవికి తగిన గౌరవాన్ని ప్రసాదిస్తుంది.

అంతేకాదు సక్రమమైన ప్రవర్తన, ఔన్నత్యం ఆరోగ్యకరమైన ప్రజా జీవితానికి చాలా అవసరం కూడా.

శ్రీలంకలో భారత దౌత్య కార్యాలయం చాలా పెద్ద సంస్థ. అక్కడ పనిచేసే వాళ్లు సంఖ్యను బట్టి చెప్పాలంటే, శ్రీలంకలో వున్న మిగతా దౌత్యకార్యాలయాన్ని కంటే భారత దౌత్య కార్యలయమే చాలా పెద్దదని చెప్పాలి. నిర్ణీత సమయానికి కార్యాలయానికి వెళ్లడం చాలా ముఖ్యమని నేను భావించాను. వివిధ విషయాల గురించి నాతో మాట్లడడానికి చాలామంది వచ్చేవారు. వారి వారి అవసరాలు తీర్చడానికి, ఆలస్యం కాకూడదన్నది నా ఉద్దేశ్యం. కార్యాలయంలో మిగతావారు కూడా తమ బాధ్యతలను వెంటవెంటనే నెరవేర్చాలని ఆనతి జారీ చేశాను.

శ్రీలంక ప్రకృతి సౌందర్యం నిండినది. నయనానందకరమైన దృశ్యాలు, చరిత్ర ప్రాముఖ్యత వున్న స్థలాలూవున్న ప్రదేశం. వినోద యాత్ర చేసే వారికి కావలసిన సదుపాయాలు విరివిగా ఏర్పాటు చేయబడ్డాయి. నేను తరచూ వాటిని చూడడానికి వెళ్లడం కద్దు. చాలావరకు కారులోనే వెళ్లేవాణ్ణి. శ్రీలంకలో మంచి రోడ్డు సౌకర్యాలు వున్నాయి.

ప్రతి యేడాదీ కండిలో జరిగే 'బెరహార' ఉత్సవం చూడడానికి వేలకొలది వచ్చేవారు. ఆ ఉత్సవం బుద్ధుని పవిత్ర దంతాన్ని ఊరేగించే దృశ్యం. ప్రజలకు, భక్తి పారవశ్యం కలిగించేది. ఏనుగులు మెల్లిగా వెళ్లాలంటే వివిధ సంగీత యంత్రాలతో, దీపాల తోరణాలు, ఆటపాటలతో సాగే ఆ పొడవైన ఊరేగింపు రాత్రి సమయాన్ని దేదీప్యంచేస్తూ కండి ముఖ్య వీధుల గుండా వెళ్తుంది.

బుద్ధదేవుని ఆ పవిత్ర దంతం బెంగాల్ నుంచి నాలుగవ శతాబ్దంలో శ్రీలంకకు తీసుకురాబడింది. కండిలో ఒక పెద్ద విహారంలో జాగ్రత్తగా భద్రపరచివున్నారు. దాన్ని భద్రపరచే వున్నగది ద్వారబంధమే బంగారు, వెండితో పూతపనిచేయబడి వుంది. ఆ గదిలోపల అందమైన శిల్ప చాతుర్యం వెదజల్లే ఒక ఎత్తయిన వెండి పీఠం మధ్య అమర్చిన ఇనుప కంచె నుంచి ఆ పవిత్ర దంతాన్ని దర్శించవచ్చు. ప్రపంచంలో బౌద్ధమతానికి చెందిన ప్రజలందరూ ఇక్కడికి పవిత్ర యాత్ర కోసం వస్తారు. సన్యాసుల దుస్తులు ధరించి, మంత్రాలు వల్లిస్తూ కూర్చుని అటూ ఇటూ తిరుగుతూ వున్న బౌద్ధమత సన్యాసులను - చేతుల్లో పువ్వులతో, పూజాద్రవ్యాలతో వచ్చే ప్రజలను, ఆలయం ప్రాంగణంలోపలా బయటా చూడవచ్చు.

ప్రతియేటా జూలై, ఆగష్టు నెలల్లో ఈ ఉత్సవాన్ని చేస్తారు. చక్కగా అలంకరించిన ఒక ఏనుగు మీద దానికని అర్హతగల ధర్మాత్ములు, ఆ పవిత్ర

చిహ్నాల్ని భక్తిపూర్వకంగా అమర్చుతారు. శ్రీలంకలో మహోత్సవాన్ని చూడడానికి, స్వదేశంనుంచి మాత్రమే కాకుండా, విదేశాల నుంచి కూడా ప్రజలు కండికి వస్తారు. ఇంత జనం గుమికూడే మరే ఉత్సవాన్ని శ్రీలంకలో చూడలేము.

నేను చాలాసార్లు కండికి వెళ్లాను. ఒకసారి కండినుంచి కొలంబో తిరిగి వచ్చిన రోజున జరిగిన ఒక సంఘటన, శ్రీలంకలో ఉన్న కాలంలో జరిగిన సంఘటనలల్లో మరిచిపోని ఒక సంఘటన.

ఆ రోజు కండి నుంచి మేము కొలంబో తిరిగి వచ్చినప్పుడు రాత్రి ఎనిమిదైంది. అమ్ము, లీల నాతో వున్నారు. మా యిల్లు కొలంబో హార్బర్ రోడ్డులో వుండేది. ఆ పెద్ద భవనంలో యిద్దరు ముగ్గురు నౌకర్లు వుండేవాళ్లు. ఇక తోటపనివాడు, వంటపనివాడు, డ్రైవర్, అటెండర్లు, కొందరు మాతో వుండేవారు. వాళ్లు కింద అంతస్థులో పడుకునే వాళ్లు. మేడ మీద ఒక గదిలో నేనూ, అమ్ము, వుంటే పక్క గదిలో లీల పడుకొవడానికి వెళ్లింది. ప్రయాణపు అలసట ఎక్కువగా వుండడం వల్ల మేము ముగ్గురం పదకొండు గంటలకల్లా బాగా నిద్రపోయాము. వాకిటి తలుపులు మేడమెట్ల వాకిలి, అన్ని బాగా మూసివేశాము. రాత్రి రెండు గంటల సమయంలో, పక్కగది నుంచి లీల ఆర్తనాదం వినిపించింది. నేను వెంటనే అక్కడికి వెళ్లాను. అమ్ము నా వెనకనే ఆ గదిలోకి వచ్చింది. లైటువేసి చూస్తే లీల స్పృహ తప్పిపడివుంది. ఏదో ఒక అరుపు అరిచిందే తప్ప అడిగే ప్రశ్నలకు ఒక దానికీ జవాబు చెప్పలేని స్థితిలో పడివుంది. కింది నుంచి నౌకర్లు మేడమీదికి పరుగెత్తుకొని వచ్చారు. గదిలోపలి పెట్టి రెండు షెల్ఫులు తెరువబడివుండడం అప్పుడే గమనించాము. నగలన్ని దోచుకుపోయారు. కింది వాకిలి తెరచి వుంది. ఎక్కువసేపు గడవకుండా డాక్టర్‌ను రప్పించాము. పక్కయింట్లోనే వుంటున్న న్యాయశాఖా మంత్రి డాక్టర్ రాజపక్షి, వాళ్లావిడా వచ్చి సహాయం చేశారు. లీలకు స్పృహ రావడానికి ఒక గంటసేపు పట్టింది. ఆమె మాట్లాడ్డం ప్రారంభించిన తర్వాతే అసలు జరిగిన సంగతులు తెలిశాయి.

ఆమె బాగా నిద్ర పోతున్నప్పుడు ఎవరో వచ్చి మెడలోని గొలుసు లాగినట్లనిపించింది. కళ్లు తెరిచి చూస్తే మంచం పక్కన షర్టు ఫుల్‌ప్యాంట్ వేసుకున్న ఒకడు నిలబడ్డం కనిపించింది. ఆమె అరవడానికి నోరెత్తగానే ఆమె ముఖం మీద ఏదో పొడిచల్లాడు. అప్పుడు ఆమె అరిచింది. తర్వాత ఏం జరిగిందో ఆమెకు తెలియదు. ఆ దుష్టకృత్యం జ్ఞాపకం నుంచి బయట పడడానికి ఆమెకు రెండు రోజులు పట్టింది.

దొంగలు యిద్దరు ముగ్గురు వచ్చి వుండాలి. ఇంచు మించు రెండు వేల రూపాయల విలువ చేసే నగలు, చీరలు వాళ్లు దోచుకుపోయారు. వెంటనే అక్కడికి పోలీసు అధికారులు వచ్చారు. ఆ తర్వాత రెండు రోజులు చాలామంది వచ్చి మమ్మల్ని పరామర్శించారు. ప్రధాని సేనానాయకా కూడ వివరాలు తెలుసుకోవడానికి వచ్చారు. పోలీసువాళ్లు దోషులను పట్టుకోవడానికి ఎంతో ప్రయత్నించి నప్పటికీ దొంగలు దొరకలేదు. దొంగలించబడిన నగలూ దొరకలేదు. సందడి నిండిన నా శ్రీలంక జీవితంలో ఇదొక చేదైన అనుభవం.

# శ్రీలంక నుంచి తిరుగు ప్రయాణం

భారత్ - శ్రీలంక సమస్యకు పరిష్కారం వెతకటం కోసరం నేను చాలాసార్లు ప్రధాని సేనా నాయకాతో చర్చలు జరిపాను. పౌరహక్కులు కోరే భారతీయుల వాదాన్నిసుముఖమైన దృక్పథం నుంచి పరిశీలించడానికి వాళ్లు సిద్ధంగా లేరు. శ్రీలంకలో సుస్థిరంగా వుండాలనుకునే వారి సంఖ్యను వీలైనంతవరకూ తగ్గించడానికే ప్రధాని ఆశించారు. ఆ కోరికను పౌర సత్వ విన్నపాలను పరిశీలించి అనుమతి యివ్వడానికి హక్కు పొందివున్న అధికారులు వీలైనంతవరకునెరవేర్చారు.

ప్రజాస్వామ్య పరిపాలనా విధానం పునాదే ఓటు హక్కు కదా? శ్రీలంకను మాతృభూమిగా పొంది, అక్కడ స్థిరపడడానికి, నిశ్చయించినవారు మాత్రమే, అక్కడ ఓటు హక్కు పొందడానికి తగ్గ పౌరసత్వాన్ని పొందడానికి సాధ్యమా? అని శ్రీలంక వారు వాదించసాగారు. ఆ సిద్ధాంతం సరైనదే. ఆవిధంగా భావించే 1948వ సం॥ శ్రీలంక పౌరసత్వ చట్టాన్ని అమలులోకి తీసుకువచ్చారు. అంతకుముందు స్థిరపడే హక్కును నిర్ణయించే చట్టం ఏదీ లేదు. భారతీయులు స్థిరపడే హక్కును పరిమితం చేయడం కోసరమే ఒక ప్రత్యేక చట్టం 1949వ సం॥ అమలులోకి వచ్చింది. ఆ చట్టం ప్రకారం పౌరసత్వ హక్కులను కోరి, చాలామంది భారతీయులు ప్రభుత్వానికి విన్నపపత్రాలు సమర్పించుకున్నారు. అయితే అధికారులు ఏదో ఒక కారణాన్ని చూపి, వాటిని అనుమతించ కుండానే తోసివేశారు. పౌరసత్వం కోసరం వచ్చే విన్నప పత్రాలను, పరిశీలించే విషయంలో యింకా కొంచెం ఉదారత, న్యాయం చూపాలని నేను ప్రధానికి మనవిచేశాను. విదేశ వ్యవహారాలకు సంబంధించిన బాధ్యతలను ప్రధాన మంత్రే వహించడంవల్ల భారతీయ - పౌరసత్వానికి సంబంధించిన సమస్యలను సర్ ఆలివర్ గుణతిలకా విచారణ జరిపారు. తర్వాత కాలంలో ఆయనే శ్రీలంక గవర్నర్ జనరల్ అయ్యారు. ఆ రోజుల్లో సర్ ఆలివర్, శ్రీలంక మంత్రి మండలిలో ఒకరుగా వుండేవారు.

భారతీయుల పౌరసత్వం గురించి మంతనాలు జరపడానికి నేను చాలాసార్లు గుణతిలకాను కలుసుకున్నాను. ఎవర్నయినా ఇట్టే ఆకర్షించే స్వభావం కలవారు గుణతిలకా. మధురంగా మాట్లాడేవారు. హుందాగా

నడుచుకునేవారు. ఆయన వ్యక్తిగత అభిప్రాయం ఏదైనప్పటికీ సేనా నాయకా అభిప్రాయానుసారమే ఆయన వ్యవహరించడం సాధ్యం. ప్రధాని ఎక్కువమంది భారతీయులకు పౌరసత్వ హక్కులను యివ్వడానికి సుముఖంగా లేరు. సేనా నాయకా పదవీ కాలంలో భారత్ - శ్రీలంక సమస్యకు పరిష్కారం సులభంకాదని నేను గ్రహించాను. అయినప్పటికీ విసుగు చెందకుండా నేను ప్రయత్నం చేయసాగాను.

భారతీయుల పౌరహక్కుల కోసరం 'శ్రీలంక భారత్ కాంగ్రెస్' సుస్థిరమైన ప్రయత్నాలలో దిగింది. తర్వాతికాలంలో ఆ ఉద్యమమే 'డెమొక్రటిక్ కాంగ్రెస్'గా మారింది. దాని సభ్యులు చాలామంది తోటపని వాళ్లే. దాని నాయకులు చాలామందితో నేను సాన్నిహిత్యం పెంచుకున్నాను. అయినప్పటికీ వారి కార్యకలాపాలు ధోరణి నాకు నచ్చలేదు. అందువల్ల అవసరమన్న సందర్భాలలో మాత్రమే వాళ్ల అభిప్రాయాలను భావాలను అడిగి తెలుసుకునే వాణ్ణి. వాళ్ల ధోరణి నాకు నచ్చక పోవడంలాగే వారికీ నా కార్యకలాపాలు నచ్చకుండా పోయివుండవచ్చు. నావల్ల ఉద్యోగ వ్యవహారాలరీత్యా వాళ్లతో సాన్నిహిత్యం పెంచుకోవడం సాధ్యమయిందే తప్ప, స్నేహపూర్వకంగా కలసి చర్చించడానికి వీలుకాలేదు.

1952వ సం॥ ప్రారంభంలో శ్రీలంక ప్రభుత్వం ఒక బ్రహ్మాండమైన ప్రదర్శనశాల ఏర్పాటు చేసింది. అందులో వివిధ దేశాలూ, ముఖ్యంగా భారతదేశము పాల్గొన్నాయి. అట్టే వ్యవధి లేకపోవడంతో త్వరత్వరగా ఏర్పాట్లు చేయబడ్డాయి. అయినప్పటికీ ప్రదర్శనశాలలో భారతీయ విభాగం, మనసును ఆ ట్టుకున్నది. నెలరోజుల పాటు కొనసాగిన ఆ ప్రదర్శన ముగిసే ముందు శ్రీలంకలో ఒక అపాయం వాటిల్లింది.

ప్రధాని సేనా నాయకాకు గుఱ్ఱపు స్వారీ చేయడం చాలా సరదా. దాన్ని ఆయన తమ శరీర వ్యాయామంగా భావించేవారు. ప్రతి రోజూ ఉదయం ఒక గంటసేపు గుఱ్ఱపు స్వారీ చేయడం అలవాటు. ఒక రోజు ఆయన అలా సముద్రతీరంలో స్వారీ చేస్తున్నప్పుడు క్రిందపడి స్పృహ కోల్పోయారు. చాలామంది వైద్యవేత్తలు ఆయన ప్రాణాలు కాపాడడానికి ఎంతో ప్రయత్నించికూడా ప్రయోజనం లేకుండా పోయింది. 1952వ సం॥ మార్చి ఇరవై రెండో తేదీ ఆయన కాలం చేశారు.

శ్రీలంక ప్రజలు ఆయనకు శ్రద్ధాంజలి ఘటించడానికి అనువుగా ఆయన భౌతికదేహం ఒక వారంరోజుల పాటు ఒక బహిరంగ ప్రదేశంలో ఉంచబడింది. శ్రీలంకలోని వివిధ ప్రాంతాలనుంచి ప్రజలు, లక్షలాది మంది వచ్చి ఆయనకు అంజలి ఘటించారు. ఆరు రోజులు రాత్రి, పగలు అనే

భేదం లేకుండా శ్రద్ధాంజలి ఘటించడానికి ప్రజలు గుంపులు గుంపులుగా వచ్చి ఆయనపట్ల తమకున్న గౌరవాన్ని, అభిమాన్ని తెలియజేశారు. శవాన్ని స్మశానానికి తీసుకుపోయే దారిపొడవునా ప్రజలు గుమికూడడం ద్వారా ఆయన పట్ల ప్రజలకున్న గౌరవ మర్యాదలు ద్యోతకమయ్యాయి. వారి ఆచారాలతో చితికి నిప్పంటించబడినప్పుడు అక్కడ గుమిగూడిన ప్రజలు తమ నాయకునికి శ్రద్ధాంజలి ఘటించే విధంగా ఒకసారి వంగి నమస్కరించారు. స్టీఫన్ సేనా నాయకా జీవితం తెరమరుగయింది.

సేనా నాయకా మరణంతో శ్రీలంక అధికారపదవికి పోరాటం ఆరంభమైంది. చివరికి ఆయన కుమారుడు డడ్లీ సేనా నాయకానే చివరికి ఆ పదవికి ఎన్నుకున్నారు. తండ్రి తర్వాత తనయుడు ప్రధానమంత్రి అయ్యాడు.

తండ్రికున్న సామర్థ్యంగాని, పలుకుబడిగాని కుమారునికి లేదు. భారతీయులకు సంబంధించినంతవరకూ ఆయన కొంత ఉదారంగా వ్యవహరించగలడని అనుకున్నాము. ఎందుకంటే ఆయనతో నేను తొలిసారి మాట్లాడినప్పుడు ఆ నమ్మకం కలిగింది. ఆ స్థితిని భారతీయులకు అనుకూలంగా ఉపయోగించుకోవచ్చునని నేను భావించాను. ఒక నిర్ణీత సమయంలో ఆయన వద్ద వున్న పౌరసత్వ విన్నప పత్రాలు పరిశీలించి, ఫలితం తెలియచేయమని; అలా చేసేప్పుడు, చట్ట సంబంధమైన చిన్నచిన్న లోపాలను పట్టించుకోకుండా, విన్నపం చేసుకున్నవారికి సహాయపడమని నేను మనవి చేశాను. ఈ ప్రయత్నంలో నేను చాలామంది శ్రీలంక నాయకులను, అధికారులను కలుసుకుని మాట్లాడి, వారి ఆదరణ పొందగలిగాను. అప్పుడే 'శ్రీలంక - భారత్ కాంగ్రెస్' పౌరసత్వంహక్కుకోసం, సత్యాగ్రహ పోరాటంలో దిగింది.

డడ్లీ సేనానాయకా పదవీ బాధ్యతలు చేపట్టి ఎక్కువ రోజులు కాలేదు. ఆయన ఆ పదవిలో స్థిరపడడానికి కొంతకాలం పడుతుంది. ఈలోగా సత్యాగ్రహం చేపట్టడం వివేకం కాదని నేను భావించాను. నా అభిప్రాయాన్ని 'శ్రీలంక - భారత్ కాంగ్రెస్' వారికి తెలియజేయడానికి వెనుకాడలేదు. అయితే వాళ్లు వేచి చూడ్డానికి ఒప్పుకోలేదు.

కాంగ్రెస్ సత్యాగ్రహ పోరాటం ప్రారంభించారు. అది నిరాటకంగా కొనసాగింది. పౌరసత్వం కోరివచ్చిన విన్నపాలను పరిశీలించే పద్ధతుల గురించి ప్రధాన మంత్రి గుణతిలకా, విదేశాంగశాఖలో, కార్యదర్శి వున్న వైద్యనాధన్ మొదలైన వారిని కలుసుకుని చాలాసార్లు చర్చించాను. వాళ్లు నా అభిప్రాయాన్ని అంగీకరించారు. ఈ వివరాలను నేను అప్పటికప్పుడు ఢిల్లీకి తెలియజేస్తూ వచ్చాను. ఆ స్థితిలోనే నాకు ఢిల్లీనుంచి శ్రీలంక ప్రభుత్వంతో

నేను జరిపే చర్చలను తాత్కాలికంగా ఆపమని నాకు వర్తమానం అందింది. ఇది నాకెంతో ఆశ్చర్యం కలిగించింది. 'శ్రీలంక - భారత్ కాంగ్రెస్' ప్రోత్సాహంవల్లే ఢిల్లీనుంచి నాకు అటువంటి ఉత్తరువు వచ్చిందని అనిపించింది.

ఈ పరిస్థితిలో శ్రీ ఆర్. టి. చారిని శ్రీలంకకు భారత సహాయ రాయబారిగా నియమించింది, భారత ప్రభుత్వం. ఆయన శ్రీలంకలో పదవిని స్వీకరించడానికి వచ్చారు. ఒక సహాయ రాయబారిని నియమిస్తున్నట్లు నాకు ముందుగా తెలియజేయలేదు. పైగా నేను శ్రీలంక నుంచి భారత దేశానికి తిరిగి రానున్నట్లు కొన్నిరోజుల తర్వాత ఢిల్లీ పత్రికలు వార్తలు ప్రచురించాయి. భారత ప్రభుత్వం తమ సిద్ధాంతానికి అనుగుణంగా నేను తీసుకున్న చర్యలు తృప్తికరంగా భావించలేదని నాకు అనిపించింది.

ఈ పరిస్థితిలో యింకా నేను రాయబారిగా కొనసాగటం కష్టం అనిపించింది. అందువల్ల ఈ కారణాల వల్ల, ప్రభుత్వం కోరిన విధంగా 1952వ సం॥ సెప్టెంబర్ ఆరవతేదీ నేను రాయబారి పదవి నుంచి వైదొలిగాను. ఆ రోజే ప్రధాని నెహ్రూకు ఒక ఉత్తరం వ్రాశాను.

శ్రీలంకలో రాయబారిగా బాధ్యత స్వీకరించి ఆనాటికి పదిహేను నెలలు పూర్తి అవుతున్నాయని, ఆకాల పరిమితిలో నేను నా మనస్సాక్షికి అనుగుణంగా బాధ్యతలు చేపట్టి నెరవేర్చడానికి ప్రయత్నించినట్లు, శ్రీలంక ప్రభుత్వం పట్ల విశ్వాసంతో, భారతదేశం విశాల దృక్పధానికి అనుగుణంగా ఆచరణలో పెట్టడానికి కృషిచేసినట్లు ఆ ఉత్తరంలో తెలియజేశాను. ముఖ్యమైన వార్తలను, ఎక్కువ చేయకుండానూ, అర్థం చేసుకునీ అప్పటికప్పుడు తెలియజేస్తూ వచ్చిన విషయాలు ఉత్తరంలో వివరంగా తెలియజేశాను. నేను రాయబారి పదవిని స్వయంగా ఆశించి కోరుకున్నది కాదనీ, ప్రధాని ఆహ్వానాన్ని నా దేశం యిచ్చిన ఆనతిగా భావించి అంగీకరించినట్లు, తెలియజేసాను. ఆ ఉత్తరంలో యింకా శ్రీలంక ప్రభుత్వంతో చర్చలు కొనసాగించడం ఆపివేయమని తెలియజేసినందుకు నేను వివరణ అడిగాను. ఏదైనాసరే ఆచరణలో వున్న చర్చలను సుముఖంగా పూర్తిచేయడానికి అనుకూలమైన వాతావరణాన్ని సృష్టించడానికి నా చేతనైన ప్రయత్నాలన్నీ చేశామన్న తృప్తితో, శ్రీలంక నుంచి తిరుగు ప్రయాణమవుతున్నాననీ తెలియజేశాను.

అటువంటి ఉత్తరాన్ని నేనేదో కోపంతో రాయలేదనీ, అయినా ఢిల్లీలో తీసుకున్న చర్య నా మనసుకు వేదన కలిగిస్తున్నదనీ ప్రధానికి తెలియజేసాను.

ఈ ఉత్తరానికి పదిహేడో తేదీ ప్రధాని జవాబు పంపారు. శ్రీలంక భారత్ సమస్యకు సంబంధించినంతవరకు భారత ప్రభుత్వం అనుసరించే విధానంలో నాకు భారత ప్రభుత్వం మధ్య అభిప్రాయభేదం వున్నది. నిజమే అని ప్రధాన మంత్రి అంగీకరించారు. శ్రీలంక భారతీయులు తీసుకున్న చర్యలన్నీ సక్రమమైనవేనని భారత ప్రభుత్వం భావించలేదు. ఆ విషయం వారికి ప్రభుత్వం తెలియజేయడానికి వెనుకాడలేదు. అయితే తమ ఉద్దేశాలకు ఆదరణగా వుంటుందని భావించి వాళ్లు ప్రయత్నాన్ని కొనసాగించేప్పుడు, ఆవిధంగా చెయ్యకుండా అడ్డుపడటంలో భారత ప్రభుత్వం ఉద్దేశం కాదు అన్నదే ఆ ఉత్తరం సారాంశం. నా దృక్పధంలో కొన్ని గొప్ప నిజాలు లేకపోలేదనీ అయినప్పటికీ మన ప్రభుత్వం ధోరణి వేరు విధంగా వుందని ఆయన ప్రస్తావించారు. ప్రభుత్వ ధోరణిని ప్రభుత్వం కోరినవిధంగా వివరించడానికి నావల్ల వీలుకాకపోవడమే అభిప్రాయభేదానికి కారణం అని ప్రధాని బహిర్గతంగా తెలియజేశారు.

ఈ ఉత్తరానికి సెప్టెంబర్ ఇరవై ఆరవతేదీ నేను పంపిన జవాబు గురించి క్లుప్తంగా చెప్పుకోవాలి. శ్రీలంక - భారత్ సమస్యలను గురించి భారత ప్రభుత్వ సిద్ధాంతానికి భిన్నంగా నేను ప్రవర్తించడానికి ప్రయత్నించలేదనీ, అయితే నా అనుభవంలో భారత ప్రభుత్వ సిద్ధాంతాన్ని పునఃపరిశీలన చేయడం అవసరమని చెప్పే బాధ్యత నాకున్నదనీ నా జవాబులో తేటతెల్లంచేసాను. నా ప్రయత్నాలన్నీ సమస్యలకు పరిష్కార మార్గమని నేను విశ్వసించినట్లు, అవి సమస్యను కొనసాగించే ఉద్దేశంతో చేసినవి కావనీ, శ్రీలంకలో భారత రాయబారిగా భారత ప్రభుత్వంతో వున్న సంబంధం ఒక గుణపాఠంగా వుందనీ, నా ప్రజా జీవితంలో ఈ అనుభవం యింకా సహాయకారిగా వుండగలదనీ నేనా ఉత్తరంలో తెలియజేశాను.

నేను రాయబారిగా పదవినుంచి వైదొలగనున్నానన్న వార్త వెలువడినప్పుడు చాలామంది మిత్రులు దానికి కారణం అడిగారు. పత్రికల్లో చాలా ఊహలు వార్తలుగా వెలువడసాగాయి. ఆ సమయంలో మౌనంగా వుండడమే ఉచితంగా తోచింది.

దౌత్యకార్యాలయంలో నాతో పనిచేసిన పలువురు, అందజేసిన సహకారం చెప్పకోదగింది. వారు ప్రస్తుతం వివిధ దేశాలలో వుంటున్నారు. అయినప్పటికీ నేను వాళ్లతో యిప్పటికీ సన్నిహితంగానే వున్నాను. శ్రీలంకలో నా అంతరంగ కార్యదర్శిగా వున్న వెంకటాద్రిని గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలి. చాలా సమర్థులు, విశ్వాసపాత్రుడు. నా ఉద్దేశ్యం గ్రహించి పనిచేసేవారు. ఒక పనికూడా సగంలో నిలువదు, సాకులు చెప్పి తప్పుకోరు. నేను నమ్మినదాన్ని

వెంకటాద్రి చేస్తాడన్న దృఢమైన విశ్వాసంతో వుండవచ్చు. కొందరు పాత మిత్రులను నేను కొలంబోలో కలుసుకున్నాను. వారిలో పాకిస్థాన్ రాయబారి సర్దార్ సేఠ్‌ను యిక్కడ ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ఉత్తర మలబార్‌లో తలైచ్చేరిలో నివసించేవారాయన. సహాయనిరాకరణోద్యమ కాలంలో కాంగ్రెస్ ప్రముఖులలో ఆయన ఒకరు. తిలక్ స్వపరిపాలన నిధికి డబ్బు సేకరించే విషయంలో ఆయన ఎంతో సహకరించారు. దేశ సేవను ఉత్సాహంగా కొనసాగించడానికి సహకరించిన వారు సర్దార్. ఒకే లక్ష్యంతో భారత స్వాతంత్ర్య ఉద్యమంలో కలిసి కృషి చేసిన మేము యిద్దరమూ, స్వాతంత్ర్యానంతరమే కలుసుకున్నాము. రెండు విభిన్న దేశాల రాయబారులు అన్న హోదాలో.

నేను శ్రీలంకనుంచి తిరిగి రావడానికి ఒక నెల ముందు నుంచే వీడ్కోలు తతంగాలు ప్రారంభమయ్యాయి. రాయబారులు సింహళీయులు, భారతీయులు, తెల్లవారు.... ఇలా సలువురి తరపున వీడ్కోలు సత్కారాలు వాళ్ల ప్రేమను మాత్రమే ద్యోతకం చేయలేదు, పాక కళ గొప్పదనాన్ని చాటేవిగా కూడా వున్నాయి.

కండికి వెళ్లి నేనూ, నా భార్య సోల్‌బరీ ప్రభువు నుంచి సెలవు తీసుకున్నాము. అమ్మాకు ఆంగ్లం సరిగా రాకపోయినప్పటికీ, మాటలు అర్థం చేసుకోవడానికి ప్రయత్నించేది. మిగతా వాళ్లు మాట్లాడేప్పుడు జాగ్రత్తగా గమనించేది. సోల్‌బరి, సాహిత్యం, చరిత్ర మొదలైన విషయాల పట్ల ఉత్సాహం కలవారు. మేము ఆయన వద్ద సెలవు తీసుకుని కొలంబోకు తిరిగి వచ్చాము. ఒక వారం తర్వాత సోల్‌బరీ నాకు ఈ విధంగా రాశారు.

"మీరు మీ ఆవిడ నాదగ్గర సెలవు తీసుకుని వెళ్లినప్పటికీ, మీ యిద్దరినీ నేను మళ్లీ చూడగలనని భావిస్తున్నాను. మీరు దూరం కావడం గురించిన విచారంతో నేనీ ఉత్తరం వ్రాస్తున్నాను. చాలాసార్లు మనం మాట్లాడుకుని వున్నాం. ఆ సందర్భాలలో మీ అభిప్రాయాలలో వున్న న్యాయాన్ని, తమ విశాల హృదయాన్ని నేను తెలుసుకోగలిగాను. వివేకవంతమైన మీ సంభాషణలను అనుభవించి ఆనందించే అవకాశం నాకు లభించింది. మీరు మీ భార్య యిక్కడనుంచి వెళ్లిపోవడం ఎంతో వేదన కలిగిస్తోంది. నేను నేర్పిన ఆంగ్లాన్ని మీ ఆవిడ మరువదని నమ్ముతున్నాను.

ఎప్పటికీ మీ మిత్రుడు

సోల్‌బరీ.

ఇటువంటి ఎన్నో ఉత్తరాలు చాలామంది మిత్రులనుంచి నాకు వచ్చాయి. పదిహేను నెలలు నాతో ఒకటిగా కార్యాలయంలో పనిచేసిన అధికారులు,

మిగతా సిబ్బంది నుంచి వీడ్కోలు తీసుకోవడం కొంత ఆవేదన కలిగించే అనుభవంగానే వుంది. అయినప్పటికీ జీవితం మనల్ని ఒకచోటు నుంచి మరొక చోటుకు నడిపిస్తూనే వుటుంది కదా?

1952వ సం॥ సెప్టెంబర్ ఏడో తారీఖు ఉదయం నేనూ, అమ్మ కొలంబోనుంచి బయలు దేరాము. రాయబారులు, మిత్రులు చాలామంది మమ్మల్ని సాగనంపడానికి విమానాశ్రయానికి వచ్చారు. వారి అందరి దగ్గరి నుంచి వీడ్కోలు తీసుకుని నేను విమానంలో ఎక్కాను. అయిదు నిమిషాల్లో అది కొలంబో నగరాన్ని వదలి మద్రాసు వైపుకు మమ్మల్ని తీసుకుపోయింది. నా జీవిత నాటకంలో మరో ఘట్టం ముగిసింది.

# తల్లీ, అమ్మో

రాయబారిగా బాధ్యతలు నిర్వహించి నేను తిరిగి రానున్న వార్తను వినగానే శ్రీ.వి.యం. నాయర్ నేను 'మాతృభూమి' సంపాదక బాధ్యతలు స్వీకరించాలని టెలిగ్రామ్ యిచ్చారు. డైరెక్టర్లు కూడ అందుకు నన్ను ఒత్తిడి చేశారు. కొన్ని రోజులు ఒలవకోడ్‌లోని నా గృహంలో విశ్రాంతి తీసుకున్న తర్వాత, నేను అక్టోబర్ నెలలో మళ్లీ 'మాతృభూమి' సంపాదక బాధ్యతలు స్వీకరించాను.

శ్రీలంక వెళ్లాలని నిశ్చయించిన తర్వాత మా అమ్మదగ్గర వీడ్కోలు తీసుకోవడానికి వెళ్లాను. అప్పుడు ఆమె 'నా చివరి కాలంలో నువ్వు నా దగ్గరే వుండాలి. నాకు ఒంట్లో బావులేదని వార్తవింటే నువ్వు వెంటనే రావాలి' అన్నది. మా అమ్మకు ఎనభై ఐదు సంవత్సరాలు. నేను లంక నుంచి తిరిగి రాగానే అందరికన్నా మా అమ్మే ఎక్కువ ఆనందాన్ని పొందింది. కొద్దిగా జ్ఞాపక శక్తి తగ్గిందే తప్ప, మరేదీ ఎక్కువగా అనారోగ్యం అని చెప్పే పరిస్థితి ఆమెకు ఏర్పడలేదు. ఎంతటి వృద్ధాప్యం వున్నప్పటికీ వాలుకుర్చీలో కూర్చబడి 'మాతృభూమి' చదివేది. ఒకసారి నేను పాల్‌ఘాట్‌లో ఒక కళాశాల వార్షికోత్సవానికి అధ్యక్షత వహించడానికి వెళ్లాను. ఆ సభకు తానూ వస్తానంది. సభ జరిగే చోటికి మెట్లెక్కి నడిచి వెళ్లాలి, అది కష్టం అని నేను చెప్పినప్పుడు, 'ఇక మీదట నీ ఉపన్యాసం వినగలనని నాకు అనిపించటం లేదు. అందువల్లే ఈ మీటింగ్‌కు రావాలని ఆశ పడుతున్నాను' అన్నది. సభ జరిగే చోటికి చాలా శ్రమతో వచ్చింది. సభ ముగిసేవరకు అక్కడ వుంది. ఇంటికి రాగానే స్పృహ తప్పి పడిపోయింది. రెండు గంటలసేపు స్పృహ రాలేదు. ఆవేళ వాటిల్లిన అనారోగ్యం ఆ తర్వాత పూర్తిగా కోలుకోలేదు. ఏమైనా సరే అమ్మ స్నానం చెయకుండా వుండే వారు కాదు. పిల్లలు పాట పాడేప్పుడు తాళం తప్పినా, అపస్వరం పలికినా వెంటనే దానిని ఎత్తిచెప్పి సరిదిద్దేది.

రోజులు గడిచాయి. నెలలు దొర్లిపోయాయి. లంకనుంచి నేను తిరిగి వచ్చిన తర్వాతనే నేను 'జీవిత జ్ఞాపకాలు' అన్న పుస్తకం వ్రాయడం ప్రారంభించాను. అలాంటి ఒక పుస్తకాన్ని రాయాలన్న కోరిక నాకు చాలా రోజులుగానే వుంది. 'జీవిత జ్ఞాపకాలు' ప్రచురించినప్పుడు ప్రజలు చూపిన ఆదరణ నాకెంతో

సంతోషాన్ని కలిగించింది. రకరకాల పాఠకుల నుంచి నాకు వచ్చిన ఉత్తరాల ద్వారా ఆ పుస్తకం పట్ల ప్రజల్లో ఏర్పడిన ఉత్సాహం నాకు బాగా అర్థమయింది.

లంకనుంచి తిరిగి ఒక సంవత్సరం కాకముందే అమ్మా వ్యాధిగ్రస్తురాలయ్యారు. దారుణమైన కేన్సర్ వ్యాధి ఆమెను పట్టుకుంది. నాలుగు సంవత్సరాలకు ముందే ఆమెకు ఒకసారి శస్త్ర చికిత్స చేశాము. దాంతో ఆ భయంకరమైన వ్యాధి బాధ తొలగిపోయిందని భావించాము. ఆ తర్వాతే మేము లంకకు వెళ్లాము. అప్పుడప్పుడూ వైద్యులు ఆమెకు వైద్య పరిశోధన చేయడం అలవాటు. భయపడడానికి ఏమీలేదు.... అని చెబుతూ వచ్చారు. అయినప్పటికీ కేన్సర్‌కు శస్త్ర చికిత్స చేసినప్పటికీ, తొంభై శాతం మందికి మళ్లీ వచ్చే అపాయం వుందని ఒక డాక్టరు నాతో చెప్పారు. మళ్లీ అమ్మా వ్యాధి తీవ్రతకు గురయ్యారు. ఇతరులకు ఇబ్బంది పెట్టకూడదన్న ఉద్దేశంతో, భయంకరమైన బాధవేధిస్తూన్నప్పటికీ అమ్మా నోరు మెదపకుండా భరించేది.

చికిత్సకోసరం మేము మద్రాసు వెళ్లాము. కేన్సర్ వ్యాధికి చికిత్సావిధానం సౌకర్యాలు ఇటీవల కాలంలో బాగా అభివృద్ధి చెందాయి. కానీ ఆ వ్యాధిని పూర్తిగా రూపుమాపే మార్గాలు ఇంకా అన్వేషించి కనుగొనలేదు. నాలుగు వారాల చికిత్స తర్వాత కొంత ఉపశమనంతో మేము కోళిక్కోడ్ తిరిగి వచ్చాము. అయినా ఆ ఉపశమనం చాలా రోజులు కొనసాగలేదు. వ్యాధి మళ్లీ తీవ్రమయింది. ఆయుర్వేద చికిత్సను ప్రారంభించాము. ప్రయోజనంలేదు. 1954వ సం॥ ఏప్రిల్ ఎనిమిదో తారీఖు అమ్మాను కోళిక్కోడ్ నుంచి ఒలవక్కోడ్ సమీపంలో వున్న మా 'అత్తాళచ్చిర' గృహానికి తీసుకువచ్చాము. అక్కడ మా మనుమరాలు నళిని పెళ్లిచేయడానికి నిశ్చయించాము. అమ్మా శారీరిక స్థితి తీవ్రత భయపెట్టే స్థితిలో వున్నప్పటికీ, వివాహ మహోత్సవాన్ని అనుకున్నట్టు జరిపించి వేయాలని పట్టుపట్టింది. పెళ్లి అలాగే జరిగిపోయింది. ఆరేళ్ల పాటు అమెరికాలోనూ, ఇంగ్లండులోనూ విద్యాభ్యాసం చేయడానికి వెళ్లిన, మా అబ్బాయి ఉణ్ణి అప్పుడే మాతృదేశానికి తిరిగి వచ్చాడు.

వ్యాధి బాగుచేయడం కుదరదని మేమందరమూ భయపడుతున్నప్పటికీ, వ్యాధిగ్రస్తురాలు అందుకు విరుద్ధంగా వ్యాధి త్వరగా నయమవుతుందని నమ్ముతూ వుండేది. అదే మాకెంతో ఓదార్పుగా వుండేది. తరుచుగా ఆమె కోళిక్కోడ్‌కు తిరిగి వెళదామని చెబుతూ వుండేది. ఆ సమయంలోనే నేను 'గడిచిన కాలం' పుస్తకం వ్రాయడం ప్రారంభించాను. వ్రాసిన భాగాలను నన్ను

చదివి చూపమనేది. అందులో వివరించిన సంఘటనలను గురించి తన అభిప్రాయాలను వెలిబుచ్చేది. వదలివేసిన సంఘటనలను గురించి జ్ఞాపకం చేసేది. 'గడిచిన కాలం' చదివి వినాలన్న అభిలాషవున్న అమ్మకు ఆ రచన పూర్తయిన తర్వాత చదివి వినిపించి సంతోషించే భాగ్యం నాకు లభించలేదు. ఆమె వ్యాధి ఆమెను అంతిమ దశకు తీసుకెళ్లింది. జన సంచారం ఆమెకు నచ్చలేదు. తన చుట్టూ వున్న ప్రపంచ జ్ఞాపకాలను మరిచింది. 'నేనీ వ్యాధిని భరించలేకున్నానే' అని అప్పుడప్పుడూ అరిచేది. ఇద్దరం ముగ్గురం రేయింబవళ్లుగా 'అత్తాళచ్చిర' ఇంట్లో ఆమెకు సేవలు చేశాము. ఆ గ్రామసీమలోని యిల్లు నాకెంతో యిష్టం. అమ్మ వ్యాధిగ్రస్థురాలైవున్న రోజులలో సాయంకాలాల్లో ఆ యింటి మెట్లు దిగి పొలందగ్గరకు నేను వాహ్యాళికి వెళ్లేవాణ్ణి. 'అత్తాళచ్చిర' గ్రామం ప్రశాంతత ప్రకృతి సౌందర్యం పొంగిపొరలే పరిసరాలు కుడివైపుగా కొద్ది దూరంలో మలుపుళ కాంతి దీపాల ప్రకాశం; ఎడమవైపు ఒలవక్కోడ్ రైల్వే నిలయం కాంతి పుష్పాలు ప్రజ్వరిల్లేవి! ఎదురుగుండా పలు వరసల్లో కనిపించే పర్వత శ్రేణులలో అక్కడక్కడ రగిలే కారుచిచ్చు యిరువైపులా వెలిగే విద్యుద్దీపాలకన్న అద్భుతంగా కనిపించేవి. ఆ ప్రశాంత వాతావరణంలో వేదనకు భరించలేని అమ్మ దీనస్వరం నాహృదయాన్ని పిండివేసేది. దేవుడు ఎందుకోమరి మనుషుల్ని ఇలా వేధిస్తాడు! శిక్షా ఇది? ఆ వేదనను కొంతైనా తగ్గించడానికి వీలుకాలేదే అని బాధపడేవాణ్ణి.

"ఇవాళ ఎప్పటిలాలేదు. చాలా అలసటగా వుంది. డాక్టర్‌కు కబురుచెయ్" అని వేకువజామున నాలుగు గంటలకు చెప్పింది అమ్మ. ఆరోజు జూన్ ఇరవై మూడో తేది. వెంటనే డాక్టర్ పరుగెత్తుకొచ్చారు. బాధ తగ్గించడానికి ఏమేమో చేశారు, తెల్లవారింది. మేమందరం ఆమె గుండె వేగంగా కొట్టుకోవడం మాత్రం చూస్తూ నిలబడ్డాము. అమ్మ, లేపి కూర్చోబెట్టమని నెమ్మదిగా చెప్పింది. పడక మీద జారబడినట్లు లేపి కూర్చోబెట్టాను. ఊపిరి పీల్చడానికి ఆమె పడే శ్రమ చూడలేక పోయాను. తర్వాత ఆమె ఎంతోసేపు శ్రమపడలేదు. కూర్చున్నట్టుగానే అమ్మ చివరి శ్వాసను వదిలింది.

ఇరవైతొమ్మిదేళ్లకు ముందు లక్ష్మి కూడా అదే స్థలంలోనే ఈ భూప్రపంచాన్ని వదలి వెళ్లింది. 'అత్తాళచ్చిర' విశాల ప్రదేశంలో అమ్మకు అంత్యక్రియలు జరిపాము. అమ్మ కథ ముగిసింది.

నా సుఖ సౌకర్యాలకోసరమే జీవితాన్ని అర్పించింది అమ్మ. అంతకు మించిన జీవితాదర్శం ఆ వనితారత్నానికి వుండేది కాదు. వార్తా పత్రికలు, పుస్తకాలు చదవాలని ఆశించినప్పటికీ రాజకీయ విషయాల పట్ల శ్రద్ధ వుండేది

కాదు. ఇంటిపనుల్ని సక్రమంగా నెరవేరుస్తూ గృహిణిగా తన బాధ్యతలు నెరవేర్చడానికి యిష్టపడేది. చుట్టాలకు సపర్యలు చేయడం, సేవకులకు అజ్ఞలు పురమాయించడంలో ఆమె మంచి ఇల్లాలుగా పేరు తెచ్చుకుంది. పాకకళలో ఆమె సిద్ధ హస్తురాలు. సంసారజీవితమే ఇక శాపంగా మారిన అనుభవం గల మిత్రులు కొందరు నాకు తెలుసు. ఆ విషయంలో నేను భాగ్యవంతుణ్ణి. లక్ష్మి, అమ్ము నా జీవితంలో చవిచూపిన మధురస్మృతులకు నేనెప్పటికీ రుణపడి వున్నాను. వారు వదలి వెళ్లిన మధురస్మృతులు, నా హృదయంలో ఎన్నటికీ మాసిపోనివి.

ఇది జరిగి మూడు వారాలు కాకముందే నాతల్లి కూడా పోయారు. ఆమె అంతం పండిన పండు కాడ వదలి రాలిపోయినట్టు జరిగింది. భగవంతుడు ఆమెకు దీర్ఘాయువు ప్రసాదించాడు. కాని ఒక తల్లి స్థానాన్ని వేరెవ్వరు భర్తీ చేయగలరు? స్వార్థరహితమైన సేవకు ఒక ఉదాత్త వ్యాఖ్యానం కదా మాతృత్వం! చాలా స్వల్ప కాలంలోనే నా ప్రేమను మోసిన యిద్దరు వనితరత్నాలు నానుంచి శాశ్వతంగా దూరమయ్యారు.

1955 వ సం॥ నవంబరు నెలలో నాకుమారుడు ఉణ్ణి వివాహ సందర్భంగా నేను మళ్లీ సింగపూర్ వెళ్లాను. ఆ భూమి మీద కాలు మోపగానే నాలో ఎన్నెన్నో భావేద్వేగాలు చెలరేగాయి. నలభైయేళ్లుగా సింగపూర్‌లో నివసిస్తున్న డా॥ వి. బి. మీనన్ కుమార్తె లీల పెళ్లికూతురు. పెళ్లికూతురు కూడా తండ్రిగారి వృత్తిలోనే శిక్షణ పొందింది. లీల సింగపూర్ ఆస్పత్రిలోనే డాక్టర్‌గా వుండేది.

ఏడేళ్లకు ముందు నేను సింగపూర్ వదలి వెళ్లాను. ఆ స్వల్పకాలంలో సింగపూర్‌లో వచ్చిన మార్పులు నన్నెంతో ఆశ్చర్యపరిచాయి. అంతకు ముందు, పద్దెనిమిది రోజులు నౌకలో పయనం చేసిన తర్వాతే సింగపూర్ చేరడం సాధ్యం. ఆ రోజుల్లో మద్రాసులో విమానమెక్కినట్లయితే మూడున్నర గంటలసేపులోగా సింగపూర్ చేరవచ్చు. యుద్ధం తర్వాత సింగపూర్ సాధించిన వివిధ రకాల అభివృద్ధిని అక్కడి కొత్త భవనాలు చాటిచెప్పాయి. భావవికాసంలాగే భవన నిర్మాణ వికాసాన్ని, అభివృద్ధిలోనూ కల్గిన అద్భుతమైన మార్పులు చోటుచేసుకున్నాయి. రోడ్లమీద ఎన్నో వరుసలుగా సాగే కారుల్ని చూసి ఆశ్చర్యంతో నిలబడిపోయాను.

మూడు వారాలపాటు నేను సింగపూర్‌లో వున్నాను. అనేకమంది స్నేహితులను కలుసుకోవడం, వివిధరంగాల వారితో స్నేహ సంబంధాన్ని మళ్లీ కొనసాగించడంలోనూ కాలం హాయిగా గడిచిపోయింది. ఆ స్నేహితులలో చాలామంది నాలాగే యుద్ధ కాలంలో కష్టాలను అనుభవించిన వారే. కొందరు

నాతో జైల్లో వున్నవారు. వారిలో ఒకరైన సర్ రాబర్ట్‌స్కాట్, ఆ రోజులలో సింగపూర్‌లో కమీషనర్ జనరల్‌గా వుండేవారు. "మనం ఇవాళ సంతోషకరమైన వాతావరణంలో కలుసుకుంటున్నాము" అని నన్ను ఆహ్వానించారు. ఒక రోజు నేను ఆయన అతిథిగా గడిపాను. మొదట చూసిన ప్రదేశాలను, స్నేహితుల ముఖాలను చూసేప్పుడు కష్టం, సుఖం, కలగలిసిన ఓ భావన ఏర్పడుతుంది. జీవితంలో అర్థం చేసుకోలేని పరమ రహస్యమైన అందాలను ఇలాంటి సందర్భాలలోనే గ్రహించడం సాధ్యమవుతుంది.

నవంబరు నెలాఖరులో నేను మాతృదేశానికి తిరిగివచ్చాను.

# సమైక్య కేరళ ఉద్యమం

సమైక్య కేరళం అన్న అభిప్రాయం నాకు అప్పుడే ఏర్పడిందని చెప్పడానికి లేదు. చాలారోజుల నుంచే నాకా అభిప్రాయం వుంది. కేరళలో పలు ప్రాంతాలు పలువురి అధికారం క్రిందవుండడం ఒకవైపు ఆశ్చర్యంగాను, మరోవైపు విచారంగాను వుండేది. నేను ప్రజాజీవితంలో పాల్గొనడానికి ముందునుంచే దీనిని గురించి నేను ఆలోచించాను. అయినప్పటికీ, ఆనాటి పరిస్థితులలో కేరళలో పలుప్రాంతాలను ఒకటిగా కలిపి, సమైక్య కేరళను ఏర్పరచడానికి ఒక మార్గం కనిపించలేదు. కాని ఆ అభిప్రాయం నా హృదయంలో బలంగా నాటుకుని వుంది. 'స్వతంత్ర భారతం' అనే ఆశ కూడా ఆ రోజులలో అలాంటి కలగానే కదా వుండేది? 1919వ సం॥లో మద్రాసు మళయాళీ సంఘం తరఫున జరిగిన ఒక సభలో నేను మొట్టమొదటి సారిగా సమైక్య కేరళ గురించి మాట్లాడాను. తిరువిదాన్కూర్, కొచ్చి, మలబారు కలిసిన ఒక ప్రదేశం ఏర్పడాలని నేను వెలిబుచ్చిన అభిప్రాయం, ఆనాటి సభాధ్యక్షున్ని ఆశ్చర్యపరచింది. పరిపక్వత అనుభవం లేకుండా నాకు తోచిన అభిప్రాయాన్ని చెప్పినందుకు ఉపన్యాసంతో నిరసన తెలియజేసి ఖండించారాయన. అప్పుడు నిర్వహింపవలసిన ముఖ్యమైన పనులను వదలి, అవసరంలేని, ఆచరణయోగ్యం కాని విషయాలపట్ల యువకులు ఆలోచించడం శ్రేయస్కరం కాదని ఆయన తెలియజేశారు. అప్పటికే ఎన్నటికైనాసరే అది జరిగేపనికాదు అనే అక్కడున్న వారిలో అధికులు భావించారు. అయినా రెండేళ్లు గడిచేలోగా, సమైక్య కేరళకు ఒక రూపం కల్పించే సమయం ఆసన్నమయింది. ఒట్టపాలంలో సమావేశమైన ప్రధమ కేరళ ప్రదేశ్ మహాసభలో దానికి అనువైన సందర్భం ఏర్పడింది. సహాయ నిరాకరణోద్యమం ప్రారంభమయినప్పుడు కాంగ్రెసును నిర్వహించడానికి అనుగుణంగా, భాషా ప్రాతిపదికమీద కొత్త కాంగ్రెస్ ప్రదేశాలను, ఏర్పరచారు. అప్పుడే కొచ్చిన్-తిరువాన్కూర్-మలబార్ కలిసే విధంగా కేరళ ప్రదేశ్ కాంగ్రెస్‌ను ఏర్పరచారు. ఆ రోజులలో నేను కేరళ ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగా వుండేవాణ్ణి. ఒట్టపాలంలో జరిగిన మహాసభలో, కొచ్చిన్నుంచి, తిరువిదాన్కూరు నుంచి, మలబారునుంచి ప్రతినిధులు కేరళీయులు అన్న

ప్రాతిపదిక మీద ఒకటైన దృశ్యం నన్ను ఉద్వేగ పూరితుణ్ణి చేశాయి. ప్రచారం, నిర్వహణ, మొదలైన కార్యక్రమాలకు సౌకర్యాలు ఏర్పరచడం కోసరమే అలా భాషా ప్రాతిపదికపై ప్రాంతాలను ఏర్పరచినప్పటికీ అదే సరైన విధానంగా కేరళ ప్రదేశ్ ఏర్పడడానికి మొదటి మెట్టు అయింది.

ఒక సంవత్సరం గడిచిన తర్వాత కాంగ్రెస్ ప్రచార కృషి కోసరం, నేను తిరువిదాన్కూర్ వెళ్లినప్పుడు కొల్లంలో ఒక బహిరంగ సభలో కేరళ ప్రదేశం గురించి మాట్లాడాను. అప్పుడు ఆ సభలో ఒక గౌరవనీయులైన వ్యక్తి "కేరళ ప్రత్యేక ప్రదేశం అయ్యేట్టువుంటే, కొచ్చి, తిరువిదాన్కూర్, మహారాజు స్థితి ఏమిటి?" అన్న ప్రశ్నను లేవదీశారు. "అది క్లిష్టమైన సమస్యే. పరిస్థితులు మారేప్పుడు, రాజు పరిస్థితి ఒక సమస్య కాదు" అని మాత్రం అప్పుడు నేను ఆ ప్రశ్నకు జవాబు చెప్పాను.

1923వ సం॥ 'మాతృభూమి' వెలువడడం ప్రారంభించిన తర్వాత నేను రాసిన తొలి సంపాదకీయంలో, సమైక్య కేరళం గురించి అభిప్రాయాన్ని ఇలా వెలిబుచ్చాను.

"ఒక భాష మాట్లాడుతూ, ఒకే చరిత్ర కలిగి సిద్ధాంతరీత్యా ఒకేరకమైన ఆచార వ్యవహారాలు కలిగిన కేరళీయులు ఇప్పుడు విడిపోయి చిన్నాభిన్నంగా నలుగురు పాలకుల క్రింద వుంటున్నప్పటికీ, కేరళీయుల సంక్షేమానికి, ఉన్నత స్థితికి, కేరళలో వివిధ ప్రాంతాలలో నివసించే ప్రజలు ఇప్పటికైనా సాన్నిహిత్యం, ఐక్యమత్యంతో వుండడం ఎంతైనా అవసరం అని భావిస్తూ 'మాతృభూమి' ఆ లక్ష్యం కోసరం నిర్విరామంగా ప్రయత్నిస్తుంది"

సమైక్య కేరళ లక్ష్యాన్ని ప్రచారం చేయడం కోసరం నాకు లభించిన అవకాశాన్ని దేన్నీ వదులుకోలేదు. 1925వ సం॥ జనవరిలో నేను 'మాతృభూమి' సంపాదక బాధ్యతలు వదలి వెళ్లేప్పుడు, నా తర్వాత వచ్చిన పి. రాముణ్ణి మీనన్ సమైక్య కేరళం గురించి, నా ప్రయత్నాలను గురించి సంపాదకీయంలో ఇలా వ్రాశారు. 'దూరంలో వున్నప్పటికీ, ఏ మాత్రం అస్పష్టతలేని విధంగా ఉదాత్తమైన లక్ష్యాన్ని సాధించడానికి ఆయన ప్రయత్నించారు, ప్రయత్నిస్తున్నారు. అది ప్రయోజనం లేనిదని చెప్పే ధైర్యం ఎవరికుంది? గత నాలుగు సంవత్సరాల అనుభవం ఏదైనా సరే, ఈ నవీన కేరళం ఉదయించే సమయం గత నాలుగు సంవత్సరాలకన్నా ఇప్పుడు మరింతగా సమీపించిందంటే కాదని ఎవరనగలరు?

1927వ సం॥ లోనే నేను మలయా వెళ్లాను. తర్వాత ఇరవై సంవత్సరాల కాలం అక్కడ నివసించాను. ఈ మధ్య రెండు మూడు సార్లు 'మాతృభూమి'లో సమైక్య కేరళ గురించి రాశాను. 1934వ సం॥ 'ఓణం' ప్రత్యేక సంచికలో,

అనాటి పరిస్థితులలో సమైక్య కేరళ నిర్మాణం గురించి నేను ఈ విధంగా రాశాను.

"కొచ్చి, తిరువిదాన్కూర్ రాజకుంటుంబాల వారు తమ తమ పదవులను స్థానాలను, ప్రజా సంక్షేమం కోసరం వదులుకోలేదంటే, వాటిని కొద్దిపాటి మార్పులతో నిలబెట్టే ఒక ఫెడరల్ రాజ్యం స్థాపించడం సాధ్యమే. మలయా దేశంలోని 'ఫెడరేటెడ్ మలాయ్‌స్టేటన్' ఇందుకు ఒక ఉదాహరణ". అక్కడ నలుగురు రాజులు నివసించే నాలుగు ప్రదేశాలు కలిసి ఇక ఫెడరల్ స్టేట్‌గా వుంటోంది. వారి వారి ప్రదేశాలలో వారు వారు నివసించినప్పటికీ, ఒక స్టేట్‌గా సాధారణ పరిపాలనా విధానమే ఈ నాలుగు రాజ్యాలలోను నెలకొని వుంది. ఈ పద్ధతిని మనము అనుసరించడం బావుంటుంది. రాజులే లేని పరిపాలనా పద్ధతే మన లక్ష్యంగా భావించాము. అది యిప్పటికీ సాధ్యంకానప్పటికీ, ఫెడరల్ సంస్థానం అయినప్పటికీ మనం వెంటనే ఏర్పరచడానికీ ప్రయత్నించాలి. అయితే తాత్కాలికమైన ఏర్పాటుగానే భావించడం సాధ్యం'.

1945వ సం॥ లో 'రానున్న కేరళ' అన్న శీర్షికలో మద్రాసు మలయాళిసంఘ రజతోత్సవాలను పురస్కరించుకుని వెలువరించిన సంచికలో నేనొక వ్యాసం రాశాను. అందులో నేను నా ఊహలలో చూసిన కేరళ విశాల స్వరూపాన్ని చూడవచ్చు. సమైక్య కేరళ లక్ష్యం, ఈ కాలంలో నా ఆలోచనను ఎంతగానో ప్రేరేపించింది.

ఒక ప్రత్యేక మలయాళ ప్రదేశం మాత్రం నా లక్ష్యంకాదు. తిరువిదాన్కూర్, కొచ్చిన్ మలబార్ వాటితో చేరగల్గిన ఇతరప్రదేశాలు ఒకటిగా ఏకమైన కేరళయే నా ఊహలలో ఉద్భవించిన సమైక్యకేరళ. ఒకటి కంటే ఎక్కువ మాతృభాషగా కలవారు అక్కడవున్నారు.

స్వాతంత్ర్య పోరాటం జరపడంలోనే నిమగ్నమైవున్న ఆ రోజులలో సమైక్యకేరళ లక్ష్యాన్ని నిజంగానే కార్యాచరణకు తీసుకురావడానికి ఎలాంటి ప్రయత్నమూ చేయడానికి వీలుకాకపోయింది. అయితే కేరళ ప్రజలు అభిలషించ దగ్గ ఆ లక్ష్యానికి ఎందరో తమ ఆదరణను తెలియజేశారు. సమైక్య కేరళ కోరికకు ఎవరూ వ్యతిరేకతను వ్యక్తం చేయలేదు. వ్యక్తంచేసి వున్నప్పటికీ నాటి పరిస్థితుల దృష్ట్యా దానినెవరూ లెక్కచేసేవారు కాదు.

1946వ సం॥ అక్టోబర్‌లో, ఇరవై సంవత్సరాలు నివసించి సింగపూర్ నుంచి స్వదేశానికి తిరిగి వచ్చిన తర్వాతే సమైక్య కేరళ లక్ష్యాన్ని సాధించడంలో కావలసిన మార్గాలను అన్వేషించడానికీ చర్చలు జరపడానికి నా అధ్యక్షతన ఒక ప్రారంభ సమావేశం ఏర్పాటు చేశారు. దానిని గురించి ముందు

అధ్యాయంలో తెలియజేశాను. కేరళ కాంగ్రెస్ కమిటీ ఎన్నికచేసి ఏర్పాటు చేసిన ఒక 'సబ్ కమిటీ' తరఫున 'నిరుతురుత్తి'లో ఆ సభ జరిగింది.

ఆ సమావేశంలో చేసిన తీర్మానం ఫలితంగానే 1947 వ సం॥ ఏప్రిల్ నెలలో శ్రీ కేళప్పన్ నాయకత్వంలో తిరుచ్చూర్‌లో చారిత్రక ప్రాముఖ్యంగల సమైక్యకేరళ మహాసభ జరిగింది. అంతకు ముందే, కొచ్చిన్ మహారాజా చట్టనిర్మాణ సభకు పంపిన సమాచారంలో, ఇలా తెలియ చేశాము. 'కేరళ నాగరికత స్థిరంగా నెలకొనాలంటే అది ఒకే పరిపాలనకు లోబడి వుండాలి అన్న దృఢమైన అభిప్రాయం నాకు వుంది. అందుకోసరం మలబార్, కొచ్చి, తిరువిదాన్కూర్, ఒకటిగా చేరి కేరళకు సాధారణ పరిపాలనా విధానం నిర్ణయించే పథకాన్ని రూపొందించాలి'.

అయితే ఈ అభిప్రాయం ఆనాటి తిరువిదాన్కూర్ పరిపాలకులకు సరైనదిగా అనిపించలేదు. కేరళలోని వివిధ ప్రాంతాలనుంచి, ప్రతినిధులు తిరుచ్చూర్ సమావేశానికి వచ్చారు. పలుప్రజా సంస్థలనుంచి ప్రతినిధులు ఆ మహాసభలో పాల్గొన్నారు. అంతమంది ప్రతినిధులు పాల్గొన్న మహాసభ ఆ రోజులలో కేరళలో మరేదీ జరగనట్టు లేదు. సమైక్య కేరళ సంస్థాపనకు సుముఖమైన ఒక తీర్మానాన్ని మహాసభ ఆమోదించింది.

మహాసభ లక్ష్యాన్ని అమలు జరిపే విధంగా పైన పేర్కొన్న చర్యలు అమలు చేయడానికి వందమంది సభ్యులు గల ఒక కౌన్సిల్‌ను ఎన్నుకున్నారు ఈవిధంగా కేరళ ప్రదేశాన్ని రూపొందించడానికి ప్రాథమిక ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి.

ఆ మహాసభ జరిగినప్పుడు నేను సింగపూర్‌లో వున్నాను. అక్కడనుంచి ఒక అభినందన సందేశాన్ని పంపడానికే నాకు వీలైనది.

1946 వ సం॥ ఫిబ్రవరి 20 వ తేది ఆల్వాలో సమైక్య కేరళ సమావేశం ఒకటి ఏర్పాటు అయింది. అప్పుడు ఆ ఉద్యమానికి ఒక నూతనతేజం కలిగింది. ఇంతకు ముందు చెప్పిన సమైక్య కేరళ కౌన్సిల్ సభ్యులే కాకుండా, తిరువిదాన్కూర్ శాసనసభ సభ్యులు, మద్రాసు శాసనసభ మలబార్ సభ్యులు, కేరళ కాంగ్రెస్ కమిటీ సభ్యులు, ఇంకా ప్రత్యేక ఆహ్వానితులు అందరూ కలిసి రెండు వందలకు పైగా ఆ సమావేశంలో పాల్గొన్నారు. సమైక్యకేరళ కౌన్సిల్ అధ్యక్షులు శ్రీకేళప్పన్ ఈ సమావేశానికి అధ్యక్షత వహించారు.

'కేరళ ప్రకృతి సౌందర్యంలో కనిపించే సమైక్య సహజత్వాన్ని కేరళ ప్రజల ఆర్థిక సాంస్కృతిక వికాసం, పరిపాలనా సౌకర్యాలు దృష్టిలో వుంచుకుని, తిరువిదాన్కూర్, కొచ్చిన్, మలబార్, వాటిలో చేరదగిన మిగతా ప్రాంతాలను

ఒకటిగా కలిపి ఒకే ప్రదేశంగా చేయాలన్న జనాభిప్రాయాన్ని సమావేశం దృఢపరుస్తోంది. పైగా అటువంటి కేరళ ప్రదేశం, ప్రస్తుత ప్రజా ప్రతినిధుల పరిపాలన కిందికి తీసుకురావాలని భావిస్తున్నది' అన్న తీర్మానాన్ని ఆ సభ ఆమోదించింది. తీర్మానాన్ని నేను ప్రతిపాదించాను. టి.యమ్. వర్గీస్ దాన్ని బలపరిచారు. కోళిపురత్తు మాధవ మీనన్, సి. కేశవన్, పనమ్ పళ్ళి గోవిందా మీనన్ మొదలైనవారు దాన్ని బలపరుస్తూ ఉపన్యసించారు.

ఆ తీర్మానం కోరిన లక్ష్యం నెరవేరడానికిముందే ఏర్పడిన సమైక్య కేరళ కౌన్సిల్‌కు బదులుగా, పదిహేను మంది సభ్యులు గల సమైక్య కేరళ కమిటీని ఎన్నుకున్నాము. కావాలంటే కొత్త సభ్యుని చేర్చుకునే అధికారాన్ని కమిటీకి యిచ్చాము. ఆ కమిటీలో నేనొక సభ్యుణ్ణి. సమైక్య కేరళ కమిటీ అన్న పేరుతో వున్న ఈ సంస్థ సమైక్య కేరళ స్థాపనకు ప్రయత్నాలు కొనసాగించింది. కమిటీ అధ్యక్షుడు కేళప్పన్, కార్యదర్శి కె.ఎ. దామోదరమీనన్, కేరళ ప్రదేశాన్ని త్వరగా రూపొందించే ముఖ్యమైన చర్యలను తీసుకోవడానికి అల్వాయ్ మహాసభ ఈ కమిటీకి అధికారం యిచ్చింది.

అల్వాయ్ సభ జరిగిన ఆరునెలల్లోగా చాలా ముఖ్యమైన సంఘటన జరిగింది. 1949 జూలై ఒకటో తేదీ తిరువిదాన్కూర్, కొచ్చి ఏకమయ్యాయి. కేరళ ప్రదేశం రూపొందడానికి అది అతి త్వరలో దారి తీయగలదని చాలామంది, దాని వల్ల కేరళ ప్రదేశం ఏర్పడడానికి ఆలస్యమవుతుందని కొందరూ భావించారు. ఆ రోజుల్లో రాజ్యాంగ మంత్రి కార్యాలయంలో కార్యదర్శిగా వున్న ఎ.పి. మీనన్ నిర్విరామకృషి ఫలితంగానే అది సాధ్యమయింది.

తిరువిదాన్కూర్ - కొచ్చి కలయిక, సమైక్య కేరళ కమిటీ సభ్యుల మధ్య రకరకాల అభిప్రాయాలను కలిగించింది. సమైక్య కేరళ లక్ష్యానికి ఈ కలయిక అనుకూలంగా వుంటుందని తీర్మానించిన తరవాత, ఆ కమిటీలో తనకు స్థానంలేదని కేళప్పన్ ఆ కమిటీనుంచి వైదొలగారు. ఆ తరువాత, సెప్టెంబర్ పద్దెనిమిదో తేదీ, తిరువనంతపురంలో జరిగిన సమైక్య కేరళ కమిటీ సమావేశంలో నన్ను కమిటీ అధ్యక్షునిగా ఎన్నుకున్నారు. ఆ సమావేశంలో యింకా కేరళ ప్రదేశాన్ని ఏమాత్రం ఆలస్యం లేకుండా రూపొందించడానికి, కేంద్ర ప్రభుత్వానికి ఒక విజ్ఞాపన పంపడానికి దాని గురించి ఆలోచించడానికి ఒక సబ్ కమిటీని ఏర్పాటు చేశాము. కె.ఎ. దామోదర మీనన్, మాణిక్కత్తు నారాయణ మీనన్, కె. బి. మాధవన్ నాయర్, జి. శంకరన్ నాయర్, డాక్టర్ ఆర్. కృష్ణ పిళ్లై మొదలైన వారు ఆ సబ్ కమిటీ సభ్యులు. సమైక్య కేరళ కమిటీ అధ్యక్షుడిగా నేనూ ఆ బృందంలో వున్నాను. కేంద్ర ప్రభుత్వానికి

సమర్పించడానికి ఆ కమిటీ ఒక నివేదికను తయారు చేసింది. పైగా పాల్‌ఘాట్‌లో సమైక్య కేరళ మహాసభ ఒకటి జరపడానికి నిశ్చయించింది.

1949వ సంవత్సరం నవంబర్ ఆరవ తేదీ సమైక్య కేరళ మహాసభ పాల్‌ఘాట్‌లో సమావేశమయింది. ప్రతినిధులు ప్రేక్షకులు చాలామంది ఆ మహాసభకు హాజరయ్యారు. తిరుచ్చూర్ మహాసభ, అల్వాయ్ మహాసభల్లా కాకుండా, పాల్‌ఘాట్ మహాసభ భిన్నంగా కనిపించింది. దానికి కొన్ని కారణాలు వున్నాయి.

1950 జనవరిలో నూతన రిపబ్లిక్ పరిపాలన ఏర్పడుతున్నప్పుడు కేరళ ప్రదేశాన్ని కూడా ఏర్పరచాలని మాలో కొందరం భావించాము. తిరువిదాన్కూర్ - కొచ్చి ఏకమైన తరువాత కేరళ ప్రదేశం ఏర్పడడానికి, మలబార్‌ను, దానితో కలిసిన ప్రాంతాలను, దీనితో కలిపివేయాలి. ఈ అభిప్రాయానికి మేము మద్దతుదార్లను చేర్చడానికి పూనుకున్నాము. కొందరికి మా చర్య నచ్చలేదు. దానికి వాళ్లు తెలియచేసిన కారణాలు రెండు.

రాజకీయరీత్యా, మద్రాసు రాష్ట్రం కన్నా తక్కువస్థాయిలో వున్న బి (విభాగం) రాష్ట్రం తిరువిదాన్కూర్ - కొచ్చి-మలబార్ మద్రాసు రాష్ట్రంలో ఒక భాగం కదా? ఆ స్థితిలో మలబార్, తిరువిదాన్కూర్ - కొచ్చి రాష్ట్రంలో కలిస్తే, మలబారు రాజకీయ విలువ తగ్గిపోతుంది. తిరువిదాన్కూరు - కొచ్చి రాష్ట్ర రాజకీయ విలువ, మద్రాసు రాష్ట్రానికి సమంగా అభివృద్ధి చెందేవరకు మలబార్ దానితో చేరడం సరైనది కాదని వాళ్లు వాదం లేవదీశారు.

మరొక సమస్య, రాజ ప్రముఖులకు సంబంధించినది. తిరువిదాన్కూర్ - కొచ్చి రాజ్యంలో మలబార్ చేరాలంటే ఆ ప్రదేశ నాయకుడు రాజ ప్రముఖుడు అవుతాడు. ఏకమై పోయినట్లయితే తిరువిదాన్కూర్ రాజు జీవితమంతా ఆ రాజ్యపు రాజ ప్రముఖుడిగా వుండే పరిస్థితి ఏర్పడుతుంది. రాజ ప్రముఖుడు, గవర్నర్ అధికార పదవికి సంబంధించినంతవరకు ఒకే హెూదాకు చెందిన వాళ్లే. కొందరికి ఆ పదవికి గల పేరూ, రాజ ప్రముఖుని పదవీకాల వ్యవధీ నచ్చలేదు. ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు పలుకుబడీ, శక్తీ పెరుగుతున్న ఆ కాలంలో ఒక రాజ ప్రముఖుణ్ణి రాష్ట్ర నాయకునిగా అంగీకరించడం సరైనదికాదు అని వాళ్లు పట్టుబట్టారు. నినాదాలు రగులుకున్నాయి. రాజ్య ప్రముఖుడు లేని ఒక కేరల ప్రదేశాన్ని ఆదరిస్తూ ఒక తీర్మానం ఆమోదించారు. పాల్‌ఘాట్‌లో మహాసభ ముగిసింది.

రెండు నెలలు గడిచిన తర్వాత, సబ్ కమిటీ సభ్యులు ఢిల్లీకి వెళ్లి ప్రధానినీ, సర్దార్ పటేల్‌నూ, కాంగ్రెస్ నాయకుణ్ణీ కలుసుకుని, సమైక్య కేరళ కోసరం ఒక నివేదికను సమర్పించారు. ఆ రోజులలో రాష్ట్రాల మంత్రి

కార్యాలయ కార్యదర్శిగా వున్న వి.బి. మీనన్, సమైక్య కేరళ రాయబార బృందానికి ప్రేరణను, సలహాలను యిచ్చారు.

కేరళ ప్రదేశాన్ని రూపొందించడానికి పెద్దగా ఆటంకాలు లేవు. అయితే ఆంధ్ర ప్రదేశ్ రూపొందించడానికి ముందు, ఇతర ప్రదేశాలను ఏర్పరచడం సరికాదనీ, తగిన సమయంలో ప్రభుత్వమే ఇటువంటి ప్రయత్నం చేసి, తగిన చర్య తీసుకుంటుందనీ అందువల్ల యింకా కొన్ని రోజులు వేచి వుండడం శ్రేయస్కరం అని ఆయన తెలియజేశారు. డిసెంబర్ నాలుగోతేదీ, నేనూ, మిగతా సభ్యులు ఢిల్లీ నుంచి తిరిగి వచ్చాము.

పాల్‌ఘాట్ మహాసభలో జరిగిన సంఘటనలకు సంబంధించి, సమైక్య కేరళకు వ్యతిరేకమైన అలజడులూ అప్పుడప్పుడు జరుగుతూ వచ్చాయి. కేరళ ప్రదేశానికి లోనైన ప్రదేశాలను గురించి, అస్పష్టమైన అభిప్రాయాలను కొందరు వెలిబుచ్చసాగారు. సమైక్య కేరళ కమిటీ అప్పుడప్పుడూ సమావేశమయినప్పటికీ, చెప్పుకోతగ్గ కార్యక్రమం ఏదీ ఆ కొద్దికాలంలో జరగలేదు. ఈ సమయంలో నేను శ్రీలంకకు భారతీయ రాయబారిగా వెళ్లాను. 1952వ సంవత్సరం సెప్టెంబర్‌లో నేను తిరిగి వచ్చాక సమైక్య కేరళ ప్రయత్నాలు మళ్లీ ప్రారంభమయ్యాయి.

ఈ లోగా 1952వ సంవత్సరం జూన్ నెలలో కాంగ్రెస్ కమిటీ రెండుగా చీలింది. తిరువిదాన్కూర్ - కొచ్చి ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ అని, మలబార్ ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ అని విడిపోయాయి సమైక్య కేరళ సంబంధించినంతవరకు లేని ఒక మార్పు ఈ కారణంగా వచ్చింది. 1953వ సంవత్సరంలో ఏప్రిల్ నెలలో పాల్‌ఘాట్‌కు చెందిన మలబార్ ప్రదేశ్ జాతీయ మహాసభ దక్షిణ ప్రాంత విభాగానికి అనుకూలంగా ఒక తీర్మానాన్ని ఆమోదించింది. 'తిరువిదాన్కూర్ - కొచ్చి - మలబార్‌తో పాటు కలిసిన మద్రాసు రాష్ట్రం కలిపి 'దక్షిణ ప్రదేశం' గా ఆ మహాసభ ఆమోదించింది.

సమైక్య కేరళ కమిటీ సమైక్య కేరళను రూపొందించడానికి ప్రయత్నాలు చేస్తున్నప్పుడు మలబార్ ప్రదేశ కాంగ్రెస్ చేసిన దక్షిణ ప్రదేశ తీర్మానం కొత్త చిక్కులను తెచ్చిపెట్టింది. ఇటువంటి విరుద్ధమైన అభిప్రాయాలు గలవారితో పోరాడుతూ, సమైక్య కేరళ కమిటీ తన ప్రయత్నాలను కొనసాగించింది.

1953వ సంవత్సరం డిసెంబర్ ఇరవైరెండో తేదీ, రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ గురించి ఆలోచించడానికి ఒక కమీషన్‌ను ఏర్పాటు చేస్తున్నట్లు ప్రధాని పార్లమెంటులో తెలియజేశారు. ఒక వారం కాగానే ముగ్గురు సభ్యులు గల కమీషన్‌ను ప్రకటించారు. హసన్ అలీ, హృదయనాథ్ ఖుస్రు, సర్దార్ కె.ఎమ్. ఫణిక్కర్ ఆ కమీషన్ సభ్యులు. సమైక్య కేరళకు సంబంధించి

కమీషన్‌కు సమర్పించవలసిన నివేదిక తయారుచేయడానికి కమిటీ ఆ తరువాత ప్రయత్నించి కృషిచేసింది. ఇందుకు కొన్ని రోజులుపట్టింది. కమిటీ దీనికోసరం చాలాసార్లు సమావేశమయింది.

1954వ సంవత్సరం జూన్ నెలలో కమిషన్ సభ్యులు కోళిక్కోడ్ వచ్చినప్పుడు సమైక్య కేరళ కమిటీ నివేదికను వారికి సమర్పించాము. తిరువిదాన్కూర్ - కొచ్చి రాజ్యం, మలబార్, దక్షిణ కర్నాటకలో కొన్ని భాగాలు, నీలగిరి జిల్లాలో గూడలూరు, ఊటి, గుటక్, లక్షదీవులు కలసిన ఒక ప్రదేశాన్ని సమైక్య కేరళగా కమిటీ ప్రకటించింది. కమీషన్ నివేదిక ప్రకటించడానికి కొంత ఆలస్యమయింది. ఈ లోగా చాలా సార్లు నేను కమీషన్ సభ్యుల్ని కలుసుకుని కేరళ ప్రదేశంలో చేర్చవలసిన ప్రాంతాల గురించి మళ్లీ మాట్లాడాను. సమైక్య కేరళను రూపొందించడానికి అనుకూలంగా ప్రతికూలంగా పలుచోట్ల నుంచి కమీషన్‌కు అందించిన అనేక నివేదికలు గురించి ఆ కాల ఘట్టంలో పత్రికలలో వెలువడిన వార్తలు ఎంతో ఆసక్తికరంగా వుండేవి. కేరళ ప్రదేశానికి అనుకూలంగా నివేదిక వెలువడినప్పుడు, దక్షిణ ప్రదేశం కోరుతూ వాదించేవారు, అలజడి ప్రారంభించారు. ఢిల్లిలోనూ, కేరళలోనూ వాళ్లకు కొందరు మద్దతు యిస్తూ వుండేవారు. సమైక్య కేరళ పట్ల సుముఖత చూపిన కొందరు ప్రముఖులు కూడా, 'దక్షిణ ప్రదేశం' కోరే వారుగా మారిపోవడం వేదన కలిగించింది. నా సన్నిహిత మిత్రుల్లో కూడా కొందరు ఆవిధంగా మారారు. మలబార్ ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ ఈ విషయంలో అనుసరించిన విధానం చాలా విచారించ దగ్గది. ఒక ప్రసిద్ధ పత్రిక ప్రచురించినట్టు 'కేరళ ప్రదేశం ఆశిస్తు తొలుత మంతనాలు ప్రారంభించింది కాంగ్రెస్. దానికి వ్యతిరేకంగా ఆఖర్లో వాదించేది కూడా కాంగ్రెస్సే. జాతీయ స్థాయిలో ఇలా జరగడం విచారించతగ్గ విషయం. కేరళ కాంగ్రెస్‌కు బీజాలు వేసిన ప్రదేశమే మలబార్. ఆ ప్రాచీన కుటుంబంలోనే ఇటువంటి విపరీతమైన మార్పు కనిపిస్తుంది'. అన్ని పార్టీల ప్రతినిధులూ పాల్గొన్న చర్చా సమావేశాన్ని నేను ఒకసారి నిర్వహించాను. కాంగ్రెస్ ప్రతినిధులు తప్ప తక్కిన పార్టీల ప్రతినిధులందరూ ఆ సమావేశానికి హాజరయ్యారు.

కమీషన్ నివేదికను ఆధారంగా భారత ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాలు వెలువడినప్పుడు, బొంబాయిలోనూ, మరికొన్ని ప్రాంతాలలో వాటిని అంగీకరిస్తూ, వ్యతిరేకిస్తూ పెద్ద ఎత్తున అలజడులు చెలరెగాయి. తమ తమ అభిప్రాయాలకు అనుగుణంగా రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ జరగలేదన్నదే ఆ అలజడులకు కారణం!

కేరళ ప్రదేశాన్ని ఏర్పాటుచేయడానికి నిర్ణయం తీసుకున్న తరువాత ఏర్పడిన పరిస్థితులను గురించి ఆలోచించడానికి సమైక్య కేరళ కమిటీ 1956వ సంవత్సరం మార్చి నాలుగోతేది తిరుచ్చూర్‌లో సమావేశమయింది. కమిటీ ఆ రోజు ఆమోదించిన తీర్మానం గురించి యిక్కడ తెలియ చేయడం అవసరం అనుకుంటాను.

'సమైక్య కేరళ కమిటీ కేరళ ప్రదేశాన్ని ఏర్పాటు చేయడానికి ధృడంగా నిలబడి కృషిని కొనసాగిస్తుంది'. 'కేరళ ప్రదేశంలో చేరవలసిన ప్రాంతాలకు సంబంధించి కమిటీ తెలియజేసిన హక్కులన్నీ అంగీకరించినట్లు తెలియలేదు. అయినప్పటికీ కేరళ ప్రదేశాన్ని రూపొందించే విషయం గురించి ఎన్.ఆర్.సి. (రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ కమీషన్) నివేదిక ఆధారంగా భారత ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాన్ని కమిటీ అంగీకరిస్తున్నది'

'సరిహద్దు తగాదాలకు సంబంధించి అలజడులు కొనసాగడం రాష్ట్ర ఉన్నతోద్దేశాలకే హాని కలిగిస్తుందని కమిటీ భావిస్తున్నది. నూతన కేరళ ప్రదేశం విజయానికి జరిగే కృషిలో ఉత్సాహంతో ఉత్తేజంతో కలిసి సహకరించడానికి, కమిటీ ప్రజలకు పిలుపునిస్తోంది'.

'కేరళ ప్రజల హృదయపూర్వకమైన ఆశలకు వ్యతిరేకంగా కేరళను మద్రాసుతోనే, మైసూర్‌లోనే లేదా రెండు ప్రాంతాలలోనే చేర్చడానికి కొందరు నాయకులు చేసే ప్రయత్నాలను కమిటీ ఆందోళనతోనూ, వేదనతోనూ పరిశీలిస్తూ వచ్చింది. అటువంటి ప్రయత్నాలను పూర్తిగా వదిలి పెట్టి కేరళను ఒక ప్రత్యేక ప్రదేశంగా రూపొందించాలని భారత ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాన్ని వీలైనంతవరకు త్వరగా కార్యాచరణకు తీసుకురావడానికి తగిన వాతావరణాన్ని సృష్టించాలని కమిటీ బాధ్యతగల అందరినీ ప్రార్థిస్తున్నది'.

సమైక్య కేరళ కమిటీ అంగీకరించిన ధోరణి ఇదే. ఈ ధోరణి తేటతెల్లంగా కేరళలోనూ, మరికొన్ని ప్రాంతాలలోనూ ఏర్పాటైన అనేక సమైక్య కేరళ మహాసభలలో నేను తెలియజేశాను.

నేను ఆశించిన ప్రకారం కేరళ ప్రదేశం రూపొందలేదని ఎరుగుదును. తిరువిదాన్కూర్‌లోని నాలుగు తాలూకాలు, గుడలూరు, కేరళ ప్రదేశంలో చేరని విషయం గురించి చాలా బాధ కలిగింది. ఐతే ప్రదేశంకన్నా ఇటువంటి కేరళ ప్రదేశం రూపొందడాన్ని నేను హర్షించాను. నా అభిప్రాయాన్ని 'మాతృభూమి' పోకడను తీవ్రమైన భాషలో ఖండిస్తూ పలు ఉత్తరాలు నాకు వచ్చాయి. రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ నివేదిక అమలు కానంత వరకు ఏమి జరుగనున్నదో సరిగ్గా తెలియదు. అది అమలులోకి రాగానే కేరళ ప్రదేశం రూపొందడం ఖాయం

అని తెలియగానే హద్దులేని ఆనందం పొందాను. చాలాకాలంగా వున్న కోరిక నెరవేరినప్పుడు ఆనందం సంతృప్తి కలగడం సహజమే కదా?

అఖిల కేరళ సాహిత్య పరిషత్తు రజతోత్సవాన్ని ఈ కాలంలోనే జరుపుకున్నాం. ఈ ఉత్సవానికి నేనెంతో ఉత్సాహంతో అధ్యక్షత వహించడానికి ఒప్పుకున్నాను. పరిషత్తు, కేరళలో సాహితీపరుల పెద్ద సంస్థ అని మాత్రమే కాదు - సమైక్య కేరళ రూపొందిన వెంటనే పరిషత్ రజతోత్సవాలు కలిసి వచ్చాయి. ఇది ఒక శుభ సూచనగా నేను భావించాను. పరిషత్ రాజకీయాలకు అతీతంగా వ్యవహరించినప్పటికీ కేరళ ప్రజలను ఏటా ఒకే వేదిక మీదికి తీసుకువచ్చి, వాళ్లు ఒకరి నొకరు పరిచయం చేసుకొవడానికి ఐకమత్య బీజాలు నాటడానికి దోహదం చేసింది. సాస్కృతికంగా సమైక్య కేరళ కోసరం పరిషత్తులా దీక్షతో కృషిచేసిన సంస్థ మరొకటిలేదు.

భారతదేశంలోని ముఖ్య భాషలలో సుప్రసిద్ధమైన కొందరు సాహితీపరులు ఈ ఉత్సవాలకు ఆహ్వానించబడ్డారు. ఈకారణంగా నేను అధ్యక్షత వహించడానికి చాల సంతోషించాను. ముఖ్యంగా భాషా ప్రాతిపదికపై ప్రదేశాలను రూపొందించడం భారతీయుల ఐకమత్యానికి హానిచేయదు, పైగా దాన్ని దృఢతరం చేస్తుంది అని నేను ఆ రోజుల్లో భావించాను. వివిధ భాషా ప్రాంతాలలో చాలా సన్నిహితంగా మసలుతూ, సంస్కృతిలోనూ, సాహిత్యంలోనూ, సుస్థిరం చేయబడ్డ భారతీయ ఐకమత్యాన్ని స్పష్టంగా చూడవచ్చని భావించాను. సాహితీపరుల మహాసభకు అలాంటి ఉద్దేశంతోనే ఎంతో ఉత్సాహంగా నేను స్వాగతం పలికాను.

నా అధ్యక్షోపన్యాసంలో, సాహితీపరులు రాజకీయ పక్షాలకు చెందిన వారిలాగా విడిపోయి కీచులాడడం గురించి, అందువల్ల ఏర్పడే యిబ్బందులను గురించి, విమర్శించాను. విజ్ఞాన వైశిష్ట్యం గలవీ, ఉత్సాహం కలిగించే ఉన్నత గ్రంధాలను విరివిగా వెలువరించాలని అందుకు ఈనాటి సాహితీపరులందరూ, ప్రచురణకర్తలూ సహకరించాలని విజ్ఞప్తి చేశాను. ఉత్తమ గ్రంధాలు రూపొందడానికి ఇలాంటి సహకారం చాలా అవసరమని సూచించాను. పరిషత్ కార్యకలాపాలలో తీసుకోవలసిన కాలానుగుణ్యమైన కొన్ని సంస్కరణలను కూడా తెలియజేశాను.

మహాసభలో పార్టీ తేడాలు పాటించకుండా చాలామంది ప్రజలు పాల్గొనడం నాకెంతో ఉద్వేగాన్ని కలిగించింది. సాహిత్యాభివృద్ధి పట్ల వివిధ రంగాలకు చెందిన కేరళ ప్రజలు చూపే ఉత్సాహం శ్రద్ధ కేరళ ప్రగతికి దోహదం చేయాలని నేను ఆశించాను. సాంస్కృతిక రంగాలలో ఏర్పడిన సహకారం జాతీయ రంగంలో ఏర్పడినట్లయితే కేరళ ప్రదేశం భవిష్యత్తు గురించి ఎవరూ

దిగులు పడనవసరంలేదు. కేరళ సత్వర ప్రగతిలో అందరు మలయాళీలకు హృదయపూర్వకమైన ఆసక్తి వున్నదని నా విశ్వాసం. జాతీయ, ఆర్థిక, సాంఘిక రంగాలలో సహకార సూచనలు ప్రారంభమయ్యాయని నాకు అనిపించింది. సాహితీ మహాసభలో చూపిన ఉత్సాహం, ఐకమత్యం,, భావం, కేరళ సముజ్వల భవిష్యత్తుకు సూచనలు అన్న నమ్మకంతో నేను మహాసభ నుంచి తిరిగి వచ్చాను.

1956వ సంవత్సర నవంబర్ ఒకటో తేదీ కేరళ ఒక ప్రత్యేక ప్రదేశమయింది. ఆ విజయోత్సవానికి అధ్యక్షత వహించడానికి నేను ఎర్నాకుళం వెళ్లాను. ప్రజలు గుంపులు, గుంపులుగా వచ్చి ఆ బహిరంగ సభలో భారీ ఎత్తున పాల్గొన్నారు. కేరళ రాష్ట్రం మీదున్న నా భావి విశ్వాసం దాన్ని చూడగానే మరింత దృఢతరమయింది. కేరళలాగే ఇతర ప్రాంతాలూ ఆ రోజున ఆనందంగా వేడుకలు జరుపుకున్నాయి. ఉజ్వలమైన భవిష్యత్తు కోసరం హృదయపూర్వకమైన విశ్వాసంతో వెళ్లే ప్రజలను నేను ఆ ఉత్సవ సందర్భంలో చూసి ఉద్వేగంతో పరవశం చెందాను.

# నా ఊహలలో కేరళ

అమితోత్సాహంతో ఒక లక్ష్యసాధనకోసరం నిర్విరామంగా కృషిచేస్తున్నప్పుడు ఆప్రయత్నమే ఆనందానుభూతిని కలిగిస్తుంది. లక్ష్యాన్ని సాధించిన తర్వాత సాధించామన్న ఆనందంతో ఎన్ని రోజులు మురిసిపోవడానికి లేదు. తర్వాత ఏమి చెయ్యడమో తోచని స్థితి ఏర్పడుతుంది. రకరకాల ఆలోచనలు తలెత్తుత్తాయి. అలాంటి మనోస్థితి కేరళ ప్రదేశం ఏర్పడిన తర్వాత నాలో కొత్త ఆలోచనలకు దోహదం చేసింది.

కేరళ రాష్ట్రం ఏర్పడింది. ఇకపై ఏంచెయ్యాలి? కేరళను అభ్యుదయ పథంలో తీసుకెళ్లడం సాధ్యమేనా? దానికి తగిన మార్గమేది? ప్రగతి పథకాలను గురించి చేను చెప్పడం లేదు. పథకాలు రూపొందించి కార్యరూపం కలిగించడానికి కావలసిన మనోస్థితిని గురించి చెబుతున్నాను. మన ప్రజలు ఉత్సాహం గల వాళ్లే. సేవ చేయ్యడానికి వెనుకాడే వాళ్లుకాదు. 'అయినా చాలా మంది ఏం చెయ్యాలి? అన్న విషయం తెలియని మూఢులు' అంటే తప్పు లేదు. మనలో మన లక్ష్యం గురించి స్పష్టమైన నిర్దుష్టమైన అవగాహన కావాలి. లక్ష్యం కోసం కేవలం ఉత్సాహంగా వుంటే చాలదు. ఎలాంటి ఆకర్షణీయమైన లక్ష్యమైనప్పటికీ, ఆచరణలో పెట్టి విజయం సాధించడానికి స్పష్టమైన నిర్దుష్టమైన పథకాలు లేనట్లయితే ప్రయోజనం లేదు. లక్ష్యాన్ని మనం గమ్యంగా భావించి కృషి చెయ్యాలి.

నా ఊహల్లోని కేరళ నేను ఇవాళ చూస్తున్న కేరళ కన్నా చాలా భిన్నమైనది. లేమి, నిరుద్యోగం అక్కడలేవు. అపరిశుభ్రమైన పూరి గుడిసెలు, ఆకలితో అలమటించే ప్రజల్ని అక్కడ చూడలేము. నూతన పరిశ్రమలు విస్తృత వ్యాపారాలు, ఆధునికమైన వ్యవసాయం కేరళను పూర్తిగా మార్చివేస్తుంది. ప్రాథమిక పాఠశాల లేని గ్రామం వుండదు; పచ్చగా కనువిందు చేసే ఉద్యానవనాల్లో ఆడిపాడుకునే పిల్లల ఆరోగ్యాన్ని చూస్తే మనసు ఉప్పొంగుతుంది. గ్రామసీమలలోనూ నగరాలలోనూ తీర్చి దిద్దిన శుభ్రమైన రోడ్లు, వీధులు, అందంగా నిర్మింపబడిన భవనాలు చూపరుల హృదయాలను దోచుకునే విధంగా వుంటాయి. ప్రజల సౌజన్య పూరితమైన మాటలు, వ్యవహరించే తీరు వచ్చినవారికి ఆనందాన్ని సమకూరుస్తాయి. వైద్య

నిలయాల్లో చికిత్సా సౌకర్యాలు అభివృద్ధి చెందివున్నప్పటికీ తక్కువ మంది రోగగ్రస్తులే కనిపిస్తారు. కార్మికులు ఆనందోత్సాహాలు, తృప్తి ప్రతిబింబించే ముఖాలలో తమ బాధ్యతలు నిర్వహించి, సాయంకాలం యింటికి వచ్చి బట్టలు మార్చుకుని వినోద స్థలాలకు వెళ్లే దృశ్యం చూడడానికి ఎంతటి ఆనందాన్నిస్తుంది? వెడల్పయిన రోడ్లమీద అటూ ఇటూ పరుగులు తీసే వాహనాలు, యూనిఫారాల్లో వికసించిన ముఖాలతో పనిచేసే బస్సు కార్మికుల్ని చూస్తే ఎంతటి సంతృప్తి కలుగుతుంది? ప్రయాణికుల సౌకర్యార్థం అక్కడక్కడ ఏర్పరచిన హోటళ్లు, మరో విధంగా కొత్తదనాన్ని చేకూరుస్తాయి. తక్కువ ధరకు శ్రేష్ఠమైన ఆహారం యిక్కడ లభిస్తుంది.

ప్రభుత్వ కార్యాలయాలో సక్రమంగా పద్ధతిగా పనులు జరిగేతీరు వర్ణనాతీతం. ప్రజల అవసరాలను గ్రహించి క్షణాలమీదుగా అవి సమకూర్చడానికి, సిద్ధంగా వున్న ఉద్యోగుల గురించి గొప్పగా భావించాలి; యాత్రికులు స్వర్గతుల్యంగా భావించే ప్రకృతి దృశ్యాలు కేరళలో చాలా వున్నాయి. వాళ్ల యిష్టానుసారం ప్రయాణం సాగించడానికి వసతులు, తగిన టూరిస్టు భవనాలు, విరివిగా ప్రజల్ని ఆకర్షిస్తాయి. నూతన కేరళ నిర్మాణ కార్యక్రమాలకు కావలసిన ద్రవ్యసేకరణకు మార్గాలు ఏర్పడుతాయి. బిక్షమెత్తుకునే వాళ్లనే, ఆకలితో అలమటించేవారినే, అక్కడ చూడడానికి వీలుకాదు. ఆటలకోసరం క్రీడా స్థలాలు విరివిగా వుంటాయి. శరీర ఆరోగ్యాన్ని తేజస్సునూ అభివృద్ధి చేసుకునే విధంగా ఎన్నెన్నో క్రీడలు యేటా తిరునావాయిలో జరిగే కేరళ కళోత్సవం కేరళ పేరు ప్రఖ్యాతుల్ని ఇనుమడింపజేస్తుంది!

ప్రజాప్రతినిధులు సమావేశమయ్యే శాసన సభామంటపం నూతన రీతిలో వుంటుంది. నిర్మాణ పద్ధతి మాత్రమే కాదు, చూపరుల దృష్టిని ఆకర్షించే విధంగా వుంటుంది. ప్రజా ప్రతినిధులు గౌరవనీయమైన దుస్తులు ధరించి అందులో సమావేశమవుతారు. నాగరికతతో ప్రేమతోను వ్యవహరించే వారి మధుర స్వభావం వారి వివేకపూరితమైన ఉపన్యాసాలు, వివాదాలు చూపరులకు కేరళ శాసన సభ నడిచే తీరును మళ్లీ మళ్లీ చూడాలనిపించేలా చేస్తూ, ఔన్నత్యాన్ని ప్రతిబింబిస్తాయి.

ఇలాంటి ఊహకు తగిన విధంగా ద్రవ్య సంపద, నాగరికతా వికాసం, చెట్టా పట్టాలేసుకుని నడిచే సమగ్ర కేరళ మన లక్ష్యం. దానికి పునాదులే ఐకమత్యం. వివిధ సమాజాలు, మతాలకు చెందినవారి మనఃపూర్వకమైన సమైక్యత. అలాంటి సమగ్రమైన కేరళను మనం పునాదులనుంచి నిర్మించాలి.

లక్ష్యం ఫలానా అని స్పష్టంగా తెలుసుకున్న తర్వాత మార్గాల గురించి ఆలోచించాలి. కార్యాచరణకు ఎదురయ్యే అడ్డంకులను, గురించి ఆలోచించాలి. ప్రజా సంక్షేమ కార్యాలకు అడ్డుపడి ఆటంకాలు కలిగించే వాళ్ళు చాలావరకు సంకుచిత స్వభావాలుగల వాళ్లగానే వుంటారు. ఎదుటివారి అభిప్రాయాలను, గౌరవించడం తెలియని మనస్తత్వం, కష్టించి పనిచేయడానికి ఉత్సాహం గలవాళ్లను కూడా బాధిస్తుంది.

'నాకు, నాజాతివాళ్ళు, నాజాతి అన్న ఆలోచనలు అధిగ మించి – నాదేశం' నా దేశం తర్వాతనే నేను' అన్న మనోభావం ఏర్పరచుకోవాలి. సమైక్య కేరళం నాకేమిచ్చింది? అని అడగడానికి బదులుగా ఐక్య కేరళానికి మనం ఏమి చేశాము? అని ప్రతి ఒక్కరు ప్రశ్నించుకోవాలి. ఏ మతానికి సంబంధించిన వాళ్లయినప్పటికి ఎలాంటి అభిప్రాయాలు కలిగివున్న వాళ్లయినప్పటికి దేశ ప్రజాలుగా భావిస్తూ ఓ ఉన్నత లక్ష్యాన్ని స్వల్పమైన స్వార్థ ప్రయోజనాలకు బలి యివ్వకూడదు.

లక్ష్యసాధనకు ఆత్మ విశ్వాసం చాలా ముఖ్యం. సామర్థ్యం మాత్రం వుంటే చాలదు, ఉత్సాహం వుంటేనే చాలదు. అనుకున్న పనిని విజయవంతంగా పూర్తి చేయగలమనే ఆత్మవిశ్వాసం వుండాలి. ఆత్మవిశ్వాసం వున్న మనిషే – చెయ్యడానికి కష్టమైన పనులన్నిటినీ చెయ్యగలడు. 'బ్రిటిష్ ఆధిపత్యంలో మనం బానిసలుగా బ్రతుకవలసిందే' అని మనం నిద్రపోతూ గడిపాము. ఒకప్పుడు 'ఆనందం, స్వతంత్రం ఆంగ్లేయులకు...పేదరికం, బానిసత్వం మనకు అని' బాధ పడిన కాలాన్ని చవిచూశాము. అవన్నీ కేవలం జ్ఞాపకాలుగా ఇవాళ పరిస్థితులు మారిపోలేదా? దానిని ఎలా సాధించాము? ఆత్మవిశ్వాసంతో చేసిన ప్రయత్నాల వల్లే కదా విజయం సాధించాము?

మరో విషయం కూడా చెప్పాలి: అదే ఐకమత్యం. ఐకమత్యంతో వుంటేనే మనం అనుకున్న లక్ష్యాన్ని మనం అనుకున్న కాలంలో సాధించడం వీలవుతుంది. ఎలాంటి సమర్థుడూ, ధీరుడూ, ఉత్సాహవంతుడూ, అయినప్పటికీ యితరులతో కలిసి కృషిచేయకపోతే అలాంటి ఉదాత్త గుణాల వల్ల ఎలాంటి ప్రయోజనమూ వుండదు. దేశం ఔన్నత్యం సాధించడానికి జీవనానికీ ఐక్యమత్యమే ముఖ్య సాధనం.

సహకరించే మనస్తత్వం లక్ష్యాన్ని తేటతెల్లంగా గ్రహించి దానిని సాధించే మార్గాలు అన్వేషించడం, ఆత్మ విశ్వాసంతో అందరూ కలిసి కృషి చేసే పట్టుదల నూతన కేరళను ఉన్నతంగా ఉత్తమ స్థాయిలో నిర్మించడానికి యివన్నీ చాలా ముఖ్యం. ప్రజలలో యింతవరకూ పౌరబాధ్యతల పట్ల సరైన ఉ...షన ఏర్పడలేదు. దేశ ఔన్నత్యాన్ని, మంచి అవగాహనగల పౌరులే కదా

కాపాడి అభివృద్ధి చేయగలరు? అలాంటి ప్రగాఢ అవగాహన ప్రగాఢమైన శిక్షణ ద్వారానే ప్రజాహృదయాలలో ఏర్పరచడం సాధ్యం. ప్రతి పౌరునికి దేశంపట్ల ఉదాత్తమైన బాధ్యత వుంది. ఆ బాధ్యతను నిర్వహించడానికి కావలసిన శిక్షణ, జీవితంలోని వివిధ ఘట్టాలనుంచి లభించాలి. అందువల్ల పౌరశిక్షణ సంఘాలను దేశం మొత్తం మీద నెలకొల్పాలి. ఈ దేశ పౌరులుగా మన బాధ్యతలను బాగా గ్రహించి నిర్వహించడానికి అవసరమైన లక్షణాలు అభివృద్ధి చేసుకోవాలి. అందుకు మనం శ్రద్ధ చూపాలి.

1. విద్యా వికాసం: ప్రజాస్వామ్య పరిపాలనలో ప్రజల వద్దే అధికారం వుంటుంది. మొదటమొదట ప్రజలకు స్వయంగా ఆలోచించే సామర్థ్యం వుండాలి. సరైన అభిప్రాయాలను ఏర్పచుకోవడానికి కావలసిన తెలివితేటలు ప్రజలందరూ పొందాలి. వివేకవంతం కాని అధికారం అపాయాల్ని కలిగిస్తుంది. ఉన్నత పదవులలో వున్నవారిని గురించే నేనిక్కడ చెప్పడంలేదు. వివిధ స్థాయిల్లో వున్న ప్రజల గురించి చెబుతున్నాను. ఓటు హక్కు పొందిన వారిని, లేనివారిని, శాసన సభలలోనూ, స్వచ్ఛంద సంస్థలలోను వున్నవారిని గురించి, వృత్తులను, జీవనోపాధిగా చేసుకున్నవారిని, స్త్రీలను, పురుషులను, అందరినీ బాధించే విషయాలను గురించి నేనిక్కడ చెబుతున్నాను. ఈనాటి ప్రపంచం గురించి ప్రజ్ఞ, కనీస అవగాహన అందరికీ వుండాలి. తర్వాత వ్యక్తిగత సమస్యల గురించి సరైన అవగాహన వుండాలి. విద్య, చదువు అని అంటున్నప్పుడు పాఠశాలలోనూ, కళాశాలలలోనూ, విశ్వవిద్యాలయాలలోనూ చదివే చదువును గురించి చెప్పడంలేదు. దేశ పౌరుల సామాన్య బుద్ధి వికాసం గురించే ముఖ్యంగా చెబుతున్నాను. అసెంబ్లీలలో బాధ్యతలు నిర్వహించేవారికి, తమ కార్యనిర్వాహణ గురించి తప్పకుండా విద్యాజ్ఞానం వుండాలి. సంగతులను సక్రమంగా అర్థం చేసుకుని వుంటేనే వాటిని సక్రమంగా నిర్వహించడానికి సాధ్యమవుతుంది. ఆ విధంగా ప్రజలకు కావలసిన సామాన్య విద్యతో పాటు వ్యక్తిగతమైన అవసరాలకు తగిన విధంగా వృత్తికి కావలసిన ప్రత్యేక విద్య పొందడానికి పరిస్థితులు కావాలి.

2. నడవడిక: నడవడిక అంటే ఏమిటి? అందులో ఎన్నో యిమిడివున్నాయి. ఇతరుల ఆనందానికి, విశ్వాసానికి పాత్రమయ్యే విధంగా నడుచుకోవడం, మంచి నడవడికకు వున్న ప్రత్యేకత. చెప్పే మాటలకు అనుగుణంగా నడుచుకోవడం చేపట్టిన బాధ్యతలను సక్రమంగా నెరవేర్చడం ఇతరుల మంచికి మనుగడకు కీడు తలపెట్టకుండా వుండటం, అవినీతి, అక్రమాలు ఎదురైనప్పుడు సహించకుండా ఎదురు తిరగడం - ఇవన్నీ వుండడమే మంచినడత. ఒక ఉత్తమ పౌరునికి ఈ లక్షణాలన్నీ వుండాలి. ఈ

లక్షణాలు ఏర్పరచగల సక్రమ మార్గాలలో తప్పకుండా శిక్షణ యివ్వాలి. పౌరులకు చదువుకున్న మంచినడతకు ఎక్కువ ప్రాముఖ్యత నివ్వాలి.

3. పరి శుభ్రత: పరి శుభ్రత అంటే శారీరిక శుభ్రత మాత్రమే కాదు; శారీరక పరిశుభ్రత చాలా ముఖ్యం, అయినా కేవలం శారీరిక శుభ్రత మాత్రం చాలదు. నివసిస్తున్న యిల్లు, చుట్టు పట్ల పరిసరాలు శుభ్రంగా అందంగా వుండాలి, అలా వుంచుకోవడమే నాగరికత. ప్రతిపల్లె, ప్రతి పట్టణం కూడా అలా శుభ్రంగా వుండడానికి ప్రజలందరూ శ్రద్ధ చూపాలి. గ్రామసీమల్లోని ప్రజలందరూ కృషి చేస్తే గ్రామాలు కళ కళలాడుతూ వుండవూ? మన దేశం ఒకప్పుడు ఎంత గొప్పగా వెలిగింది?

4. దుస్తులు : దుస్తులు మనిషి శరీరాన్ని మాత్రం రక్షించడం లేదు, అవి గౌరవాన్ని కూడా కాపాడుతాయి. ప్రస్తుతం దుస్తులు ధరించే అలవాట్లలో వస్తున్న నిర్లక్ష్య ధోరణి విపరీతమైన అక్రమ ప్రవర్తనకు దోహదం చేస్తోంది. పాశ్చాత్య పద్ధతిలో దుస్తులు ధరిస్తున్నట్లు కొందరు చెబుతారు. ప్రాచీనకాలం నుంచీ మన పూర్వులకు అందంగాను, నియమబద్ధంగాను, దుస్తులు ధరించే అలవాటు వుంది. ఇటీవల కొంతకాలంగా ఆ అలవాటు ప్రకారం ఎవరూ దుస్తులు ధరించడం లేదు. నిరాడంబరజీవితం అన్న పేరుతో ఎక్కడికైనా సరే ఎలాంటి దుస్తులైనా ధరించవచ్చు అన్న అలవాటు ఆచరణకు వచ్చేసింది. ఈ విధంగా పిన్నలూ, పెద్దలూ కూడా తప్పు చేస్తున్నారు. మన అసెంబ్లీ సమావేశాలలోనూ, ప్రభుత్వకార్యాలయాలలోనూ కొన్ని వింతలను చూస్తుంటే, మన గౌరవం పెరగటానికి ఎలాంటి అవకాశం లేదనిపిస్తోంది. కార్యాలయ క్రమశిక్షణ రక్షించాలంటే అందుకు దుస్తులు ధరించడంలోనూ నియమాలు, ఓ పద్ధతిని అనుసరించాలి. ఆడంబరం అవసరం లేదు, అయినా, శుభ్రత, అందం, పద్ధతి.... యివన్నీ వుండాలి. అది మన నాగరికతలో ఒక భాగం.

5. ఆరోగ్యం : శరీర దారుఢ్యాన్ని తేజస్సును, పెంపొందించే వ్యాయామ శిక్షణను యువతీ యువకులకు యివ్వాలి. పుట్‌బాల్, క్రికెట్ మొదలైన ఆటలలో యువకులు ఆసక్తి చూపుతున్నారు. కాని అది చాలదు శరీర సౌష్ఠవం, కాంతి పొందాలంటే క్రమబద్ధమైన వ్యాయామం, విశ్రాంతి అవసరం. మానసిక నైర్మల్యం, వికాసం పొందాలంటే అందుకు శరీరాన్ని కూడా అందంగా, ఆకర్షవంతంగా వుంచుకోవాలి. పూర్వకాలంలో యుద్ధశిక్షణ, కుస్తీ, సాము గారడీలు మొదలైనవి శారీరక అందచందాలను యినుమడింపజేయడానికి దోహదం చేసేవి. ఇవాళకూడ అలాంటి క్రీడలను శిక్షణ దేశం మొత్తం మీద వ్యాప్తి చెందేట్టు చేయడం మంచిది. పదిహేను సం॥ వయసుకు రాకముందే,

బాలబాలికలకు శారీర సౌష్ఠవానికి సంబంధించిన వ్యాయమ శిక్షణ యివ్వడం మరీ శ్రేయస్కరం. ఇందుకోసరం కార్యక్రమాలను నిర్మాణాత్మకంగా రూపొందించాలి.

6. కాలక్షేపం: సంతోషంలేని గ్రామ జీవితాలనే యివాళ చూస్తున్నాం. కాలక్షేపానికి మానసిక వికాసం కలిగించే సౌకర్యాలు, సమయం గ్రామీణ ప్రజలకు తక్కువే. నగరవాసులకు అలాంటి వసతులు బాగావున్నాయి. పూర్వకాలంలో రకరకాల ఆటపాటలుండేవి. ఉత్సవాల కాలంలోను, పండుగ రోజుల్లోను, అలాంటి ఆటపాటలు వినోద క్రీడలతో మానసికానందం కలిగించే అవకాశం వుండేది. ఇవాళ అలాంటివేమీ లేవు. వాటి స్థానంలో వేరే వినోద క్రీడలు కూడా ఏర్పడలేదు. ప్రాచీన క్రీడలకు మళ్లీ జీవంపోసి, కొత్త రకమైన వినోద క్రీడలను స్థానం కల్పించాలి. మన యువకులకు ఉత్సాహ ప్రోత్సాహం అందజేయాలి.

7. సేవ: మనిషి ఒక సంఘజీవి. ఎన్నో సౌకర్యాలను సంక్షేమాలను కలుగజేసే సమాజం పట్ల పౌరులకు కొన్ని బాధ్యతలు వున్నాయి. ఆ బాధ్యతలు నిర్వహించడం చాలా ముఖ్యం. ఒక విధంగా కాకపోయినా మరో విధంగా మనం ఒక్కొక్కరం సమాజానికి సేవ చెయ్యవచ్చు. అలాంటి సేవే మనకు మంచి సమకూరుస్తుంది. ప్రపంచ మహనీయులందరూ, ఇతరులకు మంచి జరిగే విధంగా మనం మన జీవితాలను మలుచుకోవడమే ఉత్తమమని నొక్కివక్కాణించారు. మన జీవితంలో ఒక భాగం అలాంటి సేవలకు ఉపయోగపడాలి. ఏ స్థాయిలో వున్న వారికైనా సరే యిది సాధ్యమయ్యేపనే. చక్రవర్తి ఆల్‌ఫ్రెడ్‌ను గురించి విన్నాం కదా? ఆయనకు పరిపూర్ణమైన సంపద పలుకుబడి వుండేవి. ప్రజాసేవకే అంకితమని జీవించాడు. ప్రజలలో విద్యావికాసం కలిగించడానికి యితర భాషా గ్రంధాలను తన భాషలోకి తెచ్చారు. ఆయన జీవితాశయమే ప్రజాసేవ. భారత దేశంలో విశేష కీర్తి నార్జించిన గాంధీ మహాత్ముని ఉదాత్త జీవితం ప్రజాసేవకే అంకితమైంది. ఎలాగైనా జీవించాలని మనం అనుకుంటాం. జీవితంలో సార్థకతను సాధించాలంటే, సేవా హృదయంతో కృషి చేయడమే ఉత్తమం. మన సమయంలో ఒక భాగాన్ని ప్రజాసేవకు అర్పించడానికి మనలో ఒక్కొక్కరు కృతనిశ్చయులు కావాలి. అది మన సామర్థ్యాన్ని పెంచుతుంది. పలుకుడి, మంచి పెరుగుతాయి.

పై విధంగా శిక్షణ యివ్వడానికి, ప్రభుత్వానికి సంబంధించిన సంస్థలు తప్ప కుండా ఏర్పడాలి. రకరకాల వయోపరిమితులవారికి తగ్గట్టు శిక్షణా శిబిరాలు ఏర్పాటు చెయ్యవచ్చు. స్త్రీలకంటూ ప్రత్యేకంగా శిక్షణ యివ్వాలి, అలా జరిగిన

రోజు మనదేశం ఎంతటి ఉన్నత స్థాయికి చేరుకుంటుంది? అన్ని కాలాలకు, అన్ని తరగతుల వారికి సరిపడే పథకాలను రూపొందించడం సాధ్యం కాదు. కాలానుగుణంగా అన్నిటా మార్పులు చెయ్యవలసి వుంటుంది. అందువల్ల మన సుదూర భవిష్యత్తులో కార్యరూపం యివ్వడానికి తగిన కొన్ని పథకాలను యిక్కడ చర్చిద్దాం.

ఆలోచనలనుంచే ఆచరణ పుడుతుంది. మనం ఇవాళ అనుభవించే సౌకర్యాలన్నీ అనేక మంది ఆలోచనల పర్యవసానంగా ఏర్పడినవే. నిర్మాణాత్మకమైన ఆలోచనా విధానం, మనిషిని కార్యశూరుణ్ణి చేస్తుంది. మనం జీవించే పరిసరాలతో పాలుపంచుకోవడానికి కూడా అది సహాయపడుతుంది. పగటి కలలు కంటూ పడుకోవడం గురించి నేనిక్కడ చెప్పడం లేదు. కార్యసాధనకు పురికొల్పే, ఉత్సాహాన్ని పెంపొందించే నిర్మాణాత్మకమైన ఆలోచనలే మంచి చేకూరుస్తాయి. ముందు వివరంగా చెప్పినట్లు పౌరశిక్షణా శిబిరాలను, కేరళ రాష్ట్రమంతా ఏర్పరచినట్లయితే, ఆశ్చర్యం కలిగించే మార్పులను సాధించవచ్చు అనడంలో సందేహం లేదు. ఈ సలహాను పరిశీలించడం సాధ్యం కాదా?

ఇరవై అయిదు శతాబ్దాలకు ముందు 'గ్రీసు'లో జీవించిన తత్త్వజ్ఞాని, 'పైతాగరస్' తమ శిష్యులకోసారి ఇలా చెప్పేరు.

'ఒక ఉన్నతమైన పౌరునికి తన దేశంతో వున్న బాంధవ్యం గురించి నేను వివరంగా చెబుతున్నాను. దేశం, తల్లి, తండ్రి కన్నా ఉత్తమమైనది. సంతానాని కన్నా స్నేహితుల కన్నా ఉన్నతమైన సాన్నిహిత్యం కలది. దేశం అందరికీ తల్లి తండ్రి; భార్యకి భర్త, భర్తకు భార్య; కుటుంబం అన్న సంస్థ ఉన్నతమైన సంస్థ. భార్యాపిల్లల ద్వారా ఒకరు పొందే ఆనందం ఎంతటి పవిత్రమైనది? అయితే దానికన్నా ఉత్తమమైనది అందరినీ సంరక్షించే దేశం అదిలేదంటే దోపిడీదారులు కుటుంబాలను కొల్లగొట్టి నాశనం చేస్తారు. కన్నతల్లి మానమర్యాదలు మంచి పౌరులకు ఏవిధంగా గౌరవప్రదమైనదో - అలాంటిదే తన దేశ గౌరవం కూడా. భార్యా బిడ్డలను కాపాడే దేశ గౌరవాన్ని వారికన్నా వెలలేనిదిగా భావించాలి. మీ జీవితానికి సంపన్నత సమకూర్చేది దేశమే. మీకు ప్రశాంతత, భద్రత సమకూర్చేది అదే. దేశం ద్వారానే నాగరికుడైన మానవుడు అటవిక జీవితం నుంచి విడివడి, సంస్కార స్వభావాలను పెంపొందించుకుని, కళలను పెంచి ఔన్నత్యాన్ని పొందుతున్నాడు. వీరులు తమ యింటి కోసరం కుటుంబంకోసరం, దేనినైనా ఎలా త్యాగం చేస్తారో - మాతృదేశంకోసరం, తమ అమూల్య ప్రాణాలను సైతం త్యాగం చేయడానికి అంతకన్నా సంతోషంగా ముందుకు వస్తారు!'

# ఒక క్లిష్ట పరిస్థితి

కేరళ ప్రదేశం ఏర్పడినప్పుడు ఎన్నో గొప్ప విషయాలు జరుగుతాయని ఆశించాను. కేరళ ప్రజలు విద్యాబుద్ధి, సేవా హృదయం గలవారు. వాళ్లు ఉత్సాహంతో కలసి పనిచేసినట్లయితే కేరళ భారతదేశంలో మిగతా రాష్ట్రాలకు ఒక ఆదర్శంగా పునర్వికాసంతో భాసించగలదని భావించాను. నేను ఎదురుచూసిన అభివృద్ధి కేరళలో కనిపించలేదు. అందుకు విరుద్ధంగా, నేను ఎదురు చూడని, ఆశించ కూడని, వినాశ స్థితిని చూడవలసిన దయానీయ స్థితి ఏర్పడింది. అయినప్పటికీ కేరళ రాష్ట్రం ఏర్పడిందే కేరళ ప్రజలకు మంచిది కాదని నేను భావించడం లేదు. లోటుపాట్లను అలావుంచి తప్పులను సరిదిద్దుకొని పురోగమించడానికి మార్గాలు వెతకవచ్చు.

కేరళ రాష్ట్రం ఏర్పడి ఎక్కువ రోజులు కాక ముందే తిరువనంతపురంలో ఒక పెద్ద పోరాటం బయలుదేరింది. కేరళ ఉన్నత న్యాయస్థానం గురించిన పోరాటం అది. తిరువిదాన్కూరూ, కొచ్చి ఏకంకాగానే నూతన తిరువిదాన్కూర్ - కొచ్చి ప్రదేశ రాజధాని నగరం తిరువనంతపురమే అని తీర్మానించబడింది. ఉన్నత న్యాయస్థానం ఎర్నాకుళంలో వుంటుందని నిర్ణయించబడింది. అయితే కేసును నమోదు చేసే ఫైలింగ్ అధికారాలతో ఉన్నత న్యాయ స్థానం ఒక 'బెంచ్' తిరువనంతపురంలోనూ నెలకొల్పడానికి తీర్మానించారు. కేరళ ప్రభుత్వం సమైక్యంగా అమలులోకి రాగానే ఆ 'బెంచ్'కు సంబంధించిన అధికారాన్ని తీసివేయాలని తీర్మానించారు. పోరాటం దీనికి వ్యతిరేకంగా చెలరేగింది. ఉన్నత న్యాయస్థానానికి సంబంధించిన 'బెంచ్' పలుచోట్ల ఏర్పాటు చేయడం, ఒక ఉన్నత న్యాయస్థానానికి గౌరవప్రదం కాదన్న కారణంతో ఈ పోరాటం న్యాయసమ్మతం కాదని 'మాతృభూమి' భావించింది. ఈ అభిప్రాయం, సరైనదా? కాదా? అన్నది యిక్కడి సమస్య కాదు. పోరాటాన్ని, నాయకత్వం వహించిన వారి కార్యకలాపాలు, చేపట్టిన పద్ధతులు ఏమాత్రం సరికావని 'మాతృభూమి' తెలియజేసింది. అది పోరాటం తలపెట్టిన వాళ్లకు మరింత ఆగ్రహం తెప్పించింది. వాళ్ళు 'మాతృభూమి' తిరువనంతపురం కార్యాలయాన్ని ముట్టడి చేశారు.

పోరాటం రెండు నెలలు సాగింది. మధ్య చాలా విచారించ దగ్గ సంఘటనలు జరిగాయి. కేరళ శాసనసభ తొలి సమావేశం జరిగేంతవరకూ, పోరాటాన్ని వాయిదా వేసినట్లు తీర్మానించిన వార్త తెలియగానే నాకు ఎంతో ఉపశమనం కలిగింది.

ఉన్నత న్యాయస్థానానికి చెందిన 'బెంచ్'కోసరం పోరాటం ముగిసే సమయానికి ఎన్నికల ప్రచారం ఆరంభమైంది. రాష్ట్రాల పునర్విభజనల తర్వాత జరిగిన మొట్టమొదటి ఎన్నికలు అవి. అన్ని పార్టీలు చాలా ఉత్సాహంతో పోటీచేశాయి. కాంగ్రెస్ లక్ష్యాన్ని, సిద్ధాంతాలను, 'మాతృభూమి' ఆదరించింది. అందువల్ల కాంగ్రెస్ పార్టీ ఎన్నికలలో విజయం సాధించాలని 'మాతృభూమి' ఆశించినప్పటికీ, ఒక జాతీయ దిన పత్రికగా మిగతా అన్ని పార్టీల ఎన్నికల ప్రచారాన్ని 'మాతృభూమి' ప్రచురించిది. ఆ విధంగా చేయడం సరికాదని కొందరు కాంగ్రెస్ నాయకులూ, తమను గురించి ప్రచురించే వార్తలు న్యాయమయిన స్థాయికి తగ్గట్టు లేవని యితర పార్టీలవాళ్లు తిరస్కరించకపోలేదు. ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీకి ఆదరణ చూపిన కారణంగా, 'మాతృభూమి' చేసిన సేవ స్వల్పమైనది కాదని ఆనాటి కాంగ్రెస్ నాయకుడు యు.ఎన్. ేబర్, ఒకసారి నాతో అన్నారు. ఎన్నికల ఫలితాలు రాగానే చాలామంది ఆశ్చర్యం చెందారు. కొందరు నిరాశ చెందారు. కమ్యూనిస్టు పార్టీ అరవైస్థానాలను, కాంగ్రెస్ నలభైమూడు స్థానాలను, పి.యస్.పి. తొమ్మిది స్థానాలను, లీగ్ ఎనిమిది స్థానాలను, ఇండిపెండెంట్లు ఆరు స్థానాలను పొందారు. ఇండిపెండెంట్లలో అయిదుగురికి కమ్యూనిస్టు పార్టి మద్దతుదార్లు, ఒకరు కాంగ్రెస్ మద్దతుదారు నామినేట్ చేయబడిన ఒక ఆంగ్లో ఇండియన్‌కు చెందిన స్థానంతో కలిపి, మొత్తం నూటయిరవై ఏడుమంది శాసనసభలో వున్నారు. కమ్యూనిస్టు పార్టీ వారికే అధిక సంఖ్యాబలం లభించింది. ఈ స్థితిలో మన భాధ్యత గురించి ఆ రోజు 'మాతృభూమి' సంపాదకీయంలో తెలియజేశాను.

1957వ సం॥ మార్చి పందొమ్మిదో తేది ప్రచురించిన ఆ సంపాదకీయంలో ముఖ్యభాగాలు యివి.

"కేరళ ప్రదేశంలో ఒక ప్రభుత్వం ఏర్పడడానికి సంబంధించి కొన్ని విషయాలు యిక్కడ పరిశీలిద్దాం. ఇండియా పార్లమెంటు - రిపబ్లిక్ పరిపాలనా పద్ధతిని అంగీకరించి వుంది కదా? దాని అంతరార్థాన్ని, హక్కులను శ్రద్ధగా గ్రహించి అందులో విశ్వాసం వుంచిన వాళ్లకు కేరళ ఎన్నికల ఫలితాలు ఎదురుచూసిన విధంగా లేకపోయినప్పటికీ, యిక కొనసాగించవలసిన కార్యకలపాల గురించి జంకుగాని, భయంగాని కలగడానికి ఆస్కారం లేదు.

ఎన్నికల ద్వారా కమ్యూనిస్టు పార్టీ కేరళ శాసనసభలో మెజారిటీని సాధించి, గౌరవం పొంది వుంది. ఆ పార్టీ కేరళ ప్రదేశ్ పరిపాలనకు చేపట్టడమే ప్రజాస్వామ్య విధానానికి తగిన గౌరవం. కమ్యూనిస్టు సభ్యులకూ, ఆ పార్టీతో పాటు శాసన సభ కార్యకలాపాలలో దానికి మద్దతుగా వుండడానికి అంగీకరించిన ఇతర సభ్యులకు కేరళ ప్రభుత్వాన్ని స్థాపించడంలో సమస్య ఏదీ లేదనీ అనిపిస్తోంది. ప్రస్తుత స్థితిలో యిది చాలా సహజంగా జరుగతగ్గ సరళమైన కార్యక్రమం.'

ఈ అభిప్రాయానికి అనుగుణంగా వుంటూ వచ్చింది 'మాతృభూమి'. అందుకు కాంగ్రెస్ పార్టీలోవున్న కొందరు ప్రముఖులు నిరసించారు.

కమ్యూనిస్టు ప్రభుత్వ కార్యాచరణ ఖండించతగ్గ విధంగా వున్న పలు సందర్భాలలో వాటిని 'మాతృభూమి' శ్రద్ధగా విమర్శించడానికి వెనుకాడలేదు. అటువంటి పలుసందర్భాలు వచ్చాయి. ఇందువల్ల కమ్యూనిస్టు పార్టీకి మాతృభూమి' పట్ల వున్న విరోధం అధికమైంది.

కాంగ్రెస్ వారిలో ఒక వర్గం విమర్శను, కమ్యూనిస్టు పార్టీ విరోధాన్ని, యింకా కొందరి వ్యతిరేకాన్ని 'మాతృభూమి' సహిస్తూ దాని లక్ష్యానికి, సిద్ధాంతానికీ, అనువైన విధంగా కొనసాగడం సులభంగా లేదు. అయినప్పటికీ లక్ష్యాన్ని కాపాడడానికే దీక్ష పూనాను. నేను కమ్యూనిస్టు పార్టీ వారి పక్షం అయిపోయినట్టు కొందరు నా సన్నిహిత మిత్రులు కూడా ఈ కాలఘట్టంలో చెప్పారు. కమ్యూనిస్టు వారి అభిప్రాయాలలో నాకు ఎలాంటి అంగీకారమూ లేదు. అయినప్పటికీ పార్లమెంటరీ ప్రజాస్వామ్య విధానాన్ని అవలంబించిన మనం, ఎన్నికలలో మెజారిటీ సాధించి, ప్రభుత్వాన్ని చేపట్టడానికి సిద్ధంగా వున్న పార్టీకి, అది కమ్యూనిస్టు అయినప్పటికీ, మరే పార్టీ అయినప్పటికీ, అది ప్రభుత్వాన్ని నిర్వహించడానికి కావలసిన సహకారం అందించాలి. అదే ప్రతిపక్షాలకు మర్యాద. 'మాతృభూమి' దీన్ని సూచించి ఈ విధంగా నడుచుకోమని దేశనాయకులను కోరింది. అయినా నేను అవలంబించిన ధోరణికి 'మాతృభూమి' సంబంధం వున్న వారి నుంచి హృదయపూర్వకమైన ఆదరణ లభించిందని చెప్పడానికి లేదు. నాముందున్న లక్ష్యం చూపే మార్గంలో నేను వెళ్లాను.

ఈ కాలంలో పత్రిక నడపడానికి సంబంధించిన యిబ్బందులు మాత్రమే ఎనుగు కలిగించాయని చెప్పడానికి లేదు. కేరళ నూతన ప్రజాస్వామ్య కార్యకలాపాలు ఆందోళనకరంగా వుండేవి. వయోజన ఓటు హక్కు విధానం దేశానికి మేలు చేస్తుందా? అన్న అనుమానాన్ని కలిగించే విధంగా కొన్ని సంఘటనలు జరిగాయి. వివేకం సంయమనం లేని ప్రజాస్వామ్యం

అరాచకంవైపుగా ప్రజలను తీసుకువెళుతుందని భయపడ్డాను. స్వల్ప కారణాలకోసరం జాతీయ పక్షం వారు చాలా మంది 'సత్యాగ్రహం' 'నిరాహారదీక్ష' అని శాంతికి భంగం కలిగించారు. విద్యార్థుల మధ్య ఉద్రిక్తత, కలహాలు, ప్రభుత్వ కార్యాలయ సిబ్బంది మధ్య క్రమశిక్షణా రాహిత్యం అవీ నా అనుమానాన్ని మరింత ఎక్కువ చేశాయి. మనం స్వతంత్రం పొందిన తర్వాత మన గుణాలు ఔన్నత్యాన్ని పొందాయా? ఆ ఔన్నత్యాన్ని అభివృద్ధి చేసుకోవడానికి మనం ప్రయత్నిస్తున్నామా? అన్న ప్రశ్నలు నాలో చెలరేగాయి. కాలక్రమంలో వీటికంతా పరిష్కారం లభిస్తుందని ప్రశాంతంగా నేను వుండలేక పోయాను. ఈ స్థితికి ఎవర్ని తప్పు పట్టగలం? ఎవరి మీదైనా నింద మోపడం వల్ల ఏమైనా ప్రయోజనం వుంటుందా? దాన్ని పోగొట్టడానికి బాధ్యత మిగతా వారికున్నట్లే నాకు లేదా? ఈ స్థితి మార్చడానికి ఏం చేయ్యాలి; అని నన్ను నేనే ప్రశ్నించుకున్నప్పుడు నాకు సంతృప్తి కలింగించే విధంగా ఏ మార్గమూ కనిపించ లేదు. బాధ్యతను నెరవేర్చలేని స్థితిలో ఏదో నేరం చేసినట్లు అనిపిస్తుంది. ఆ భావంతో ఏం చెయ్యాలో తెలియక - కాలం గడుపుతూ వచ్చాను.

# కొన్ని ప్రయత్నాలు

ఈ కాలంలో అనేక కారణాలవల్ల, పూర్తిగా రాజకీయ వ్యవహారాలలో నా ఆలోచనలను కేంద్రీకరించడం మానేయాలని ఆశించాను. అదేకాదు; రాజకీయాలకు సంబంధించిన సమావేశాలలో పాల్గొనే ఉత్సాహంకూడా తగ్గిపోయింది. రాజకీయాలకు సంబంధించిన అభిప్రాయాలలో ఏర్పడిన విప్లవాత్మకమైన మార్పే అందుకు కారణం అనిపిస్తుంది. ఇతరుల అభిప్రాయాలను నేను అసలు అంగీకరించలేనని భావించినప్పటికీ, వారిని వ్యతిరేకించని మానసిక పరిపక్వత నా యువ ప్రాయంనుంచే అభివృద్ధి చెందుతూ వచ్చింది. అయితే యిటీవలి కాలంలో, అభిప్రాయాలను వెలిబుచ్చే విధానంలో అనుసరించే మార్గాలు, వాటికి ఉపయోగించే భాష నా అభిరుచికి తగ్గట్టుగా లేవు. ఒకవేళ, మారుతున్న వాతావరణానికి అనుగుణంగా నన్ను నేను మార్చుకోలేకపోవడంవల్ల అలా అనిపించిందో ఏమో? ఏమైనాసరే రాజకీయరంగంనుంచి తప్పుకోవాలన్న కోరిక నాలో అధికమయింది. ఇతర రంగాలలో నా దృష్టిని మరల్చడానికి నేను అవకాశాలు చూడడం ఆరంభిచాను.

దక్షిణభాషా పుస్తక సంస్థ కార్యకలాపాలలో నేను దృష్టిని సారించాను. 1955వ సం॥ దక్షిణ ప్రాంత భాషలకు 'ట్రస్ట్' స్థాపించబడింది. తమిళం, తెలుగు, మలయాళం, కన్నడం, మొదలైన దక్షిణాది భాషలలో మంచి పుస్తకాలను తక్కువ ధరకు ప్రచురించే ఉద్దేశ్యంతో మద్రాసులో 'ట్రస్ట్' ప్రారంభించబడింది. ఇందుకు, అమెరికాలోని ఫోర్డ్ ఫౌండేషన్‌నుంచి అవసరమైన ఆర్థిక సహాయం లభించింది. పుస్తక ప్రచురణకు సంబంధించి ట్రస్ట్‌కు సలహాలు యివ్వడానికి ఒక్కొక్క భాషకు చెందిన ఒక్కొక్క కౌన్సిల్ ఏర్పరచబడింది. మలయాళ భాషకు చెందిన సలహా సంఘానికి నేను అధ్యక్షుణ్ణయ్యాను. దాదాపు రెండు వందల పుస్తకాలను, ట్రస్ట్ వివిధ దక్షిణ భాషలలో ప్రచురించింది. అందులో మలయాళ భాషా పుస్తకాలు నలభై.

కేరళ సాహిత్య అకాడమీ నిర్వాహక సంఘం అధ్యక్షుడిగా నేను కొంతకాలం పని చేశాను. 1956వ సం॥ అకాడమీ సర్దార్ కె.యం. ఫణిక్కర్ అధ్యక్షతన ప్రారంభించబడింది. అప్పటికి కేరళ ప్రదేశం ఇంకా రూపొందలేదు. తర్వాత సర్దార్ ఫణిక్కర్, ఫ్రాన్స్‌కు భారతీయ రాయబారిగా వెళ్లాక ఆ పదవికి

సంబంధించిన బాధ్యతలను, అధికారాన్నా నేను చేపట్టాలని ప్రభుత్వం నన్ను కోరింది. 1957వ సం|| ఫిబ్రవరిలో నేను కేరళ సాహిత్య అకాడమీ కార్యనిర్వాహక సంఘ అధ్యక్షుడిగా బాధ్యతలు స్వీకరించాను. కొత్తగా స్థాపించబడిన ఆ సంస్థ అభివృద్ధి, గౌరవమర్యాదలు దృష్టిలో వుంచుకుని కృషి చేయవలసి వచ్చింది. కేరళలో సుప్రసిద్ధ సాహిత్య వేత్తలు చాలామంది అందులో సభ్యులు. ఇలాంటి సంస్థలో కృషిచేసే అవకాశం లభించడం ఓ పెద్ద గౌరవంగా నేను భావించాను. అకాడమీ తిరువనంతపురం నుంచి తిరుచ్చూర్‌కు బదలీ అయింది. అక్కడవున్న పాత జిల్లా కోర్టు భవనంలో కొన్ని మార్పులు చేసి అకాడమీని అక్కడ నెలకొల్పాము. అకాడమీకి సంబంధించిన వివిధ కార్యకలాపాలు సక్రమంగా నెరవేరే సూచనలు కనిపించాయి దాదాపు రెండు సంవత్సరాలు నేను కార్యనిర్వాహక వర్గం అధ్యక్ష పదవిని నిర్వహించి విరమించవలసి వచ్చింది. అందుకు కారణాలు గురించి 1958వ సం|| మార్చి నెల ఎనిమిదో తారిఖున నేను పదవీ విరమణ చేసినప్పుడు వెలువరించిన ఒక నివెదికలో తేటతెల్లం చేశాను. ఆ నివేదికలో కొన్ని భాగాలు యివి.

అకాడమీ కార్యకలాపాల నిర్వహణా భాధ్యతలు స్వీకరించిన తర్వాత - నాకు కావలసిన అధికారిని ఎంపిక చేయడానికి అధిక ప్రాముఖ్యం యిచ్చాను. అకాడమీ కార్యాలయ కార్యక్రమాలను దక్షతతో నిర్వహించడానికి కార్యదర్శికి సహాయం చేయడానికి, కార్యాలయానికి సంబంధించిన వ్యవహారాలు పర్యవేక్షించడానికి మంచి అనుభవం, దక్షతగల అధికారిని - అకాడమీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నియమిస్తే బావుంటుందని కార్యనిర్వాహక వర్గం తీర్మానించింది. తత్ఫలితంగా నా కోరికను అనుసరించి, రెవిన్యూ శాఖలో బాధ్యతాయుతమైన పదవిని నిర్వహించి అనుభవం గడించిన ఒక అధికారిని ప్రభుత్వం అకాడెమీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నియమించింది.

కొన్ని నెలల తర్వాత వున్నట్టుండి ఆ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ కార్యక్రమాలను పూర్తిచేసి, రెవిన్యూశాఖకు మళ్లీ తీసుకుంటున్నట్లు, అతనికి బదులుగా ఎలాంటి సూచనా లేకుండా కొత్తగా ఒకరిని నియమిస్తునట్లు అకాడమీ కార్యదర్శికి వార్త అందింది. పైన చెప్పిన అధికారి సేవలు అకాడమికి ఇంకా అవసరం లేదన్నట్లు ఆ ఉత్తరువులో కారణం చూపారు. అయితే అది నిజానికి పూర్తిగా విరుద్ధమైనది. అకాడమీ ఎప్పుడూ అలా చెప్పలేదు. నిర్వహణాధికారిని (ఇ.ఒ.) మళ్లీ వెనక్కు తీసుకుంటున్నట్లు ప్రభుత్వం నిర్ణయిం తీసుకునే ముందు అకాడెమీ అభిప్రాయాన్ని కనీసం గౌరవం కోసరమైన అడిగివుంటే బావుండేది. అంతమాత్రం కూడా గౌరవం చూపకుండా

అకాడెమీ ఉద్యమాన్ని ప్రగాఢంగా ప్రభావితం చేసే విషయంలో దాని గురించి ఎలాంటి వివరాలు తెలియని ఒక వ్యక్తిని ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నియమించడం, ఏ విధంగానూ న్యాయం కాని చర్యగా వుంది. ప్రభుత్వ పర్యవేక్షణలో నెలకొల్పబడినదే అయినప్పటికీ సాహిత్య అకాడెమీ ప్రభుత్వానికి లోబడని శాఖ కాదు. కార్యదర్శి తప్ప దాని క్రింద వున్న వివిధ అధికారుల నియామక అధికారం పద్ధతి ప్రకారం అకాడెమీ కార్యవర్గానికే చెందుతుంది. మొదటిసారి మాత్రం ప్రభుత్వం అయిదేళ్లకు ఆ నియామకానికి చెందిన అధికారాన్ని పొందవచ్చు నన్న ఒక అంశం పరిపాలనా చట్టం ఎజెండా పదిహేనవ భాగం ఇ విభాగంలో వుంది. ఆ విషయాన్ని గ్రహించిన తర్వాతే నేను ఇలా చెబుతున్నాను. ప్రభుత్వం చేసిన నియామకం మొదటిసారిది కాదు – రెండవసారి. ఒకవేళ మొదటిసారి అయినా అకాడెమీ స్వతంత్ర ప్రతిపత్తినీ, గౌరవాన్ని పురస్కరించుకుని, ఆ సంస్థ వర్గం అభిప్రాయాన్ని తెలుసుకోకుండా ఒక నియామకం చెయ్యడం సరికాదు. అకాడెమీ అభిప్రాయాన్ని తెలుసుకోకుండా దాని క్రింద పనిచేసే ఒక అధికారిని బదిలీ చేసి ఆయనకు బదులుగా వేరొకరిని నియమించడం అకాడెమీని తీవ్రంగా అగౌరపరచడమే అని భావిస్తున్నాము.

ఇందుకు నిరసన తెలియజేస్తూ ప్రభుత్వానికి, ముఖ్యమంత్రికీ వ్రాసిన ఉత్తరాలకు సంతృప్తికరమైన జవాబేమీ రాలేదు. అంతవరకు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గానున్న వారి అవసరం రెవిన్యూ శాఖకు అవసరమయిందన్న సర్క్యులర్ మాత్రం ఒకటి వచ్చింది. అయితే ప్రభుత్వ ఉత్తర్వులో చూపిన కారణం అదికాదు. అదేనని స్పష్టంగా తేల్చి చెప్పలేదు. కారణమేదైనా అకాడెమీకి చేసిన అగౌరవాన్ని సమర్థించే విధంగానూ అది సమాధానంకాదు.

ఒక వ్యక్తిని కర్తవ్య నిర్వహణకు శాశ్వతంగా నియమించాలనిగాని, అతనిని ఎప్పుడూ మరోచోటికి బదిలీ చేయకూడదనీ అకాడెమీ చెప్పలేదు. వ్యక్తిగతంగా ఎలాంటి అభిప్రాయానికీ యిక్కడ ఆస్కారం లేదు. అకాడెమీలాంటి ఒక ఉన్నతమైన సంస్థ పట్ల ప్రభుత్వం నడుచుకోవలసిన విధానానికి పూర్తి విరుద్ధంగా జరిగిన దానిగురించే యిక్కడ నిరసన తెలియజేస్తున్నాము. ఇందుకు ప్రభుత్వం ఎలాంటి ప్రత్యుత్తరం యివ్వకపోవడం శోచనీయం.

మార్చి ఒకటో తారీఖున కార్యవర్గకమిటీ సమావేశం, జనరల్‌కౌన్సిల్ సమావేశం జరిపి ప్రభుత్వ చర్యకు నిరసన తెలియ జేసింది. అకాడెమీ కోరిక మన్నించి ప్రభుత్వం తన ఉత్తరువును పునః పరిశీలించాలని ఉద్దేశించింది; ఈ తీర్మానం ఆ రోజే ప్రభుత్వానికీ తెలియజేశాము. అయినా ప్రయోజనం లేదు.

కేరళ సాహిత్య అకాడెమీని ఉన్నత స్థితికి తీసుకురావాలన్న ఆకాంక్షతో నేను ఆ బాధ్యతను స్వీకరించాను. అందుకు ప్రారంభంనుంచే ప్రభుత్వం అంగీకరించగల కార్యక్రమాలను ప్రారంభించాలని ఉద్దేశించాను. అయినా అకాడెమికి వ్యతిరేకంగా ప్రభుత్వం వ్యక్తం చేసిన మనోభావం, నా లక్ష్యానికి అనుకూలంగా లేనప్పుడు - నా వల్ల మనస్ఫూర్తిగా ఆ బాధ్యతలను నెరవేర్చడం కష్టమవుతుంది. ఈ స్థితిలో నేను అకాడెమీని నడిపించడం సాధ్యం కాదు. అందువల్ల గాఢ విచారంతో ఈ పదవినుంచి నేను తప్పుకోవలసివుంది.

అకాడమి కార్య వర్గ కమిటీ అధ్యక్షపదవికి రాజీనామా యిచ్చాను. అయితే సాధారణ సభ్యునిగా ఆ సంస్థతో సంబంధం కొనసాగింది.

ఈ సందర్భంలో తుంజన్ స్మృతిచిహ్న కమిటీని గురించి, వళ్లత్తోళ్ స్మారక చిహ్నం కమిటీ గురించి చెప్పడం యుక్తం. తిరూర్‌కు సమీపంలో తుంజన్ పరంబలో మహోపాధ్యాయునికి ఉచిత స్మారక చిహ్నం ఏర్పాటు చేయాలనీ, మరికొన్ని తీర్మానాలతో 1955వ సం॥ తుంజన్ స్మారక చిహ్న కమిటీ నొకదానిని ఏర్పాటు చేశాము. దానికి అరవైయేళ్ల క్రితమే అప్పటి కొందరు ప్రముఖులు అదే తీర్మానాలతో తుంజన్ పరంబలో సమావేశమై చర్చించారు. అయినా తర్వాత దానిని గురించి ఎవరూ ప్రయత్నించలేదు. 1954వ సం॥ డిసెంబర్ పదిహేడవ తేదీ, తుంజన్ స్మృతి దినాన్ని జరపడానికి తుంజన్ పరంబిలో ఒక సమావేశం ఏర్పడింది. సముచితమైన ఓ స్మారక చిహ్నం ఏర్పరచడానికి అధిక సంఖ్యలో సభ్యుల్ని చేర్చాలని ఒక కమిటీని ఏర్పాటు చేశాము. అదే తుంజత్తు ఆసాన్ స్మారక చిహ్న కమిటీ. కమిటీ సభ్యులు స్మారక చిహ్న నిర్మాణ కోసరం చందాలు, వసూలు చేశారు. అయినా అది ఆ స్మారక చిహ్న నిర్మాణానికి అయిన ఖర్చులో కొంత భాగం మాత్రమే వచ్చింది. ప్రభుత్వ సహాయం లేకుండా స్మారక చిహ్న నిర్మాణం సాధ్యంకాదని గ్రహించి, సభ్యులు కేరళ ప్రభుత్వాన్ని ఆశ్రయించారు. నాటి కేరళ ముఖ్యమంత్రి పట్టంథానుపిళ్లె. ఆయన ఎంతో శ్రద్ధతో అందుకు సహాయం చేస్తామని మాట యిచ్చారు. దానికి అనుగుణంగా ప్రయత్నించారు కూడా. నాటి కేరళ రాష్ట్రమంత్రి మండలి లోని కె. చంద్రశేఖరన్, తర్వాత ముఖ్యమంత్రిగా వచ్చిన ఆర్. శంకర్, స్మారక చిహ్న నిర్మాణంలో విశేషమైన ఉత్సాహం చూపారు. దాని ఫలితంగానే 1964వ సం॥ జనవరి పదిహేనవ తారీఖున పూర్తి చేసిన స్మారక చిహ్నానికి ప్రారంభోత్సవం జరిపాము. అందుకు మూడు లక్షల రూపాయలు ఖర్చు అయింది. తుంజన్ స్మారకచిహ్న కమిటీ వసూలు చేసిన పైకాన్ని ప్రభుత్వానికి అప్పగించారు. ఈ స్మారక చిహ్న నిర్వహణకు 1946వ సం॥ అక్టోబర్ 31వ తారీఖున ప్రభుత్వం ఒక కమిటీని

చేసింది. ఆ కమిటీ అధ్యక్ష బాధ్యతలు నన్ను స్వీకరించమన్నారు. నేను అంగీకరించాను.

స్మారకచిహ్నం పనులు పూర్తయినప్పటికీ, చూపరులు చూసి ఆనందించడానికి కేవలం ఒక అందమైన చిహ్నం మాత్రం చాలదని భావించాను. మేధాశక్తితో పరిశోధనలు జరపడానికి కావలసిన పుస్తకాలతో గ్రంధాలయం ఒకటి నెలకొల్పాలి. ఇంకా తుంజన్ ఎళుతచ్చన్‌కు సంబంధించిన అన్ని పుస్తకాలు, మలయాళంలోను, సంస్కృతంలోనూ వున్న ఉన్నత గ్రంధాలు అక్కడ చోటు చేసుకోవాలి. మంచి పుస్తకాలను చదివి ఆనందాన్ని అనుభవించడానికి, పరిశోధనలు జరపడానికి అక్కడ వసతులు కల్పించాలి. ఇందుకోసరం తుంజన్ మందిరానికి వచ్చే పండితులకు సాహితీప్రియులకు రచయితులకు, బస చేయడానికి సౌకర్యాలు కల్పించాలి. తరచుగా పండితులు పరిశోధకుల సదస్సులు, సమావేశాలు ఏర్పాటు చేయ్యాలి; బుద్ధి వికాసానికి దోహదం చేసే గ్రంధాలను 'తుంజన్ ఇల్లం' ప్రచురించాలి. తుంజన్ మందిరానికి చుట్టు ప్రక్కల గల ప్రదేశాలలో సుందర ఉద్యానవనాలు పెంచి ఆకర్షణీయంగా చేయాలి. కేరళ (రాష్ట్రం) నుంచి మాత్రమేకాదు యావద్భారత దేశంనుంచి యావత్ప్రపంచంనుంచి ఎడతెగకుండా చూపరులు వచ్చే పవిత్ర యాత్రా స్థలంగా 'తుంజన్ ఇల్లమ్' వెలుగొందాలి. ఈ లక్ష్యసాధనకు ఈ కమిటీ కృషి చేస్తోంది.

వళ్లత్తోళ్ స్మారకచిహ్నం కమిటీ ప్రయత్నాలు కూడా విజయవంతంగానే ముగిశాయి. 1958వ సం॥ మార్చి నెల పదమూడవ తారీఖున మహాకవి వళ్లత్తోళ్ కాలధర్మం చెందారు. తర్వాత ఒక నెలలోగా సిరుతురిత్తిలో సమావేశమైన ఒక సభలో వళ్లత్తోళ్‌కు ఒక స్మారక చిహ్నం ఏర్పరచాలని తీర్మానించి అందుకోసరం ఒక కమిటీని ఏర్పాటు చేశాము. ఆ కమిటీ అధ్యక్షత బాధ్యతల్ని నేనే స్వీకరించాను. అయినా జనసామాన్యం నుంచి లభించిన మొత్తం చాలా తక్కువ పత్రికలద్వారా విజ్ఞప్తులు ప్రకటించినప్పటికీ, వ్యక్తిగతంగా చాలామందికి ఉత్తరాలు వ్రాసినప్పటికీ చెప్పుకోతగ్గ ఫలితాలు లభించలేదు. వసూలు చేసిన పైకాన్ని వుంచుకొని త్వరలో ఓ స్మారకచిహ్నాన్ని నిర్మించాలని కమిటీ నిశ్చయించింది. వసూలైన పైకం పన్నెండు వేల అయిదు వందలు మాత్రమే. దీనిని కేరళ విశ్వవిద్యాలయానికి యిచ్చి కళలు - సాహిత్యం గురించి సంవత్సరం విడిచి సంవత్సరం స్మారక ఉపన్యాసాలు యివ్వడానికి ఏర్పాటు చేయాలని కోరాము. విశ్వవిద్యాలయం అందుకు అంగీకరించింది. 1962వ సం॥ మే పదమూడో తారీఖున సిరుతురిత్తి కళా మంటపంలో జరిగిన నిరాడంబరమైన కార్యక్రమంలో - పన్నెండువేల

అయిదువందల రూపాయలు చెక్కును వళ్లత్తోళ్ స్మారక కమిటీ అధ్యక్షుడిగా నాటి విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులైన కె.సి.కె.యి. రాజాకు సమర్పించాను. ఆలిండియా రేడియో కేంద్ర డైరెక్టరు జనరల్‌గా వున్న డా. బి.కె. నారాయణమీనన్, తిరువనంతపురంలో 1966వ సం॥ ఫిబ్రవరి పద్నాలుగు, పదిహేను తేదీలలో ప్రథమ 'వళ్లత్తోళ్ స్మారకోపన్యాసం' చేశారు.

మరోస్మారకచిహ్నం గురించీ, లభించిన విజయం గురించీ, యిక్కడ చెప్పుకోవాలి. 'మాతృభూమి' ప్రారంభించిన 'మన్నార్ కొట్టు కృష్ణన్ కుటుంబ సహాయనిధి' అది!

1957వ సం॥ నవంబర్ 28వ తేదీ మన్నార్‌కాట్టులో ఒక సంఘటన జరిగింది. టికొట్టులో పనిచేసే వట్టత్తొట్టి కృష్ణన్ అనేవ్యక్తి తన ప్రక్కింట్లో కాపురముంటున్న ఒక మహమ్మదీయమిత్రుని యిల్లునిప్పంటుకుని రగులుకోవడం చూశాడు. లోపల చిక్కుకుపోయిన యిద్దరు పసిపాపల్ని కాపాడడానికి వెంటనే నిప్పు ల్లో దూకాడు. మంటల నుంచి పిల్లల్ని కాపాడాడు. అయితే ఆ ప్రయత్నంలో కృష్ణన్ తన ప్రాణాలను త్యాగం చేశాడు. కృష్ణన్‌కు తల్లి, భార్యా యిద్దరు పిల్లలు వున్నారు. అతడు చేసిన ఆ ప్రాణత్యాగం ఆయన పట్ల ప్రజలకు ప్రగాఢమైన గౌరవాభిమానాలను రేకెత్తించాయి. పేదరికంలో బాధపడుతున్న కృష్ణన్ కుటుంబానికి సహాయంచేసే ఉద్దేశ్యంతో ప్రజానీకానికి 'మాతృభూమి' ఒక విజ్ఞప్తిచేసింది. డిసెంబర్ పదోతారీఖు సంచికలో మన్నార్‌కాడు కృష్ణన్ కుటుంబసహాయనిధి ప్రారంభమయింది. ప్రతిరోజు పలుచోట్లనుంచి కొంచెం కొంచెం డబ్బు ప్రోగవడం ప్రారంభమయింది. విదేశాలనుంచి కూడా సహాయనిధి రావడం మొదలయింది. ఒకే నెలలో ఇరవై మూడువేల మూడువందల ఎనభై అయిదు రూపాయల ఎనభై నాలుగు పైసలు (23,385.84) చేరాయి. ఆ మొత్తాన్ని కృష్ణన్ తల్లికీ, భార్యకు, యిద్దరు పిల్లలకు అంతకు ముందే నిర్ణయించిన ప్రకారం - ఆనాటి కేరళ గవర్నర్ శ్రీ రామకృష్ణారావు అధ్యక్షతన కోళిక్కోడ్‌లో ఒక సభ ఏర్పాటుచేసి యిచ్చాము. కృష్ణన్ భార్య నివసిస్తున్న యిల్లు, కాలిపోయిన మహమ్మదీయుని యింటిని బాగుచేసి యివ్వడమే కాకుండా కృష్ణన్‌కు అంత్యక్రియలు జరిపిన చోట ఒక చిన్నస్మారక చిహ్నం కూడ నిర్మించాము. ఈ ద్రవ్యసహాయానికి, యింత స్వల్పవ్యవధిలో ప్రజలు యింతపెద్దమొత్తాన్ని పంపడం జ్ఞాపకం ఉంచుకోదగ్గది.

కొన్ని స్మారక చిహ్నాలకు, ప్రజాసహాయం ఎడతెగకుండా వస్తూ వుంటుంది. కొన్నింటికి ఎంత ప్రయత్నం చేసినా అవసరమైనంత పైకం చేరదు. స్మారక చిహ్నాల స్థాపనకు బాధ్యత స్వీకరించిన కమిటీ సభ్యుల నిర్ణయాలకు

అనుగుణంగా కావలసిన వస్తువులు, పైకమూ వారి ప్రయత్నాల వల్లే సమకూరవు. దీనికి కారణం వాళ్లల్లో ఉత్సాహం లేకపోవడం అనికాని, ప్రజలకు స్మారక చిహ్నం నెలకొల్పాలని ఉద్దేశించిన మహనీయుని పట్ల జాలి కాని, గౌరవంకాని లేకపోవడం అని కానీ భావించడానికి వీలులేదు. కొన్ని వ్యక్తిగత విషయాలు ప్రజాహృదయాలలో ప్రగాఢమైన ముద్రవేస్తాయి. కొన్ని విషయాలు ప్రజలలో ఉత్సాహం కలిగించడం లేదు. అందువల్ల ఎవరిదో లోపం అనడం సరికాదు. కోళిక్కోడ్ ఆసుపత్రులలో వ్యాధిగ్రస్తుల చికిత్స సౌకర్యాలను వీలయినంతవరకు అభివృద్ధిచేసి, ఆసుపత్రి నిర్వహణకు సహాయం చేయమని 'కోళిక్కోడ్ హాస్పిటల్స్ అమెనిటీస్ ఫండ్ అసోసియేషన్' అన్న పేరుతో 1956వ సం॥ ఒక సంఘం ఏర్పాటయింది. నేను దాని అధ్యక్షుణ్ణి. కొందరు డాక్టర్లు, ప్రజాప్రతినిధులు యిందులో సభ్యులుగా వున్నారు. కమిటీ కృషి ఫలితంగా కోళిక్కోడ్ వైద్య కళాశాల వైద్య నిలయానికి, ఎక్స్‌రే సాధనం, కార్డియోగ్రామ్ సమకూర్చాము. ఇంకా కుదిరైవట్టం లోని మానసిక వైద్య నిలయానికి, కోళిక్కోడ్ జనరల్ ఆసుపత్రికి, ఒక్కొక్క రేడియో యివ్వడం వీలయింది. రిజిష్టర్ చేయబడ్డ ఈ సంస్థ కృషి యింకా కొనసాగుతూనే వుంది.

ఇలాంటి సమాచార ప్రయత్నాలు కేరళ ఇతర ప్రాంతాలలోను కొనసాగాయంటే వ్యాధిగ్రస్తులకు ఎంతో సహాయంగా వుంటుంది.

ఇదే ఉద్దేశ్యంతో ఒక సంస్థను, కోళిక్కోడ్ మెంటల్ హాస్పిటల్ రోగులకు సహాయం చేయడానికి స్థాపించాము. దానికి నేను అధ్యక్షునిగా వుంటున్నాను. ఈ సంస్థ కృషి మూలంగా రోగులకు లక్ష రూపాయల ఖర్చుతో ఒక నూతన భవనం నిర్మించబడింది. సంస్థలో ప్రముఖ సభ్యురాలుగా వుంటున్న శ్రీమతి కుట్టి వెళ్లోడి ఈ కార్యక్రమాలకోసరం ముందు నిలబడి దీక్షతో కృషిచేశారు.

# నేత్ర చికిత్స కోసం లండన్ ప్రయాణం

1954వ సంవత్సరమే మొట్టమొదటి సారిగా నాకంటి చూపు చెడిపోవడం గ్రహించాను. అయినప్పటికీ చదవడం, వ్రాయడం నేను మానలేదు. చదివేప్పుడు కాస్త కష్టంగా వుంటే ఎవరినైనా చదవమని వినేవాణ్ణి. ఆ విధంగా కొన్నాళ్లు సాగింది. నా మిత్రులు డాక్టర్ పి.పి. మీనన్ అప్పుడప్పుడు కళ్లు పరిశోధించి అవసరమైన చికిత్స చేశారు. మూడేళ్లు గడిచిన తర్వాత, కోళిక్కోడ్ హెడ్‌క్వార్టర్స్ ఆస్పత్రిలో ఎడమ కంటిలో శస్త్రి చికిత్స చేశారు. ఆశించిన ఫలితం ఏర్పడలేదు. శస్త్రిచికిత్స తర్వాత ఒక మసక వెలుతురు మాత్రమే కనిపించింది. కుడి కంటిలోనూ, చీకటి ముదరడంతో మామూలు అవసరాలను తీర్చుకోవడం, ఇష్టప్రకారం తిరగడం కూడా కష్టంగా తోచింది. అయినప్పటికీ వేకువజామున లేచి వ్రాసే అలవాటు కుంటు పడలేదు. వ్రాసే దాన్ని నావల్ల సరిగా చూడడం వీలుకాలేదు. కాగితం మాత్రం కనిపించేది. నెమ్మదిగా రాసి, తెల్లవారిన తర్వాత, నా మనమరాళ్లతో ఎవరినైనా పిలిచి చదవమని, వినేవాణ్ణి, కొంతకాలం యిలా సాగింది.

ఒక రోజు వేకువజామున నేను లేచి వ్రాశాను. కొంతసేపు వ్రాసిన తర్వాత నా మనుమరాలు నళినిని పిలిచి చదివి వినిపించమన్నాను. ఆమె నా చేతినుంచి కాగితం తీసుకుని చూసి 'తాతా! యిందులో మీరేమి వ్రాయలేదే! అన్నది. పెన్నులో సిరా అయిపోవడం కూడా గమనించకుండా వ్రాశానన్నది అప్పుడే గ్రహించాను. అప్పుడు ఆమె చెప్పడం విని నేను నవ్వాను. అయినప్పటికీ నా పరిస్థితి విచారకరంగా పరిణమిస్తుందని ఈ సంఘటన నాకు గుర్తు చేసింది. ఆ తర్వాత కొన్ని రోజులు నేను వేకువ జామున లేచి వ్రాసే అలవాటును పూర్తిగా మాన వలసివచ్చింది. అయినప్పటికీ యథాప్రకారం కార్యాలయానికి వెళ్లి, పనులు పర్యవేక్షించడం, సభల్లో పాల్గొనడం మాత్రం మానలేదు. నేను చదువడానికి బదులుగా ఎవరినైనా చదువమని వినేవాణ్ణి. వ్రాయడానికి బదులు చెప్పి వ్రాయమన్నాను. ఈ విధంగా నా పనులు ఆపకుండా కొనసాగించాను

1956వ సంవత్సరంలో ఎర్నాకుళంలో జరిగిన సాహిత్య పరిషత్ ఉత్సవానికి నేను అధ్యక్షత వహించినప్పుడు, నా అధ్యక్షోపన్యాసం చదవలేని

స్థితి నాకు చాలా వేదన కలిగించింది. దాన్ని పెద్ద లోపంగా భావించాను. నా మిత్రుడు నా తరఫున ఆ ఉపన్యాసం చదివారు. కుడికంట్లో చీకటి ముదిరిన తర్వాత, యించుమించు ఒక గుడ్డివాడిలాగే నేను రోజులు గడిపాను. నా స్థితి కొందరికి తెలిసి వుండడంవల్ల, బహిరంగ సభల్లో నేను పాల్గొనేప్పుడు, ప్రయాణం చేసేప్పుడు, నాతోపాటు వుండి నన్నెంతో జాగ్రత్తగా చూసుకునేవాళ్లు. అందుకు వారికి నేనెంతో ఋణపడివున్నాను.

కుడికంటిలో పార శస్త్రచికిత్స చేయడానికి అనువుగా ముదిరిన తర్వాత అందుకు లండన్ నగరం వెళ్లడం మంచిదని నా మిత్రులు కొందరు తెలియజేశారు. అక్కడ వున్న సౌకర్యాలు, తెలుసుకున్న తర్వాత నేను కూడా లండన్ వెళ్లడానికే నిశ్చయించాను. దాదాపు నాలుగు నెలల పాటు లండన్‌లో వుండవలసి వస్తుందని తెలిసి నేను అందుకు తగిన ఏర్పాట్లు చేయడం ప్రారంభించాను. 'మాతృభూమి' సంపాదక బాధ్యతను, నా ప్రియమిత్రులు, మాతృభూమి కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్ అయిన శ్రీ వి.యం. నాయర్ దయతో స్వీకరించడానికి అంగీకరించారు. ఎనిమిది సంవత్సరాల క్రితం, నేను శ్రీలంకకు వెళ్లవలసి వచ్చినప్పుడు కూడా ఆయనే ఆ బాధ్యతను చేపట్టడానికి ముందుకువచ్చారు. 'మాతృభూమి'ని సమర్థవంతమైన నాయర్ బాధ్యతకు అప్పగించి, దిగులు, బరువు, తగ్గిన వాణ్ణిగా నేను యితర ఏర్పాట్లు చూడసాగాను. ప్రయాణానికి, చికిత్స ఖర్చులకు, లండన్ నగరంలో వుండడానికి కావలసిన డబ్బు సేకరించవలసి వచ్చింది. అనుభవసారాల నుంచి నేను డబ్బు విషయంలో ఏదీ నేర్చుకోలేక పోయాను. డబ్బును సంపాదించి కూడబెట్టే సామర్థ్యం గాని, ఖర్చును అదుపులో పెట్టే వివేకంగాని నాకు లేదు. ఇది సరైన విధానం కాదని నాకు చాలాసార్లు అనిపించేది. అయినప్పటికీ చిరకాలపు అలవాటును వదులుకోవడం ఎలా సాధ్యం?

లండన్ ప్రయాణంలో నాతో ఒకరు తోడుగా రావలసివచ్చింది. మొత్తం ఖర్చు లెక్కగట్టి చూసినప్పుడు దాదాపు ఇరవైవేల రూపాయలు కావలసివచ్చింది. నాలుగు నెలల జీతం ముందుగానే తీసుకున్నా యింకా పెద్దమొత్తం తక్కువ అవుతుంది. సింగపూర్ నుంచి ఉణ్ణి కొంత డబ్బు పంపాడు. 'మాతృభూమి' నుంచి కూడా కొంత సాయం చేశారు. ఇంకా ఐదువేలు కావలసి వచ్చింది. దానికి ఏంచెయ్యడమా? అని మధనపడుతున్న సమయంలోనే కేంద్ర సాహిత్య అకాడెమి, 1956, 1957, 1958 సంవత్సరాలలో ప్రచురితమైన ఉత్తమ మలయాళ గ్రంథమని 'గడిచిన కాలం' పుస్తకానికి బహుమతి యిచ్చి గౌరవించనున్నట్లు వార్త తెలియవచ్చింది. ఐదువేల రూపాయలతో పాటు వాళ్లు యిచ్చే తామ్రపత్రాన్ని కూడా నేను

స్వయంగా స్వీకరించాలని ఆహ్వానం పంపారు. లండన్ వెళ్లవలసిన సమయంలో ఢిల్లీకి వెళ్లడం అంత సులభం కాదు. కాని 1959వ సంవత్సరం ఫిబ్రవరి నెల యిరవై ఆరో తేదీ ఢిల్లీలో జరిగిన అవార్డు ప్రదాన ఉత్సవంలో నేను తప్పకుండ పాల్గొనాలని మిత్రులు పట్టుబట్టడంవల్ల స్వయంగా వెళ్లి బహుమతి అందుకున్నాను. ఆ తర్వాత ఢిల్లీలోనూ, మద్రాసులోనూ, మరికొన్ని చోట్ల అభినందన సభలు ఏర్పాటు చేయబడ్డాయి. మిత్రుల ఆదరణ, ఉత్సాహం, సంతోషం నా మనసును ద్రవింపచేశాయి.

ఢిల్లీనుంచి తిరిగివచ్చిన రెండు, మూడురోజులలో మార్చి ఆరవ తేదీ నేను కోళిక్కోడ్ నుంచి బయలుదేరాను. మా అమ్మాయి లీల, మనుమరాలు పద్మిని నాతో పాటు మద్రాసు వరకూ వచ్చారు. అక్కడినుంచి వాళ్లు సింగపూర్ వెళ్లారు. పద్మినికి మూడు నెలల క్రితమే పెళ్లయింది. ఆమె భర్త శ్రీధరన్ సింగపూర్‌లో ఉపాధ్యాయుడుగా వుంటున్నారు.

మార్చి ఎనిమిదవ తేదీన మద్రాసునుంచి విమానంలో నేను లండన్‌కు బయలుదేరాను. నా అల్లుడు కె.బి. కరుణాకరమీనన్, డాక్టర్ పి.పి. మీనన్ నాతో వున్నారు. మద్రాసు నుంచి బయలుదేరిన రెండోరోజు రాత్రి పదిగంటలకు మేము లండన్ చేరాము. 1915వ సంవత్సరంలో ప్రథమ ప్రపంచ యుద్ధం జరుగుతున్న కాలంలో న్యాయశాస్త్రం చదివిన తర్వాత బారిష్టర్‌గా నేను లండన్ నుంచి స్వదేశానికి వచ్చాను. నలభై నాలుగేళ్ల తర్వాత నేను మళ్లీ లండన్ లో వున్నాను. అప్పుడు ఓడ ప్రయాణం చేశాను. ఆరువేల మైళ్లు దూరం వున్న ఆ సుదీర్ఘమైన సముద్ర ప్రయాణం పూర్తికావడానికి యిరవై రెండు రోజులు పట్టాయి. ఈ రోజుల్లో కొన్ని గంటలల్లో విమానం మనల్ని లండన్‌కు తీసుకువెళుతుంది.

లండన్ విమానాశ్రయంలో మా కోసరం మిత్రులు ఎదురుచూస్తూ వున్నారు. మేము వై.యం.సి.ఏ. వసతి గృహంలో బసచేయడానికి వాళ్లు ఏర్పాటు చేశారు. అక్కడికి వెళ్లాము. నేను పదిరోజుల తర్వాతే మూర్‌ఫీల్డ్ ఆస్పత్రిలో చికిత్సకోసరం చేరాను. అంతవరకూ అక్కడే వున్నాను. మూర్‌ఫీల్డ్ ఆస్పత్రి నేత్రచికిత్సకు పేరు గడించింది. ఈ పెద్ద ఆస్పత్రిలో 'డాక్టర్ స్టెల్లార్డ్' అనే నేత్రవైద్యులే నా కుడి కంటిలో శస్త్రచికిత్స చేశారు. లండన్ నేత్ర వైద్యులలో 'డాక్టర్ స్టెల్లార్డ్' ప్రథమ శ్రేణిలో వున్న సుప్రసిద్ధ నేత్ర వైద్యులు. ఆయన నేత్ర పరిశోధన చేసిన తర్వాత కుడికంట్లో బాగా చూపు తెలుస్తుందనే చెప్పారు. అది నాకెంతో సంతోషం కలిగించింది. చాలా ఉత్సాహంగా నేను ఆపరేషన్ టేబుల్ మీద పడుకున్నాను. చికిత్స ముగిసిన పదోరోజున కట్టువిప్పినప్పుడు వెలుగు చూడగానే నేను చాలా సంతోషించాను. రెండు

రోజులు గడిచిన తర్వాత మళ్లీ నేత్ర పరిశోధనచేసి, కళ్లద్దాలు రాసియిస్తామని ఆయన చెప్పారు.

నిర్ణీతమైన రోజున నన్ను పరిశోధన గదికి తీసుకుపోయారు. చికిత్స చేసిన నా కుడి కంటిని, అరగంటకు పైన జాగ్రత్తగా డాక్టర్ పరిశోధించి చూశారు. తర్వాత ఆయన నాతో 'మిస్టర్ మీనన్, మీ ఉత్సాహాన్ని ఎక్కువచేసి ప్రస్తుతం అందుకు విరుద్ధంగా చెప్పడానికి చాలా విచారిస్తున్నాను. ఆశించిన ఫలితం లభించలేదు. పొరను తొలగించడానికి ముందు కంటి యధార్థపరిస్థితిని తెలుసుకోలేకపోయాను. కంటిచూపు బాగా తెలియాలంటే మరో పెద్ద శస్త్రచికిత్స చేయవలసివుంటుంది. దానికి ఒక నెల పడుతుంది. మూడు గంటలసేపు మత్తులో వుండాలి. చికిత్స ముగిసిన తర్వాత రెండు వారాలు పాటు కదలకుండా పడుకుని వుండాలి. ఏమి చెయ్యాలన్నదీ మీరే ఆలోచించి నిర్ణయించండి' అన్నారు.

'అయితే యిదంతా జరిగిన తర్వాత ఫలితం ఎలా వుంటుంది? కంటి చూపు బాగా వచ్చేస్తుందా?' అని నేను అడిగాను.

'ఆ విషయం కచ్చితంగా చెప్పలేము' అన్నారు డాక్టర్.

'చూపు బాగానే రావాలి' అనే ఆయన చెప్పారు. 'బాగానే రావాలి' అని సందేహంగా చెబుతున్న మాటలు నాకు దిగ్భ్రాంతి కలిగించాయి.

'తర్వాత నేను ఆలోచిస్తాను' అన్నాను. చెప్పలేనంత వేదన కలిగింది. చక్రాలబండిలో కూర్చోబెట్టి నన్ను గదికి తీసుకుపోయారు. నర్సు నన్ను మంచం మీద పడుకోమని చెప్పి వెళ్లిపోయింది. ఆమె తిరిగి రావడానికి ఐదు నిమిషాలయింది. ఇంతలోనే నాలో ఏవేవో ఆలోచనలు పొడచూపాయి. మంచం మీద వాలి కిటికీగుండా చూసినప్పుడు తెలిసిన కొద్దిపాటి వెలుతురు, నాకు కొంత ఉపశమనంగా వున్నప్పటికీ, శస్త్రచికిత్స జరిగాక కూడా యింతే చూపు అన్న విషయం నాకు నిరుత్సాహం కలిగించింది. ఎంత ప్రయత్నించినా ధైర్యం నన్ను వదలిపోయినట్లే అనిపించింది. 'కొంత చూపయినా వచ్చింది కదా అని సంతోషించాలేగాని, ఎక్కువ చూపు రాలేదే అని నిరాశచెందడం భావ్యమా?' అని నన్ను నేనే ప్రశ్నించుకున్నాను. ఉత్సాహ పరుచుకోవడానికి ప్రయత్నించాను. ప్రయోజనం లేదు. సమయం గడుస్తున్న కొద్దీ నా బలహీనత ఎక్కువయింది. ఒకవేళ నా ముఖంలోనూ ఆ నిరుత్సాహం కనిపించి వుండాలి. నర్సు హార్లిక్స్ తీసుకుని రాగానే 'మీరెందుకిలా బాధపడి పోతున్నారు. ఎప్పుడూ వున్న శాంతి, చిరునవ్వు కనుపించవేం?' అని అడిగింది. 'పాట వినండి. మనసుకు హాయిగా వుంటుంది' అని రేడియో పెట్టింది. సంగీత మధుర ధ్వనిలో నా మనసు శాంతి పొందలేదు. 'రేడియోను ఆపేయండి నాకు ఎటువంటి శబ్దమూ

వినపడని ప్రశాంతత కావాలి' అన్నాను. ఆమె రేడియో కట్టేసింది. నేను ఏదేదో ఆలోచించుకుంటూ పడుకున్నాను.

నిరాశ ఎక్కువవుతున్నప్పుడు నేను ప్రార్థనలో దిగాను. ప్రార్థన ద్వారా శాంతి, ఆత్మ విశ్వాసం పొందవచ్చని భావించిన నేను, దానిని పరిశోధించడానికి సందర్భం దొరికిందని కొంతసేపు ప్రార్థనలో గడిపాను. ఇటువంటి సందర్భాలలో మనకు ప్రియమైన **వారు చెంత** వుండాలనుకుంటాము. ఆదరణలో ఆప్యాయంగా నర్సు కావలసిన అవసరాలు సమకూర్చడం మాట్లాడ్డం, నాకెంతో ఉపశమనంగా వుంది. అయినప్పటికీ నేను ఎంతగానో అభిమానించే వారిలా, నన్ను ఎంతో ప్రేమించేవాళ్లలా ఆమె అవుతుందా? అటువంటి హృదయపూర్వకమైన ప్రేమను పంచే వారికోసం నా మనసు ఆరాటపడసాగింది.

దగ్గర్లో కొన్ని పరికరాలు ఏవో చప్పుడుచేస్తున్నాయి. దూరంగా కార్లు చేసే హారన్ ధ్వనులు, నర్సు ఓదార్పు మాటలు, నా చెవుల్లో స్పష్టం లేని శబ్దాల్లా వినిపించాయి. కొంతసేపు తర్వాతే కరుణాకర్ మీనన్, డాక్టర్ పి.పి. మీనన్ అక్కడికి వచ్చారు. వారితో నేను డాక్టర్ స్టెల్లార్డ్ అభిప్రాయం చెప్పాను. వాళ్లు నన్ను ఓదార్చడానికి పూనుకొన్నా, ప్రయోజనం లేదు. తట్టుకోలేని నిరుత్సాహం, విచారం నన్ను ఆవహించాయి. ఆ రోజంతా ప్రార్థనలోనే గడిపాను. నన్ను చూడడానికి వచ్చిన మిత్రులందరితో నేను మామూలుగా మాట్లాడుతున్నప్పటికీ, నా హృదయంలో రగులుతున్న ఆవేదనా జ్వాలను వాళ్లెవరూ గ్రహించలేదు. ఆ రాత్రి నేను నిద్రపోలేదు. మాటిమాటికి మంచం మీది నుంచి అటూ ఇటూ తిరుగుతూ మనసులో పొంగిపొరలుతున్న ఆవేదనను అణచుకోవడానికి ప్రయత్నించాను. మర్నాడు ఉదయం డాక్టర్ స్టెల్లార్డ్ నన్ను పరిశోధించడానికి వచ్చినప్పుడు 'ఇంక ఆపరేషన్ వద్దని తీర్మానించేశారా?' అని అడిగారు.

'దానికి నాకు యిష్టంలేదు' అని జవాబు చెప్పాను.

'డాక్టర్, జబ్బు నయం కావడానికి మూడు మార్గాలున్నాయి, మందుల వల్ల, నయం కావడం లేదంటే శస్త్రచికిత్స; ఈ రెండు లేదంటే మూడో మార్గాన్నే నమ్మాలి. అది ప్రార్థన, విశ్వాసం మాత్రమే. మొదటి మార్గాలలో కనిపించని ఫలితం అందులో లభిస్తుందని నమ్ముతున్నాను'.

'మిస్టర్ మీనన్! మీ విశ్వాసాన్ని మెచ్చుకుని **అభినందిస్తున్నాను**., దేవుడు మిమ్మల్ని దయతో చూస్తాడు' అన్నారు డాక్టరు.

తర్వాత రెండు రోజులు నేను ఆస్పత్రిలో వున్నాను. ఎదురుచూసిన ఫలితం శస్త్రచికిత్స ద్వారా లభించకపోయినప్పటికీ, మునుపటికన్నా యిప్పుడు కాస్త

కంట్లో వెలుతురు ఎక్కువయినట్లు అనిపించింది. బయటకి వచ్చి చుట్టూ చూసినప్పుడు, కాస్త ఉత్సాహం వచ్చింది. లండన్‌లో అలవాటైన ప్రదేశాలు, పాత భవనాలు, రోడ్డు మీది వాహనాలూ, నాకు సంతోషం కలిగించినప్పటికీ, నా అసమర్ధత రేఖా మాత్రంగా నాలో వ్యాపించకపోలేదు.

రెండు వారాలపాటు నేను ఆస్పత్రిలో వున్నాను. వైద్యుల సామర్ధ్యం, నర్సుల సేవలు, వైద్య శాఖ సౌకర్యాలు, ఎంత మెచ్చుకున్నా చాలదనిపించింది. సేవ చేయడం ఒక ఉన్నత కళగా భావించి, అదే ధ్యేయంగా వున్న కొందరు నర్సులను నేను అక్కడ చూశాను. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు, గౌరవం, ప్రేమను తెలియజేసుకుంటున్నాను.

ఆస్పత్రి నుంచి తిరిగి వచ్చిన తర్వాత నేను లండన్ నగరంలో కొన్నాళ్లు బసచేశాను. అప్పుడు డాక్టర్ స్టెల్లార్డ్ చెప్పిన శస్త్రచికిత్స గురించి కూడా తీవ్రంగా ఆలోచించాను. నా పిల్లలు, బంధువులు, మిత్రులు ఈ వార్త తెలియగానే, రెండవ ఆపరేషన్ గురించి బాగా ఆలోచించమని తెలియజేశారు. డాక్టరు పి.పి. మీనన్ కూడా లండన్‌లో నా స్నేహితులైన కొందరు డాక్టర్లతో కలిసి ఆలోచించారు. దాని గురించి మంచి చెడూ, బాగా పరిశోధించి, ఆలోచించిన తర్వాత రెండవ శస్త్రచికిత్స వద్దనే నిశ్చయించాను.

ఇటువంటి స్థితిలో ఇంకా లండన్‌లో వుండడం ఎందుకు? శస్త్రచికిత్స ముగిసిన తర్వాత, స్కాట్‌లండ్‌కు ఐరోపాలో మరికొన్ని ప్రదేశాలకు వెళ్లాలని అనుకున్నాను. ఇవన్నీ వద్దు అనుకుని స్వదేశానికి తిరుగు ప్రయాణానికి సిద్ధమయ్యాము. ఆపరేషన్ ద్వారా పొందిన కొంచెం వెలుగు, కొత్త కళ్లద్దాలు పెట్టుకోవడంతో ఇంకా కాస్త మెరుగయింది. నాకు చిరపరిచితమైన లండన్ నగరాన్ని మళ్లీ చూడ్డం సాధ్యమయింది. నూతన భవనాల రూపాలు, సంఖ్యలు, మాత్రం నాకు ఆనందాన్ని కలిగించలేదు. పెద్ద విప్లవం ఏదీ లేకుండా, సోషలిస్టు పంథాలో సాగిన సమాజ నిర్మాణంలో ఆంగ్లేయులు సాధించిన విజయం, చూసి ఆశ్చర్యం చెందాను. ఉద్యోగం లేని వారి సంఖ్య చాలా తక్కువ. మారిన వాతావరణంలో, సంతృప్తిగా బ్రతికే ఆంగ్లేయుల సూక్ష్మదృష్టి, ఔన్నత్యాన్ని చూసి, గౌరవమర్యాదలు చూపనివారు ఎవరుంటారు?

# లండన్ నుంచి తిరిగిరాక

1959వ సంవత్సరం ఏప్రిల్ ఇరవై ఒకటో తేది పగలు మూడు గంటలకు మేము లండన్ నుంచి విమానంలో బయలుదేరాము. కొందరు మిత్రులు నాకు వీడ్కోలు చెప్పడానికి విమానాశ్రయానికి వచ్చారు. సాయంత్రం ఆరు గంటలకు 'ప్రాగ్' చేరుకున్నాము. అక్కడ భారతీయ మిత్రులను కలుసుకొని ఒక గంటసేపు ముచ్చటించాను. ఏడు గంటలకు అక్కడినుంచి బయలుదేరి డమాస్కస్‌లో దిగాము. అప్పటికే తెల్లవారింది. ఉదయం ఏడుగంటలకు డమాస్కస్ నుంచి బొంబాయి, బయలుదేరిన విమానం ఆ సుదీర్ఘ పయనంలో అటు ఇటూ వూగిపోసాగింది. ఎర్‌హోస్టెస్‌లకు, మిగతా వైమానిక సిబ్బందికీ అది అలవాటే అయినప్పటికి, ప్రయాణీకులలో చాలామందికి, భయాన్ని కలిగించింది. ఉదయం ఆహారం తెచ్చి అందించిన అమ్మాయి ప్రమాదమేమీ లేదని నవ్వుతూ చెప్పినప్పటికీ, ఆ హామీ నా కలవరాన్ని పోగొట్టలేదు. ఆహారాన్ని అయిష్టంగానే తీసుకొన్నాను. విమానం వూగిపోవడం తగ్గి ప్రశాంతత ఏర్పడేవరకు అలాగే వున్నాము. ఆ తర్వాతే నేను భోజనం చేశాను. మంచి ఎండగా వుండడం వల్ల భూప్రదేశాన్ని చూడడానికి, కొన్ని సమయాలలో వివిధ స్థలాలను చూడడానికి ఎర్‌హోస్టెస్ సహకరించింది. ఇరవైవేల అడుగుల ఎత్తులో విమానం పయనిస్తోంది. అయినప్పటికీ ఒక గదిలో కూర్చుని మాట్లాడుతున్నట్లే నాకు అనిపించింది. నేవిగేటర్, పైలట్ మొదలైన వారి కుశాగ్రబుద్ధి, సమయస్ఫూర్తి, సామర్థ్యం మేము ఏమాత్రం దిగులు లేకుండా పయనించడానికి దోహదం చేశాయి. ఏ నిమిషంలోనూ ఏమైనా జరుగవచ్చు, అయినప్పటికీ విమానం అటూ ఇటూ వూగిసలాడిన సమయం తప్ప ప్రయాణీకులకు ఎలాంటి భయాన్ని కలిగించలేదు. ఉదయం ఆహారం, మధ్యాహ్నం భోజనం ముగించి ఎనిమిది గంటలు పయనించిన తర్వాత ఇరవై రెండో తేదీ, సాయంకాలం నాలుగున్నర గంటలకు, బొంబాయి వచ్చి చేరాము. చాలా మంది మిత్రులు, బొంబాయి విమానాశ్రయానికి వచ్చారు. వారిని కలుసుకొని మాట్లాడిన తర్వాత నేను బసచేయడానికి ఏర్పాటు చేయబడిన విడిదికి వెళ్లాము.

వి.యం. నాయర్ అల్లుడి యింట్లో నేనూ, కరుణాకరన్ బసచేశాము. మాధవదాస్, ఆయన సతీమణి కమల ఎంతో ప్రేమాదరాలతో మమ్మల్ని ఆహ్వానించారు. నాలుగు రోజులు అక్కడ బస చేసి పూర్తిగా విశ్రాంతి తీసుకున్నాము.

ఏప్రిల్ ఇరవై ఆరవ తేదీ బొంబాయి నుంచి మద్రాసు వచ్చాము. డాక్టర్ పి.పి. మీనన్ కూడా ఆ రోజే కోళిక్కోడ్ తిరిగి వెళ్లారు. మద్రాసు తిరిగి వచ్చిన తర్వాతే దేశంలో నికృష్ట పరిస్థితులు, అందుకు పరిష్కారం వెదికే ప్రయత్నంలో ప్రభుత్వం ఎలాంటి చర్యా తీసుకోకపోవడం చూసి శ్రీ కేళప్పన్ నిరవధిక నిరాహారదీక్ష వహించడానికి పూనుకున్నట్లు వార్త అందింది.

ఈ విషయం నన్ను ఎంతో వేధించింది. స్వార్థరహిత మనస్తత్వం, త్యాగశీలత గల కేళప్పన్ దేశభక్తిలోని ఆదర్శ దృక్పథం నాకు ఎంతో గౌరవం వుంది. అయితే నిరాహార దీక్షతో దేశ స్థితిగతుల్ని బాగుచేయవచ్చని నేను అనుకోవటంలేదు. నిరాహారదీక్షకు పూనుకోవద్దని నేను కేళప్పన్‌కు మనవి చేశాను. నేను ఉత్తరం వ్రాయగానే ఆయన అభిప్రాయాన్ని మార్చుకుంటారని ఏ మాత్రమూ అనుకోలేదు. అయినప్పటికీ కేళప్పన్‌కు ఒక ఉత్తరం వ్రాయడం నాకు ఎంతో ఉపశమనం కలిగించింది.

నేను కరుణాకరమీనన్ మద్రాసులో ఒక వారం గడిపిన తర్వాత, మే రెండవ తేదీ, రాత్రి విమానంలో సింగపూర్‌కు పయనమయ్యాము. మూడవ తేదీ ఉదయం సింగపూర్ చేరాము. సింగపూర్‌లో ఆరు వారాలు గడిపాము. నా కూతురు లీల యింట్లోనే వున్నాము. ఆమె భర్త తలాప్ అక్కడ ఉపాధ్యాయుడుగా వున్నాడని చెప్పాను కదా! మా అబ్బాయి ఉణ్ణి కూడ సింగపూర్‌లోనే వుండేవాడు. జపాన్ వైమానిక కంపెనీలో ఉణ్ణి, ఒక అధికారి. వాళ్లే కాకుండా, నా బంధువులు చాలామంది అక్కడ వుండేవాళ్లు. ఉణ్ణి కుమారునికి మూడేళ్లు నిండాయి. నేత్ర చికిత్స కాగానే, కాస్త వెలుగు పుంజుకున్న తర్వాత మొట్టమొదటి సారిగా నా మనుమడు హరి ముఖాన్ని చూడ్డం సాధ్యమవుతుందా? అని భావించాను. సింగపూర్ వెళ్లిన ఆ రోజు ఉదయమే నేను వాణ్ణి తొలిసారిగా చూశాను. అప్పటి నా మనోభావాలను నేనెలా వివరించగలను?

నేను సింగపూర్‌ను వదిలి పదకొండేళ్లు గడిచాయి. అయినప్పటికీ అక్కడవున్న మలయాళీలు, ఇతరులు నన్ను ఆహ్వానించి చూపిన గౌరవమర్యాదలకు హృదయం ద్రవించింది.

సింగపూర్ చరిత్రలో ఒక నూతన అధ్యాయం ప్రారంభమైన దశలో నేను అక్కడికి వెళ్లాను. సింగపూర్ ఒక ప్రత్యేక ప్రదేశంగా వుండేది. నేను అక్కడ

వున్న రోజులలో నూతన పరిపాలనా విధానం ప్రకారం సార్వత్రిక (జనరల్) ఎన్నికలు జరిగాయి. ఎన్నికల కోలాహలాన్ని పి.ఐ.సి. గెలుపొందడాన్నీ చూశాను. ఆ విజయోత్సవంలో పాల్గొన్న ప్రజలను చూసి ఆశ్చర్యపోయాను. బ్రిటిష్ వాళ్లు స్వేచ్ఛగా అధికారం చెలాయించిన ప్రాంతం సింగపూర్. పి.ఐ.సి. అధికారానికి వచ్చిన తర్వాత బ్రిటిష్ వాళ్లు ఒకరొకరుగా అక్కడి నుంచి వెళ్లిపోయారు. ఆ చిన్న ద్వీపంలో ఎన్నెన్ని మార్పులు వచ్చాయి?

మలయాలోనూ అలాగే జరిగింది. బ్రిటిష్ వాళ్లు దాన్నీ వదులుకోవలసి వచ్చింది. తొమ్మిది రాష్ట్రాలు కలిసి ఒక ఫెడరేషన్‌గా ఏర్పడింది. ఎన్నికైన ఒక సుల్తాన్ పరిపాలనా విధానాన్ని అనుసరించి నాయకుడయ్యాడు. ఒక పార్లమెంటు ప్రజాస్వామ్య పరిపాలనా విధానం అతి త్వరగా కలిసివచ్చింది.

దాదాపు ముప్పైయేళ్ల పూర్వం, నేను మొట్టమొదటి సారిగా మలయా వచ్చి, అక్కడ వున్న ఉన్నత న్యాయస్థానంలో న్యాయవాది కావడానికి దరఖాస్తు వేసినప్పుడు, నా జాతీయ భావాలు, ఆ న్యాయస్థానంలో నన్ను న్యాయవాదిగా వుండడానికి ఆటంకమయ్యాయి. అంటే ఆనాటి న్యాయవాదుల సంఘం వారు అలా భావించారు. ఇప్పటి దేశ పరిస్థితిని చూసినప్పుడు అక్కడ వున్న చాలామంది మిత్రులు బహుశా నన్ను సంప్రదాయవాదిగా భావించవచ్చు. ఒక కాలంలో ఎటువంటి జాతీయ భావాన్నయినా సరే పరిహసించిన చాలామంది అప్పుడు రాజకీయ రంగంపట్ల అభిమానం కలవారుగా కనిపించారు.

పాత మిత్రులను కలుసుకోవడానికి చాలా విందుల్లో, సభల్లో పాల్గొనడానికీ నేను సింగపూర్‌లో వున్నప్పుడు అవకాశాలు లభించాయి. 'విదేశీ విశేషాలు' కొత్త ప్రచురణ విడుదల చేసేప్పుడు అందులో చేర్చడానికి కావలసిన ఐదు కొత్త అధ్యాయాలను అక్కడ వున్న రోజుల్లోనే వ్రాసి ముగించాను.

జూన్ పధ్నాలుగో తేదీ, రాత్రి పదిగంటలకు నేను కరుణాకరమీనన్ విమానంలో సింగపూర్‌నుంచి ఏడుగంటల సేపు ప్రయాణం చేసిన తర్వాత మద్రాసు వచ్చి చేరాము. ఒక రోజు అక్కడ గడిపి పదహారవ తేదీన కోళిక్కోడ్‌కు బయలుదేరాము.

సింగపూర్‌లో నా కళ్లద్దాలు మళ్లీ ఒకసారి మార్చుకున్నాను. కొత్త కళ్లజోడు కాస్త ఎక్కువగానే వెలుగు నిచ్చింది. కోళిక్కోడ్ రైల్వేస్టేషన్‌కు వచ్చిన మిత్రుల ముఖాలు తేటగా కనిపించినప్పుడు నేను చాలా సంతోషించాను. వాళ్లల్లో చాలామంది ముఖాలను స్పష్టంగా చూసి రెండేళ్లకు పైనే అయింది.

నాలుగు నెలల సెలవుల్లో నేను లండన్ వెళ్లాను. అది పూర్తికావడానికి ఇంకా రెండు వారాలు వుంది. ఆ కాలఘట్టంలో పాల్‌ఘాట్‌కు మరికొన్ని

చోట్లకూ, వెళ్లి బంధువులనూ, మిత్రులనూ చూశాను. తర్వాత కోళిక్కోడ్‌కు వచ్చి జూలై ఆరవ తేదీ మళ్లీ కార్యాలయం పనులు చేపట్టాను.

# మారిన పరిస్థితులు

నేత్రచికిత్స కోసం ఇంగ్లండు వెళ్లడానికి ముందువున్న దానికన్నా ఇప్పుడు కాంతివంతమైన కళ్లతో నేను స్వదేశానికి వచ్చాను. అయినప్పటికీ వ్రాయడానికి చదవడానికీ యిబ్బంది గానే వుంది. రెండు పనులకూ, మునుపటిలాగే ఇతరుల సాయం కావలసి వచ్చింది. అయినప్పటికీ ఎక్కువ కష్టంలేకుండా, నా దైనందిన చర్యలను నేనే చూసుకోగలిగాను. ఆరోగ్య లోపంగాని, ఉత్సాహం లేక పోవడంగాని లేదు. ఇంగ్లండు నుంచి తిరిగి వచ్చిన తర్వాత భవిష్యత్తు గురించి తీవ్రంగా ఆలోచించవలసిన విధంగా దేశ పరిస్థితి మారిపోయివుంది.

ఔను. దేశ పరిస్థితులు పూర్తిగా మారిపోయివున్నాయి. కేరళలో కమ్యూనిస్టు పార్టీ అధికారానికి వచ్చింది. ఆ ప్రభుత్వానికి విరోధంగా ఇతర పార్టీల ప్రాబల్యం ఎక్కువయింది. ప్రభుత్వం తీసుకువచ్చిన, విద్యా సంస్కరణలకు వ్యతిరేకంగా మొదటి పోరాటం ప్రారంభమయింది. అది అతి త్వరలోనే రాష్ట్రమంతటా ఒక ఉద్యమంలా వ్యాపించింది. కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని పడగొట్టడానికి ఆరంభమైన కేకలు రాష్ట్రం నాలుగు వైపులా ప్రతిధ్వనించాయి. కమ్యూనిస్టు పార్టీ తప్ప మిగతా పార్టీలన్నీ ఒకటయ్యాయి. చిన్న పొరపాటును కూడా భరించి పాలకులను సహించేట్టులేరు. ఎన్నికలలో విజయం సాధించి పదవిని చేపట్టిన తమకు శాసనసభలో మెజారిటీ ఉన్నంత వరకు పరిపాలించే హక్కువుందని కమ్యూనిస్టు పార్టీ పాలకులు వాదించారు. అధికారంలో వున్న ఒక పార్టీతో ప్రత్యక్షంగా పోరాటంలోకి దిగి, గద్దె దించడానికి పూనుకోవడం ప్రజాస్వామ్య పద్ధతికి తగినది కాదు అని వాళ్లు తెలియజేశారు. రెండేళ్లుగా జరుగుతున్న కమ్యూనిస్టు నాయకుల విపరీత పరిపాలనకు ఏవిధంగానైనా అంతం చూడకపోయినట్లయితే, అది కేరళ ప్రజాస్వామ్య విధానానికి ముప్పు తీసుకొస్తుందని కాంగ్రెస్ పార్టీవాళ్లు, ఇతరులు భావించారు. ప్రజలు రెండు పక్షాలుగా విడిపోయారు. ఒక పక్షం కమ్యూనిస్టులను ఆదరించేవారు. ఇతరులు కమ్యూనిస్టు వ్యతిరేకులు.

ప్రజాపోరాటాన్ని అణచడానికి, కమ్యూనిస్టు ప్రభుత్వం శ్రద్ధగా చర్యలు తీసుకున్నప్పుడు, వ్యతిరేకతే ఉధృతంగా కనిపించింది. కేరళకు బయటాలోపలా కూడా, పోరాటానికి మద్దతుదార్లు వ్యతిరేకులు

ఎక్కువయ్యారు. కేరళలో జరుగుతున్న వ్యవహారాలను, భారతదేశంలోనూ, ఇతర దేశాలలోనూ ప్రజలు చాలా విచారంతో గమనించ సాగారు.

కేరళలో రాజకీయరంగం ద్వేషం పగతో చాలా హీనస్థితికి వస్తున్నది. ఉవ్వెత్తున లేచిన పోరాట ప్రవాహంలో జాతీయ పార్టీలతో పాటు పత్రికలు కూడా పరీక్షలకు గురిఅయ్యాయి. కమ్యూనిస్టుపార్టీ దారుణ పరిపాలనా విధానం గురించి బయటపడడానికి ప్రతిపక్షాలు స్వాతంత్ర్య పోరాటం సాగించాయి. దేశంలోవున్న పరిపాలనా విధానం గురించి నాకు అభిప్రాయభేదం వుండేది. ఆ పార్టీ వైదొలగాలనే నేను భావించాను. ఐతే అందుకు కాంగ్రెస్ పార్టీవాళ్లు, ఇతరులూ చేపట్టిన విధానం నాకు బాధ కల్గించింది. ప్రజాస్వామ్యానికి ఆ చర్య ఏమాత్రం దోహదం చేయదని నాకు అనిపించింది. కమ్యూనిస్టుపార్టీ వారి దారుణమైన పరిపాలన లాగే స్వాతంత్ర్య పోరాటం వాళ్లు చేపట్టిన విధానాలు ప్రజాస్వామ్య వినాశానికి దారితీస్తాయని నేను భయపడ్డాను. కమ్యూనిస్టు పరిపాలనను పడగొట్టడానికి రంగంలో దిగిన రాజకీయ పార్టీలుగాని, పత్రికలు గాని, తమకు వున్న ఉద్వేగంలో, ప్రజాస్వామ్యానికి రానున్న ఈ అపాయాన్ని ఆలోచించలేదు. విలాంటి ఆదరణ లేకుండా వీటినంతా చూస్తూ వుండటం తప్ప వేరే మార్గం నాకు కనిపించలేదు. అయినప్పటికీ, ఏదీ చెప్పకుండా నేను మౌనంగా చూస్తువుండడం నా దేశ ప్రజలకు నేను చేసే ద్రోహంలా నా మనసు వేదనకు గురైంది. 1959వ సం॥ జూలై ఇరవై తొమ్మిదో తేది 'మాతృభూమి' పత్రికలో నేనొక ప్రకటన ప్రచురించాను. కేళప్పన్ కూడా అందులో సంతకం చేశారు. ఈ ప్రకటన మరికొన్ని పత్రికలలో కూడా వచ్చింది. అందులోని కొన్ని భాగాలను యిక్కడచూడవచ్చు.

ఇంతకు పూర్వం ఎప్పుడూ ఏర్పడని విధంగా ఒక అనిశ్చిత స్థితి యివాళ కేరళలో ఏర్పడింది. క్రమశిక్షణ శాంతి దెబ్బతిన్నాయి. చట్టాన్ని గౌరవించి, నీతికి ధర్మానికి కట్టుబడి, జీవించే జీవితం పూర్తిగా నశించింది. విద్యార్థులు చదువులలో శ్రద్ధచూపడం లేదు. పెద్దలు తమ బాధ్యతలపట్ల శ్రద్ధ చూపడం లేదు. క్రమశిక్షణ లేని మాటలు, ఆచరణ విధానాలు నాగరికత సంస్కృతి సంపన్నులైన పెద్దలు అంగీకరించలేనంతగా దిగజారాయి. రెండు పక్షాలవాళ్లు ఏ పక్షంలోనూ చేరకుండా వుండేవాళ్లు సిగ్గుతో తలవంచుకునే విధంగా వున్న హీనమైన స్థితి ఇవాళ్టి కేరళలో చూస్తున్నాము. దానికి బాధ్యులు ఎవరన్నదీ, ఏపార్టీవారి పక్షంలో న్యాయంవున్నది? అన్న వివాదాస్పదమైన విషయాలను యిక్కడ వివరించడంలేదు. ఈ రోజున జరిగే కొన్ని ఆశించదగని సంఘటనలు కొనసాగుతూవుండడం, దేశ భవిష్యత్తును నాశనం చేస్తుందని

భావించి మౌనాన్ని విసర్జించి మేము ఈ విధంగా ఒక ప్రకటన చేయడానికి సిద్ధపడ్డాము.

మరో సంప్రదాయంలో పెరిగిన మాకు, ఇవన్నీ చూస్తున్నప్పుడు నిరుత్సాహం కలుగుతోంది. మనసు ఆవేదన పడుతోంది. తట్టుకోలేని వేదన కలుగుతోంది. ఈ స్థితిలో ఒక పరిష్కారం వెతకడం, ఈ దేశ ప్రజలకూ, ప్రభుత్వానికి సంబంధించిన ఒక పవిత్రమైన బాధ్యత కాదా? ప్రజల ధార్మిక భావాలను మంచి మార్గాలకు మళ్లించి ఔన్నత్యం పొందేట్టు చేయడం మన వల్లకాదా?

పోరాటాన్ని అట్టే కాలం కొనసాగదని అనుకున్నప్పుడు కాస్త ఉపశమనం కలిగేది. దేశంలో జరిగిన అస్తవ్యస్త వ్యవహారాలు, పరిపాలనకు వాటిల్లిన సమస్యలు కేరళలో కమ్యూనిస్టు పార్టీవారి పరిపాలనకు, అంతం చూడాలని అనుకోవడమే కారణమని కేంద్ర ప్రభుత్వం గ్రహించింది. అందువల్ల 1959వ సం॥ సెప్టెంబర్ ఒకటో తేదీ ఆచరణలో వున్న పరిపాలనను రద్దు చేసి, అధికారాన్ని ఇండియన్ యూనియన్ అధ్యక్షుడు చేపట్టాడు. యుద్ధం ముగిసింది. దేశంలో పాత పరిస్థితి మొదలైంది. రాజకీయ పార్టీలన్నీ మళ్లీ ఎన్నికలకు సిద్ధం అయ్యాయి. 1960వ సం॥ ఫిబ్రవరి నెలలో ఆ ఎన్నికలు జరిగాయి. దాని ఫలితంగా కాంగ్రెస్ పి.ఎస్.పి. కలిసిన మంత్రిసభ ఏర్పాటైంది. ముస్లింలీగ్ ఆదరణ కూడ ఈ మంత్రిమండలికి లభించింది. అప్పుడే నాకు లీగ్‌లో చేరడం మంచిది కాదనిపించింది.

ఈ మారిన పరిస్థితిలో, నా బాధ్యతలను గురించి నేను ఆలోచించసాగాను. ముఖ్యంగా చాలాపనులను ఇతరుల సాయంలేకుండానే నేను చేసుకోగలిగాను. అయినప్పటికీ వ్రాయడానికి, చదవడానికి ఇతరుల సహాయం కావలసివచ్చింది.

ఈ విషయాలను గురించి ఇతరులతో వాదించడానికి నేను యిష్టపడలేదు. అయితే పత్రికా సంపాదకుడిగా నా కర్తవ్యాలను సక్రమంగా నెరవేర్చడానికి యివి యిబ్బందిగా వున్నట్టే అనిపించేది. ఇక ఏంచెయ్యడమా? అని విచారించసాగాను.

నేత్ర చికిత్సంకోసరం నేను లండన్ వెళ్లినప్పుడు, సంపాదక బాధ్యతలు నిర్వహించిన వి.యం. నాయర్ నేను తిరిగి వచ్చిన తర్వాత కూడా నాకు సహాయంగా కొంత కాలం పత్రిక పనులను చూస్తూ వచ్చారు. ఆ విధంగా ఆయన పత్రికాసంపాదకుడుగా చాలా వరకూ బాధ్యతలు చేపట్టడం వల్ల కొంతవరకు ఉపశమనంగా వుండేది. వి.యం. నాయర్ ఈ విధంగా 'మాతృభూమి' మేనేజింగ్-ఎడిటర్ అయ్యారు. నేను చీఫ్ ఎడిటర్‌గా వున్నాను.

ఆ తర్వాత 'మాతృభూమి' అభివృద్ధికి, వికాసానికి, ఎ.యం. నాయర్ చేసిన సేవ చాలా గొప్పది.

ఈ కొత్త పరిస్థితి, నేను వివిధ రంగాలలో కృషిచేయడానికి కూడా దోహదం చేసింది. కేరళ సాహిత్య అకాడెమీ కార్యకమిటీ అధ్యక్షుడిగా వుండి వైదొలగానని ఇంతకు ముందు చెప్పాను కదా? అకాడెమీ ఉపాధ్యక్షులుగా వున్న మహాకవి వళ్లత్తోళ్ కాలం చేసిన తర్వాత ఆ పదవిని నేను చేపట్టాలని నూతన ప్రభుత్వం నన్ను కోరింది. అకాడెమీ పూర్తిగా స్వతంత్రంగా కొనసాగే సంస్థగా వుండాలి. దాని కార్యకలాపాలలో ప్రభుత్వం జోక్యం చేసుకోకూడదు. అన్న కారణం చేతనే కదా ఆ అధ్యక్షపదవి నుంచి వైదొలగాను! అకాడెమీ పదవినీ, అధికారాన్ని గురించిన నా అభిప్రాయాన్ని నూతన ప్రభుత్వం అంగీకరించి గౌరవిస్తుందన్న నమ్మకం కొద్దీ, ఉపాధ్యక్ష పదవిని మళ్లీ చేపట్టాను. నేను ఆశించిన విధంగా, అకాడెమీని క్రమబద్ధం చేసే విధంగా సంస్కరణలు తీసుకురావడానికి నేను చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. 1961వ సం|| అక్టోబర్ ఏడవతేదీన సాహిత్యఅకాడెమీ నాలుగోవార్షిక సమావేశంలో నేను అధ్యక్షోపన్యాసం చేశాను. అప్పుడు ఆ అభిప్రాయాన్ని స్పష్టం చేశాను. ఆ ఉపన్యాసంలో కొన్ని భాగాలను యిక్కడ పొందుపరుస్తున్నాను.

'అకాడెమీ సొంత బాధ్యతలను, సక్రమంగా నెరవేర్చుకోవాలంటే పూర్తిగా అది స్వతంత్రంగా కొనసాగే సంస్థగా వుండాలి. దానిని కార్యాచరణకు తీసుకువచ్చే విధానాన్ని రూపొందించడం ప్రభుత్వం బాధ్యత అని 1956వ సం|| అకాడెమీ మొదట ప్రారంభించినప్పుడు ఆనాటి కొచ్చిరాజ్య సలహాదారుగావున్న శ్రీ పి.యన్. రావు చెప్పారు. అదే అభిప్రాయాన్ని 1954వ సం||లో కేంద్ర సాహిత్య అకాడెమీ ప్రారంభోత్సవ ఉపన్యాసంలో మౌలానా అబుల్‌కలాం ఆజాద్ స్పష్టం చేశారు. అకాడెమీలను, స్వతంత్రంగా నిర్వహణ జరిపించడానికి కావలసిన నిధిని సమకూర్చడం మాత్రమే మనం చేయవలసినవి. ఈ విధంగా దృశ్యానికి కావలసిన తెర ఎత్తడమే ప్రభుత్వం పని - బాధ్యత. అకాడెమీని స్థాపించిన తర్వాత దానిమీద ఎటువంటి నియమాలను, ప్రభుత్వం విధించకూడదు. స్వయంపరిపాలన జరిగే ఒక సంస్థగా దాని బాధ్యతలు నిర్వర్తించడానికి, దానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని యివ్వాలి. అకాడెమీ ఉన్నత లక్ష్యాలను, ఏర్పరచడానికి, ప్రజల అభిరుచిని మెరుగుపరచడానికి కృషిచేయాలంటే దేశ ప్రజల మధ్య దాన్ని గురించి మంచి, మర్యాద, గౌరవం వుండి తీరాలి. అందుకు అకాడెమీ ఒక స్వతంత్ర సంస్థగా వుండాలి. ప్రభుత్వం దాని నిర్వహణకు కావలసిన నిధి సమకూర్చడం వల్ల అది ప్రభుత్వం ఆజ్ఞలను శిరసావహించి, ప్రభుత్వ పక్షంగా

వ్యవహారించవలసిన ప్రభుత్వ శాఖ కాదు. ఈ విషయాన్ని అకాడెమి సభ్యులు, ప్రజలు, ప్రభుత్వం ఎప్పుడూ మరిచి పోకూడదు.

అకాడెమీ అభివృద్ధికి సహాయపడటం తప్ప అకాడెమీని ప్రభుత్వం మీద ఆధారపడే సంస్థగా మార్చడానికి ప్రభుత్వం ఎప్పుడూ ప్రయత్నించకూడదు. అది అకాడెమీ గౌరవాన్ని తగ్గిస్తుంది. తన్నుతానే నిర్వహించుకునే హక్కులువున్న సంస్థగా వుండాలనే దాన్ని ప్రారంభించిన వాళ్లు ఆశించారు. అయితే ఆ ప్రారంభ కాలం నుంచి, మార్పులేమైనా చెయ్యాలంటే, ఆ బాధ్యతను అకాడెమీకే అప్పగించేవారు. ఆ తర్వాత బాగా ఆలోచించిన తర్వాత అకాడెమీ తయారుచేసిన నిర్వాహక సంస్కరణలను ప్రభుత్వ అంగీకారం పొందడానికి పంపి ఎనిమిది నెలలు దాటుతోంది. యింకా దానికి ప్రభుత్వం అంగీకరించలేదు అన్నది మాత్రమేకాదు. దాని సంబంధంగా అకాడెమీతో ఎలాంటి చర్చలు జరపడానికి ముందుకు రాలేదు. చాలాసార్లు ఈ విషయం గురించి అకాడెమీ ప్రభుత్వ దృష్టికి తీసుకురావడానికి ప్రయత్నించి ప్రయోజనం లేకుండా పోయింది. ప్రభుత్వం నిర్లక్ష్యవైఖరి, విముఖత మారలేదు. ఇది అకాడెమి మంచి అభివృద్ధికి తగినది కాదు అని చెప్పనవసరం లేదు.

ఎలాగో ఆ సంవత్సరంలో నేను అకాడెమీతో వున్న సంబంధాన్ని తెంచుకున్నాను. ఇప్పుడు కూడా కేరళ సాహిత్యఅకాడెమీకి, దానికి అవసరమైన స్వతంత్రం గానీ తగిన గౌరవంగానీ రాలేదు.

లండన్ నుంచి తిరిగి వచ్చిన తర్వాత నేను చాలా పుస్తకాలు రాశాను. 'విజయత్తిలేక్కు' (విజయం వైపు) 'ప్రభాతదీపం' 'అబ్రహం లింకన్' 'నామ్మున్నేట్టు' (మనం ముందడుగువేస్తున్నాం) 'నవభారత శిల్పులు' (రెండు భాగాలు) 'జవహర్‌లాల్ నెహ్రూ' 'మహాత్మాగాంధీ' (రెండు భాగాలు) 'నాట్టినువేండి' (దేశం కోసరం) మహాత్మా అనే రెండు నాటకాలు ఇలా పన్నెండు పుస్తకాలు రాశాను.

ఈ పుస్తకాలు రాయడంలో నాకు చాలామంది సహకరించారు. చూపు సరిగ్గాలేకుండా ఇన్ని పుస్తకాలు ఎలా రాయగలిగాననే సందేహం పఠితలకు కలగవచ్చు. తెల్లవారుజామున మూడు గంటలకే లేచి రాయడానికి కూర్చునే వాణ్ణి. ఒక పుస్తకం పూర్తికాగానే మరొకటి ప్రారంభించేవాణ్ణి. కొన్ని సందర్భాల్లో ఒకటి కంటే ఎక్కువ పుస్తకాలు రాసేవాణ్ణి. ఇలా ఎనిమిది సంవత్సరాల్లో పన్నెండు పుస్తకాలు రాశాను.

నాకు వ్రాయడానికి సహాయపడ్డవారిలో కొందరిని గురించి చెప్పుకోవాలి. మధుర వనం కృష్ణకురూప్, పి.యం. వేణుగోపాల మారార్, ఎన్.ఏ. కృష్ణన్

నాయర్ మొదలైన వారు. పుస్తకం రాసేముందు నేను మరికొన్ని పుస్తకాలు చదవవలసివచ్చేది. ఎప్పుడూ నా జ్ఞాపకాల నుంచే పుస్తకాలు రాయడం సాధ్యంకాదు. అందువల్ల చాలాసార్లు దానికి కావలసిన పుస్తకాల నుంచి కావలసిన భాగాలను చదివి వినిపించమని సహాయకులను అడిగేవాణ్ణి. తర్వాత పుస్తకం వ్రాయడం ప్రారంభించేవాణ్ణి. నేను చెబుతూవుంటే సహాయకులు రాయడం అలవాటు. నా కూతురు లీల మనుమరాలు నళిని, 'మాతృభూమి' సంపాదకులుగా తంగమ్ నాకు ఒక్కో విధంగా ఉత్సాహంగా సహకరిస్తూ వచ్చారు. ఈ క్లిష్టమైన పనిలో నాకు సహాయపడ్డ అందరికీ నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

చాలా బహిరంగసభల్లోనూ నేను పాల్గొనవలసివచ్చేది. సమయం దాటకుండా వుండడం నా ముఖ్యమైన సిద్ధాంతం. నిర్ణీత సమయానికి సభ జరుగుతున్న చోటికి చేరుకోవాలని అనుకునేవాణ్ణి. ఎంత చిన్న సభ అయినప్పటికీ అక్కడికి వెళ్లి మాట్లాడవలసిన విషయం ఆలోచించుకొని సిద్ధంచేసుకున్న తర్వాత వెళ్లేవాణ్ణి. రేడియో ఉపన్యాసాలకు నన్ను ఆహ్వానించేవారు. రాసింది చూసి చదవడం నా వల్ల కాదు కదా! అయినప్పటికీ మాట్లాడవలసిన విషయం ముందుగానే రాసి సిద్ధం చేసుకునేవాణ్ణి. ఆపైన మైకు ముందు నుంచుని మాట్లాడ్డం నాకు కష్టం కాదు.

పత్రికకు సంబంధించిన మూడొంతుల పనులు వి.యమ్. నాయరే చూసుకుంటున్నప్పటికీ, కార్యాలయానికి వెళ్లగానే నాకు చాలా పనులు వుండేవి. రోజూ వచ్చే ముఖ్యమైన ఉత్తరాలను, పత్రికలనూ, నా కార్యదర్శి శ్రీ కుమారన్ నాకు చదివి వినిపించేవాడు. ఉత్తరాలకు జవాబు రాయమనేవాణ్ణి. తమతమ సమస్యలకు సంబంధించిన పలువురి నుంచి వచ్చే ఉత్తరాలు ఎక్కువగా వుండేవి. ఆ తర్వాత చూడడానికి వచ్చిన వారిని కలుసుకుని మాట్లాడేవాణ్ణి. మధ్యాహ్నం భోజనం తర్వాత ఒక గంటసేపైనా నిద్రపోవడం అలవాటు. ఏది వద్దనుకున్నా, మధ్యాహ్నపు నిద్ర మాత్రం వదలలేదు. మళ్లీ కార్యాలయానికి వెళ్లి ఒకటిన్నర గంటలసేపు పనిచేసే వాణ్ణి. కొన్ని రోజుల్లో నేను సభలలో మాట్లాడవలసి వచ్చేది. లేనప్పుడు యింటికి వచ్చి లీలగాని, నళిని గాని నాకు నచ్చిన పుస్తకాలు చదివి వినిపించేవారు. రాత్రి భోజనం అయిన తర్వాత కొంతసేపు ఏదైనా చదవమనే, లేదా సంగీతం వింటూనో కూర్చునేవాణ్ణి. తొమ్మిదిన్నర గంటలకు నిద్రపోయేవాణ్ణి. నాకు వయసుడిగినప్పటికీ, అలా నాకు అనిపించలేదు. ఆకలి లేక పోవడం, జ్ఞాపకశక్తి మందగించడం, నిద్రపోవడం, మొదలైన అనారోగ్యాలు, ఆ

వయసులో యిబ్బంది పెడతాయి. కానీ యింతవరకు అటువంటివేమీ నాకు బాధ కలిగించలేదు.

సభలలో పాల్గొనడానికి గాని, మరేదైన కారణం వల్ల నేను అప్పు డప్పు డూ బయటి ఊళ్లకు వెళ్లవలసివచ్చేది. కోరిన ఆహారం కావలసివచ్చినప్పు డు దొరికేట్టు ఏర్పాట్లు చేసినట్లయితే ప్రయాణం బాధగా అనిపించదు. ప్రయాణం చేయడాన్ని నేను ఆశించేవాణ్ణి.

కంటిచూపు తగ్గడం వల్ల వచ్చిన బాధ, నా కార్యక్రమాలనుగాని, మానసికారోగ్యాన్నిగాని బాధించకుండా వుండేట్టు నేను జాగ్రత్తలు తీసుకున్నాను. నేత్రచికిత్స చేసుకున్న తర్వాత నాకు కొంత మనస్సుకు అలసట ఏర్పడినమాట వాస్తవమే. రోజులు గడుస్తున్న కొద్దీ నేను, అలసట, దిగులు తగ్గడం ప్రారంభించి తర్వాత పూర్తిగా మాయమయింది. సాధారణంగా ఉత్సాహంతోనే అనుదినకృత్యాలు నిర్వహించేవాణ్ణి. మన మనసుకు తగ్గట్టే మన ప్రపంచం వుంటుంది కదా! పూర్తిగా కంటిచూపు లేనివాళ్లు, ఎన్నెన్ని మహాకార్యాలు చేశారు?

'కంటి చూపు, పూర్తిగా పోయినప్పటికీ జీవితాన్ని ఉపయోగకరంగానూ, సంతోషదాయకంగానూ భావిస్తున్నాను. ఆ ఆత్మవిశ్వాసాన్ని ప్రధానంగా భావించాలి' అని ఫ్రేజర్ ప్రభు ఒకసారి చెప్పారు. కంటిచూపు లేని వాళ్ల బాధలు రూపుమాపడానికి ఎంతో కృషిచేసిన వారాయన. ఆయనా చూపులేని వారే. అటువంటి గొప్పవాళ్ల మంచి మాటలు, వినడం చాలా ఆసక్తిగల వాణ్ణి నేను. ఇటువంటి పలువురి మహానీయుల జీవితచరిత్రలను నేను చదివాను. యింకా చదవమని చెప్పి, విని ఆనందిస్తున్నాను. వినికిడి, చూపులేని వనిత హెలెన్ కెల్లర్ జీవితచరిత్ర నన్నెంతగానో ఆకర్షించిన పుస్తకం. ఆ ధీరవనిత చెప్పినట్లు పంచేంద్రియాలు ద్వారా మనం పొందే అనుభవాలను, ప్రకృతి మనకు ప్రసాదించిన సాటిలేని వరంగానే భావించాలి. అన్ని యింద్రియాలలో మన కెంతో ఆనందాన్ని కలిగించేది కళ్లే అని నిస్సందేహంగా చెప్పవచ్చు.

రోజులో చాలా భాగం నేను పనుల్లోనే లీనమై వుండడంవల్ల, నా లోపాన్ని తలుచుకుని బాధపడడానికి నాకు సందర్భాలు చాలా తక్కువగానే వుండేవి. కంటిచూపు తగ్గినప్పటికీ, జీవితాన్ని ఉపయోగకరంగా గడిపే మార్గాలను, నేను యిప్పు డు కూడా పరిశీలిస్తున్నాను. ఆ ప్రయత్నంలో నేను ఓడిపోయినట్లు చెప్పడానికి లేదు. మారుతున్న జీవితంలో నా అసమర్థత అనుదిన నిత్యకృత్యాలను ఆటంకం కాకుండా వుండాలి అన్నదే నా హృదయపూర్వక ప్రార్థన.

# ప్రజాజీవితం రెండు వైపులు

అర్ధశతాబ్దాకాలానికి పైగా నేను ప్రజాజీవితంలో పాల్గొన్నాను. ఆ విధంగా కేరళలోనూ, బయట ప్రజాజీవితం రెండు ప్రక్కల్నీ చేదును, తియ్యదనాన్నీ రుచిచూసే అవకాశాలు నాకు చాలా కలిగాయి.

ప్రజాజీవితంలో పాల్గొనడానికి నాకు ఉత్సాహం కలిగించేది ఏది? అని ఎవరైనా నన్ను అడిగినట్లయితే నేను జవాబు చెప్పలేక తికమక పడతాను. చిన్ననాటినుంచే నాకు ప్రభుత్వ కార్యాలయంలో అడుగుపెట్టే ఆశ వుండేదికాదు. ప్రజాజీవితంలో పాల్గొని కృషిచేయడానికి తగిన స్వతంత్రం, వసతి కలిగించే వృత్తిని చేపట్టడానికే నేను ఆశపడ్డాను. విద్యార్థిగా వున్న రోజుల నుంచే దేశభక్తి ప్రపూరితులైన దేశ నేతల జీవితచరిత్రలను చదివే ఉత్సాహం ఎక్కువగా వుండేది. ఏ దేశానికి చెందిన వారైనాసరే, స్వతంత్రం కోసరం పొందిన వీరుల కథలు నాకు ఎంతో ఉత్సాహాన్ని రేకెత్తించేవి. ఇటలీని ఒకే దేశంగా రూపొందించడానికి సంపూర్ణంగా పోరాడిన మాజిని, అమెరికాకు స్వాతంత్ర్యం సాధించిన వాషింగ్‌టన్, మంజు వంశస్థుల **అరాజరిక** పరిపాలన నుంచి చైనాను విముక్తిచేసిన డాక్టర్ సన్-యాట్-సేన్, ఐర్లండులో బ్రిటిష్ పరిపాలనను అంతంచేసిన డివేలరా, నీగ్రో బానిసల విముక్తి కోసరం హృదయం ద్రవించి కృషిచేసి లింకన్ మొదలైన వారి జీవితచరిత్రలను ఎంత ఉత్సాహంతో చదివాను. ప్రజాజీవితం పట్లనాలో ఆసక్తి పెంచడానికి అవి ఎంతో నాకు ఉత్సాహాన్ని కలిగించాయి.

నేను కోళిక్కోడ్ లో న్యాయవాద వృత్తి ప్రారంభించిన కాలంలోని హోమ్‌రూల్‌లీగ్ కార్యదర్శి బాధ్యతల్ని చేపట్టాను. అలా ప్రారంభమైన ప్రజాజీవితం, చాలాకాలం వరకు కొనసాగుతూ వచ్చింది. ఒక రంగంలో లేదంటే మరో రంగంలోకి నేను పనిచేసే విధానం మారుతూ వుండేది. కాని నాకు యిష్టమైన ప్రజాసేవలో మాత్రం నేను కొనసాగుతూనే వచ్చాను. ఏ రంగంలో వున్నప్పటికీ ప్రజాసేవ చేసేప్పుడు వ్యతిరేకతను ఎదుర్కొనకుండా వుండలేము. హోమ్‌రూల్ ఉద్యమంలో పాల్గొన్న కాలంలో, దళిత వర్గాల విరోధాన్ని నేను పొందవలసివచ్చింది. వైక్కం సత్యాగ్రహపు రోజుల్లో నేను అగ్రజాతుల వారిని ఎదుర్కోవలసివచ్చింది. సహాయనిరాకరణోద్యమ

సమయంలో ప్రభుత్వ పక్ష అధికారులందరూ నాకు విరోధం అయ్యారు. కార్మిక ఉద్యమ విషయంలో పెట్టుబడిదార్లనుంచి తీవ్రమైన వ్యతిరేకతకు గురిఅయ్యాను. సిద్ధాంతపరంగా విశ్వాసం, చిత్తశుద్ధి, ఈ రెండే యిటువంటి సందర్భాలలో ఒక ప్రజాసేవకునికి ఉత్సాహాన్ని ధైర్యాన్ని సమకూర్చగలవు.

'సూర్యుడు అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్య కీర్తి, శక్తి ఎక్కడ? దానిని వ్యతిరేకిస్తారట ఈ హోమ్‌రూల్ వాళ్లు? ఇటువంటి పిచ్చివాళ్లతో ఏం మాట్లాడుతాం?' అనే ఆ రోజుల్లో కాంగ్రెస్ వారి గురించి చాలామంది మాట్లాడారు. వారితో వివాదించడంలో ప్రయోజనం లేదు. ఎదుటివారి అభిప్రాయాలను వినే ఓర్పుగాని, అంగీకరించే మనసుగాని, ఆ రోజుల్లో అటువంటి వారి వద్ద లేదు.

ప్రజారంగంలో పనిచేసినప్పుడు, ముఖ్యంగా నాలుగువైపులా వ్యతిరేకతను ఎదుర్కొనవలసివచ్చింది. నా కుటుంబస్థులు, బంధువులు మొదలైన వారు ఆశించతగ్గ వాణ్ణి నేను. నేను పాశ్చాత్యదేశాలకు వెళ్లి ఉన్నత విద్యనభ్యసించి బారిష్టర్‌గా వచ్చిన రోజులలో నానుంచి ఏవేవే గొప్ప లాభాలను ఎదురుచూశారు. నా మనస్తత్వం, ప్రజాసేవ చెయ్యాలనే ఉత్సాహం, వారి ఆశలను కోర్కెలను నాశనం చేశాయి. సాధారణంగా నన్నెంతో ప్రేమాదరాలతో ఆహ్వానించే బంధుమిత్రులు కూడా నేను వృత్తిని మానేసి సహాయనిరాకరణోద్యమంలో పాల్గొన్న తర్వాత, నన్ను చూడగానే విసుగుచూపడం ప్రారంభించారు. నా తెగింపు వాళ్లకు ఆశ్చర్యం, కలిగించడం మాత్రమే కాకుండా, నా చర్యవల్ల ఆ రోజుల్లో వారికీ ప్రభుత్వానికీ మధ్యవున్న మంచి సంబంధం ఏదైనా హానికలిగిస్తుందేమోనన్న భయంకూడా పట్టుకుంది. దానిని గ్రహించి నేను వాళ్లనందరినీ చూడడానికి వెళ్లడం కూడా మానేశాను. ఆర్థిక దుస్థితి ఆత్మవిశ్వాసాన్ని ఎలా నాశనం చేస్తుందో ఆనాటి అనుభవాలు నాకు తెలియజేశాయి. చేతుల్లో డబ్బులేక దైనందిన ఖర్చులకు కూడా అవస్థ పడివున్నాను. ఆనాటి జ్ఞాపకాలే నేను మరువలేనంతగా బాధను కలిగిస్తాయి. విద్యార్థిగా వున్న దశనుంచే అప్పుల బాధనన్ను వెన్నంటివచ్చింది. ఆ ఒత్తిడి అప్పుడప్పుడూ ఎక్కువవుతూ, తగ్గుతూ వచ్చింది. ఇప్పుడు కూడ నేను దాన్నుంచి పూర్తిగా బయటపడినట్టు చెప్పడానికి లేదు. ఆ రోజుల్లో స్థిరమైన ఆదాయం లేదు. సేకరించి దాచుకున్నది ఏమీలేదు. ఖర్చులు తగ్గించడానికి వీలుకాదు. యిటువంటి స్థితిలో ఎవరికైనా విసుగుపుడుతుంది కదా? తత్వజ్ఞానం, వేదాంత చింతన, అప్పుడు మనకు రుచించదు, జీవితాన్ని ఎలాగైనా ముగించుకోవాలని కూడ అనిపిస్తుంది. అటువంటి దుఃఖమైన కాలాన్ని నేనెలాదాటివచ్చానే తలుచుకుంటేనే ఆశ్చర్యంగావుంటుంది.

ప్రభుత్వ భయం, అధికారుల బెదిరింపులు నన్ను వదలకుండా వేధించాయి. ఖైదు చేసేవారు, పోలీసువాళ్లు ఇంటిని సోదాచేసేవాళ్లు. ఏదో ఒక నేరం మోపి నన్ను కోర్టులో నిలబెట్టి జరిమానా విధించి దాన్ని వసూలుచేయడానికి జప్తు చేసేవారు అని రకరకాలుగా భయం, అనుమానం నన్ను తరుముతూ వచ్చేవి. ఎరనాడులో ఉద్యమం చెలరేగినప్పుడు నన్ను ఖైదుచేస్తారని చాలాసార్లు నేను విన్నాను. అయినా అది జరగలేదు. అయినప్పటికీ దిగులు, భయం తోనే నేను చాలా రోజులు గడిపాను. జపాన్‌వాళ్లు సింగపూర్‌లో ప్రభుత్వాన్ని చేపట్టిన కాలఘట్టంలో చాలా భయంకరమైన అనుభవాలతో బాధపడ్డాను. రానున్న బాధలను గురించిన దిగులు, బాధలు వచ్చినప్పుడు అనుభవించడం కన్నా భయంకరమైన అనుభవం నాకు రానున్న కష్టాల గురించి భయం మాత్రమేకాదు నా కుటుంబం వారికి రాగల బాధలు కూడా నన్ను విపరీతంగా వేధించేది.

ప్రజాసేవలో కోపోద్రిక్తులైన ప్రజల సమూహం, హింసాకాండకు గురికాకుండా తప్పుకోవడం సాధ్యంకాదు. ద్రోహులు, వృధా నిందలు, మొదలైన వాటికి నేను చాలాసార్లు గురిఅయ్యాను. మన సుఖసంతోషాలకు ఇతరులను ఆశించి లాభం పొందలేము. ఇతరుల ఆలోచనలను, చర్యలను, మనం బాగుచేయలేము. ఒక ప్రజాసేవకుడు పూలమాలను, కీర్తిమాలను స్వీకరించి నట్టే రాళ్ల దెబ్బలను, నిందలను భరించవలసివుంటుంది. దీని నెప్పుడూ మరచిపోకూడదు. రెండిటినీ సమంగా భావించి, ప్రజాసేవలో కొనసాగడానికి వీలుకాలేదంటే, ఆ రంగం నుంచి తప్పుకోవడం శ్రేయస్కరం, ఈ విధంగా సలహాలు యివ్వడం సులభమే. అయితే కార్యాచరణకు తీసుకురావడం కష్టం. ఉదాహరణకు ఒక సంఘటన గురించి చెబుతాను.

శాసనసభ బహిష్కారం కొనసాగాలా? **వద్దా? అన్న** విషయం గురించి చర్చ జరపడానికి, కాంగ్రెస్ ఒక ప్రత్యేక కమిటీని ఏర్పాటు చేసింది. ఎరనాడు ఉద్యమం తర్వాత జరిగింది యిది. డాక్టర్ అన్సారీ, పండిత మోతిలాల్‌నెహ్రూ, హకీం అజ్‌మల్‌ఖాన్, రాజగోపాలాచారి, విఠల్ బాయ్ పటేల్, కస్తూరి రంగ అయ్యంగార్ మొదలైనవారు ఆ కమిటీ సభ్యులు. మలబార్‌లో అడుగుపెట్టడానికి వారికి ప్రభుత్వం అనుమతి యివ్వనందువల్ల, మలబార్ కాంగ్రెస్ సభ్యుల సాక్ష్యాలు అడిగి తెలుసుకోవడానికి ఈ రోడ్‌లోనే ఆ విచారణను ఏర్పాటుచేశారు. ఆ రోజుల్లో నేను కేరళ కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిని మరికొందరు మిత్రులతో సాక్ష్యం చెప్పడానికి ఈ రోడ్ వెళ్లాను. నాతో వున్నవారు వివిధ విషయాలపై నాతో అభిప్రాయభేదం కలవాళ్లే. వాళ్లు విచారణ కమిటీ ముందు సాక్ష్యం చెప్పేప్పుడు నా వాదాలను తిరస్కరించలేదు.

వ్యక్తిగతంగా విమర్శించారు. ఆధారంలేని ఆ విమర్శలను వింటూ వుండడం తప్ప, వేరే దారిలేదు. నా వల్ల అది భరించడానికి వీలుకాలేదు. మనస్ఫూర్తిగా కష్టాలుపడి కూడా యిటువంటి నిరసనలను ఎదుర్కొనవలసివస్తున్నదే అని బాధపడ్డాను.

'ఎందుకోసరం దీన్నంతా భరించి ప్రజాసేవలో కొనసాగాలి? ఎవరెవరి వృత్తులు వారు చేసుకుంటూ సుఖంగా జీవితం గడపకూడదా? వాటిని వదిలేసి ఎందుకు యిలా భరించాలి.' అని కూడా అప్పుడు అనిపించింది. 'మీరు మరీ అపరాధిగా భావింపబడ్డవారు కారు, మిస్టర్ కేశవమీనన్' అని విఠల్‌బాయ్ పటేల్ ఆ సందర్భంలో చెప్పిన మాటలు యింకా నా చెవుల్లో మారుమ్రోగుతున్నాయి. ఈ రోడ్ నుంచి తిరిగి వచ్చేప్పుడూ, మూడవ తరగతి రైలుపెట్టె బెర్త్‌మీద పడుకుని నా బాధలన్నీ తలుచుకుని కన్నీళ్లు కార్చాను. నా హృదయంతో నేను మాట్లాడ్డం వినడానికి ఎవరూ అప్పుడు నా దగ్గరలేరు.

మన ఆలోచనలను, బాగా తెలుసుకోకుండానే తప్పుగా భావించి చాలా సందర్భాలలో వ్యతిరేకిస్తారు. చెలరేగే ప్రజాసమూహాన్ని ఎదుర్కోవలసి వచ్చినప్పుడు నిదానంగా చాలా ధైర్యంగా ఓర్పుగా వుండాలి, వీలైతే గుంపునుంచి వెళ్లిపోవడమే మంచిది.

హృదయపూర్వకంగా ప్రజాసేవలో పాల్గొనేవారికి ఎప్పుడూ ప్రజల ప్రేమాదరాలు లభిస్తాయని చెప్పడానికి లేదు. కొన్ని సందర్భాలలో చివరి ఘట్టంలోనే అందుకు అవకాశం వుంటుంది. తన జీవితకాలంలో ఎక్కువభాగం, దేశస్వాతంత్ర్యం కోసరమే పోరాడి, విదేశంలో రకరకాల బాధలు అనుభవించిన 'మాడమ్ కామ' ఆవిన్ మరణం తర్వాతే వారి ఉన్నత సేవ గురించి చాలామంది తెలుసుకున్నారు. జీవితకాలంలోనూ, మరణం తర్వాత కూడా తన సేవకు గుర్తింపు పొందకుండానే పోయినవారు వున్నారు. మన సేవ అంగీకరించబడుతుందన్న ఉత్సాహం తోనే ప్రజాజీవితంలో బాధలు పడడానికి సిద్ధపడతాము? మన లక్ష్యానికి తగిన జీవితాన్ని గడపడానికి ప్రయత్నించాము అన్న ఒక్క ఆలోచనే మనకు సంతృప్తిని కలిగిస్తుంది.

ఒక ప్రజాసేవకునికి ప్రజలద్వారా లభించే కీర్తి నిజంగా సంతోషం కలిగించగలదే. సుప్రసిద్ధ వక్త శ్రీనివాసశాస్త్రిని గురించి ఒక కథ చెప్పడం కద్దు. ఒకసారి కలకత్తాలో శ్రీనివాసశాస్త్రి ఉపన్యసించారు. ఉపన్యాసం ముగించి ఆయన తన బసకు వెళ్లినప్పుడు, అక్కడ వున్న ఒక మిత్రుడు శాస్త్రి దగ్గరికి వచ్చి 'తమ ఉపన్యాసం చాలా బావుంది. ఇటువంటి అవకాశం లభించడమే మహాభాగ్యం' అన్నాడు. దానికి శాస్త్రిగారు యిలా జవాబు చెప్పారు, 'ఇటువంటి అభినందనలు నేను చాలా విన్నాను? అయినప్పటికి మిత్రుల

హృదయపూర్వక ప్రశంసలు వినడంలో నాకు ఎలాంటి విసుగూ ఏర్పడడం లేదు' అన్నారాయన. ఎటువంటి మనిషి హృదయంలోనైనా సరే ఏర్పడే భావాలనే శాస్త్రిగారు వ్యక్తంచేశారు.

ప్రజాజీవితంలో ఎటువంటి కఠినమైన అనుభవాలు ఏర్పడినప్పటికీ, ప్రజల ప్రేమను పొందగలిగే వివిధ సందర్భాలు, నాకు లభించాయి. మనకు ఏర్పడే అనుభవాలను మనం క్రమబద్ధం చేసుకోగలమా? ఎల్లలేని ప్రేమాభినందనలను, అంగీకరించినట్లే విమర్శలు కూడా ఎదుర్కోవలసి వుంటుంది. అయితే ఈ రెండూ మనల్ని దారితప్పిపోయేట్లు చేయడానికి చోటివ్వకూడదు. ప్రజాసేవలో పాల్గొన్నవారు దేనికైనా సిద్ధంగా వుండాలి. యుద్ధభూమికి బయలుదేరిన సైనికుల్లాంటి వారేవారు. భవిష్యత్తు నిశ్చయించుకోలేనిది. యుద్ధంలో మరణం కూడా వాటిల్లవచ్చు. విజయంతో తిరిగిరావచ్చు. అయినప్పటికీ వారికి తాము దేశ స్వతంత్ర్యాన్ని కాపాడడానికి బయలుదేరామన్న నమ్మకమే నూతనోత్తేజం యివ్వగలదు. అదే విధంగా ప్రజాసేవకు తన్ను అర్పించుకున్న ప్రజాసేవకునికీ, అన్యాయంతో అవినీతితో పోరాడే ఉత్సాహం, కష్టాలలో బాధపడే సామాన్యులను ఓదార్చే ఉత్సాహం, యితరుల క్షేమ సౌకర్యాలను, అభివృద్ధిచేసే ఉత్సాహం, సుస్థిరమైన విశ్వాసాన్ని కలిగిస్తుంది. బాధలను భరించి, ఆటంకాలను, అధిగమించి పురోగమించే అసాధారణ శక్తిసామర్థ్యాలు కొందరికి వుంటాయి. వ్యతిరేకత వచ్చేప్పుడు మరింత ముందుకు చొచ్చుకుపోతారు. ఇటువంటి వారు నాయకులుగా వున్నప్పటికీ లేకపోయినప్పటికీ తమ శక్తి సామర్థ్యాలన్నిటినీ ప్రజాసేవకే అంకితం చేశారన్న కీర్తికి పాత్రమవుతారు.

జీవితంలో నా అనుభవాలు ఈ రోజు మసకబారే, జ్ఞాపకాలుగానే మిగిలిపోతున్నాయి. ఆ జ్ఞాపకాల మధురిమను నేను యివాళ చవిచూస్తూ అనుభవిస్తున్నాను. బాధలు నాకెన్నో ఏర్పాడ్డాయి. ప్రజాజీవితంలో నేను పాల్గొనలేదంటే యివాళ నేను పొందుతున్న తృప్తి నాకెప్పటికీ లభించేదికాదు. జీవిత సాయం సమయంలో ఆత్మతృప్తే కదా ముఖ్యమైంది!

# అశాంతి

1966వ సంవత్సరం జరిగిన రిపబ్లిక్ ఉత్సవాలలో భారత యూనియన్ అధ్యక్షుడు నాకు 'పద్మభూషణ్' యిచ్చి, గౌరవించారు. ఈ వార్తకు సంబంధించిన ఊహాగానాలు అంతకు ముందే నా చెవిని పడ్డాయి. రిపబ్లిక్ దినాన ఈ వివరాలు వెలువడినప్పుడు చాలామంది స్నేహితుల నుంచి అభినందనలు వచ్చాయి. అప్యాయంగా, ప్రేమపూర్వకంగా వాళ్లు రాసిన ఉత్తరాలకు నా మనసు ద్రవించింది. రెండు నెలల తర్వాత దీనికి సంబంధించిన ఉత్సవం - ఢిల్లీలో జరిగింది. స్వయంగా ఆ సత్కారాన్ని అందుకోవడానికి నేను ఢిల్లీ వెళ్లాను. నాతో పాటు కుమార్తెలీల, మనుమరాలు నళిని, తలాప్పు దామోదరన్ వచ్చారు. రాష్ట్రపతి భవనంలో జరిగే అలాంఛనాన్ని స్వయంగా నేను చూడ్డానికి వీలుకాకపోయినా ప్రేమ వాత్సల్యమయమైన ఆ వాతావరణం, మనసులో నిలిచిపోయింది.

ఒక వారం మేము ఢిల్లీలో బసచేశాము. అంతలో నా పాత మిత్రుడు జనరల్ మోహన్‌సింగ్ పిలుపును అంగీకరించి మేము చండీఘర్ వెళ్లాము. మోహన్‌సింగ్ ఎంత మధురంగా ఆహ్వానం పలికాడు? ఐ.ఎన్.ఏ. కాలంలో మాకు ఏర్పాడ్డ అనుభవాల గురించి మేము మాట్లాడుకుని సంతోషించాము. ఆయనతోపాటు రత్తన్‌సింగ్ కూడా వున్నారు. ఐ.ఎన్.ఏ. రోజుల్లో ఆయన కార్యదర్శిగా వున్నవారు రత్తన్‌సింగ్. ఆ తర్వాత ఆయన పంజాబ్ మంత్రిమండలిలో ఒకరుగా పనిచేశారు.

ఢిల్లీ నుంచి తిరిగి వచ్చిన తర్వాత నేను చాలా అభినందన సభల్లో పాల్గొన్నాను. ఆ తర్వాత నాకు ఎనభైయేళ్లు పూర్తి అయ్యేరోజువచ్చింది. మిత్రుల వద్ద నుంచి, పలు సంస్థల నుంచి ఆరోజు అందిన బహుమతులను విలువకట్టలేనివిగా భావించి, యింకా వాటిని భద్రపరచాను. ఈ జీవితం ఎంతటి విచిత్రమైన నాటకం అని ఈ రోజుల్లో నేను తరుచూ భావించడం కద్దు. కొంతకాలం క్రితం ఎన్నో బాధలు ఇప్పుడు మనసును పులకింపజేసే అభినందనలు!

ఆ సంవత్సరం కోళిక్కోడ్ నగరం శతవార్షికోత్సవం జరిగింది. ఆ ఉత్సవాన్ని కోలాహలంగా జరిపారు. దానికి ముందుగా ఆరునెలల పాటు ఏర్పాట్లు

జరిగాయి. ఆ ఏర్పాట్లలో నేనూ పాలుపంచుకున్నాను. ప్రయత్నం సఫలవంతం కావడంతో మాకు ఎంతో సంతృప్తి కలిగింది. ఈ ఏర్పాట్లలో కోళిక్కోడ్, కళాశాల విద్యార్థులు నిర్వహించిన బాధ్యతలను, ఎంత మెచ్చుకున్నా చాలదు. కోళిక్కోడ్ చరిత్రలో జరిగిన ముఖ్యమైన సంఘటనలు కళ్లకు కట్టి నట్లుగా వేషాలు వేసుకుని వివరించిన ఉత్సవ కార్యక్రమం ప్రజలను బాగా ఆకర్షించింది. ఈ సంఘటనలను పర్యవేక్షించి, ఉన్నతంగా ప్రదర్శించిన వాళ్లు కోళిక్కోడ్ విద్యార్థులే. విద్యార్థులు మిగతా వారికి మార్గదర్శకులుగా వెలుగొందారు.

ఈ రోజులలో కాసరగోడ్‌కు సంబంధించిన ఒక ఉద్యమం ఆరంభమైంది. కాసరగోడ్‌లోని కొన్ని ప్రాంతాలు, తమకు సొంతమని మైసూర్ ప్రభుత్వం వాదించింది. అప్పుడు మైసూర్‌కూ మహారాష్ట్రకు మధ్య కొన్ని సరిహద్దు తగాదాలు వచ్చాయి. అందుకు విచారణ జరపడానికి భారత ప్రభుత్వం ఒక ఏకసభ్య కమీషన్ ఏర్పాటుచేసింది. సుప్రీమ్‌కోర్టు ముఖ్యన్యాయమూర్తి మహాజన్ ఆ కమీషన్ సభ్యులు. కాసరగోడ్ విషయం కూడా కమీషన్ విచారణలోకి వచ్చింది యిది సహించరాని అన్యాయమని కొందరు భావించారు. నేనూ అదే విధంగా భావించాను. దీని గురించి చర్చజరపడానికి ఒక అఖిల కేరళ మహాసభను 1966వ సంవత్సరం నవంబర్ నెలలో ఎర్నాకుళంలో ఏర్పాటు చేశాము. పదకొండు సంవత్సరాల క్రితం తీర్మానించబడిన సరిహద్దు విషయాన్ని మళ్లీ లేవదీయడం సరికాదని సభ తెలియజేసింది. కాసరగోడ్ విషయంలో ఒక నిర్ణయానికి వచ్చేవరకు అప్పుడప్పుడూ అవసరమైన కార్యక్రమాలను చేపట్టడానికి, సభ ఒక ప్రత్యేక కమిటీని ఎన్నుకుంది. ఆ కమిటీ అధ్యక్షుణ్ణి నేను. కొంతకాలం వరకు కమిటీ ఉత్సాహంగా పనిచేసింది. ఫలితం కూడా లభించింది. ఆనందాలకు, ఆర్భాటాలకు మధ్య అక్కడక్కడ దేశంలో గందరగోళం ఏర్పడక పోలేదు. ఈ అస్తవ్యస్త ధోరణి అతి త్వరగా పెరిగి వ్యాపించింది. స్వాతంత్ర్యం తర్వాత, అది దేశంలో ఏర్పడిన పరీక్షా ఘట్టంగా తయారయింది.

1947వ సంవత్సరం తర్వాత మన నూతన ప్రజాస్వామ్య ఫలితంగా, దేశంలో వివిధ ప్రాంతాలు అభివృద్ధిచెందిన తర్వాత, భారతదేశం త్వరలో ప్రపంచ దేశాల ప్రథమ శ్రేణిలో ఒక స్థానం పొందగలదని చాలామంది ఆశించారు. స్వతంత్ర భారతదేశం ఆ రోజుల్లో చెందిన అభివృద్ధి ఆ భావాన్ని దృఢతరం చేసింది. పెద్ద పెద్ద ఆనకట్టలు, భారీపరిశ్రమల అభివృద్ధి, పరిశోధనా కేంద్రాలు, నూతన విశ్వవిద్యాలయాలు, దేశంలో చాలా ప్రాంతాలలో ఏర్పడ్డాయి. ప్రపంచ దేశాలను పీడించే సమస్యలను గురించి, భారతీయుల

అభిప్రాయాన్ని తెలుసుకోడానికి అగ్రరాజ్యాలు ప్రయత్నించాయి. అంతర్జాతీయ మహాసభలలో ముఖ్యసమస్యల గురించి, భారతదేశం అభిప్రాయాన్ని తెలుసుకోవడానికి, ఇతర దేశాల నాయకులు, ఉత్సాహపడడం చూశాము. కాంగ్రెస్ త్యాగధీరణి జవహర్‌లాల్‌నెహ్రూ ప్రత్యేక విశిష్టతలు ఇటువంటి అభ్యున్నతికి కారణాలనడంలో ఏమాత్రం సందేహం లేదు. అయితే 1962వ సంవత్సరం తర్వాత ఈ స్థితిలో మార్పువచ్చింది. చైనీయులు ఉన్నట్టుండి దాడి జరపడం, మన లోపాలకు, విచ్ఛిత్తికి కారణమయింది. చైనీయుల దాడి యింకా కొంతకాలం కొనసాగినట్లయితే మన పరిస్థితి ఏమిటి? అన్నదే ఆలోచించడానికి సాధ్యం కాకుండా పోయింది. సక్రమమైన నడత, ఐకమత్యం భావం, కష్టపడి పనిచేయాలన్న శ్రద్ధ, దేశంలో తగ్గాయి. సమ్మెలు, రాకపోకలను యిబ్బంది కల్పించే క్రమశిక్షణా రాహిత్యం, ప్రజా ఆస్తులను సౌభాగ్యాన్ని నాశనం చేసే బాధ్యతారాహిత్యం, హత్య, దోపిడి మొదలైన నేరాలు అనుదిన చర్యలైనాయి. దేశం భవిష్యత్తును గురించి చాలావేదన కలిగించిన మరో సమస్య విద్యార్థుల్లో క్రమశిక్షణాలోపం వాళ్ల అవకతవక చర్యలు రోజూరోజుకూ ఎక్కువైపోయాయి. రాజకీయ పార్టీలు దేశమంతటా అస్తవ్యస్తమైన కార్యకలాపాలను ప్రోత్సాహించే విధంగా నడచుకున్న తీరును మాటల్లో వివరించలేము. పదవీ వ్యామోహమే వాళ్లలో పైశాచిక నృత్యం చేసింది.

భాష పేరిట, సరిహద్దుల పేరిట, దేశంలో పలు ప్రాంతాలలో రగుల్కొన్న హింసాకాండ, మన ఐక్యతను ఛిన్నాభిన్నం చేయగలదని పలువురు భయపడ్డారు. కొన్ని ప్రాంతాలలో యితరభాషా ప్రాంతాలకు చెందినవారు వుండడాన్ని, ఉద్యోగం చేయడాన్ని, బహిరంగంగా వ్యతిరేకించారు. ఈ దుర్మార్గానికి స్థానం కల్పిస్తే, దేశసమైక్యతకు, భద్రతకు అపాయం వాటిల్లవచ్చునని అనిపించింది. ఇటువంటి అస్తవ్యస్త పరిస్థితి ఏర్పడి, దేశాన్ని పట్టి పీడించసాగింది. ఇది పార్లమెంటు, అసెంబ్లీ లను కూడా వదలిపెట్టలేదు. దుర్మార్గాలను, చూడకుండా కళ్లు మూసుకోలేము. వాటిని అరికట్టే మార్గాలను అన్వేషించాలి. అది అవసరమయింది. ఇటువంటి సమస్యల నడుమ ప్రజల మధ్య ఒక నూతన దృక్పథాన్ని, ఉత్సాహాన్ని రేకెత్తించడానికి సహకార సంస్థలు అవసరమని మాలో కొందరం భావించాము.

ఒక దేశం గొప్పతనం కానీ, విశిష్టత కానీ, ఆ దేశ ప్రజల స్వభావాన్ని బట్టే వుంటుంధి. ప్రజలలో మంచి స్వభావాన్ని అభివృద్ధి చేయడానికి శిక్షణ తప్పకుండా అవసరం. అయితే స్వతంత్రం తర్వాత అటువంటి శిక్షణ కావాలన్న భావమే దేశంలో ఏర్పడలేదు. అందువల్ల మేము పౌరుల సంఘం

అన్న ఒక సంస్థను ప్రారంభించాము. వ్యక్తిగత జీవితంలోనూ, ప్రజాజీవితంలోనూ, ఉన్నత ఆదర్శాలను చేపట్టవలసిన అవసరాన్ని సంఘాలకు తెలియజేశాము. వివేకాన్ని పెంపొందించుకోవడానికి, స్వతంత్రంగా ఆలోచించడానికి కలిసి కట్టుగా పనిచేయడానికి స్నేహభావాన్ని పెంపొందించుకోవడానికి, ప్రజాసేవ చేయడానికి సంఘం సభ్యుల మధ్య, నూతనోత్తేజాన్ని కలిగించాలి. జాతి, మత, పదవి భేదాలను పాటించకుండా అందరితో సమానంగా వ్యవహరించడం దేశాన్ని పీడించే సమస్యలను బాగా పరిశోధించి, వాటి పరిష్కారమార్గాలను అన్వేషించడం వీలైనంతవరకూ తీర్మానాలను ఆచరణలో పెట్టడానికి ప్రయత్నించడం, యువకులు ఉన్నత పౌరులుగా భాసించాలన్న ఉత్సాహాన్ని రేకెత్తించి ప్రోత్సాహించడం, శాంతియుత మార్గాలలో ప్రగతి సాధించడానికి ఏమాత్రం విసుగు చెందకుండా కృషిచేయడం, యివన్నీ సంఘం జరుపవలసిన పథకాలలోని అంశాలు.

ఈ సంఘం ఫలితాలను తెలుసుకోవడానికి కొంతకాలం పడుతుంది. అయితే దేశభవిష్యత్తు గురించిన విశ్వాసాన్ని మంచి పద్ధతిలో అభివృద్ధి చేయడానికి అది ఆధారంగా వుంటుందనడంలో మాకు అనుమానంలేదు. ఆ నమ్మకం వల్ల సంఘ కార్యక్రమాలలో ఉత్సాహం, ఆనందం కనిపించసాగింది.

సంస్థలూ, ప్రజాసంఘాలు, వ్యక్తుల్లాంటివే. వాటికి ఒక స్థిరమైన స్వభావం లేదు. కాలానికి అవసరానికి అనుగుణంగా సంఘాలు ప్రారంభమవుతాయి అభివృద్ధి చెందుతాయి. కొన్నాళ్లు గడిచిన తర్వాత కనుమరుగవుతాయి. ఆ స్థలంలో మరికొన్ని సంస్థలు ప్రారంభమవుతాయి. పౌరుల సంఘం ద్వారా, నేను ఊహల్లో దర్శించిన కేరళను, తలచుకుంటూ దానిని నిజ జీవితంలో ప్రత్యక్షంగా చూసే ప్రయత్నాలలో ప్రస్తుతం వున్నాను.

# వృద్ధాప్యం శాపమూ - వరమూ

నా ఎనభైమూడో ఏట నేను ఈ అధ్యాయాన్ని రాస్తున్నాను. మామూలుగా చూసినట్టయితే నేను ఒక ముసలివాణ్ణి. అది సరికాదని చెప్పడానికి లేదు. జీవితంలో ఒక్కొక్క దశలోనూ, ఆ దశకు సంబంధించిన కొన్ని విశేష అంశాలు వుంటాయి. శైశవ దశలో కపటం లేకుండా వుండటం, బాల్యంలో ఆశలు; యౌవనంలో తిరగబడే తత్వంతో పాటు కొంత మొరటుతనం - నడివయసులో డబ్బు సంపాదించే ఉత్సాహం - వృద్ధాప్యంలో ఊగిసలాడే స్థితి. ఇవి అందరికీ ఒక విధంగా ఉంటాయని చెప్పడానికి లేదు. వృద్ధాప్యంలోని చేతగానితనం నన్ను అంతగా బాధించినట్టు నాకు ఇంకా అనిపించడం లేదు. కంటిచూపు బాగా తగ్గిపోవడం నిజమే. అది ఒక్కటి తప్ప మరే ముసలితనపు బాధలకూ నన్ను సమీపించే ధైర్యం లేదనే అనిపిస్తోంది. మనిషి తట్టుకోలేనంతగా వేధించే రెండు బాధల్లో ఒకటి వృద్ధాప్యం; ఇంకొకటి పేదరికం. వీటిలో ఏ ఒక్కటైనా చాలు మనిషి నిరాశ చెందడానికి. రెండు ఒకటిగా చేరినట్లయితే జీవితంలో మరేదీ అవసరం లేదు. అదే నరకమవుతుంది. అటువంటి బాధలతో అలమటించేవారిని చూసి నేను ఎంతో ఆవేదన చెందాను. వాటిని అరికట్టడానికి ముందుగానే ఇన్ని ఏర్పాట్లు చేసి వుంచుకున్నప్పటికీ, ఆ క్లిష్టదశ వచ్చినట్లయితే దానిని తట్టుకోవడానికే కదా మనం మనో బలాన్ని పెంచుకోవాలి? నా సుదీర్ఘజీవితంలో నేను అనుభవించిన బాధలు ఈ విషయంలో నాకు కొంత శిక్షణ నిచ్చాయి.

వయసు అధికమవుతున్న కాలంలో పనిచేసే సామర్థ్యం తగ్గి, ఉత్సాహం లేకపోవడం సాధారణంగా ఏర్పడడం సహజం. ఈ రోజువరకూ ఆ రెండూ నన్ను బాధించలేదు. పని చేయడంలో ఇప్పుడు కూడా మంచి ఉత్సాహం వుంది. అయితే ఒకే రకమైన పనిచేస్తేనే విసుగు ఏర్పడుతుంది. రోజూనేను మూడు, నాలుగు గంటల సేపు రాయడానికి కూర్చుంటాను. ఎక్కువగా సభలకు వెళుతుంటాను. రకరకాల సంస్థలతో ప్రస్తుతం నేను సంబంధం ఏర్పరచుకున్నాను. ఒక్కొక్క సంస్థలోనూ ఒక్కొక్క విధమైన కార్యక్రమాలు వుంటాయి. అందువల్ల నాకు విసుగుఏర్పడడం లేదు. పనుల్లో వైవిధ్యం వుండడంతో పాటు నేను సంబంధ బాంధవ్యాలు ఏర్పరచుకున్న వాళ్లు కూడా

ఆ పనులతో పాటు మారుతూ వుంటారు. విద్యావంతులు, కానివారు, ఉన్నత పదవుల్లో వుండేవారు, తక్కువ స్థాయిలో వుండేవారు. రాజకీయాలతో సంబంధం వున్నవాళ్లు, కళ, సాహిత్యం, సాంఘిక సేవ, మొదలైన వివిధ రంగాలలో కృషిచేసే వారందరితోను నేను సంబంధం ఏర్పరచుకున్నాను. ఎటువంటి వారైనా సరే, వాళ్లతో కలిసి పోవడానికి నాకు ఇబ్బంది అనిపించేది కాదు. నేను వారితో ప్రేమగా వ్యవహరించడం వల్ల, వారు నా పట్ల అభిమానం చూపుతున్నారు.

వృద్ధాప్య స్థితికి వున్న లోపాలలో ఒకటి పని అంటేనే విసుగు పుట్టడం. నా వయసు వున్న మిత్రులొకరు నన్ను ఒకరోజు చూడడానికి వచ్చారు. పాతరోజుల గురించి ఏవేవో మాట్లాడుతూ ఆయన నా ప్రక్కన వాలు కుర్చీలో కూర్చున్నారు. కొంత సేపయ్యాక, రెండు కాళ్లు తీసి వాలు కుర్చీ చేతుల మీద వుంచి, పైప్‌ను చేతిలోకి తీసుకుని బద్ధకంగా నాతో చెప్పారు- 'నా కింక ఏ ఆశవుందో తెలుసా మిస్టర్ మీనన్? ఒక్కపనీ చెయ్యకుండా, ఇదేవిధంగా పైప్‌పట్టుకుని, పడుకున్నట్లు, ఇష్టప్రకారం ఆలోచించుకుంటూ విశ్రాంతిగా వుండడమే. ఈ విధంగా మిత్రులు ఎవరైనా ఏదైనా మాట్లాడుతూ వుంటే చాలు'

ఆ విధంగా బద్ధకంతోనూ, సోమరితనంతోనూ కాలం గడపాలన్న ఆ కోరిక నాకు లేదు. విశ్రాంతి తీసుకోవడమన్నా, మిత్రులతో మాట్లాడడమన్నా నాకు ఇష్టమే. అయితే ఏమి చెయ్యకుండా **వుండాలని** నేను ఆశించడం లేదు. ఒక పనినుంచి మరోపనికి మారడం నాకు విశ్రాంతి లాంటిదే.

శరీరంలో ఆరోగ్యం తగ్గడం కూడా వృద్ధాప్యంలో మరొకలోటు. ఎనభైయేళ్లు అయిన తర్వాత కూడా దృఢంగా వుండే వాళ్లు చాలా తక్కువే. చూపుతక్కువ కావడం ఒకటి తీసేస్తే, నా దేహారోగ్యం తృప్తిగా వుండడమే కాదు, దృఢంగా వుందనికూడా చెప్పవచ్చును. వయసుకు తగ్గట్టేకదా మనకు ఒక్కొక్క కార్యక్రమంలో పాల్గొనడం పట్ల ఇష్టం ఏర్పడుతుంది. జాతీయ కార్యకలాపాలలో శక్తికొద్దీ పనిచేసే ఉత్సాహం, ఎదుటివారితో వాదించిగెలుపొందే ఉత్సాహం. వాళ్లను ఓడించాలనే పట్టుదల నాకు ఈ రోజుల్లో లేకపోవడం నిజమే. అయినా నా చుట్టూ జరిగే కార్యక్రమాలతో ఎలాంటి సంబంధమూ లేకుండా నేను దూరమైపోయానని కాని, అవినాలో ఎలాంటి ప్రతిస్పందనను గానీ ఏర్పరచలేకపోయాయని గాని చెప్పడానికి లేదు. చెప్పాలంటే ఇవాళ నిదానంగా ప్రతివిషయాన్నీ పరిశోధించి సూక్ష్మంగా సత్యాలను గ్రహించడం సాధ్యమవుతోంది. ఏ పక్షం వహించకుండా న్యాయబుద్ధితో ప్రతిదాన్నీ పరిశీలించడానికి వృద్ధాప్యం ఎంతో ఉపయోగకరంగా

వుంది. పదవులకు, పేరు ప్రఖ్యాతులకూ, ఆశపడకుండా ప్రజల సంక్షేమానికి తగిన విధంగా, సమస్యలు పరిశీలించి, మంచి చెడు నిర్ణయించడానికి సాధ్యమవుతోంది. వృద్ధాప్యంలో యువకులను, మధ్యవయస్కులను ఆకర్షించని విధంగా ఏమీ చేయడంలేదు. నిర్మాణాత్మకమైన ఆలోచనలతో, సలహాలతో, యువకులను కార్యశూరులుగా తీర్చిదిద్దడానికి వృద్ధాప్యమే తగిన కాలం. శరీరానికి సంబంధించినంతవరకు, నలత వున్నప్పటికీ జీవితంలో గొప్పసాధనలు కేవల శారీరక బలంతో మాత్రమే సాధించబడడం లేదు అన్న సత్యాన్ని ఈ స్థితిలో గ్రహించడానికి సాధ్యమవుతున్నది.

నిర్మలమైన జ్ఞానం, ఉద్రేకపూరితం కాని మనసు, దృఢమైన ఆలోచన, ప్రతిఫలం ఆశించని స్వభావం, మొదలైన మంచి గుణాలు, ఉన్నత లక్ష్యాలను సాధించుకోవడానికి చాలా సహాయకారిగా వుంటున్నాయి. వృద్ధాప్యదశలో ప్రశాంతంగా ఒకచోట కూర్చుని చదువుకోవచ్చును. రాయవచ్చును. ఇవి సంతోషం కలిగించే పనులు. రాయడానికీ, చదవడానికి నాకు ఇతరుల సహాయం కావలసివచ్చినప్పటికీ, నేను ఆ వ్యాపకాలలోనే ఎక్కువగా గడుపుతున్నాను. ఈ విధంగా నాకు తగిన సహాయం చేసే వారికందరికీ నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. చాలాకాలంగా క్రమబద్ధమైన అలవాట్లు కలిగియుండడం వల్లే ఈ స్థితిలో వుండగలుగుతున్నానని భావిస్తున్నాను. చిన్న చిన్న విషయాల కన్నిటికీ కంగారుపడే స్వభావం నాకు లేదు. ద్వేషం, పగ నా మనసును స్పృశించడాన్ని నేను అనుమతించను. ఈ గుణాలన్నీ, దేహారోగ్యాన్ని ఒకే విధంగా వుంచుకోవడానికి దోహదం చేస్తున్నవే. నాకు తెలియకుండానే మరికొన్ని విషయాలు కారణాలుగా వుండవచ్చును. ఏమైనాసరే, ఆరోగ్యం బాగులేదని విచారించవలసిన సందర్భాలు నాకు బహుశ ఏర్పడలేదనే చెప్పగలను.

వయసు ముదురుతున్న కొద్దీ కొందరు తాము మరణాన్ని సమీపిస్తున్నట్టుగానూ, ఈలోకం నుంచి, తాము సంబంధం వుంచుకున్న వారినుంచి, వీడ్కోలు పుచ్చుకోవలసిన సమయం ఆసన్నమవుతున్నట్టుగాను రకరకాల భావాలు ఏర్పడి మనసును కలచివేయడం సహజం. ఆ విధంగా ఆలోచించి కళ్లనీళ్లు పెట్టుకుని ఏడ్చిన ఒక వ్యక్తిని నేనెరుగుదును. అటువంటి వారు ఎంతోమంది వుండవచ్చు. అయినా అటువంటి చిత్తచాంచల్యాలకు నేను లోనైనది లేదు. నాకు చాలామంది మిత్రులు వున్నారు. మంచి కుటుంబ జీవితం అనుభవించే భాగ్యమూ వుంది. చాలాకాలం నాకీ భాగ్యం ప్రసాదించిన దేవుని మరికొంత కాలం ఈ అవకాశం ఇవ్వమని ప్రార్థించకపోలేదు. అయితే అదే సమయంలో అత్యాశకు చోటివ్వకూడదని కూడా గ్రహించాను.

పూర్తిగా జాతీయ కార్యకలాపాలతో తలమునకలుగా వున్ననేను, కొంతకాలం పాటు వాటి నుంచి తప్పుకున్నాను. ఇందువల్ల జాతీయకార్యకలాపాల పట్ల ఆసక్తి లేదని అర్థం కాదు. ఉద్యోగం విరమణ చేస్తున్న ఘట్టంలో వున్న ఒకాయన చెప్పిన మాటలు నాకీ సందర్భంలో గుర్తుకువస్తున్నాయి.

'ఈ రోజు వరకు ఉద్యోగానికి సంబంధించిన ఫైళ్లను, పుస్తకాలను చదవటానికే సమయంసరిపోయేది. నాకు ఇష్టమైన పుస్తకాలు చదివి ఆనందించడానికి అవకాశం లేకుండా పోయింది. ఉద్యోగవిరమణ చేసిన తర్వాత అందుకు కావలసిన సమయం దొరుకుతుందని ఎదురుచూస్తున్నాను.'

వృద్ధాప్యస్థితి జీవితంలో ఒక భాగంకాదా? జ్ఞానాన్ని వికసింపజేసుకోవడమే జీవితం ప్రధాన లక్ష్యం. అది జీవితాంతం కొనసాగాలికదా? చదవడం వల్లే జ్ఞానం అభివృద్ధి అవుతుందని చెప్పలేము. ఇతరులతో కలిసిమెలిసి ఉండడంవల్ల జ్ఞానాన్ని పెంచుకోవచ్చును. ఆ విధంగా ఉండడానికి నా వృద్ధాప్యం అడ్డుగా లేదు. విద్యార్థులు గానీ, మరికొందరు యువకులు గానీ కొత్త సంగతుల కోసం నా వద్దకు వచ్చేటప్పుడు, వాళ్ల ఉత్సాహంలో పాలు పంచుకుంటున్నాను. వాళ్ల దృక్పథంతో ఆలోచించి విషయాలను ఆకళింపు చేసుకోగలను. అందుకు వయోబేధం అడ్డంకిగా లేదు.

మానసికంగానూ, శారీరకంగానూ, వృద్ధాప్యం బాధించకుండా మన లోపాలను మనం సరిదిద్దుకోడం అసాధ్యమేమీ కాదు. సరైన ఆహారం, తగిన వ్యాయామం, చాలినంత విశ్రాంతి దేహారోగ్యాన్ని క్రమబద్ధం చేసే విధంగానే, మంచి **పుస్తకాలుచదివి** ఆనందించడం, మంచి విషయాలను గురించి ఆలోచించే అభ్యాసం. విజ్ఞానాభివృద్ధికి, ఆధ్యాత్మిక వికాసానికి దోహదం చేస్తాయి. ప్రమిద వెలుగుతూ వుండడానికి నూనె పోస్తూవుండాలి కదా? బలహీనమైన శరీరానికి తగిన విధంగా ఆహారం ఇచ్చేటట్టుగానే, విసుగుచెందేమనకు ఆరోగ్యం పొందడానికి మంచి ఆలోచనలు చాలా అవసరం అవుతాయి.

వివిధ కార్యక్రమాలలో కాలం గడపడంలో ఉత్సాహం కలవాణ్ణి నేను. అయితే ఉత్సాహానికి తగిన విధంగానే ఎప్పుడు అన్నీ జరగడం లేదు. నేను నా చరమదశ ఏవిధంగా ముగించాలని ఆలోచిస్తున్నానో చెప్పమని ఒకసారి నా మిత్రుడు ఒకరు అడిగాడు. ఇతర విషయాలలాగే ఈ చివరి ఆశలోనూ మనుషులు భిన్నాభిరుచిగలవారే!

ఒకప్పుడు నేను లండన్‌లో విద్యార్థిగా వున్నప్పుడు, ఒక మధ్య వయస్కురాలైన వనిత ఆనాటి దిన పత్రికలో చదివిన ఒక మరణవార్తను చూపి నాతో అన్నది 'మిస్టర్ మీనన్! సముద్రంలోనే, నదిలోనే మునిగి చావాలన్నది నా ఆశ. అఖరుగా శ్వాస ఆగినప్పుడు మరణంలో ఒక ఆనందం

కలుగుతుంది కదా? అందువల్ల నేను ఆవిధంగానే మరణించాలని ఆశిస్తున్నాను'.

మరొకరు నాతో ఇలా అన్నారు.

'నిద్రపోతున్నప్పుడు మరణం రావాలి. అదే నేను కోరుకునే చివరి ఆశ' ఇటువంటి మరణాన్ని ఇష్టపడని వారున్నారు.

నా ఆశ ఇదే:

నాకూ, ఇతరులకు ఇబ్బంది కలిగించే విధంగా చాలా కాలం నేను వ్యాధిగ్రస్తుణ్ణిగా మంచం పట్టకూడదన్నది నా ప్రార్థన. ఉన్నట్టుండి కళ్లు మూయడం కూడా నాకు ఇష్టం లేదు. ఆ ముగింపు అతనికి సంబంధించినంతవరకు మంచిదే అయినప్పటికీ, బంధువులకూ, మిత్రులకు అది ఇబ్బందికరంగానే వుంటుంది. అనుకోని సంఘటన హఠాత్తుగా జరిగినప్పుడు చాలా ఇబ్బందులు, గందరగోళం వాటిల్లవచ్చు. నా పట్ల ప్రేమగల వాళ్లకందరికీ అటువంటి ఇబ్బంది కలగడాన్ని నేను ఆశించడం లేదు. నేను మరణాన్ని ఎదురు చూస్తున్నానన్న విషయం నేనూ, ఇతరులూ గ్రహించే విధంగా రెండు మూడు రోజులు మంచం పట్టాక, మరణం చెందాలన్నదే నా ప్రార్థన. నాకూ మనశ్శాంతితో మరణాన్ని ఆహ్వానించడానికి అవకాశం వుంటుంది. ఎవరికి తెలుసు? నా ఆశ ఎలా నెరవేరుతుందో? నా మరణం తర్వాత దాన్ని ఇతరులు తెలుసుకుంటారు.

# సాయం సమయ ఆలోచనలు

ఈ పుస్తకం తొలి ముద్రణ విడుదల అయినవెంటనే, దానిని చదివిన నా సన్నిహిత మిత్రులొకరు, నాతో అన్నమాటలు, ఈ అధ్యాయాన్ని వ్రాయడం ప్రారంభించినప్పుడు జ్ఞాపకం వస్తున్నాయి. నా చిరకాల జీవితానుభవాలను పరిశీలించి వాటిలో స్పష్టమైన అభిప్రాయాలను, యువతరానికి అనుభవపాఠంగా చెప్పడం మంచిదని ఆయన భావించారు. ఆయన మాట ప్రకారం వారికి నీతులు చెప్పడానికి పూనుకోవడం లేదు. అయినావారికి ముందు హెచ్చరికగా, జీవితంలో ఉపయోగపడే విధంగా నాకు తోచిన అభిప్రాయాలను చెప్పడానికి ఉపక్రమిస్తాను.

నాతో జీవితం ప్రారంభించిన వాళ్లలో కొందరు మాత్రమే ఇవాళ ఉన్నారు. వారిలోను, చాలా మంది ఆరోగ్యం చెడి, జీవితాన్ని అనుభవించకుండానే రోజుల్ని నెట్టుకొస్తున్నారు. అలాంటి పాతమిత్రుని నేను చూడడానికి వెళ్లినప్పుడు, ఆయన వున్న స్థితి చూసి, ఆశ్చర్యపడి, బాధపడ్డాను. ఒక కాలంలో ఫుట్‌బాల్ క్రీడాకారుడు గానూ, హైజంప్‌లో ఛాంపియన్‌గానూ, గజఈతగాడుగానూ గెలుపొందిన ఆయన ఇద్దరి సాయంతో నాలుగు అడుగులు వేయడానికి ఎంతగానో కష్టపడ్డాడు. కాలం ఆయన్ని ఎలాంటి దైన్య స్థితికి పడద్రోసింది! కొంతసేపు కూర్చుని చిన్ననాటి సంఘటనలను జ్ఞాపకం చేసుకుంటూ మాట్లాడుకున్నాము. నాటకాలలో వేషాలు వేసిందీ, కళాశాల వార్షికోత్సవాలలో వాలంటీరుగా పనిచేసిందీ, చెరువుల్లో ఈత కొట్టడం మొదలైన ఎన్నో సంఘటనలు....

జీవిత సంధ్యా సమయంలో, గడిచిన ఆ పాత కాలాన్ని మళ్లీ జ్ఞాపకాల తెరమీద నిలబెట్టి ప్రాణం పోసి, అందులో మునిగితేలాము. ఆ జ్ఞాపకాలలో ఆవేదన, దైన్యం పెల్లుబుకుతోందా? అని నన్ను ఎవరైనా అడిగితే లేక పోలేదనే చెప్పాలి. అయినా వాటిలో ఆనందోత్సాహాలు రేకెత్తించే జ్ఞాపకాలూ వున్నాయి. సుఖదుఃఖాల సమ్మేళనమే జీవితం...తప్పు చేయకుండానే, నిందమోయకుండానే జీవితం గడపడం చాలాకష్టం అనునదే నా అనుభవం.

అయితే యవ్వనప్రాయంలో నేను చదివిన కొన్ని పుస్తకాలు, నేను పరిచయం చేసుకున్న కొందరు పెద్దమనుషులు నాకు జీవితంలో

మార్గదర్శకులయ్యారు. ఎంతో కాలమైనప్పటికి, వాళ్ల మాటలూ, చేతలూ, నా మనసులో ఇంకా తాజాగా వున్నాయి. నేను చదివిన పుస్తకాలలో అర్థపుష్టి, శైలి ఆకర్షించినట్లయితే వాటిని నేను ఉత్సాహంతో కంఠతాపట్టేవాడిని. అది నాకు పసిప్రాయంనుంచే అలవాటయింది. అదే విధంగా ఒకరి వద్ద కనిపించే ఓర్పు, నాగరికత, మరొకరి వద్ద కనిపించే మాటకారితనం, వేరొకరి వద్ద వుండే కష్టించి పని చేసేగుణం మొదలైన మంచి గుణాలను నా జీవితంలో అనుసరించడానికి ఉత్సాహంతో కృషిచేశాను. ఇతరులను అనుసరించడంలో విజయం సాధించానని చెప్పడానికి వీలులేదు. కాని జీవితపయనంలో వారి మార్గదర్శకత్వం నాకు కొంతైనా మేలు చేసింది. జీవితచరిత్రలు చదవడంలో నాకుండే దాహం యింతా అంతాకాదు. కష్టాలతో పోరాడుతూ, జీవితాన్ని అర్థవంతంగా, ఇతరులకు ఉపయోగపడే విధంగా చెక్కుచెదరని ఉత్సాహంతో ప్రయత్నించిన మహాపురుషుల జీవిత చరిత్రలు ఎవరికి మాత్రం ఉత్సాహాన్ని రేకెత్తించవు?

గడచిన కాలాన్ని కాస్త తిరిగి చూస్తే నేను వివిధ దశలలో పనిచేసిన రోజులు జ్ఞాపకానికి వస్తున్నాయి. రకరకాల మనుషులతో కలిసి తిరిగిన సందర్భాలు, నా మాటలు, చేతలు వారి హృదయాలలో ఎలాంటి స్పందనను కలిగించి వుంటాయన్నదీ నాకు తెలియదు. పలువురి ప్రేమపూరితమైన మాటలను చెవులారా విని సంతోషించే సందర్భాలు ఎన్నో నాకు ఎదురయ్యాయి. అయినా నాకు శత్రువులే లేరనే, నన్నుగాని, నా చేతలనుగానీ కఠినంగాను, నిశితంగాను విమర్శించి నన్ను నిరసించే వాళ్లు లేరనే అనుకుని మోసపోయేవాణ్ణి కాను. విమర్శలను ఎదుర్కొనేటప్పు డు నేను కలవరపడడం చాలా అరుదు. ఇతరుల అభిప్రాయాలను గౌరవించి, వాటిని సూక్ష్మంగా పరిశీలించడం మంచిది. అది అహంకారాన్ని తగ్గించి మనలోని లోపాలను సరిదిద్దుకోవడానికి దోహదం చేస్తుంది.

జీవనభృతి కోసమో మరే కారణంచేతనో, మనం ఒక్కొక్కరం ఒక్కొక్క వృత్తిని స్వీకరిస్తాము. ఒక వృత్తిని సక్రమంగా చేయడం వల్ల మాత్రమే పరిపూర్ణత సాధించలేము. మరో ప్రధాన కర్తవ్యం కూడా మనకుంది. సందర్భం లభించినప్పు డల్లా పొరుగువారికి సాయపడటం, నాలుగు మంచి మాటలు చెప్పడానికి మనం చాలాదూరం పోవలసిన అవసరం లేదు. మన చుట్టూ వున్నవారిని ప్రేమతో చూస్తేనే చాలు. ఆకలి తీర్చుకోవడానికి అన్నం లేక మాన రక్షణకు బట్టలు లేక, తల దాచుకోవడానికి నీడలేక అవస్థలు పడే పేదసాదలు **ఎందరో ఉన్నారు**; రోగగ్రస్తులై చికిత్సకు దారి లేక బాధపడుతున్న వారి సంఖ్య తక్కువేమికాదు. చదువుకోవాలన్న ఆశ, తెలివితేటలు, ఉత్సాహం

వుండీ పేదరికంతో బాధపడే పసిపిల్లలు, వారిని చూసి కన్నీళ్లు కార్చే కన్నవాళ్లు మనదేశంలో కోకొల్లలుగా వున్నారు. వీరి దుఃఖ భారాన్ని తగ్గించే విధంగా తప్పకుండా మన చేతనైన సాయం మనం చెయ్యవచ్చు. అందరిచేతా పెద్ద ఎత్తున సంఘసేవ చేయడానికి సాధ్యమవుతుందని కాదు. అయితే సందర్భానికి తగ్గట్టుగా ఇలాంటి చిన్న చిన్న సేవలు చేయడానికి అందరి వల్లా వీలవుతుంది. ప్రేమ పూరితమైన మనసు, ఉత్సాహం రేకెత్తించే మంచి మాటలూ, ఎలాంటి వారికైనా సేదతీరుస్తాయి! మనకూ అవి, ఆత్మ సంతృప్తినీ, శాంతిని ప్రసాదిస్తాయి!

ఒక వ్యక్తిని గురించి గాని ఒక విషయాన్ని గురించిగాని అభిప్రాయం చెప్పడానికి తొందరపడటం మంచిదికాదు. ఒక వ్యక్తి నైజాన్ని బాగా తెలుసుకోవడానికి మనకు అవకాశం దొరుకుతుందని చెప్పలేము. వారికి గిట్టని వాళ్లు వాళ్ల గురించి మన దగ్గర ఏవేవే చెప్పవచ్చు. వాళ్లు కూడా అసలుసంగతి తెలుసుకోకుండా, వేరెవరో చెప్పగా విని, దాన్ని బట్టి మనతో ఆ మాటలే చెప్పి వుండవచ్చు. అయినా పూర్తిగా వివరాలు తెలుసుకోకుండా వారిని గురించి ఒక నిశ్చితమైన అభిప్రాయానికి రావడం సరికాదు. ఏ విషయమైనా సరే మంచీ, చెడుల గురించి నిర్ణయం చేసేప్పుడు, సమగ్రంగా పరిశీలించి నిజాన్ని గ్రహించాలి. అలా పరిశీలించే స్వభావం చాలామందికి ఉండడం లేదు. సూక్ష్మంగా పరిశీలించకుండా అభిప్రాయాలు వెలిబుచ్చడం ఎప్పుడు సరికాదు! మనసు విప్పి అభిప్రాయాలు చెప్పడం మనసుకు తృప్తినిస్తాయి. అయినా అందుకు సాధ్యంకాని సందర్భాలనూ నేను జ్ఞాపకం తెచ్చుకుంటున్నాను. ఇతరుల మనసుకు ఇబ్బంది కలుగజేయకూడదన్న అభిప్రాయంతో నేను అలా అభిప్రాయాలను వెలిబుచ్చకుండా ఊరుకోలేదు. నా అభిప్రాయాలను స్పష్టం చేయడంవల్ల ఎదురుచూడని పర్యవసానాలు ఏర్పడతాయేమోనని జంకి, కొన్ని సందర్భాలలో నేను మౌనం వహించాను. అయినా అలా ఊరుకోవడంవల్ల మనసు చెప్పరాని విధంగా ఆక్రోశించేది!

ఒక సన్యాసి అద్భుతకృత్యాలను గురించి చెప్పి ఆయనను పొగుడుతూ పరిపరివిధాలుగా చెప్పారు. ఆ సన్యాసి అభిమాని. అదంగా విన్న మరొకాయన 'అవన్నీ ఒట్టి ఊహాలు....గాలి కబుర్లు' అని తిట్టిపోశారు. మామూలు మనిషి తెలివితేటలకి అందని కొన్ని అద్భుతశక్తులు, కొందరి దగ్గర వుండడం జరగరాని పనికాదు. మనకు వాటి గురించి ఏమీ తెలియదన్న కారణంతో అలాంటి శక్తులేవీ లేవని తిరస్కరించడం ఒక విధమైన అహంభావమే. మన తెలివితేటలకు, మేధాశక్తికి ఒక హద్దు అంటూవుందని, దానికి అతీతమైన కొన్ని సంగతులు ప్రపంచంలో వున్నాయనీ మనం తెలుసుకోవాలి.

మరో విషయం. ఒకే కుటుంబంలో రకరకాల అభిరుచులు, అభిలాషలు గల వాళ్ళు, రకరకాల వయసుకు చెందిన వాళ్ళు, రకరకాల స్వభావాలు గలవాళ్ళూ వుంటారు. మునుపటికన్నా ఇవాళ్టి జీవన విధానంలో ఎన్నో తేడలు, మార్పులు కనిపిస్తున్నాయి. కుటుంబ జీవితంలో సుఖసంతోషాలు, సమైక్యత వుండాలంటే కుటుంబంలోని వాళ్ళు. ముఖ్యంగా పాత తరం వాళ్ళు - ఉదారంగా ఉండడానికి. ఇతరుల ధోరణిని అర్థం చేసుకుని మసలుకోవడం తెలుసుకోవాలి. వాళ్ళు జీవితంలో కష్టసుఖాలను జీర్ణం చేసుకుని జీవితంలో చాలా భాగం అనుభవించిన వాళ్ళు యువకులు, మధ్యవయస్కులు జీవితాన్ని ఇకమీదటే చవిచూడనున్న వాళ్ళు. వాళ్లకు తప్పకుండా కావాలనిపించే ఖర్చులు వయసుమళ్లిన వారికి అనవసర మనిపించవచ్చు. అలా అనిపించినప్పటికీ యువకుల కోరికలకు అడ్డు రాకూడదు. తనకు వాళ్ల ధోరణితో పొసగదు అన్నంత మాత్రాన, 'యువకుల శ్రేయస్సుకు అది తగినది కాదు' అని అనిపించనంత వరకు, వాళ్ల అభిప్రాయాలను గౌరవించి ఉదారంగా వుండడమే శ్రేయస్కరం.

మనం అంగీకరించలేని, అభిమానించలేని అభిప్రాయాలను ఇతరులు చెబుతున్నప్పుడు, దానిని వ్యతిరేకించి వాదించడానికి పూనుకోవడం సరైనదికాదు. మౌనంగా, మందహాసంతో ఆ అభిప్రాయభేదాన్ని మెల్లిగా ప్రకటించవచ్చు. అది కూడా చెయ్యకుండా వుండడం మరీ మంచిదే. మన అభిప్రాయాలు చెప్పడానికి తగిన సందర్భాలు వస్తాయి. ఆ సమయంలో వాటిని అందంగా చెప్పవచ్చు!

మన నమ్మకాలు సిద్ధాంతాల గురించి కొంత చెబుదామనుకుంటున్నాను. కొందరు తమ మత విశ్వాసాల గురించి స్థల సమయ సందర్భాలు పాటించకుండా చెబుతూ వినేవాళ్లను ఇబ్బందులపాలు చేస్తూంటారు. అవాంఛనీయమైన ఈ అలవాటుని విడిచిపెట్టడం మంచిది. ఇతరుల విశ్వాసాలలో లోపాలు చూపటం, దూషించడం మంచిది కాదు. ఏ అభిప్రాయాన్నయినా సరే, వ్యతిరేకించి వాదించడం కానీ, తిరస్కరించి వితండవాదం చెయ్యడం కానీ కష్టమైన పనేమి కాదు. అయితే అది అవివేకమే అవుతుంది. మన విశ్వాసాల కనుగుణంగా మనం జీవిస్తున్నాము. అదే విధంగా ఇతరులూ వాళ్ల నమ్మకాలకు తగ్గట్టుగా జీవిస్తున్నారు. నాగరికమైన సంస్కృతి వున్నవారు అలాగే భావిస్తారు. మన అభిప్రాయాలకు మద్దతు యిచ్చేవారు. లేరన్న దిగులు చెందవలసిన అవసరం లేదు. మత సంబంధమైన విశ్వాసాల గొప్పదనాన్ని, వాటిని అంగీకరించేవారి సంఖ్యనుబట్టి నిర్ణయించడం లేదు. ఆ అభిప్రాయాలను మనసారా నమ్మి, మనస్ఫూర్తిగా వాటికి కట్టుబడి జీవించే వాళ్లే

ఆ గొప్పదనాన్ని నిలబెడతారు. బాహ్య ప్రపంచానికి కనిపించే కొన్ని అలవాట్లు, మనసు నిలకడలేని ప్రార్థనలు, తరచుగా గుడులకు, తీర్థాలకు వెళ్లి రావడం మాత్రమే కొందరి మత సంబంధమైన నమ్మకాలు నడవడికలు, నిజమైన మత విశ్వాసం వున్నవారు. ఆ విశ్వాసాన్ని తమ కార్యకలాపాలన్నిటిలోనూ ద్యోతకమయ్యేట్లు చేస్తారు. వ్యక్తిగత జీవితంలోను, కుటుంబ విషయాలలోనూ, వ్యాపార సంబంధమైన విషయాల లోనూ, ప్రజాజీవితంలోనూ, ఆ నమ్మకాలకు తగ్గట్లుగా నడచుకుంటారు.

పగ సాధించాలన్న భావన మన మనస్సులో ఎప్పుడూ ఉదయించకూడదు. ఉదాత్త జీవితం కొనసాగించాలని ఆశించే వారికి తగిన మనోదృక్పథం కాదది. తెలిసో తెలియకో ఎవరో మనకు కీడు చేసినప్పటికీ, దానిని మనసులో వుంచుకుని, దానికి ప్రతిగా అతనికి చెడు చెయ్యడానికి సందర్భం కోసం కాచుకుని వుండడ నీచులు చేసే పని. అలాంటి గుణమే చాలా మందిలో ఎక్కువగా వుంటోంది.

ఒక కార్యాలయంలో కొన్ని అంశాలను చర్చించడానికి ఒక ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేశారు. అందుకు అక్కడికి ఒక అధికారి వచ్చి మొదటి వరుసలో కూర్చున్నాడు. నిజానికి ఆయనకు ఆహ్వానం లేదు. ఆహ్వానితులు మాత్రమే పాల్గొనే సమావేశం అది - అని కార్యదర్శి వివరించాడు. అయినా దానిని అతను లెక్క చెయ్యలేదు. కార్యదర్శి ఈ విషయాన్ని అధ్యక్షునికి తెలియజేశాడు. ఆయన ఆజ్ఞాపించిన తర్వాత ఆ అధికారి లేచి వెళ్లవలసి వచ్చింది. కార్యదర్శి మీద ఆయనకు ఏర్పడిన కోపం కొన్నాళ్లయినా తగ్గలేదు. మూడేళ్లు గడిచాక, ఆ కార్యదర్శి ఉద్యోగకాల పరిమితి పూర్తి కావడంతో, అతనిని ఆ పదవిలో, కొనసాగించనివ్వడానికి చర్చ జరిగింది. ఆ అధికారి తనకున్న పలుకుబడినంతా వినియోగించి- ఆ కార్యదర్శిని పదవిలో కొనసాగనీయకుండా అడ్డు తగిలాడు. మర్యాదస్తుడు సంస్కారం వున్న పెద్దమనిషి చెయ్యవలసిన పనా ఇది? ఇంకో ముఖ్యమైన విషయం చెబుతాను.

నా వల్ల ఈ కార్యాన్ని పూర్తి చేయడం సాధ్యమా? నేను స్థాపించిన ఈ సంస్థను ఇంకా అభివృద్ధి చెయ్యడానికి వీలవుతుందా? అన్నవిచారం చాలామందిని ముఖ్యంగా వయోధికుల్ని వేధిస్తూవుంటుంది. ఈ భయం అర్థం లేనిది. సూక్ష్మంగా పరిశీలిస్తే దేనికైనా 'పరిపూర్ణత' సిద్ధించినట్లు మనం ఎలా భావించగలం? ఒక పనిని ఎంత సక్రమంగా చేసినప్పటికీ, ప్రయత్నిస్తే మరింత చక్కగా చెయ్యడం సాధ్యమే. ఇవాళ మనం చూస్తున్న రైలు బండి విమానం - ఒక వ్యక్తి ప్రయత్నం మాత్రమే కాదు. పలువురి నిర్విరామకృషికి లభించిన ఫలితాలే అవి! సంస్థలు కూడా అలాంటివే. భారత జాతీయ

కాంగ్రెస్, రెడ్‌క్రాస్ ఉద్యమం, రోటరీ క్లబ్.... ఇలాంటి వివిధ సంస్థలు - ఒక్కొక్క ఘట్టంలో వేర్వేరు వ్యక్తుల కృషివల్ల అభివృద్ధి చెందుతున్నవే. ఇలాంటి దిగులు నన్ను కూడా కష్టపెడుతూవుండేది. రాయడానికి ప్రారంభించిన కొన్ని పుస్తకాలు పూర్తిచేయగలనా! అన్న దిగులు! ప్రారంభించిన కొన్ని సంస్థలు సక్రమంగా కొనసాగేటట్లు చూడగలనా? అనే సందేహం; తప్పక చేద్దామని ఆశించే కొన్ని పనులు పూర్తి చేయగలనా? అన్న విచారం; ఇవన్నీ అర్థం లేని బలహీనతలు అని తెలిసినప్పటికీ వాటిని అధిగమించడానికి వీలుకావడం లేదు.

కొన్ని రోజులుగా నా మనసులో కదలాడే కలల గురించి ఇప్పుడు చెప్పాలని వుంది.

పరీక్షలు దగ్గర పడుతున్నాయి. ఇంకా నేను అన్నీ చదివి సిద్ధంకాలేదు. ప్రయాణానికి నిర్ణయించిన రోజు దగ్గరవుతోంది. ఐనా నేనింకా సిద్ధం కాలేదు. ఇలాంటి భావన వచ్చే విధంగా నేను కలలు కంటున్నాను. దీనికి కారణం తెలుసుకోవాలని ఒక మనస్తత్వ శాస్త్రవేత్తకు వ్రాసి తెలుసుకోవాలనుకున్నాను. అప్పుడు నా మిత్రులొకరు, 'నా పనులు పూర్తి కాలేదే అని అంతరాంతరాలలో అణగారివున్న ఆలోచనలే ఇలాంటి కలలకు కారణం' అన్నారు. ఇది ఒక వేళ నిజమే కావచ్చు. ఏది ఎలా వున్నప్పటికీ - ప్రారంభించిన పనిని పూర్తి చేయలేదే అని ఆలోచించి ఆవేదన చెందవలసిన అవసరం లేదని నన్ను నేను సమాధాన పరచుకున్నాను. ప్రారంభించిన కార్యక్రమాలను నెరవేర్చడానికి సాధ్యమైనంతవరకు కృషి చేయడం - అంతకుమించి మనం ఏమీ ఆలోచించవలసిన అవసరం లేదు. జీవితం ఒక ప్రయత్నం మాత్రమే- ఫలితాన్ని అనుభవించినా, అనుభవించికపోయినా సరే!

రైల్వే ప్లాట్‌ఫారం శుభ్రం చేసే ఒక కార్మికుడి గురించి ఈ సందర్భంలో ఆలోచిద్దాం. చెత్తాచెదారం, పళ్లతొక్కలు, సిగరెట్ పీకలు వున్న ఆ స్థలాన్ని శుభ్రం చెయ్యడానికి అతను ప్రయత్నిస్తాడు. వాటినంతా వూడ్చి, చెత్తకుండీలో పోసి, ఒకచోట బీడీ కాలుస్తూ నిలబడతాడు. కొద్ది సేపయ్యాక మళ్లీ అక్కడ చిరిగిన కాగితాలు, ఎంగిలాకులు, బత్తాయి తొక్కలు, తమలపాకులతో ఆ స్థలం నిండిపోతుంది. అతడు వెంటనే మళ్లీ చీపురు, చేట పట్టుకుని కొంచెం కూడా బద్ధకం లేకుండా తన పనిని ప్రారంభిస్తాడు. అతను ఒక సాధారణ కార్మికుడు మాత్రమే. అయినా అతని దగ్గర్నుంచి మనం ఒక మంచిపాఠం నేర్చుకోవడానికి వీలవుతోంది. 'గుమిగూడిన జనం ఏవిధంగా స్థలాన్ని అపరిశుభ్రం చేసినా - మన పని దానిని శుభ్రం చేయడమే ....'

కొందరు ఇతరులను వేధించినప్పటికీ, అటువంటి బాధితులకి సహాయం చెయ్యడమే మన కర్తవ్యం అని భావించాలి. ఎవరైనా దిక్కులేని వారిని క్రింద పడద్రోసినట్లయితే వారిని లేవతీసి ఓదార్పు చెప్పడమే మన ధర్మం. జీవితంలో మనం అనుసరించవలసిన మార్గం అదే. మనకు మానసికంగా కూడా తృప్తినిచ్చేమార్గం కూడా అదే!

# సింహావలోకనం

వయోవృద్ధదశలో మన మనసుల్లో రకరకాల ఆలోచనలు రావడం సహజమే. కుటుంబానికి సంబంధించీ, యితర విషయాల గురించి, మరణం తర్వాతి స్థితి గురించీ మొదలైన ఆలోచనలు. అయితే నన్ను యిప్పుడు వేధిస్తున్నవి అటువంటి ఆలోచనలు కావు. నా దేశ భవిష్యత్తు గురించిన విచారమే రోజురోజుకూ ఎక్కువవుతోంది. అలముకుంటూన్న అల్పప్రవృత్తులు, క్రమరహితమైన కార్యకలాపాలు, దయారహితమైన హింసాకృత్యాలు, మనదేశ సంపదకే ఆపద తెచ్చేవిగా పరిణమిస్తూవున్నాయి. *నెహ్రూ మరణానికి తర్వాత పరిస్థితి మరీ దిగజారిపోయింది. ప్రజలలో అధికమవుతున్న నిరాశను విశ్వాసరాహిత్యాన్ని రూపుమాపడానికి దృఢమైన నాయకుడు ప్రస్తుతం మన మధ్యలేడు. గత వంద సంవత్సరాల కాలంలో యిటువంటి దయనీయమైన స్థితివున్నట్లు తెలియడం లేదు.

ఇది చీకటి కమ్ముకున్న కాలం. వెలుగు రేఖలు ద్యోతకమయ్యే మార్గమూ కనిపించడం లేదు. మహాపురుషులు, జ్ఞానులు జన్మించిన ఈ పుణ్యభారతభూమికి వున్నట్టుండి జ్ఞానుల కరువు వచ్చిందా? అన్న అనుమానం కొన్ని సమయాల్లో కలుగుతుంది.

ఎంతకాలం జీవించానన్నది ముఖ్యం కాదు. ఏవిధంగా జీవించానన్నదే ముఖ్యం, ద్రవ్యం కోసం పడే తీరని ఆశగాని, అధికార పదవులకోసం మోహంగాని నన్నెప్పుడూ ఆవహించింది లేదు.

డబ్బు దాచే అలవాటు నాకు లేదు. దాన్ని భద్రపరచి పూజించేవాణ్ణికాను. అవసరాలను తీర్చుకోవడానికీ, ప్రేమను తెలియపరచుకోడానికో, లేనివారికి సహాయం చేయడానికీ డబ్బు అవసరమే. అయినా దాన్ని దాచడంలో నాకే సుఖమూ కనిపించలేదు. చేర్చిపెట్టలేదన్న విచారమూ నాకు లేదు.

పండిన దైవ భక్తిగల వాళ్ళు, తీవ్రమైన నాస్తికవారులూ నా మిత్ర బృందంలో వున్నారు. ఇరుపక్షాల వారితోనూ మైత్రి నెరపడంలో నాకే యిబ్బందీ లేదు. నాకంటూ కొన్ని సిద్ధాంతాలు, నమ్మకాలూ వున్నాయి. ఇతర విషయాలలో లాగే,

---

* మూలమలయాళ గ్రంథం 1969 లో వెలువడింది. అప్పుడు రాసిన మాటలు ఇవి.

మతసంబంధమైన నా విశ్వాసాలలోనూ మార్పులేవీ రాలేదు. ప్రస్తుతం ఆ నమ్మకాలే నాకు శాంతిని, ఓదార్పును సమకూరుస్తున్నాయి.

నాకు సంతోషం కలిగించే మూడు విషయాలను యిక్కడ ప్రస్తావిస్తాను.

మనశ్శాంతిలేనివారు, సహించలేని అన్యాయాల గురించి చెప్పుకునేవారూ, బాధలనుంచి బయటపడే మార్గం తెలియకుండా ఆశ్రయించేవాళ్లు, యిలా రకరకాల మనుషులు నా దగ్గరికి వస్తారు. ప్రత్యక్షంగానూ, ఉత్తరాల ద్వారానూ, నా సహాయాన్ని అపేక్షించే వారిని ఉపశమనం కలుగజేస్తున్నప్పుడు వారిలో కలిగే తృప్తి, నాలో వివరించలేని ఆనందాన్ని కలిగిస్తోంది.

ఇష్టమైన పుస్తకాలను చదువుతున్నప్పుడే, పాటలను వినేప్పుడు, నాకు అంతులేని ఆనందం కలుగుతోంది. ఇది మరొక అనుభవం. ఈ ఆనందాలను నేను అనుభవించని రోజులేదనే చెప్పాలి. ఆప్తమిత్రులతో మాట్లాడి సంతోషించడం మరొక ఆనందమైన అనుభవం, మిత్రులు పలువురు వున్నప్పటికీ, మనసుకు సన్నిహితంగా నాతో మైత్రిచేసేవాళ్లు చాలా కొద్దిమందే. అటువంటి మిత్రుల ప్రేమను పొందడం వారితో మాట్లాడి ఆనందించడం అంటే నాకు చాలా యిష్టం. ప్రేమ పూర్వకమైన స్నేహాన్ని అనుభవించని మనిషి జీవితంలో ఆనందం వుంటుందా?

నేను ఈ పుస్తకం చివరి భాగానికి వచ్చేశాను. నా జీవితం చివరి భాగానికి కూడా ఎనభై మూడు సంవత్సరాలు నిజంగానే దీర్ఘాయుష్షే. సంపూర్ణ ఆరోగ్యం, జీవితానందం, అనుభవించే ఉత్సాహం, యింకా నా మనసులో వుందంటే, అందుకు కరుణామూర్తి అయిన దేవుని దయ అని భావించి కృతజ్ఞతాభావంతో వున్నాను. చేదైన అనుభవాలు, ఎన్నో సంభవించి వున్నప్పటికీ, జీవితంలో నిరుత్సాహం గాని, ప్రజల పట్ల ద్వేషంగానీ నాకు ఏర్పడింది లేదు. ప్రపంచాన్ని, స్నేహితులమయమైన ఒక గృహంగానే ఎప్పుడూ భావిస్తున్నాను. ఎక్కడినుంచి వచ్చాము? ఎక్కడికి వెళుతున్నాము? దీనికంతా లక్ష్యం ఏమిటి? ఈ జీవితం.... దీనికి సంబంధించిన అనంతమైన సమస్యలు దీనికంతటికీ అర్థమేమిటి?

ఈ సుదీర్ఘకాలంలో ఎన్ని మార్పులు! సామాజిక ధర్మాలు, అలవాట్లు, ఆచారాలు మారిపోయాయి. ప్రజల భావాలు మార్పుచెందాయి. నేను జీవించిన వాతావరణం మారిపోయింది. నా శారీరక స్థితి మారిపోయింది. అయినప్పటికీ నేను అలాగే జీవిస్తున్నాను.

'నేను' ఎవరు? జవాబు దొరకని ఈ ప్రశ్న అప్పటిలాగే యిప్పుడు కూడా నాలో విరామం లేకుండా ఆలోచనకు దారితీస్తోంది. అంతిమ కాలానికి చాలా అవసరమైన సంపూర్ణ శాంతిని నేను యిప్పుడు అన్వేషిస్తున్నాను. అయితే

జీవితం లోని లెక్కలేనన్ని రహస్యాలు, గుణ భేదాలు, నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నాయి. తెలుసుకోజాలని వాటిని తెలుసుకోవడానికి ప్రయత్నంచేసినప్పుడు, ఏర్పడే అలసట నాకు వస్తుంది కదా? ఆకాశాన్ని చూసేప్పుడు, చూపుకు అందినంత వరకూ నక్షత్రాలను చూస్తాము. వాటికి అవతల యింకా ఎన్నో నక్షత్రాలు వుండవచ్చు. మనం చూడలేము అన్నంత మాత్రాన అవి లేవని చెప్పగలమా? సువిశాల సముద్రంలో నావను నడిపే నావికుని విధంగానే మనమూ జీవిత పయనాన్ని కొనసాగిస్తున్నాము. బండలను, యిసుకతిన్నెలను జాగ్రత్తగా పరిశీలిస్తూనే నావికుడు నావను గడపాలి. లేకుంటే అపాయం వాటిల్లుతుంది. జీవిత పయనం కూడా అదే. స్పష్టమైన బుద్ధితో అవసరమైన వాటిని, లేనివాటిని పరిశీలించి బలహీనతకు చోటివ్వకుండా, జీవితాన్ని నడిపించలేదంటే, అపాయాన్ని ఆహ్వానించినట్లే అవుతుంది. ఆ విధంగా జాగ్రత్త పడేప్పుడే కొన్ని సందర్భాలలో తప్పులు దొర్లిపోతాయే? అదే లేనప్పుడు, వచ్చే ఫలితాన్ని వేరుగా చెప్పవలసిందేముంది?

నేను చేసిన తప్పులను ఉపయోగించుకోని అవకాశాలను, బాగా దిద్దుకోని లోపాలను, యిప్పుడు జ్ఞాపకం చేసుకుని పశ్చాత్తాపం చెందుతున్నాను. ఒకవేళ తప్పులే, మన మంచి అభ్యున్నతికి ప్రోత్సాహకరంగానూ, ఆధారంగా వుండవచ్చు! ఎవరికి తెలుసు? మన ఉపాధ్యాయులే అనుభవాలు కదా?

దీన్ని నేను రాస్తున్నప్పుడు, ఉదయం సమయంలో లెక్కలేనన్ని నక్షత్రాలు గగనంలో మెరుస్తున్నాయి. దూరంనుంచి సముద్ర తరంగాల ఘోషవినిపిస్తోంది. ఒకటి ధ్వని తరంగాల వరుసలో...కాకి, కోడిపుంజు, యింకా కొన్ని పక్షులు, అరుణోదయానికి స్వాగతం పలుకుతున్నాయి. ప్రజల కంఠస్వరాలు, బళ్ల రాకపోకలు. మరొక రోజు ఉద్యమం ప్రారంభమయిందని చాటుతున్నాయి. రాత్రి-పగలు, నిద్ర-ఉద్యోగం, సాయంత్రం-ఉదయం. ఇలా కాలం ముందుకు వెళుతోంది. జీవితం కూడ అదేవిధంగా కొనసాగుతోంది. చూసి, తెలుసుకుని వీటినంతగా నేను అనుభవించాను కదా... అని నేను గడచిన కాలాన్ని తలుచుకునేప్పుడు, నేను ఆశ్చర్యం చెందుతున్నాను. జీవితంలో వున్న మాధుర్యాలు యింకా నన్ను కాదనలేదు. అది నన్నెక్కడికి తీసుకుపోతుందో నాకు తెలియదు. ఇంకా ఎటువంటి అనుభవాలను రానున్న కాలం తేనున్నదో? ఏదైతేనేమి?

అభయం సత్త్వసంశుద్ధిః, జ్ఞానయోగవివస్థితిః
దానం తమశ్చ యజ్ఞశ్చ, స్వాధ్యాయస్తపఅరవమ్
అహింసా సత్యమక్రోధః త్యాగశ్శాంతి తిరపైశుపై

దయాభూతేష్వలోలత్వం, మార్దవం హ్రీరచాపలమ్
తేజః క్షమాధృతి శౌచమ్, మద్రోహోనాతిమానిత
భవంతి సంపదం దైవీం.. అభిజాతస్యభారత!

'నిర్భయం, హృదయ నైర్మల్యం, జ్ఞానయోగంలో స్థిరత్వం, పరోపకారం, వినయం యజ్ఞం, వేదాలు నేర్చుకోవడం, తపస్సు, నిజాయితీ, అహింస, సత్యం, కోపం లేకపోవడం, త్యాగం, ఓర్పు, శక్తి, జీవకారుణ్యం, మృదుత్వం, సిగ్గు కలిగివుండడం, విసుగు చెందకపోవడం, తేజస్సు, క్షమ, ధైర్యం, శుభ్రత, ద్రోహబుద్ధి లేకపోవడం, యివన్నీ దైవమన్న సంపదను కలిగిన వారికి ఏర్పడుతాయి పార్థా!' అన్న గీతోపదేశం, అన్ని పరిస్థితులలోనూ నాకు మార్గదర్శకం కావాలి!

Printed at The Central Electric Press A-12/1 Naraina Indl. Area, Phase-I, New Delhi-28.